మహాదేవ ప్రచురణలు : ద్వితీయ కుసుమము.

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# శ్రీ సూత సంహిత

( స్కాందపురాణాంతర్గతము )

'కవితా విశారద' 'న్యాయవాది'

## శ్రీ బుద్ధవరపు మహాదేవ ప్రణీతము

శేషపూరణము — న్యాసము
'సహజపాండిత్య' 'తర్కకోవిద'

శ్రీ జి. ఎ. ఎస్. ఎస్. సోమయాజులుశర్మ
M. A. (సంస్కృతము). M. A. (తెలుగు). M. A. (దర్శనములు)
తెలుగు లెక్చరర్.

ద్వితీయ ముద్రణ 1990

మహాదేవ ప్రచురణలు

1-1-710/1 గాంధీనగరం, హైదరబాదు 500 380, ఆంధ్రప్రదేశ్.

హరిః ఓమ్

# తొలిపలుకు

సంస్కృతమున నున్న మాఘకవికృత 'శిశుపాలవధ' 'సూతసంహిత' 'చంపూరామాయణము' 'కువలయానందము' మొదలైన కావ్యపురాణ ధర్మశాస్త్ర గ్రంథములను నా పతిదేవులైన స్వర్గీయ శ్రీ బుద్ధవరపు మహాదేవుఁడుగా రాంధ్రీకరించినారు. కాని వారి జీవితకాలములో నేగ్రంథము ముద్రింపఁబడ లేదు. వారు 1968 సంవత్సరములో దైవసాన్నిధ్యమును బొందిరి. వారి వ్రాఁతప్రతులను జూచిన విద్వత్కవిశేఖరులు 'కళాప్రపూర్ణ' వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు మహాదేవభారతిని ఆంధ్రలోకమున కందించుట అత్యంతావశ్యక మని నొక్కి వక్కాణించి తత్కార్యనిర్వహణమునకు వారే శ్రీకారము చుట్టి ఆంధ్రమాఘమున కచ్చున కనుకూలమగు నొక యాకారము నిచ్చినారు. దానికి తోడు సహజకవీశ్వరులైన శ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మగారి పర్యవేక్షణలో మాకుటుంబమునకు ఆప్తబాంధవులైన శ్రీ వేమవరపు వెంకటరమణశర్మగారి నిర్విరామకృషితోను మాఘకావ్యముతో శ్రీమహాదేవకవి కృతుల ప్రచురణ ప్రారంభమైనది. ఆ మాఘకావ్యము విజ్ఞానఘను లగు పెద్దల సాదరాభిమానములకు పాత్ర మగుట మా యదృష్టము.

పిదప - కేవలము సరస్వతీ సంసేవనమే ధ్యేయముగాఁ గల శ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మగారీ సూతసంహిత నత్యంతశ్రద్ధాసక్తులతోఁ బరిష్కరించి మొదటి ఖండమును బూరించి ప్రచురణకు కారకులైనారు. వారికి నా ధన్యవాదములు.

ఆంధ్రమాఘము వలెనే యీ సూతసంహితాగ్రంథమును గూడ తమ హానిమన్ ముద్రణాలయమునందే ముద్రణ మారంభించి, అనారోగ్యముతో బాధపడుచున్నను, అనేకకష్టముల కోర్చి తనకు తాతగారగు శ్రీమహాదేవకవిగారి యెడఁ గల నిష్కళంక భక్తితో ముద్రించుచు మా వేంకటరమణ శర్మ కన్ను మూయుట తీరని లోప మైనది. బహుముఖ ప్రజ్ఞాశాలి, హోమ్యోపతివైద్యనిపుణుఁడే కాక అవైద్యశాస్త్రమున నెన్నియో గ్రంథములను రచించి ప్రకటించి యాంధ్రమండలి కృతజ్ఞతాభాజన మైనాఁడు, మఱపు రానివాఁడు, మాకు సంతతస్మరణీయుఁడు. శ్లాఘనీయుఁడు, ఆయన కుమారుఁడు చిరంజీవి తమ్మిరాజు, అచ్చు పూర్తియగుటకు నిర్విరామకృషి చేసి తాను కృతార్థుఁడగుటయే కాక తండ్రిని సంకల్పసిద్ధుని చేసి నా యాశీర్వచనములకు పాత్రుఁ డైనాఁడు.

వర్తకసరణితోనే గ్రంథప్రకటన మధికముగా జరుగుచున్న యీ కాలములో భారతీయ సంస్కృతిని రక్షించుచు, సద్గ్రంథప్రకటమునకు సర్వదా ప్రోత్సాహము నిచ్చుచున్న శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారు ధనసాహాయ్యము చేసినందులకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివాదములు. తెలుఁగువారి యిలువేలుపైన శ్రీ వెంకటేశ్వరుల కరుణచే మఱెన్నో గ్రంథములు వెలుఁగు లోనికి వచ్చుఁగాక! అని కోరుచున్నాను.

ఈ సూతసంహితను బఠించి తమ యమూల్యాభిప్రాయముల నిచ్చిన బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారికి, బ్రహ్మశ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారికి

'కవితాభూషణ' 'విద్వత్కవిశేఖర' 'కళాప్రపూర్ణ'

## బ్రహ్మశ్రీ వేంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారి

# ఆమోదము

శ్రీ గురుమూర్తయే నమః

పదునెనిమిది పురాణములలో నొకటి యైన స్కాందపురాణము నందలి యాఱు సంహితలలో నీ సూతసంహిత యొకటి. సంస్కృతము నుండి తెనిఁగించిన వారు 'కవితావిశారద' బుద్ధవరపు మహాదేవామాత్యులు తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురము వాస్తవ్యులు. సంస్కృతాంధ్రాంగ్లముల కీయన త్రివేణీసంగమస్థానము. బి. ఏ; బి. ఎల్. పట్టమునంది యుత్తమన్యాయవాదిగాఁ బ్రసిద్ధి నొందిన బహుముఖీనప్రజ్ఞాపాటవము గలవారు. కడుపు నిండిన విద్యల తోపాటు, ఇల్లు నిండిన కళత్రద్వయము వలనఁ గలిగిన పుత్త్రపౌత్త్ర దుహితృదౌహిత్రసంపత్తి గల భాగ్యశాలి. పరమేశ్వర భక్తులు. కవితాకన్యకుఁ బుట్టినిల్లుగాఁ బ్రసిద్ధమైన కూచిమంచి వారి వంశమునఁ బుట్టి, బుద్ధవరపు వారి వంశమునకు దత్తులైనారు. కొప్పులింగేశ్వరస్వామి వారికి శివభాగవతు లనిపించుకొన్న కన్న తండ్రిగారగు కూచిమంచి సోమసుందరకవిగారి వలెను, కాళిదాసుని కుమారసంభవము నాంధ్రీకరించి పేరెక్కిన అన్నగారగు కూచిమంచి సాంబయ్యగారి వలెను బాల్యము నుండియుఁ గవితావ్యసనమునఁ బడి, సంస్కృతమున భట్టికావ్యమునకు దీటైన మాఘమహాకవికృత మగు 'శిశుపాలవధ' కావ్యము నాంధ్రీకరించిన కవితావీరులు మహాదేవకవిగారు. శిశుపాలవధమునకు ముందు వెనుకల నెందో గాని స్కాందాంతర్గతమగు నీ సూతసంహితను, భోజుని 'చంపూరామాయణము' ను అలంకార గ్రంథమైన "కువలయానందము" నాంధ్రమున కనువదించుటయే కాక యింకను భగవత్పరములైన కావ్యములను స్వతంత్రముగా రచించిన వారు. పండితకవుల పరిగణన కెక్కి శ్రీ కంచి కామకోటి పీఠాధిపతుల యాశీర్భాగ్యము నందిన భాగ్యశాలులు శ్రీ మహాదేవకవిగారు.

ఇంతలింతలు గ్రంథముల నిన్నిటిని రచించియు నందే యొకటియు నాయన జీవించి యున్న కాలమున ముద్రితము కాలేదనినట్లు కవిగారి ధర్మపత్ని విజ్ఞానవతి, పతిదేవతాలలామమైన శ్రీమతి మంగాయమ్మగారు ప్రకటించిన 'తొలిపలుకు' వలన స్పష్ట మగుచున్నది. ఎంతయో పలుకుబడి గల న్యాయవాదిశేఖరులు పెక్కు మడిమాన్యములుగల పెద్ద గృహస్థు గ్రంథముద్రణమున కాయనకు ధనలోపమా? ఆడంబరము, ఆర్భాటము నాయనకుఁ బనికిరాని వగుటయే కారణమై యుండును. గ్రంథములను వ్రాసి యుంచినచోఁ దరువాతి వారు ప్రకటింతు రనియుఁ దలంచి యుండవచ్చును. అట్లే వారి యర్ధాంగి శ్రీమతి మంగాయమ్మగారును, ఆమె సంతానములో నొకఁడైన చి॥ సుందరకృష్ణారావును, మహాదేవకవి గారి మేనల్లురలో నొకరైన శ్రీ వేమవరపు నాగభూషణరావుగారి కుమారులగు శ్రీ వెంకటరమణ శర్మగారును శిథిలములు కానున్న యీ మహాదేవకవిగారి గ్రంథముల నన్నిటిని "మహాదేవపరిచరణ" అను పేర ముద్రణమునకుఁ బూనుకొనుట మహాభాగ్య మనిపించుకొనుచున్నది. శ్రీ వేమవరపు

వేంకటరమణ శర్మగారు తమ "హానిమన్" ప్రెస్సు నందు 1974 సంవత్సరములో ముందుగా 'శిశుపాలవధ" (మాఘకావ్యము) ముద్రించి, వెలుఁగులోనికిఁ దెచ్చి కవిపండితలోకము వలన మెప్పందినారు.

రెండవ ప్రచురణముగా "సూతసంహిత" నచ్చొత్తింపఁ బూనుకొనిన శ్రీమతి మంగా యమ్మగారి యొక్కయు, వారి పుత్త్రరత్నము చి॥ సుందరకృష్ణారావు యొక్కయు నభీష్టము నెఱవేర్పఁ దలఁచి శ్రీ వేమవరపు వేంకటరమణ శర్మగారు తమ "హానెమన్" ప్రెస్సు నందు ముద్రింపఁ బూనినారు. కాని ముద్రణము పూర్తి కాకుండ. అసౌజన్యనిధి కన్ను మూయుట యాయన కుటుంబమునకే కాదు, హోమియోపతివైద్యశాఖకును, తద్గ్రంథరచనకును, బంధు వర్గమునకును, అస్మదాదిమిత్రవర్గమునకును దీఱని లోపమై యందఱ మనస్సులను వేధించు చున్నది. అది దైవసంకల్పము. మిగిలిన సూతసంహితాగ్రంథమును కీ॥శే॥ శ్రీవేమవరపు వేంకటరమణశర్మగారి ద్వితీయ పుత్త్రుఁడు చిరంజీవి తమ్మిరాజు పితృవియోగ శోకమును దిగ మ్రింగి ముద్రణ కృత్యము పూర్తి చేసిన బుద్ధిమంతుఁడు. ఉత్తమ చరిత్రుఁడు. అతఁడు వేఁయి యేండ్లకు సమానులం దుత్తమశ్లోకుఁడగుఁగాక! యని యాశాసించుచుఁ బ్రకృతమగు సూతసంహితనుగూర్చియు ననువాదమును గూర్చియు నాలుగు మాటలు వ్రాయుచున్నాను.

## సూ త సం హి త

సీ॥ పద్మాదికంబులు పదియు నెనిమిదియు, నాదిపురాణంబు లా పురాణ
జాతంబు నాల్గు లక్షలసంఖ్య గలయది, యుపపురాణంబులం దుద్భవించెఁ
బదునొకండవదియై బహుసంహితలతోడ, బహుఖండములతోడ బహువిచిత్ర
కథలతో నేకలక్షగ్రంథపరిమాణ, కలితమై శ్రీమహాస్కాంద మెప్పు. (కాశీ-1-71)

"పద్మపురాణాదులైన పదునెనిమిది పురాణములు నాల్గు లక్షల శ్లోకములతో వెలసినవి. అందు స్కాందపురాణము పదునొకండవది లక్షశ్లోకపరిమితము" అని శ్రీనాథవాణి స్కాంద పురాణమున నాఱు సంహితలు. ఆ సంహితలలో నేఁబదిఖండములు. ఆసంహితాషట్కమున నాఱువేల శ్లోకముల తోడి సూతసంహిత యొకటి. ఈసంహితయందు (1) శివమాహాత్మ్య ఖండము (2) జ్ఞానయోగఖండము (3) ముక్తిఖండము (4) యజ్ఞవైభవఖండము నని నాల్గు ఖండములు, రెండువేల తెలుఁగు గద్యపద్యములలో నొప్పుచున్నవి.

ఈసూతసంహిత నాంధ్రీకరింపఁబూనిన మహాదేవకవిగారి వ్రాఁతప్రతి యందుఁ బ్రథమ మగు శివమాహాత్మ్యఖండము గానరామిని, ఆద్యంతము పరిచూచి ముద్రణమునకు సిద్ధము చేసిన బుద్ధిమద్గ్రేసరుఁడు, సంస్కృతాంధ్రాంగ్లాంబుధి పారంగితుఁడు, సహజపాండిత్య బిరుదాభి రాముఁడు నగు చిరంజీవి గరిమెళ్ళ అచ్యుత సత్యశేషగిరి సోమయాజి శర్మ యిట్లనియున్నాఁడు,

తే॥గీ॥ అతఁడు శ్రీ సూతసంహిత యందు రెండు
మూఁడు నాలుగు ఖండముల్ మోగి రచించి

మొదటి ఖండంబు నాకయి వదలెనేమొ
దానిఁ దెనిఁగింతు గ్రంథసందర్భమునకు. (శి. మా. 13)

అని పూనుకొని మహాదేవకవి కవితాసరస్వతికి రత్నపీఠముగా నాఖండము పూరించుట

తే॥గీ॥ ఎఱ్ఱనార్యుండు సకలలోకైకవిదితుఁ, డయిన నన్నయభట్టమహాకవీంద్రు
సరససారస్వతాంశప్రశస్తి దన్నుఁ, జెందుటయు సాధుజనహర్షసిద్ధిఁ గోరి॰

క॥ ధీరవిచారుఁడు తత్కవి, తారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయకా
నారణ్యపర్వశేషము, పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగాన్.

(భార-ఆరణ్య-7-470)

అనిన యెఱ్ఱాప్రెగడ వాక్యమును స్ఫురింపఁ జేయుచున్నది. పదునెన్మిది పురాణములలో నొకటి యగ్నిదేవుని, ఒకటి సూర్యుని, రెండు బ్రహ్మదేవుని, నాలుగు విష్ణువును, పది శివుని సృష్టిస్థితిలయకారకుఁడైన పరమాత్మగాఁ జెప్పునని —

తే॥గీ॥ ఒకటి యగ్నిని భాస్కరు నొకటి చెప్పు, రెండు శ్రీబ్రహ్మదేవుని శ్రీతిఁ బలుకు
నాల్గు శ్రీవిష్ణుమూర్తి గుణంబు లెన్నుఁ, బది పురాణంబు లీశ్వరుఁ బ్రస్తుతించు.

(శి-మా. 25; 198)

ఇందలి శివమాహాత్మ్యఖండమున శర్మ వాక్కు.

ఆ శివపరమైన పదిపురాణములలో స్కాంద మొకటి. దాని యవాంతరభాగములలో నొకటియైన సూతసంహిత యం దేఖండము నందును శివుఁడే జగత్కారణమైన పరబ్రహ్మముగాఁ జెప్పఁబడును.

ఈ సూతసంహితలో రెండవది యగు ముక్తిఖండమున ముక్తి, ముక్త్యుపాయము, మోచకుఁడు, మోచకప్రదుఁడు నని నాలుగు పదార్థములు ముఖ్యముగాఁ జెప్పఁబడినవి. (1) ముక్తి యనఁగా విడుపు. జనన మరణ ప్రవాహరూపమయి యనాది యగు సంసారము నుండి బయలుపడుట యన్నది పరమార్థము (2) సంసారము నశించి దాని నుండి విడువఁబడుట కుపాయములు (ఈశ్వరసేవారూపములు). (3) మోచకుఁ డనఁగా సంసారబంధము నుండి విడిపించు వాఁడు గురువు. సకలసృష్టికిఁ బరమగురువు శివావతారమగు దక్షిణామూర్తి యన్నమాట (4) మోచకప్రదుఁడు — మోచకుఁ డగు త్రిభువనగురువును జేర్చువాఁడు పరబ్రహ్మస్వరూపుఁడైన పరమశివుఁడు. అతఁడు సమాధికరహితుఁడు పరంజ్యోతీరూపుఁడు. అతని ప్రకాశము చేతనే దృశ్యములు, శ్రవ్యములు నైన చేతనాచేతనముల సృష్టిస్థితిసంహారములు జరుగుచుండును. జీవుల పరస్పరభేదమునకుఁ బురాకృత సుకృత దుష్కృతరూప మగు కర్మము హేతువు. అట్టి కర్మ మాగామిసంచితప్రారబ్ధరూప మైనట్టి దెట్లు నశించునో యెట్లు పరమశివస్వరూపమున జీవుఁడు లీనము కావలెనో దానికే యెన్నో యుపాయములు వేదములలో, ఉపనిషత్తులలో, పురాణములలోఁ జెప్పఁబడును. అట్టి ముక్తికి వలసిన యుపాయము లన్నియు నీ సూతసంహిత యందుఁ బెక్కు లైతిహ్యములలో వివరింపఁబడినవి.

ఈ ఖండ చతుష్టయమునఁ గల విషయము లన్నియుఁ బ్రతిఖండాంతము నందలి గద్యము నందు వరుసగాఁ జెప్పఁబడి యుండుటచేఁ బునరుక్తి యగునను భయమున నా భారము జిజ్ఞాసువులకే విడిచి పెట్టితిని.

వ్యాసభగవానులు పరమార్థ ముపదేశించి జీవులకుఁ దరణోపాయము చూపఁదలఁచిన దయాళువు గదా! ఈ పురాణములలోఁ గొన్ని శివపరముగాను, కొన్ని విష్ణుపరముగాను, కొన్ని సూర్యాది దేవతాపరముగాను జెప్పుటలోని యౌచిత్యము తెలిసికోవలదా? త్రిగుణాత్మక మైన ప్రకృతియే పరమాత్మ సన్నిధానముచేఁ దానే కర్త్రి యైనట్లు సృష్టి నంతయుఁ జేయుచు మాయాశబ్దవాచ్య మగుచున్నది. మాయామయ మైన జగత్తు లోని చేతనాచేతనవస్తువుల కా మాయ యొక్క (అనఁగా సత్త్వ రజస్తమోగుణాత్మిక యొక్క) భావము వచ్చుటలో వింత యేమున్నది? పరిశీలింప నా త్రిగుణము లాజన్యము లందుఁ దప్పక వర్తించు నన్నమాట. అట్లు వర్తించునవి కావుననే కొన్ని జన్యములు సాత్త్వికములు, కొన్ని రాజసములు, కొన్ని తామసములు నగుచున్నవి. ఆ ప్రకృతికిఁ గూడ హేతువైన పరమాత్మకు జీవులందఱ యెడ సమదృష్టియే కాన, వాని నన్నిటిని సంసారము నుండి యుద్ధరించుటకై వాని వాని గుణముల కనువగు రీతిని కొన్ని సాత్త్వికములుగను, కొన్ని రాజసములుగను, కొన్ని తామసములుగను పురాణములు తానే వ్యాసమహర్షి రూపముతో నవతరించి లోకమున కుపదేశింప వలసి వచ్చినది. కావునఁ బురాణవాఙ్మయమున భిన్నభిన్నదేవతాపారమ్యము కనఁబడును. దానికై పురాణము లలోని భేదముల నెంచి యల్పజ్ఞానుల మగు మనము క్షోభపడనక్కఱ లేదు. పరమార్థమునఁ బరబ్రహ్మ మేదియును గాదు, అన్నియును దానే యగును.

శ్రీ శంకరభగవత్పాదులు —

> యస్యాంతర్నాదిమధ్యం న హి కరచరణం నామగోత్రం న సూత్రం
> నో జాతిర్నైవ వర్ణో న భవతి పురుషో నా నపుంసం న చ స్త్రీ।
> నాకారం నైవకారం నహి జనిమరణం నాస్తి పుణ్యం న పాపం
> తత్త్వం నో తత్త్వమేకం సహజసమరసం సద్గురుం తం నమామి॥

అని గురుమూర్తి యగు దక్షిణామూర్తి రూపము తెలిపినారు. జ్ఞాని యగు వ్యక్తి యట్టి పరబ్రహ్మము నేరూపమునఁ దెలిసి కొన్నను వాని కా దేవుఁడు కారకుఁడు కాఁడా? యేమి! సూతసంహిత యందు విష్ణువునకుఁ బరమశివుఁడు జ్ఞానోపదేష్ట. విష్ణుపరమైన పురాణములందు శివుఁడు విష్ణుభక్తుఁడుగాఁ గనఁబడును. నిరిద్దఱు కొన్నిట సూర్యునకుఁ గొన్నిట పరాశక్తికిఁ గొన్నిట గణపతికి భక్తులుగాఁ గనవత్తురు. ఇది యంతయుఁ దత్తద్గుణప్రధానులైన జీవులకుఁ బరమాత్మ యెడ నాభిముఖ్యము గల్గించుటకే యని తెలియఁ దగును. పరమవిజ్ఞాని కావునఁ గాళిదాసు కుమారసంభవము సప్తమ సర్గమున గౌరీకళ్యాణ ఘట్టమునందు —

> శ్లో॥ ఏకైవ మూర్తి ర్బిభిదే త్రిధా సా, సామాన్య మేషాం ప్రథమావరత్వమ్।
> విష్ణో ర్హర స్తస్య హరిః కదాచి, ద్వేధా స్తయో స్తా వపి ధాతు రాద్యౌ॥

(కుమార — 7 — 44)

అనెను. వ్యాసుల వారి పరమసిద్ధాంతమున కీశ్లోకము వ్యాఖ్యానరూపము. అట్టి యుత్తమ సిద్ధాంతమున కాస్పద మైన యీ గ్రంథమును 2043 పద్యగద్యములతోఁ దెలుఁగువారి కందించిన 'కవితావిశారద' మహాదేవకవి గారు కైలాసమున మహాదేవునిలో సాయుజ్యము పొంది యుందురు. కాదు పొందియేయున్నా రని యనుమానప్రమాణమున స్థిరీకరింతును.

మహాదేవకవి కవితాపాటవ మనన్యసాధ్య మని దీనికి వెనుకటి ముద్రితగ్రంథము శిశుపాలవధ (మాఘము) పీఠిక యందు నేను వివరించియున్నాను. అంతకంటె శాబ్దికముగా నిం దధిక మేమియు లేదు గాని రసభావావిష్కరణమున సహజసరళసరణిలో నడచిన యీరచన సహృదయుల హృదయముల నావర్జించుకొనక మానదు. అని నా యాశయము.

కాకినాడ.
30—9—83

ఇట్లు,
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

'ఆంధ్ర కల్హణ' 'సాహితీసమ్రాట్' 'కళాప్రపూర్ణ'

## బ్రహ్మశ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారి

# పీఠిక

శ్రీమద్వేదవ్యాసప్రణీత మైన పురాణసందోహమున శివదేవతాక మైన స్కాందము ద్వివిధము, ఖండాత్మక మైన స్కాందము మహాపురాణము. ఉపపురాణము సంహితాత్మకము. బ్రహ్మాదులు కొలువు తీర్చి యుండఁగా భవానీదేవి సన్నిధిని శివుని వలన స్కందుఁడు శివ ధర్మములను విని వానిని లోకమునఁ బ్రవర్తింపఁ జేసెను. అందుచే నిది స్కాందమని పేరు పొందినది. ఈ మహాపురాణవిజ్ఞానము స్కందుని వలన భృగువునకు, భృగునివలన నంగిరసునకు, అంగిరసునివలన చ్యవనునకు, చ్యవనునివలన ఋచీకునకు ననుగ్రహానుప్రాప్త మైనది. ఇటులు పారంపర్యోపదేశమున శతకోటిప్రవిస్తృతి నొందిన స్కాందమును వ్యాస భగవానుఁడు గ్రహించి చరమయుగము నందలి మానవమనీష కనుగలముగా సంగ్రహపఱిచి సూతాదుల కుపదేశించెను. సంగ్రహ మనుకొన్న దీని శ్లోకసంఖ్య కూడఁ దక్కువది కాదు. ఎనుబది యొక్క వేయి పయిచిలుకు. మహేశ్వరఖండము-వైష్ణవఖండము-బ్రహ్మఖండము-కాశీ ఖండము-అవంతిఖండము-నాగరఖండము - ప్రభాసఖండము-ఇటుల సప్తఖండాత్మకస్కాందము మహాపురాణము,

ఇఁక షట్సంహితాత్మకము, ఉపపురాణము నైన స్కాందము పంచాశత్ ఖండమండి తము. పరమశివుఁడు కుమారస్వామికి, ఆయన సనత్కుమారునకు, ఆయన వ్యాసభగవాను నకు, ఆయన సూతాదులకుఁ బరంపరగా నుపదిష్ట మైన గ్రంథ మిది. సనత్కుమారసంహిత సూతసంహిత—శాంకరసంహిత—వైష్ణవసంహిత—బ్రహ్మసంహిత — సౌరసంహిత ఇవి యాఱు సంహితలు.

ఇందు సూతసంహిత రెండవది. ఈసంహిత శివమాహాత్మ్యఖండము, జ్ఞానయోగ ఖండము, ముక్తి ఖండము, యజ్ఞవైభవఖండము నను నాల్గుఖండములుగా వింగడింపఁబడి యున్నది. అఱువది యే డధ్యాయముల గ్రంథము. మొత్తము స్కాందము సర్వపురాణ సముచ్చయ మనఁదగిన మహాగ్రంథము. ఇందలి భాష యితరపురాణముల లోని భాషకంటె విలక్షణమై కావ్యపాకగణనీయమై యలరారుచున్నది. స్కాందములోని కొన్ని ఖండము లేఱుకొని పద్యమున గద్యమునఁ దెనుఁగుపఱిచిన వారున్నారు. శ్రీనాథకవిసార్వభౌముని కాశీఖండము, భీమఖండము స్కందపురాణసంహిత లోనివే గదా!

ఖండచతుష్టయవిశిష్ట మైన శ్రీ సూతసంహిత' స్వమహిమప్రతిష్ఠితమై భారతదేశమున భూమప్రచారము నందిన మహాగ్రంథము. శ్రీశంకరభగవచ్చరణు లంతటి వారు సూత్ర భాష్యరచనాధికారసిద్ధికి సూతసంహితను బదునెన్మిదిసారులు పారాయణము చేసికొని రనఁగా మఱి తత్సంహితామహిమ మెంతటిదో చెప్ప నలవి గాదు. సూతసంహిత ఖ్యాతి సార్వకాలిక మైనది. పాండ్యనృపతి కొలువులోని శైవాభినివేశమును గూర్చి పలుకు సందర్భమున శ్రీకృష్ణదేవరాయలవారి 'ఆముక్తమాల్యద' లోని యీ గీతము మనము చదువుకొన్నదే,

తే॥గీ॥ అప్పు డిచ్చకులగు బ్రాహ్మణౌఘమెల్ల, నాత్మజనిమామి విడువ బే కలికభూతి
గడ్డముల నాన రదురాక లిడ్డ సంది, సూతసంహిత లిఖికించి చొఱఁ బొడఁగిరి.

(ఆముక్త-4-46)

నాఁటికి నేఁటికి లబ్ధవర్ణులలోఁ బ్రసిద్ధి నొంది పఠనపాఠనక్రమమునఁ బ్రామాణికమై యున్న యీసూతసంహిత నిటుల రసవదాంధ్రచంపూప్రబంధముగా నిబంధించిన కవితా విశారదులు శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యులు.

కైలాసవాసి యీ కవివరుఁడు సూతసంహితాంధ్రీకృతికి ముందు మాఘమహాకవి ప్రణీతమైన శిశుపాలవధమును సమర్థముగాఁ దెలిఁగించెను. మాఘ కావ్యము ననువదించుట కెత్తుగడ నెత్తి చారితార్థ్యము నందుట సామాన్య విషయము గాదు. విద్వత్కవిశేఖరులు శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారి పరిష్కరణ పర్యవేక్షణములతో నాగ్రంథము కొన్నేండ్ల క్రితమే ముద్రితమై పండితప్రశంసలకు భాజన మైనది. మహాదేవకవి ప్రాచ్య గోదావరీమండలము లోని రామచంద్రపురమున నివసించి యుండి న్యాయవాదివృత్తినిర్వహణ మున విత్తసంపత్తియు గ్రంథరచనాపూర్వహత్వమున యశోవైభవమునుగడించిన విశారదుఁడు.

మహాదేవకవి యీ సూతసంహితలో జ్ఞానయోగ, ముక్తిఖండములు రెండును యజ్ఞ వైభవఖండము లోని పూర్వభాగమును దెనుఁగుపఱిచెను. ప్రథమఖండ మైన శివమాహాత్మ్య మును వదలివైచెను. అథవా తదాంధ్రీకృతప్రథమఖండ ముత్పన్న మైనదోః ఖండత్రయము నందలి గద్యపద్యసంఖ్య 1693. మహాదేవకవి తెనుఁగుంజేయక విడిచిన ప్రథమఖండము శివమాహాత్మ్యమును మున్నూటేబది పద్యగద్యములలో నాంధ్రీకరించిన కవివరుఁడు చిరంజీవి గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ. సకలసుకవిబుధజనవిధేయుఁడు సహజపాండిత్యుఁడు నైన చి॥ శర్మకుఁ బురాకృతశుభాధిక్యమున జనన సాఫల్యముఁ జేకూర్చు చున్న సూతసంహితాపూరణ మిది స్పృహణీయకవితాధోరణితో సహృదయచేతస్తర్పణ మొన రించుచున్నది. ఈ ప్రథమఖండాంధ్రీకరణమును గూర్చి చెప్పుటకు ముందు బుద్ధవరపు మహాదేవకవి తెనుఁగుసేఁతపై నానందావిష్కృతి చేయవలసిన విధి యున్నది.

మహాదేవకవి జ్ఞానయోగఖండమున జ్ఞానయోగ సంప్రదాయ పరంపరాకథనాధ్యాయము నిటుల సీసముతో మొదలుపెట్టెను.

సీ॥ ఒకచోట నానాలతోర్వీజసముదయ, మ్మొకట నానాలతాంతోత్కరమ్ము
నొకచోట నానాఫలోత్కృష్టకందౌఘ, మొకట నానాస్వాదుయోగ్యసలిల
మొకచ్రేవ నానావిధోజ్జ్వలమణిగణ, మ్మొకట నానాకురంగకబలమ్ము
నొకచాయ నానాసురకృతార్థబృందమ్ము, నొకట నానాకిన్నరకృతివితతి

తే॥గీ॥ చెలువు దయివాలి నమృతాంశుశేఖరాల, యమ్మ సొమ్ముల కెల్లను సొమ్ము నగుచు,
వెలయు ముల్లోకములఁ బేరు పెంపుఁ గని వి, లాస సంపద నడరి కైలాసశిఖరి

(జ్ఞాన - 1)

శ్లో॥ కైలాసశిఖరే రమ్యే నానారత్నసమాకులే।, నానాపుష్పసమాకీర్ణే నానామూల ఫలోదకే॥
నానావల్లీసమాకీర్ణే నానామృగసమాకులే, నానావృక్షసమాకీర్ణే నానాయోగిసమావృతే॥

(జ్ఞాన-1, 2)

ఇత్యాది శ్లోకములలో నున్న కైలాసశిఖరవర్ణనమున కీతెలుఁగు లోని యెత్తుగడ చిత్తరంజకమై యున్నది. ఒకచోట్ల ఒకసీమ, ఒకక్రేవ, ఒకచాయ యని పాదాదులకు రప్పించుట తెలుఁగు పద్యము నందలి గతిసౌందర్యవిశేషమునకు స్ఫోరకము. ఆంధ్రీకరణమన్నది కవి కక్లిష్టకార్యము కాదు. అందులో శ్రీ సూతసంహిత యనేకశివధర్మరహస్యములకు, దార్శనికజ్ఞానమునకు, యజ్ఞాదిశ్రౌతవైభవమునకు, అధ్యాత్మతత్త్వమునకుఁ బెన్నిధానము. ఒక కథావస్తు వాధారముగా రచన చేయుటలోఁ గవి యొక్క స్వాతంత్ర్యప్రదర్శన కధికావకాశ ముండును. ఈ సంహితలో నితివృత్తము గౌణము ధర్మజ్ఞానాదికథనము ప్రధానము. అనువాదకర్త ప్రధానాంశములను దాఁటి వేసినచో జిజ్ఞాసువులైన పాఠకుల కన్యాయము చేసినట్లగును. కనుక యథామూలానువాదము కవికి విధివిహిత మగుచున్నది. మఱి ప్రతిభావంతుఁ డగు రచయిత యొకఁడు గద్యపద్యరచనాశిల్పాధారమునఁ దన కౌశలమును ప్రత్యేకించుకొనుచున్నాఁడు.

మన యాంధ్రసారస్వతమునఁ జంపూరీతికిఁ గవిత్రయభారత మొరవడి. ఎక్కడ వచనము? ఎక్కడఁ బద్యము? మరల నేవృత్త మెక్కడ? ఈ పొసగింపు పురాణాంధ్రీకరణములో నొక రామణీయకసంపాదనము చేయును. ప్రకృతము. ఆంధ్రసూతసంహితాకర్త మహాదేవకవి తాదృశమైన రచనౌచిత్యవైశారద్యము గలవాఁడు. శాస్త్రీయవిషయములు చెప్పవలసిన చోట నీకవి ఛాందసమార్గమునఁ బోక స్వచ్ఛందసుందరమైన గద్యము నుపయోగించెను. ఆవచనములు సుదీర్ఘములయ్యును సుస్పష్టరుచిరములై విసువు పుట్టించుట లేదు.

జ్ఞానయోగఖండమున బ్రహ్మచర్యాశ్రమ, గృహస్థాశ్రమ, సన్యాసాశ్రమ విధినిరూపణములు పాపకర్మఫలనిరూపణము, నాడీచక్రనిరూపణము, ఆసనవిధి, ముక్తిఖండమున జ్ఞానానుత్పత్తి కారణకథనము, ఈశ్వరనృత్తదర్శనము; యజ్ఞవైభవఖండమునఁ బరాపరవేదార్థవిచారము, వాచికయజ్ఞనిరూపణము, షడక్షరవిచారము, జ్ఞానయజ్ఞవిచారములోఁ గతిపయాంశములు, జ్ఞానోత్పత్తికారణనిరూపణము, శివలింగస్వరూపకథనము, ముక్తిసాధనవిచారము, ద్రవ్యశుద్ధ్యుపాయకథనము, అభక్ష్యనివృత్తికథనము, మృత్యుసూచకవివరణము, అవశిష్టపాపస్వరూపకథనము — ఈ యధ్యాయము లందలి గద్యము లరఁటిపం డొలిచి చేతఁ బెట్టినట్లు తత్త్వనిగూఢార్థములను సుగమముచేయుచు హృద్యముగా సాఁగినవి.

మహాదేవకవి పద్యము లెచ్చోటఁ బట్టి చూచినను బ్రసాదగుణస్వాదువులు. విశేషించి యీకవివరుని సీసములు సువర్ణములు. కందములు రసకందములు, జ్ఞానయోగఖండమున 'ధ్యానవిధి' యను నధ్యాయమున నవవిధధ్యానవిధానములను జెప్పుచున్న సీసము లున్నవి. "సోఽహ మని ధ్యానముం జేయు చొప్పొకంటు" అని యీపద్యముల మకుటము. తెలుఁగు పలుకుల లాలిత్యమున కవి పరమోదాహరణములు. ఒకటి :

సీ॥ పటికంపు జాదక్క పరిఢవిల్లెడి మేని, వాని రేఱేఁడు సొమ్మైన వాని
వలిమలఱేని ముద్దులపట్టి సామేనఁ, గలవాని మెడకప్పు గలుగు వాని
ఇఱుకేలుఁదోయి పెం పెసఁగు సోయగముల, వానిఁ గన్నులు మూఁడు వఱలు వాని
వేల్పు లందఱుఁ జేరి వేవిధంబుల మ్రొక్కు, లిడువాని సంతసం బెనయువానిఁ

తే॥గీ॥ పరము( దగు వాని నానందపరమధామ, మగుచు నొప్పారు వానిని నతుల( డైన
వాని వేల్పుల మిన్నయౌ వాని నిల్పి, సోఽహ మని ధ్యానముం జేయు చొ
ప్పొకండు. (జ్ఞాన - 282)

దీనికి మూలము లేక పోలేదు. ఉన్న దందురు. అది మొత్తము గ్రోపు చేసినచో రెం డనుష్టుప్పులు.

శ్లో॥ ఉమార్ధదేహం వరద ముత్పత్తిస్థితివర్జితమ్।
శుద్ధస్ఫటికసంకాశం చంద్రరేఖావతంసకమ్॥
త్రిలోచనం చతుర్బాహుం నీలగ్రీవం పరాత్పరమ్।
ధ్యాయేన్నిత్యం సదా సోఽహ మితి బ్రహ్మవిదాంవర॥ (జ్ఞాన-19-3,4)

ఈ మూలమంత్రమునకు ముద్దుముద్దుగా భాష్యము చెప్పినట్లు పలు సీసము దేశీయ శోభతో నలరారుచున్నది. స్వీకృతలీలావతారు(డైన శివునియం దాత్మభావరూపధ్యానవిధి యీ యధ్యాయమున మహాదేవకవి మనోహరము స్వానుభవజన్యమునైన తెనుగుభాషలో నభివర్ణించెను. మూలగ్రంథములోని యభిప్రాయమును గురుముఖతః శ్రవణము చేసి మననము చేసికొని తదనుధ్యానమున( జిత్తశుద్ధి పడసిన సుకృతికి( గాని సూతసంహిత నాంధ్రీకరించు సంకల్పము కలుగదు. మహాదేవకవి వాఙ్మయజీవితమును జరితార్థము చేసికొన్న పుణ్యపురుషు(డు. ఈ మహాగ్రంథము నందలి వస్తు వెంత మహత్తర మైనదో కవిత్వ మంత ప్రశస్త మైనది. రసవత్తర మైనది.

ఉ॥ అంజలి గూర్తు సర్వభువనైకవిధాతకు( దామసచ్ఛటా
భంజనకర్త కగ్నిశశిభాస్కరవాయుముఖాదినిర్వప
త్సంజ మెఱుంగ రాని యొక మోహనతత్త్వవిశేషవల్లరీ
మంజులసూనబృందనవమంజరికిన్ శివమూర్తి కియ్యెడన్ (145 పుట)

మ॥ పటుసారాంచితవేదదర్శితమహావాక్యానుసంధానసం
ఘటితజ్ఞానపదార్థ మే ఘనున కైక్యజ్ఞానసంపాది యౌ
చటులానేకభయాస్పదాత్మకలసత్సంసారదారంబు దో(
చుటయే యా ఘనుపట్ల మాను మల మెచ్చో నిల్చు సంశుద్ధిలోన్. (188 పుట)

కం॥ ద్విజు( డైనం గానీ యం, త్యజు( డైనం గాని జ్ఞానయజ్ఞోడుప మ
క్కజముగ( గొన( గల్గినచో, నిజసంసృతి వార్ధి దా(ట నేర్చున్ జుండీ!
(189 పుట)

కం॥ శిష్యు( డొక్క(డు శ్రుతి యొక్కటి, ప్రవిమలజ్ఞాన మింత పలు(గ నేర్చున్
వివరింప నగునె! ననుబో(, టి విప్రునకు దాని వాక్పటిష్ఠత తెలియన్. (189 పుట)

ఎన్ని యుదాహరణము లెత్తి చూపినను, ఆంధ్రీకర్త కవితావాక్పటిష్ఠత చెప్పినటుల కాదు. గ్రంథములో( బ్రవేశించి చదువ మొదలిడితిని. విడువ బుద్ధి కాలేదు. మహాదేవ మహస్సరోవరమున దో(గాడుచున్న యానందానుభవము కలిగినది. ఆ మహాదేవు(డు శివు(డో! తెలు(గుకవియో! చెప్ప లేను.

కైలాసనివాసి యగు బుద్దవరపు మహాదేవకవి వ్యుత్పత్తి శంకింపఁదగినది కాదు. ఆంధ్రీకరణమహాప్రవాహములోఁ గొన్ని ప్రమాదపతితములు శాబ్దికముగా నుండవచ్చును. అవి పరిగణింపఁ దగినవి గావు.

1) జ్ఞానయోగఖండము రెండవ పద్యములో
"కన్నుఁగవ మూసి తనుం దను గాంచుచుండి"
'స్వయం స్వమేవ ధ్యాయంతమ్' మూలము. 'తనుం దాను గాంచుచుండి' యని కాని, 'తాను దనుం గాంచుచుండి' యని కాని యుండనగును. ఒకటి ప్రథమాంతము. ఒకటి ద్వితీయాంతము.

2) జ్ఞానయోగఖండము, 19వ పుట, 81 వచనము.
'అగ్నికార్యపరిత్యాగము రేతోత్సర్గమ్మును సంభవించిన' 'రేతఉత్సర్గము' అనుట సమ్మతము. ఇది ముద్రణదోషము కావచ్చును.

3) జ్ఞానయోగము. 24వ పుట.
"బ్రహ్మ నారాధింపవలె బ్రహ్మవర్చోఽభిలాషుఁడై యారోగ్యలక్ష్మి గోరి"
'బ్రహ్మవర్చసాభిలాషుఁడై' యనవలయును.

4) యజ్ఞవైభవఖండము — 201 పుట
కం॥ శివశక్తుల నెఱఁ బాసిన
ధ్రువముగఁ దలక్రిందు కాలు — దివి దెస గలుగున్.
'ధ్రువము' కాదు ధ్రువము, యతిస్థానము సవరింపవలెను.

5) 370 పుట — 'సకలమునుఁ బునీత మని' 'పూతము" అనవలెను.

నిమజ్జ తీందోః కిరణే శ్వివాంకః

## శివమాహాత్మ్య ఖండము

ఇఁక నీమహాదేవకవి సూతసంహితాంధ్రీకృతిలోఁ బాలు పంచుకొన్న శివమాహాత్మ్య ఖండికర్తను గూర్చి తద్రచనా విశేషమును గూర్చి యించుక నివేదింతును.

శ్రీ శివమాహాత్మ్యఖండము మున్నూటయేఁబది పద్యగద్యములలో నొక ప్రత్యేక కావ్యము వలె నున్నది. చి॥ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ కవిత్వ మర్మజ్ఞత కీ పూరణము దర్పణము. చి॥ శర్మ సంస్కృతాంధ్రములలో, తత్త్వశాస్త్రములో ఎం. ఏ. పట్టములు పొందుటయ కాదు, తర్కకోవిదుఁడును. పాణినీయము, పూర్వమీమాంసా గ్రంథములు గురుసన్నిధి నధ్యయనించెను. తన వ్యుత్పత్తికిఁ దన విద్యానిష్ఠకు ననురూప మైన యాంధ్రకవితాస్వాపతేయ మీతని యొద్ద నున్నది. ఆది మహాదేవానుగ్రహమున నర్థ ఒంతమై యలరారుచున్నది.

తే॥గీ॥ "అతఁడు శ్రీసూతసంహిత యందు రెండు
మూఁడు నాలుగు ఖండముల్ మొగి రచించి
మొదటి ఖండంబు నాకయి వదలె నేమొ।
దానిఁ దెనిఁగింతు గ్రంథసందర్భమునకు." (శి. మా. — 13)

శ్రీసూతసంహితాంధ్రీకృతిశేషరచన కీ ప్రథమావకాశము చి॥ శర్మ భాగధేయ మనవలయును. ఈ సుకవి మూలవిధేయముగా రచన సాగించుచుఁ బెక్కుచోట్లఁ దన స్వతంత్ర ప్రతిభను వెల్లడించుచు వచ్చెను. తీర్థమాహాత్మ్యకథనములో నీపద్యము చూడ నగును.

సీ॥ ఆవుఁ జంపిన యట్టి యఘ మెల్లఁ బాయంగ, దక్షిణగంగ గౌతముఁడు తెచ్చె
దాన వసిష్ఠుండు తనపాయ గైకొనెఁ, గౌశికుం డొకపాయ గరిమ నిలిపె
శ్రీభరద్వాజుండు చేకొనె నొకపాయ, నత్రియు నొకపాయ నందుకొనియెఁ
గశ్యపాత్మజు లైన గరుడుండు సూర్యుండు, నొక్కొక్క తమపాయ లొందిపట్టి
తే॥గీ॥ పుణ్యసప్తగోదావరపుష్కరముల, సింహరాశిని రవిగురుల్ సెలఁగు వేళ
స్నాన మొనరించి శివుఁ గొల్చి ధన్యు ముక్తి, ముద్దియ వరించి ముద్దుపై ముద్దు
పెట్టు. (శి మా. 303)

ఈ సందర్భమున మూల మిటులున్నది.

శ్లో॥ గోదావరీతి యా లోకే సుప్రసిద్ధా మహానదీ।
సింహరాశౌ స్థితే సూర్యే సింహయుక్తే బృహస్పతౌ॥
తస్యాం స్నాత్వా యథాశక్తి ధనం దత్వా తు మానవః।
గంగాయాం ద్వాదశాబ్దస్య నిత్యం స్నానఫలం లభేత్॥
(శి. మా. — 12-20, 21)

ఈ మూలములో సప్తగోదావరప్రసంగము లేదు. గౌతముఁడు, వసిష్ఠుఁడు, కౌశికుఁడు, భరద్వాజుఁడు, అత్రి, గరుడుఁడు, సూర్యుఁడు నొక్కొక రొక్కొక పాయగా గోదావరిని దీసికొని వచ్చిరి. భీమమండలమున నాయా మహర్షుల నామములతో నాపాయలు వెలసి ప్రవహించుచున్నవి. ఆంధ్రీకర్త తన పద్యమున సప్తగోదావరప్రసక్తి తెచ్చి ఋషిసంకీర్తనముతో విస్తరించి గోదావరీప్రశంస చేయుట దేశౌచిత్యపోషకము. నన్నయభట్టారకుల సీ॥ "దక్షిణగంగనాఁ దద్దయు నొప్పిన గోదావరియు జగదాది యైన భీమేశ్వరంబును" (భార-ఆది-8-129) ఇత్యాది పద్యమును జ్ఞప్తిలో నుంచుకొని చేసిన యీ స్వాతంత్ర్యము సహృదయహృదయంగమము. విజయవిలాసకర్త చేమకూర వేంకటకవి యర్జునుని తీర్థయాత్ర సందర్భమున వేంగిదేశవైభవమును విస్తరించెను గదా! సంస్కృతమూలమున నిదిలే దనుట పాడి గాదు.

తెలుఁగుకవి యొక్క స్వదేశాభిమాన మిక్కడ మూలము. మన పూర్వాంధ్రమహాకవులు శ్రీనాథాదు లాంధ్రీకరణవిషయమున నిట్టి స్వతంత్రతఁ దీసికొన్నారు. కనుకనే వారి కావ్యముల కొక వైశిష్ట్యము. చి॥ సోమయాజికవి యీ ప్రథమఖండమున నమూలకమైన కల్పనారామణీయకమును తత్ర తత్ర ప్రదర్శించెను. విలయసమయ సముద్రమధ్యమున మునిఁగిన మహీమండలమును యజ్ఞవరాహమూర్తి దంష్ట్రాగ్రమున నుద్ధరించిన ఘట్టమున నయిదారు పద్యములు కలవు. అవి భావసంపదచేఁ, బదగ్రథనపు సొంపుచే హృదయమును రసతరంగిత మొనర్చుచున్నవి. ఒక పద్యమేని యుదాహరింప నుండఁజాలను.

సీ॥ బొబ్బాసి గొట్టంబు ముం దూఁద గాలి కూఁ, గెడి మెట్ట తామరి గింజ వోలె
ముదురంగ ముగ్గిన మొగిలిపూ పొత్తుపైఁ, జేలి యాడుచు వ్రాలు తేఁటి వోలె

నైరావణగజంబు చారుశుండాగ్రభా, గమున నొప్పెడు నల్లకలువ వోలె
ధవళపక్షమునందుఁ బవితిచందురు శృంగ, మధ్యమందున్న బింబంబు వోలెఁ
తే॥గీ॥ బచ్చపుత్తడి యమ్ముపై బంతి వోలె, నిడుద బంగారు కామపై గొడుగు వోలెఁ
గూటకిటిరాజు కరవాఁడి కోఱ యందు, నఖిలసర్వంసహాగోళ మందగించె.

(శి. మా. — 216)

ఈ యధ్యాయాంతమున "శ్రీమన్మహాయజ్ఞవారాహమూర్తీ। ప్రశాంతావనీమండలార్తీ। సదాదేవతాచక్రవర్తీ। .... ... అని యారంభమై "మఖశ్వేతపోత్రీ। నమస్తే। నమస్తే। నమః" అని సమాప్తమైన సుదీర్ఘమైన దండకము కలదు. ఇది నన్నయగారి యాంధ్రమహాభారతము లోని దండకమును బోలి గంగాప్రవాహశైలీమనోహరమై యలరారుచున్నది. ఇందలి గ్రంథావతరణము, ఆంధ్రభారతావతరణము నొరవడిగా నుంచుకొని వ్రాసి నట్లున్నది.

కం॥ అందంబై, సకలజనా, నందంబై పార్వతీశనవమధురకథా
బృందంబై ముక్తిలతా, కందంబై స్కాంద మొప్పుఁ గవివరసభలన్.

(శి. మా. — 2[illegible])

కం॥ తులకించు సూతసంహిత, తొలిఖండం బగుచుఁ బండితులు గొనియాడన్
గలికల్మషనాశకమై, యిల శివమాహాత్మ్యఖండ మెసఁగున్ సభలన్.

(శి మా. — 38)

మఱియు నీకవి వరుఁ డీఖండములో నైకవిధవృత్తముల నుపయోగించి తన ఛందస్సుందరగతివిన్యాసకౌశలమును బ్రదర్శించెను. మందాక్రాంతము, మత్తకోకిల, మాలిని, పంచచామరము, కవిరాజవిరాజితము, స్రగ్ధర, అశ్వధాటి, శిఖరిణి, వసంతతిలకము, తరువోజ, పాలాశదళము, పృథ్వి. ఇవియుఁ గాక మధ్యాక్కర, మధురాక్కర, ద్విపద లుపయోగించెను. ఏవృత్తము నేప్రకరణమున నుపయోగింపవలెనో తెలిసి యుపయోగించెను గాని ఛందోవిజ్ఞానప్రకటనమునకుఁగాదని రహస్యజ్ఞులు గ్రహింపఁగలరు. ఈ కవి 'మధ్యాక్కర' లో ఎఱ్ఱనవలెఁ జతుర్థగణాద్యక్షరముపై యతిని వేయుటయే కాక నన్నయవలెఁ బంచమగణాద్యక్షరముపై యతిని గూడ వేసెను. రెండు యతుల మధ్యాక్కర యిది.

ఇంద్రాదిదేవాళి గెల్చి - యేడ్తెఱ - యేపారఁ దొల్లి
నింద్రజి రథముపై నేఁగి - నిచ్చోట - నెటుసాఁగ కాఁగ
సాంద్రభక్తిని దేడ డిగ్గి - సపితృపు - స్ఫటికని దోఁగి
చంద్రమోమకుటలింగంబు - స్థాపించి - సరి గొల్చి యేఁగె.

(శి. మా. — 320)

ఎందులకుఁ జెప్పితి ననఁగా శివమాహాత్మ్యఖండాంధ్రీకర్తకు వ్యుత్పత్తిసౌష్ఠవ మెంతటిదో పద్యశైలీసంపత్తియు నంతటిది. ఎంత వ్రాసినను వ్రాయవచ్చును. శ్రీమదాంధ్రసూతసంహితాగ్రంథము నాద్యంతము పఠించిన యానందప్రకటనమే యీ పీఠిక.

రాజమహేంద్రి,
రుధిరోద్గారి శ్రావణ
మాసశివరాత్రి
5—9—1983

ఇట్లు
మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

# న్యాసము

శ్రీరామచన్ద్రాయనమః

కం॥ శ్రీసంప్రదాయ దేశికు
వ్యాసుని గొనియాడి బుధ్ధవరకవ్యాంధ్రి
శ్రీసూతసంహితకు నే
న్యాసము రచియింతుఁ గవిబుధావళి కరుణన్.

శ్లో॥ మద్వయమ్ భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయమ్।
అనాపలింగకూస్కాని పురాణాని పృథక్ పృథక్॥

## —: అష్టాదశ పురాణ పరంపర :—

మద్వయ మనఁగా మత్స్య-మార్కండేయములు. భద్వయ మనఁగా భవిష్యద్-భాగవతములు. బ్రత్రయ మనఁగా బ్రహ్మ-బ్రహ్మవైవర్త-బ్రహ్మాండములు. వచతుష్టయ మనఁగా వరాహ-వామన-వాయు-విష్ణుపురాణములు. అ-అగ్నిపురాణము. నా - నారదపురాణము. ప-పద్మపురాణము. లిం-లింగపురాణము. గ-గరుడపురాణము. కూ - కూర్మపురాణము. స్కా-స్కాందపురాణము. ఇవి యష్టాదశమహాపురాణములు.

1) మత్స్యపురాణము :—

ఇది మత్స్యమూర్తి వైవస్వతమనువున కుపదేశించినది- ఇందు 291 అధ్యాయములు 14000 శ్లోకములు గలవు. ధర్మములు, వ్రతములు, రాజనీతి విస్తరముగా వర్ణింపఁబడినవి. కాళిదాసు రచించిన విక్రమోర్వశీయకథ దీని నుండియే గ్రహింపఁబడినది. గ్రంథాంతమునఁ బ్రాచీనరాజుల చరిత్ర మానుపూర్విగా వర్ణింపఁబడుటచే నిది చారిత్రకుల కెక్కువగా నుపయోగపడును.

2) మార్కండేయ పురాణము :—

మార్కండేయ మహాముని క్రోష్టుకిముని కుపదేశించిన విధముగా ధర్మపక్షులు జైమిని మహర్షి కీపురాణమును జెప్పినవి. ఇందు 137 అధ్యాయములు 9000 శ్లోకములు గలవు. హరిశ్చంద్రోపాఖ్యానము, సుమతి పాతివ్రత్యమహిమ, మదాలసకథ, చతుర్దశమనువుల కథలు, మహిషాసురవధ, శ్రీమద్దేవీవిజయము మొదలగునవి యిందు హృద్యముగా వర్ణింపఁబడినవి. దేవీనవరాత్రములందు భక్తులు పారాయణ మొనర్చు "దుర్గాసప్తశతి" యిందే యుపదేశింపఁబడినది.

3) భవిష్యత్పురాణము :—

ఈపురాణము జనమేజయుని పుత్త్రుఁడగు శతానీకునకు సుమంతు మహర్షి యుపదేశించినది. ఇందు (1) బ్రహ్మ (2) వైష్ణవ (3) శైవ (4) సౌర (5) ప్రతిసర్గము లను నైదు పర్వములు మొత్తము 605 అధ్యాయములు 14000 శ్లోకములు గలవు. జయచంద్రుఁడు, పృథ్వీరాజు, అక్బరు మొదలగు రాజుల చరిత్రములు; పాణిని, పతంజలి మొదలగు ఋషుల చరిత్రములు; కబీరు, నరశ్రీ, నానక్ మొదలగు భక్తుల చరిత్రములు విపులముగా వర్ణింపఁబడినవి. కలియుగరాజవంశావళి యందు వివిధరాజవంశములు క్రమముగా వర్ణింపఁ

బడుటచే నిది చారిత్రకుల కెక్కువగా నుపయోగపడును. ఉత్తరభాగమున వివిధ వ్రతములు వర్ణింపఁబడినవి. గ్రంథారంభమున సూర్యోపాసనము ప్రధానముగాఁ బ్రతిపాదింపఁబడినది.

4) భాగవత పురాణము ;—

భాగవతపురాణములు రెండు గలవు. ఒకటి శ్రీకృష్ణుని మాహాత్మ్యమును వర్ణించునది. మఱి యొకటి శ్రీ దేవీమాహాత్మ్యమును వర్ణించునది. వైష్ణవులు శ్రీకృష్ణభాగవతము మహాపురాణమనియు శ్రీదేవీభాగవత ముపపురాణమనియుఁ జెప్పుదురు. శాక్తేయులు శ్రీ దేవీభాగవతము మహాపురాణ మనియు శ్రీకృష్ణభాగవత ముపపురాణమనియు నుడువుదురు.

(క) శ్రీమద్భాగవతము :—

శ్రీ వ్యాసమహర్షి రచించిన యష్టాదశపురాణములలో శ్రీమద్భాగవతమునకుఁ బ్రచుర ప్రచారము గలదు. ఇది పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుఁ డుపదేశించినది. ఇందు 12 స్కంధములు 335 అధ్యాయములు 18000 శ్లోకములు గలవు. శ్రీమన్నారాయణుని యేకవింశత్యవతారములు విపులముగా వర్ణింపఁబడినవి. దశమస్కంధమునందు శ్రీకృష్ణపరమాత్మ పవిత్రచరిత్రము విస్తరముగా హృద్యముగా వర్ణింపఁబడినది. శ్రీ శంకరభగవత్పాదాచార్యులు చిన్ననాఁటఁ దమతల్లికి భాగవతమును వినిపించెడివారు. శ్రీమధ్వాచార్యుల భాగవత తాత్పర్యనిర్ణయము ప్రసిద్ధము. శ్రీ వల్లభాచార్యులు భాగవతమునకు భాష్యమును రచించి ప్రస్థానచతుష్టయమును స్థాపించుటయే కాక దీనిని వ్యాసమహాముని యొక్క సమాధిభాషగాఁ బేర్కొనిరి. భాగవతముపై (1) శ్రీచిత్సుఖాచార్యులు (2) శ్రీధరాచార్యులు (3) సుదర్శనాచార్యులు (5) వీరరాఘవాచార్యులు (5) విజయధ్వజాచార్యులు (6) సనాతనగోస్వామి (7) జీవగోస్వామి (8) విశ్వనాథచక్రవర్తి (9) మధుసూధనసరస్వతి (10) శుకదేవాచార్యులు (11) శ్రీహరికవీంద్రులు (12) వంశీధరమిశ్రులు మొదలగు పండితులు విపులమైన వ్యాఖ్యలు రచించిరి. శ్రీమధుసూధనసరస్వతి "భక్తి రసాయనము" నందును శ్రీ రూపగోస్వామి 'ఉజ్జ్వలనీలమణి' "భక్తిరసామృతసింధువు' అందును భాగవతమును బ్రమాణముగాఁగైకొని భక్తి రసరాజ మని స్థాపించిరి. శ్రీవంశీధరమిశ్రులు 'జన్మాద్యస్యయతః' అను భాగవత ప్రథమశ్లోకమునకు 100 అర్థములను జెప్పిరి. ఇట్లిందు భగవద్భక్తితోఁబాటు సర్వశాస్త్రరహస్యములు నిమిడియుండుటచే 'విద్యావతామ్ భాగవతే పరీక్షా' యను సామెత యేర్పడినది.

(ఖ) శ్రీమద్దేవీభాగవతము :—

దేవీభాగవతము శ్రీ వ్యాసమహర్షి జనమేజయున కుపదేశించినది. ఇందుఁ గూడ 12 స్కంధములు 318 అధ్యాయములు 18000 శ్లోకములు గలవు. సర్వత్ర శ్రీమత్పరమశక్తియైన దేవి ప్రభావము మిక్కుటముగా వర్ణింపఁబడినది. పంచమస్కంధమునందు దుర్గాదేవి మహిషాసుర-రక్తబీజ-చండ-ముండ-శుంభ-నిశుంభాది రాక్షసులను వధించుట విస్తరముగా వర్ణింపఁబడినది. ద్వాదశస్కంధమునందు గాయత్రీమాహాత్మ్యము విపులముగాఁ జెప్పఁబడినది, దేవీస్తోత్రములు, గాయత్రీకవచము, గాయత్రీ హృదయము, గాయత్రీస్తోత్రము, గాయత్రీసహస్రనామములు నుపదేశింపఁబడినవి. సందర్భానుసారముగాఁ బాండవచరిత్రము, శ్రీరామచరిత్రము, శ్రీకృష్ణచరిత్రము, హరిశ్చంద్రోపాఖ్యానము మొదలగునవి వివరింపఁ

బడినవి. విష్ణుభక్తులు శ్రీమద్భాగవతమును సప్తాహపారాయణము గావించుచున్నట్లు దేవీ భక్తులు దేవీభాగవతమును నవాహపారాయణము గావించుచున్నారు. దేవీభాగవతముపై శ్రీ నీలకంఠపండితులు సంతరించిన విపులవ్యాఖ్యానము గలదు.

5) బ్రహ్మపురాణము :—

ఈపురాణము బ్రహ్మ మరీచి కుపదేశించినది. ఇందుఁ బూర్వోత్తరభాగములలో మొత్తము 245 అధ్యాయములు 13000 శ్లోకములు గలవు. విష్ణుని యవతారములు, శ్రీజగన్నాథ (పూరీ) మాహాత్మ్యము, గోదావరీమాహాత్మ్యము విపులముగా వర్ణింపఁబడినవి.

6) బ్రహ్మవైవర్తపురాణము :—

ఈపురాణము సావర్ణి మనువుచే నారదున కుపదేశింపఁబడినది. శ్రీకృష్ణపరమాత్మ మొట్టమొదట దీనిని బ్రహ్మ కొసంగుట చేతను, శ్రీకృష్ణునిచేఁ బరబ్రహ్మము వివరింపఁబడుట చేతను దీనికి బ్రహ్మవైవర్త మని పేరు వచ్చినది. ఇందు (1) బ్రహ్మఖండము (2) ప్రకృతి ఖండము (3) గణేశఖండము (4) శ్రీకృష్ణజన్మఖండము నను నాలుగు ఖండములు మొత్తము 266 అధ్యాయములు 18000 శ్లోకములు గలవు. మొదటి ఖండమునందుఁ బరబ్రహ్మస్వరూపము, రెండవ ఖండమునందు దుర్గా-లక్ష్మీ-సావిత్రీ-సరస్వత్యాది ప్రకృతిస్వరూపము, మూఁడవ ఖండమునందు విఘ్నేశ్వరచరిత్రము, నాల్గవ ఖండమునందు శ్రీకృష్ణచరిత్రము వర్ణింపఁ బడినవి.

7) బ్రహ్మాండపురాణము :—

ఈపురాణము వాయుదేవునిచే వ్యాసున కుపదేశింపఁబడినది. సమస్త బ్రహ్మాండము, సకలభువనములు నిందు వర్ణింపఁబడుటచే దీనికి బ్రహ్మాండపురాణ మని పేరు వచ్చినది. ఇందు (1) ప్రక్రియాపాదము (2) అనుషంగపాదము (3) ఉపోద్ఘాతపాదము (4) ఉపసంహారపాదము నను నాలుగు పాదములు మొత్తము 161 అధ్యాయములు 12000 శ్లోకములు గలవు. వివిధద్వీపవర్ణనములతోఁబాటు సందర్భానుసారముగా రామచరిత్రము, పరశురామ చరిత్రము, దివోదాసుని కథ మొదలగునవి చెప్పఁబడినవి. చతుర్యుగపరిమాణము, నక్షత్ర మండలవర్ణనము గూడఁ గలవు. ఇందు శ్రీరామచంద్రుఁడు పరబ్రహ్మస్వరూపుఁడుగను సీతాదేవి మాయాస్వరూపిణిగను వర్ణింపఁబడిరి. అధ్యాత్మరామాయణము, లలితోపాఖ్యానము బ్రహ్మాండపురాణాంతర్గతము అని సంప్రదాయము.

8) వరాహపురాణము :—

ఈపురాణము శ్రీయజ్ఞవరాహస్వామిచే భూదేవి కుపదేశింపఁబడినది. ఇందుఁ బూర్వోత్తరభాగములలో మొత్తము 218 అధ్యాయములు, 24000 శ్లోకములు గలవు. వివిధ వ్రతములు భగవత్స్తోత్రములు మిక్కుటముగా నుపదేశింపఁబడినవి. మధురామాహాత్మ్యము, నాచికేతోపాఖ్యానము విస్తరముగా వర్ణింపఁబడినవి.

9) వామనపురాణము :—

ఈపురాణము పులస్త్యమహర్షి నారదున కుపదేశించినది. వామనావతారకథ రెండు మాఱులు విపులముగా వర్ణింపఁబడుటచే దీనికి వామనపురాణ మని పేరు వచ్చినది. ఇందుఁ

బూర్వభాగమున 95 అధ్యాయములు 10000 శ్లోకములు గలవు. ఉత్తరభాగమున (1) మహేశ్వరీసంహిత (2) భాగవతీసంహిత (3) సౌరీసంహిత (4) గణేశ్వరీసంహిత యను నాలుగు సంహితలు 4000 శ్లోకములు గలవు. ఇందు విష్ణుకథలతోఁబాటు శివకథలు కూడఁ జెప్పఁబడినవి.

10) వాయుపురాణము :—

వాయుపురాణము మహాపురాణము, శివపురాణ ముపపురాణ మని కొన్ని పురాణములు చెప్పుచున్నవి. శివపురాణము మహాపురాణము, వాయుపురాణ ముపపురాణ మని కొన్ని పురాణములు చెప్పుచున్నవి. కొందఱు వాయుపురాణము శివపురాణాంతర్గత మని వక్కాణించుచున్నారు. వాయుపురాణము వాయుదేవునిచే నుపదేశింపఁబడినది. ఇందు (1) ప్రక్రియాపాదము (2) అనుషంగపాదము (3) ఉపోద్ఘాతపాదము (4) ఉపసంహారపాదము నను నాలుగు పాదములు మొత్తము 112 అధ్యాయములు 11000 శ్లోకములు గలవు. శివచరిత్రము విస్తరముగా వర్ణింపఁబడినది. ప్రసంగానుసారముగా విష్ణుచరిత్రము కూడఁ బ్రతిపాదింపఁబడినది. భూగోళవర్ణనము మిక్కుటముగాఁ గలదు. 99 వ అధ్యాయమునఁ బ్రాచీనరాజవంశావళి యానుపూర్వకముగాఁ జెప్పఁబడుటచే నిది యైతిహాసికుల కెక్కువగా నుపయోగపడును. చివర గయామాహాత్మ్యము గలదు.

(ఖ) శివపురాణము ;—

ఇది కూడ వాయుప్రోక్తము. ఇందు (1) విద్యేశ్వరసంహిత (2) రుద్రసంహిత (3) శతరుద్రసంహిత (4) కోటిరుద్రసంహిత (5) ఉమాసంహిత (6) కైలాససంహిత (7) వాయవీయసంహిత యను నేడు సంహితలు గలవు. ఇందలి రుద్రసంహిత (1) సృష్టిఖండము (2) సతీఖండము (3) పార్వతీఖండము (4) కుమారఖండము (5) యుద్ధఖండము నని యైదు ఖండములుగా విభజింపఁబడినది. ఇట్లే వాయవీయ సంహితలో (1) పూర్వభాగము (2) ఉత్తరభాగము గలవు. మొత్తము 457 అధ్యాయములు 24000 శ్లోకములు గలవు. ఇందు శివచరిత్రము, శివలీలలు, పాశుపతమతము విస్తరముగా వర్ణింపఁబడినవి. కాళిదాసమహాకవి కుమారసంభవములో శివపురాణము నెక్కువగా ననుకరించెను.

11) విష్ణుపురాణము ;—

ఈపురాణము పరాశరమహర్షి మైత్రేయున కుపదేశించినది. ఇందు 6 అంశములు మొత్తము 126 అధ్యాయములు 6000 శ్లోకములు గలవు. శ్రీవిష్ణుమూర్తి యవతారకథలు, శ్రీకృష్ణలీలలు నిందు విస్తరముగా వర్ణింపఁబడినవి. కలియుగరాజచరిత్ర మానుపూర్విగా నిందుఁ గలదు. వైష్ణవుల కీపురాణము పరమ ప్రమాణము. రామానుజ-మధ్వ-వల్లభ-చైతన్యమతానుయాయుల కిది పారాయణగ్రంథము. దీనిపై (1) శ్రీచిత్సుఖాచార్యులు (2) శ్రీధరస్వామి (3) విష్ణుచిత్తులు (4) నృసింహభట్టు (5) జగన్నాథపాఠకుఁడు (స్వభావార్థదీపిక) (6) రత్నగర్భుఁడు (వైష్ణవాకూతచంద్రిక) మొదలగు వారు విపులవ్యాఖ్యలు సంతరించిరి. విష్ణుపురాణము పూర్వోత్తరభాగములుగా విభక్తమై 23000 శ్లోకములు గలిగి యున్నదని ప్రాచీనపురాణములు చెప్పుచున్నవి గాని 6000 శ్లోకములు గల పూర్వభాగము మాత్రమే నేఁడు లభించుచున్నది.

12) అగ్నిపురాణము ;—

ఈపురాణము నగ్నిదేవుఁడు వసిష్ఠమహర్షి కుపదేశించెను. ఇందు 383 అధ్యాయములు 12000 శ్లోకములు గలవు. అగ్నిపురాణ మొక విజ్ఞానసర్వస్వము. దశావతారములు రామచరిత్ర, హరివంశము, భారతకథ సంగ్రహముగా వర్ణింపఁబడినవి. సకలశాస్త్రములు సంగ్రహింపఁబడినవి. వివిధవ్రతము లుపదేశింపఁబడినవి, అందువలననే 'ఆగ్నేయే హి పురాణేఽస్మిన్ సర్వా విద్యాః ప్రదర్శితాః' అని చివరఁ జెప్పఁబడినది.

13) నారదపురాణము ;—

ఈపురాణము నారదప్రోక్తము. ఇందు (1) పూర్వభాగము (2) ఉత్తరభాగము నని రెండు భాగములు మొత్తము 207 అధ్యాయములు 25000 శ్లోకములు గలవు. విష్ణుతత్త్వము ప్రధానముగాఁ బ్రతిపాదింపఁబడినది. విష్ణు-రామ-హనుమత్-కృష్ణ-కాళీ-మహేశ్వర మంత్రము లుపదేశింపఁబడినవి. ఛందోవ్యాకరణ జ్యోతిషనిరుక్తాదిశాస్త్రములు సంగ్రహింపఁబడినవి. ఉత్తరభాగమునందుఁ బరమవిష్ణుభక్తుఁ డగు రుక్మాంగదుని చరిత్రము విస్తరముగా వర్ణింపఁబడినది. పూర్వభాగమున నష్టాదశపురాణముల విషయానుక్రమణికలు నుండుటచేఁ బ్రాచీనపురాణముల స్వరూపము తెలిసికొనుటకిది యెక్కువగా నుపయోగపడును.

14) పద్మపురాణము :—

ఈపురాణము పద్మకల్పమునందుఁ బ్రవర్తిల్లుటచేతను, శ్రీవిష్ణునాభిపద్మము భూమండలముగాఁ బరిణమించుట యిందుఁ బ్రధానముగా వర్ణింపఁబడుటచేతను దీనికిఁ బద్మపురాణ మని పేరు వచ్చినది. ఇందు (1) సృష్టిఖండము (2) భూమిఖండము (3) స్వర్గఖండము (4) పాతాళఖండము (5) ఉత్తరఖండము నను నైదు ఖండములు మొత్తము 641 అధ్యాయములు 55000 శ్లోకములు గలవు. సృష్టిఖండము నందు హిరణ్మయ పద్మోత్పత్తి, విశ్వోత్పత్తి వర్ణింపఁబడినవి. భూమిఖండమునందు సప్తద్వీపములు, సప్తసాగరములు వర్ణింపఁబడినవి. స్వర్గఖండమునందు వైకుంఠలోకవర్ణనము, శివార్చన విధి, విష్ణ్వర్చనము మున్నగునవి గలవు. కాళిదాసుని యభిజ్ఞానశాకుంతలమున కిందలి శకుంతలోపాఖ్యానమే యాకరము. పాతాళఖండమునందు శ్రీరామచరితము, రామాశ్వమేధము, శ్రీకృష్ణచరిత్రము హృద్యముగా వర్ణింపఁబడినవి. కాళిదాసుని రఘువంశమున కిశ్రీరామచరిత్రమే మూలము. ఉత్తరఖండమునందు మోక్షసాధనములైన తీర్థములు, వ్రతములు, వివిధధర్మములు, విష్ణుభక్తి యుపదేశింపఁబడినవి.

15) లింగపురాణము :—

శివలింగమాహాత్మ్యము విస్తరముగా వర్ణింపఁబడుటచే దీనికి లింగపురాణ మని పేరు వచ్చినది. ఇందు (1) పూర్వభాగము (2) ఉత్తరభాగము నను రెండు భాగములు మొత్తము 163 అధ్యాయములు 11000 శ్లోకములు గలవు. శివుని 28 అవతారములు, శైవవ్రతములు శైవతీర్థములు విపులముగా వర్ణింపఁబడినవి. ఉత్తరభాగము నందుఁ బశు-పాశ-పశుపతి తత్త్వ ముపదేశింపఁబడినది. విష్ణుమహత్త్వము తెలుపు నుపాఖ్యానములుకూడ నిందుండుట విశేషము. దీనిపై గణేశపండితుఁడు రచించిన 'శివతోషిణి' యను విపులవ్యాఖ్య గలదు.

16) గరుడపురాణము :—

ఈపురాణము విష్ణుమూర్తి గరుత్మంతున కుపదేశించినది. ఇందు (1) పూర్వఖండము (2) ఉత్తరఖండము నను రెండు ఖండములు మొత్తము 264 అధ్యాయములు 18000 శ్లోకములు గలవు. పూర్వఖండమున విష్ణుమూర్తి యవతారములు, విష్ణుమాహాత్మ్యము విస్తరముగాఁ బ్రతిపాదింపఁబడినవి. రత్నపరీక్ష, యాయుర్వేదము, పశుచికిత్స, రాజనీతి, ఛందశ్శాస్త్రము, సాంఖ్యయోగము, గీతాసారము మొదలగునవి విపులముగాఁ బ్రతిపాదింపఁబడినవి. ఇందుఁ జక్కని సుభాషిత శ్లోకము లెన్నియో గలవు. ఉత్తరఖండమునకుఁ బ్రేతకల్ప మని పేరు. ఇందు మరణానంతరము జీవునిగతి, యమలోకమార్గము, వైతరణీనది, ప్రేతనివాసస్థానము, ప్రేతస్వరూపము, యమలోకము, వివిధనరకములు, యమయాతనలు, శ్రాద్ధవిధులు మొదలగునవి మిక్కుటముగా వర్ణింపఁబడినవి. ఈప్రేతకాండము నాశౌచదినములందుఁ దప్పఁ దక్కిన దినములందుఁ బఠింపరు. భారతీయులకుఁ బాపభీతి, పరలోకభయము మెండుగా నుండుట కీపురాణమే ప్రధానకారణము. చివర మోక్షనిరూపణము గలదు.

17) కూర్మపురాణము :—

శ్రీకూర్మనాథుఁడైన విష్ణుమూర్తి యింద్రద్యుమ్నున కీపురాణము నుపదేశించెను. ఇందు (1) బ్రాహ్మీసంహిత (2) భాగవతీసంహిత (3) సౌరసంహిత (4) వైష్ణవసంహిత యను నాలుగు సంహితలు 18000 శ్లోకములు గల వని గ్రంథారంభమునఁ గలదు. కాని నేఁడు మొదటి దగు బ్రాహ్మీసంహిత యొక్కటే లభించుచున్నది. బ్రాహ్మీసంహితయందు (1) పూర్వభాగము (2) ఉత్తరభాగము నను రెండు భాగములు మొత్తము 96 అధ్యాయములు 6000 శ్లోకములు గలవు. పూర్వభాగమున సృష్టివర్ణనము, పార్వతీతపస్సు, శక్తిసహస్రనామములు, కాశీమాహాత్మ్యము, ప్రయాగమాహాత్మ్యము గలవు. ఉత్తరభాగమున నీశ్వరగీత, వ్యాసగీత గలవు; శివమాహాత్మ్యము విస్తరముగా వర్ణింపఁబడినను నిందు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల కభేదము ప్రతిపాదింపఁబడినది. శ్రీశంకరభగవత్పాదులు సనత్సుజాతీయ-విష్ణుసహస్రనామభాష్యములలో నీశ్వర-వ్యాసగీతలను బ్రమాణముగా నుదాహరించిరి. శ్రీవిజ్ఞానభిక్షువు లీశ్వరగీతకు భాష్యమును రచించిరి. భగవద్గీత కీశ్వరగీతయే మూలమని సాంప్రదాయికులు వక్కాణింతురు.

18) స్కాందపురాణము :—

శ్రీవ్యాసమహర్షి రచించిన గ్రంథములలో మహాభారతమునకుఁ దరువాత నంతటి గౌరవము గల గ్రంథము స్కాందపురాణము. ఈపురాణమును మహేశ్వరుని యొద్ద విని కుమారస్వామి లోకమున వ్యాపింపఁ జేయుటచే దీనికి స్కాందపురాణ మని పేరు వచ్చినది. నేఁడు స్కాందపురాణములు రెండు లభించుచున్నవి. మొదటిది ఖండాత్మక మైనది. రెండవది సంహితాత్మకమైనది. ఖండాత్మకమైన స్కాందమునందు (1) మహేశ్వరఖండము (2) వైష్ణవఖండము (3) బ్రహ్మఖండము (4) కాశీఖండము (5) అవంతీఖండము (రేవాఖండము) (6) తాపీఖండము (నాగరఖండము) (7) ప్రభాసఖండము నను 7 ఖండములు మొత్తము

1671 అధ్యాయములు 81000 శ్లోకములు గలవు. ఇందు సర్వత్ర శివమాహాత్మ్యము విస్తరముగాఁ బ్రతిపాదింపఁబడినది.

I. మహేశ్వరఖండమునందు (1) కేదారఖండము (2) కుమారికాఖండము (3) అరుణాచలమాహాత్మ్యము నను మూఁడు భాగములుగలవు. వీనిలోఁ బార్వతీపరమేశ్వరుల లీలలు మిక్కుటముగా వర్ణింపఁబడినవి. II. వైష్ణవఖండమునందు వేంకటాచలమాహాత్మ్యము పురుషోత్తమ (పూరీ) క్షేత్రమాహాత్మ్యము, బదరికాశ్రమమాహాత్మ్యము, మాసమాహాత్మ్యములు, క్షేత్రమాహాత్మ్యములు వర్ణింపఁబడినవి. III. బ్రహ్మఖండమునందు బ్రహ్మ-బ్రహ్మోత్తరఖండములు గలవు. బ్రహ్మఖండమునందు సేతు (రామేశ్వర) మాహాత్మ్యము, ధర్మారణ్యమాహాత్మ్యము, చాతుర్మాస్యమాహాత్మ్యము గలవు. బ్రహ్మోత్తరఖండమునందు గోకర్ణక్షేత్రమాహాత్మ్యము, చంద్రాంగదచరిత్ర మొదలగునవి గలవు. IV. కాశీఖండమునందు విశ్వేశ్వర-గంగా-మణికర్ణికామాహాత్మ్యములు, వారణాసి యందలి వివిధలింగములు, తీర్థములు వర్ణింపఁబడినవి. V. రేవాఖండమునందు నర్మదానదీమాహాత్మ్యము, మహాకాళమాహాత్మ్యము వర్ణింపఁబడినవి. సుప్రసిద్ధమైన సత్యనారాయణవ్రతకథ యిందే గలదు. VI. తాపీఖండము నందుఁదాపీనదీమాహాత్మ్యము, విశ్వకర్మోపాఖ్యానము, హాటకేశ్వరమాహాత్మ్యము మొదలగునవి గలవు. VII. ప్రభాసఖండమునందుఁ బ్రభాసక్షేత్రమాహాత్మ్యము, ద్వారకామాహాత్మ్యము గలవు.

సంహితాత్మకమైన స్కాందమునందు (1) సనత్కుమార (2) సూత (2) శంకర (4) వైష్ణవ (5) బ్రహ్మ (9) సౌరములను నాఱు సంహితలు మొత్తము 8.000 శ్లోకములు గలవు. I. సనత్కుమారసంహితయందు (2) క్షేత్ర (2) తీర్థ (3) కాశీ (4) సహ్యాద్రి (5) హిమాచల (6) మలయాచల (7) వింధ్యాచల (8) మోక్ష (9) ప్రభాస (10) పుష్కర (11) నాగర (12) నర్మదా (13) శ్రీశైల (14) అవంతీ (15) గౌరీ (16) కురుక్షేత్ర (17) కేదార (18) హరిద్వార (19) సేతు (20) కాశికా (21) తత్త్వోపఖ్యాన (22) నదీ (23) ధర్మ (24) దేశ (25) వర్షఖండములు గలవు. ఇది 26000 శ్లోకముల గ్రంథము II. సూతసంహితయందు (1) శివమాహాత్మ్య (2) జ్ఞానయోగ (3) ముక్తి (4) యజ్ఞవైభవఖండములు గలవు. ఇది 6000 శ్లోకముల గ్రంథము III. శంకరసంహితయందుఁ బూర్వోత్తరభాగములు గలవు. పూర్వభాగమున (1) సంభవ (2) అసుర (3) వీరభద్ర (4) యుద్ధ (5) దక్ష (6) ఉపదేశఖండములు నుత్తరభాగమున (1) ఉపనీత (2) స్వర (3) గంగాసాగర (4) వేదసాగర (5) సిద్ధ (6) ప్రమేయ (7) ఉమా (8) నాగర (9) ప్రాయశ్చిత్త (10) కర్మవిపాక (11) దానప్రశంసా (12) కళ్యాణ (13) అగస్త్యఖండములు గలవు. ఇది 30,000 శ్లోకముల గ్రంథము IV. వైష్ణవసంహిత విష్ణుమాహాత్మ్యమును నిరూపించు 5000 శ్లోకముల గ్రంథము V. బ్రహ్మసంహితయందు బ్రహ్మోత్తరఖండము గలదు ఇది 3000 శ్లోకముల గ్రంథము. VI. సౌరసంహిత శివమాహాత్మ్యమును నిరూపించు 1000 శ్లోకముల గ్రంథము. వీనిలో సూత-శంకర-సౌరసంహితలు నేఁడు లభించుచున్నవి. సనత్కుమారసంహిత కొంత లభించుచున్నది. తక్కిన సంహితలు లభించుట లేదు.

## పురాణములు — ఆంధ్రీకరణములు

1) మత్స్యపురాణము —
1) లింగమగుంట రామకవి
2) హరిభట్టు
3) కాణాదము పెదసోమయాజి
4) కల్లూరి సుబ్రహ్మణ్యదీక్షితులు (వచనము)

2) మార్కండేయపురాణము —
1) మారన
2) పొన్నతోట బొబళకవి
3) ఎల్లకర నృసింహకవి (ద్విపద)
4) కల్లూరి సు. దీ. (వచనము)

3) భవిష్యపురాణము —
కల్లూరి సుబ్రహ్మణ్యదీక్షితులు (వచనము)

4) భాగవతము —
1) బమ్మెర పోతన్న
2) శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

(ఖ) దేవీభాగవతము —
1) ములుగు పాపయారాధ్యులు
2) దాసు శ్రీరాములు
3) తిరుపతి వెంకటకవులు
4) త్రిపురాన తమ్మయదొర
5) నోరి నరసింహశాస్త్రి
6) సరిపెల్లి విశ్వనాథశాస్త్రి (వచనము)
7) స్థానాపతి రుక్మిణమ్మ (వచనము)

5) బ్రహ్మపురాణము —
1) జనమంచి శేషాద్రిశర్మ
2) వెంకటపార్వతీశ్వరకవులు
నడకుదుటి వీరరాజు

6) బ్రహ్మవైవర్తపురాణము —
1) గోపీనాథ వెంకటకవి
[శ్రీకృష్ణజన్మఖండము]
2] దోమా వెంకటస్వామి

7] బ్రహ్మాండపురాణము —
1] కాపూరి ఎల్లన
2] జనమంచి శేషాద్రిశర్మ

8] వరాహపురాణము —
1] నంది మల్లయ; ఘంట సింగయ
2] హరిభట్టు
3] కల్లూరి సు. దీ. [వచనము]

9] వామన పురాణము —
1] పొన్నతోట బొబళకవి
2] లింగముగుంట రామకవి
3] ఎలకూచి బాలసరస్వతి
4] రామావఝుల కొండయ్యశాస్త్రి

# న్యాసము

5] వెంకటపార్వతీశకవులు
నడకుదుటి వీరరాజు
6] కల్లూరి సు. దీ. [వచనము]

10] వాయుపురాణము — పెద్దయమంత్రి

[అ] శివపురాణము —
1] ముదిగొండ నాగవీరేశ్వరకవి
2] మంత్రిప్రెగడ భుజంగరావు

11] విష్ణుపురాణము —
1] వెన్నెలకంటి సూరన
2] పశుపతి నాగనాథుఁడు
3] కలిదిండి భావనారాయణకవి
4] తుపాకుల యనంతభూపాలుఁడు [వచనము]
5] కళ్ళేపల్లి నరసింహమూర్తి
6] తాడేపల్లి సీతారామస్వామి
7] నోరి గురులింగశాస్త్రి [వచనము]

12] అగ్నిపురాణము — — —

13] నారదపురాణము —
1] పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి
2] వాసిరాజు రామన్న
3] క్రొత్తలంక మృత్యుంజయకవి
4] కల్లూరి సు. దీ. [వచనము]

14] పద్మపురాణము —
1] కామినేని మల్లారెడ్డి
2] పిశుపాటి చిదంబరశాస్త్రి

పద్మపురాణసంగ్రహము — కమలనాథామాత్యుఁడు
ఉత్తరఖండము — మడికి సింగన

15] లింగపురాణము —
1] తెనాలి రామకృష్ణకవి
2] ములుగు చంద్రమౌళిశాస్త్రి

16] గరుడపురాణము — పింగళి సూరన

17] కూర్మపురాణము —
1] రాజలింగకవి
2] మండ కామేశ్వరకవి
3] భమిడిపాటి సుబ్రహ్మణ్యశర్మ
4] కల్లూరి సు. దీ. (వచనము)

18] స్కాందపురాణము :—

1] కాశీఖండ — భీమఖండములు — శ్రీనాథుఁడు
2] కౌమారఖండము — జనమంచి శేషాద్రిశర్మ
2] ధర్మఖండము — ఈఁదులపల్లి భవానీశకవి
4] నాగరఖండము — తురగా రామకవి — అయ్యంకి బాలసరస్వతి
5] బ్రహ్మోత్తరఖండము — 1] శ్రీధరమల్లె వెంకటరామకవి

2] పట్టమట్ట సోమనాధకవి
3] ముత్తరాజు వెంకటకృష్ణకవి
4] ప్రాఁతకోట మల్లయకవి
6] శివరహస్యఖండము — కోడూరి వెంకటాచలపతి
7] సేతుఖండము — వక్కలంక వీరభద్రకవి
8] సూతసంహిత — 1] పట్టమట్ట సోమనాధకవి
2] బుఱ్ఱవరపు మహాదేవకవి.

## సూ త సం హి త

అష్టాదశమహాపురాణములలో శ్రీమద్భాగవతము వలె స్కాందపురాణభాగములలో సూత సంహిత విశిష్టస్థానము నలంకరించినది. శ్రీశివమాహాత్మ్యము, చాతుర్వర్ణ్యధర్మములు, వివిధాశ్రమధర్మములు, పుణ్యక్షేత్రములు, పవిత్రతీర్థములు, సాంఖ్యయోగసిద్ధాంతములు, ద్వాదశోపనిషద్రహస్యములు, నద్వైతవేదాంతతత్త్వము సుందరశైలిలోఁ బ్రతిపాదింపఁ బడుటచే సూతసంహిత ప్రాచీనకాలము నుండియుఁ బలువురు పండితుల దృష్టి నాకర్షించి ప్రచురప్రచారము గాంచినది శ్రీశంకరభగవత్పాదాచార్యులు మొదలుకొని బెల్లంకొండవారి వఱకుఁ గల మహాపండితు లందఱు దీనిని బరమప్రమాణముగా స్వీకరించిరి.

## 1) శ్రీశంకరభగవత్పాదాచార్యులు (క్రీ. పూ. 507-489)

ప్రస్థానత్రయమున కద్దముల వంటి పవిత్రభాష్యములను రచించి యద్వైతమతమును స్థాపించి 'జగద్గురువు' అని ప్రఖ్యాతిగాంచిన శ్రీశంకరభగవత్పాదులు సూతసంహితను బదునెనిమిది మాఱులు నిశితముగాఁ బరిశీలించి బ్రహ్మసూత్రభాష్యమును రచించి రని సంప్రదాయము.

శ్లో॥ తా మష్టాదశధా దృష్ట్వా శంకరః సూతసంహితామ్।
చక్రే శారీరకమ్ భాష్యం సర్వశ్రుతిమనోహరమ్॥

ఇత్యాదినా తదీయశారీరకభాష్యస్య శ్రీమత్సూతసంహితా మూలకత్వావగమేన చ భగవత్పాదాభిమతం కేవలాద్వైత మేవ వ్యాసతాత్పర్యవిషయ ఇత్యర్థస్యైవ ప్రామాణికత్వేన స్ఫుటమ్ ప్రతీయమానతయా" — అని వ్యాసతాత్పర్యనిర్ణయమునం దయ్యణ్ణదీక్షితులును

శ్లో॥ తా మష్టాదశధాలోచ్య శంకరః సూతసంహితామ్।
చక్రే శారీరకమ్ భాష్యం సర్వవేదాంతనిర్ణయమ్॥

అని శ్రీశంకరాచార్యచరిత్రమునందు బలదేవోపాధ్యాయులు నుదాహరించిన సాంప్రదాయికశ్లోకము లీవిషయమును వ్యక్తము చేయుచున్నవి. వీని ననుసరించియే యాంధ్రవిజ్ఞాన సర్వస్వము నందు ''సూతసంహితను 18 మాఱులు (లేదా 18 విధములుగా) ఆలోచించి శంకరులు సూత్రభాష్యము రచించిరని యొక యైతిహ్య మున్నది." (వి.స.7సం-13వపుట) అని చెప్పఁబడినది. భగవత్పాదు లంతటి వారు పదునెనిమిమాఱు లాలోడించుటయే సూతసంహిత గొప్పతనమును వేనోళ్ళ వెల్లడించుచున్నది.

## 2) మాధవమంత్రి – తాత్పర్యదీపిక

సూతసంహిత వేదవేదాంతతత్త్వములను నిరూపించు నతిక్లిష్టగ్రంథ మగుటచే దీనిపై మాధవమంత్రి 'తాత్పర్యదీపిక' యను విపులవ్యాఖ్యను రచించెను. దీనికి మూఁడు సంస్కరణములు గలవు.

1) శాస్త్రసంజీవనీముద్రాక్షరశాల — మద్రాసు — 1907.
శ్రీ శా. విశ్వనాథశాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁబడినది తెలుఁగులిపి. ఏకసంపుటము.

2) ఆనందాశ్రమ సంస్కృతగ్రంథావళి — పూనా – 1924.
శ్రీవాసుదేవశాస్త్రిగారిచేఁ పరిష్కరింపఁబడి వినాయకగణేశ ఆపటే గారిచేఁ బ్రకటింపఁబడినది. దీనికి 5 తాళపత్రప్రతు లాధారము. నాగరలిపి – 3 సంపుటములు.

3) బాలమనోరమాగ్రంథావళి — మద్రాసు – 1954.
నాగరలిపి – ఏకసంపుటము.

ఈతాత్పర్యదీపికాకర్త మాధవవిద్యారణ్యు లని ప్రాచీనపండితుల యాశయము. వేఱొక మాధవుఁ డని నవీన చారిత్రకుల నిర్ణయము. ఈవిషయము వించుక పరిశీలింతము.

### తాత్పర్యదీపికాకర్త యెవరు?

శ్రీమదయ్యణ్ణదీక్షితులు వ్యాసతాత్పర్యనిర్ణయము నందు — "శ్రీమత్సూతసంహితా తాత్పర్యదీపికాయాం విద్యారణ్యగురుచరణైః - అత ఏవ సాంఖ్యై రుచ్యతే సత్త్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతి రిత్యాదినా" అనియును

పట్టమట్ట సోమనాథసోమయాజి సూతసంహితయందు —

సీ॥ ఘనుఁడు విద్యారణ్యముని యేర్పరించిన, తాత్పర్యదీపిక దారి కలిమి.
తే॥గీ॥ అట్టిదగు సూతసంహిత యాకలించి, ప్రణుతమతి వేదవేదాంతభాష్యకర్త
యతిఘనుండు విద్యారణ్యయతి యొనర్చె, నాదిఁ దాత్పర్యదీపిక యనెడు టీక.

అనియును జెప్పుటచేఁ బ్రాచీనులు తాత్పర్యదీపికాకర్త విద్యారణ్యులని భావించి రనుట స్పష్టము. దీని కుపోద్ఘాతకముగా మద్రాసు ప్రతులు రెండింటియందును "శ్రీమద్విద్యారణ్యకృతతాత్పర్యదీపికాఖ్య సూతసంహితావ్యాఖ్యానప్రారంభః" అను వాక్యము చూపట్టుచున్నది. సుప్రసిద్ధచారిత్రకులగు సత్యనాథయ్యరుగారు —

The Sikarpur (Shimoga Dt.) record of Bukka– I of the same date mentions the Kulaguru Kriya Sakti and Madhavamantrin, the king's minister, who was not only a soldier but also the establisher of the path of the Upanishads. (History of India, Vol. II. 148P) అనియును

The Madhava Vidyaranya (1302–87) the head of

the Sringeri Math, was the son of Mayana and brother of Sayana and Bhoganatha and should not be confounded with the Madhavamantrin, a scholar-general of Bukka-II. The two Madhavas belonged to different gotras and sutras and are described in literature as *the* establisher of the path of the Vedas and the establisher of the Path of the Upanishads respectively. (History of India, Vol. II Page 150) అని చెప్పుచున్నారు.

శ్రీ పోరంచర్ల శ్రీరామమూర్తిగారు కూడ —

Madhava was a Minister of Bukka I and Harihara II and he was held in high esteem by them.

This Madhava must be distinguished from another Madhava, who was another minister of Bukka I. These two Madhavas may be reffered to, for avoiding confusion as Madhavacharya and Madhavamantrin respectively.

Madhavamantrin was the son of Dvivedi Cavunda and Macambica of Angirasagotra. He studied under a Saiva-teacher called Kriyasakti. He was both a scholar and a warrior. He ruled as the Governor of Banavase under Bukka I and Harihara II and vanquished the turuskas of Goa. On the other hand Madhavacarya is never known as a warrior.

Madhavamantrin is the author of a commentary on the Sutasamhita called Tatparyadeepika. He was also described in the inscriptions as a commentator of the Upanishads, as a publisher of the Saiva-Agamas and as the author of some poetical works.

(Contribution of Andhra to Sanskrit Literature; Page 90), అని చెప్పుచున్నారు.

మాధవవిద్యారణ్యులు బోధాయనసూత్రులు, భారద్వాజగోత్రులు యజశ్శాఖీయులు. వీరి జననీజనకులు శ్రీమతీమాయణులు. సాయణభోగనాథులు సోదరులు. మాధవులు మొదట హరిహర-బుక్కరాయసోదరులకు (1336-1379 A, D,) కులబ్రాహ్మణులై, విద్యాగురులై,

యమాత్యులుగా నుండి విజయనగరసామ్రాజ్యమును స్థాపింపఁజేసి కర్ణాటకసింహాసనసంస్థాపనాచార్యులని ప్రసిద్ధి నొందిరి. పిమ్మట సన్న్యసించి విద్యారణ్యనామముతో శృంగేరిపీఠము నధిష్ఠించిరి. శ్రీవిద్యాతీర్థులు, భారతీతీర్థులు, శ్రీకంఠాచార్యులు వీరి గురువులు. సాయణమాధవసోదరులు గలిసి చతుర్వేదభాష్యములనే గాక యనేక శాస్త్రగ్రంథములను రచించిరి.

ఈకాలమునందే మాధవమంత్రి కూడ నుండెను, ఇతఁడు బుక్కరాయలకు దండనాయకుఁడు, మాధవామాత్యు లాంగిరసగోత్రీయులు. తండ్రి చౌండభట్టు. తల్లి మాచాంబిక. గురువు క్రియాశక్తి. వీరు సూతసంహితా తాత్పర్యదీపికను, శైవాగమసారసంగ్రహము నుపనిషద్వ్యాఖ్యలను రచించిరి.

సాధారణముగా సాయణ–మాధవసోదరులచే రచింపఁబడిన గ్రంథములలో నంత్యగద్య మీవిధముగా నుండును.

"ఇతి శ్రీమద్రాజాధిరాజపరమేశ్వర వైదికమార్గప్రవర్తక శ్రీవీరబుక్కభూపాలసామ్రాజ్యధురంధరేణ సాయణాచార్యేణ విరచితే మాధవీయే వేదార్థప్రకాశ ఋక్సంహితాభాష్యే ఒష్టమాష్టకేఒష్టమో ఒధ్యాయః సంపూర్ణః"

దీనికి భిన్నముగాఁ దాత్పర్యదీపికాంతగద్య మీక్రింది విధముగా నున్నది.

"ఇతి శ్రీమత్కాశీవిలాసక్రియాశక్తి పరమభక్త త్ర్యంబకపాదాబ్జసేవాపరాయణే నోపనిషన్మార్గప్రవర్తకేన శ్రీమాధవాచార్యేణ విరచితాయాం సూతసంహితాతాత్పర్యదీపికాయాం చతుర్థస్య యజ్ఞవైభవఖండ స్యోపరిభాగే సూతగీతావ్యాఖ్యాయాం సర్వవేదాంతసంగ్రహో నామాష్టమో ఒధ్యాయః".

సాధారణముగా సాయణ – మాధవసోదరులచే రచింపఁబడిన గ్రంథములలో నవతారిక

శ్లో॥ వాగీశాద్యాః సుమనసః సర్వార్థానా ముపక్రమే।
యం నత్వా కృతకృత్యాః స్యు స్తం నమామి గజాననమ్॥

అనుశ్లోకముతోఁగాని

శ్లో॥ ప్రణమ్య పరమాత్మానం శ్రీవిద్యాతీర్థరూపిణమ్।

అను శ్లోకముతోఁగాని

శ్లో॥ నమః శ్రీశంకరానందగురుపాదాంబుజన్మనే।
సవిలాసమహామోహగ్రాహగ్రాసైకకర్మణే॥

అనుశ్లోకముతోఁగాని యారంభ మగును. దీనికి భిన్నముగాఁ దాత్పర్యదీపికావతారిక

శ్లో॥ ప్రణమామి పరంబ్రహ్మ యతో వ్యావృత్తవృత్తయః।
అవిచారసహం వస్తు విషయీకురుతే ధియః॥
శ్రీమత్కాశీవిలాసాఖ్యక్రియాశక్తీశసేవినా।
శ్రీమత్త్ర్యంబకపాదాబ్జసేవానిష్ణాతచేతసా॥
వేదశాస్త్రప్రతిష్ఠాత్రా శ్రీమన్మాధవమంత్రిణా।
తాత్పర్యదీపికా సూతసంహితాయా విధీయతే॥

అను శ్లోకములతో నారంభ మగుచున్నది.

శ్రీమాధవవిద్యారణ్యులు సకలవేదములకు విపులభాష్యములను రచింపఁబూనిన వారగు టచే నందడుగడుగునఁ బూర్వమీమాంసాన్యాయముల విచార మెక్కువగా నుండును గాన ముందుగా 'జైమినీయన్యాయమాల' యను కారికాగ్రంథమును, న్యాయమాలావిస్తరమను వ్యాఖ్యానమును సంతరించిరి. వారి గ్రంథములలో మీమాంసాసందర్భ మెచ్చట వచ్చినను విధిగా జైమినీయన్యాయమాల యుదాహరింపఁబడును. వీరి వైయాసకన్యాయమాలా–విస్తరములు గూడ విట్టివే. దీనికి భిన్నముగాఁ దాత్పర్యదీపికయందు మీమాంసాసందర్భములు వచ్చినపుడు జైమినిసూత్రములే యుదాహరింపఁబడినవి గాని న్యాయమాల పేర్కొనఁబడలేదు. విద్యారణ్యుల వ్యాఖ్యానపంక్తి విస్తరముగా సులభశైలిలో నుండును. తాత్పర్యదీపికా పంక్తి సంక్షేపముగా జటిలశైలిలో నున్నది. శ్రీవి. రాఘవాచార్యు లుదాహరించిన మారప్ప శాసనములో —

శ్లో॥ త్రయీం సమాలోచ్య పురాణసంహితాం, హితాయ లోకస్య హి యేన మంత్రిణా:

ప్రసాదితత్ర్యంబకశాసనాత్ కృతః, సమస్తశైవాగమసారసంగ్రహః॥

అను శ్లోకము సూతసంహితావ్యాఖ్యానము, శైవాగమసారసంగ్రహము మాధవమంత్రిచే రచింపఁబడిన వని నొక్కి వక్కాణించుచున్నది. మాధవవిద్యారణ్య–మాధవమంత్రుల గోత్రములు, తల్లిదండ్రులు, విద్యాగురువులు, గ్రంథాంతగద్యములు వ్యాఖ్యానశైలి పరస్పర భిన్నముగా నుండుటచే మాధవమంత్రియే తాత్పర్యదీపికాకర్త యను చారిత్రకుల నిర్ణయమే సమంజసముగా నున్నది.

ఇక్కడ నొక్క చిన్న చిక్కు విషయ మాలోచింపవలయును తాత్పర్యదీపిక యారంభము నందును, మఱల యజ్ఞవైభవఖండోపరిభాగము నందలి బ్రహ్మగీతావ్యాఖ్యారంభము నందును —

శ్లో॥ నమః శ్రీశంకరానందగురుపాదాంబుజన్మనే।

సవిలాసమహామోహగ్రాహగ్రాసైకకర్మణే॥

అను శ్లోకము కనుపట్టుచున్నది. అట్లే జ్ఞానయోగఖండాంతమున

శ్లో॥ సంహితాయాశ్చ సూతస్య వ్యాఖ్యాం తాత్పర్యదీపికామ్।

సుస్థిరా మనుగృహ్ణాతు విద్యాతీర్థమహేశ్వరః॥

అను శ్లోకము గలదు. ఈరెండు శ్లోకములందు విద్యారణ్యముద్ర స్పష్టముగాఁ గలదు. తాత్పర్యదీపికాకర్తకుఁ గూడ శంకరానందులు, విద్యాతీర్థులు విద్యాగురువులైనట్లీ శ్లోకములు నొక్కి చెప్పుచున్నవి. ఈశ్లోకములు మద్రాసు–పూనా ప్రతులలో సమానముగా నున్నవి. దీనినిబట్టి మాధవమంత్రి కూడ విద్యారణ్యులవలెనే శంకరానంద, విద్యాతీర్థుల యొద్ద విద్య నభ్యసించెననియు, మాధవవిద్యారణ్యులకు విద్యాతీర్థుల వలెనే మాధవమంత్రికిఁ గ్రియాశక్తి పరమగురు వనియు, శ్రీమదాంధ్రమహాభారతరచనమున నన్నయభట్టునకు సహాధ్యాయుఁడగు నారాయణభట్టు తోడయినట్లు తాత్పర్యదీపికారచనమున మాధవమంత్రికి మాధవ విద్యారణ్యులు తోడ్పడి యుందురనియు నాకృతజ్ఞతను వెల్లడించుటకే విద్యారణ్యశ్లోకములను మాధవమంత్రి తన తాత్పర్యదీపికలో గ్రహించె ననియు నూహింపవలయును. వ్యాఖ్యానరచనమునందు నామసామ్యముతోఁ బాటు విద్యారణ్యుల సహాయము కూడఁ గొంత యుండుటచేఁ

బట్టి మట్టి సోమయాజికవి, అయ్యణ్ణదీక్షితులు వంటి సాంప్రదాయికులు తాత్పర్యదీపికాకర్తలుగా విద్యారణ్యులను పేర్కొనిరి. తాత్పర్యదీపికావ్యాఖ్యాన విశేషములను తరువాత వివరింతును.

### 3) శ్రీసదాశివబ్రహ్మేంద్రసరస్వతి (1725)

శ్రీమత్పరమహంసపరివ్రాజకులై జీవన్ముక్తులై బ్రహ్మభావమును గాంచిన సదాశివ బ్రహ్మేంద్రసరస్వతీచరణులు వేదాంతరసికులకు సంగీతలాలసులకు సుపరిచితులు. వీరు "సూతసంహితాసంగ్రహము"ను రచించిరి. (1) అద్వైతరసమంజరి (2) ఆత్మవిద్యావిలాసము (3) ఆత్మానాత్మవివేకసంగ్రహము (4) పరమహంసచర్య (5) బోధార్యప్రకరణము (6) బ్రహ్మతత్త్వ ప్రకాశిక (బ్రహ్మసూత్రవ్యాఖ్య) (7) సర్వవేదాంతసార సంగ్రహము (8) సిద్ధాంతకల్పవల్లి (9) కేసరవల్లి (10) యోగసుధాకరము (పాతంజల యోగసూత్రవ్యాఖ్య) (11) నవమణిమాల (12) ఆత్మానుసంధానము (13) స్వప్నోదితము (14) స్వానుభూతిప్రకాశిక (15) దక్షిణామూర్తిధ్యానము (16) మనోనియమనము (17) ఉపనిషద్వ్యాఖ్యలు (18) భగవత్కీర్తనలు వీరియితరకృతులు. 'మానస సంచర రే' 'బ్రూహి ముకుందేతి' 'చేతః శ్రీరామమ్' 'చింతా నాస్తి కిల' 'పిబరే రామరసమ్' 'భజరే గోపాలమ్' మొదలగు కీర్తనలు మిక్కిలి ప్రసిద్ధిగాంచినవి.

### 4) భాస్కరరాయలు (1750)

[1] వరివస్యారహస్యము [2] సేతుబంధము [3] గణేశసహస్రనామభాష్యము (శ్లోకభాష్యము) [4] దుర్గాసప్తశతీటీక [5] లలితాసహస్రనామభాష్యము మొదలగు 40 గ్రంథములను రచించిన భాస్కరరాయలు మంత్రశాస్త్రజ్ఞులకు దేవీభక్తులకు సుపరిచితులు.

లలితాసహస్రనామభాష్యములో —

అత ఏవ స్కాందే సూతసంహితాయాం నామసు గౌణముఖ్యభేదేన ఫలభేదః స్మర్యతే.

శ్లో॥ నామాని సర్వాణి తు కల్పితాని, స్వమాయయా నిత్యసుఖాత్మరూపే।
తథాపి ముఖ్యాస్తు శివాదిశబ్దా, భవంతి సంకల్పనయా శివస్య॥
ముఖ్యశబ్దజపతో మునీశ్వరాః। సత్యమేవ పరమేశ్వరోఽభవత్।
తస్యవక్త్రకమలే సదాశివో నృత్యతిస్మ పరమేశయా సహ॥
ఇత్యలంవిస్తరేణ. (ఉపోద్ఘాతభాష్యము)

యజ్ఞవైభవఖండే తు—
జ్ఞాతార్థం జ్ఞాతమిత్యేవం వక్ష్యే సతి తద్వినా।
ఓమితి ప్రాహ లోకోఽయం తేన జ్ఞాతస్య వాచకః॥

సర్వావభాసకం మంత్ర మిమం జపతి యో ద్విజః।
సర్వమంత్రజప ప్రోక్తఫలం స లభతేఽచిరాత్॥

ఇతి. (ఫలాక్షరప్రథమసూత్రభాష్యము)

స్కాందే బ్రహ్మగీతాయాం తథైవోపబృంహణదర్శనాత్ —

శ్లో॥ శంకరాఖ్యం తు విజ్ఞానం బహుధా కల్ప్యతే బుధైః।
కేచిద్ధృదయ మిత్యాహుః ... ... ఇత్యారభ్య
వశ ఇత్యాస్తికాః కేచిత్ సర్వాణ్యేతాని సంతతమ్‌ః
ప్రజ్ఞానస్య శివస్యాస్య నామధేయా న్యసంశయమ్॥
ఇత్యంతమ్ ("శివకామేశ్వరాంకస్థా" నామభాష్యము)
మొదలగుచోట్ల సూతసంహితాశ్లోకము లుదాహరింపఁబడినవి.

## ౫) అయ్యణ్ణదీక్షితులు (1850)

అయ్యణ్ణదీక్షితులు రచించిన వ్యాసతాత్పర్యనిర్ణయము చిన్న గ్రంథ మైనను మిక్కిలి ప్రచారము గాంచినది. వ్యాససూత్రములు నద్వైతమునందే తాత్పర్యమని నిర్ణయించుట కై నీ రపూర్వమార్గము నవలంబించిరి. న్యాయ-వైశేషిక-సాంఖ్య-యోగ-మీమాంసా-వేదాంత ములు షడ్దర్శనములు. ఈదర్శనకారు లన్యదర్శనసిద్ధాంతములను బూర్వపక్షము చేసి తమ సిద్ధాంతములను స్థాపింతురు. బ్రహ్మసూత్రములందుఁ దక్కిన దర్శనములు ఖండింపఁబడి నట్లే తక్కిన దర్శనములందు వేదాంతదర్శనము కూడ ఖండింపఁబడినది. గౌతమ-కణాద-కపిల-పతంజలి-జైమినులు వేదాంతదర్శనమును ఖండించు సందర్భములో నద్వైతమతమునే ఖండించుటచే శ్రీశంకరభగవత్పాదప్రతిపాదితమైన యద్వైతమతమునందే బ్రహ్మసూత్రము లకుఁ దాత్పర్యమని యందు సిద్ధాంతము చేయఁబడినది గ్రంథాంతమునఁ బురాణముల కన్నిటికి నద్వైతమతమునందే తాత్పర్యమని చెప్పుచు "అత ఏవోక్తం శ్రీమత్సూతసంహితా యాం యజ్ఞవైభవఖండే ద్వావింశాధ్యాయే — — తస్మాత్ సకలశ్రుతిసూత్రస్మృతీతిహాస పురాణాగమమంత్రాణాం వ్యాసాభిమత కేవలాద్వైత ఏవ తాత్పర్యస్యావధారితత్వేన తాదృశా ద్వైతమేవ పరమార్థ ఇతి సిద్ధమ్॥

అని సూతసంహితయందలి యజ్ఞవైభవఖండము లోని 22వ యధ్యాయము పూర్తిగా నుదాహరింపఁబడి శంకరాద్వైతమే పరమార్థమని ముగింపఁబడినది. ఈవ్యాసతాత్పర్య నిర్ణయము బ్రహ్మసూత్రచంద్రిక కనుబంధముగా శ్రీవెన్నెలకంటి సుందరరామశర్మగారిచే సుందరముగా ననువదింపఁబడినది.

## ౬) శ్రీ బెల్లంకొండ రామరాయకవి (1875-1914)

విభిన్న శాస్త్రములలో శతాధికగ్రంథకర్తలై విశేషించి యనేకాద్వైత వేదాంతగ్రంథ ములు రచించి యపరశంకరు లని ప్రసిద్ధి నొందిన శ్రీ బెల్లంకొండ రామరాయ కవీంద్రులు జగత్ప్రసిద్ధులు. వీ రుపనిషత్ప్రస్థానము ననుసరించి వేదాంతముక్తావళిని, గీతాప్రస్థానము ననుసరించి శ్రీశంకరభాష్యార్కప్రకాశమును, సూత్రప్రస్థానము ననుసరించి శంకరాశంకర భాష్యవిమర్శమును రచించిరి. శంకరాశంకరభాష్యవిమర్శములో రామానుజాచార్యుల శ్రీభాష్య మును, సుదర్శనాచార్యుల శ్రుతప్రకాశికను ఖండించి శ్రీశంకరభగవత్పాదుల యద్వైత సిద్ధాంతమును బునఃప్రతిష్ఠించిరి. ఇందుఁ బురాణముల కన్నింటికి నద్వైతమతమునందే తాత్పర్యమని నిరూపించు సందర్భములో "సూతసంహితాయా నిర్విశేషబ్రహ్మపరత్వప్రతిపాద నమ్" అను ప్రత్యేకప్రకరణములో సూతసంహిత యందలి యనేకశ్లోకముల నుదాహరించి

మఱలి గ్రంథాంతమున సూతసంహిత యందలి బ్రహ్మగీతలోని పంచమాష్టమాధ్యాయశ్లోకములను ప్రమాణముగాఁ గైకొని యద్వైతతత్త్వమును స్థాపించిరి. బెల్లంకొండవారి యీ గ్రంథము సంపూర్ణముగా లభింపకుండుట మన దురదృష్టము.

## 7) ధూపకర అనంతయజ్ఞేశ్వరశర్మ (19 5)

గోవాపండితులైన యజ్ఞేశ్వరశర్మగారు భగవద్గీతకు 'అవిగీత' యను చక్కని టిప్పణిని రచించిరి. ఇందు జ్ఞానదేవ-వామనపండితులు రచించిన మహారాష్ట్రవ్యాఖ్యలలోని విశేషములు అభినవగుప్త, మధుసూదనసరస్వత్యాదులు రచించిన గీతావ్యాఖ్యలలోని రహస్యములు క్రోడీకరింపఁబడినవి. భగవద్గీత యందలి 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః' (4-13) అను శ్లోకమున కపిగీతలో మహాభారతఘట్టములు, అత్రిసంహిత. అగ్నిపురాణము, మాతంగలీల, వారతాంతవిస్మృతి, జైమినిమీమాంస, పాతంజలమహాభాష్యము మొదలగువానిసుదాహరించి జన్మమును బట్టియే వర్ణము గాని కర్మమును బట్టి కాదని నిరూపించి చివరకు—

తథా చోద్ఘోషితం సూతసంహితాయామ్ —

శ్లో॥ సర్వేషాం జన్మనా జాతి ర్నాన్యథా కర్మకోటిభిః।

పశ్వాదీనాం యథా జాతి ర్జన్మనైవ నచాన్యథా॥ (శి మా. 12-51)

ఇతి సర్వేషా మపి శ్రుతిస్మృతిపురాణేతిహాసాదీనాం చాయ మేవ సిద్ధాంత ఇత్యన్యత్ర విస్తర ఇత్యలం ప్రసక్తానుప్రసక్త్యా" అని సూతసంహితాశ్లోకమును ప్రమాణముగాఁ జూపి సిద్ధాంతగ్రంథమును ముగించిరి. ఇట్లనేక శాస్త్రార్థఘట్టములకు సూతసంహిత నికషోపలమైనది

### తెలుఁగు కవులు

## 8) శ్రీకృష్ణదేవరాయలు. (1509-1530)

సూతసంహితను మొట్టమొదటఁ బ్రస్తావించిన తెలుఁగుకవి శ్రీకృష్ణదేవరాయలు శ్రీనాథుఁడు కాశీఖండములో స్కాందపురాణగ్రంథశ్లోకానుక్రమణికలో సూతసంహితను బరిగణించినను గథాసందర్భములో మతగ్రంథముగా సూతసంహితను గీర్తించిన కీర్తి రాయలువారికే దక్కును.

తే॥గీ॥ అప్పు డిచ్చకు లగు బ్రహ్మణౌఘ మెల్ల, నాత్మజనభూమి విడువలే కలికభూతి
గడ్డముల నాన రుదురాక లిడ్డ సంది, సూతసంహిత లిటికించి చొరఁదొడఁగిరి.

(ఆముక్త.4-46)

ఈపద్య మాముక్తమాల్యదలో యామునాచార్యచరిత్రమును శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవికిఁ దెలుపు సందర్భము లోనిది. పాండ్యరాజునకు శైవమతమునం దభిరుచి మెండు. అతని రాణికి వైష్ణవమతము నందు మక్కువ యెక్కువ. రాజు శైవమతము నవలంబించి వైదిక కర్మములను విడిచిపెట్టి శైవశాస్త్రములనే వినుచు నారాధ్యదేవళ్ళనే యారాధించుచు శైవ బ్రాహ్మణులకే యగ్రహారము లిచ్చుచుండెను. అపుడు బ్రాహ్మణులు జన్మభూమిని విడువలేక గడ్డములు వఱకు విభూతి పెట్టుకొని రుద్రాక్షమాలలు దాల్చి సందిట సూతసంహితల నిటి

కించికొని రాజాస్థానమునకు రాఁదొడఁగి రని భావము. దీనినిబట్టి రాయలవారి కాలములో శైవమతస్థులలో సూతసంహితకుఁ బ్రచురప్రచార ముండెడి దని స్పష్టము.

## ४) పట్టమట్ట సోమనాథసోమయాజి (1500)

సూతసంహితను మొట్టమొదటఁ దెలిఁగించిన కవి పట్టమట్ట సోమనాథకవి. రాజోలు తాలూకా యందలి 'పెదవలపల్లి' యీతని జన్మస్థలము. సోమనాథకవి "సూతసంహిత"ను దెనిఁగించి కామినేని కామారెడ్డికి, "బ్రహ్మోత్తరఖండము" నాంధ్రీకరించి కామినేని యెల్లా రెడ్డికి నంకితము గావించెను. 'షట్చక్రవర్తిచరిత్ర', 'శివధర్మోత్తరము', 'పద్మపురాణము రచించిన కామినేని మల్లారెడ్డి యీకృతి పతులకు సోదరుఁడు. సోమనాథకవి తన్నుఁ గూర్చి చెప్పుకొన్న పద్యములనుబట్టియుఁ బూర్వకవిస్తుతులను బట్టియు నితఁడు సర్వశాస్త్రనిష్ణాతుఁ డనియు, బహుగ్రంథపరిశీలకుఁడనియు సరసకవితాకుశలుఁడనియుఁ దెలియుచున్నది. "కవితా విలాసమున నీతఁడు శ్రీనాథునితోఁ దులతూఁగుచుండు" నని శ్రీచాగంటి శేషయ్యగారు చెప్పు చున్నారు. చాగంటివారి కవితరంగిణిని బట్టి యీతని రెండు గ్రంథములు ముద్రింపఁబడి నట్లు తెలియుచున్నది గాని రెండు కావ్యములు కూడ నాకు లభింప లేదు. ఈసోమనాథకవి వంశములోఁ బుట్టిన పట్టమట్ట సరస్వతీసోమయాజి తన వృథుచరిత్రలో —

ఉ॥ నన్నయభట్టుగారు యజనం బొనరించిన చోట జన్మిచె
ట్టున్నది తణుకు తూర్పున సమున్నత మైనది దాని నీడ నే
మున్నతజిన్ శిఖత్వమున నున్నతరీతి వరం బొసంగుచున్
నన్నుఁ గృతార్థుఁ జేసితిరి నాయుమ నీవును భీమనాయకా!

అను పద్యములో నన్నయగారు తణుకులో యజ్ఞము చేసినట్లు చెప్పినాఁడు. ప్రకృతము ననుసరింతము. ఆధునికులలో శ్రీసూతసంహితను యథామాతృకముగా నాంధ్రీకరించినవారు శ్రీబుద్ధవరపుమహాదేవామాత్యులు.

## శ్రీ బుద్ధవరపు మహాదేవకవి (1889–1968)

శ్రీబుద్ధవరపు మహాదేవకవి యాంధ్రభాషాపాఠకులకు సుపరిచితులు. వీరు సుప్రసిద్ధవిద్వత్కవివంశమగు కూచిమంచి వారి యింట జన్మించిరి. (1) శ్రీకొప్పులింగేశ్వరశతకము [2] భక్తచింతామణిశతకము [3] శ్రీకొప్పులింగేశ్వరదండకము [4] శ్రీకొప్పులింగేశ్వర కీర్తనలు రచించిన శ్రీకూచిమంచి సోమసుందరకవి వీరి తండ్రి. కాళిదాసు కుమారసంభవ మును యథామాతృకముగా నాంధ్రీకరించిన సాంబకవి వీరి యన్న. ఇంక మన మహాదేవకవి [1] మాఘకావ్యము [2] సూతసంహిత [3] చంపూరామాయణము [4] కువలయానందము నను నాలు గుద్గ్రంథములు రచించి శ్రీకంచికామకోటిపీఠాధిపుల శుభాశీస్సులను బడసి జయపురమహారాజులగు శ్రీవిక్రమదేవవర్మగారిచేఁ 'కవితావిశారద' బిరుదము నందిన కవి చంద్రులు. వీరి పూర్వులు గ్రంథములను గూర్చియు వీరి యితరగ్రంథములను గూర్చియు మాఘభూమికయందు సోదాహరణముగా వివరించితిని. ప్రస్తుత గ్రంథమగు సూతసంహితను గూర్చి యించుక తెలిసికొందము.

సూతసంహిత యందు [1] శివమాహాత్మ్యఖండము [2] జ్ఞానయోగఖండము

(3) ముక్తిఖండము (4) యజ్ఞవైభవఖండము నని నాల్గు ఖండములు గలవు. ఈ సంహిత ధర్మశాస్త్రరహస్యములను, సాంఖ్యయోగములను, ఉపనిషద్వేదాంతములను, శ్రీ శివపారమ్యమును నిరూపించు శాస్త్రగ్రంథము గాని కథాప్రధానమైనది గాదు. ఇట్టి గ్రంథమును పద్యకావ్యముగా సంతరించుట కత్తిమీఁద సాము వంటిది.

మన పూర్వకవు లందఱు నితిహాసపురాణముల ననువదించునపుడు మూలగ్రంథమును సంగ్రహించి తెలుఁగుభాష కనుగుణముగాఁ గథాప్రధానముగా రచించిరి. ఒక్క పోతన మాత్రము శ్రీమద్భాగవతమును గొంచెము కూడ విడువక కొన్నిఘట్టములను పెంచి కొన్నిచోట్ల శ్రీధరవ్యాఖ్యను జోడించి యథామాతృకముగా నాంధ్రుల కందించెను. మహాదేవకవి కూడ నుపాఖ్యానములుగల తావులందుఁ బెంచుచు, శాస్త్రప్రఘట్టకములందు వ్యాఖ్యానమును జోడించుచు యథామాతృకముగా సూతసంహిత నాంధ్రీకరించుట తెలుఁగువారి యదృష్టము.

## ఉపాఖ్యానములు

6000 శ్లోకములు గల యీసూతసంహితలోఁ గథలు కొలఁది మాత్రమే గలవు. ముక్తిఖండ-యజ్ఞవైభవఖండములలో (1) కోలాహలకథ (2) శశివర్ణోపాఖ్యానము (3) వారకాంతాచరిత్రము (4) సంగిరోపాఖ్యానము (5) దుర్ఘటచరిత్రము (6) సత్యసంధచరిత్రము (7) కుమ్మరికథ (8) గౌతమమహర్షి చరిత్రము (9) బ్రాహ్మణాధముని కథ యనునవి తొమ్మిది కథలు గలవు. కవులు తమ సామర్థ్యమును జూపుట కిట్టి పట్టులే యెక్కువగా నుపయోగించును.

### 1. కోలాహలుని కథ :—

ఇది ముక్తిఖండములో శివుఁడు విష్ణుమూర్తి కుపదేశించినది. కోలాహలుఁడను దుర్మార్గుఁడు తండ్రిని జంపి తల్లిని రమించి చివరకు కేదారణ్యములో మరణించుటచే మోక్షము పొందెనని చెప్పఁబడినది. మూలము నందలి 3 శ్లోకములు 3 పద్యములుగా (ముక్తి-71-73) ననువదింపఁబడినవి.

### 2. శశివర్ణోపాఖ్యానము :—

ఇందలి శశివర్ణోపాఖ్యానము, సంగిరోపాఖ్యానము, దుర్ఘటచరిత్ర, బ్రాహ్మణాధముని కథ మొదలగునవి శివరాత్రిమాహాత్మ్యమునందలి సుకుమారచరిత్రను, గాశీఖండమునందలి గుణనిధికథను, పాండురంగమాహాత్మ్యమునందలి నిగమశర్మోపాఖ్యానమును గుర్తునకుఁ దెచ్చును. గురుశుశ్రూషణమహిమను దెల్పుటకు రెండుపాఖ్యానములు చెప్పఁబడినవి.

వేదవేదాంగములు, పురాణేతిహాసములు పఠించి పవిత్రుఁడైన పాకయజ్ఞుఁ డను బ్రాహ్మణుఁడు గలఁడు. అతనికిఁ బూర్వపాపకర్మవశమున దుశ్శీలుఁడైన యొక కొడుకు జన్మించెను, పాకయజ్ఞుఁడతనికి శశివర్ణుఁ డని పేరు పెట్టెను.

తే॥గీ॥ చిన్నవయసున గొనముల తెన్నుఁ గనమి, పేరు 'శశివర్ణుఁ' డని తండ్రి పెట్టెఁగాని
గొనములను గాంచ 'నిశివర్ణుఁ' డనుచుఁ బిల్వఁ, దగియె నాతండు కర్మవిధంబులెట్లొ।
(ముక్తి-172)

ఈ పద్యము పాండురంగమాహాత్మ్యము నందలి

తే॥గీ॥ నిగమశర్మాభిధానంబు నేతిబీర, కాయయును బోలె నయథార్థగాథ దాల్చి

(పాండు-3-13)

అను పద్యమును జ్ఞాపకము చేయుచున్నది.

సీ॥ ఆశ్రమమర్యాద-నాశ్రయించుట లేదు, వేదనిందైకప్రవీణుఁ డగును
ఆచరింపఁడు ధర్మ మావగింజంతయు, ధర్మచారిత్రుల నిందన మొనర్చు
నెనరు గల్గి దొకింత విషుఁగుల యందును, ప్రాణిహింసాపరత్వమున మెలఁగుఁ
బెద్దలఁ గని లేచి భృత్యుభావము గనఁ, డాత్మభృత్యులు గాఁగ నరయు వారిఁ

తే॥గీ॥ దండ్రిఁ దిట్టును దల్లి ని వేండ్రఁ బెట్టు, నన్న నవ్వును జెలియలి నడఁగఁద్రొక్కు-
శక్తి కొలఁదిని దుర్నయచయ మొనర్చు మీఁదెఱుంగఁడు చెన్నఁటి వాదు లాడు.

(ముక్తి-179)

కం॥ ఆలన్ బొరిగొను నన్య, స్త్రీలన్ గలయంగఁ జూచుఁ జెన్నఁటి మాటన్
పూలన్ వలెఁ దలఁ దాల్చును, గాలము వ్యర్థముగఁ బుచ్చుఁ గట్టిఁడి వాఁడౌ.

(ముక్తి-181)

ఇట్లు శివవర్ణుఁ డనేకపాపముల నొనర్చి పెక్కురోగములకు గుఱియై చివరకు మరణావస్థ నొందెను. అట్టి స్థితి యందున్న కొడుకును జూచి పాకయజ్ఞుఁడు విలపించుచుండఁగా దేవభక్తుఁ డగు నొక ఋషి వచ్చి గోపర్వతమున కేఁగి శివుని గొల్చినచో శివవర్ణుని యాధి వ్యాధులు మాను నని యుపదేశించెను. పాకయజ్ఞుఁడు శివవర్ణునితో గోపర్వతము చేరి శక్తీశ్వరుని భజించినంతనే నీరోగి యయ్యెను. గురుశుశ్రూషామహిమమునఁ బాకయజ్ఞుఁడు సుతునితో మోక్షము గాంచెను. మూలమున 48 శ్లోకములలో నున్న యీకథ తెలుఁగున 49 పద్యములలో (ముక్తి-165-214) విస్తరింపఁబడినది.

## 3. వారాంగనకథ :-

దీనికి వెనువెంటనే యొక వారాంగన కథ గలదు. సుభగ యను నొక వేశ్య గలదు. ఆమె చిన్నెలిట్లు వర్ణింపఁబడినవి.

సీ॥ అడుగులఁ జిరుమువ్వ లలర నృత్యము సేయు, నలయురా! యని జాలి సొలయు వారు
మునివ్రేల నుసుచెక్కుటను జేర్చి యభినయం, బొనరింప భేష భేష నెడు వారు
పెదవి మెదల్చి సౌరు దలిర్ప శృంగార, పదము పాడిన యబ్బపడెడు వారు
అత్తరుగంధమ్ము నందీయ వలపులు, తలఁపులు గొనసాగ మెలఁగు వారు

తే॥గీ॥ పిన్నలున్ బెద్దలున్ సాని మిన్నఁ గన్నఁ; జెన్ను నెన్నుచు నాలేమ చీరచెంగు
గాలి సోకిన ధన్యోఽస్మి కతలఁ గేల, యనుచు నెవరికి వారలే యలరుచుండ్రి.

(ముక్తి-211)

సీ॥ ఒకనరుపై వెత్తి యొలయ మూర్వశి వట్టి, బేల యాచెలి ముంద రేల నడువ
రంభ యెంతటిది యీభామ దగ్గఱఁ జేరి, బిడ్డఁగా వలెఁ గొన్ని యొద్దికలను

సరసుల బెదరు కన్ సన్నల నారయ్యు హరిణకు నీలేమ కగునె సవతు
పేరుచేఁ దెల్లమౌ తీరు తిలోత్తమ, కది దీనితో సరి యగునె యెందు

తే॥గీ॥ ప్రియుల దగ్గరి కొఱలేని పెరిమ లొలుకఁ, గులికి కులికించు పట్టు లక్షలను బార
వశ్యమున మాయఁ జాలని పదఁతు లగుట, దీనికిని వేలుపసానులు దీనికట్టు.

(ముక్తి-225)

ఆ రోవెలఁది విటుల నాకర్షించి మిద్దెలు మేడలు కట్టుచుండఁగాఁ గొంతకాలమునకు ముదిమి వచ్చెను.

ఉ॥ మోమున గోము సన్నగిలఁ బొల్పగు చెక్కులి నిగ్గు తగ్గఁ గ
న్దామరలందు గంతులిడు దళ్కులు బెళ్కులు వీడికోల్ గొనన్
సాములు దక్కి మన్మథుఁడు చయ్యన పేఁటొక తావుఁ జూచికో
నామదిరాక్షిపై ముదిమి యల్లన నల్లనఁ బ్రాకె వింతగన్.

(ముక్తి-227)

అట్టి ముసలితనమునం దావేశ్య చేసిన పాపములే పిశాచములై యామెను బాధించెను. రోగములతో సుక్కుచున్న దాని యింటికి విలక్షణయోగి రాఁగా నతని భక్తితో మూఁడేండ్లు సేవించెను.

కం॥ సన్నని పలువ లొసంగెను, జెన్నగు పూవుల నొసంగెఁ జెలఁగుచు నఱుఁతన్
హొన్నుజగా సేవశ మిడె, నన్నెలఁతుక దాని కాతఁ డందె ముదమ్మున్.

ఇట్టి యోగి శుశ్రూషాఫలముచే నావేశ్య ముక్తి గాంచెను. మూలమునందు 12 శ్లోకములలోఁ గల యీకథ 33 పద్యములలో (ముక్తి-216-249) విస్తరింపఁబడినది.

## 4. సంగిరోపాఖ్యానము :—

సంగిరుఁడను నొక బ్రాహ్మణుఁడు పండితుఁ డయ్యుఁ గుతర్కము నవలంబించి వేదాంతశాస్త్రము నవహేళనము చేయుచు ననేక పాపముల నొనరించెను.

కం॥ అవశిష్టపాప మొక్కటి, లవలేశము లేక కేవలమ్మాతఁడు పా
శవవృత్తి మెలఁగుచున్ గా, నవశుం డయి మరణశయ్య లావటి యుండెన్.

(యజ్ఞవై-348)

అతఁడు మరణించిన పిమ్మట యమకింకరు లతనిని ఘోరనరకము లందుంచి యిట్లు బాధించిరి.

సీ॥ చెఱకుగానుగుఁ గాల్వేతులం దొడిగిరి, గ్రిట్టిన కోలలం ద్రిప్పి యార్చి
చిఱుగుంట లెల్లెడ మెఱసి నెత్తురు చిమ్మ, నొడల నాడించినా రులుఁ దెచ్చి
మొండిఱంపపుఁ గోఁత రెండుగా వ్రీలఁగా, నంగమెల్లను గోసి రాచి యాచి
కాలు నూనియు నగ్గి కణముల బొబ్బెక్కు, నందాఁకఁ బొరలించి రట్టె యిట్టె

తే॥గీ॥ చెప్పఁగాఁ జూడఁగా వట్టి చెట్టఁ గూర్చి, కోటివత్సరపర్యంత మాటుపాటు
లేని నరకార్ణవమ్మున వాని ముంచి, లేవ నెత్తిరి జము నాన చేత వారు.

(యజ్ఞవై-354)

సంగిరుఁ డిట్లు యమయాతనలు పొందుచుండఁగాఁ బూర్వపుణ్యవశమున శతానందుఁ డను మహర్షి యచటికి వచ్చి 'ఓంనమశ్శివాయ' యను షడక్షరమంత్రరాజము నతని కుపదేశించెను. సంగిరుఁడు నమశ్శివాయ మంత్రము నుచ్చరించినంతనే దేవతలందఱు నతనికిఁ బ్రత్యక్షమైరి. యమలోకము దేవలోకమైనది.

సీ॥ సురతరుశాఖాప్రసూనవర్షంబులు, గురిసె నెల్లెడల నబ్బురము గాఁగ
మునులు సిద్ధులు యక్షపుంగవుల్ గుమిగూడి, సల్పిరి నృత్యంబు చతురగతుల
నచ్చరల్ కింపురుషాగ్రేసరులఁ గూడి, గేయముల్ పాడి రమేయలయల
నంభోజసంభవుం డనుఁగుఁగొమ్మం గూడి, మేలి నాట్యంబులు లీలఁ జేసె

తే॥గీ॥ సకలసురసంఘములతోడ సౌరపతియు, వచ్చి యాడెను నుత్సవ మచ్చుపడఁగ
వేయునేత్రరమారమణీయపాణిఁ, బాణి గొని జాణమై చక్రపాణి యాడె (యజ్ఞవై-360)

అపుడు శతానందమహర్షిని గాంచి శివుఁడని యముఁడు భయపడి నమస్కరింపఁగా మహర్షి యిట్లుపదేశించెను.

సీ॥ విష్ణుదేవేంద్రాదివిబుధవర్గము కంటె, శివుఁడు మేలను వారి చెంతఁ బోకు
శివనామ మెచ్చు వైష్ణవపంకజోద్భవా, ద్యభిధల కను వారి నంటఁ బోకు
సర్వావభాసకసర్వమూలము శివుం, డను వారి నింతైనఁ జెనకఁ బోకు
యగ్నిరిత్యాదిమంత్రాన్వితంబుగ బూది, ధరియించు వారి డగ్గరఁగఁ బోకు

తే॥గీ॥ మెడఁద నుదుటను భుజముల నెనయ మూఁడు, బంతులను బూది నలఁదిన భవ్యజనుల
దూరమునఁ గాంచి యెడగల్గఁ దొలఁగి డాయఁ, బోకు మెయ్యెడ నిది మంచి బుద్ధి నీకు
(యజ్ఞవై-366)

సీ॥ లింగమందునఁ ద్రిశూలిన్ భవమోచకు, నర్చించు వారిపై నరుగఁ బోకు
మొప్పుగ రుద్రాక్ష లొకటైన మూఁడైన, నొకటైన నిడువారిఁ జేరఁ బోకు
శమదమంబుల నొంది శంకరభక్తులై, సన్న్యాసులౌ వారి సరసఁ బోకు
మమలవేదాంతవాక్యార్థశ్రవణమున, నాఢ్యులౌ వారి డాయంగఁ బోకు

తే॥గీ॥ యజ్ఞదానతపస్స్తవనాదివివిధ, సాధనంబుల ననిశంబు శంభుసేవ
సల్పి ధన్యుల సామీప్యపదవిఁ జనఁగఁ, బోకు మెయ్యెడ నిది మంచిబుద్ధి నిజము.
(యజ్ఞవై-367)

వ॥ మఱియు నిదియు గమనింపుము.

సీ॥ నిఖిలదివ్యుల కంటె నిజముగా శివుఁ డెక్కు, డన మాను వారి సేవలకుఁ గొట్టు
కేశవాదులతోడ నీశుండు సముఁ డని, పలుకువారిని గూడఁ బగులఁగొట్టు
తగు శ్రద్ధతోడ శ్రౌతస్మార్తసత్క్రియల్, నెరపకుండెడి వారి శిరసుఁ గొట్టు
పరగ శ్రుతిస్మృతీతరసిద్ధకార్యముల్, నేయు వారిని లెంప వాయఁగొట్టు

తే॥గీ॥ గురువులకు ద్రోహ మొనరించు పరమనీచు, లైన వారిని నీచేత నైనయంత
వఱకు గాసిల్లఁ గొట్టు వై వస్వతుండ!, మాన కిఁక దిని నీకిది మంచిబుద్ధి.
(యజ్ఞవై-371)

అని యుపదేశించి శతానందుఁడు కైలాసమున కేఁగెను. యముఁడు సంగిరునితో "మఱల నీవు బ్రాహ్మణకులమునఁ బుట్టి వేదములు చదివి కుతర్కములు విడిచి బ్రహ్మజ్ఞానమును బొందుము. నీకింక దుఃఖము లుండ" వని చెప్పి వెడలెను. మూలము నందు 50 శ్లోకములలో నున్న యీకథ 39 పద్యములలో (యజ్ఞ-344-382) యథామాతృకముగా ననువదింపఁబడినది.

## 5. దుర్ఘట చరిత్ర :—

యజ్ఞవైభవఖండమునందుఁ బ్రసాదవైభవమును వివరించు సందర్భములో కథనీ చెప్పఁబడినది. దుర్ఘటుఁ డను దుశ్శీలుఁ డొకఁడు లెక్కకు మిక్కిలిగాఁ బాతకములు గావించెను.

సీ॥ ఒక నూఱుమంది నూరక బాపలన్ బట్టి, కుత్తుకల్ కత్తితోఁ గోసినాఁడు
లేగడ్డిపోఁచల లీల నూఱావుల, లేఁగ లార్వఁగఁ దలల్ ద్రెంపినాఁడు
క్రొవ్వి దీనులతో విరోధించి వారి మం, దిరశతంబులు గాల్చి తీరినాఁడు
లోఁతునీ శ్యేపారు నూతులు నూటింటి, వేరంబు గొని పూడిపించినాఁడు

తే॥గీ॥ కంటఁబడ్డ సతీమణిఁ గాఁపరించి, బల్మిమై బిగి కౌఁగిళ్ళఁ బట్టినాఁడు
గురువరేణ్యుల ధనమైన నరకుగొనక, తస్కరింపంగ దీక్షలం దవిలినాఁడు.

(యజ్ఞ-390)

ఇన్ని పాపము లొనర్చినను బూర్వజన్మమున నొక శివవ్రతున కొక కాసును దానమిచ్చిన ఫలితముగా మరణసమయమునఁ బశ్చాత్తప్తుఁడైన యతని కొక బ్రాహ్మణుఁడు వ్యాఘ్రపురీమాహాత్మ్యమును బోధించెను. అబోధము ననుసరించి దుర్ఘటుఁడు శ్రీవ్యాఘ్రపురి కేఁగి శివుని గొల్చి యచట మూఁడేఁడులు నివసించుటతో నతని జీవిత మంతయు మాఱిపోయెను.

సీ॥ కల్లలే గాని పల్కంగ నేరని వాఁడు, సతమును సత్యవాక్చతురుఁ డయ్యె
దేవళంబులఁ జూచి యేవగించెడి వాఁడు, పరమేశభక్తి సంపన్నుఁ డయ్యె
మిన్ను మన్నున్ మ్రింగు మేటి రోసపువాఁడు, రమణీయశాంతాంతరంగుఁ డయ్యెఁ
గను గొన్న దానిపై మనసు నెఱపువాఁడు, నిష్కామసత్కర్మనిపుణుఁ డయ్యె

తే॥గీ॥ నవని నధమాధముండయి యలరు వాఁడు, సకలలోకాధిపతి యయి జరిగె జగతి
నెన్నొ నరకంబులం బడ నున్నవాఁడు, ముక్తుఁడై దుర్ఘటుండు సమ్మోద మందె.

(యజ్ఞ-408)

ఇట్లు దభ్రసభానాధుని కరుణచే దుర్ఘటుఁడు ముక్తి నొందెను. మూలమునందు 27 శ్లోకములలో నున్న యీకథ తెలుఁగున 15 గద్యపద్యములలొ యథామాతృకముగా ననువదింపఁబడినది.

## 6. సత్యసంధుని కథ :—

సత్యసంధుఁ డను నొక బ్రాహ్మణుఁడు సకలవిద్యలు నేర్చి విష్ణుసేవల నొనర్చెను.

సీ॥ అతఁడు ప్రతిష్ఠించు నచ్యుతాయతనముల్, పెక్కు వైకుంఠాల నిక్కు నడఁచు
నతఁ డభ్యసించు శ్రుత్యంగముల్ శ్రుతులు బ్ర, హ్మాదుల బలుమెప్పు అంది యొప్పు
నతఁ డొనర్చిన కేశవాంఘ్రిసపర్యల, విరులిగి గ్రాఁకుల విరులఁ గేరు
నతఁడు పూజించెడి హరిభక్తు లచ్యుత, స్వాములే మఱి పెఱవారు గారు
తేఁగీ॥ విష్ణుపుణ్యస్థలమ్ముల వెనుక నొక్క, పైన నాతండు దర్శింప నది గలగదు
ధన్యతమ విష్ణుదివ్యమంత్రముల నెల్ల, నతఁడు సద్భక్తి జపియింప నదియు లేదు.
(యజ్ఞ-413

ఆసత్యసంధు నకు విష్ణువు ప్రత్యక్షమై శివుని సేవింపు మని యుపదేశించెను. సత్య సంధుఁడును వైదికసూక్తుల యంతరార్థము గ్రహించి శంభునిబూజించి ముక్తుఁ డయ్యెను. ఇక్కడ సత్యసంధుఁడు విష్ణువును స్తుతించిన సంస్కృతభాషాపద్యము లన్నియు హృద్యశైలిలో నలరారుచున్నవి. మూలములో 59 శ్లోకములలో నున్న యీకథ 32 పద్యములలో రమణీయ ముగా నడచినది.

## 7. కులాలకాంత కథ :—

శిల్పకళారహస్యము లన్నియు నెఱిఁగిన యొక కుమ్మరి గలఁడు.

సీ॥ పూమొక్క కొకకుండ పూని యొనర్చెనా!, లేని మొక్కలె పూవు లూనినట్లు
కోర్కి మీఱఁగ నొక్క కూజాను జేసెనా!, నీరు లేకయె నారు నిల్పినట్లు
నిండు షేడుక నొక్క భాండంబు వానెనా!, బ్రహ్మాండ మందునఁ బరగినట్లు
దనుప లోకము నొక్క దాక నిర్మించెనా!, ముక్కు విందుగఁ బోపు పొగచినట్లు
తేఁగీ॥ ప్రకృతిసౌందర్యమును గ్రిందుపఱచునట్లు, కుంభకారుఁడు కుండలఁ గూర్చు లలిత
కళ లనంతములై యిందుకళలఁ గేరు, లెక్కకే మ్రొక్కు మని యొక్కసక్కి మాడి.
(యజ్ఞ-578)

ఇట్లు సౌందర్యకళోపాసన మొనరించు నాకులాలుఁడు సౌందర్యమున రతిని మించిన భార్యతో ననేకభోగము లనుభవించుచుండెను.

క॥ సతి కౌఁగిట సుఖియించుచు, రతి యిది కుమ్మరిది గాదురా యని యెదలో
రతి చక్కఁదనము దలఁచుచు, నతఁడు ముదం బందుచుండు నమ్మే యెడలన్.
(యజ్ఞ-581)

ఆకులాలదంపతులకు లోకోత్తరలావణ్యశ్లోకోత్తరయగు నొక పుత్త్రిక జనియించి యీడేఱినది.

క॥ అచ్చెలువ తలను ముడిచిన, ముచ్చట ముడి నెవఁడు చూచి మురియక యుండున్
లచ్చికిఁ గల చెల్వమ్ములు, పొచ్చెమ్మనవచ్చు దాని పొలుపుల పజ్జన్.(యజ్ఞ-585)
క॥ అచ్చరలేమలు ఖపికిన్, వచ్చి తదీయాంగసౌష్ఠవం బారసి ము
ద్దిచ్చి మది మెచ్చి కౌఁగిటఁ, గ్రుచ్చి కనుల్ దెఱచికొనుచుఁ గ్రుమ్మరుదు రిలన్.
(యజ్ఞ-589)

శా॥ గోపీచెంగులు జాలువార వెనుకన్ గుచ్చెళ్లు మీఁగాళ్లపైఁ
బ్రాచుర్యంబునఁ జిందులాడ నునుజాల్వారైక తళ్కొత్తఁగా

పోచల్‌దాల్ మునుజేతి కందమిడ నాపూబోణి చెయ్యెత్తఁగా
వీచుల్ వీచులు గాఁగఁ బార్శ్వపుచు నువ్విళ్లూరఁజేయున్ విటున్.

ఉ॥ బంగరు ముద్దుటుంగరము ప్రన్నని వ్రేలి నలంకరింపుచుం
డం గరపల్లవంబు పయఁటన్ సవరించెడి పట్ల కుంభకా
రాంగన నంగజారి కనులారఁగ నారసె నేని చీరకొం
గుం గయికొంచు వెంటఁబడుఁ గోమలి దాసజనాగ్రగణ్యుఁడై. (యజ్ఞ-595)

ఆ కుంభకారకురంగనయన యొక విప్రనందనుని వలచి నిరాకరింపఁబడి మూఁడువేల మంది బ్రాహ్మణులను జంపింతు నని శపథము చేసి ముష్కరులచే నట్లు చేయించుచు నొక పర్వతకందరంబుపైఁ దపం బొనర్చుచున్న బ్రహ్మజ్ఞానిని జంపుటకై చంద్రహాస మెత్తినది. బాహువులు స్తంభించినవి. అంత నామె విప్రమాహాత్మ్యము నెఱింగి రక్షింపు మని యతని కెఱఁగినంతనే యతఁడు కరుణించెను. ఆకులాలకాంత యాయోగివర్యుని దనయింట నుంచి సేవ లొనరించినది.

సీ॥ నీపాదరజములో నాపాపములు వాయఁ, గాళ్ళు గడ్గెదను వే నీళ్ళు దెచ్చి
మజ్జన మ్మని నన్ను మన్నింపఁగా నీవు, గొజ్జంగితోఁ దీర్తు మజ్జనమ్ము
సేవకీతిలకమం చీవు గారవమీయఁ, దిలకంబు నుదుటను దిద్దుదాన
దరిలేని నామనస్తాపంబు చల్లారఁ, జందనచర్చ లొసంగు దివ్వు.
తే॥గీ॥ డతులవాసన లెల్ల నన్నాదరింపఁ, బూలదండల నీమెడన్ వ్రేల నిడుదు
ననుచు నాత్మార్పణము చేసి యనుదినమ్ము, కుటిలకుంతల సేవించు గురువరేణ్యు.
(యజ్ఞ-621)

ఈగురుశుశ్రూషణమహిమచే నామె జ్ఞానము నొంది తల్లిదండ్రులతో బంధువులతోఁ గైలాసలోకము వడసినది. మూలమునందు 9 శ్లోకములలోనున్న యీచిన్నకథను మహాదేవ కవి ప్రతిభతో 56 పద్యముల యుపాఖ్యానముగాఁ దీర్చిదిద్దెను. వీరి కవితావైశారద్యమున కిది దర్పణము. కుమ్మరి దంపతుల కళానైపుణ్యము, కులాలకుమారి లావణ్యము, విప్రనందనునితో శపథము, బ్రహ్మజ్ఞానిని జంపుటకై చంద్రహాస మెత్తినపుడు బాహుస్తంభనము గురుశుశ్రూష మొదలగునవి యన్నియు రమణీయముగాఁ బెంపఁబడినవి. కులాలసుందరి సౌందర్యమును వర్ణించు 14 పద్యములు కమనీయశైలితో సాఁగినవి.

### 8. గౌతమమహర్షి చరిత్ర :—

ఈయుపాఖ్యానము తిక్కన పురాణములందుఁ గూడఁ బ్రసిద్ధమైనది. పూర్వ మొకప్పుడు ద్వాదశవర్షక్షామము సంభవించినది.

క॥ అన్నపుమెతు కొకటైనన్, గన్నులకున్ గానరాక కరమును బ్రాణా
పన్నంబయి లోకము వే, గె న్నిరతము మంగలమున గింజలువోలెన్. (యజ్ఞ-634)

సీ॥ సలిలంబు లింకఁగా జలచరమ్ముల కొక, సంఘమారణములు సంభవించె
కసవుగింజలు లేని కతమున నవి దిను, జంతుజాలము లెల్ల సమసిపోయెఁ
దిన మాంస మలవడమిని పలలాహార, జీవసంతతులు నశించిపోయెఁ
గాల్వ నెవ్వరు లేక గృహదేవళ్ళను, రాళ్ళు రప్పలును బిల్లేళ్ళునయ్యె.

తే॥గీ॥ భూము లెల్లను బీడులై బుగ్గి యయ్యె మడుగు లెల్లను దెగ కాలిమంట లయ్యె
గొప్ప నదు లింకఁబాటి బల్ తిప్ప లయ్యెఁ, జెప్పఁగా నెవ్వఁ డోప్పు మా తిప్పలెల్ల
(యజ్ఞ-653)

అట్టి క్షామకములో జనులు తినుటకుఁ దిండి కట్టుటకు గుడ్డ లేక మలమల మాడి గౌత మాశ్రమము చేరి యజ్ఞపాదమహర్షిని గాంచి దీనాననులై యిట్లు మొఱపెట్టిరి

సీ॥ అస్థిపంజరముకా కరయ నేమున్నది, పూర్వ మీతఁడు దొడ్డ బొజ్జ నొప్పు
నూచకాళ్ళను జేతు లూచ శక్తియు లేదు, తొలుత జవాకెట్టి దొరయ యితఁడు
హీనస్వరముతోడ దీనుఁడై పలుకును, మొదట సింహార్భటిన్ బొదలు నితఁడు
కనులు లోఁతుకఁ బోయి కన బూచివలెఁ దోఁచుఁ, దొగరేకుకనుల మున్ దగు నితండు

తే॥గీ॥ చిన్న చిరుగుల బొంత నీయన్నమిన్న, మొలను గట్టుక లజ్జమైఁ దలను వంచి
యచ్చటం గూరుచున్నది చచ్చి సగము, రాతిగుండెయుఁ గరఁగు నన్నాతిఁ జూడ.
(యజ్ఞ-647)

వారి విలాపములు విని గౌతముఁడు కరుణించి వారి నాదరించెను.

మ॥ ధనధాన్యంబులు వస్త్రముల్ తిలలునున్ దైలంబులున్ గంధమున్
ఘనసారమ్ములఁ దమ్ములమ్ములును మేల్కస్తూరి మున్నైనన వా
నిని నెవ్వండెది గోరు దానిని రవంతేన్ లోటు లేకుండ న
ట్లు నిరాబారి యొసంగె వానికిఁక నీతున్ గల్గనే యెయ్యెడన్.

సీ. వ్యాధిచేఁ గృశియించు వారి నారసి భిష, గ్వరులను బిల్పించి మాన్పె వ్యాధి
సంస్కారహీనులౌ జనములఁ గనుగొని, యలఘుసంస్కారవంతుల నొనర్చె
చిఱ పాపలకుఁ బాలు వరియించి వారింటి, ముంగిట ధేనువుల్ పూని నిల్పె
శయ్య సౌఖ్యము కోరు సరసాత్ములకుఁ బట్టు, దిండ్లతోఁ బఱుపులన్ దెలిసి యిచ్చె

తే॥గీ॥ భక్ష్యభోజ్యమ్ము లెన్నేని పంచిపెట్టె, నృత్యగానాదిముదములన్ నియతిఁ గూర్చె
గౌతముని వంటి దాత యెక్కాల మందుఁ గలుగఁడని చెప్పవచ్చు లోకమ్ములందు.
(యజ్ఞ-662)

ఇట్లతిథిసత్కారము లొనరుచు గౌతముఁ డచ్చటి జనులకు శ్రుతిశాస్త్రరహస్యములను బోధించుచుండఁగా నొక యావు వచ్చి చేను మేయుచుండెను. అదిగని గౌతముఁ డాయావును జీఁవురుపుల్లతో నదలింపఁగా నాగోవు వెంటనే మరణించెను. అదిగని జనులు గౌతముఁడు గోహంత యని పాపి యని నిందించిరి.

క॥ గ్రక్కున నది మరణించిన, ముక్కున వ్రేలుంచుకొనుచు బుధపరిషత్తా
చక్కఁ గని నీవు పాపుఁడ, వుక్కివుఁడ వనంచుఁ బల్కె నుత్కంఠములన్.(యజ్ఞ-666)

అది విని గౌతముఁడు కోపారుణనయనచణుండై వారి నిట్లు శపించెను.

సీ॥ శివపూజ లొనరింపఁ జేతు లాడకయుండు, శివకథల్ వీనులు చెలఁగి వినవు
శివమూర్తి ధ్యానింపఁ జిత్త మొప్పదు శివ, గాథలు వల్కఁ నాల్కఁ రుచి గనదు
శివమందిరమును దర్శింపఁ గాళ్ళేఁగవు, శివరూపుఁ జూడఁ గన్గవకు బోఁత
శివభక్తుఁ బూజింప నవు ననిష్టము శివ, తీర్థమ్ములకుఁ బోవ దీర దెపుడు.

తే॥గీ॥ శివుని నామంబు జపియింప జిహ్వ చేఁదు, శివుని మాహాత్మ్యములు పల్కఁ జెట్ట గ్రమ్మ
శివుని కర్పించి దానము చేయకుండ్రు, శివుని సందర్భములను నింపవు ముదమ్ము.
(యజ్ఞ-675)

ఆ.వె. బౌద్ధమతము మఱియు బార్హస్పతంబును, బిట్టు మిమ్ముఁ బట్టి విడువకుండు
శాంభవంబు వామశాక్తేయమతమును, స్వకృతదురితఫల మొసంగుఁగాత.
(యజ్ఞ-687)

మూలమునందు 47 శ్లోకములలో నున్న యీకథ 37 గద్యపద్యములుగా విస్తరించినది ఈగోహత్యాపాతకమును బాయుటకే గౌతమమహర్షి గోదావరిని దీసికొని వచ్చెనని తక్కిన పురాణము లభివర్ణించినవి.

## 9. బ్రాహ్మణాధముని కథ :-

ఈకథ హాలాస్యమాహాత్మ్యమును వివరించుటకై చెప్పఁబడినది. ఒక బ్రాహ్మణాధముఁడు గలఁడు.

సీ॥ పెదవి మెదపినట్టి యదనులె వినరాని, బూతులకును బెద్ద బుంగ యగును
కారణమ్మును లేక కన్నులు సన్నుచును, పైఁబడి కోడిగ్రాఁచై బరి తెగు
జూద మాడుట సురఁ జొక్కి త్రావుట రెండు, క్రీడలుగాఁగ లెక్కించు నతఁడు
తనచేతలకు జనుల్ దన్ను నిందింపఁగా, విఱ్ఱవీఁగుచు వారి వెక్కిరించుఁ

తే॥గీ॥ పిన్నపెద్దలు తల్లియున్ బిడ్డ లేదు, మంచిచెడ్డలు దోఁప వాకించుకైన
వాని సరివచ్చువాఁ డెందు నైన లేఁడు, వానిఁ గన్నమ్మ యెట్టి పాప మ్మొనర్చె
(యజ్ఞ-766)

సీ॥ వేదపాఠం బేల వెఱ్ఱి యెత్తెనె? మీకు, నాదు పల్కే యగు వేద మెపుడు
స్మృతుల దలంపేల మతి పోయెనే మీకుఁ, గామినీస్మృతికన్నఁ గలవె స్మృతులు?
నఖిలపురాణేతిహాసముల్ పరిహాస, పాత్రమానంబులీ వగిది నెఱుఁగుఁ
డామ్నాయశీర్షంబు లమ్మమ్మ తాతల, రుచి లేని సరసాలు రూఢిఁ గనుఁడు

తే॥గీ॥ చెలఁగి భోగింప నేరక చేతకాని, చవట లగుదురు ఋషిముని ప్రవరు లిలను
వారు నాబారిఁ బడ్డవహో! దగియెదు, బుద్ధిఁ జెప్పెదు వాఁడ నిబద్ధిగాను (యజ్ఞ 767)

ఇట్లా బ్రాహ్మణాధముఁ డనేకపాపకృత్యము లొనర్చుచుండఁ గొంతకాలమున కాతని పాపఫలితముగా నొక బ్రహ్మరాక్షసుఁడు రోఁకలి పుచ్చుకొని యతనిని వెంటాడెను. బ్రహ్మరాక్షసభీతిచే నతఁడు పరుగిడుచు హాలాస్యక్షేత్రము చొచ్చినంతనే బ్రహ్మరాక్షసుఁడు వీడెను అంత నాబ్రాహ్మణుఁడు పుణ్యబుద్ధితో హాలాస్యనాథుని సేవించి షడక్షరజపము చేసి ముక్తి నొందెను. మూలమునందు 10 శ్లోకములలోఁ గల యీకథ 10 పద్యములలో ననువదింపఁబడినది.

ఇట్లు మూలము నందలి యుపాఖ్యానము లన్నియు నీయాంధ్రానువాదములో సహస్రదళపద్మములవలె వికసించినవి.

## వే ద శా స్త్ర ప రి ఘ ట్ట ము లు

సూతసంహిత కథాప్రధానమైన పురాణము గాదనియుఁ గేవలశాస్త్రపురాణ మనియు ముందే తెలిపితిని. ఇందు వేదమంత్రములు, ఉపనిషద్వాక్యములు, ధర్మశాస్త్రరహస్యములు దార్శనిక సిద్ధాంతములు, అద్వైతవేదాంతము, శివపారమ్యము మిక్కుటముగా నిరూపింపఁ బడినవి. దీనికిఁ దోడు వ్యాఖ్యాత యగు మాధవమంత్రి తాత్పర్యదీపికలో మంత్రశాస్త్ర రహస్యములను, దార్శనికసిద్ధాంతములను మిక్కిలి విస్తరించెను. వీని నన్నిటిని దెలుఁగునకుఁ దెచ్చుటకు గ్రంథకర్తకుఁ గవితాశక్తితోఁ బాటు సర్వశాస్త్రములందు నుద్దండపాండిత్య ముండవలయును. శాస్త్రవిషయములను సంగ్రహించుట మూలగ్రంథకర్త కన్యాయము చేయుటయే గాక పాఠకులను గూడ వంచించుట యగును. మహాదేవకవి యీశాస్త్రవిషయములను మాతృకకు వివరణరూపముగా సులభసుందరశైలిలో నెట్లనువదించిరో యించుక పరికింతము.

### వేదమంత్రములు :-

ఓం నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః।
నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యా ముత తే నమః॥
యా తే రుద్ర శివా తనూ రఘోరాఽ పాపకాశినీ। ......

నమస్తే అస్తు భగవన్ విశ్వేశ్వరాయ మహాదేవాయ త్ర్యమ్బకాయ త్రిపురాన్తకాయ త్రికాలాగ్నికాలాయ కాలాగ్నిరుద్రాయ నీలకణ్ఠాయ మృత్యుఞ్జయాయ సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీమన్మహాదేవాయ నమః॥

వేదవ్యాసమహర్షి యీ నమకమంత్రములను యథాతథముగాఁ గైకొని యీశ్లోకములను రచించెను.

శ్లో॥ నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః।
నమస్తే అస్తు ధన్వనే కిరాభ్యాం తే నమోనమః॥
యా తే రుద్ర శివా తనూః శాన్తా తస్యై నమోనమః।
నమోఽస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ తే నమః॥ (ముక్తి-9-58)

వీనివి మహాదేవకవి యిట్లనువదించెను.

కం॥ భీమాఖిలాఘసంఘము, లే మన్యువుచే నశించు నెంతయుఁ దృటిలో
నామన్యువునకు నంజలి, మేము సమర్పింతు మయ్య! మృడ! దేవేశా!

కం॥ ఏ కలకుఠమ్ము తాఁకునఁ, జీకాకున్ బొంది సౌమ్మసిలు నరిలోకం
బాకలకుఠమ్ము నీయది, మాకు నమస్కార్యమగు నుమాధవ! యెపుడున్.

కం॥ నీలగ్రీవునకున్ వే, వేలం గన్నులును జెలఁగు వేల్పునకున్ వే
వేలం గేలం బొలిచెడి, వేలుపుమిన్నకును నతులివే యర్పణమా. (ముక్తి-331)

### ఉపనిషన్మంత్రములు :-

హరిః ఓమ్। శం నో మిత్రః శం వరుణః। శం నో భవ త్వర్యమా।
శం న ఇన్ద్రో బృహస్పతిః। శం నో విష్ణు రురుక్రమః। నమో బ్రహ్మణే।

నమ స్తే వాయో। త్వమేవ ప్రత్యక్షమ్ బ్రహ్మాసి। త్వా మేవ ప్రత్యక్షమ్ బ్రహ్మ వదిష్యామి। ఋతం వదిష్యామి। సత్యం వదిష్యామి। త న్మా మవతు। త ద్వక్తార మవతు। అవతు మామ్। అవతు వక్తారమ్। ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥

తైత్తిరీయోపనిష త్తీమంత్రములతో నారంభమైనది. ఈమంత్రములను వేదవ్యాస మహర్షి యిట్లనువదించెను.

శ్లో॥ శం నో మిత్రః శం వరుణః శం నో భవతు చార్యమా।
శం న ఇన్ద్రశ్చ వాగీశః శం నో విష్ణు రురుక్రమః॥
నమోఽస్తు బ్రహ్మణే వాయో! నమోఽస్తు తవ శోభనమ్।

త్వమేవ సాక్షాద్బ్రహ్మాసి త్వాం వదిష్యామి శఙ్కరమ్॥
ఋతం చ సత్యం చాహం త్వాం వదిష్యామి విశేషతః।
తన్మావతు కల్యాణం తద్వక్తారం చ శోభనమ్॥
మామ్ భూయోఽవతు వక్తార మపి చావతు శోభనమ్।

శాన్తిః శాన్తిః పునః శాన్తి ర్దోషత్రయనివృత్తయే॥
(యజ్ఞవై-16—3....7)

శ్రీ బెల్లంకొండ రామారాయకవి యిట్లుపశ్లోకించెను.

శ్లో॥ శం నో మిత్ర ఉదన్వతా మధిపతి శ్శం శం న ఏషోఽర్యమా
శం నో జిష్ణు రసౌ బృహస్పతి రజో విష్ణు ర్భవత్వేష శమ్।
వన్దే బ్రహ్మ నమోఽస్తు మారుత! తవ త్వం బ్రహ్మ సాక్షా దసి
త్వం సత్యం చ ఋతమ్ ప్రపాలయ గురుం వక్తార మేనం చ మామ్॥
(వేదాంతముక్తావళి : పూ. భా — 131)

మహాదేవకవి యిట్లాంధ్రీకరించిరి.

సీ॥ ఇడుత సౌఖ్యము మిత్రుఁ డిడుత సౌఖ్యము వరు
ణుఁడు నర్యముఁడు సుఖం బిడుత నెపుడు
నిడుత సౌఖ్య మ్మింద్రుఁ డిడుత సౌఖ్యము బృహ
స్పతి యుఁడుక్రమవిష్ణుఁ డతిముదమున
నిడుత సౌఖ్యము మ్రొక్కు లిడెద బ్రహ్మాత్మవా
యూ! నీవు ప్రత్యక్షమైన బ్రహ్మ
మంచు సత్యము ఋతం బంచు వచించెద
నట్టి నన్నీవు చేపట్టి యోము

తే॥గీ॥ మోమఁ గోరెద నుపదేష్టృపుంగవులను, నా గురుస్వామి! నన్నోము మోగు లెల్ల
నన్నగిల్లను గావుత నన్నగిల్లు, నన్నగిల్లుత నని పల్కు జ్ఞాన మొదవు
(యజ్ఞ-304)

శ్లో॥ అథవా ఽహం హరిః సాక్షాత్ సర్వజ్ఞః పురుషోత్తమ।

సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్॥
విశ్వో నారాయణో దేవః అక్షరః పరమః ప్రభుః।
ఇతి ధ్యాత్వా పునః స్వస్య హృదయామ్భోజమధ్యమే॥
నిర్వాతదీపవత్ తస్మిన్ దీపితం హవ్యవాహనమ్
నీలతోయదమధ్యస్థం విద్యుల్లేఖేవ భాస్వరమ్॥
నీవారశూకవద్రూపమ్ పీతాభాసం విచిన్తయేత్।
తస్య వహ్నేః శిఖాయాం తు మధ్యే పరమకారణమ్॥
పరమాత్మాన మానన్దమ్ పరమాకాశ మీశ్వరమ్।
ఋతం సత్యమ్ పరమ్ బ్రహ్మ సామ్బం సంసారభేషజమ్॥
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపమ్ మహేశ్వరమ్।
నీలగ్రీవం స్వమాత్మానమ్ పశ్యన్తమ్ పాపనాశనమ్॥
బ్రహ్మవిష్ణుమహేశానై ర్ధ్యేయం ధ్యేయవివర్జితమ్।
సోఽహ మిత్యాదరేణైవ ధ్యాయే ద్యోగీ మహేశ్వరమ్॥
(జ్ఞాన—19—12...21)

ఈ మూలశ్లోకములకు —

సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ ।
సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశమ్భువమ్।
విశ్వం నారాయణం దేవ మక్షరమ్ పరమమ్ పదమ్।
పద్మకోశప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్।
తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః।
నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా।
నీవారశూకవత్తన్వీ పీతాభస్వ త్యణూపమా।
తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః।
సబ్రహ్మ సశివః సహరిః సేన్ద్రః సోఽక్షరః పరమః స్వరాట్,
ఋతగ్ం సత్యమ్ పరమ్ బ్రహ్మ పురుషం కృష్ణపిఙ్గళమ్।
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమోనమః॥
అను నారాయణసూక్తము మూలము. దీనిని మహాదేవకవి యిట్లనువదించెను.

సీ॥ వేతలర్ వేకాళ్ళ వేయికన్నుల నొప్పి, సర్వలోకాధారచణత వెలసి
వేమొగంబుల వేరి వేమంటలోఁ బోరి, యగ్గిఁ బోలిన తేజ నంది మెఱసి
నల్లని మబ్బుపై నాణెంపు మెఱుఁగుఁదీ, వియ తళుక్కుమొత్తంపు పెంపు దనరి
గాలిచేఁ గదలికఁ గననిదీపము వోలి, నిశ్చలంబై న కాంతిని దలిర్చి

తే॥గీ॥ నిశితనీవారశూకసన్నిభము నగుచు, సన్నముగ వెల్గ కణికలో శంభు విష్ణు
బద్మజధ్యేయుఁ బరమాత్మ భక్తిఁ గొల్చి, సోఽహ మని ధ్యానముంజేయు చొ
ప్పొకండు. (జ్ఞాన-289)

శ్లో॥ అథవా సత్య మీశానం జ్ఞాన మానన్ద మద్వయమ్।
అనన్త మమలం నిత్య మాదిమధ్యాన్తవర్జితమ్॥
తథా స్థూల మనాకాశ మసంస్పృశ్య మచక్షుషమ్:
నరసం నగన్ధాఖ్య మప్రమేయ మనూపమమ్॥
సర్వాధారం జగద్రూప మమూర్తమ్ మూర్త మవ్యయమ్:
అదృశ్యం దృశ్య మన్తస్థమ్ బంహిష్ఠం సర్వతోముఖమ్॥
సర్వతః పాణిపాదం చ సర్వకారణకారణమ్।
సర్వజ్ఞత్వాదిసంయుక్తం సోఽహ మిత్యేవ చిన్తయేత్॥

(జ్ఞాన — 10 — 24 ... 27)

ఈ శ్లోకములకు

ఏతద్వై తదక్షరం గార్గి! బ్రాహ్మణా అభివద న్త్యస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘ మలోహిత మస్నేహ మచ్ఛాయ మత మోఽ వా య్వ నాకాశమసఙ్గ మస్పర్శ మగన్ధ మరస మచక్షుష్క మశ్రోత్రమ్॥"

అను బృహదారణ్యకశ్రుతి మూలము. మహాదేవకవి మూలశ్లోకముల కీ శ్రుతిని జోడించి యిట్లనువదించెను.

సీ॥ అవ్యయుం డాదిమధ్యాంతశూన్యుఁ డనంతుఁ, డనలుఁ డద్వయుఁడు ననఘుఁడు పుణ్యుఁ
డహ్రస్వుఁ డస్థూలుఁ డస్పృశ్యుఁ డద్రేశ్యుఁ, డంశుఁ డగంధుండు నప్రమేయుఁ
డనుపముఁ డక్రియుఁ డజ్ఞాతరూపుండు, సర్వతోముఖుఁడును సర్వగుండు
సర్వజ్ఞుఁడును సర్వసాక్షియ సచ్చిదా, నందస్వరూపుఁ డానందమయుఁడు

తే॥గీ॥ కారణంబుల కెల్లను గారణంబు, నద్భుతుం డార్తిహరుఁ డగు హరు హిమాద్రి
జామనోహరు నెద నిల్పి సంతతమ్ము, సోఽహ మని ధ్యానముం జేయు చో ప్పొకండు

(జ్ఞాన—290)

శ్లో॥ భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః।
క్షీయన్తే చాస్య కర్మాణి దృష్టే హ్యాత్మని సువ్రత॥
యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ।
జ్ఞాత్వాత్మానమ్ పరానన్దం న బిభేతి కుతశ్చన॥ (యజ్ఞవై-10—40;41)

ఈయుపనిషచ్ఛ్లోకము లెంత సుందరముగా ననువదింపఁబడినవో చూడుఁడు—

కం॥ భేదిల్లున్ హృద్గ్రంధియు, ఛేదిల్లున్ సంశయము లశేషక్రియలన్
వేదొలఁగు నాత్మదర్శన, మేదురభాగ్యం బొకింత పేకొనె నేనిన్.

కం॥ డెందంబును బలుకులు నే, చందంబున నేనిఁ జేరఁ జాలవొ యా యా
నందస్వరూపుఁ గాంచిన, నెందున్ భయ మొందఁ డెవ్వఁ డింత నిజంబొ

(యజ్ఞ-151; 152)

### గాయత్రీ మంత్రవివరణము :—

'గాయన్తం త్రాయత ఇతి గాయత్రీ' గానము చేయు వానిని సర్వదా రక్షించునది గాన నావరాదేవతకు గాయత్రి యని పేరు. గాయత్రీమంత్రము నాల్గు వేదములకు సారభూత మైనది.

కం॥ ఒక పాదము ఋగ్వేదం, బొక పాదము నగు యజుస్సు నొక పాదమ్మై
యకలంకసామ మొప్పును, బ్రకటము గాయత్రికిన్ ద్రిపద యను పేరున్.

తే॥గీ॥ అతిశయించు నాధర్వణశ్రుతియ చేష్ట, శబ్దశాస్త్రంబు కల్పశిక్షానిరుక్త
ములును జ్యోతిషమును నంగములును బంచ, శీర్షములు గాఁగ నతులితశ్రీ రహించు
(యజ్ఞ-76;77)

అందువల్లనే గీతాచార్యుఁడు 'గాయత్రీ ఛన్దసా మహమ్' (భ. గీ. 10—35) అని వక్కాణించి యున్నాఁడు. ఇందలి యజ్ఞవైభవఖండములో నాలవ యధ్యాయములో 32 గద్యపద్యములలో గాయత్రీమంత్రము విస్తరముగా వివరింపఁబడినది.

## శాస్త్రఘట్టములు

### ధర్మశాస్త్రము :—

సూతసంహిత యొక ధర్మశాస్త్రమని చెప్పవచ్చును. ఇందలి జ్ఞానయోగ ఖండములో బ్రహ్మచర్య-గృహస్థ-వానప్రస్థ—సన్యాసాశ్రమవిధులు; యజ్ఞవైభవఖండములో ధర్మములు, ప్రాయశ్చిత్తము, పాపశుద్ధి, ద్రవ్యశుద్ధి, యభక్ష్యనివృత్తి, యవశిష్టపాపస్వరూపము, మొద లగు ధర్మశాస్త్రవిషయము లన్నియు విస్తరముగా వివేచింపఁబడినవి.

### యోగశాస్త్రము :—

"ఆత్మా వాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" ఆత్మమును జూడ వలయును, వినవలయును, మనన మొనర్పవలయును, నిదిధ్యాసనము చేయవలయు నని బృహదారణ్యకశ్రుతిలో యోగియాజ్ఞవల్క్యు లుపదేశించుచున్నారు. ఇక్కడ వేదాంతశాస్త్రము శ్రవణోపయోగి యని, తర్కశాస్త్రము మననోపయోగి యని, యోగశాస్త్రము నిధిధ్యాసనోప యోగి యని గ్రహింపవలయును.

సూ : యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధయో ఽష్టా వంగాని (యో ద 2-29) (1) యమము (2) నియమము (3) ఆసనము (4) ప్రాణా యామము (5) ప్రత్యాహారము (6) ధారణ (7) ధ్యానము (8) సమాధి యనునవి యోగమున కెనిమిది యంగము లని పాతంజలయోగసూత్రము. ఇందలి జ్ఞానయోగ ఖండ ములో 13-20 అధ్యాయములలో నీయష్టాంగయోగము విపులముగా వివరింపఁబడినది. 11 వ యధ్యాయ మగు నాడీచక్ర నిరూపణములో 'ఇడ' 'పింగళ' 'సుషుమ్న' యను నాడులు వివ రింపఁబడి 12వ యధ్యాయములో నాడీశుద్ధి నిరూపింపఁబడినది. యజ్ఞవైభవఖండము నందలి 28 వ యధ్యాయములో శివలింగస్వరూపకథనమునందు (1) మూలాధారము (2) మణి

పూరము (3) అనాహతము (4) ఆజ్ఞ (5) ద్వాదశారము (6) షోడశారము నను చక్రములు వివరింపఁబడినవి.

సూ :- క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః। తస్య వాచకః ప్రణవః। (యో. ద. 1-28; 31) అవిద్యాదిక్లేశములు, పుణ్యపాపకర్మములు, తత్ఫలితములగు జాతివిభోగాదివిపాకములు, వానిని వెంబడించు నాశయములు (వాసనాప్రపంచము) వీనిచే మూఁడు కాలములందు స్పృశింపఁబడని పురుషవిశేషుఁ డీశ్వరుఁడు. ప్రణవము (ఓంకారము) భగవద్వాచక మని యోగదర్శనము.

"ఓ మిత్యేదక్షరగ్ం సర్వం తస్యోపవ్యాఖ్యానమ్। భూతమ్ భవ ద్భవిష్య దితి సర్వ మోంకార ఏవ। యచ్చాన్యత్ త్రికాలాతీతం తదప్యోంకార ఏవ।' అని మాండూక్యోపనిషత్తు కూడఁ బ్రధానముగా నోంకారమునే యుపదేశించుచున్నది. ఇందుఁ గూడ —

వ॥ "అస్థానమునఁ బ్రకృతివాచకమైన 'సః' అను నక్షరమును బురుష వాచకమైన 'హం' అను నక్షరమును గల హంసమంత్రమును "సోఽహ" మనుటకు బదులు సకారహకార లోపమున 'ఓమ్' అను నేకాక్షర ముద్భూత మైనది" (యజ్ఞ-33). అనఁగా "హంసః" అను దానిని దిరుగవేసినచో 'సోఽహమ్' అని యేర్పడును ఇందలి హల్లులను దొలఁగించినచో "ఓ + అమ్" అని యేర్పడి సంధిచే 'ఓమ్' అగుచున్నది యని చెప్పి

క॥ సర్వావభాసకుం డగు, శర్వుం డోంకారమం దెసంగుచు నిలుచున్
సర్వేశ్వరునకు నయ్యె ద, ఖర్వోజ్జ్వలవిమలవాచకమ్మయి వెలయున్ (యజ్ఞ-56)
అనియజ్ఞవైభవఖండములో 5వ యధ్యాయమునందుఁ బ్రణవము విచారింపఁబడి మఱల 28వ యధ్యాయములో షట్చక్రనిరూపణమునందు —

వ॥ తద్ధ్యానమున నోంకారమునఁ బ్రథమమాత్రయగు నకారమహామంత్రమును స్మరింపవలయును. జాగ్రదవస్థాసాక్షి యయి వైశ్వానరాభిఖ్యుండగు పురుషుం డకారముగా భావింపవలెను. మఱియుఁ గాంతిని గోటిసూర్యోపమంబయ్యుఁ దైక్ష్ణ్యరహితం బగుట కోమలంబయి కర్మఫలప్రాప్తిస్థానము కానందున నపదంబయ్యు సర్వకర్మఫలోపభోగస్థానంబైన లింగశరీరము నుపాధిగాఁ గొనుట పదాఖ్య వెలసి స్థూలశరీరరహితంబగుట నబాణంబయ్యు స్థూలశరీరోపాధిసహితం బగుట బాణనామూర్ధ్వంబయి వెలసిల్లు. సంసారనాశకంబగుట నూర్ధ్వముఖంబయి వెలసిల్లు విష్ణుస్వరూపం బనాహతచక్రమునందు నోంకారమునకు ద్వితీయమాత్రయగు నుకారాఖ్యమహామంత్రముచే ధ్యానింపవలెను. వాస్తవముగ నరూపమయ్యు నాత్మభక్తజనానుగ్రహనిమిత్తంబునఁ బార్వతీసహితంబయి శతలక్షసితభానుసదృశంబయి విశ్వంబయ్యు విశ్వజ్ఞానసాధనంబయి వెలయు రుద్రరూపమును నాజ్ఞాచక్రమందు నోంకారతృతీయమాత్ర యగు 'మ' కార మహామంత్రమునఁ గొలుచునది. పూర్వోక్తాకారోకారమకారమంత్రత్రయంబు గురూపదేశంబునఁ గాని యభ్యసింపరాదు. (యజ్ఞ-495)

అని యోంకారోపాసన ముపదేశింపఁబడినది. ఇక్కడ 'మా మోహ మా పద్యథాహమే వైతత్ పంచధాత్మానమ్ ప్రవిభ జ్యైతద్బాణ మవష్టభ్య విధారయామీతి' (ప్ర. ఉ. 2-3)

అను ప్రశ్నోపనిషత్ప్రయోగము ననుసరించి ప్రాణ మనఁగా స్థూలశరీర మని గ్రహింపవల యును. 'ప్రాణం శరీరం కార్యకారణసంఘాతమ్' అని భగవత్పాదభాష్యము. "ప్రాణమితి-ప్రాతీతి బలవయో రభేదా ద్వాతి కుత్సితం గంధం వహతీతి వా వినాశం గచ్ఛతీతి వా దేశా ద్దేశాంతరం గచ్ఛతీతి వా ప్రాణమ్. ప్రాణ మివ ప్రాణం కార్యకరణసంఘాతం శరీర మిత్యర్థః' అని యానందగిరివ్యాఖ్య, వీని ననుసరించి 'ప్రాణమితి స్థూలశరీరమ్' అని తాత్పర్యదీపిక. ఇట్టి యోగరహస్యము లిందుఁ బెక్కుగలవు. ఈయోగశాస్త్రవిషయములనుగూడ వీరెంత సొగసుగాఁ దెనిఁగించిరో గమనింపుఁడు.

కం॥ మూలాధారోదితయై ప్రేలి షడబ్జములు శీర్ష వీథీగమన
శ్రీలబ్ధమధురసుధలన్, గ్రోలు అలన నేలు వానిఁ గొలుతున్ మదిలోన్. (జ్ఞాన-29)

సీ॥ సరగున స్వస్తికాసనమునన్ గూర్చుండి, ముకుపుటంబుల గాలి మురిని గ్రోలి
తల మొద లలుకాలు దనుకఁ బూరించి య, వ్వల హజ్జహోయిపై నిలిపి యవల
నల్ల మూలాధార మందున నాఁగి య, వ్వలి నాభికందహృత్పద్మములను
వ్యాపింపఁజేసి యవ్వలిఁ గంఠతాలుసీ, మలఁ జొన్పి యవల భ్రూమధ్యనిటల

తే॥గీ॥ దేశములకును గొనివచ్చి తిపిరి శిరము, నందు హత్తించి మొదలిటి యక్కరము ను
కారమును బిందువుం గూర్చి కడ నమశ్శి, వాయ యని యోమునుం గూడఁ బల్కు-
టొప్పు. (జ్ఞాన-263)

హజ్జ = పాదము. "అంజ హజ్జ యడుగు నాఁగఁ బాదాఖ్య" అని సాంబనిఘంటువు.

## వ్యాఖ్యావలోడనము—అద్వైత వేదాంతము.

తాత్పర్యదీపికాకర్త యగు మాధవమంత్రిని గూర్చి ముందే వివరించితిని. ఇతఁడు సకలశాస్త్రపారంగతుఁ డగుటచే నుపనిషత్తుల తోడను, మంత్రశాస్త్రరహస్యముల తోడను వ్యాఖ్యను విపులీకరించెను. అద్వైత ఘట్టములందు మూలసంహితాకర్తయే తర్కభాష నుప యోగించెను. దీనికిఁ దోడు వ్యాఖ్యాత తార్కికపరిభాషను ప్రచురముగాఁ బ్రయోగించి యద్వైతతత్త్వమును స్థాపించెను. ఇట్టి శాస్త్రార్థఘట్టములను మహాదేవకవి యెంత మెల కువతో నాంధ్రీకరించెనో గమనింతము.

శ్లో॥ షడ్భావవిక్రియాహీనా శుభాశుభవివర్జితా।
సర్వద్వంద్వవినిర్ముక్తా సత్యవిజ్ఞానరూపిణీ॥ (ముక్తి-2-30)

తా. దీ. :- వైషయికదుఃఖపరిహేతదయోగ్యత్వం కారణ మాహ-షడ్భావేతి॥ జాయతే ఽస్తి విపరిణమతే వివర్ధతే ఽపక్షీయతే వినశ్యతీతి షడ్భావవికారాః। వైషయికసుఖప్రాప్తౌ వా దుఃఖ నివృత్తౌ వా ఏతే స్యుః। ఉపయ న్నపయన్ ధర్మో వికరోతి హి ధర్మిణమ్' ఇతి న్యాయా న్నిత్యనిరతిశయానందస్వరూప స్యాత్మనః స్వరూపాభివ్యక్తిరూపాయాంనైతత్సంభవ ఇత్యర్థః।

వ॥ జాయతే, అస్తి, విపరిణమతే, వివర్ధతే, అపక్షీయతే, నశ్యతి యను షడ్భావవికారముల నొందక హేయోపాదేయసంజ్ఞల కందక సంవిద్రూపమును మాత్రము గాంచి యనన్యా

శ్రియమయి నిత్యానందసంధాయకమయి స్వయంజ్యోతిష్ట్వవిరాజితమయి వాచ్యవాచకలక్ష్య లక్షణ సంబంధదూరమయి సర్వజీవాత్మభూతమునయి, యపాస్తావరణవిక్షేపకాత్మకాజ్ఞానంబయి యదృశ్యాశ్రవ్యానాస్వాద్యాతిసంయుతవిశేషణమ్ముల కాలవాలమ్మగు విశుద్ధముక్తి యొప్పారు.

(ముక్తి-36)

శ్లో॥ ఘటజ్ఞానా ద్ఘటాజ్ఞానం యథా లోకే వినశ్యతి।
తథాత్మజ్ఞానమాత్రేణ నశ్య త్యజ్ఞాన మాత్మనః॥
రజ్జ్వజ్ఞానవినాశేన రజ్జుసర్పో వినశ్యతి।
తథా ఽఽత్మాజ్ఞాననాశేన సంసారశ్చ వినశ్యతి॥ (ముక్తి-3-7,8)

వ॥ ఘటాజ్ఞానము ఘటజ్ఞానమునను, రజ్జ్వజ్ఞానము రజ్జుజ్ఞానము వలనను నశించునటు లాత్మ జ్ఞానము వలన నాత్మాజ్ఞానము నశించు. (ముక్తి-58)

శ్లో॥ ఏష ఏవ హి మంత్రార్థః సత్యం సత్యం న చాన్యథా।
వేదాః సర్వే పురాణాని స్మృతయో భారతం తథా॥
అన్యాన్యపి చ శాస్త్రాణి తథా తర్కాశ్చ సర్వశః।
శైవాగమాశ్చ వివిధా ఆగమా వైష్ణవా అపి॥
అన్యాగమాశ్చ విదుషా మనుభూతి స్తథైవచ।
అస్మిన్నర్థే స్వసంవేద్యే పర్యవస్యంతి నాన్యథా॥
బాధ్యబాధకతాం యాంతి వ్యవహారే పరస్పరమ్।
సముద్ర ఇవ కల్లోలా ఇతి వేదార్థసంగ్రహః॥ (యజ్ఞ-8-23...25)

మాధవమంత్రి యీశ్లోకముల యొద్ద న్యాయ-వైశేషిక-సాంఖ్య - యోగ-మీమాంసాది శాస్త్రముల నాలోడించి బృహద్వ్యాఖ్య రచించి చివర — తత్ర తావ ద్భట్టాచార్యాః—

శ్లో॥ ఇత్యాహ నాస్తిక్యనిరాకరిష్ణు రాత్మాస్తితామ్ భాష్యకృ దత్ర యుక్త్యా।
దృఢత్వ మేత ద్విషయశ్చ బోధః ప్రయాతి వేదాంతనిషేవణేన॥

ఇతి। గురుమతానుసారిణా భవనాథే నాప్యుక్త మర్థవాదాధికరణే — అథవా న వేదాంతానాం చోదనైకవాక్యతా। అథాతో బ్రహ్మజిజ్ఞాసేతి శాస్త్రాంతరస్థితే రితి ...... నను ప్రమాణప్రమేయాదిషోడశపదార్థా ఇతి నైయాయికాః। ద్రవ్యగుణాదిషట్పదార్థా ఇతి వైశేషికాః। అవ్యక్తమహదహంకృతిప్రభృతీని చతుర్వింశతి తత్త్వానీతి సాంఖ్యాః। శివశక్తిసదాశివేశ్వరవిద్యాతత్త్వప్రభృతీని షట్త్రింశత్తత్త్వానీతి శైవాః। ఏవం బహుధా విప్రతిపన్నానాం కథ మేకస్మిన్నేవార్థే పర్యవసాన మిత్యాశంక్యాహ—బాధ్యబాధకతామితి।

అని యీమతముల కద్వైతమునందుఁ బర్యవసానము చూపెను. మీమాంసాదర్శనము జైమినిప్రణీతము. జైమిని సూత్రములకు శబరస్వామి భాష్యము రచించెను. ఈ శాబర భాష్యమునకు శ్రీకుమారిలభట్టపాదులు 'శ్లోకవార్తికము' 'తంత్రవార్తికము' 'టుప్టీక' యను వ్యాఖ్యలు రచించిరి. ఇది వ్యాఖ్యోపవ్యాఖ్యలతోఁ బెరిగి భాట్టప్రస్థాన మని ప్రసిద్ధి గాంచినది.

పైవ్యాఖ్యలోఁ బేర్కొన్న భట్టాచార్యులు కుమారిలభట్టపాదులు. శ్రీప్రభాకరమిశ్రులు శాబర భాష్యముపై (1) బృహతి (2) లఘ్వి యను రెండు వ్యాఖ్యలు రచించిరి. ఇది వాఖ్యోపవ్యాఖ్యలతోఁ బెంపొంది ప్రాభాకరప్రస్థాన మని పేరొందినది. ప్రభాకరమతానుయాయి యగు భవనాథుఁడు మీమాంసాసూత్రములపై "నయవివేక" మను వ్యాఖ్యాగ్రంథము రచించెను దీనిపై 4 వ్యాఖ్యలు వెలసినవి.

సూ :—. ప్రమాణ ప్రమేయ సంశయ ప్రయోజన దృష్టాంత సిద్ధాం తావయవ తర్క నిర్ణయ వాద జల్ప వితండా హేత్వాభాస చ్ఛల జాతి నిగ్రహస్థానానాం తత్త్వజ్ఞానా న్నిశ్శ్రే యసాధిగమః (న్యా. ద 1-1-1) అని యక్షపాదమహర్షి న్యాయసూత్రము.

(1) ప్రమాణము (2) ప్రమేయము (3) సంశయము (4) ప్రయోజనము (5) దృష్టాంతము (6) సిద్ధాంతము (7) అవయవము (8) తర్కము (9) నిర్ణ యము (10) వాదము (11) జల్పము (12) వితండ (13) హేత్వాభాసము (14) ఛలము (15) జాతి (16) నిగ్రహస్థానము — ఇవి 16 పదార్థములని నైయా యికమతము.

సూ :— ధర్మవిశేషప్రసూతాద్ ద్రవ్య గుణ కర్మ సామాన్య విశేష సమవాయానాం పదార్థానాం సాధర్మ్య వైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానా న్నిశ్శ్రేయసమ్ (వై. ద. 1-1) అని కణాదమహర్షి వైశేషిక సూత్రము (1) ద్రవ్యము (2) గుణము (3) కర్మము (4) సామాన్యము (5) విశేషము (6) సమవాయము—ఇవి 6 పదార్థము లని వైశేషిక మతము. ఇట్లే 24 తత్త్వములను సాంఖ్యులు; 36 తత్త్వములను శైవులు నంగీకరించిరి. ఈమతముల కన్నింటికి నద్వైతము నందే తాత్పర్య మని పై వ్యాఖ్యలో వివరింపఁబడినది దీనిని మహాదేవకవి యిట్లు తెనిఁగించెను —

వ॥ మఱియు నైయాయికవైశేషికులకు జ్ఞానము వలన మోక్షమును ముక్తునకుఁ దనకంటె వేఱైన ప్రపంచము ప్రతిపత్తి గనకుండుటయు వేదాంతులతో సమానమే యగును ... ... అట్లయినచో మీమాంసకుల మతము వైదికమత మెట్లగునని శంకింపవలదు. ఏల యన నాత్మా స్తిత్వము వారి కంగీకారము కనుక వారి మతము వైదికమత మని చెప్పవచ్చును. భవా చార్య శిష్యుండగు భవనాధుండు నాస్తిక్యనిరాకరణపరాయణుండై స భవాచార్యుని యాత్మాస్తి త్వసిద్ధాంతము యుక్తిబద్ధము చేయుటకుఁ గర్తృత్వభోక్తృత్వాది లక్షణములచే నాత్మ నుప దేశించునని వెల్లడించును గాన సర్వదర్శనములు నుపనిషన్మూలాద్వైత బ్రహ్మస్వరూపము నంగీకరించు నట్లయే యూహింపవలసియున్నది. మఱియుఁ బ్రమాణప్రమేయాదిషోడశపదార్థ వాదులగు నైయాయికులును, ద్రవ్యగుణాదిషట్పదార్థవాదులగు వైశేషికులును, నవ్యక్తమహ దాదిచతుర్వింశతితత్త్వవాదులగు సాంఖ్యులును, శివశక్తి సదాశివేశ్వరవిద్యాదిషట్త్రింశత్తత్త్వ వాదులగు శైవులును భిన్నభిన్నవాదావలంబులగుట నెట్లేకపదార్థమునందుఁ బర్యవసానము గలుగు వారగుదురని సందేహింప వలదు. మున్నిటి గరితన్ను వలె వారి మతములు పరమా త్మునందుఁ బరస్పరము బాధ్యబాధకతాభావము నొందును. (యజ్ఞ-154)

ఇది సూతుఁడు శౌనకాదుల కుపదేశించు గ్రంథము గాన మహాదేవకవి యనంతరకాలికు లగు భవనాథాదుల నామములు తొలఁగించియున్నచో బాగుండెడిది.

వ॥ మఱియు జీవవిజ్ఞాన మిఱుదెఱఁగులు......తత్పదార్థమందుఁ దత్పదార్థబుద్ధి ప్రామాణ్యజ్ఞానము. ఘటమునందు ఘటజ్ఞానము, పటమునందుఁ బటజ్ఞానము యదార్థజ్ఞానమగు...... అందుఁ బ్రమాణజ్ఞాన మాఱువిధములై యలరారు. ప్రత్యక్షానుమానోపమానార్థాపత్తిశబ్దానుపలబ్ధి అను నాఱును ప్రమాణములే. అం దనుపలబ్ధిజ్ఞానము మాత్ర మభావజ్ఞానము. తక్కినవైయును భావరూపజ్ఞానములు ...... అక్షరసముదాయము పదము. పదసముదాయము వాక్యము. ఏకాక్షరపదములు నేకపదవాక్యములునుం గలవు. కొందఱ మతమున నక్షరములే యర్థప్రకటనసామర్థ్యములు. కొందఱి మతమునఁ బదములే మఱి కొందఱి మతమున వాక్యములే యర్థముల నిరూపించును. దీనినే స్ఫోటవాద మందురు ...... ఘటపటాదులు వ్యావహారికసత్యములు. బ్రహ్మము మాత్రము పారమార్థికసత్యము. (యజ్ఞ-196)

ఈ సుదీర్ఘవచనములోఁ బ్రమాస్వరూపము, షడ్విధప్రమాణములు, స్ఫోటవాదము, మహావాక్యతాత్పర్యము యథావ్యాఖ్యానముగా వివరింపఁబడినవి.

శ్లో॥ అపరా సా పరాముక్తి రాత్మరూపైవ చేన్మతమ్।
తథాపి ముక్తిః ప్రాప్యా వా నప్రాప్యా వాత్మనో భవేత్॥
ప్రాప్యా చే దాత్మనా ముక్తి రప్రాప్తప్రాప్తి రేవ సా।
అప్రాప్తప్రాప్తి రప్యస్య సంబంధో వైక్య మేవ వా॥
సంబంధ శ్చే త్స సాధ్యో వా నిత్యోవా సాధ్య ఏవ చేత్।
అనిత్యః స తు సంబంధో భవేన్నిత్యో న సర్వథా॥
సాధ్యానా మపి భావానా మనిత్యత్వం వ్యవస్థితమ్।
అభావస్య నసాధ్యత్వం ప్రధ్వంసాఖ్యస్య సర్వథా॥ (యజ్ఞ 80 ...)

తా.దీ.:- ఏవం సిద్ధాంత మభిధాయ పూర్వపక్షం దూషయితు మాద్యపక్షస్య ద్వితీయం వికల్ప మాశంకతే-అపరేతి। సా నిత్యసిద్ధా ముక్తి రాత్మరూపా అపి త్వపరాత్మనోఽన్యైవ చేన్మతేత్యర్థః। వికల్పాసహత్వే నేమం పక్షం దూషయితుం వికల్పయతి — తథాపీతి। ఆత్మవ్యతిరిక్తా కిం వా ప్రాప్యా? న ప్రాప్యా వా? అద్యం పునర్ద్వికల్పం దూషయితుం ఫలితార్థమాహ — ప్రాప్యా చేదితి। అథ తామాద్యం పక్షం వికల్పయతి — అప్రాప్తప్రాప్తి రితి ...... వ్యాప్తిం దర్శయతి — సాధ్యానామితి। వక్రీవరతురీవేమాదిసాధ్యానాం ఘటపటాదీనాం భావానా మనిత్యత్వం దృశ్యతే। అతః సాధ్యత్వ మనిత్యత్వేన వ్యాప్తమిత్యర్థః। అనైకాంతికత్వం పరిహరతి—అభావస్యేతి। ప్రధ్వంసాభావస్య భావరూపసాధ్యత్వధర్మయోగో న ఘటతే తథావిధధర్మయోగే తస్య ఘటాదివద్భావత్వ మేవ స్యాత్ ...తద్వ త్ప్రధ్వంసస్యాపి సమాన మితి తస్యా ప్యనిత్యత్వ మభ్యుపగంతవ్య మిత్యర్థః।

వ॥ మఱియుఁ బరముక్తి యాత్మరూప గాక యన్యరూప యగునని తలంతురేని యది యనవద్యసిద్ధాంతము కాదు ...... ఏమరిన స్వకంఠాభరణమును దద్విషయకాప్తవాక్యస్మరణమును భ్రమకృత ప్రాప్త్యప్రాప్తులకు దృష్టాంతము. ప్రాప్యమా? యప్రాప్యమా యని వికల్పించిరేని యందుఁ బ్రాప్య మైనచో నప్రాప్తప్రాప్తిరూపమా? ప్రాప్త

ప్రాప్తి రూపమా? యని మఱల వికల్పించి యప్రాప్తి ప్రాప్తి రూపమైనచో ప్రాప్యప్రాపక సంబంధము విషయమున రెండు భిన్నవస్తువులకుఁ గల యథార్థయస్వస్వామ్యాదిసంబంధమా? లేక రెండు వస్తువులకుఁ గల తాదాత్మ్యరూపమా? యని పునర్వికల్పనం బొనర్చి మఱియు మొదటి పక్షమునఁ దత్సంబంధము సాధ్యము సంతవంతమునా? లేక సిద్ధము నిత్యమునా? యని ప్రశ్నించుకొని తర్కించి విచార మొనర్చిన యెడల ముక్తి ప్రాప్య మను సంగితి యుక్తి యుక్తము కాదని తెలియు నది యెట్లనిన ముక్తముక్తులకుఁ గల సంబంధము సాధ్యసంబంధమందురా? చక్రచీవరతురీవేమాదిసాధ్యమైన ఘటపటాదులవలె ముక్తియు ననిత్యమగు ...... ప్రస్తుతము ప్రధ్వంసాభావము నిత్య మని యంగీకరించియే విమర్శింతము. తత్పక్షమున దృష్టాంత మసమమని మడువవలసి యున్నది. భావరూప మైన ముక్తి విషయమున నభావరూపమైన ప్రధ్వంసాభావదృష్టాంత మెట్లు కార్యమగును ...... ముక్తి సర్వభంగుల నప్రాప్యమని యెంచు వారి కొక ప్రత్యుత్తరము గలదు. అప్రాప్యమైన ముక్తి కెవండైనను బ్రయత్నించునా? శశశృంగమునఁ గండూతినివారణ మొనరింపను గగనకుసుమమున శిరో౽లంకరణ మొనరింపను జూచు వెఱ్ఱి గలఁడే? ...... కావునఁ జైతన్యాఖ్యము లయినవి భావపదార్థములు కానిం డభావపదార్థములు కానిండు. సాధ్యపదార్థములు కానిండు. ప్రకృతి ప్రభృతులైన సాధ్యపదార్థములు కానిం డవి యెల్ల ననిత్యములని యంగీకరింపక యెట్టి తర్కాదిశూరునకుఁ దీరదు. సనాతని యగు వేదమాత నిత్యానిత్యములచేత నాచేతనాచేతనముల వివరించుచున్న సందర్భములోఁ జైతన్య మనంతమనియు నచిత్పదార్థ మంతవంతమనియు బుద్ధిమంతులు పంతంబులు మాని యంతఃకరణము నిశ్చయించుకొని నిశ్చింతు లగుట లెస్స (యజ్ఞ -807)

ఇక్కడ నీవిషయము గమనింపవలయును. వైశేషికులు ద్రవ్య-గుణ-కర్మ-సామాన్య-విశేష-సమవాయములను భావపదార్థములుగా నిరూపించి యభావమును సప్తమపదార్థముగా నంగీకరించిరి ఆ యభావము (1) ప్రాగభావము (2) ప్రధ్వంసాభావము (3) అత్యంతాభావము (4) అన్యోన్యాభావము నని నాల్గు విధములు. కార్యోత్పత్తికి ముందున్న యభావము (కుండ పుట్టుటకు ముందుండు కుండ యొక్క యభావము) ప్రాగభావము. ఇది యనాది, సాంతము. కార్యోత్పత్తి కనంతర మందున్న యభావము ప్రధ్వంసాభావము. ఇది సాది, యనంతము. మూఁడు కాలములందు నుండు నభావము (అసలేలేనిది) అత్యంతాభావము. పరస్పరము వస్తువులందుండు నభావ మన్యోన్యాభావము. ఇందుఁ బ్రధ్వంసాభావము నిత్యమను తార్కికపక్షము ఖండింపఁబడి వేదాంతమతము స్థాపింపఁబడినది.

శ్లో॥ ఆత్మానాత్మేతి విపేన్ద్రా ద్వివా ద్రవ్యం వ్యవస్థితమ్।
అత్మ ద్రవ్యం స్వయంశుద్ధం సత్యజ్ఞానాదిలక్షణమ్॥
సత్తామాత్రేన దోషో౽స్తి స్వతఃశుద్ధం యతఃసదా।
యది సత్తా స్వితో౽శుద్ధా దుష్టం సర్వమ్ భవేత్సదా॥ (యజ్ఞ -4(2,3)

వ॥ మఱియు ద్రవ్యము ద్వివిధము. ఆత్మద్రవ్యము నిత్యశుద్ధము. తదితరమెల్ల శుద్ధేతరము. అదెట్లనిన నాత్మ సచ్చిదానందుగ నిగమము అభివర్ణించినవి ఉపాధిరహిత సత్తా చైతన్యానందములు నిత్యము స్వతఃశుద్ధములే. సత్తాలక్షణ మెఱుఁగఁదగు. పరస్పర భిన్న

సర్వనామరూపాత్మక ప్రపంచమునందును దుద కత్యభావమునందును దండ యందు దారము వలె ననుస్యూతమయి సామాన్యముగ నున్నది యనుటయే సత్తాస్వరూపము సత్త స్వతోదోష మందురా? సర్వదోషత్వమే పట్టి పవిత్రత్వమునకు నిలువ నీడ లేకయే పోవును. సత్తయుఁ గలదనియుఁ దత్సంపర్కమువలన సత్తకు దుష్టత్వమొదవు నందురా? నిర్దుష్టమును వాస్తవముగ దుష్టమగు నెడ సర్వదా నిర్దుష్టవస్తు వొకటన్నది లేనే లేదు. అటుగాక సత్తాశూన్యత్వ మంగీకరింతురా? తచ్ఛూన్యత్వస్ఫురణము స్వవచనవ్యాఘాతహేతు వగును. కావున సత్త నిత్యమును స్వతశ్శుద్ధమని యొప్పుకొనక తప్పదు. (యజ్ఞ-961)

ఇది దిక్ప్రదర్శనము. తక్కిన శాస్త్రవచనములను గూడ నిట్లే గ్రహింపవలయును. కవితాకుశలులగు తర్కకర్కశచాతురీధురీణులు గాని యిట్టి ఘట్టముల నింత యందముగా ననువదింప లేరు. శాస్త్రఘట్టములు మతవిషయములు వచ్చినపుడు మల్లుచఱచి నిలవడిన తెలుఁగు కవులను వ్రేళ్ళపై లెక్కింపవచ్చును. అట్టివారిలో మొదటివా రాంధ్రభాగవతరచనాచణులగు పోతనామాత్యపూజ్యచరణులు. రెండవవా రాముక్తమాల్యదాప్రబంధసంధాతలగు శ్రీకృష్ణదేవరాయలు. మూఁడవవారు సీతారామాంజనేయసంవాదకర్తలగు లింగమూర్తి గురుమూర్తులు. ఈ కోవలో నాల్గవ వారు మన మహాదేవామాత్యులు. నేఁటి కాలములో నిట్టి శాస్త్రఘట్టములందుఁ బరీక్ష కాఁగు గ్రంథరాజము వెంపరాల వారి శంకరవిజయము. పోతనగారు భాగవతానువాదమున శ్రీధరవ్యాఖ్యను జోడించినట్లు మహాదేవకవి సూతసంహితానువాదమున మాధవవ్యాఖ్యను జోడించుట పాఠకుల యదృష్టము.

## సర్వదర్శన సమన్వయము :—

వ॥ వైదికములనియు వేదవిరుద్ధములనియు మతము లిరుతెఱఁగులు. పురాణేతిహాస ధర్మశాస్త్రములు వేదవేదాంగోపవేదములును గాపాల కామిక లాకుళ వైష్ణవ బ్రాహ్మ సోమపాశుపత భైరవాద్యాగమములును బౌద్ధార్హ తాద్యాగమములును దర్కసాంఖ్యలోకాయత మీమాంసాదిశాస్త్రములును భిన్నభిన్నప్రతిపాదకములయ్యు నీశ్వరచైతన్యమే తత్తత్ప్రవక్తల హృదయమునఁ బ్రవేశించి పలికించుటచే నీశ్వరనిర్మితములని నుడువఁబడెను. ఆస్తికము లగు మతము లన్నియు నీశ్వరసమ్మతములు. సకల నదులకు సముద్రుఁడు పరమావధి యగునటుల సకలమార్గములకు నీశ్వరుండు పరమావధి. ఏయే మార్గముల నేవేల్పు భజింపఁబడి ననాయా మార్గముల నుపాసింపఁబడు దైవతము నుపాధిగాఁ గొని యీశ్వరుండు తద్రూపములఁ గాంచి యనుగ్రహించి తత్తద్విశిష్టమార్గముల సాధకుని బ్రవేశింప సాయమొనర్చును కాని యన్ని మార్గములు ముక్తిసోపానములు. కర్మాశ్రయులకు శ్రద్ధాజ్ఞానముల నొసఁగియు జ్ఞానజిజ్ఞాసువులకు జ్ఞాన మొసంగియుఁ గర్మజ్ఞానమార్గస్థుండయి యీశ్వరుండు తత్తదాశ్రయులకు శ్రేయఃప్రదాత యగు. ముక్తి నానారూపగా దేశరూప యగును కావున శ్రుతీతరమార్గములును దత్తదధికారిజనములకుఁ బ్రమాణములగు. (యజ్ఞ ౮౫౬)

కం॥ అధికారితారతమ్య, ప్రధానముగ సర్వశాస్త్రపద్ధతులు ప్రమా
ణధురంధరములగుఁదా, యెవ్విధి నరసినఁ బ్రమితి గనని విధులుం గలవే?

(యజ్ఞ-361)

అని యీసూతసంహిత సర్వదర్శనములను సమన్వయపఱిచి యద్వైతమార్గము నుపదేశించుచున్నది. అయ్యణ్ణదీక్షితులు వ్యాసతాత్పర్యనిర్ణయములో జీవర సీయధ్యాయమునే యుదాహరించి గ్రంథమును ముగించినారు.

## క వి తా శై లి

ఈసూతసంహిత యందలి కవిత యన్వయకాఠిన్యము లేక సహజసుందరశైలిలో సాఁగినది. మహాదేవకవి సంస్కృతాంధ్రభాషలలో సమానాధికారము గల వారయినను గూచిపంచి వారి యింటఁ బుట్టిన వారగుటచేఁ గాఁబోలు నచ్చతెనుఁగు వైపునకుఁ గొంత మొగ్గు చూపిరి. సంస్కృతభాషాపద్యములను సంస్కృతసమాసఘటితపద్యములను రచించి తమ యుభయభాషా వైశారద్యమును వెల్లడించిరి.

### సంస్కృతభాషాపద్యములు :-

నన్నయ, తిక్కన, పావులూరి మల్లన మొదలగు వారు గ్రంథాదిని సంస్కృతశ్లోకములు రచింపఁగా; నాచన సోమన, పోతన, శ్రీనాథుఁడు, జక్కన, కనుపర్తి యబ్బయామాత్యుఁడు మొదలగు కవులు స్తోత్రములలో సంస్కృతభాష నుపయోగించిరి. ఏఁదులపల్లి భవానీశకవి ధర్మఖండమునందు, నడిదము సూరకవి కవిజనరంజనమందు సంభాషణలోఁగూడ సంస్కృత భాషను వాడి చమత్కారమును జూపిరి. ఇందు యజ్ఞవైభవఖండములో సత్యసంధుఁడు చేసిన విష్ణుస్తోత్రము నిసర్గ సుందరము. ఇచట నొక దండకము పిదప 6 సంస్కృతభాషాపద్యములు గలవు.

కం॥ హారాంగదకేయూరో, దారలసన్మండనాయ ధన్యస్వాదు
స్మేరాననాయ కరుణా, పూరాంచితలోచనాయ భో వందేఽహమ్.

కం॥ అహ మర్పయామి భవతే, మహతే దండప్రణామ మండన మధునా
సహభక్త్యా విలసచ్ఛ్రీ, క్రహస్త తరసా గృహాణ కరుణార్ద్రధియా.

(యజ్ఞ-416-421)

ఇట్లే విష్ణుమూర్తి శివుని నుతించిన సందర్భములో నొక సంస్కృతభాషా పద్యము గలదు,

తే॥గీ॥ మాతృకామంత్రిలధ్యాయ మాతృమాన, సాక్షిణే మాతృకాకాయసంగితాయ
మాతృకాధారభూతాయ మాతృకైక, మూలరూపాయ మహతే నమో నమోఽస్తు.

(యజ్ఞ-512)

ఇక్కడ నొకవిషయ మవధేయము,

మ॥ నరకాంభోనిధితారిణాయ విలసన్నారాయణాఖ్యాయ మం
ధరభూమీధరభారనిర్వహణనందత్కూర్మరాజాయ ధా
స్వరకశయ్యాగృహసాగరాయ ఘనయజ్ఞక్షేమసంధాయకా
య రమాకోమలబాహుగాఢపరిరంభానందచిత్తాయ తే. (యజ్ఞ-419)

ఇం దాంధ్రభాషానుసారముగా రెండు మూఁడు పాదములు సంధింపఁబడినవి. "యతిః సర్వత్ర పాదాంతే శ్లోకార్ధే తు విశేషతః' అను లక్షణముచే సంస్కృతశ్లోకములోఁ బూర్వార్ధమున కుత్తరార్ధముతో సంధి చేయుట మహాదోషము. కాని యిది సంస్కృతభాషాపద్య మైనను దెలుఁగుసంప్రదాయానుసారముగా యతిప్రాసము లుంచుటచేతను దెలుఁగులోఁ బూర్వోత్తరార్ధములు కలియుట దోషము కాకపోవుటచేతను 'భాస్వర' శబ్దముతో రెండు మూఁడు పాదములు కలియుట దోషము కాదని తెలియవలయును.

## సంస్కృతవాక్యానుకరణములు :—

తెలుఁగుపద్యములో సంస్కృతవాక్యములను సంఘటించుట యొకవిధమగు చమత్కారము ఇట్టి వందు మిక్కుటముగాఁ గలవు.

తే॥గీ॥ మనకు "యస్యామతం తస్య మత" మనియెడు
తలవకారోపనిషదుక్తి గలుగుఁ గాన. (ముక్తి-50)

మ॥ అనఘుం డాడఁ బితామహోను లట "ధన్యాః స్మో వయ" మ్మంచు హ్ర
ద్వనజాతంబున నెంతు రట్టి ఘనుఁడే ధ్యానార్హుఁ డౌ నెయ్యెడన్, (యజ్ఞ-132)

కం॥ వాదము లేల 'మహాం శ్చా
సౌ దేవో' యనెడి నుడువు సరణుల కిరవై. (యజ్ఞ-436)

ఇక్కడ 'సూ:— అనుకృతిని నమశ్శబ్దము తుది యత్తున కోత్వము విభాష నగు' (బాల-సంధి-51) అని సూత్రించి; ఈకార్యము లాఁతిచో సహితము గానంబడియెడి. 'గతానుగతికో లోకో యటంచున్' (కళా-7-110) అను సూరిగారి వాక్య మనుసంధేయము.

కం॥ భాసురవేదము 'తద్భా
సా సర్వ మిదం విభాతి సత్య' మ్మని. (యజ్ఞ-486)

కం॥ శివలింగవిగ్రహమ్మున్, 'శివస్య లింగ' మ్మనుచు వచింతురు వేదో
ద్భవవిజ్ఞానుల్ కొందఱు, 'శివ ఏవ చ లింగ' మని వచింపుటయ తగున్.
(యజ్ఞ-487)

ఇట్లుపనిషద్వాక్యములు యథాతథముగా సంఘటింపఁబడినవి. మఱియొకపద్య మనుకరణప్రకరణములోఁ జూపుచున్నాను.

సంస్కృతసమాసఘటనమున కొక యుదాహరణము —

సీ॥ సరసచందనఘనసారమృగీమద, సాంకవాదిఖ్యాతసౌరభములు
షడ్రసోపేతసంస్తవనీయమోదకా, పూపాతిరసముఖ్యభోజ్యములును
పరమపవిత్రతావాససూర్యాత్మజా, జహ్నుకన్యాదిస్థసలిలములును
గగనవన్నిర్మలకార్పాసకౌశేయ, కాంచనాదిదుకూలసంచయములు
తే॥గీ॥ ప్రకృతిచేతను మిక్కిలి భవ్య మయ్యు, నెద్ది సోఁకిన మాత్రాన నెలమి వీడి
రోఁత కానట్టి దేహంబు రూఢి గాఁగ, హేయమే గాని స్తోత్రార్హ మెట్టు అగును?
(యజ్ఞ-316)

తెలుఁగుపలుకుల కూర్పున కొక యుదాహరణము —

సీ॥ లేఁతవెన్నెలం గవలీల గెల్వఁగ జాలు, ఐసుమంబు మేనిపైఁ బసలు గొలుప
ముత్తరుగా దిద్దు బూది యొప్పిదముల్, నుదిటిపై ముదిపెముల్ గుదురు పఱుప
మెడ దిగి వదురాక బెడఁగుల సెవళం, బిరిదిచందపుఁ జెన్ను అమరఁ జేయ
సంజ కెంజాయ గెల్వం జూచు నెఱ్ఱని, జడలు వైరాగ్యంపుఁ దొడవు లీన

తే॥గీ॥ నారచీరలు మొలకు మండనము గాఁగఁ, దన్ను భజియించు వారిపైఁ గన్న నెనరు
కంటికొనల నటింపఁగా గరళకంఠుఁ, డప్పటికి వచ్చి ప్రత్యక్ష మయ్యె నంత.
(యజ్ఞ-509)

పూర్వకవ్యనుకరణములు :-

తిక్కన — మహాదేవకవి.

తే॥గీ॥ అనిన నలుగాలివాన గోవును; నశేష, శబ్దముల మంత్రమును; లోహజాతిఁ గాంచ
నమును; మనుజుల విప్రుండు; సమధికత్వ, భాజనము లంద్రు వేదప్రపంచవిదులు.
(భార-శాంతి-1-71)

నలుగాలివాన = నాలుగుకాళ్ల గల జంతువులందు

చ॥ మనువుల నెల్లనుం బ్రణవమంత్రము; వేల్పుల నెల్లనున్ శివుం;
డనుపమపూజనమ్ముల హరార్చనమున్; వివిధస్వరూపవే
దనముల నాత్మవేదన; ముదారచరిత్రులయందు నందివా
హనచరితమ్ము, మిన్న లగు నంచు నెఱుంగు ముకుంద! యెయ్యెడన్. (యజ్ఞ-380)

పోతన — మహాదేవకవి.

సీ॥ వలనొప్పఁగా 'న దైవం కేశవా త్పర', మ్మని పల్కు రాజకీరావళియును
మహిమ 'జగ ద్విష్ణుమయ మఖిల' మ్మని, చదివెడు శారికాసముదయంబు
నేపారఁగా 'జితం తే పుండరీకాక్ష', యని లీలఁ బాడు పికావళియును
అలి మీఱఁగా 'మంగళం మధుసూదన', యనుచుఁ బల్కెడు మయూరావళియును

తే॥గీ॥ దవిలి క్రౌంచద్విషట్స్వధేత్యాదిశబ్ద, కలితముగ మ్రోయు మధుపనికాయములును
గలిగి యఖిలైకదివ్యమంగళవిలాస, మహిమఁ జెన్నొందు వైకుంఠమందిరంబు.
(భాగ-2 229)

సీ॥ శాకల్య మెఱుఁగుఁడీ 'యేక మే వాద్వితీ, యం బ్రహ్మ' యని పల్కు లలరఁ బల్కఁ
జాలఁ జింతింప 'నశబ్ద మస్పర్శ మ, రూప' మ్మనుచు నీశ్వరుని వచింప
'బ్రహ్మ యో వేద స బ్రహ్మైవభవతి స, త్య' మ్మంచు ఘంటాపథమ్ము తెలుపఁ
గన నెంతయును 'నిర్వికారనిరంజన, పురుషుఁ డుమేశుఁ' డన్ బోధ మెసఁగ

తే॥గీ॥ శ్రుతిని బోలెడు వేఱొక్క చొప్పు నెందుఁ, గాంచ మెన్నండు నితరమార్గములు సతముఁ
బల్కఁ జాలు నవిద్య వేభంగు లొప్పు, విద్య వెలయింపఁ జాలవు వెఱతెరువులు
(యజ్ఞ-357)

'అన్యవాదకోలాహలము' లో నిట్టి పద్యము లెక్కువగాఁ గలవు.

సీ॥ కలుగఁడే? నాపాలి కలిమి సందేహింపఁ, గలిమిలేములు లేక కలుగు వాఁడు
నా కడ్డపడ రాఁడె? నలి నసాధువులచేఁ, బడిన సాధుల కడ్డు పడెడు వాఁడు
చూడఁడే! నాపాటుఁ జూపులఁ జూడక, చూచువారల కృపఁ జూచు వాఁడు
లీలతో నా మొఱాలింపఁడే? మొఱఁగుల, మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగు వాఁడు

తే॥గీ॥ అఖిలరూపులుఁ దనరూప మైన వాఁడు, ఆదిమధ్యాంతములు లేక యడరువాఁడు
భక్తజనముల దీనుల పాలి వాఁడు, వినఁడె! చూడఁడె? తలఁపఁడె! వేగ రాఁడె!.
(భాగ-8-87)

సీ॥ వెలయించు నన్నింటి వెలయింపఁగాఁ దన్ను, వస్తు వెద్దియు లేక వఱలు వాఁడు
పుట్టించు నన్నింటిఁ బుట్టింపఁగాఁ దన్నుఁ, దల్లిదండ్రులు లేక తనరు వాఁడు
పాలించు నన్నింటిఁ బాలింపఁగాఁ దన్నుఁ, బ్రభు వెవ్వఁడును లేక పరగు వాఁడు
సమయించు నన్నింటి సమయింపఁగాఁ దన్ను, మృత్యువు గలుగక మెలఁగు వాఁడు

తే॥గీ॥ అద్వితీయుండు కేవలుం డభవుఁ డన్న, తత్త్వ మొక్కటి యగును వాస్తవపదార్ధ
మన్యవస్తుచయంబుల నరయఁ దవ్వి, నిత్యములు గావు కావు మనీషులార!
(యజ్ఞ-396)

శ్రీకృష్ణదేవరాయలు — మహాదేవకవి.

సీ॥ ఉండు నప్రాణులం దొక్కించు కాశక్తి, స్థావరశ్రేణిఁ దజ్జాతి కంటె
నెఱ్ఱిరోఁకటిబండ జెఱ్ఱి మన్దిండి మున్నగు సరీసృపములం దంత కంటె
ఖగముల మఱి వాని కంటె మృగావలి, యందు నూహింపంగ నందు కంటె
దంతిగోముఖపశుతతి నంత కంటె మర్త్యకదంబకములయం దంత కంటె

తే॥గీ॥ యక్షగంధర్వనాగాళి నంత కంటె, నంతకంటె నిలింపులం దంత కంటె
హరిహయుని యందు దక్షునం దంత కంటె, నాద్యుఁడు హిరణ్యగర్భునం దంత
కంటె. (ఆముక్త-3-80)

సీ॥ క్రిమికీటఖేటగణము కంటెఁ బశువులు, వానికంటెను నరుల్ వారి కంటె
బాపనయ్యలును నవ్వారి కంటెను బండితుల్ వారి కంటెను దొడ్డబుద్ధి
నలరు వారలు వారి కంటెఁ గర్మఠులును, వారి కంటెను బరివ్రాజకులును
సన్న్యాసులున్ గుటీచకులు వారల కంటె, నలఘుబహూదకాఖ్యులును వారి

తే॥గీ॥ కంటె హంసలు నవ్వారి కంటెఁ బరమ, హంసు లవ్వారి కంటెను నాత్మవేత్త
లరయ మిన్నలు జ్ఞానుల కధికు లెట, నరయఁగా లేము సర్వలోకాళి నరసి.
(జ్ఞాన-96)

చేమకూర వెంకటకవి — మహాదేవకవి.

కం॥ కడు హెచ్చు కొప్పు దానిం, గడవం జనుదోయి హెచ్చు కటి యన్నిటికిన్
గడు హెచ్చు హెచ్చు లన్నియు, నడుమే పస లేదు గాని నారీమణికిన్.
(విజయ - 1 - 39)

ఉ॥ పెన్నెరి వేణికిన్ దుఱుము పెద్దది పెద్దదియో॑ బిఱుందు చె
న్నెనన్నగిఁ జాలఁ బెద్ద కమలెంచఁగ మిక్కిలి పెద్దలౌను మే
వన్నెయుఁ బెద్ద కాని యల వారిజనేత్రకు వింతవింతగా
నెన్నదు మొందు సన్ననయి నిల్చెను బెద్దల మధ్యఁ బిన్నయై. (యజ్ఞ-586)

కూచిమంచి తిమ్మకవి — మహాదేవకవి.

కం॥ తలమేఁ జలువపేరుమ, బొలుపారు కడింది సౌరు బూచుల బారున్
మలయూపఁ బుడమిఁ తేరుమ, గలిగిన నెఱవేల్పు! మొనలకై దువతాల్పు!
(ఆచ్ఛ. రామా-2-118)

కం॥ మెడకప్పు మూఁడు కన్నులు, జడ నేఱుం బశ్తి తలను జాబిల్లి మెయిన్
గిడలేని మొడికపుం దొడ, వడరెను ముక్కంటి మూర్తి ధ్యానార్హంబౌ.
(యజ్ఞ—181)

యమకము :—

కం॥ అని పల్కిన పలువల్కులు, విని వారలు పుండరీకవిమలపురమ్మున్
జని జనితభక్తిఁ దాండవ, ఘను ఘనకారుణ్యవర్షఘనుఁ గాంచి రొగిన్
(ముక్తి—287)

అంత్యానుప్రాసము :—

కం॥ శూలికి మాయాశాలికిఁ, బాలితదేవాలి కఖిలపాపై కవనీ
కీలికిఁ గపాలమాలికిఁ, జాలఁగ సాష్టాంగవినతి సమితి నొసఁగెదన్.

కం॥ రుద్రునకుఁ గృపాపూర్ణస్వ ముద్రునకును సాంద్రతరతమోఽహస్కరని
ర్నిద్రునకు భూతితృప్తద, రిద్రునకున్ నే నమస్కరింతున్ బత్తిన్. (జ్ఞాన-23,24)

తే॥గీ॥ అలఘుపుణ్యపలమ్ము వృద్ధాచలమ్ము, అఖిలవిధ్వస్త దురితవారాశి కాశి
సాంద్రభీషణభవతమోజాలములకు, ఘనతరోష్ణగభస్తి శ్రీకాళహస్తి (ముక్తి-303)

జాతీయములు — సుభాషితములు,

ఈ గ్రంథమునందు - 'తూచాలు తప్పకుండఁగ' (ముక్తి-123) "నీ యిల్ బంగా రిము గాను' (ముక్తి-221) "నోరు కాయలు కాచెన్" (యజ్ఞ-651) వంటి జాతీయ ములు, "వంటింటి శశము" (యజ్ఞ-164) మొదలగు సామెతలు

చ॥ కలుగుమ గాదె రత్నములు గల్గిన తావుల నత్తగుల్లలున్
మలయజభూజకోటరమువన్ విషభీకరపన్నగంబులున్
గలుగుమగాదె లోకములఁ గాల్చు మహాదహనోగ్రమూర్తి శీ
తలజలరాశిలోఁ గలుగు దై జకఁ గల్గఁ గాకమున్ (ముక్తి-166)

తే॥గీ॥ కొడుకు చెడుగైనఁ గల మెల్లఁ జెడుమ గాదె! (ముక్తి-183)
మొదలగు సుభాషితములు గలవు.

## అకారాద్యనుక్రమణిక :—

మూలము నందు ఋషుల నామములు భగవన్నామములు వచ్చినపుడు వానిని మహాదేవ కవి యకారాద్యనుక్రమణికలో నమర్చుట ముచ్చటగా నున్నది.

శ్లో॥ విష్ణువృద్ధో విశాలాక్షో వత్సః కుండిన అరుణిః।
జాబాలో జమదగ్నిశ్చ జర్జరో జంగమో జయః॥
పక్వః పాశధరః పారః పారగః పండితోత్తమః।
మహాకాయో మహాగ్రీవో మహాబాహు ర్మహోదరః॥
ఉద్దాలకో మహాసేన ఆర్త ఆమలకప్రియః।
ఏకపాదో ద్విపాదశ్చ త్రిపాదః పద్మనాయకః॥ (జ్ఞాన—1-9-...)
ఇక్కడ మూలకర్త కూడఁ గొంతవఱకు నక్షరక్రమము పాటించెను.

వ॥ అనత్త మార్తామలకప్రియారణులు, మత్త మోద్దాలకోగ్రవీర్యులును, గణ్వాకరుణ కంకణకల్పాంత కళాధరకాలకాలాగ్నిరుద్రకైవల్యులును, జయజంగమజర్జరజాబాలులును ... (జ్ఞాన-5)

శ్లో॥ హరభక్తో హిరణ్యాక్షః శైవపూజాపరాయణః।
అంబికాచరణస్నేహ ఈశ్వరాంఘ్రిపరాయణః॥ (ముక్తి—1 అధ్యా)

వ॥ అణిమాండుండు, నత్యుగ్రుండు, నతిప్రసన్నుండు, నారుణియు, నారుణేయుండును .... (ముక్తి-6)

ఇక్కడ మూలములో 9-28 శ్లోకములలోఁ జెప్పఁబడిన ఋషుల నామములు తెలుఁగు వచనములో నకారాద్యనుక్రమణికలో నమర్పఁబడినవి.

శ్లో॥ అకారాయ నమః సాక్షా దనంతానందమూర్తయే
ఆత్మభూతాయ సర్వేషా మతిశుద్ధాయ శూలినే॥
ఆకారాయా తిశుద్ధాయ సాక్షిణే సర్వవస్తునః।
అంబికాపతయే తుభ్య మసంగాయ నమో నమః॥
క్షకారాయ క్షమంత్రార్థస్వరూపాయ క్షమావతామ్।
క్షేమదాయ మమ క్షేమ స్వరూపాయ నమోనమః॥ (యజ్ఞ-29 అధ్యా)

వ॥ "అ" కారుండ వైన నీ వతిశుద్ధుండ వఖిలాత్మభూతుండ వనంతానందమూర్తివి నీకు నమస్కారము ...... 'క్ష' కారుండవు నీవు క్షమంత్రార్థస్వరూపుండవు క్షమారమణీయులకు క్షేమప్రదాతవు నీవు. నాకును క్షేమకారుఁడ వగు నీకు నమస్సు (యజ్ఞ—511)
ఇక్కడ నక్షరమాలాస్తోత్రము యథామాతృకముగా ననువదింపఁబడినది. ఇచ్చట నొక విశేషము.

## సోమలతాలక్షణము :—

శ్లో॥ 'అకారాయ లతాసోమస్వరూపాయ లతాత్మనే' (యజ్ఞ-29-60)
అనుచోట శివుఁడు సోమలతాస్వరూపుఁడుగాఁ జెప్పఁబడినాఁడు. సోమశబ్దము చంద్ర

వాచకము. "శ్లో॥ సోమః కుబేరే పితృదేవతాయాం వసుప్రభేదే చ సుధాకరే చ। దివ్యౌషధీ సోమలతాపమీరకర్పూరసీరేషు చ వానరే చ॥" అని విశ్వప్రకాశము. ఉమాసహితుఁడగు శివుఁడు కూడ సోముఁడు. సోమలత కీపే రేల వచ్చినదో తాత్పర్యదీపికాకారుఁడు వివరించినాఁడు.

లతేతి—అష్టమూర్తేః శివస్య చంద్రః ఏకా మూర్తిః। తస్య చ ప్రతిపదాదిపౌర్ణమాస్యంతతిథిషు నిత్య మేకైకకళా వర్ధతే పునః ప్రతిపదాదిదర్శాంతే ష్వేకైకలా హీయతే యథా తథా సోమలతాయా అపి పౌర్ణమాసీపర్యంతం నిత్య మేకైకపత్రస్య వృద్ధిః పునర్దర్శపర్యంత మేకైకపత్రస్య హానిః। అతః శివో ఽపి చంద్రాత్మలతాసోమస్వరూపః। చంద్రకిరణాధీనత్వాత్ సర్వలతానాం వృద్ధేః చంద్రో లతానా మాత్మా। అత శ్చంద్రరూపః శివో ఽపి లతాత్మా। తస్మై॥

చంద్రునకు సోమలతకు సంబంధము గలదు. చంద్రకళలు శుక్లపక్షములో వృద్ధి చెంది కృష్ణపక్షములో క్షీణించునట్లే సోమలత కూడఁ బాడ్యమి మొదలు పున్నమ వఱకు నొక్కొక్క యాకుచు దొడిగి మఱలఁ బాడ్యమి మొద అమావాస్య వరకు నొక్కొక్క పత్రముమ రాలుచును. ఇక్కడ వ్యాఖ్యను జోడించి మహాదేవకవి యిట్లు తెనిఁగించెను.

వ॥ 'ల' కారుండ వీవు లలితమృగలాంఛనుండైన సోమునకు శుద్ధప్రతిపత్తిథి మొదలు పౌర్ణమి వఱకు నొక్కొక్క కళ హెచ్చి యప్పటి నుండియు నమావాస్య వఱకు నొక్కొక్క కళ తగ్గునట్లు సోమలతకుఁ బూర్వపక్షమునఁ బ్రతితిథి కొక్కొక్క పత్రము తొడుగుటయుఁ బశ్చాత్పక్షమునఁ బ్రతితిథి కొక్కొక్క యాకు నూడుచుటయు సంభవించుటం జేసి యా యష్టమూర్తులలో నొక్కఁడవైన సోముని వలె సోమలతయు నీవు. (యజ్ఞ-511)

శ్లో॥ అథ నామాని వక్ష్యామి పరతత్త్వస్య సువ్రతాః।
యాని సంకీర్తయన్ మర్త్యో విముక్తిఫలభాగ్భవేత్॥
శివో రుద్రో మహాదేవః శంకరో బ్రహ్మ సత్పరమ్।
శంభు రీశాన ఈశశ్చ శూలీ చంద్రకలాధరః॥ (యజ్ఞ-33 అధ్యా)

సీ॥ అద్భుతుం డాధారుఁ డంతకారియు నహ
మర్థుండు నద్వైతుఁ డప్రమేయుఁడు. (యజ్ఞ—674)

ఇక్కడ మూలములో 33 పరమతత్త్వనామాధ్యాయములో 2-25 శ్లోకములలోఁ జెప్పఁబడిన శివనామములు తెలుఁగులో 674—684 పద్యములలో నక్షరక్రమము ననుసరించి చెప్పఁబడినవి.

## ఛందోవిశేషములు

మహాదేవకవి యిందు సామాన్యములగు చంపకోత్పలశార్దూలమత్తేభములను, కందము, సీసము, తేటగీతి, యాఁటవెలఁది, ఛందస్సులనే యుపయోగించెను గాని విశేషచ్ఛందములను వాడలేదు. కాని యొక విజయమంగళరగడ, యొక దండకము, నొక మత్తకోకిల యిందు వాడఁబడినవి.

విజయమంగళరగడ :—

జయము జయము దేవదేవ! జయము విజయమంగళంబు
జయ మవాప్తకామ! జయము జయము సోమ! సంతతంబు
జయము సర్వకలుషనాశ! సత్కవీశ! శోభనంబు
జయము త్రిపురభేద! ముక్తసౌఖ్యప్రద! బల్మభంబు. (జ్ఞాన-187)

ఇది 12 పాదముల విజయమంగళరగడ. అనఁగా 24 పాదముల తురగవల్గనరగడ.

కం॥ ఆద్యంతప్రాసంబులు, హృద్యంబుగ రెంట రెంట నిడి పాదము ల
ద్యద్యతులఁ గూర్పఁదగు నన, వద్యంబగు రగడలందు వారిజనాభా!

అందుఁ దురగవల్గన మను రగడ—

శ్రీసతీశుఁ బరమపురుషుఁ, జిత్తమునఁ దలంచు వారు
వాసవాదినిఖిలదివిజ, వంద్యు నాశ్రయించు వారు
నిట జనింతు రనఁగ నన్వ, యించుఁ దురగవల్గనంబు
వటుదినేశలఘువిరామ, భానుమద్గణాష్టకంబు.

అందు విజయమంగళ మను రగడ —

కేశవాయ తే నమోఽస్తు, కృష్ణ పాహి పాహి యనుచుఁ.
గేలు మొగిచి మౌళి నునిచి, కృష్ణుఁ బలికె ననుచు నిట్లు
దేశభాషణములఁ జెప్ప, ద్విగుణతురగవల్గనమునఁ,
దేరు విజయమంగళంబు, తీయదెలుకు రనము నట్లు.

అని యనంతామాత్యుని ఛందోదర్పణము.

రగడయందు రెండురెండు పాదములకు మొదటఁ జివరఁ గూడఁ బ్రాసములను వాడవల యును. పాదమునకు 8 సూర్యగణములు (న-హ) ఉన్నచోఁ దురగవల్గనము. 5వ గణము మొదటి యక్షరము యతిస్థానము. తురగవల్గనమును రెట్టించినచో విజయమంగళ మగును. అనఁగా విజయమంగళమునందుఁ బాదమునకు 16 సూర్యగణము లుండును. ప్రతిపాదము నందును 5-9-13 గణముల మొదటి యక్షరములు యతిస్థానములు. ఇందలి రగడను దురగ వల్గనముగా భావించినచో నాల్గేసి పాదముల కాద్యంతప్రాసములు గల 24 పాదముల రగడ యగును. కాని మహాదేవకవి మొదటిపాదము నందును జివరి పాదములందును 'విజయ మంగళ' ముద్ర వేయుటచే దీనిని 12 పాదముల రగడగా భావించుటయే యుక్తము.

దండకము :—

యజ్ఞవైభవఖండములో 25 వ యధ్యాయమున సత్యసంధుఁడు విష్ణుమూర్తిని స్తోత్రము చేయు సందర్భములో —

శ్రీక్షీరపాథోధిజామానసాంభోజరాజద్విలాసోల్లసద్భంభరా! ...
దిగంతైకకీర్తీ! కృపాస్ఫూర్తి! దేవా! నమస్తే! నమస్తే! నమః. (యజ్ఞ-417)

అను దండకము గలదు. ఇచ్చవచ్చి నన్ని తగణములు వాడి చివర నొక గురువు

నిలుపుట, లేక నగణద్వయముపై నిచ్చవచ్చిన రగణములు నిలుపుట దండకలక్షణము. తెలుఁగుకవు లెక్కువగా నీరెండు విధముల దండకములనే వాడినారు. ఇది తగణదండకము.

మత్తకోకిల :—

కాయికం బనఁ గాలికంతు న • ఖర్వభక్తి ని గొల్చుటల్
కాయజారివరాలయస్థలిఁ • గాలు నిల్పి సుఖించుటల్
గేయశైవమహాస్థలిన్ గృత • కృత్యుఁడై చరియించుటల్
జ్ఞేయశంభువిలాసగాథ ర • చించి కీర్తి వహించుటల్. (యజ్ఞ–848)

శ్రావకాభరణాంక విన్ రస • జాళరేఫల దిగ్విరా
మావహంబుగ మత్తకోకిల • యండ్రు దీనిఁ గవీశ్వరుల్.

అని కవిజనాశ్రియ లక్షణము. మత్తకోకిలలోఁ బ్రతిపాదమునందు "ర-స-జ-జ-భ-ర" గణములుండును. 11వ యక్షరము యతిస్థానము.

## యతివిశేషములు :—

1) నిత్యసమాసయతి :—

నిత్యసమాసములందు యతి యచ్చునకు హల్లునకుఁ గూడఁ జెల్లును.
చాంద్రాయణశబ్దమునకు

సీ॥ చాంద్రాయణవ్రత మొన • ర్పంగ వలయు
అఘము వాయును గృచ్ఛ్రచాం • ద్రాయణమ్ము. (జ్ఞాన-76)

సాంబశబ్దము నందలి యచ్చునకు

చ॥ అని వచియింప నాఘనుఁడు • సాంబశివున్ మది నిల్పి (జ్ఞాన-11)

అపరోక్షశబ్దము నందలి యచ్చునకు

ఉ॥ తత్ప్రసాదాతిశయమ్ముచేత నప • రోక్షవిభూతి (జ్ఞాన-85)

పదార్థశబ్దము నందలి యచ్చునకు

ఉ॥ సాదరబుద్ధి యద్వయప • దార్థము తెల్పుమ (యజ్ఞ-818)

సోఽహంశబ్దము నందలి హల్లునకు

తే॥గీ॥ సోఽహ మని ధ్యానముం జేయు చొ ప్పొకండు. (జ్ఞాన-282)

2) నిత్యయతి :—

ఉ॥ ఎంతేని యవశ్యకృత్య మని • యొంతురు (జ్ఞాన-64)

'ఎట్టి మహాక్రూరకర్మః • దేనియు'; 'నెట్టన హరి తలఁపు గలిగె • నేని' అని యుదాహరించి యేని శబ్దమున కచ్చు తోడను, వ్యంజనము తోడను యతి కుదురునని నిత్యయతిగా నప్పకవి పేర్కొనినాఁడు.

3) ఇంచుగాగమయతి :-

క॥ ఏతటి భజియింప కెటా ళ • జించుట యన్నన్ (జ్ఞాన–176)

సీ॥ ఇచట శక్తిఁ జూ • జించి విరించి (ముక్తి-193)

క॥ కాంచనచేలుని దమి నుతి
యించె నన(గ భిన్నవిరతి • యేపారు( గృతిన్
గొంచక పోషించెన్ విను
తించె నన(గ భిన్నవిరతి • యేపారు( గృతిన్.

అని సులక్షణసారమునందు లింగమగుంట తిమ్మకవి యీయతి నంగీకరించెను.

4) విశేషవళులు :—

సీ॥ జ్ఞాని కన్గవ విప్పి • కన్గొన్న మాత్రాన
జ్ఞాని పుట్టిన యంత • కన్న తల్లియు( గన్న (జ్ఞాన-320)

కం॥ జ్ఞానము కేవలకృప న
జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రి • కాశము సేయన్ (శాంతి-4-225)

అను తిక్కనగారి ప్రయోగ ముదాహరించి 'క-జ్ఞ' వర్ణములను విశేషవళులుగా నప్పకవి పేర్కొనినాఁడు.

5) తద్భవవ్యాజయతి :—

సీ॥ జ్ఞాని కన్పడు మాత్రి • నాకాదిలోకాధి (జ్ఞా-320)

'జ్ఞ-న' వర్ణములను దద్భవవ్యాజయతులుగా నప్పకవి పేర్కొనినాఁడు.

6) పంచమీవిభక్తి విరామము :—

సీ॥ అలరు వారలు వారి • కంటెఁ గర్మఠులును

కం॥ అపరోక్షజ్ఞాన మంత • కన్నన్ మఱి (ముక్తి-286)

వీనిని బంచమీవిభక్తివిరామములుగా నప్పకవి చెప్పినాఁడు.

7) అఖండయతి :—

తేఁగీ॥ ఓము! మోమఁ గోరెద నుపదేష్టృ • పుంగవులను (యజ్ఞ-304)

కం॥ జ్ఞానమ్మున! నుపకార మొనర్చు( గానఁ • గొనవలె దానిన్ (యజ్ఞ-720)

ఉ॥ భానుసహస్రభాసి వృష • భాధిపుఁ డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండవడి • పొల్పగు నాదికవిప్రణీతమై.

అని కవిజనాశ్రయమునం దీయతి యంగీకరింపఁబడినది.

8) ధ్రువశబ్దయతి :—

మ॥ ధ్రువమౌ జ్ఞానము దాన మోక్షరమ నొం • దున్ (ముక్తి-62)

ఇక్కడ యతి సరిగానే యున్నది. కాని

కం॥ ధ్రువతరతేజోవిశాల • దీప్తాంగునకున్ (జ్ఞాన-166)

కం॥ ధ్రువముగఁ దలక్రిందు కాలు • దివిదెస గలుగన్ (యజ్ఞ-247)

కం॥ ధ్రువబుద్ధిం జెలఁగినపుడు • కృతకృత్యుఁ డగున్ (యజ్ఞ-269)

ఈపద్యపాదములందు 'ధృవ' శబ్దముతో యతి పాటింపఁబడినది. రెండు రూపము లును గలవని వీరు భ్రమించి యుందురు. "ధ్రువ" శబ్దము సాధువు గాని 'ధృవ' శబ్దము సాధువు గాదు.

సీ॥ గం।డజదస్యుగర్వవా , సములు పెక్కు— (జ్ఞాన-115)

కం॥ నాడులఁ బూజార్హుఁ డైన , వానిఁ బలికెదన్ (జ్ఞాన-168)

సీ॥ వ। ట్టున కంచు నెఱిఁగితి , గుట్టు తెలిసె (యజ్ఞ-112)

తే॥గీ॥ అచ్యుతాదు। లకును రుచియించు నట్టుల , హరుఁడు (యజ్ఞ-372)

ఆ॥వె॥ జాల మలఘుఫలము , నబ్బఁ జేయు (యజ్ఞ-331)

సీ॥ వృత్తచిత్తుం డైన - శెట్టి కొడుకు (యజ్ఞ-861)

ఈ యాఱు పాదములందు యతి తప్పినది. వేల కొలఁది పద్యములు గల యుద్గ్రంథ ములను రచించునపు డిట్టి వప్రమాదము లెంతటి కవికైనను సంభవించును. శ్రీనాథుని కాశీ ఖండములో నిట్లే —

శా॥ ప్రాశస్త్యంబు వహించు ద్వాదశసహ . స్రగ్రంథసంక్లప్తి వి
శ్వేశక్షేత్రవియన్నదీవటుకడుం . శీనాథసత్కీర్తన (కాశీ-1-81)

అను పద్యములో రెండవపాదములో యతి తప్పినది. ఇట్టివి ప్రమాదపతితములు గాని కవులు బుద్ధిపూర్వకముగాఁ బ్రయోగించినవి కావు.

## ప్రాస విశేషములు :—

రేఫశకటరేఫములకుఁ బ్రాసమైత్రి యప్పకవి యంగీకరింపకపోయినను బెక్కుమంది పూర్వకవులు వాడుటచే నిందుఁ గూడ వాడఁబడినవి. ఇట్లే న-ణ ప్రాసము; ద-ధ ప్రాసము ఖండాఖండప్రాసము నిందుఁ గలవు.

1) ఉభయప్రాసము (న - ణ) :—

చ॥ అని వచియింప నాఘనుఁడు సాంబశివున్ మది నిల్పి బాదరా
యణు వరసన్నిధానము హృదబ్జమునన్. (జ్ఞాన-10)

కం॥ ప్రాణాయామపరాయణు
లై నిచ్చలు మనఁగఁ జాలు నతియోగులు (జ్ఞాన-28)

కం॥ కని తిరిగి యమలదండ
ప్రణతుల నర్పించి పూజ భక్తి నొనర్చెన్ (ముక్తి-55)

2) ఖండాఖండప్రాసము :—

కం॥ యజమానుఁడు ప్రోజ్జ్వలద
గ్నిఁ జక్కఁగను వ్రేల్చె ద్రవ్యనిచయముచే (జ్ఞాన-129)

కం॥ అకలంకమతులు వల్కుదు
రీక నియమాంగముల సేని నెఱుఁగు మొకటిగన్ (జ్ఞాన-230)

కం॥ మదిఁ బంచాక్షరిని బ్రణవ మహితమ్ముగ భ
క్తిఁ దగన్ జపియించినఁ దుద (ముక్తి-65)

చ॥ పగతుని రూపమున్ బుడమిపై లిఖియించి తదీయవక్షమం
దుఁ గడిమి వాని పేరు లిపి తోడ రచించి. (యజ్ఞ-95)

3) ఋప్రాసము (ఋ - ర) :—

మ॥ పరమబ్రహ్మపదార్థమున్ గని నిజస్వాంతమ్మలన్ గోరు బ్ర
హ్మఋషిశ్రేష్ఠులు మీకు నేను మును పార్వాదేవితో (యజ్ఞ-749)

4) స్వవర్గజప్రాసము (ద - ధ) :—

కం॥ బద్ధాదరుఁ డగు వరఫణ
భృద్ధాముఁడు సూరిజనవరేణ్యుల్ వినుఁడీ! (యజ్ఞ-949)

కం॥ కృతప్రాయశ్చిత్తుఁడైనఁ గీడున్ దొలఁగున్ (జ్ఞాన-56)

కం॥ పేరిమ్ముగఁ గృచ్ఛ్రవ్రతము నెనయించినచో (జ్ఞాన-72)

ఆ॥వె॥ ఆత్మప్రీతి యొక్కటగు ముదంబు (జ్ఞాన-229)

కం॥ న్యాయార్జితద్రవ్యంబుల (జ్ఞాన-231)

కం॥ ఔనది వేదాంతశ్రవణ మను నియమంబున్ (జ్ఞాన-233)

సీ॥ వరప్రజాపతిని నుపస్థ యందు (జ్ఞాన-270)

ఉ॥ గ్రావనివాసు నొక్కని నిరంతరబ్రహ్మపదావలంబ (ముక్తి-155)

ఉ॥ బన్న మొనర్చి దేవధనబ్రాహ్మణవిత్తములన్ హరించు (యజ్ఞ-453)

కం॥ నేలన్ సాష్టాంగప్రణతి నెఱపెన్ హరియున్ (యజ్ఞ-510)

చ॥ మ్మఱియును భస్మధారణప్రమాణము లారసి (యజ్ఞ-560)

ఉ॥ పన్నఫలస్వరూపత్రిదివప్రభృతిప్రకటప్రదేశ (యజ్ఞ 830)

సీ॥ శ్రుతినిందన మధీతశ్రుతిపరిత్యాగంబు (యజ్ఞ-871)

చ॥ పండితునకునన్న లోకప్రకటీకృతసంసృతిదోషదుఃఖ (యజ్ఞ-890)

కం॥ చేసినఁ బ్రణవంబు భక్తిఁ జేసిన పరశ్రద్ధా సంగతి (యజ్ఞ-907)

వీని యందు రేఫఘటితసంయుక్తాక్షరములకు ముందున్న యక్షరములు లఘువులుగా వాడఁబడినవి. ఇట్టి వానిని గొందఱు ప్రయోగించుచున్నారు గాని దీని వలనఁ బద్యముల నడక కుంటుపడును. అందువల్లనే వృత్తరత్నాకరటీకలో నారాయణపండితుఁడు 'తాన్మృతా నపి క్రవ్యాదాః' 'ఏతచ్ఛ్రుత్వా గదితో మయా త్వమ్' 'తవ హ్రియాపహ్రియా మమ హ్రీరభూత్' 'ధనమ్ ప్రదానేన శ్రుతేన కర్ణౌ' మొదలగు కవిప్రయోగము లుదాహరించి చివరకు "ఇదం చ మహాకవిప్రయోగదర్శనే భవతి, న తు స్వేచ్ఛయా" అని హెచ్చరించినాఁడు.

కం॥ పదియాఱుక్రోసుల పొడ
వది పదియార్క్రోసు వెడఁద యగు (ముక్తి-191)

ఇందు 'క్రో' కు ముందున్న 'ఱు' గురువుగా వాడఁబడినది గాని యది గురువు గాదు.

ఆ॥వె॥ అంధ్రికృతుల మాట కాదివర్ణము క్రింద, సూఁదఁబడని జడ్డ యుండె నేని
వాని యెడమ నున్న వ్రాలు నందును గూడి, గురువు అనుచు గణము గూర్ప వలదు.
(అప్ప-4-53)

అని యప్పకవీయము. 'పదియాఱుంగ్రోసులు' అని యుండవలయును.

కం॥ తొంబది యా అంగుళమ్ము
అం బొడవగు తనువు స్వాంగులమ్ముల కొల (జ్ఞాన-169)

ఈ కందము నడక సరిగానే యున్నది గాని మొదటి పాదములో మూఁడవ గణముగా జగణము గలదు. కందములో బేసి జగణముంచుట దోషము.

కం॥ కందము త్రిశరగణమ్ముల, నందును గాభజసనలము లైదునె గణముల్
పొందుసు న్బేసి నలజము, లొందుం దుది గురువు జగణ మొప్పదు బేసిన్.

అని కవిజనాశ్రయము. గోపీనాథవెంకటకవి శ్రీకృష్ణజన్మఖండములో

కం॥ సర్వేశ్వర సర్వరూప, సర్వోత్తమ సర్వబీజ సర్వాధారా
సర్వజ్ఞ సర్వవందిత, సర్వాతీత నిను భక్తి సన్నుతి సేతున్.

అను కందపద్యములో బేసి జగణము గలదు. ఇందు మొదటిపాదము సరిగా నడచు చున్నను గణములు సరిగా లేవు. నాల్గవ పాదమున గణములు సరిగా నున్నను నడక సరిగా లేదు. నడక బాగున్నను గణములు సరిగా లేనిచో లాక్షణికు లొప్పరు గణములు సరిగా నున్నను నడక కుంటిన యెడల నాలంకారికు లంగీకరింపరు. కాన మాత్రాగణబద్ధములగు దేశీయచ్ఛందము లుపయోగించునపుడు కవి మిక్కిలి జాగరూకుఁడై యుండవలయును.

## వ్యా క ర ణ వి శే ష ము లు.

1) కం॥ ప్రాయశ్చిత్తానేకో
పాయములఁ 'బునీతుఁ' డైన వాఁడు. (జ్ఞాన-88)

చ॥ సకలమునున్ 'బునీత' మని శాస్త్రకృతాదరబుద్ధి నెంచుఁడీ. (యజ్ఞ-977)

పునీతశబ్ద మపాణినీయమైనను గొందఱు సంస్కృతకవులు, తెలుఁగు కవులు దీనిని బ్రయోగించుచున్నారు.

శ్లో॥ తథా పునీతా తమభిః పద్మై స్తవ (భాగ-8-18-31)
అని సంస్కృతభాగవతములో వ్యాసమహర్షియు

శ్లో॥ కాపాలిరూపసముపేతపునీతదృష్టే
శ్రీవజ్రశృంగవృషభాధిపతే! నమస్తే।

అని పాలకుర్కికి సోమనాథుఁడును సంస్కృతములో దీనిని వాడిరి.

చ॥ తత్క్షణమ కోటి పునీతులఁ జేయు వారలన్. (భాగ-3-552)

సీ॥ తపిలి ధరించి సద్యఃపునీతాత్ములై. (భాగ-3-557)

మ॥ ధరించితి గదా! యెన్నన్ బునీతాకృతిన్. (భాగ-3-570)

చ॥ పుణ్యతీర్థముల నొప్పఁ బునీతము సేయఁబూని (భాగ-4-929)

మ॥ పా। వనులై లోకములం బునీతములుగా (భాగ–10-2-1217)

అని పోతనగారు పునీతశబ్దమును వాడిరి. పరిష్కర్తలు 'పవిత్ర' శబ్దముగా దిద్దివేసిరి. అకాడమీ ప్రతి యందుఁ బునీతపాఠము లే గలవు

ఉ॥ నివ్వటిలంగ వారలు పునీతులఁ జేయుదు రెల్లలోకులన్. (పద్మ-5-74)

అని పద్మపురాణోత్తరఖండమున మడికి సింగనయు

ఉ॥ నేఁ డిది చేసియుండఁడు పునీతమతిన్ హయమేధ వేళ. (మునిశాప-80)

అని కల్పవృక్షములో విశ్వనాథవారును బ్రయోగించిరి.

2) సీ॥ బ్రహ్మ నారాధింపవలె బ్రహ్మవర్చోఽభి
లాషఁ డై యారోగ్యలక్ష్మిఁ గోరి (జ్ఞాన-97)

'బ్రహ్మహస్తిభ్యాం వర్చసః' (5-4-78) అను పాణినీయసూత్రముచే 'బ్రహ్మవర్చసాభిలాషుఁ' డని యుండవలయును.

శ్లో॥ బ్రహ్మవర్చసకామస్తు బ్రహ్మాణమ్ పూజయే న్నరః (జ్ఞాన-8-33)
అని మూలము.

సీ॥ బ్రహ్మ నారాధింపవలె బ్రహ్మవర్చస
లాలసుం డారోగ్యలక్ష్మిఁ గోరి. అన్నచో సరిపడును.

3) నీతుకు (జ్ఞాన-46); దిక్కుకు (జ్ఞాన-68); దైవతరాజుకు (ముక్తి-166)

సూ :– కువర్ణకంబు పరం బగు నపుడు కవిత్రయంబువారి ప్రయోగంబులం దక్కఁ దక్కిన మహాకవి ప్రయోగంబులందునుం గొన్ని యెడల నిగాగమంబు చూపట్టదు. (ప్రౌఢ-శబ్ద-19)

అను ప్రౌఢవ్యాకరణము ననుసరించి పై ప్రయోగములు సాధువులు.

చ॥ కనిన పదంబు ద్రిప్పఁగ జగత్పతి పద్మజుకైనఁ బాడియే. (నృ.పు. 2-28)

అని యెఱ్ఱనగారి నృసింహపురాణము.

4) నాశముకై (జ్ఞాన-133) గాజుకై (జ్ఞాన-171)

కం॥ రామాయణమును రచించి ప్రాచేతసుకై
అనున ట్లివి కై విభక్త్యంతములు.

5) కం॥ మూన్నాళ్ళు పేఁడిసీళ్లన్
మూన్నాళ్ళన్ పేఁడిపాలు మూన్నాళ్ళు ఘృష్టం
పున్నేయి. (జ్ఞాన-71)

సూ :– కొన్ని యెడల నవర్ణంబు పరంబగు నపుడు పూర్వపదాంత్యదకారంబు నకారంబగు. (ప్రౌఢ-సంధి-15)

అను సూత్రముచే 'మూన్నాళ్ళు, పేన్నీళ్ళు' అను రూపములు సిద్ధించును. 'మూన్నాళ్ళన్ పేన్నీళ్ళన్' అని వాడినచో నింకను జమత్కారముగా నుండెడిది.

సూ :— సమాసంబుల నదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళం బులు పరం బగు నపుడు నుగాగమంబగు (బాల-సంధి-25) అని సూత్రించి 'ఈ యాగమం బొకానొకచోట స్థిరంబు పరంబగుచోఁ గానంబడియెడి. — గరువపున్మరువు' అని సూరిగారు చెప్పుటచే 'సుష్ణంపున్నెయి' యనునది సాధువు

6) సీ॥ జడలండఁ గల యేటి పడఁతి మోమందమ్ము (ముక్తి-112)

సూ :— కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం దుకారంబున కచ్చుపరంబగు నపుడు నుగాగమంబునకు లోపంబునగు. (ప్రౌఢ-సంధి-10)

అని సూత్రించి ప్రౌఢవ్యాకర్త 'గోకుల మిల్లిలు' (హరి.పూ. 5—203); 'బచ్చింట' (పాండు-3-16); 'శిరసందము' (కళా—7—126) అను ప్రయోగములను జూపుటచే మోమంద మనునది సాధువు.

ఉ॥ ఏమందము మందయాన మొగమందము మీఋ నవారవిందమున్.

అని చేమకూర వెంకటకవి. (విజయ—1—149)

7) కం॥ రీతిం బాయని సంస్కృతి

నేతురు వాపంగ జగము నిచ్చలు మెచ్చన్. (యజ్ఞ—205)

కం॥ ద్యూతక్రీడకుఁ గొండొక నేతున్ (విరా-1-1-196) అను తిక్కనగారి ప్రయోగము నను సరించి యిట 'నేర్తు' రనుదానికి 'నేతు' రని ప్రయోగింపఁబడినది.

8) ఆ॥వె॥ జపించి పాపచయ మడంచవలయు. (యజ్ఞ-900)

సూ:— కవిత్రయేతరప్రయోగంబులం గొన్ని యెడల నిప్రత్యయాదులు పరంబు లగు నపుడు పకారం బించుకచ్చకారంబున కేసిఁ గానంబడదు. (ప్రౌఢ-క్రియా—16)

అను ప్రౌఢవ్యాకరణసూత్రముచే 'నడంప' ననుదానికి 'నడంచ' నని ప్రాసస్థానమున వాడఁబడినది.

ఇట్లే తక్కిన విశేషముల నెఱుంగవలయును.

## పరిష్కరణము — శేషపూరణము

మహాదేవకవి పుత్త్రు లగు శ్రీబుద్ధవరపు భాస్కరరావుగారు, డా॥ శ్రీవేమవరపు వెంకట రమణశర్మగారు మా యింటికి వచ్చి కవిగారి ధర్మపత్ని శ్రీ బుద్ధవరపు మంగాయమ్మగారు సూతసంహితను సత్వరముగాఁ బ్రకటింపవలయు నని కుతూహలపడుచున్నా రనియు, గ్రంథ ముద్రణమునకు శ్రీతిరుమల తిరుపతి దేవస్థానమువారు ద్రవ్యసాహాయ్యము చేయుచున్నా రనియుఁ జెప్పి గ్రంథమును బరిష్కరింపవలయు నని వ్రాఁతప్రతులను నా కిచ్చిరి. ఈ సూతసంహితను బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు పరిష్కరించినచో సముచిత ముగా నుండునని నేను దలంచితిని కాని యస్మద్గురుతుల్యులగు వెంపరాల వారు కూడ వార్ధక ములోఁ దా మీపని చేయఁజాల మని చెప్పి పరిష్కరణభారమును నాపైఁ బెట్టిరి. ఈగుర్వా జ్ఞను మిత్రాజ్ఞను శిరసా వహించి భగవంతునిపై భారము వేసి దుష్కరమగు నీగ్రంథ పరి ష్కరణమునకు నేను బూనుకొనుట తప్పనిసరి యైనది.

ఈసూతసంహితకు 3 వ్రాతప్రతులు గలవు.

(క) మహాదేవకవి స్వయముగా వ్రాసినది. 4 సంపుటములు. మొదటి సంపుటము జ్ఞాన యోగఖండము. 18-1-38 నాఁడు ప్రారంభము. 23-10-39 నాఁడు ముగింపు. రెండవ సంపుటము ముక్తిఖండము. 22-12-39 నాఁడు ముగింపు మూఁడవ సంపుటమునందు యజ్ఞవైభవఖండములోని 1–21 అధ్యాయములు, నాల్గవ సంపుటములో 22-41 అధ్యాయములు గలవు. 42-45 అధ్యాయములు పొడవు కాగితములపై వ్రాయఁబడినవి. అసమగ్రము. "నదనద్యాదిసమస్తరూపముగ..." (372 పుట) అను మత్తేభముతో నీగ్రంథము ముగియుచున్నది.

(ఖ) మహాదేవకవి పుత్త్రిక యగు డా॥ శ్రీమతి సీతామహాలక్ష్మి, M. A., Ph. D. గారు వ్రాసినది. ఈమె జ్ఞానయోగ-ముక్తిఖండములకు నకలుప్రతిని వ్రాసిరి గాని యజ్ఞవైభవఖండమును వ్రాయలేదు

(గ) మహాదేవకవిపుత్త్రులగు శ్రీభాస్కరరావుగారు మఱియొక ప్రతిని 7 సంపుటములుగా వ్రాయించి ఛాయాముద్రణప్రతిని (xerox copy) గూడఁ దీయించిరి. ఇందు జ్ఞానయోగ ముక్తిఖండములు యజ్ఞవైభవఖండములో 1–21 అధ్యాయములు గలవు. వీరు కూడ 22-45 అధ్యాయములను విడిచిపెట్టిరి.

మహాదేవకవి గ్రంథములను రచించుటలో వహించిన శ్రద్ధను వానిని ప్రకటించుటలోఁ గాని లేక వానికి శుద్ధప్రతులు వ్రాసి భద్రపఱచుటలోఁ గాని చూపలేదు. మహాదేవకవి ప్రతి మిక్కిలి శిథిలావస్థలో మన్నది. కొట్టివేఁతలు దిద్దుపాటులు మిక్కుటముగాఁ గలవు. కొన్ని చోట్ల నక్షరములు చెరిగిపోయినవి. కొన్ని చోట్లఁ గాగితములు చిరిఁగిపోయినవి. కొన్ని పద్యపాదములు పోయినవి. యజ్ఞవైభవఖండము నందలి 22-41 అధ్యాయములకుఁ బ్రత్యంతరము లేదు. చి॥ కంభంపాటి సత్యనారాయణమూర్తి చే దీని కొక ప్రతిని వ్రాయించితిని. 42-45 అధ్యాయములు గల పొడవు కాగితములు క్రిమిదష్టములై నిలువుగా రెండు ముక్కలుగా విడిపోయినవి. ఈముక్కలను జేర్చి పద్యములను గూర్చుట క్రిదష్టస్థలములందుఁ బదముల నూహించుట మిక్కిలి కష్టమైనది.

ఇట్లీ మూఁడు ప్రతుల నాధారము చేసికొని సంస్కృతమూలముతో సరిచూచి శుద్ధప్రతిని ముద్రణమునకు సిద్ధము చేసితిని. వ్రాఁతప్రతిలోఁ గల యక్షరదోషములను రేఫశకటరేఫములను, అర్ధబిందువులను సవరించుట తప్ప మహాదేవకవి రచనలోని పదప్రయోగములను మార్పు చేయలేదు. అది పరిష్కర్త పని కాదు. ఇఁక సూతసంహితలోని మొదటి ఖండమగు శివమాహాత్మ్యఖండము మహాదేవకవి యాంధ్రీకరించినది యెంత ప్రయత్నించినను లభింపలేదు. ఆరంభఖండమగుటచే దీనిని నేను రచించితిని. అట్లే యజ్ఞవైభవఖండములో 45వ యధ్యాయమునందు "నదనద్యాదిసమస్తరూపముగ" (పుట 372) అను పద్యము వఱకే మహాదేవకవి గ్రంథము లభింపఁగా "వ॥ కావున మహర్షులారా!" యను వచనము మొదలుకొని 45-46-47 అధ్యాయములను బూరించితిని. ఈశేషపూరణము నందలి గుణదోషములకు సహృదయులగు పాఠకులే ప్రమాణము. ఇట్లు యథాశక్తిగా నీసూతసంహితను

బరిష్కరించితిని. వ్రాఁతప్రతులను మూలముతో సరిచూచుట, శేషభాగములను బూరించుట, ముద్రణమును సరిచూచుట నే నొక్కఁడనే చేయవలసివచ్చుటచే నిందుఁ గొన్ని తప్పులు పడినవి. దీనికిఁ దోడు సీసకాక్షరముల తలకట్లు చిదిగిపోయినవి. కావునఁ బాఠకమహాశయులు వానిని సవరించుకొని పఠింపఁ గోరుచున్నాను.

ఇట్లే నేను రచించిన శివమాహాత్మ్యఖండములోఁ గూడ ననేకదోషములు దొరలియుండును. ఉండును గాదు ... ఉన్నవి.

శా॥ వ్యాసున్ బైలఁడు గొల్చి ఋక్శ్రుతి నథర్వంబున్ సుమంతుర్షి (శి.మా -48)

'సుమంతుర్షి' యనుచోట సుమంతు శబ్దము కారాంత మగుటచే గుణము వచ్చుట శాస్త్రమునకు విరుద్ధము. బహ్వృచశబ్దము వలెనే యణాదేశము వచ్చి 'సుమంత్వృషి' యని యగుట శాస్త్రసమ్మతము. కావున నిచ్చట

శా॥ వ్యాసున్ బైలఁడు గొల్చి ఋక్శ్రుతి నథర్వంబున్ సుమంతుండు
అని పఠింపవలయును. ఇది శాబ్దిక మగు దోషము.

వ॥ సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వఱకునుగల యఱువది గడియలు కాలంబు (శి మా. 180) సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వఱకు ముప్పది గడియలకాల మగును గాని యఱువది గడియల కాలము గాదు. కావున నిచ్చట "సూర్యోదయము నుండి సూర్యోదయము వఱకు" నని పఠింపవలయును. ఇది యార్థికమగు దోషము. ఈరెండు దోషములను నాకుఁ దెలియఁ జెప్పిన బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారికి సర్వదా కృతజ్ఞుఁడను. ఇట్లే సహృదయులగు పాఠకులీ గ్రంథము నందలి దోషములను సూచించినచో ద్వితీయముద్రణము నందు సవరింపఁ గలను.

ఈ సూతసంహితలోఁ గల నాల్గు ఖండములలో యజ్ఞవైభవఖండము మిక్కిలి పెద్దది. ఇది పూర్వోత్తరభాగములుగా విభజింపఁబడినది. పూర్వభాగము నందు 47 అధ్యాయములు గలవు. ఉత్తరభాగమునందు బ్రహ్మగీత—సూతగీత యను రెండు గీతలు 20 అధ్యాయములలోఁ గలవు. మహాదేవకవి పూర్వభాగమును దెనిఁగించి యుత్తరభాగమును విడిచి పెట్టెను. దీని కొక కారణము గలదు. ఈరెండు గీతలు నుపనిషదనుసారముగా నద్వైతవేదాంతమును బ్రతిపాదించుచున్నవి. భగవద్గీతపై శంకరభాష్యము వలె నీగీతలపైఁ దాత్పర్యదీపిక విస్తరముగాఁ గలదు. వ్యాఖ్యను జోడింపనిచో మూల మవగతము గాదు. సవ్యాఖ్యానముగా ననువదించినచో గ్రంథము పెరుగును. మఱియు నిట్టివి రహస్యవిద్య లగుటచే జిజ్ఞాసువులు వ్యాఖ్యలతో మూలమునే పఠింతు రని మన తెలుఁగుకవు లిట్టి వానిని విడిచిపెట్టిరి. ఈదృష్టితోనే తిక్కన భగవద్గీతను సంగ్రహముగా ననువదించెను. తిక్కన భగవద్గీతను విడిచిపెట్టుటను గూర్చి విమర్శకులు తలకొక విధముగాఁ దలంచుచున్నారు. కొందఱు భగవద్గీత మిక్కిలి కష్టమైన గ్రంథ మగుటచే ననువదించుట యసాధ్య మని యెంచి తిక్కన విడిచి పెట్టె నని భావించుచున్నారు. కాని శాంత్యానుశాసనికపర్వములను సుందరముగా ననువదించిన కవిబ్రహ్మ సామర్థ్యము లేక గీతను విడిచిపెట్టుట వట్టి కల్ల.

## తిక్కన భగవద్గీతను ప్రక్షిప్తముగా భావించెనా?

చాగంటివారు తరంగిణిలో "సనత్కుమారగీత యుత్తరహిందూదేశప్రతుల యందే గాని, దక్షిణహిందూదేశప్రతుల యందు లేవని పండితులు వ్రాసి యున్నారు. అందుచేతనే తిక్కన భారతమునం దవి లేవు అట్లే భగవద్గీతారహితమైన భారతమే తిక్కనకు లభించిన దని తలంచుట కవకాశ మున్నది. యుద్ధారంభదినమున నుభయసేనామధ్యమున రథముపై నిలువఁబడి చూచినప్పు డర్జునునకుఁ దాను జేయఁబోవు గురువృద్ధబంధుజనవధకార్యము హృదయమునకుఁ దట్టి విషాదము గలిగి యుద్ధవిముఖుఁ డగుటయుఁ గృష్ణుఁ డాతని కాసమయమున జ్ఞానము నుపదేశించుటయు గీతయొక్క ప్రధానోద్దేశము. భారతమునం దిప్పు డున్న పదునెనిమిది యధ్యాయముల గ్రంథము నప్పుడు జరిగిన దని తలంపరాదు. ఆగ్రంథమును జదువుట కదమము రెండు దినములు పట్టును. అంతకాలము యుద్ధము మాని వారు భగవద్గీతావిషయములను జర్చించుచుఁ గూర్చుండి యుండ లేదు. శ్రీకృష్ణభగవానుఁ డర్జునుని మూఢత్వమును బోఁగొట్టుటకై తగిన మాటలను జెప్పి విశ్వరూపమును జూపి రెండు మూఁడు ముహూర్తముల కాలములో నాతనిని రణోన్ముఖుని జేసి యుండునని తలంప వలసి యుండును. భగవద్గీత ప్రక్షిప్తమని నే ననుట లేదు". (క.త. 2 సం. 188 పుట) అని చెప్పుచున్నారు.

ఇది చింత్యము. నన్నయభట్టారకుఁడు భారతారంభములో భగవద్గీతను బేర్కొనెను. భగవద్గీతకు భాష్యములు రచించిన మతాచార్యు లందఱు దాక్షిణాత్యులు. శంకర-భాస్కర-రామానుజ-శ్రీకంఠ-మధ్వాచార్యులు రచించిన గీతాభాష్యములు తిక్కన నాఁటికే ప్రసిద్ధములు. అట్టి స్థితిలోఁ దిక్కనకు లభించిన భారతములో గీత లేకుండుట గాని తిక్కన వంటి మహాపండితుఁడు ప్రక్షిప్తమని తలంచుట గాని యసంభవము. భగవద్గీత 700 శ్లోకముల గ్రంథము. గీత నర్థము చేసికొనుటకుఁ గొన్ని జన్మములు పట్టునను విషయములో విప్రతిపత్తి లేదు గాని దానిని బూర్తిగాఁ జదువుటకు రెండు మూఁడు గంటల కాలము చాలును. 140 శ్లోకములలోఁ గల విష్ణుసహస్రనామములను శ్రీసుబ్బులక్ష్మిగారు 20 నిమిషములలో స్పష్టముగా మధురకోమల కంఠముతో గానము చేయుట లోకవిదితమే గదా! శ్రీకృష్ణుఁడు భగవద్గీతను శ్లోకములలో నర్జునునకు బోధింప లేదు. ఆగీతాచార్యుఁ డుపదేశించిన విషయములను యథాతథముగా మన కవగతమగు నట్లు వివరించుటకు వ్యాసమహర్షి 700 శ్లోకములను రచించెను. ఈవిషయమునే శ్రీశంకరభగవత్పాదాచార్యులు "తం ధర్మమ్ భగవతా యథోపదిష్టం వేదవ్యాసః సర్వజ్ఞో భగవాన్ గీతాఖ్యైః సప్తభిః శ్లోకశతై రుపనిబబంధ" యని భాష్యారంభములోఁ జెప్పుచున్నారు. ఒక విషయమును జెప్పుట వేఱు. దానిని గ్రంథముగా రచించుట వేఱు. మఱియు నొక విషయమును బోధించుటకుఁ బట్టు కాలము వక్తృశ్రోతలపై నాధారపడి యుండును. భగవద్గీతకు వక్త యగు శ్రీకృష్ణపరమాత్మ శ్రోత యగు నర్జునుఁడు నవతారపురుషులు కావున భగవద్గీత యందలి విషయముల నన్నింటిని జర్చించుటకు వారి కాసమయము చాలి యుండును. ఇక్కడ శేషయ్యగారి "భగవద్గీత ప్రక్షిప్తమని నే ననుట లేదు. కథాసందర్భమున నడుమ నడుమ రచింపఁబడిన వాక్యములను బట్టి భగవద్గీత యంతయుఁ దిక్కనయొద్దఁ గల దనియు రసభంగ మగు ననియో మఱి యేకారణముననో దీనిని బూర్తిగా నాంధ్రీకరింప నిష్టము లేక విడిచిపెట్టెననియు గోచరించుచున్నది". అని వాక్యములు మెచ్చఁదగినవి.

పింగళివారు సాహిత్యచరిత్రలోఁ దిక్కన తన యనువాదప్రణాళిక కనుగుణముగ గీతను సంగ్రహించె నని చెప్పుచున్నారు. ఇది కొంత సమంజసముగానే యున్నది.

ఆంధ్రసాహిత్య అకాడమీవారు ప్రకటించిన కర్ణపర్వమునకు మరుపూరు వారువ్రాసిన పీఠికలో నసంబద్ధములగు వాక్యములు లెక్కకు మిక్కిలిగాఁ గలవు.

"ఇంతటి ప్రశస్తిని గనిన గీతను, ఈపేరుతో పర్వసంగ్రహము గాని అనుక్రమణిక గాని పేర్కొనవు నన్నయ తెనుగునేత గూడ చెప్పదు ... శ్రీవివేకానందస్వాములవారు— గీతను ఆదిశంకరభగవత్పాదుల వారే వ్రాసి తన మతవ్యాప్తికి ఘనతకు అధికారికముద్ర లభించుటకు కృష్ణునిపేర బెట్టి భారతము లోనికి చొప్పించి అతికివేసినారు. (Foisted into the body of Maha Bharata) అనే వాదమును కాదనరైరి. (అలంబజారు మార్చి-1897) గీతాభాష్యములకు మూల మని చెప్పబడే బోధాయనవ్యాఖ్య దేశంలో తన కెక్కడా కనిపించ లేదని, రామానుజాచార్యుల వారు చూచినది శిథిలప్రతి అని చెప్పికొనినను, ఎందుకు దాని ప్రతి వ్రాయించ లేకపోయినా రని సందేహించి శ్రీవివేకానందుల వారు చెప్పు చున్నారు. ఈపని జరిగిన తర్వాతనే—అనగా శంకరుని తర్వాతనే (క్రీ శ. 788–820) గీతకు ప్రాశస్త్య మబ్బిన దని అంటారు స్వామీజీ. భగవద్గీత పేరు, యీ వేదాంతము తిక్కన నాటికి వ్యాప్తిలో నున్నట్లు లేదు. (అవతారిక-17,18 పుటలు)

ఇవి యన్నియు రెడ్డి గారి ప్రతారకవాక్యములు గాని యదార్థములు గావు. నన్నయ భట్టు పర్వానుక్రమణికలో 'సనత్సుజాతంబును' 'భగవద్గీత' ను (ఆది-1.33) పేర్కొని మఱలఁ బర్వసంగ్రహములో "ధృతరాష్ట్రునకు మనస్తాపోపశమనంబుగా సనత్సుజాతు డధ్యాత్మకథలు చెప్పుటయు" (ఆది-1-43); "వాసుదేవుండు మోక్షపర్మన హేతువులం జెప్పి యర్జును మోహభ్రాంతిఁ జెఱచుటయు" (ఆది–1–45) అని వానిని వివరించినాఁడు.

ఇఁక శ్రీవివేకానందస్వామి వాక్యములను బరిశీలింతము. 1897 లో నాలంబజారులో స్వామి శిష్యులకు భగవద్గీతను బోధించు సందర్భములో నీవిధముగాఁ జెప్పెను.

"మఱియొక విషయము: శంకరాచార్యుడు గీతపై గొప్ప భాష్యమును వ్రాసి దానికి ప్రసిద్ధి చేకూర్చుటకు ముందు, భగవద్గీతను గుఱించిన జ్ఞానము సామాన్యప్రజల కెక్కువగ లేదు. అంతకు చిరము పూర్వము గీతపై బోధాయనవ్యాఖ్య ప్రచారములో నుండెనని పలు వుర నమ్మకము. ఈవిషయమును రుజువుచేయగలిగినచో గీత పురాతనత్వమును, వ్యాసుని తత్కర్తృత్వమును చాలవఱకు నిరూపిత మగు ననుటకు సందేహము లేదు. రామానుజుఁడు బ్రహ్మసూత్రములకు తాను వ్రాసిన శ్రీభాష్యమున ఏబోధాయనభాష్యము ననుసరించెనో, శంకరాచార్యుఁడు పైతము ఏబోధాయనభాష్యమును పేర్కొనుటే కాక అందుండి ఉదాహరణ ములను పైతము అక్కడక్కడ చూపి యున్నాడో, ఏబోధాయనభాష్యమును గూర్చి దయా నందస్వామి అంత గొప్పగా చర్చించెనో — ఆబోధాయనభాష్యగ్రంథపుప్రతి ఒక్కటైనను భరతదేశ మందంతటను పర్యటించినను నాకు కనబడలేదు. శ్రీభాష్యమును వ్రాయు నప్పుడు రామానుజునకు లభించిన బోధాయనవృత్తి ప్రతి కూడ చెదలు తినివేసిన ప్రతి యట. గొప్ప దగు బోధాయనుని వేదాంతసూత్రభాష్యమే యింతటి సందిగ్ధాంధకారమున మఱుగుపడి యుండగా భగవద్గీతపై గూడ నతని భాష్య ముండెనని నిరూపింప ప్రయత్నించుట వ్యర్థము

శ్రీశంకరాచార్యుడే గీతాకారు డని, అతడే దానిని మహాభారతములో చొప్పించె నని కొందఱి యూహ". (సంపూర్ణ గ్రంథావళి-సం. 3-328 పుట)

స్వామి తన యుపన్యాసములలో గ్రంథములలో మాటిమాటికి పరమప్రమాణముగా నుదాహరించిన గ్రంథరత్నము భగవద్గీత. ఇక్కడ శంకరభాష్యము పుట్టువఱకును గీత ప్రచారము గాంచ లేదని మొదటి వాక్యమునకు భావము. చివరి వాక్యములోఁ 'గొందఱి యూహ' యను మాటలే యది స్వామి యభిప్రాయము గాదని వెల్లడించుచున్నవి. భగవ ద్రామానుజాచార్యులు శ్రీభాష్యప్రారంభములో "భగవద్బోధాయనకృతాం విస్తీర్ణామ్ బ్రహ్మసూత్రవృత్తిమ్ పూర్వాచార్యాః సంచిక్షిపుః। తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యంతే।" అని చెప్పినారు. అట్లే శ్రీనీలకంఠారాధ్యపాదులు గీతాభాష్యప్రారంభములో —

శ్లో॥ బోధాయనాది మున్యుక్తశ్రౌతశైవావలంబినా।
చిదచిచ్ఛక్తిసంయుక్తశివాద్వైతప్రబోధినా॥
నీలకంఠశివారాధ్యసమాఖ్యేన మయాధునా।
తత్త్వామృతాకరాఖ్యేన భాష్యరత్నేన భాష్యతే॥

అని చెప్పుచున్నారు. దీనిని బట్టి బోధాయనమహర్షి బ్రహ్మసూత్రములకు భగవద్గీతకు వ్యాఖ్యలు రచించినట్లు తెలియుచున్నది. కాని యవి నేఁడు లభించుట లేదు. ఈ విషయమునే స్వామి పైసందర్భములో వెల్లడించెను.

శ్రీబోధాయనమహర్షి గృహ్యశేషసూత్రములో —

శ్లో॥ ప్రచ్ఛాద్య తు తృణైః శుద్ధై ర్దూర్వాభిశ్చ విశేషతః।
విష్ణో ర్నామసహస్రం వా శైవం వాపి తథా జపేత్॥

'దేశాభావే ద్రవ్యాభావే సాధారణే కుర్యా న్మనసా ధ్యాయే దితి। తదాహ భగవాన్—

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహమ్ భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥
(భ. గీ. 9-26; బో. గృ. శే. 2-22-9)

అని విష్ణుసహస్రనామములను, శివసహస్రనామములను భగవద్గీతను పేర్కొనెను. పాణినిమహర్షి "పారాశర్యశిలాలిభ్యామ్ భిక్షునటసూత్రయోః" (4-3-110) అను సూత్రములో బ్రహ్మసూత్రములను పేర్కొనెను. పాశ్చాత్యచారిత్రికులు, తత్పృష్ఠగాములగు భారతీయ చారిత్రికులు నిర్ణయించిన పాణినిబోధాయనశంకరాదుల కాలములు సరియైనవి గావు. పాణిని మహర్షి కాలము క్రీ. పూ. 2900. బోధాయనాదిసూత్రకారుల కాలము క్రీ. పూ. 2500. శ్రీశంకరభగవత్పాదుల కాలము క్రీ. పూ. 509-477. అధికము మదీయమహాభారతకంటకోద్ధారమునం దనుసంధేయము.

పారిస్ పట్టణములో 1900 సంవత్సరములో జరిగిన మతచరిత్రకారుల సమావేశసభలో స్వామి యిచ్చిన యుపన్యాసమును బత్రిక లిట్లు పేర్కొనినవి.

"బుద్ధుని పూజ కంటె శ్రీకృష్ణుని పూజ ప్రాచీనమైన దని శ్రీవివేకానందస్వామి వచించెను. మహాభారతరచన, భగవద్గీతారచన ఒకేనాటిది కాదనినచో నిశ్చయముగా భగవద్గీత మహాభారతమునకు పూర్వపుదే గాని ఎంతమాత్రమును తరువాతిది గాదు. గీతలోని భాషాశైలి

మహాభారతములోని భాషాశైలి ఒకటే అధ్యాత్మికభావములను వివరించుటకు గీతలో ప్రయోగింపబడిన విశేషణము లనేకములు మహాభారతములోని అరణ్యపర్వము. తదితర పర్వము లందు ప్రాకృతభావప్రకటనములందు ప్రయోగింపబడినవి. ఆపదములు ఒకే కాలములో ధారాళముగను విస్తృతముగను వ్యవహార మందున్నగాని అంతటి సామ్యము సాధ్యము గాదు. గీతలోని భావక్రమము, భారతము లోని భావక్రమము ఒక్కటే గీత సమకాలిక మతశాఖ లన్నిటి సిద్ధాంతములను గమనించి యుండగా బౌద్ధమతము నేల పేర్కొనదు?" (వి.సం గ్రం. 6 సం-౯61 పుట).

He described the Vedas as the common basis of both Hinduism and Buddhism, and held that both Krishna and the Bhagavad Gita were prior to Buddhism.
(Vivekananda : A Biography : Page 305)

ఇట్లు శ్రీవివేకానందస్వామి భగవద్గీత భారతాంతర్గత మని నొక్కి వక్కాణించుచుండ రెడ్డిగారు స్వామి వాక్యములకుఁ దమ యభిప్రాయములను జోడించి యుదాహరించుట పాఠకు లను వంచించుట యగును.

"మన ప్రాచీనకవులు ముఖ్యముగా పోతన కన్నడపంపఁడు తమ నాటి వాడుకభాషనే ఉపయోగించినారు ... ... ఇక ఆనాటి తిక్కన తెనుగు ఈనాడు అందరికి తెలియకపోయిన దానికి కారణం — ఆవాడుకభాష మారిపోవుటే". (అవతారిక-77)

ఇదికూడ రెడ్డిగారి యూహాగానమే గాని వాస్తవము గాదు. తిక్కన గాని, పోతన గాని, కన్నడకవులు గాని తమ గ్రంథములలో స్వచ్ఛగ్రాంథికభాషనే ప్రయోగించిరి గాని వాడుకభాషను వాడ లేదు. గ్రాంథికభాష యానాఁడు నీనాఁడు నొకవిధముగానే యున్నది. తిక్కన భారతభాష యర్థము కాని దుస్థితికి మన తెలుఁగుజాతి యింకను దిగజారలేదు. క్షణ క్షణము మారు శీలము గలది గావుననే వ్యావహారికభాషను గ్రంథములలో వాడవలదని పైయాకరణు లుద్ఘోషించుచున్నారు. వ్యాకరణములు రచించి తెలుఁగువారి కొక దారి చూపిన నన్నయ-చిన్నయలపై ధ్వజ మెత్తి మన మాతృభాష కూడ సరిగా రాని హీనస్థితిలో మనమున్న ప్పుడు తిక్కన పోతన లేమి చేయఁగలరు? తెలుఁగు వారికి భాషావిషయములోఁ బరమప్రమాణమైన శ్రీమదాంధ్రమహాభారతము నందలి కర్ణపర్వమునకు రెడ్డిగారు గ్రామ్యభాషలో నవతారికను వ్రాసిరి. ఇం దుదాహరింపఁబడిన తిక్కనగారి పద్యములలోని యర్థబిందువులను దొలఁగించుటకు రెడ్డిగారి కేమి యధికారము గలదు? అర్థబిందుశకటరేఫములు, యతిప్రాసములు నాంధ్రభాషాయోష కమూల్యాలంకారములు. అం దర్ధబిందువు త్రిలింగసరస్వతి ముక్కునకు ముంగర వంటిది. స్వచ్ఛగ్రాంథికభాషలో రచింపఁబడిన ప్రాచీనగ్రంథములకు గ్రామ్యభాషలో నవతారికలు వ్రాయుట ప్రాచీనకవులను అభూకరించుట. అర్థబిందువులను దొలఁగించుట తెలుఁగుతల్లి నవమానించుట.

"ఈగ్రంథములను సూతులు ప్రచారము లోనికి దెచ్చి వ్యాపింప జేసినారు. సూతులు బ్రాహ్మణస్త్రీకి క్షత్రియునికి బుట్టినవారు. వీరు రథకారకవృత్తితో బాటు పౌరాణికులుగా గూడ నుండిరి". (7 పుట)

ఇదంతయు రెడ్డిగారి మేధాసంపత్తి విలసనమే గాని నిజము గాదు.

"విప్రాయాంక్షత్రియా జ్జాతః సూత ఇత్యుచ్యతే బుధైః" (శి.మా.12-18) 'క్షత్రియు నకు-విప్రకాంతయందు జనించిన వాఁడు సూతుండగు' (శి.మా.-281)అని యీసూతసంహితయే చెప్పుచున్నది. కాని సూతమహర్షికి సూతజాతికి సంబంధము లేదు. "ఉగ్రశ్రవాస్తు సౌతి రేవ న జాతిసూతః। తథాత్వే తత్రాపి సూతశబ్దప్రయోగోపపత్తే స్సౌతి రిత్యపత్యార్థస్య తద్ధితస్యా నర్థక్యం స్యాత్ ...... పౌరాణికపదం న జాతిసూతపర మపితు పురాణాధ్యేతృబ్రాహ్మణపర మితి।" అని నీలకంఠవ్యాఖ్య. ఇక్కడ సూతశబ్దము జాతివాచకమే యైనచో సూతుని కొడుకు కూడ సూతుఁడే యగును గాని సౌతి గాఁడు. సూతమహర్షి యగ్నికుండసముద్భూతుఁ డని కాశీఖండము చెప్పుచున్నది. అధికము బాలవ్యాస శ్రీవారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి గారి మహా భారతతత్త్వకథనమునం దిమసంధేయము. ఈ ప్రసంగము నింతటితోఁ జాలించి ప్రకృతము ననుసరింతము.

సకలశాస్త్రపారంగతుఁడు విశేషించి యద్వైతవేదాంతనిష్ణాతుఁడు నగు తిక్కన మహాకవి నన్నయగారి పర్వానుక్రమణికను బరిశీలింపకుండుట గాని, భగవద్గీతను బ్రక్షిప్త మని తలంచుట గాని ముక్కాలుమువ్వీసము నసంభవము ఇక్కడ రహస్యమేమన శ్రీశంకరభగవత్పా దులు భాష్యములు రచించిన ఘట్టములను దిక్కన సూచించియు సంగ్రహించియు విడిచిపెట్టెను. భగవత్పాదులు మహాభారతమునందలి సనత్సుజాతీయ-భగవద్గీతా-విష్ణుసహస్రనామములకు భాష్య ములను రచించిరి.

తిక్కన యుద్యోగపర్వములో 4 అధ్యాయములలోఁ గల సనత్సుజాతీయమును 'సనత్సు జాతుం డధ్యాత్మవిషయములగు వివిధవాక్యంబుల సోపానప్రకారంబున నంతకంతకు సూక్ష్మం బులగు నర్థంబులు సమర్థించుచు నందుఁ బ్రజ్ఞాచక్షుం డెయ్యది యేర్పడ నడిగె నది యెల్ల వివ రించుచు హృదయపుష్కరకలితంబగు పరతత్త్వంబు ప్రసాదించునట్టి గూఢోక్తులను గ్రహిం చుచుండ నెట్టకేలకుఁ బ్రభాతంబగుటయు ధృతరాష్ట్రవిదురుల నామంత్రణంబు చేసి యద్దేవ ముని యంతర్ధానంబునొందె నట్టి సమయంబున" (ఉద్యో-2-106) అని సూచించి విడిచెను. భీష్మపర్వమునందు 18 అధ్యాయములలోఁ గల భగవద్గీతను —

కం॥ పూనుగ ధర్మక్షేత్రం, బైన కురుక్షేత్రమున మహాహవమునకుం
బూని మన బలముఁ బాండవ, సేనయు నిటు వన్ని యేమి చేసెం జెపుమా॥
(భీష్మ-1-171)

అను పద్యము మొదలుకొని

తే॥గీ॥ అధిప యేగేశ్వరేశ్వరుం డైన కృష్ణుఁ, డును ధనుర్ధరవర్యుఁ డర్జునుఁడు నెచట
నిలిచి రచ్చట విజయంబు నీతి సిరియు, భూతి నిత్యంబు లగు నిది నాతలంపు
(1-231)

అని 61 పద్యగద్యములలో సంగ్రహించెను. అనుశాసనికపర్వము నందలి విష్ణుసహ స్రనామములను "అని పలికి 'విశ్వంబు విష్ణుండు వషట్కారుండు భూతభవ్యభవత్ప్రభు' వను వివి మొదలైన 'రథాంగపాణి యక్షోభ్యుండు సర్వప్రహరణాయుధుం' డనియెడు నివి తుదగాఁ

గల సహస్రనామంబు లుపన్యసించి" (అను-5-324) అని సూచించి విడిచెను. ఈ ఘట్టములను జిజ్ఞాసువులగు పాఠకులు శంకరభాష్యముల తోడనే పఠింతురని తిక్కన తలంపు. కూర్మ పురాణమునం దుత్తరభాగములో నీశ్వరగీతయు వ్యాసగీతయు నుండఁగా భమిడిపాటి వేంకట సుబ్రహ్మణ్యశర్మగారు పూర్వభాగమును దెనిఁగించి యుత్తరభాగమును విడిచి పెట్టిరి. అట్లే మహాదేవకవి కూడ యజ్ఞవైభవఖండోత్తరభాగమునందలి బ్రహ్మగీతా-సూతగీతలను విడిచిపెట్టి యుందురు. పాఠకుల కొఱ కీగీతల యందలి విషయములను సంగ్రహముగా వివరింతును.

బ్రహ్మగీత :—

ఇందు 12 అధ్యాయములు గలవు. 1వ యధ్యాయములో దేవత లందఱు వేదతత్త్వము నెఱుఁగుటకై బ్రహ్మలోకమున కేఁగుట, బ్రహ్మగీత నారంభించుట చెప్పఁబడినవి. 2వ యధ్యాయమగు వేదార్థవిచారములో వేదముల కన్నింటికి శివుని యందే తాత్పర్యమని చెప్పఁ బడినది. 3వ యధ్యాయములోఁ దైత్తిరీయోపనిషత్తు ననుసరించి శివస్వరూపము చెప్పఁబడి నది. 4వ యధ్యాయములోఁ దలవకారోపనిషత్తు ననుసరించి సాక్షిశివస్వరూపము చెప్పఁబడి నది. 5వ యధ్యాయమగు నాదేశకథనములో ఛాందోగ్యోపనిషత్తు ననుసరించి బ్రహ్మాత్మైక త్వము విస్తరముగా నిరూపింపఁబడినది. 6వ యధ్యాయములో మఱల ఛాందోగ్యశ్రుతి నను సరించి దహరోపాసనము వివరింపఁబడినది. 7వ యధ్యాయములో ముండకోపనిషత్తు ననుస రించి బ్రహ్మవస్తుస్వరూపము వివరింపఁబడినది. 8వ యధ్యాయములోఁ గైవల్యోపనిషత్తు ననుసరించి బ్రహ్మాత్మైక్య ముపదేశింపఁబడినది. 9వ యధ్యాయములో బృహదారణ్యకోపని షత్తు ననుసరించి బ్రహ్మానందస్వరూపము వివరింపఁబడినది. 10వ యధ్యాయములో మఱల బృహదారణ్యకశ్రుతి ననుసరించి యాత్మయే బ్రహ్మమని నిరూపింపఁబడినది. 11 వ యధ్యా యములోఁ గఠవల్లీశ్వేతాశ్వతరోపనిషత్తుల ననుసరించి బ్రహ్మముయొక్క సర్వశరీరస్థితి వర్ణింపఁబడినది. 12వ యధ్యాయమగు శివాహంప్రత్యయాశ్రయత్వకథనములో సకలోపని షత్తులకుఁ బ్రత్యగ్బ్రహ్మతాదాత్మ్యమునందే తాత్పర్యమని నిర్ణయింపఁబడినది. ఈ బ్రహ్మ గీత 1058 శ్లోకముల గ్రంథము.

సూతగీత :—

ఇందు 8 అధ్యాయములు గలవు. 1వ యధ్యాయములో గురునమస్కారపూర్వకముగా సూతగీత యారంభమైనది 2వ యధ్యాయములోఁ బశు పాశ—పతిస్వరూపము, ఆత్మము వలన సృష్టి, శివపారమ్యము బోధింపఁబడినవి. 3వ యధ్యాయములో సామాన్యసృష్టి వివరిం పఁబడి యద్వైతమే శ్రుతిసమ్మత మని చెప్పఁబడినది. 4వ యధ్యాయములో సృష్టి విశేషము గా నిరూపింపఁబడి జగత్తున కీశ్వరుఁడే కర్త యని చెప్పఁబడినది. 5 వ యధ్యాయములో నాత్మస్వరూపము చెప్పఁబడినది 6వ యధ్యాయమగు సర్వశాస్త్రార్థసంగ్రహములో మూర్తి ధ్యాన ముపదేశింపఁబడి శివస్వరూపమే ధ్యేయ మని చెప్పఁబడినది. 7వ యధ్యాయమగు రహస్యవిచారములో సర్వత్ర దేవతాబుద్ధి కలిగి యుండవలయునని చెప్పఁబడినది. 8 వ యధ్యాయమగు సర్వవేదాంత సంగ్రహములోఁ బరశివస్వరూపము, శమదమాదిసాధనసంపత్తి వ్యాల్లేఖమంత్రజపము చెప్పి మఱల నుపనిషత్తులకు నాగమములకు నద్వైతమునందే తాత్పర్య మని సిద్ధాంతము చేయఁబడినది. ఈ సూతగీత 458 శ్లోకముల గ్రంథము. ఈ రెండు గీతల యందు నుపనిషత్సిద్ధాంతములు, నద్వైతతత్త్వము విస్తరముగాఁ బ్రతిపాదింపఁబడుట

వల్లనే శ్రీశంకరభగవత్పాదాచార్యులు బ్రహ్మసూత్రభాష్యరచనాధికారసిద్ధి కీ సూతసంహితను బదునెనిమిది మాఱులు పఠించి యుందురు. వివిదిషువులగు పాఠకులు తాత్పర్యదీపికతో నీ రెండు గీతలను మూలమునందుఁ బఠింతురు గాక!

ఈ సూతసంహిత ముద్రణ మారంభించి యొక సంవత్సరము పైఁగా నైనను మహాదేవానుగ్రహమున నిప్పటికిఁ బూర్తి యైనది. ఇంత కాలము విలంబ మగుటకు ముఖ్యహేతువు

## శ్రీ వేమవరపు వేంకటరమణశర్మగారు (1918–1983)

హఠాన్మరణము నొందుట. వాల్మీకివ్యాసాది సంస్కృతకవులు గాని; నన్నయతిక్కనాద్యాంధ్రకవులు గాని; శంకరరామానుజాదిమతాచార్యులు గాని; హానెమాన్, కెంటు వంటి వైద్యశాస్త్రజ్ఞులు గాని చేసిన బోధల నర్థము చేసికొనుటకు మన మేధ చాలదు. కాని యట్టి లోకోత్తరపురుషులు మనకు బంధువులో మిత్రులో యైనచో నాయానందము పట్టుటకు మన హృదయము చాలదు. అల్పజనుల గోష్ఠి వలన మన బుద్ధులు సంకుచించి యజ్ఞానము పెరుగునట్లే మహాపురుషుల సాంగత్యము వలన మన హృదయములు వికసించి విజ్ఞాన మభివృద్ధి గాంచును. శ్రీలంక వేంకటరామసోమయాజులు గారు చతుర్వేదములు, షడంగములు, షడ్దర్శనములు పఠించుటయే గాక స్వయముగా యజ్ఞములు చేసి యితరులచే ననేకయజ్ఞములు చేయించిన పుణ్యపురుషులు. శ్రీవెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారు సంస్కృతాంధ్రవాఙ్మయాంభోధికుంభసంభవులు. శ్రీ వేమవరపు వేంకటరమణశర్మ గారు హానెమాన్ పండితుని యపరావతారము. ఈ ముప్పురు మహాపురుషుల సాంగత్యము లభించుట నాపురాకృతసుకృతము. శ్రీశర్మగారితో 1973 లో నాంధ్రమాఘకావ్యముద్రణసందర్భములోఁ బరిచయ మేర్పడినది. వీరు నలువది సంవత్సరములు హోమ్యోపతి వైద్యశాస్త్రరచనారూప మగు తపస్సు గావించి కొత్తపేటలో 'హానెమాన్' ముద్రణాలయము నెలకొల్పి హానెమాన్-కెంటు-నేష్ మొదలగు వారు రచించిన యుద్గ్రంథముల నాంధ్రీకరించి సుమారు 60 వైద్యశాస్త్రగ్రంథముల నాంధ్రుల కందించిరి. శర్మగారి తండ్రిగారగు శ్రీనాగభూషణరావు గారికి మహాదేవకవి మేనమామ. శర్మగారు 1931–34 సంవత్సరములలో రామచంద్రపురములో మహాదేవకవి గారి యింట నుండి విద్య నభ్యసించిరి. ఆ సమయము నందే మహాదేవకవి గ్రంథరచన గావించెను. కాని వారి గ్రంథము లెవ్వియుఁ బ్రకటింపఁ బడలేదు. మహాదేవకవి దివంగతులైన పిమ్మట వారి సాహిత్యము కూడ ఖిలము గాకుండఁ బ్రకటింపవలయు నని శర్మగారు మహాదేవకవి పుత్త్రులను బ్రోత్సహించిరి. తత్ఫలితముగా 1974 లో నాంధ్రమాఘకావ్యము వెలువడినది. అప్పటి నుండి మా మైత్రి దినదినాభివృద్ధి గాంచినది. శ్రీశర్మగారికి సాహిత్యములోఁ బరిచయ మైన నున్నది గాని నాకు వైద్యశాస్త్రములోఁ బ్రవేశము కూడ లేదు. శర్మగారికి సంగీత మన్నచో నెక్కుడ యిష్టము. ఆధునికగేయకవిత్వ మన్నచో నసహ్యము. నేను సాహిత్య విషయములను జెప్పినచో వారు శ్రద్ధగా వినెడి వారు. వారు నాకు హానెమాన్, కెంటు, నేష్ మొదలగు వారి జీవితవిశేషములను, గ్రంథవిశేషములను జెప్పుచుండెడి వారు. శ్రీమతి సుబ్బులక్ష్మి, వసంతకుమారి, రాధ, జయలక్ష్మి మొదలగువారి సంగీతమును మే మిద్దఱము నెక్కువగా వినుచుండెడి వారము. ఇట్లు శర్మగారి గోష్ఠిలో 10 సంవత్సరములు 10 నిమిష

ములవలెఁ గడచినని. 1982 వ సంవత్సరములో శ్రీశర్మగారు, మహాదేవకవి పుత్త్రులగు శ్రీభాస్కరరావుగారు, శ్రీవెంపరాల వారి యనుమతిపై సూతసంహితాపరిష్కరణభారము నా కొప్పగించిరి. 1982 నవంబరులో సూతసంహితాముద్రణ మారంభమైనది. 8-1-1983 నాఁడు శ్రీశర్మగా రందఱను దుఃఖసాగరమున ముంచి పరమపదించిరి. స్వర్గలోకవాసు లగు శ్రీమహాదేవకవిగారు, శ్రీవెంకటరమణశర్మ గారు నీసూతసంహితాప్రకటనము వలన నానందము నొందుదురు గాక!

శ్లో॥ జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః।
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజమ్ భయమ్॥

## కృ త జ్ఞ త లు

నేఁటి యక్రమవిద్యావిధానము వలనఁ బ్రాచీనగ్రంథము లన్నియు నామమాత్రావశేషము లగుచున్నవి. మతసాంకర్యము వలనఁ బ్రాచీనసంప్రదాయములు నశించుచున్నవి. తిరుపతి దేవస్థానము వారి పుణ్యమున మఱలఁ బ్రాచీనగ్రంథములు, ప్రాచీనసంప్రదాయములు ప్రచారము నొందుచున్నవి. ఈసూతసంహితాపుణ్యగ్రంథమును రచించిన శ్రీమహాదేవకవిగారికి, గ్రంథముద్రణమునకు ధనసాహాయ్యము గావించిన తిరుపతిదేవస్థానాధికారులకు, గ్రంథప్రకటనమునకుఁ బూనుకొనిన శ్రీబుద్ధవరపు మంగాయమ్మగారికి, శ్రీసుందరకృష్ణారావుగారికి, శ్రీభాస్కరరావు గారికి, స్వీయ 'హనెమాన్' ముద్రణాలయములో ముద్రించిన శ్రీ వేమవరపు వేంకటరమణశర్మగారికి, నేను గోరిన వెంటనే యీసూతసంహితను సాకల్యముగాఁ బఠించి తమ యమూల్యాభిప్రాయము లిచ్చిన బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారికి, బ్రహ్మశ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికి నా నమోవాకములు గ్రంథముద్రణసమయములో నా యెడల మిక్కిలి యాదరాభిమానములు చూపిన మిత్త్రులు, శ్రీ శర్మగారి పుత్త్రులు శ్రీవేమవరపు తమ్మిరాజుగారికి నా కృతజ్ఞతాభివందనములు. నేను గోరిన వెంటనే యుందలి యజ్ఞవైభవఖండము లోని 22-41 అధ్యాయములకు నకలుప్రతి వ్రాసిన చి॥ కంభంపాటి సత్యనారాయణమూర్తి, B. A; B. Ed. కి నా కృతజ్ఞతాపూర్వకాశీస్సులు. భగవత్కృప వలన మహాదేవకవి తక్కిన గ్రంథములు గూడ సత్వరముగా వెలుఁగునకు వచ్చుఁను గాక! శ్రీమదాంధ్రసూతసంహితాసుధారసధారలు తనివి తీఱఁ గ్రోలి యాంధ్రజను లందఱుఁ బవిత్రు లగుదురు గాక!

నీరక్షీరవివేకన్యాయమున నీ న్యాసము నందలి దోషసందోహమును బరిత్యజించి గుణలేశ మున్నచో గ్రహించి నన్ననుగ్రహింపుఁడని పండితహంసులను వేఁడుకొనుచు నీ సూతసంహితా సాహిత్యమును గూర్చి నాలుగు మాటలు వ్రాయుట కవకాశ మొసంగిన యీ కావ్యనాయకుఁడగు శ్రీశైలానేశ్వరస్వామిని మాటిమాటికి ధ్యానించుచు నిప్పటికే పెద్ద దగుటచే నీ న్యాసము నింతటితో ముగించుచున్నాను.

శ్రీ మత్పర మేశ్వ రా ర్పణ మ స్తు.

| | |
|---|---|
| అ వి డి. | ఇట్లు |
| మాఘశుక్లపంచమీ | స క ల సు క వి బు ధ జ న వి ధే యుఁ డు, |
| సోమవారము, | |
| 6—2—1984 | గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ. |

# విషయసూచిక


| అధ్యా. | విషయము. | పుట. |
|---|---|---|
| | **శ్రీ శివమాహాత్మ్య ఖండము.** | |
| | ఇష్టదేవతాప్రార్థనాదికము | 1 |
| 1. | గ్రంథావతారము | 4 |
| 2 | పాశుపతవ్రతము | 11 |
| 3. | నందీశ్వర విష్ణుసంవాదము- ఈశ్వరప్రతిపాదనము | 16 |
| 4. | ఈశ్వరపూజావిధానము | 20 |
| 5 | శక్తిపూజావిధానము | 24 |
| 6. | శ్రీ శివభక్తపూజావిధానము | 26 |
| 7. | ముక్తిసాధనకథనము | 30 |
| 8. | కాలపరిమాణము—తదనవచ్ఛిన్న శివస్వరూపకథనము | 35 |
| 9. | పృథివ్యుద్ధరణము— వరాహావతారము | 41 |
| 10. | బ్రహ్మసృష్టికథనము | 48 |
| 11. | హిరణ్యగర్భాదివిశేషసృష్టి కథనము | 52 |
| 12. | జాతినిర్ణయకథనము | 58 |
| 13. | తీర్థమాహాత్మ్యకథనము | 63 |
| | ఖండాంతగద్యము | 75 |
| | **జ్ఞానయోగ ఖండము** | |
| 1 | జ్ఞానయోగసంప్రదాయ- పరంపరాకథనము | 1 |
| 2. | ఆత్మచే సృష్టికథనము | 4 |
| 3. | బ్రహ్మచర్యాశ్రమవిధినిరూపణము | 7 |
| 4. | గృహస్థాశ్రమవిధినిరూపణము | 8 |
| 5. | వానప్రస్థాశ్రమవిధినిరూపణము | 10 |
| 6. | సన్యాసాశ్రమవిధినిరూపణము | 12 |
| 7. | ప్రాయశ్చిత్తవిధినిరూపణము | 15 |
| 8. | దానధర్మఫలకథనము | 21 |
| 9. | పాపకర్మఫలనిరూపణము | 26 |
| 10. | పిండోత్పత్తికథనము | 30 |
| 11. | నాడీచక్రనిరూపణము | 39 |
| 12. | నాడీశుద్ధినిరూపణము | 46 |
| 13 | అష్టాంగయోగము-యమవిధి | 48 |
| 14. | నియమవిధి | 52 |
| 15. | ఆసనవిధి | 54 |
| 16. | ప్రాణాయామవిధి | 56 |
| 17. | ప్రత్యాహారవిధి | 61 |
| 18 | ధారణావిధి | 63 |
| 19. | ధ్యానవిధి | 65 |
| 20. | సమాధివిధి | 69 |
| | ఖండాంతగద్యము | 77 |
| | **ముక్తి ఖండము** | |
| 1. | ముక్తి ముక్త్యుపాయ మోచక మోచకప్రద చతుర్విధ ప్రశ్నములు | 78 |
| 2. | ముక్తిభేద కథనము | 81 |
| 3. | ముక్త్యుపాయకథనము | 88 |
| 4. | మోచకకథనము | 95 |
| 5. | మోచకప్రదకథనము | 98 |
| 6. | జ్ఞానోత్పత్తి కారణకథనము | 107 |
| 7. | గురూపసదన శుశ్రూషణమహిమ | 110 |
| 8 | వ్యాఘ్రపురమున దేవోపదేశము | 127 |
| 9. | ఈశ్వరనృత్తదర్శనము | 134 |
| | ఖండాంతగద్యము | 141 |
| | **యజ్ఞవైభవఖండము (పూర్వభాగము)** | |
| 1. | సర్వవేదార్థప్రశ్ననిరూపణము | 142 |
| 2. | పరాపరవేదార్థవిచారము | 145 |
| 3. | కర్మవైభవనిరూపణము | 149 |
| 4. | వాచికయజ్ఞనిరూపణము | 151 |
| 5. | ప్రణవవిచారనిరూపణము | 154 |
| 6. | గాయత్రీవివరణము | 158 |

— —


| అధ్యా. | విషయము. | పుట. |
|---|---|---|
| 7. | హంసవిద్యావివరణము | 165 |
| 8. | షడక్షరవిచారము | 171 |
| 9. | ధ్యానయజ్ఞవిచారము | 180 |
| 10. | జ్ఞానయజ్ఞవిచారణము | 184 |
| 11. | జ్ఞానయజ్ఞవిశేషము | 190 |
| 12. | జ్ఞానయజ్ఞవిశేషము-ప్రకారాంతరము | 193 |
| 13. | జ్ఞానయజ్ఞవిశేషము-ప్రకారాంతరము | 195 |
| 14. | జ్ఞానయజ్ఞవిశేషము-ప్రకారాంతరము | 203 |
| 15. | జ్ఞానయజ్ఞవిశేషము-ప్రకారాంతరము | 208 |
| 16. | జ్ఞానోత్పత్తికారణనిరూపణము | 211 |
| 17. | వైరాగ్యోత్పత్తిప్రకారము | 215 |
| 18. | అనిత్యవస్తువిచారము | 220 |
| 19. | నిత్యవస్తువిచారము | 231 |
| 20. | విశిష్టధర్మవిచారము | 232 |
| 21. | ముక్తిసాధనకథనము | 236 |
| 22. | మార్గప్రామాణ్యవర్ణనము | 240 |
| 23. | శంకరప్రసాదక్రమవర్ణనము | 242 |
| 24. | ప్రసాదవైభవము | 247 |
| 25. | శివప్రసాదము-ప్రకారాంతరము | 250 |
| 26. | శివభక్తివిచారము | 256 |
| 27. | పరపదస్వరూపవిచారము | 260 |
| 28. | శివలింగస్వరూపకథనము | 264 |
| 29. | శివస్థానవిచారము | 269 |
| 30. | భస్మధారణవైభవనిరూపణము | 273 |
| 31. | జీవబ్రహ్మైక్యవిజ్ఞానవర్ణనము | 284 |
| 32. | భక్త్యభావకారణనిరూపణము | 295 |
| 33. | పరతత్త్వనామవిచారము | 305 |
| 34. | మహాదేవప్రసాదకారణనిరూపణము | 310 |
| 35. | సంప్రదాయపరంపరాకథనము | 311 |
| 36. | సద్యోముక్తికరక్షేత్రమహిమ | 315 |
| 37. | ముక్త్యుపాయకథనము | 319 |
| 38. | ముక్తిసాధనవిచారము | 324 |
| 39. | వేదావిరోధము | 334 |
| 40. | సర్వసిద్ధికరధర్మవిచారము | 341 |
| 41. | పాతకవిచారము | 344 |
| 42. | ప్రాయశ్చిత్తకథనము | 349 |
| 43. | పాపశుద్ధ్యుపాయకథనము | 358 |
| 44. | ద్రవ్యశుద్ధ్యుపాయకథనము | 365 |
| 45. | అభక్ష్యనివృత్తికథనము | 371 |
| 46. | మృత్యుసూచకవివరణము | 374 |
| 47. | అవశిష్టపాపస్వరూపకథనము | 377 |
| 48. | శ్రీమద్దేవీస్తోత్రము | 381 |
| | ఖండాంతగద్యము | 384 |

ఓం

శ్రీ రామచన్ద్రాయ నమః

# శ్రీ సూతసంహిత

## శ్రీ శివమాహాత్మ్య ఖండము



పార్వతీ హృదయనీరజమత్తభృఙ్గం
గఙ్గాతరఙ్గరమణీయతమోత్తమాఙ్గమ్
సంశుద్ధభక్తజనదుఃఖతమఃపతఙ్గం
కైలాసలిఙ్గమనిశమ్ మనసా భజేఽహమ్। 1

శా. శ్రీలక్ష్మీశవిరించిముఖ్యసురసంసేవ్యోరుపాదాబ్జుఁడై
శ్రీలూతాభుజగేంద్రకుంభిశబరశ్రేయఃప్రదుండై సదా
కైలాసాచలమందుఁ బోలె నవిడిగ్రామంబునం బొల్చు మా
కైలాసేశ్వరదేవుఁ డర్థిజనతాకామ్యంబు లీడేర్చుతన్. 2

తే.గి. భక్తజనముల పాలిటి పాలవెల్లిఁ
గవిజనంబుల పాలిటి కల్పవల్లిఁ
గమలజాండంబు లెల్లను గన్నతల్లిఁ
దల్లులకుఁ దల్లి సుమతల్లిఁ దలఁతు నెపుడు. 3

సీ. శత్రుఘ్నభరతలక్ష్మణసేవితుఁడు భూత
మారీవిభురుఁడు రామప్రభుండు
శ్రీమత్సువర్చలాకామినీమానస
హంసంబు శ్రీమారుతాత్మజుండు
దేవసేనయును వల్లి వారిజాక్షియుఁ
గొలువంగఁ జెలువొందు కొమరసామి
యలమేలుమంగమ్మ నల బీబినాంచారి
నెదను దాల్చెడు వేంకటేశ్వరుండు

తే.గీ. నాల్గువీథుల మొగల జనంబు మ్రొక్క
నృత్యమాడెడి కట్లమ్మ యాశ కొమ్మ
క్రమపీయూషలహరియౌ కౌశికియును
జెలఁగి భక్తుల నెపుడు రక్షింత్రుగాత. 4

కం. ఇందిర ముఖజితపార్వణ
చందిర హరినేత్రసారసవిలోలదృగిం
దిందిర నిత్యం బస్మ
న్మందిరమున నుండి మమ్ము మనుచును గాతన్. 5

శా. సామాథర్వణఋగ్యజుర్నిగమభాషానర్తకీనర్తన
శ్రీమద్రంగధరాయితాననచతుఃశ్రీకుండు శ్రీభారతీ
రామాజృంభదురోజకుంభసుపరీరంభప్రియంభావుకుం
డౌఘుం గావుత ధాత మమ్ముల శుభాయుర్భాగ్యసంధాతయై. 6

తే.గీ. విద్యలందు నిమగ్నులై వెలయు వార
లెల్ల నా పిల్లలని కన్నతల్లి వోలె
సాఁకు శ్రీశారదాంబ యస్మద్రసజ్ఞ
నిండుదయఁ దాండవం బాడుచుండుఁగాక. 7

ఉ. ఉండ్రి మఱించు వెండిమలనుబ్బునఁ బట్టుచుఁ జెక్కుఁ దీఁటవోఁ
దీండ్రము తోడ గట్టులను దిగ్గనఁ దాఁకుచు వెన్కఁ జేరి తాఁ
దండ్రిని దల్లిఁ బేరడిగి దాఁగిలిమూఁతల యాటలాడు మా
గుండ్రనిబొజ్జవేల్పు వలిగుబ్బలిమన్మని గుజ్జుఁ గొల్చెదన్. 8

కం. రవిచంద్రమంగళులు రా
హువును గురుఁడు శనియు బుధుఁడు నుచ్చస్థుల్ కే
తువు శుక్రుఁడు శుభదృష్టిన్
సవ నిత్తురు గాక మాకు సకలార్థంబుల్. 9

ఉ. సన్నుతిఁ జేసి నాకు భవ సత్యవతీసుత కాళిదాసులన్
నన్నయభట్టుఁ దిక్కకవి నాథుని నెఱ్ఱనఁ బోతనార్యునిన్
నెన్నుదుటన్ గరాంజలులు నించి భజించుచు నాంధ్రపాణినిన్
జిన్నయసూరి మ్రొక్కెదను జేయని శుద్ధవచఃప్రసిద్ధికిన్. 10

తే.గీ. సూత్రకారుని జిన్నయసూరి మ్రొక్కి
వాక్యకారుని బహుజనపల్లిఁ దలఁచి
భాష్యకారుల వజ్ఝలవారిఁ గొలిచి
వృత్తి కారుల కిడియెద నేటికోళ్ళు. 11

సి. శ్రీమాఘకవిరాజ శిశుపాలవధకావ్య
మాంధ్రభాష రచించి యలరె నెవ్వఁ
డాంధ్రభాషాయోష కవతంసభూషగా
శ్రీసూతసంహితఁ జెప్పె నెవ్వఁ
డల భోజరాజరామాయణచంపువు
త్రైలింగభాషలో వ్రాసె నెవఁడు
తెల్గుపల్కుల నప్పదీక్షితకృతమైన
కువలయానందంబుఁ గూర్చె నెవఁడు

తే.గీ. భాసురాంధ్రాంగ్లగీర్వాణ భాష లందు
సంప్రదాయజ్ఞుఁ డైనట్టి చతురుఁ డెవ్వఁ
డట్టి ఘను బుద్ధవరపువంశాబ్ధిచంద్రు
శ్రీమహాదేవకవిచంద్రు బ్రీతిఁ దలఁతు. 12

తే.గీ. అతఁడు శ్రీసూతసంహిత యందు రెండు
మూఁడు నాలుగు ఖండముల్ మొగి రచించి
మొదటి ఖండంబు నాకయి వదలె నేమొ!
దాని దెనిఁగింతు గ్రంథసందర్భమునకు. 13

క. శ్రీమదుపనిషత్ప్రచ్చి
ద్వ్యామిశ్రానందబోధ! యద్భుతయోధా!
భూమైశ్వర్యసనాథా!
హైమవతీప్రాణనాథ! హతరిపుయూథా! 14

క. కరుణామృతభరితాంత!
కిరణా! పరమాణుయోగ కరణా! భుజగా
భరణా! సురవరవందిత
చరణా! మునియోగివిబుధ జనగణశరణా! 15

క. శారదవరనీరదశర
నారదశరదిందురజతనగగిరమణీ
హీరమణీ హారమణీ
భారమణీయాంగః సాధుపాలనచంగా! 16

వ. దేవా! యవధరింపుము. 17

## 1. గ్రంధావతారము

తే.గీ. పుణ్యమైనట్టి నైమిశారణ్యమందు
సత్త్రియాగం బొనర్చి ప్రసన్నచిత్తు
లై పురాణంబు లాలింపనభిలషించి
శౌనకాదులు రోమహర్షణకుమారు. 18

క. సూతున్ విదితపురాణ
వ్రాతున్ షట్కాలశంభుపదయుగపూజా
పూతున్ ధూతైనస్సం
ఘాతున్ గని పలికిరిట్లు కడుభక్తి మెయిన్. 19

ఉ. ఆదరమొప్ప నీశు హృదయంబున నిల్పుచు భక్తినిష్ఠతో
నాదిహరిస్వరూపుఁడగు వ్యాసుని యొద్దఁ బఠించినాఁడ వ
ష్టాదశసత్పురాణములు సాధుకథాస్మృతిచిహ్న రోమహ
ర్షా!దయ నీశు సత్కథలు సంహిత మాకెఱిఁగింపు నావుడున్. 20

తె.గి. ఈశ! పరతత్త్వ! సంసారపాశనాశ!
యాదిమధ్యాంతరహిత! యనంతరూప!
నిఖిలలోకసదాధార! నిర్వికార!
యంబికాపతి! యీశాన! యంజలింతు. 21

ఉ. శ్రీదయితావతారమయి చెల్వుగ భారతకర్తయై చతు
ర్వేదవిభాగముం జలిపి స్త్రీలను శూద్రుల నుద్ధరింప న
ష్టాదశసత్పురాణములు సల్పిన సత్కవి వేధ మద్గురున్
సాదరభక్తి మ్రొక్కెదను వ్యాసమునీంద్రుని గీర్తిరుంద్రునిన్ 22

వ. అని పరమేశ్వరధ్యానంబును గురునమస్కారంబును గావించి నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండయిన సూతుండు శౌనకాదిముని

వర్యుల కిట్లు చెప్పందొడంగె. బ్రాహ్మంబును బాద్మంబును వైష్ణవంబును శైవంబును భాగవతంబును భవిష్యంబును నారదీయంబును మార్కండే యంబును నాగ్నేయంబును బ్రహ్మకైవర్తంబును లైంగంబును వారా హంబును స్కాందంబును వామనంబును గౌర్మంబును మాత్స్యంబును గారుడంబును బ్రహ్మాండంబు ననునవి యష్టాదశపురాణంబులు. 23

తే.గీ. నాలుగులక్షలు శ్లోకముల్ నెగ్గుచుండ
భాసురపురాణములు నెప్పె వ్యాసమౌళి
కామికాదిమహాగమగ్రంథములకు
నఖిలవిద్యల కభవుండె యాదికర్త. 24

తే.గీ. ఒకటి యగ్నిని భాస్కరు నొకటి చెప్పు
రెండు శ్రీబ్రహ్మదేవుని బ్రీతిఁ బలుకు
నాల్గు శ్రీవిష్ణుమూర్తి గుణంబు లెన్నుఁ
బదిపురాణంబు లీశ్వరుఁ బ్రస్తుతించు. 25

క. తొలుతన్ వ్యాసమునీంద్రుఁడు
దెలుపఁగ విని పదియు నెన్మిది పురాణంబుల్
చెలఁగి యుపపురాణంబులు
దెలిపిరి మును బదియు నెనిమిదింటిని మౌనుల్. 26

వ. సానత్కుమారంబును నారసింహంబును నాందికేశ్వరంబును శివ ధర్మంబును దౌర్వాససంబును నారదీయంబును గాపిలంబును మానవంబు నౌశనసంబును (బ్రహ్మాండంబును) వారుణంబును గాళీపురాణంబును వాసిష్ఠలైంగంబును మాహేశ్వరంబును సాంబపురాణంబును సౌరపురాణం బును బారాశర్యంబును మారీచంబును గంగాపురాణంబు (భార్గవంబు) నను నవి యుపపురాణంబులు వీనియందు. 27

శా. లక్షశ్లోకము లొప్పఁగా బుధజనశ్లాఘానిరాఘాటమై
త్ర్యక్షాక్షీణమహత్త్వతత్త్వయుతమై యాచంద్రతారార్కమై
సాక్షాన్మోక్షపథప్రదర్శకమయై జ్ఞానాబ్ధియై సర్వలో
కక్షేమంకర మందగించు సభలన్ స్కాందం బమందోరుబుగాన్. 28

క. అందంబై సకలజనా
నందంబై పార్వతీశనపమధురకథా
బృందంబై ముక్తిలతా
కందంబై స్కాంద మొప్పుఁగవివరసభలన్. 29

వ. ఇమ్మహాస్కాందపురాణంబు పురాణంబులకుఁ దలమానికంబై యాఱుసంహితలతో నేఁబది ఖండంబులతో నఖండవై భవంబునఁ బరిఢవిల్లు మొదటిదగు సనత్కుమారసంహిత యేఁబదియైదువేలు శ్లోకంబుల తోడను రెండవదియగు సూతసంహిత యాఱువేలుశ్లోకంబుల తోడను మూఁడవదియగు శాంకరసంహిత ముప్పదివేలుశ్లోకంబుల తోడను. నాల్గవదియగు వైష్ణవసంహిత యైదువేలశ్లోకంబుల తోడను. నైదవది యగు బ్రహ్మసంహిత మూఁడువేలు శ్లోకంబులతోడను నాఱవది యగు సౌరసంహిత వేయి శ్లోకంబులతోడను తవణిల్లు వీనియందు. 30

క. నాలుగుఖండంబులతో
నీలగళునికథల తోడనిగమాగమధ
ర్మాలంబితవివిధవిషయ
జాలంబులఁ బొల్చు సూతసంహిత సభలన్. 31

వ. మఱియును గ్రంథావతారంబునును బాశుపతవ్రతంబును నందీశ్వర విష్ణుసంవాదాత్మకంబగు నీశ్వరప్రతిపాదనంబును నీశ్వరపూజా విధానదేవపూజాఫలంబులును శక్తిపూజావిధానంబును శివభక్తపూజా విధియును ముక్తిసాధనకథనంబును గాలపరిమాణతదనవచ్ఛిన్నస్వరూప కథనంబును బృధివ్యుద్ధరణకథనంబును బ్రహ్మచే సృష్టికథనంబును హిరణ్యగర్భాది విశేషసృష్టికథనంబును జాతినిర్ణయకథనంబును దీర్థ మాహాత్మ్యకథనంబును నను విషయంబుల నొప్పి పదుమూఁడధ్యాయం బులు నేడువందలు శ్లోకంబులును గలిగి. 32

క. తులకించు సూతసంహిత
తొలిఖండం బగుచుఁ బండితులు గొనియాడన్
గలికల్మషనాశకమై
యిల శివమాహాత్మ్యఖండమెసఁగున్ సభలన్. 33

వ. మఱియును జ్ఞానయోగసంప్రదాయపరంపరాకథనంబును నాత్మచే సృష్టికథనంబును బ్రహ్మచర్యాశ్రమవిధినిరూపణంబును గృహస్థాశ్రమ విధినిరూపణంబును వానప్రస్థాశ్రమవిధినిరూపణంబును సన్న్యాసవిధి నిరూపణంబును బ్రాయశ్చిత్త నిరూపణంబును దానధర్మఫలకథనంబును బాపకర్మఫల నిరూపణంబును బిండోత్పత్తికథనంబును నాడీచక్రనిరూ పణంబును నాడీశుద్ధినిరూపణంబును నష్టాంగయోగంబున యమవిధియును నియమవిధియును నాసనవిధియును బ్రాణాయామవిధియును బ్రత్యాహార విధియును ధారణావిధియును ధ్యాన విధియును సమాధివిధియును నను విషయంబుల నొప్పి యిరువది యధ్యాయంబులునేడువందలు ముప్పది యేడు శ్లోకంబులును గలిగి. 34

క. పండితసభలకు నెల్లను
మండనమై సకలసుజనమాన్యంబై భూ
మండలి మెండుగ రెండవ
ఖండంబై జ్ఞానయోగఖండం బొప్పున్. 35

వ. మఱియును ముక్తిముక్త్యుపాయ మోచకమోచక ప్రదచతుర్విధ ప్రశ్నంబులును ముక్తిభేదకథనంబును ముక్త్యుపాయకథనంబును మోచక కథనంబును మోచకప్రదకథనంబును జ్ఞానానుత్పత్తి కారణకథనంబును గురూపసదనశుశ్రూషణమహిమంబును వ్యాఘ్రపురంబున దేవోపదేశంబును నీశ్వరనృత్తదర్శనంబును నను విషయంబుల నొప్పి తొమ్మిది యధ్యా యంబులు నైదువందలునఱువదిమూఁడు శ్లోకంబులును గ (ల)గి. 36

ఆ వె. సకలవిబుధసుజనసుకవిప్రమోదమై
సభల విస్తరిల్లి విభవ మెసఁగ
సూతసంహితను బ్రభూతమై మూఁడవ
ఖండ మగుచు ముక్తిఖండ మొప్పు 37

వ. మఱియును నాల్గవఖండంబు పూర్వోత్తరభాగంబుల నలరారు నందుఁ బూర్వభాగంబున సర్వవేదార్థప్రశ్ననిరూపణంబును బరాపరభేదా ర్థవిచారంబును గర్మయజ్ఞవైభవనిరూపణంబును వాచకయజ్ఞనిరూపణం బును బ్రణవవిచారనిరూపణంబును గాయత్రీవివరణంబును హంస

విద్యావివరణంబును షడక్షరవిచారంబును ధ్యానయజ్ఞవివరణంబును ఐదు నొకండవయధ్యాయంబు మొదలుకొని పదియేనవ యధ్యాయంబు వఱకును జ్ఞానయజ్ఞ విశేషంబులును జ్ఞానోత్పత్తి కారణ నిరూపణంబును వైరాగ్యోత్పత్తి ప్రకారంబును ననిత్యవస్తు విచారంబును నిత్యవస్తు విచారంబును విశిష్టధర్మవిచారంబును ముక్తిసాధనకథనంబును మార్గప్రామాణ్యవర్ణనంబును శంకరప్రసాదక్రమవర్ణనంబును బ్రసాదవైభవంబును శివభక్తవిచారంబును బరపదస్వరూప విచారంబును శివలింగస్వరూపకథనంబును శివస్థానవిచారంబును భస్మధారణ వైభవనిరూపణంబును శివప్రీతికరజీవబ్రహ్మైక్యవిజ్ఞానవర్ణనంబును భక్త్యభావకారణనిరూపణంబును బరతత్త్వనామవిచారంబును మహాదేవప్రసాదకారణనిరూపణంబును సంప్రదాయపరంపరాకథనంబును సద్యోముక్తికరక్షేత్రమహిమంబును ముక్త్యుపాయకథనంబును ముక్తిసాధనవిచారంబును వేదావిరోధంబును సర్వసిద్ధికరధర్మవిచారంబును బాతకవిచారంబును బ్రాయశ్చిత్తకథనంబును బాపశుద్ధ్యుపాయకథనంబును ద్రవ్యశుద్ధికథనంబును నభక్ష్యనివృత్తికథనంబును మృత్యుసూచక వివరణంబును నవశిష్టపాపస్వరూపకథనంబును నుత్తరభాగంబున మొదటిదగు బ్రహ్మగీత యందు బ్రహ్మస్తుతియు వేదార్థవిచారంబును సాక్షిశివస్వరూపకథనంబును సాక్షిత్వకథనంబును తలవకారోపనిషద్వివరణంబును నాదేశకథనంబును ఛాందోగ్యోపనిషద్వివరణంబును వస్తుస్వరూపవిచారంబును ముండకోపనిషద్వివరణంబును దత్త్వవేదనవిధియను కైవల్యోపనిషద్వివరణంబును నానందస్వరూపకథనంబును బృహదారణ్యకోపనిషద్వివరణంబును నాత్మునకు బ్రహ్మత్వ ప్రతిపాదనమను బృహదారణ్యకోపనిషద్వివరణంబును బ్రహ్మముయొక్క సర్వశరీరస్థితియను కఠవల్లి శ్వేతాశ్వతరోపనిషద్వివరణంబును శివాహంప్రత్యయాశ్రయత్వకథనంబును నైతరేయకాదిసర్వోపనిషత్సంగ్రహంబును రెండవదియగు సూతగీతయందు సూతగీతయు నాత్మచే సృష్టికథనంబును సామాన్యసృష్టికథనంబును విశేషసృష్టికథనంబును నాత్మస్వరూపకథనంబును సర్వశాస్త్రార్థసంగ్రహవర్ణనంబును రహస్యవిచారంబును సర్వవేదార్థ సంగ్రహంబును నను విషయంబుల నొప్పి యిఱువదియేడధ్యాయంబులు నాలుగువేల శ్లోకంబులును గలిగి. ౘ౮

తే.గీ. అజ్ఞులకు భక్తిమార్గంబు ననువుపఱిచి
విజ్ఞులకుఁ గర్మమార్గంబు విశదపఱిచి
ప్రాజ్ఞులకు జ్ఞానమార్గంబు పదిలపఱిచి
యజ్ఞవై భవఖండంబ యలరు సభల. 39

తే.గీ. మొదట సర్గంబు ప్రతిసర్గమును బదపడి
వంశవంశానుచరితమ న్వంతరములు
గ్రాల నష్టాదశపురాణ జాలములును
బంచలక్షణముల తోడఁ బరిఢవించు. 40

చ. శ్రుతులు పఠించి శాస్త్రములు శోధన చేసియు ముక్తికామినీ
రతుఁడగు పండితాగ్రణి పురాణములన్ బఠియింపఁడేనియున్
అతనిని గాంచి మిక్కిలి భయంపడుచుండును వేదమాత లో
నితఁడు ప్రతారణంబు వెలయించు నటంచును సంశయించుచున్

క. ఇతిహాసపురాణంబుల
శ్రుతిని సముపబృంహణంబు చొప్పడుఁ జేయన్
శ్రుతిమాత గూడ నల్ప
శ్రుతుఁ గని విప్లావశంక స్రుక్కును గానన్. 42

క. స్మృతులు పురాణంబులు భా
రతమును శాస్త్రములు వేదరాశ్యవిరోధ
స్థితిని బ్రమాణంబు లగున్
స్వతఃప్రమాణంబు వేదసంహిత సుండీ! 43

మ. భగవంతుండు శివుండు నిశ్చలపరబ్రహ్మంబు మాయాగతిన్
జగతిన్ నైకవిధస్వరూపములు సంచారించులీలన్ మహా
నిగమం బొక్కటి భిన్నశాఖలను సందీపించి సర్వేశ్వరున్
నగజానాథుని శంభు శంకరుని విజ్ఞానంబుతోఁ బేర్కొనున్ 44

క. సరసిరుహాసంభవునిన్
హరుఁడు మొదట సృజన చేసి యఖిలశ్రుతులన్
గరుణమెయి నొసఁగె నంతట
స్మరియించి వెలార్చె నలువ సకలస్మృతులన్. 45

సీ. శ్రీపరాశరమహర్షికి సత్యవతి యందు
వ్యాసమహర్షియై యవతరించి
భద్వయమద్వయ బ్రత్రయవచతుష్ట
యానాపలింగకూర్మస్కాంద్యాఖ్యసత్పు
రాణజాలంబులఁ బదునెనిమి విరచించి
యుపపురాణంబుల నాగి నొనర్చి
పంచమవేదమై పరగిన భారత
సంహితఁ బ్రౌఢిమై సంతరించి

తే.గీ. వేదవృక్షమునకుఁ గూర్మిఁ బ్రోది చేసి
శాఖ లొనరించి యుపనిషత్సార మెల్ల
బ్రహ్మసూత్రంబులందునఁ బాదుకొల్పె
నాదినారాయణుఁడు బాదరాయణుండు. 46

సీ. ఏకవింశతిశాఖలే పార ఋగ్వేద
మొప్పారు హౌత్రక్రియోపయోగి
నూటొక్కశాఖల నూల్కొని యాధ్వర్య
వక్రియాధారమై వఱలు యజువు
వేయిశాఖలతోడఁ బెంపొందు సామంబు
గానప్రధాన మౌద్గాత్రసరణిఁ
దొమ్మిదిశాఖలతో నథర్వంబొప్పుఁ
దంత్రమంత్రములకుఁ దావలమయి

తే.గీ. ఆదికాలంబు నందున వేద మెల్ల
నొక్క ప్రోఁగయి యున్నచోఁ జిక్కు దీర్చి
చక్కపఱిచిన శ్రీపరాశరసుతుండు
వ్యస్తవేదుండు గావున వ్యాసుఁడయ్యె. 47

శా. వ్యాసున్ పైలుఁడు గొల్చి ఋక్శ్రుతి నథర్వంబున్ సుమంతుర్షి జి
జ్ఞాసన్ నేర్చిరి నేర్చె యాజుషము వైశంపాయనుం డర్థితో
శ్రీసామంబు పఠించె జైమినియుఁ దచ్ఛిష్యప్రశిష్యోక్తమై
భాసిల్లెన్ శ్రుతి దానఁ బొల్చె జగతిన్ వర్ణాశ్రమాచారముల్.

క. అయ్యమిచంద్రుఁడు వ్యాసుఁడు
ముయ్యాలు పురాణములను మోదముతో మా
యయ్యకు నుగ్రశ్రవసున
కొయ్యా నొసఁగె నతఁడు నాకు నుపదేశించెన్. 49

మ. అని యీరీతి వచించి సూతుఁడు సనంతానందపూర్ణాత్మ! చి
ద్ఘన! సర్వేశ్వర! సర్వసాక్షి! శివ! రుద్రా! శంకరా! పార్వతీ
వనితామానసపద్మతోషహర! హరా! బ్రహ్మేంద్రవిష్ణ్వర్చితా!
యనుచున్ భక్తివశాత్ముఁడై పరశివధ్యానాబ్ధిలో మున్గినన్ 50

## 2. పాశుపత వ్రతము

వ. శ్రీమన్మహేశ్వరధ్యానపూతుండగు సూతుం గాంచి నైమిశీయులు దేవా! యేహేతువునం జేసి యీసర్వ జగత్తును విభక్తంబయ్యె? నుత్ప న్నంబగు జగత్తు నిత్యంబు గదా! పశురూపుండగు జీవుం డజ్ఞాని గావున కర్త గానెరఁడు. జడప్రకృతియుఁ గర్త్రి గానోపదు. కావున సర్వజ్ఞుం డగు పురుషుండు జగత్కర్త కావలయు నవ్విధంబు మాకెఱింగింపు మని వేఁడిన సూతుండు దయాసాంద్రుండై మునీంద్రులారా! యీరహస్యంబు నథర్వశ్రుతి పలికిన విధానంబున వక్కాణించెద సావధానంబుగ వినుం డని యిట్లు చెప్పందొడంగె

క. పూర్వము విష్ణువు మొదలుగ
గీర్వాణులు లోకసృష్టికేలిక మెఱుఁగన్
సర్వేశ్వరుని నివాస మ
ఖర్వవిలాసంబుఁ గనిరి కైలాసంబున్. 52

క. అచ్యుతుఁ గమలాక్షుఁడివి
యచ్చరులకు దర్శనంబు నభవుం డొసఁగెన్
చెచ్చెర వారలు మ్రొక్కిరి
తచ్చరణాబ్జముల వ్రాలి తద్దయుభక్తిన్ 53

ఉ. మానుగ మ్రొక్కు నిర్జరుల మన్నన చేసి వచించె నీశ్వరుం
డేన సమస్తలోకములకేలికనై చరియింతు నెప్పుడున్

ఏన సమస్తలోకములకెల్లను గర్త మదీయమాయచే
నీనిఖిలప్రపంచచయమేర్పడుచుండుఁ జరాచరాత్మమై. 54

చ. ఎవఁడు మదీయమూర్తి గననెంచు నెఱుంగు నతండు శ్రీగురున్
దవిలి భజించి యౌపనిషదప్రకటార్థములన్ గ్రహించినన్
శివుఁడు జగద్గురుం డిటులఁ జెప్పి తిరోహితుఁ డయ్యె నంతలో
దివిజులు లోకనాథు శివదేవుని గానక సంభ్రమించుచున్. 55

సీ. శ్రీపరమేశ్వరరూపంబు భావించి
యూర్ధ్వదిక్కునకు బాహువుల నెత్తి
యాథర్వణశ్రుతి నావృత్తి గావించి
హరుని సూక్తంబుల నభినుతించి
పంచాక్షరీమంత్రపారాయణము చేసి
శతరుద్రియశ్రుతి శ్రద్ధఁ జదివి
శంకరశ్రీనామసాహస్రిఁ బఠియించి
యభవగీతంబులనాలపించి

తే.గీ. అగ్నిహోత్రసముత్పన్నమైన భస్మ
మెలమిఁ గైకొని శుద్ధపాత్రలను బెట్టి
యంఘ్రిసంక్షాళన మొనర్చి యాచమించి
భవ్యదర్భపవిత్రసత్పాణు లగుచు. 56

క. ఓమాపోజ్యోతిరితి
శ్రీమంత్రంబును జపించి శ్రీజలనాథున్
శ్రీమన్నారాయణువిన్
నేమంబునఁ దలఁచి భూతినిం గొని వారిన్. 57

క. శ్రీబాలాత్రిపురేశ్వరి
శ్రీబాలశశాంకమకుటుఁ బ్రేమఁ దలఁచుచున్
జాబాలమంత్రజాలము
శ్రీబాలాప్రాణనాథుఁ జేరి చదువుచున్. 58

తే.గీ. మహితభస్మంబు సాపాదమస్తకంబు
నలఁది ఫాలహృత్స్తనకుక్షిహస్తములను
బ్రహ్మవిష్ణుశివాత్మకప్రఖ్యమైన
శ్రీత్రిపుండ్రంబు భక్తి ధరించి మించి. 59

క. కీలించి దృష్టి లోనికిఁ
గ్రాలు హృదయపద్మకర్ణికల వహ్నినిభున్
వాలాగ్రమాత్రు నీశ్వరుఁ
బోలంగని ప్రణవమంత్రము జపియింపన్. 60

సీ. శరదబ్దసన్నిభస్వచ్ఛదేహము తోడ
శార్దూలచర్మవస్త్రంబు తోడ
వరజటాజూటప్రసద్వియద్ధుని తోడ
రమణీయబాలచంద్రకళ తోడ
వాతాశనాధీశవరహారతతి తోడ
రవిశశిజ్వలననేత్రముల తోడఁ
గాలకూటగ్రాసకలితకంఠము తోడ
భాస్కరసాహస్రభాతి తోడ

తే.గీ. వాఁడి మీఱిన మ్ముమ్మొనవాలు తోడఁ
బ్రక్కఁ గైదండ నొసఁగు శర్వాణి తోడఁ
గార్తికేయవినాయకకలితుఁ డగుచు
నల్ల సురలకు శివుఁడు ప్రత్యక్షమయ్యె. 61

సీ. ఎవ్వాని దర్శింప నెల్ల వేదాంతులు
నుపనిషన్మంత్రంబు లొగిఁ బఠింతు
రెవ్వాని వీక్షింప నెల్ల విప్రేంద్రులు
నామ్నాయసంహితల భ్యసింతు
రెవ్వాని దృష్టింప నెల్ల బ్రాహ్మణచంద్రు
లఖిలయజ్ఞంబుల నాచరింతు
రెవ్వాని దిలకింప నెల్ల యోగీశ్వరు
లష్టాంగయోగంబు నధిగమింతు

తే.గీ. రెవని కరుణాకటాక్ష మొక్కింత సోకి
విష్ణు వింతటి వాఁడయ్యె విశ్వనేత
యెవని గానంగ నేరరు హీనబుద్ధు
లట్టి యీశ్వరుఁ గాంచిరి యమరు లెల్ల. 62

క. కాంచి మహాదేవుని బల
కాంచితతను లగుచు నుదుట హస్తంబులు కీ
లించి సగద్గదముగ విను
తించిరి సద్భక్తి నెల్ల దివిజులు గుములై. 63

శా॥ స్వర్గాధీశ్వరకాలనారదహరి బ్రహ్మాది సంసేవితా!
దుర్గాచిత్తసరోజబంభర! వినిర్ధూతాఖిలాఘవ్రజా!
స్వర్గంగాజలకుందచంద్రనిభభా స్వద్గాత్రవిభ్రాజితా
భర్గా! పాలితభక్తవర్గ! వినతుల్ ఫాలాక్ష! మృత్యుంజయా. 64

మందాక్రాంతము:
నీలగ్రీవా! నిగమవినుతా! నిత్యనృత్యప్రమోదా!
లాలాటాక్షా! శ్రితజనచయాహ్లాద! లోకాధినాథా!
కైలావాసా! త్రిపురహరణా! సంయమిస్తోత్రపాత్రా!
కాలాభీలా! శతశతనమస్కారముల్ దేవదేవా! 65

మత్తకోకిల:
హేమగోత్రశరాసనా! కుసుమేషుదర్పనిరాసనా!
సామజాసురభంజనా! శ్రిత సర్వసజ్జనరంజనా!
భూమసంసృతిఖండనా! ఘన భోగిమండలమండనా!
సోమపావకభాస్కరేక్షణ! శుద్ధతత్త్వవిచక్షణా! 66

మాలిని:
వరనిగమవిహారా! పార్వతీచిత్తచోరా!
దురితతిమిరమిత్రా! స్తుత్యదివ్యచ్చరిత్రా!
సురనతపదపద్మా! సూరిచిత్తాబ్జసద్మా!
శరణు శరణు దేవా! సంతతోద్యత్ప్రభావా! 67

పంచచామరము:
జటాకుటీతటీనటల్లసద్వియత్తరంగిణీ
స్ఫుటాంబుజోల్లసత్షడంఘ్రి శుద్ధగానరంజనా!

నటోద్భటా! యఘావళీఘన ఘనప్రభంజనా!
కటీపటద్గజాజినా! జగత్ప్రభూ! నిరంజనా! 68

కవిరాజ విరాజితము :

జయ శివశంకర! శత్రుభయంకర! సాధుశుభంకర! శర్వ! హరా!
జయ నిటలాంబక! జగ్గసుమాంబక! చక్రధరాంబక! చంద్రధరా!
జయ శరపారద! శారదనీరద! సారయశోవర! శైలచరా!
జయ విషభక్షణ! సంశ్రితరక్షణ! సచ్ఛుభలక్షణ! శస్త్రకరా! 69

స్రగ్ధర :

ఉద్యద్ఖద్యోత తేజా! యురుగుణ శమనోద్యోగ యోగానవద్యా!
ఆద్యా! వేదైకవేద్యా! యఘభవపటల వ్యాధినిర్వేద వైద్యా!
సద్యస్సంకల్పసిద్ధా! సకలమునిజనా సాద్య! వేదాంతదీవ్య
త్పద్యా! కందర్పదర్ప ప్రహరణ, వినతుల్ పార్వతీచిత్తహృద్యా

అశ్వధాటీ వృత్తము :

లింగా! విభూషితభుజంగా! జటాకలిత గంగా! కరాబ్జధృతసా
రంగా! చతుశ్శృతితురంగా! ధరాతలశతాంగా! సుముక్తివనితా
సంగా! విశుద్ధధవళాంగా! జగద్భరణ చంగా! ప్రపూరితకృపా
పాంగా! విచారభవభంగా! శివాయుత శుభాంగా! నతుల్ పురహరా

శిఖరిణి :

పరజ్యోతీరూపా! వరజపతపోభావసులభా!
నిరాకారా! నిత్యా! నిగమగమనా! నిర్గుణ! మహే
శ్వరా! నాదాతీతా! శ్రుతిశిఖరతత్త్వప్రముదితా!
స్మరారీ! సంసారప్రథన! భవ! నిష్కామ! వినుతుల్. 72

వసంత తిలకము :

పంచేంద్రియేషణవిభంజన, నిర్వికారా!
చంచత్ప్రభావ! భవసాగరదివ్యనావా!
పంచాస్య! సాంఖ్యపదభావన! యోగిచేత
స్సంచార! విశ్వమయ! సాధునుతా! నమస్సుల్. 73

క. అని యీరీతిని వేల్పులు
కొనియాడి పదంబు లంటి కూర్మిని గొలువన్

గని కరము కవికరంబునఁ
గనుకని వచియించె శివుఁడు గంభీరముగన్. 74

సీ. వినుము జనార్దనా! వినుఁడు దేవతలార!
పరమతత్త్వంబునై పరగు దేవ
నాయందు జనియించి నాయందుఁ గలియును
సకలచరాచరాత్మకజగంబు
నాకంటె నధికుండు నాతో సముండును
దిలకింప ముజ్జగంబులను లేఁడు
నన్నెఱింగెడు నట్టి జ్ఞానంబు వేదాంత
సంశ్రవణంబుచే సంభవించు

తె.గీ. యజ్ఞనిర్ధూతకల్మషుల్ ధ్యాననిష్ఠఁ
దృక్తకర్మకలాపులు దాంతిశాంతి
యుక్తులు యతులు ముముక్షువుల్ వ్రతులు నన్ను
నెఱుఁగ నేర్తురు పెఱలు నన్నెఱుఁగ లేరు. 75

తె.గీ. పలికినాఁడను వేదాంతవైభవంబు
దీనిఁ బాశుపతాచారహీనుతోడఁ
బలుకఁగాఁ గూడ దిది వేదభాషితంబ
యనుచు వచియించి మాయ మయ్యెను శివుండు. 76

క. నిర్జరు లెల్లరు జగతికి
ధూర్జటియే కర్త యనుచుఁ దోడ నెఱిఁగి యు
త్సర్జించిరి సంశయముల
నార్జింపుఁడు మీరు కూడ నభవుని భక్తిన్. 77

వ: అని సూతుం డుపదేశించిన మహాదేవమాహాత్మ్యంబును శ్రీమత్పాశుపతవ్రతమాహాత్మ్యంబును విని హృష్టచేతస్కులై నైమిశీయులు

3. నందీశ్వర విష్ణు సంవాదము - ఈశ్వర ప్రతిపాదనము.

తె.గీ. గరుడగంధర్వయక్షరాక్షసపిశాచ
భుజగసురనరకిన్నరమునుల కెల్ల

భుక్తిముక్తిప్రదాతయౌ పూజ్యుఁ డెవఁడు?
వాని నెఱిఁగింపు మన సూతమౌని పల్కె. 79

ఉ. పూర్వము విష్ణుమూర్తి ఫణిభూషణుదివ్యమహత్త్వ మెర్గియున్
శర్వుని మాయ గ్రమ్మఁగనె చాల విమోహితుఁడై యహంకృతిన్
సర్వము నేనయీ జగము నాదగు శక్తి విలాస మంచుఁ దా
గర్వము పూనె మాయ గను గప్పదె? యెంతటివారి కేనియున్.

ఉ. పంకజనాభుఁ డిట్లు లభవప్రతిభన్ గనలేక మాయచే
నింక సమస్తజీవులకు నేన విభుండను గర్తనంచు నా
ధ్యంకరణాత్ముఁడై సురల కంభుజగర్భున కాజ్ఞ చేసినన్
శంకరుఁ డంత స్వీయమగు శక్తిని గైకొనె మోహ మందఁగన్.

క. శంకరుఁడు శక్తి గైకొనఁ
బంకజనేత్రుండు సురలు బ్రహ్మయు మాయా
కింకరులై మోహమహా
పంకంబునఁ బడిరి పశుల వలెను వివశులై. 8[illegible]

క. బృందారకవరు లెంతయు
నాందోళన మొందుచుండ నద్భుతరీతిన్
నందీశ్వరుండు వారికి
ముందటఁ దోఁతెంచి యిట్లు బోధ యొనర్చెన్ 83

మ. వినునారాయణ! పద్మగర్భ! వినుమీ! బృందారకుల్ మీరలున్
వినుఁడీ నావచనంబు సర్వజగముల్ విశ్వంబు పాలాక్షుచే
ఘనకోలాహలకాలకూటకబళీ కారక్రియాదక్షుచే
జననం బందును బెంపు నొందు నడఁగున్ సత్యంబు చింతింపుఁడీ

శా. విశ్వాత్ముండును విశ్వసాక్షియు మహావిశ్వప్రభామూర్తియున్
విశ్వాధారుఁడు విశ్వజంతునివహావిష్టాత్ముఁడున్ విశ్వుఁడున్
విశ్వస్రష్టయు విశ్వపాలకుఁడు శ్రీవిశ్వేశ్వరుం డొక్కఁడేఁ
విశ్వాసంబున నాదుమాట వినుఁడీ విశ్వంభరాదుల్ సురల్. 8[illegible]

ఆ.వె. ధాత శివుఁడెయౌ విధాతయు శివుఁడెయౌ
శంకరుండె లోక శంకరుండు

వహ్నిచేత నినుము భాసించి దహియించు
భాతి జగము శివునిచేత వెలుఁగు. 86

ఆ.వె. శివుని సత్ప్రసాదలవలేశలవముచేఁ
గృష్ణ! పొందితీవు విష్ణుపదము
శివుని సత్ప్రసాదలవలేశలవముచే
దేవతాత్వ మొందె దేవగణము 87

చ. వినుము! మహేశ్వరాజ్ఞ మెయి విశ్వము సర్వము నొప్పుచుండునో
వనజదళాక్ష! యీశ్వరు నవారితమాయను భ్రాంతిపొంది తీ
వనిశము పార్వతీపతిపదాబ్జములన్ భజియింపు భక్తితో
నని వచియించి నంది రజతాద్రికి నేఁగె రథోత్తమంబునన్. 88

చ. అది విని పద్మనాభుఁడును హాటకగర్భుఁడు లక్ష్మి వాణియున్
ముదమునఁ దక్కు దేవతలు మోహము వీడి మహాప్రపత్తితో
హృదయములందు శంకరు మహేశ్వరుఁ గొల్చిరి కృష్ణపింగళున్
సదయుఁడు నందివాహనుఁడు చయ్యన దర్శన మిచ్చె వారికిన్. 89

తే.గీ. ఇట్లు సాక్షాత్కరించిన యీశుఁ గాంచి
చేరి దండప్రణామముల్ చేసి భక్తిఁ
గేలుదోయిని నుదుటిపైఁ గీలుకొలిపి
యభినుతించిరి బ్రహ్మవిష్ణ్వాద్యమరులు.

క. జయజయ! కరుణాసాగర!
జయజయ, దేవేశ! సర్వజగదాధారా!
జయజయ! ముక్తిఫలప్రద!
జయజయ, సంసారపాశసంహర! హరా! 91

తే.గీ. వేదవేదాంతసంస్తుత! యాదిదేవ,
శూలహస్త! మహేశ్వరా! నీలకంఠ!
విశ్వనాయ! విశ్వేశ! విశ్వయోని!
శంకరా! శర్వ! కృత్తివాసా! నమస్సు. 92

మత్తకోకిల :
సోమరూపము వహ్నిరూపము సూర్యరూపము దాల్చియున్
భూమిరూపము తోయరూపము పొంది వాయువుమూర్తియై

వ్యోమరూపము నాత్మరూపముఁ దొప్పఁగా ధరియించియున్
గోము మీఱిన యష్టమూర్తి నిఁ గోరి కొల్చెద మెప్పడున్. 93

సీ॥ సత్యరూపునకు నసత్యరూపునకును
బోధరూపునకు నబోధునకును
సుఖరూపునకును నిస్సుఖరూపునకును సం
పూర్ణరూపునకు నపూర్ణునకును
బ్రహ్మరూపునకు నబ్రహ్మరూపునకును
జీవరూపునకు నజీవునకును
వ్యక్తరూపునకు నవ్యక్తరూపునకును
శబ్దరూపునకు నశబ్దునకును

తే.గీ. స్పర్శరూపరసంబులు సరగఁ దాల్చి
స్పర్శరూపరసంబులు వదలి గంధ
రూప మొందియు గంధంబు రూపు లేని
పరమశివున కొనర్తుము వందనములు. 94

సీ. దేహరూపునకు నదేహరూపునకును
ప్రాణరూపునకు నప్రాణునకును
శ్రోత్రరూపునకు నశ్రోత్రరూపునకును
త్వక్స్వరూపునకు నత్వక్కునకును
దృష్టిరూపునకు నదృష్టిరూపునకును
జిహ్వాస్వరూపి కజిహ్వునకును
ఘ్రాణరూపునకు నఘ్రాణరూపునకును
పాదరూపునకు నపాదునకును

ఆ.వె. పాణిరూపునకు నపాణిరూపునకును
వాక్స్వరూపునకు నవాక్కునకును
నిఖిలరూపములను నెగడియుఁ గానట్టి
వాని కిడుదు మేము వందనములు. 95

ఆ.వె. లింగరూపునకు నలింగరూపునకును
పాయురూపునకు నపాయునకును

జిత్తరూపునకు నచిత్తరూపునకు న
హీనభక్తి నిత్తుమేటికోళ్ళు. 96

ఆ.వె. మాతృరూపునకు నమాతృరూపునకును
మానరూపునకు నమానునకును
మేయరూపునకు నమేయరూపునకును
మితికి నమితి కిత్తుమతులనతులు. 97

వ రజతాదిరూపంబు శుక్త్యాదులందు వలె భవదీయ దివ్యపరమార్థ స్వరూపంబు భావాభావప్రపంచ రూపంబునఁ బరికల్పితంబై భాసించును గాన సర్వరూపరహితుండ వయ్యును సర్వరూపంబులఁ బ్రకాశించు పరమేశ్వరా! నీపాదపద్మంబులకుఁ బ్రణమిల్లెదము.

క. అక్షీణదయావీక్షణ!
త్ర్యక్షా! క్షమియించి మమ్ము నాదర మొప్పన్
రక్షింపుము! రక్షింపుము!
రక్షింపు మటంచు నాసురల్ ప్రార్థింపన్. 99

క. శీఘ్రముగ సురసుమాంజలు
లాఘ్రాణించుచు ననుగ్రహాలోకముతో
వ్యాఘ్రాజినాంబరుండును
వ్యాఘ్రపురంబునకుఁ జేరె నమరుల తోడన్. 100

వ. ఇట్లక్షీణకరుణాకటాక్షవీక్షణుండగు లలాటేక్షణుండు గొంపోవ శ్రీమద్వ్యాఘ్రపురంబు చేరియట శ్రీనటరాజరాజనాట్యావలోకనతత్పరులై బృందారకులు భూబృందారకులతో బృందంబులు గట్టి యమందానందకందళితహృదయారవిందులై యందు వసించిరి గావున మహర్షులారా! మీరు గూడ ఘృణోదధి భక్తుల పెన్నిధి శశాంకశేఖరు సకలలోకశివంకరు శంకరు నకలంకభక్తిఁ గొలువుండని యానతిచ్చిన సూతుం గాంచి. 101

## 4. ఈశ్వర పూజా విధానము.

తే.గీ. అనఘ! యీశ్వరమాహాత్మ్య మానతియ
వింటి మియ్యెడ వీనులవిందు గాఁగ

శివుని పూజావిధానంబుఁ జెప్పు మనుడుఁ
జెప్పఁ దొడఁగెను సూతుండు శివుఁ దలంచి. 102

తే.గీ. స్నాన మొనరించి పరిశుద్ధ ధాత్రి యందు
గోమయవిలేపనంబు ముగ్గులును గూర్చి
తూర్పుముఖముగ నాసనం బేర్పరించి
భక్తి నాగ స్త్యాశాస్త్రోక్త పద్ధతులను. 103

సీ. మునులార! శివలింగమును భక్తిఁ గొనివచ్చి
యింబుగా నావాహనం బొనర్చి
యర్ఘ్యంబుఁ బాద్యంబు నాచమనం బిచ్చి
స్నపనంబు వేదమంత్రములఁ జేసి
పంచాక్షరీ మంత్ర పారాయణము తోడఁ
బురుషసూక్తంబును బొరి జపించి
యాసనంబందు శ్రీహరుని బ్రతిష్ఠించి
ప్రణవపూర్వకము వస్త్రంబుగట్టి

తే.గీ. జందెమును వేసి నగలను బొందుపఱిచి
గందము నలంది సుమమాలికలు ఘటించి
ధూపమును వేసి కర్పూర దీప మొసఁగి
వివిధభక్ష్యాళి హవియు నైవేద్య మిచ్చి. 104

వ. ఇట్లు మధ్యమధ్యపానీయంబుతో నాదరంబున నైవేద్యము నివేదించి మఱల నాచమనంబు సమర్పించి. 105

తే.గీ. నాగవల్లులు కర్పురంబు పూగఫలము
క్రొత్తముత్తెపుసున్నంబు గూర్చి నట్టి
తములము నొసంగి ప్రణమిల్లి స్తవము చేసి
శివుని బ్రణవంబుతో విసర్జింప వలయు. 106

వ బ్రహ్మచారియు గృహస్థుండును వానప్రస్థుండును బ్రతిదినంబును శివపూజ నొనర్పవలయు. సన్న్యాసి ప్రణవంబు చేత దేవదేవుని బూజింపవలయు. స్త్రీలు నమశ్శివాయ మంత్రంబుచే శివు నర్చింపవలయు విరక్తులగు శూద్రులు నన్యనరులును శివాలయముమ దర్శించి ప్రణమిల్ల

వలయు. శివపూజాతత్పరుల జీవితంబు సఫలంబగు. శివార్చనంబే భుక్తి ముక్తిప్రదంబు. ఈ యర్థంబు తేటపడ నొక పురావృత్తంబు వక్కాణింతు నాకర్ణింపుఁడు. 107

మ. కడు దుర్మార్గుఁడు పుల్కసుం డొకఁడు మున్ గర్వం బఖర్వంబుగాఁ
బుడమిం ద్రిమ్మరి కండకావరముతో భూదేవులం జంపుచున్
వడి మార్గంబులు గొట్టుచున్ బథికులన్ బాధించుచున్ గోవులన్
మడియం జేయుచు రాశులౌ ధనము సంపాదించె దుష్టాత్ముఁడై.

క. గణికాపతి యగు నొక బ్రా
హ్మణుఁడు సుబంధుండు నాఁగ నతనికి మిత్రా
గ్రణి యుండఁ గొంతధన మ
ర్పణ చేసెను బుల్కసుండు వానికి మైత్రిన్. 109

ఉ. పుల్కసుఁ డిచ్చినట్టి ధనము గొన నెంచియుఁ బాపభీతి లో
నుల్కుచు బ్రాహ్మణుం డనియె నో సఖ! పుల్కస! పాపశీలివై
నిల్కడ లేక నీవు ధరణీసురులన్ గతియాలఁ బాంథులన్
ముల్కుల నేసి చంపితివి ముప్పిరిగొన్న ధనాశ పెంపునన్. 110

క. ఆలింపుము! నావచనము
చాలింపుము! నరవధాద్యసహ్యక్రియలన్
పాలింపుము! ధర్మంబును
గలింపుము! హృదయమందు గిరిశున్ భక్తిన్. 111

చ. అనుచు సుబంధువిప్రుఁడు మహాదరబుద్ధి వచించు మాట లిం
పున విని పూర్వజన్మకృతపుణ్యలవంబునఁ బుల్కసుండు తా
మును పొనరించినట్టి యఘముల్ తలపోయుచుఁ దాప మొందుచున్
మనమున నోకిలించుచును మాటికి మాటికి భీతి పుట్టఁగన్.

తే.గీ. గోమహీసురకంఠముల్ గోసినాఁడఁ
జేయరానట్టి పాపముల్ చేసినాఁడ
నిట్టి నాకింక నిష్కృతి యేమి గలదు
నుడుపు మని విప్రు కాళ్లపైఁ బడియె నతఁడు. 113

శా. పశ్చాత్తాపము నొంది పుల్కసుఁడు తాఁ బాదంబులన్ బట్టుచున్
నిశ్చేష్టుండయి యున్నఁ గాంచి గణికా నేత్రుండు గోత్రామరుం
డాశ్చర్యంబును సిగ్గు నొంది మదిలో నా పుల్కసున్ లేపి ప్రా
యశ్చిత్తంబు వచింతు నీవలన నా యజ్ఞాన మెల్లం దెగెన్.

మ. మన పాపంబులు వాయ మోక్షవరసామ్రాజ్యంబు కాత్యాయనీ
వనితాళంకరన ర్త్నస్థలము దేవ వ్రాతమౌనీంద్రయో
గినిషేవ్యంబగు తీర్థ మొండు గల దా క్షేత్రంబు సేవింత మే
యనుచున్ బుల్కసు తోడ విప్రుఁడు చనెన్ వ్యాఘ్రేశ్వరాస్థానికిన్

తే.గీ. పుల్కసుఁడు బ్రాహ్మణుఁడు వ్యాఘ్ర పురము సొచ్చి
బహుధనము భక్తవరులకుఁ బంచిపెట్టి
స్నాన మొనరించి శ్రీదభ్ర నాధునిచ్చ
భక్తిఁ బూజించి పదపడి ముక్తులైరి. 116

సీ. శ్రీవ్యాఘ్రపురనాధు సేవించి కొందఱు
కొందఱు సోమనాథుం దలంచి
కేదారవిభు నెదఁ గీలించి కొందఱు
శ్రీశైలనాధుని జేరి కొంద
అగ్నీశ్వరస్వామి నర్చించి కొందఱు
కొందఱు గోపర్వ తేందుమకుటుఁ
గాళహస్తీశ్వరుఁ గామించి కొందఱు
కొందఱు హరితీర్థ మందిరస్థు

తే.గీ. మిగుల హాలాస్యనాధు వల్మీకనాధు
వృద్ధపర్వతనాధు రామేశనాధుఁ
జెలఁగి కాంతారనాధుఁ బూజించి కొంద
ఱభవకైవల్యసామ్రాజ్య మందుకొనిరి. 117

క. కొందఱు నిత్యము తమతమ
మందిరముల యందు శివు నుమాప్రాణేశున్
జందిరశేఖరుఁ గొల్చుచుఁ
బొందిరి కైవల్యమార్గ మును భక్తిమెయిన్. 118

క. శివపూజ దురితనాశని
శివపూజయె సకలభక్తచింతామణియౌ
శివపూజ పుణ్యదాయిని
శివపూజయె భుక్తిముక్తిసిద్ధుల నొసఁగున్. 119

తే.గీ. భవుని బూజింప సకలదేవతల నర్చ
నంబు సలిపిన పుణ్యంబుదంబు మీఱఁ
బూజచే నీలకంఠుండు మోద మొందు
నభవు నెప్పుడు పూజింపుఁడయ్య! మునులు. 120

తే.గీ. అనుచు శివసమర్చనవిధి నానతీయఁ
జెలఁగి మును లెల్ల శివుని బూజించి మించి
శక్తిపూజావిధానంబు శాస్త్రసరణిఁ
జెప్పు మని వేఁడ సూతుండు చెప్పఁదొడఁగె. 121

## 5. శక్తిపూజావిధానము

తే.గీ. బాహ్య మాభ్యంతరం బనఁ బరమశక్తి
పూజ రెండు విధంబులై తేజరిల్లు
వైదికము తాంత్రికం బన బాహ్య మొప్పు
వైదికుఁడు తాంత్రికుండును వరుసఁ జేయ. 122

క. తెలగంట్ల పూజ లిట్టి రు
తెలుఁగుల నొప్పారుచుండు దీని విధానం
బెఱుఁగక భక్తుఁ డెవండే
నటిముటిఁ బూజింపఁ బతన మందును వినుఁడీ! 123

వ. అందుఁ బరశక్తి యొక్క బాహ్యపూజావిధానం బెట్టి దనిన.

ప. ఆదిపరాశక్తి నాసనంబున నుంచి
నగజాత నావాహనం బొనర్చి
యంబికాదేవికి నర్ఘ్యంబు నర్పించి
పార్వతీదేవికిఁ బాద్య మొసఁగి
యఖిలలోకేశ్వరి కాచమనం బిచ్చి
సర్వమంగళకు నుజ్జలక మార్చి

భద్రకాళికి దివ్యవస్త్రంబులను గట్టి
శర్వాణి కఖిలభూషలును బెట్టి

తె.గీ. గంధసుమధూపదీపముల్ గ్రందుకొనఁగఁ
బంభక్ష్యాన్నములు పెట్టి మంచి వీడ్య
మొసఁగి మాల్యానులేపంబు లొసఁగి నతులు
చేసి శ్రీమాతృకను విసర్జింపవలయు. 125

తే.గీ. చెలఁగి మాతృకచేఁ బూజ చేయవలయు
మాతృకను వీడి మంత్రముల్ మహిని లేవు
స్థూలయును సూక్ష్మయును మఱి సూక్ష్మతరయు
మంత్రనాయిక మాతృక మహిమ గాంచు 126

వ. అందు మందాధికారి స్థూలమాతృక చేతను మధ్యమాధికారి సూక్ష్మమాతృక చేతను నుత్తమాధికారి సూక్ష్మతరమాతృక చెతను బూజింపవలయు నివ్విధానం బంతయు గురూపదేశపూర్వకంబుగా నెఱుంగవలయు. యథాశాస్త్రపూజాస్వరూపసమ్యక్పరిజ్ఞానంబును జిత్తైకాగ్రతయుఁ గలవాఁ డాభ్యంతరపూజ కధికారి యగు నింక నాభ్యంతరపూజ యెట్టిదనిన. 127

క. సాధార నిరాధారయు
నా ధర నాభ్యంతరార్చనయు నుతికెక్కున్
సాధారపూజ కంటె ని
రాధారయె గొప్ప దండు రాగమవేత్తల్. 128

వ. మనస్సుచేఁ బరికల్పితంబగు వర్ణసంక్లప్తవిగ్రహంబు నాధారంబు చేసికొని సచ్చిదానందశివాత్మికయగు పరమేశ్వరి నావాహనాదికంబులఁ బూజ సల్పుట సాధార యనంబడు. ఆధారంబు లేక సాక్షిత్స్వంవిత్తు నందు మనస్సును లయం బొనర్చి యారాధించుట నిరాధార యనంబడు. సంవిత్తే పరమార్థంబుగఁ బరశక్తి యగు. సంవిత్తు కంటె నితరంబై భాసించునదియే సంసారము. కావున సంసారనాశంబు కొఱకుఁ బండితుండు సంవిదాకార యగు శక్తి నారాధించి యనంతరంబు నిశ్చల సమాధి యందు ధ్యానధ్యాతృధ్యేయవిభాగాతీతంబగు స్వాత్మానుసంధాన

మొందు నిట్లు. 129

తే.గీ. ఆత్మరూపిణి సాక్షిణియఖిలశక్తి
సంవిధాకారయౌ మహేశ్వరిని భక్తి
స్వాత్మభూతగఁ బూజించి స్వానుభూతి
భావనము చేయఁ బరమకైవల్య మొందు. 130

వ. ఇది వేదప్రోక్తంబగు శక్తిపూజావిధానంబు. మునులారా! మీరు కూడఁ బరశక్తిని బూజింపుఁడని సూతుండు వలికిన విని నైమిశీయు లిట్లనిరి. 131

## 6. శ్రీ శివభక్త పూజావిధానము

క. శివపూజావిధి చెప్పితి
శివశక్త్యర్చనవిధంబు చెప్పితి వింకన్
శివభక్తుని పూజావిధి
వివరింపు ఫలంబు తోడ వీను లలరఁగన్. 132

వ. అనిన సూతుం డిట్లు వచించె. 133

తే.గి. భక్తునకు నీశ్వరున కింత వాసి లేదు
భవుని సాక్షాత్స్వరూపంబు భక్తగణము
భక్తజనమును బూజింప భక్తిఁ దన్నుఁ
గొలిచినట్లుగ మదిని బొంగును శివుండు. 134

తె.గి. ఈశుభక్తుని గొనివచ్చి యింపు మీఱఁ
జరణములు గడిగి తద్వారి శిరసు నందుఁ
దాల్చి తలయంటి శుభ్రవస్త్రము లొసంగి
పంచభక్ష్యాన్నములు పెట్ట వలయు భక్తి. 135

సీ. భవభక్తునకు నన్నపానంబు లిచ్చుట
దైవభక్తున కర్థదాన మిడుట
శర్వభక్తునకు స్రక్చందనాదు లొసంగి
పిలిచి కన్నియ నిచ్చి పెండ్లి సేఁత
యీశభక్తునకును గృహమును గట్టించి
భూదానగోదానములు లొసఁగుటయు

జలపాత్ర మిచ్చుట తిలదాన మిచ్చుట
భీష్మాతపము గాయు గ్రీష్మ వేళఁ

తె.గీ. తాలవృంతంబు నాతపత్రంబు నిడుట
యడుగులకుఁ బాదరక్షలు తొడుగుటయును
జల్లనౌ చల్ల యిచ్చుట శయ్య యిడుట
యభవభక్తార్చనం బందు రఖిలబుధులు. 136

మ. వినుఁ డీయర్థము తెల్లమౌ నొక పురావృత్తంబు వాక్రుచ్చెదన్
మును వైశ్యుం డొకఁ డుండె నీశ్వరపదాంభోజాతభక్తుండు గో
ధనధాన్యోజ్జ్వలసౌధయుక్తుఁడు సదా దానవ్రతాసక్తుఁ డా
తనికిన్ బుట్టిరి నల్వురాత్మజులు విద్యల్ నేర్చి రవ్వారిగన్. 137

తరువోజ:
వారిలో జ్యేష్ఠుండు బహుసత్యవాది భర్గపాదాబ్జాత భక్తి తత్పరుఁడు
సారంబు లేని దీసంసార మనుచుఁ జాల రోయుచు మోక్షసత్కాంక్ష తోడ
వారణాసికి నేఁగి భవభక్త వరుల భక్తితోఁ బూజించి స్వధనంబు నొసఁగి
కోరి విశ్వేశ్వరు గురులింగమూర్తిఁ గూరిమిఁ గొలిచి ముక్తుండయ్యె
నెలమి. 138

ఉ. రెండవపుత్త్రుఁ డగ్రజుని రీతిని భార్యను దోడుకొంచు నీ
శుండు పరాత్పరుండు గిరిశుండు వసించెడు సోమనాథస
న్మండల మేఁగి భక్తులకు మక్కువ రొక్కము లిచ్చి మ్రొక్కి శ్రీ
ఖండశశాంకమౌళికృపఁ గాంచె ననర్గళ మోక్షమార్గమున్. 139

ఉ. మూఁడవపుత్త్రుఁ డెంతయును మోసము నేరిచి బేరమందుఁ గొం
డీఁడయి ప్రల్లదీఁడయి యనేకధనంబులు గూడఁబెట్టియున్
బోఁడిమిఁ బూర్వపుణ్యమున ముక్తిని వ్యాఘ్రపురీమహేశు మూఁ
డేఁడులు గొల్చి భక్తుల కిచ్చి ధనంబు తరించె సంసృతిన్.

సీ. నాల్గవ పుత్త్రుండు ఫల్గుజీవనుఁ డౌచు
ధర్మమార్గము వీడి దుర్మతి యయి
పథికుల విప్రుల నిధనంబు నొందించి

విపులధనం బెల్లనపహరించి
నటులఁ బోషించుచు విటుల మన్నించుచు
గాయకులకు నాతతాయులకును
గల ధనం బొసఁగుచు వెలవెలందులఁ గూడి
వర్తించి మిగుల రోగార్తుఁ డగుచుఁ

ఆ.వె. ద్రిమ్మరంగ నొక్క బొమ్మరాకాసి య
వ్వాని నొడిసిపట్టె దాని నెఱిఁగి
బచ్చు వేగ నటకు వచ్చి పుత్త్రుని జూచి
యుల్లమందు మిగులఁ దల్లడిల్లి. 141

తే.గీ. సర్వశాస్త్రార్థవిజ్ఞుఁడౌ క్ష్మాసురేంద్రుఁ
జూచి దండప్రణామంబు లాచరించి
బహుళధన మిచ్చి తన పుత్త్రు పాటు చెప్పి
యడుగులను వ్రాల విప్రుండు నుడివె నిట్లు. 142

సీ. వసియింతు రెందేని బ్రహ్మయు విష్ణుండు
నఖిలామరులఁ గూడి యనుదినంబు
ప్రవహించు నెందేని బాపనాశిని యైన
మణిముక్త యను నది మహిమ గాంచి
భస్మమౌ నెందేని బ్రహ్మహత్యాసురా
పానహేమస్తేయ పాతకములు
విహరించు నెందేని విశ్వేశ్వరిని గూడి
యీశుండు వృద్ధాచ లేశుఁడనఁగ

తే.గీ. నెం దగస్త్యుండు తపియించె నీశుఁ గూర్చి
యట్టి వృద్ధాచలము చేరి యభవుఁ గొల్చి
భక్తి నూటయెన్మిది మార్లు వలపలించి
రుద్రభక్తులఁ బూజించి బ్రోవు పుత్త్రు. 143

శా. అద్ధాత్రీసురుఁ డిట్లు చెప్పిన విధం బాలించి యుల్లాసియై
వృద్ధా వైశ్యుఁడు మిత్రబాంధవులతో నిల్లాలితోఁ బుత్త్రితో

శుద్ధాంతఃకరణంబు నందు జగదీశున్ భక్తి భావించుచున్
వృద్ధక్ష్మాధర మేఁగెఁ బర్వతసుతావిశ్వేశ శుద్ధాంతమున్. 144

సీ. సిద్ధసాధ్యమునీంద్రశుద్ధవాసంబైన
వృద్ధాచలంబునకేఁగి వేగ
మణిముక్త జలములమజ్జనం బొనరించి
వృద్ధాచలేశ్వరువినుతి చేసి
యభవలింగమునకునష్టోత్తరశతప్ర
దక్షిణంబు లొనర్చిదీక్షతోడ
మహనీయ మైనట్టిమఠమును గట్టించి
శివయోగివరుల వశింపఁజేసి

తే.గీ ధనము ధాన్యంబు తిలలునుదండులములు
తైల ముదకంబు పట్టుదుకూలములును
గుసుమమాలలు నగలునుగుస్తరించి
భరభక్తుల కాతండుభక్తి నొసఁగె. 145

తె,గీ. ఒక్క యేఁడిట్లు భక్తులనుపచరింప
బచ్చుకొడు కంత రోగంబు వాసె బ్రహ్మ
రాక్షసుఁడు వీడెఁ గోమటిరమణి తోడ
బంధువుల తోడఁ గైవల్యపదము గాంచె. 146

క. కడు భక్తిన్ వృద్ధాద్రిని
బిడికెఁడు భోజనము పెట్టవేమడుఁగు లగున్
బిడికెం డన్నము భక్తుల
కిడక కుడుచు వాఁడు మోక్షమెట్టులఁ గాంచున్. 147

క. ఈ వైశ్యుని వృత్తాంతము
వేవిధముల నాలకించిశ్వేతమునీంద్రుం
డావిర్భూతముదంబున
శ్రీవృద్ధాచలము చేరెశివుని భజింపన్. 148

ఉ. శ్వేతమహర్షి వృద్ధగిరిఁజేరి మహేశ్వరుఁ బూజ చేయుచున్
బూతజలప్రవాహ మణిముక్తను దానములాడ నిచ్చలున్

శ్వేతనదీశుభాఖ్య నదికవిశ్రుతి కెక్కెను శైవభక్తులన్
బ్రీతిగ నర్చనేయుచు వసించెె మునీంద్రుఁడు ముక్తి
కామినిన్. 149

క. శివపూజల నొనరింపుఁడు
శివశక్త్యర్చనము లెపుడుఁ జేయుఁడు భక్తిన్
శివభక్తుల సేవింపుఁడు
శివసాయుజ్యంబు మీరుఁ జెందుఁడు మౌనుల్. 150

క. ఇటు సూతుఁడు సెప్ప మునుల్
నిటలేక్షణు భక్తపాలుఁ గనిన్ నిటలతటీ
ఘటితాంజలిపుటు లగుచున్
బటుపూజ లొనర్ప శివుఁడు ప్రత్యక్షంబై. 151

పాలశదశము:
స్ఫుటఘటితమకుటశశి సురతటిని జూటన్
గటితటిని బటిసడలఁ గటకఫణు లూడన్
వటవిటపినికటమున భటపటహవాద్యా
ర్భటు లడర మృడుఁ డపుడు పటునటన మాడెన్. 152

వ. ఇట్లు మహానటుండు నాట్యంబును బ్రదర్శించి యంతర్హితుం డయ్యె నంత నక్కాంతారవాసు లనంతసంతోషంబున సూతుం గాంచి. 153

7. ముక్తిసాధనకథనము.

ఉ. కొందఱు జ్ఞానయోగమునుఁ గొందఱు కేవలకర్మయోగమున్
కొందఱు భక్తియోగమును గొందఱు జ్ఞానసమేతకర్మమున్
గొందఱు యజ్ఞయాగములుఁ గొందఱు దానమహావ్రతంబులున్
గొందఱు ఘోరమౌ తపముఁ గొందురు నిశ్చలమోక్షకాంక్షులై.

వ. కొందఱు బ్రహ్మచర్యాశ్రమంబు నవలంబింతురు. కొందఱు గార్హస్థ్యంబును స్వీకరింతురు. కొందఱు వానప్రస్థంబును బ్రశంసింతురు. కొందఱు సన్న్యాసాశ్రమంబునఁ జరింతురు. కొందఱు తీర్థయాత్రలను గావింతురు. కొందఱు స్వాధ్యాయంబును బఠింతురు. కొందఱు శివాలయం

బుల వసింతురు. పండితులు గూడ ముక్తికి భిన్నభిన్నమార్గముల నుప దేశింతురు. వీనిలో శ్వశ్రేయసప్రదంబగు మార్గంబు నిశ్చయించి వచింపుమని ప్రార్థించిన సూతుం డిట్లనియె. 155

సీ. ఈ యర్థ మెఱుఁగంగ నెంచి వేదవ్యాస
మౌని మున్ను వైకుంఠపురము చేరి
యాదినారాయణు నతిభక్తి వినుతించి
పృచ్ఛింప వెన్నుండు ఋషిని గొంచు
భారతి బ్రహ్మయుఁ బౌలోమి యింద్రుండు
ముప్పదికోటులు మూఁడుకోట్లు
బృందారకులు గొల్వ శ్రీమహాలక్ష్మి కెం
గేలుఁదమ్మిని గేల గీలుకొలిపి

తే.గీ. రజతగిరి కేఁగి పార్వతీరమణిఁ గూడి
కార్తికేయవినాయక కలితుఁ డగుచు
నందియును భృంగి ప్రమథులు నతు లొనర్ప
నిండుకొలువున్న శంకరు నెమ్మిఁ గాంచె. 156

శా. అద్రిస్వామికుమారికాకుచతటీవ్యాలిప్తకస్తూరికా
ముద్రాముద్రితవక్షు నక్షయమహామోక్షప్రదున్ నిర్మలున్
గద్రూజాంగదు భక్తతాపసమనః కంజార్కుఁ జిద్రూపునిన్
రుద్రుం బూర్ణదయాసముద్రు నతుఁడై మ్రొక్కెన్ సురౌఘం బుతోన్. 157

ఉ. వ్యాసుఁడు విష్ణువున్ విధియు వజ్రధరుండును సర్వనిర్జరుల్
శ్రీసతి వాణియున్ శచి సురీతతి చేరి నమస్కరింప సం
తోసము పల్లవింప దయ నాలోకన వారల గారవించుచున్
వ్యాసుని ప్రశ్నమున్ విని పురారి మురారి సురాలి నిట్లనున్. 58

మ. మము నీప్రశ్నమె వేయుచున్నయది యుష్మత్స్వోదరీరత్నమా
యమ నారాయణ! బాదరాయణ! వినుం డో నిర్జరుల్, సర్వయ
జ్ఞములున్ బూజలు దానముల్ జపతపస్స్వాధ్యాయతీర్థంబులున్
గ్రమముక్తిం బచరించుఁ గాని యవి సాక్షాన్మోక్ష మీఁజాలునే?

క. జ్ఞానంబే వరమోక్షని
ధానంబగు యజ్ఞయాగదానవ్రతముల్
జ్ఞానమునకు హేతువులగు
జ్ఞానము వేదాంతవాక్యజన్యము వినుఁడీ. 160

తే.గీ. శ్రౌతకర్మంబు లెల్లను జలుపు వారు
స్మార్తకర్మంబు లొనరింపఁ జాలు వారు
బహుజనుశ్శుద్ధు లైభక్తి వఱలు వారు
నాదయన్ బొంద నేర్తురు జ్ఞానపథము. 161

తే.గీ. సన్న్యసించిన విప్రుండు జ్ఞానరీతి
కధికృతుండగు నన్యులౌ యవనిసురులు
రాజులును వైశ్యులును ద్విజరమణు లెల్ల
జ్ఞానమొందుదు రుపనిషత్స్మరణిఁ గాంచి. 162

తే.గీ. స్త్రీలు శూద్రులు భారతాదికపురాణ
ములను వినుచును జ్ఞానంబుఁ బొందఁబోలు
నంత్యవర్ణులు దేశభాషాంతరస్థ
కావ్యములు విని జ్ఞానంబుఁ గాంచవలయు. 163

తే.గీ. శ్రవణమననాదు లించుకసలుపకయును
దొల్లి శ్రీవామదేవుండు తల్లిగర్భ
మందె బ్రహ్మభావము బొందె నట్టివారు
పూర్వజనురాత్త విజ్ఞానపూతు లరయ. 164

తే.గీ. శుద్ధచిత్తుఁడు విజ్ఞానసిద్ధిఁ గాంచు
జ్ఞాన మొక్కటి ముక్తికి సాధనంబు
యజ్ఞదానాదికర్మంబు లమలచిత్త
శుద్ధికివి జ్ఞానసిద్ధికిఁ బద్ధతులగు. 165

తే.గీ. బహుళజన్మసంసిద్ధుండు వడయు ముక్తి
నరుఁడు ముక్తికి యత్నం బొనర్పవలయు
ధరణి వెలసిన పుణ్యతీర్థముల నన్నుఁ
బూజ సల్పిన నిర్యత్నముక్తిసిద్ధి. 166

ఉ. క్షోణి నతిప్రసిద్ధపరిశుద్ధపవిత్రసుతీర్థమైన వా
రాణసిపట్టనంబున నిరంతరమున్ వసియించు వానికిన్
బ్రాణము లుత్క్రమించు సమయంబున నే దరికేఁగి నిత్యని
ర్వాణసుఖప్రదంబు ప్రణవం బుపదేశ మొనర్తు నెమ్మితోన్.

సీ. రాజిల్లు నేక్షేత్రరాజంబు దక్షిణ
కైలాస మనియెడిఖ్యాతిఁ గాంచి
ప్రవహించు నేయద్రిస్వర్ణముఖీనది
క్షాళితాఖిలపాపజాల యగుచు
నేసీమ వసియింతు రీబ్రహ్మ యీవాణి
యింద్రుండు శచి నీవు నిందిరయును
నేనుందు నెచ్చోట జ్ఞానప్రసూనాంబ
యను నీ యుమను గూడి యనుదినంబు

తే.గీ. నట్టి శ్రీకాళహస్తి యందద్ద ముండి
మాఘమాసమఘర్క్షమల్ మలయు వేళ
నర్కవారం బమావాస్య యలరు వేళ
నన్నుఁ బూజించి మోక్షంబు నరుఁడు గాంచు. 168

తే.గీ. వ్యాఘ్రపట్టణసీమకు శీఘ్రమేఁగి
యఖిలభవభంగ శివగంగ యందుఁ దోఁగి
యచటవర్షంబు కొనసాగి యఘము లీఁగి
వీఁగి ననుగొల్చి ముక్తికి లోఁగు యోగి. 169

క. శ్రీమద్వృద్ధాద్రికిఁ జని
నేమంబున నన్నుఁ గొలిచి నెటి రెండేఁడుల్
శ్రీమణిముక్తం దోఁగినఁ
గామించును వాని ముక్తి కాంత స్వయముగన్. 170

ఉ. శ్రీసముపేతతీర్థములసేవను జిత్తవిశుద్ధి బ్రహ్మజి
జ్ఞానయు మోక్షసిద్ధియును గల్గును మీరును యాత్ర సల్పుఁడో
వ్యాస! రమేశ! నల్వ! సురవల్లభ! దేవతలార! యంచుఁ గై
లాసవిభుండు సెప్పె విపులాధరకన్యయు సంతసింపఁగన్.

మ. ప్రణుతామ్నాయుఁడు శంకరుండు వివరింపన్ సర్వమాలించి వే
ప్రణతుల్ సేసి జనార్దనుండు సురలన్ వ్యాసర్షి వీడ్కొల్పి ద
క్షిణకైలాసము చొచ్చి హేమఖరిశ్రీవారిలో మున్గి శ్రీ
క్షణు వీక్షించి వికుంఠధామమునకున్ సాగెన్ రమాకాంతతోన్.

ఉ. బ్రహ్మపురాణకర్త యగు వ్యాసుని ప్రశ్నకు సంతసించుచున్
జిహ్మగనాథభూషణుఁడు చెప్పిన సూక్తులు లోఁ దలంచుచున్
బ్రహ్మయు వృద్ధభూధరము వచ్చి వడిన్ మణిముక్త మున్గి శ్రీ
బ్రాహ్మియుఁ దాను గూడి యభ వస్తుతి చేసి చనెన్ స్వలోక
మున్. 173

క. వ్యాఘ్రాజినచేలమహా
వాగ్ఘ్రదమున నోలలాడి వాసవముఖ్యుల్
వ్యాఘ్రేశ్వరతీర్థము చని
శీఘ్రింబుగ శివుని గొల్చి చేరిరి దివికిన్. 174

సీ. వ్యాసమౌనీంద్రుండు వారణాసికి నేఁగి
యభ్రగంగా ప్రవాహమున మునిఁగి
మణికర్ణికాతీర్థ మహితతోయంబుల
నఘమర్షణస్నాన మాచరించి
శ్రీమన్మహాదేవు శ్రీవిశ్వనాయకు
భువనవంద్యుని మ్రొక్కి పూజ చేసి
యన్నపూర్ణాదేవి నభవుని దేవేరి
శ్రీవిశాలాక్షిని జేరి కొలిచి

తే.గీ. ఢుంఠివిఘ్నేశు నెఱిఁగి యకుంఠభక్తిఁ
గాలభైరవు లోలార్కుఁ గార్తికేయుఁ
గేశవస్వామిఁ గీర్తించి కాశి యందె
శిష్యులను గూడి పెక్కేండ్లు చెలఁగి యుండె. 175

తే.గీ. కాళహస్తీశుఁ బుండరీకస్థశివుని
వృద్ధగిరినాథుఁ గాశికావిశ్వనాథు

నేను గొల్చితి నొక్కొక్కరయేఁడు భక్తిఁ
దీర్ఘయాత్రిలు గావింపుఁడర్ధి మునులు. 176

8. కాలపరిమాణము—తదనవచ్ఛిన్న శివస్వరూపకధనము.

క. అని సూతుఁడు వచియించిన
విని నైమిశమునులు మిగులవేడుకఁ గాలం
బును దత్పరిమాణంబుఁ ద
దనవచ్ఛిన్నస్వరూపునానతి యీవే! 177

వ. అని యడిగిన సూతుం డిట్లనియె

తే.గీ కాలపరిమాణసంఖ్యను గణుతి సేయ
ఫణిపవాక్పతిగీష్పతిప్రభృతిబుధుల
కలవి గాదన్న నాబోంటికలవి యగునె?
సంగ్రహంబుగ వివరింతు శ్రద్ధ వినుఁడు! 179

వ. మునీంద్రులారా! వాస్తవమునకు మాయాత్మకం బగు కాలంబు సత్యంబుగాదు. శశవిషాణతుల్యంబగు కాలంబునకుఁ బరిమాణంబు వచింప నేరికి శక్యంబగు? నయినను యుగమన్వంతరకల్పమహాకల్పాది వ్యవహారంబు ననుసరించి కాలపరిమాణంబు వక్కాణింతు సావధానులరై యాకర్ణింపుఁడు. పదునైదు నిమేషంబు లొక్క కాష్ఠ యగు నట్టి ముప్పది కాష్ఠలొక కళ యగు నట్టి ముప్పది కళ లొక ముహూర్తం బగు నట్టి ముప్పది ముహూర్తంబు లొక దివారాత్రిం బగు నట్టి పదియే నహోరాత్రంబు లొక పక్షంబగు, శుక్లపక్షభేదంబుచే నొప్పు నట్టి రెండు పక్షంబు లొక మాసంబగు నట్టి యాఱు మాసంబు లొక్క యయనంబగు దక్షిణోత్తరభేదంబుచే నొప్పు నట్టి రెం డయనంబు లొక్క సంవత్సరం బగు నిది మానవకాలసంఖ్యాప్రకారంబు. దేవతలకు దక్షిణాయనంబు రాత్రియు నుత్తరాయణంబు పవలు నగు నిట్లు దేవమానంబునఁ బక్షమాసాయనసంవత్సరప్రకారం బెఱుంగనగు నది యెట్లంటిరేని వినుండు! కాలమానంబు సావనమానం బనియు సౌరమానం బనియుఁ జాంద్రమానం బనియు ముప్విధంబుల వ్యవహరింపఁబడు నందు సూర్యసావనంబు మానవులకును జాంద్రమానంబు పితృదేవతలకును సౌరమానంబు దేవత

లకు వర్తించు నందు సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వఱకును గల యఱువది గడియల కాలంబు మానవుల కొక్క యహోరాత్రం బగు. చంద్రవృద్ధిక్షయంబులచే నేర్పడు శుక్లపక్షంబును గృష్ణపక్షంబును గలిసి చాంద్రమాసం బగు నందుఁ బితృదేవతలకుఁ గృష్ణాష్టమిని సూర్యోదయంబును శుక్లాష్టమిని సూర్యాస్తమయంబును సంభవించి యమావాస్యనాఁడు మధ్యాహ్నంబును బౌర్ణమాసినాఁ డర్ధరాత్రంబు నగునిట్లు మానవ చాంద్రమాసంబు పితృదేవతల కొక్క యహోరాత్రం బగు. ముప్పది దినంబులు గలది సావనమాసంబు. సూర్యుని యొక్క మేషాదిరాశి సంక్రమణము ననుసరించి సౌరమాసంబులు గలుగు. కర్కాటకసంక్రమణము మొదలుకొని మకరసంక్రమణము వఱకు దక్షిణాయనంబును మకరసంక్రమణము మొదలుకొని కర్కాటకసంక్రమణము వఱకు నుత్తరాయణంబును నగు నిట్లు మానవుల దక్షిణాయనంబు దేవతలకు రాత్రియు నుత్తరాయణంబు పవలు నయి మానవసంవత్సరం బొక్క దేవదినం బగు. మేషవృషభమిధునకర్కాటకసింహకన్యారాశు లాఱును నిరక్షదేశంబున కుత్తరంబునఁ బరిథవిల్లును గాన నచ్చటి యాదిత్యు నాదిత్యులు నిత్యంబు సందర్శించుటచే నుత్తరాయణంబు వారి కహంబును దులావృశ్చిక ధనుర్మకరకుంభమీనరాశు లాఱును నిరక్షదేశంబునకు దక్షిణంబున నత్తమిల్లును గాన నచ్చటి యహస్కరు ననిమిషులు గాంచక పోవుటచే దక్షిణాయనంబు వారికి రాత్రియు నగు నగుచో నుత్తరాయణసమయంబున మకరకుంభమీనరాశులలో మానత్రియంబు పరిద్యోతనుం డుద్ద్యోతించు నపుడు తద్దర్శనం బద్దివిజులకుఁ గల్గదు గాన నహం బెట్లగుఁ? నట్లే దక్షిణాయనసమయంబునఁ గర్కాటకసింహకన్యారాశులలో ఛాయావల్లభుఁడు సంచరించు నపుడు తదాలోకంబు నాకులకు సోఁకుంగావున రాత్రి యెట్లగు నందు రేని యాలింపుఁ డిచ్చట నుత్తరాయణశబ్దంబుచే మకరాదిమాసషట్కంబును దక్షిణాయనశబ్దంబుచేఁ గర్కాటకాదిమాసషట్కంబును వివక్షితంబులు గావు ముఖ్యమైన నుత్తరాయణశబ్దంబుచె నుత్తరగోళభూతం బగు మేషాదిమాసషట్కంబును దక్షిణాయనశబ్దంబుచే దక్షిణగోళభూతం బగు తులాదిమాసషట్కంబును గ్రహింపవలయు నుత్తరగోళంబు నిరక్షదేశంబున కుత్తరంబున దక్షిణగోళంబు నిరక్షదేశంబునకు దక్షిణంబున

నుంటచే నుత్తరదక్షిణాయనంబులు దేవతల కహోరాత్రంబు లగు నని యూహింపవలయు నట్టి మున్నూట యఱువది యహోరాత్రంబు లొక్క దేవవర్షంబగు నట్టి పండెండువేలు దివ్యవర్షంబులు కృతత్రేతాద్వాపర కలిరూపం బగు చతుర్యుగం బనంబడు. 180

తే.గీ. ఎసఁగు నాలుగువే లేండ్లఁ గృతయుగంబు
మూఁడువే లేండ్లతోఁ ద్రేతఁ బొలుపు మీఱు
వఱలు రెండువే లేండ్లతో ద్వాపరంబు
కలుగు నొకవేయి యేండ్లతోఁ గలియుగంబు. 181

వ. ఈ నాలుగు యుగంబులును సంధ్యాసంధ్యాంశంబులతోఁ గూడి ద్వాదశసహస్రవర్షంబుల నొప్పారు నది యెట్లంటిరేని గృతయుగప్రమాణంబు నాలుగువేలబ్దంబులు. తద్యుగమున కాది యందు రెండు వంద లేండ్లు నవసానంబు నందు రెండువంద లేండ్లు సంధ్యలు. తత్సన్నికృష్టంబులై యాది యందు రెండువంద లేండ్లు నంత్యమందు రెండువంద లేండ్లు సంధ్యాంశంబులై యెనిమిది వందలేం డ్లేఁగు నిట్లు సంధ్యాసంధ్యాంశంబులతోఁ గృతయుగంబు నాలుగువేలు నెనిమిది వంద లేండ్ల తోడను దత్పాదోనంబై త్రేతాయుగంబు మూఁడువేలు నాఱువంద లేండ్ల తోడను దదర్ధంబై ద్వాపరంబు రెండువేలు నన్నూఱేండ్ల తోడను దత్పాదంబై కలియుగంబు పండ్రెండు వందలేండ్లతో నొప్పు. మానవమానంబునఁ బదియేడు లక్షలు నిరువది యెనిమిది వేలేండ్లు కృతయుగంబునకుఁ బండ్రెండు లక్షలు తొంబదియాఱు వేలేండ్లు త్రేతాయుగంబునకు, నెనిమిది లక్షలు నఱువది నాల్గు వేలేండ్లు ద్వాపరయుగంబునకు, నాల్గు లక్షలు ముప్పదిరెండు వేలేండ్లు కలియుగంబునకు నగు నిట్లు చతుర్యుగంబునకు నలువది మూఁడు లక్షలు నిరువది వేలు మానవసంవత్సరంబు లగు నట్టి డెబ్బది యొక్క చతుర్యుగంబు లొక్క మన్వంతరంబగు నట్టి పదునాల్గు మన్వంతరంబులు బ్రహ్మ కొక్క పగలగు నంతియ రాత్రి యగు నిదియే కల్పం బనంబడు నట్టి మూఁడు వందలు నఱువది కల్పంబులు బ్రహ్మ కొక్కవర్షంబగు నట్టి నూఱేండ్లు బ్రహ్మయుఃప్రమాణం బను నది ద్విపరార్ధం బని వ్యవహరింపంబడు నిట్టి ద్విపరార్ధంబున బ్రహ్మయుఃప్రమాణంబు నెల్లిన పదంపడి 182

తే.గీ. విశ్వ మంతయు మాయలో విలయ మొందుఁ
ప్రకృతిని లయంబు గాంతురు భవుఁడు హరియు
శ్రీత్రిమూర్తుల మూర్తులు స్వీయకార
ణముల లయమొందుఁ దెలియుఁడు విమలబుద్ధి. 183

సీ. అన్యథాభానంబు నందుట మాయ నా
వ్యక్తంబు గామి నవ్యక్త మనఁగ
నాత్మతత్త్వం బెల్ల నణఁచుట తమమునాఁ
దథ్యంబు గాకుంట మిథ్య యనఁగ
విద్యావినాశ్యమై వెలసి యవిద్యనా
సద్విలక్షణమై య సత్తనంగ
శుక్తిని రజతంబుఁ జూపుట భ్రాంతినాఁ
గార్యనిష్పత్తిచేఁ గారణ మన

ఆ.వె జగతి వివిధగతుల నెగడిన యా మాయ
బ్రహ్మవిష్ణురుద్ర భావ నందు
విశ్వనాథునం ద భేదస్థితిని గాంచి
ప్రలయకాలమందు విలయ మొందు. 184

తే.గీ. మాయ యనఁగ మహేశ్వర మహిత శక్తి
కాలకాలుని మాయచేఁ గాల మొదవుఁ
గాలవశగతి సకలలోకంబు లొప్పు
నిఖిలజంతుసమూహంబు నివ్వటిల్లు. 185

తే.గీ. కాయజారాతిచేఁ గల్గు మాయ వోలెఁ
గాల మెల్లను శివునిచేఁ గల్పితంబు
పంచభూతంబులును గాల వశములగును
శివుఁడె కాలానవచ్ఛిన్నుఁ డవు నొకండు. 186

శా. శ్రీలేఖావళిమౌళిమంజుమణిరోచిర్దీప్తపాదాబ్జుఁడౌ
కైలాసేశ్వరు నాజ్ఞ చేతను సదా కాలంబు వర్తిల్లు న
క్కాలంబందునె డింది సర్వజగముల్ కాలంబు చేయున్ మహా
కాలాగ్నివుఁడు కాలకాలుఁ డొకఁడే కాలానవచ్ఛిన్నుఁడౌ. 187

తే గీ. శివుని దివ్యప్రసాదంబుచేత బ్రహ్మ
శివుని దివ్యప్రసాదంబుచేత శౌరి
శివుని దివ్యప్రసాదంబుచేత నిందుఁడ
తులపద మొంది రంచును శ్రుతులు వలుకు. 188

క. పలువురు హిరణ్యగర్భులు
పలువురు నారాయణులును బలువురు రుద్రుల్
పలువురు నాకాధీశులు
విలయం బందుదురు శివుఁడె వెలయు సతంబున్. 189

తే.గీ. స్రష్ట రాజసగుణముచే సృష్టి చేయు
శౌరి సాత్త్వికగుణముచే జగతిఁ బ్రోచు
మృడుఁడు తామసగుణముచే మడియఁ జేయు
నీ త్రిమూర్తుల లీలల నెసఁగు జగము. 190

తే.గీ. బ్రహ్మకును బెక్కు మూర్తులు వఱలుచుండు
విష్ణున కనంతమూర్తులు వెలయుచుండు
నీశున కనేకమూర్తులు నెసఁగుచుండు
నన్ని మూర్తుల యందుఁ దా నభవుఁ డుండు. 191

క. సత్యుండై త్రైకాలిక
నిత్యుండై యఖిలశాస్త్రనిగమాగమసం
స్తుత్యుండై యభవుఁ డహం
ప్రత్యయరూపమునఁ దోఁచుఁ బ్రాణుల కెల్లన్. 192

చ. అఘము లొనర్చి సంసృతిమహాంబుధి మున్గుచుఁ దేలుచున్ గడున్
లఘుమతు లైన దుర్జను లిళాధరవాసు నెఱుంగ నేర్తురే?
విఘటితపాపు లార్జితసువిద్యు లనేకజనుఃప్రపూతు లా
మఘవముఖామరప్రభు నుమావరుఁ గాంతురు భక్తియుక్తులై.

క. ఏయే భావంబులతో
నేయే దేవతల నైన నేయే భక్తుల్

ఏయే గతి నర్చించిన
నాయా రూపముల వారి • నభవుఁడు ప్రోచున్. 194

తే.గీ. విమలమగు నద్దమందు న • బింబ మట్లు
రుద్రమూర్తుల శివుఁడొప్పు • భద్రరీతిఁ
గానఁ దన్మూర్తులను భక్తి • గరిమఁ గొల్చు
వారలకు ముక్తి కొంగుబం • గారమగును. 195

తె.గీ. కొన్ని సూక్తంబు లింద్రుని • గొన్ని వాయుఁ
గొన్ని యగ్నిని గొన్ని య • ర్కున్నుతించుఁ
గొన్ని బ్రహ్మను విష్ణుని • గొన్ని పొగడు
నన్ని వేదంబు లీశ్వరు • నభినుతించు. 196

తె.గి. ఒకటి యగ్నిని భాస్కరు • నొకటి చెప్పు
రెండు శ్రీబ్రహ్మదేవుని • బ్రీతిఁ బలుకు
నాల్గు శ్రీవిష్ణుమూర్తి గు • ణంబు లెన్నుఁ
బదిపురాణంబు లీశ్వరుఁ • బ్రస్తుతించు. 198

చ. శివుఁడు సమస్తజంతుగణ • జీవహృదుజ్జ్వలదాత్మరూపుఁడౌ
భవుఁ డురుభక్తజన్మమృతి • పాశవిమోచకుఁడౌ నుమాసతీ
ధవుఁడు మహేంద్రవిష్ణువిధి • దైవతసేవ్యుఁడు నౌను నందినైం
ధవుఁడు జగజ్జనిస్థితివి • నాశనకారకుఁడౌ నెఱుంగుఁడీ! 198

శా. వేదారణ్యము సోమనాథమును శ్రీ • వృద్ధాద్రి వల్మీకమున్
గేదారంబును వ్యాఘ్రపట్టణము శ్రీ • గిర్యగ్రిమున్ గాశియున్
శ్రీదక్షాధ్వరతీర్థరాజమును శ్రీ • శ్రీకాళహస్త్యద్రియున్
శ్రీదాక్షాయణికిన్ మహేశ్వరునకున్ • బ్రేమంబులౌ క్షేత్రముల్.

తె.గీ. భవ్యతీర్థంబులను గాల • పాశనాశు
శ్రీమహాదేవు సర్వసా • క్షిని మహేశుఁ
జంద్రశేఖరు నంబికా • సహితుఁ గొలుఁడు!
శివుని కంటెను మోచకుం • డెవఁడు గలఁడు? 200

క. శ్రోత్రవ్యుఁడు శంకరుఁ డగు
నేతవ్యుఁడు వేదములకు • నీలగళుండౌ

స్తోతవ్యుఁడు మంతవ్యుఁడు
ధ్యాతవ్యుఁడు పార్వతీశుఁడభవుఁడె వినుఁడీ! 201

క. అని సూతుఁడు వివరించిన
మును లెఱిఁగిరి కాలమూలమును దన్మానం
బును గాలపరిస్థితులకు
ననవచ్ఛిన్నాత్మ దైనయభవు మహేశున్. 202

వ. తదనంతరంబు నైమిశనివాసులగు శౌనకాదిమహర్షు లిట్లనిరి.

9. పృథివ్యుద్ధరణము—వరాహావతారము.

శా. కాలంబున్ శితికంఠతత్త్వమును వక్కాణింపఁగా వింటి మిం
కెలా బ్రహ్మ యహంబు నెల్లఁగ జగంబేకార్ణవంబయ్యె? శ్రీ
కోలాకారము దాల్చి సర్వజగతీగోళంబు నెట్లెత్తె? మున్
శ్రీలక్ష్మీశుఁడు తచ్చరిత్రము మహర్షీ! మాకుఁ జెప్పంగదే!

క. సారంబులు భవతోయధి
పారంబులు భూతలోకభారంబులు భూ
దారంబులు రక్షస్సం
హారంబులు వాసుదేవునవతారంబుల్. 205

వ. అనవుడు సూతుండిట్లనియె. 206

క. ఆర్తజనదుఃఖలతికా
కర్తనములు భవతమోవికర్తనములు శ్రీ
నర్తనములు ముక్తిరమా
వర్తనములు విష్ణుమూర్తివరకీర్తనముల్. 207

శా. కల్పాంతంబున సర్వభూతయుతలోకంబెల్ల నేకార్ణవా
నల్పాకారము దాల్చె వెలుఁ గడఁగెన్ గాటంబుగాఁ జీఁకటుల్
నల్పుల్ గ్రమ్మెను భూమి బ్రుంగుడువడెన్ వారాన్నిధిన్ శేషు
నున్
దల్పంబందునఁ బవ్వళించెను జగన్నాథుండు యోగాత్ముఁడై

తే.గీ. వేయి కన్నులు తలలును వెలయుచుండ
వేయి చేతులు నడుగులు వెల్గుచుండ

వెలుఁగులకు నెల్ల వెలుఁగైనవెన్నుఁ డపుడు
పాఁపరాసెజ్జ మున్నిటఁబవ్వళించె. 209

తే.గీ. ఋతము సత్యంబు బ్రహ్మమోయీశుఁ బురుషు
నూర్ధ్వరేతు విరూపాక్షునోముఁ బరముఁ
గృష్ణ పింగళుఁ దలఁచుచువిష్ణుమూర్తి
యుదధి ఫణిశయ్య శయనించెయోగనిద్ర.

వ. ఇట్లు ప్రళయసముద్రంబున నిద్రించిన శ్రీమన్నారాయణుని గూర్చి పెద్ద లీశ్లోకంబు నుదాహరింతురు. 211

శ్లో. ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః।
తా యదస్యాయనం తేన ప్రోక్తో నారాయణః స్వయమ్॥ 212

వ. అప్పు లన నారాశబ్దంబుచేఁ జెప్పంబడు జలంబులు. నరాఖ్యం డగు పరమాత్ముని యపత్యంబు లగుటను నరుం డగు హిరణ్యగర్భుం డందుఁ బొడముటను నయ్యప్పులు నరసూను లనంబడు. అజ్జలంబులు పరమాత్ముం డగు తనకు నాశ్రయంబు లగుటం జేసి యతండు నారాయణుం డయ్యె నట్టి శ్రీమన్నారాయణుండు యోగనిద్ర నుండి మేలుకొని శ్రీమత్పరమేశ్వరాజ్ఞచే విలయసమయసముద్రమధ్యంబున మునింగిన మహీమండలంబు నుద్ధరింపం దలంచి. 213

సి. దీర్ఘఘోణోద్భవఘుర్ఘురనిర్ఘోష
బధిరితాశాగజప్రకర మైన
క్రకచ సన్నిభమహోత్కటినదంష్ట్రాప్రభా
ధఃకృతమార్తాండధామ మైన
ఖరఖురపుటతటఘట్టనోద్ధృతరజః
ప్రచ్ఛన్నభూనభోభాగ మైన
చటులసటాచ్ఛటాచ్ఛన్నదీవ్యత్తనూ
వ్యాప్తవిశ్వాజాండభాండ మైన

తే.గీ. యజ్ఞవారాహమూర్తితోనవతరించి
క్రూరదంష్ట్రావిటంకాగ్రికోటి ధరణి

సవదరించి యథాస్థితి సంతరించె
నాదినారాయణుండు కల్పాదియందు. 214

సీ. మార్తాండ చంద్రమోమండలంబులు రెండు
కర్ణకుండలములై కాంతు లినఁ
గనదంతరిక్షనక్షత్రపంక్తులు కంధ
రమున నక్షత్రహారములు గాఁగ
గౌరిజ లందునఁ జిక్కుకొన్న మందర మేరు
గిరులు మువ్వల రాలమురువు సూప
నుల్లోలచుంబితవ్యోమంబులౌ సము
ద్రములు నాల్గు ఖురావటములు గాఁగ

తే.గి. నదరి కుడిచూపు బడిచూపు పడిన చోటఁ
బెలుచ బీతెండ రేయెండ పెనగొనంగఁ
గపటకిరి యైన హరి యెత్తెఁ గఠినదంష్ట్రి
మహితజలనిధిమగ్నభూమండలంబు. 215

సీ. బొబ్బసి గొట్టంబుముం దూఁద గాలి కూ
గెడి మెట్టతామరగింజ వోలె
ముదురంగ ముగ్గినమొగలి పూపొత్తుపైఁ
దేలి యాడుచు వ్రాలుతేఁటి వోలె
నైరావణగజంబుచారుశుండాగ్రభా
గమున నొప్పెడు నల్లకలువ వోలె
ధవళపక్షము నందుఁ జవితి చందురు శృంగ
మధ్య మందున్న బింబంబు వోలెఁ

తే.గి. బచ్చపుత్తడి యమ్ముపైబంతి వోలె
నిడుద బంగారు కామపైగొడుగు వోలెఁ
గూటకిటిరాజు కరవాఁడికోఱ యందు
నఖిలసర్వంసహాగోళమందగించె. 216

చ. కమఠము మూలకంద మయికాళము దేహము నాళమై కిరీం
ద్రము పెనుగోఱ పీఠ మయిదంతులు తేకులు గాఁగ మేరుభూ

ద్రమము మృదుకోళమై దివినిఁ గ్రమ్మిన మేఘము తేఁటి గాఁగ సం
ద్ర మనెడి కొల్నిలో మొలచునల్లనికల్వయి భూమి భాసిలెన్.

తే గి. తన్ను రక్షించు విభుఁడంచుఁ దమక మొప్ప
వలచు పంటవలంతినిఁ బంట నొత్తి
కదిసి భూదారకాంతుండుఁ గౌఁగిలింప
భూనవోఢ ముదధిలోఁ మునిఁగి తేలె. 218

తే.గి. కడలి మునిఁగిన పుడమినిఁ వెడల నెత్తి
పురములను గ్రామముల వనములను నదుల
ద్వీపముల ఖండముల నెల్లఁ నేర్పరించె
సవనకిటిమూర్తి దేవతాచక్రవర్తి. 219

క. భూమండలంబు నిమ్మై
గోముగ నిలుపంగఁ గాంచి కుతుకము తోడన్
శ్రీమద్యజ్ఞవరాహ
స్వామికిఁ గై మోడ్పి రెల్ల జనలోకజనుల్. 220

క. వాణియు నజుఁడును శివళ
ర్వాణులు నింద్రుండు నతని రాణియు దివిజ
శ్రేణియు నుతించి రవిత
క్షోణీఁ జతుష్పాణి ధవళ ఘోణిన్ బోణిన్. 221

దండకము:

శ్రీమన్మహాయజ్ఞవారాహమూర్తీ! ప్రశాంతావనీమండలార్తీ! సదా దేవతాచక్రవర్తీ! చతుర్వేదవర్తీ! జగద్వ్యాప్తకీర్తీ! శతార్క ప్రభాస్ఫూర్తి! కారుణ్యమూర్తీ! సమస్తసర్వగిర్వాణకోటీరమాణిక్యభా రాజినీరాజితాంఘ్రిద్వయా! యద్వయా! యిందిరాసుందరీచిత్తపుల్లాంబు జేందిందిరా! నిత్యనీలాసతీసన్మనోమందిరా! భూమిభామామణీశుభ్రహృత్ప ల్వలక్రోడ! భక్తాండజాతావనైకైకనీడా! మహాదేవదేవా! యనంత ప్రభావా! గదాశంఖచక్రాబ్జహస్తా! ప్రశస్తా! పురాణా! మహాపూరుషా! నిర్జరా! నిర్మలా! నిశ్చలా! నిర్భయా! సర్వలోకేశ్వరా! సర్వజీవేశ్వరా! నీకుఁ గై మోడ్పు లర్పింతు మాదిస్వయంభూస్వపుండవై సత్క్రియా

శక్తవై జ్ఞానశక్తిప్రధానుండవై శ్రీవిరాడ్బ్రహ్మకున్ దండ్రివై విశ్వతేజః స్వరూపుండవై ప్రాజ్ఞరూపుండవై నట్టి నీకంజలుల్ గొమ్ము! జాగ్రత్స్వరూపంబు స్వప్నస్వరూపంబు సుప్తిస్వరూపంబు నా నీ యవస్థాత్రయిన్ సాక్షివై యే యవస్థానముల్ లేక తుర్యుండవై యాత్మరూపుండవై నట్టి నీ కేటికో శ్చ్యుతా! సర్వలోకాద్య! యోంకారరూపా! శివా! సర్వవిజ్ఞాన సంపన్న! విజ్ఞానదాయీ! జగద్యోని! వేథా! హరి! సన్నుతుల్! నిత్యశుద్ధుండవై నిత్యబుద్ధుండవై నిత్యముక్తుండవై నిత్యసౌఖ్యుండవై నిత్యశాంతుండవై నిత్యభానుండవై నట్టి యోస్వామి! నీకుం బరిణామంబు లర్పంతు మెల్లప్పుడున్ భూమియున్ దోయమున్ దేజమున్ వాయువున్ వ్యోమమున్ సత్త్వయున్ మాయయున్ సర్వ మీవే గదా! శంకరా! నీవు ప్రద్యుమ్ననామంబుతోడన్ మనోమూర్తివై నిర్నిరుద్ధానిరుద్ధాఖ్యఁ దోడ్తో నహంకారమై దివ్యసంకర్షణఖ్యాతి జీవుండవై వాసుదేవుండనంగన్ బరబ్రహ్మరూపుండవై శ్రీచతుర్వ్యూహతత్త్వంబుతో సర్వవిశ్వంబు గావించు విశ్వేశ్వరా! యోగగమ్యా! మహాయోగిచిత్తాబ్జసూర్యా, నమస్సుల్! పురాకల్పమందున్ బయోజాతగర్భుండు నిద్రింపఁగాఁ బొంచి యయ్యశ్వకంఠుండు నా రక్కసుం డొక్కరుం డుక్కువుం డౌచు వేదంబులన్ దొబ్బి మున్నీటిలో డాఁగఁగాఁ గాంచి పాఠీనరూపంబుతో దైత్యునిం గూల్చి వేదంబులం దెచ్చి యాబ్రహ్మకర్పించి సప్తర్షి సత్యవ్రతక్ష్మాపులున్నట్టి పెన్నావ రక్షించు మత్స్యేశ్వరా! దేవ! మా మ్రొక్కు గైకొమ్ము! గీర్వాణులం బూర్వగీర్వాణులుం గూడి పీయూషముం గోరి మంథాద్రికిన్ వాసుకిం జుట్టి దుగ్ధాబ్ధిఁ ద్రచ్చంగ నయ్యద్రి యంభోధిలోఁ గ్రుంకఁగాఁ గచ్ఛపాకారముం దాల్చి పృష్ఠంబునందున్ గిరిన్ మోసి తత్కార్యముం దీర్చు కూర్మేశ్వరా, దేవ! మా మ్రొక్కు గైకొమ్ము! హేమాక్షుఁ డన్ రాక్షసస్వామి యక్షీణరూక్షేక్షణుం డౌచు గర్వం బఖర్వంబుగా సర్వసర్వంసహామండలిన్ జాపఁగాఁ జుట్టి మున్నీటిలో ముంపఁగా శ్వేతకోలాకృతిం దాల్చి శంఖంబు పూరించి చక్రంబు చేపట్టి కౌమోదకిన్ వ్రేసి హేమాక్షవక్షస్థలంబున్ విదారించి పాథోధిలోఁ జుట్టి పాతాళమున్ మెట్టి భూగోళముం బట్టి పెన్కోఱపై నెట్టి రక్షించుచున్నట్టి శ్రీయజ్ఞఘృష్టీశ్వరా! దేవ! మా మ్రొక్కు గైకొమ్ము! తత్సోదరుండౌ హిరణ్యాసురుం

డున్ సురజ్యేష్ఠు మెప్పించి బలోత్కర్కలం గోరి యింద్రాదిగీర్వాణులన్
సర్వదిక్పాలురన్ గెల్చి లోకత్రయాజేయుఁడై మించి నీభక్తుఁ డైనట్టి
పట్టిన్ గరాళించి మాత్సర్యముం బూని సంరంభ మేపార డింభా! సభా
స్తంభమం దీవు విశ్వంభరున్ జూపు మంచున్ గదన్ వ్రేసినన్ న్యర్బు
దార్కప్రభోదర్కసన్మూర్తితో నుగ్రదృగ్రోచు లొప్పన్ నృహర్యక్ష
రూపంబుతోఁ బుట్టి దైతేయునిం బట్టి నేలం బడంగొట్టి వాలారు పెన్గోళ్ళ
దాత్రాళితో నాంత్రజాలంబులం జించి చెండాడి ప్రహ్లాదునిం గాచు
శ్రీనారసింహేశ్వరా! దేవ! మామ్రొక్కు గైకొమ్ము! తత్పౌత్రుఁ
డైనట్టి వైరోచనుం డంత నాకంబుపై కేఁగి వజ్రాయుధున్ గెల్చి లేఖా
వళిం దోలఁగా ఖర్వరూపంబుతో యజ్ఞశాలం బ్రవేశించి పాదత్రయిన్
వేఁడి బ్రహ్మాండమున్ నిండి యంఘ్రిద్వయిన్ భూనభోభాగముల్
మెట్టి తార్తీయపాదంబు తన్మూర్ధ మందుంచి పాతాళలోకంబు దాఁకన్
బడంద్రొక్కి సర్వాదితే యావళిం బ్రోచు శ్రీవామనాకారలోకేశ్వరా!
దేవ! మామ్రొక్కు గైకొమ్ము! శ్రీజామదగ్న్యుండవై తండ్రినిన్
జంపు పాపాత్ములన్ రాజులన్ దీండ్ర గాలించి ముయ్యేడుమాఱుల్
కుఠారంబుతో వ్రేసి నిఃక్షత్రమైనట్టి సర్వక్షమామండలిన్ గశ్యపబ్రహ్మ
కున్ ధారఁగా బోసి వెల్గొందు శ్రీవిప్రరామేశ్వరా, దేవ! మామ్రొక్కు
గైకొమ్ము! శ్రీసూర్యవంశాబ్ధిచంద్రుండవై కీర్తిసాంద్రుండవై మించి
కౌసల్యకుం బుట్టి యాతాటకన్ జంపి దోషాటులన్ గూల్చి గాధేయు
జన్నంబు రక్షించి గుండ్రాతినిన్ నాఁతిఁ గావించి యీశాను విల్ ద్రుంచి
భూపుత్రిఁ బెండ్లాడి పిత్రాజ్ఞచే భార్యతో భ్రాతతో ఘోరకాంతారముల్ సొచ్చి
మౌనీంద్రులన్ బ్రోచి మాయామృగంబైన మారీచుఁ జక్కాడి దుర్మార్గుఁ
డైనట్టి పౌలస్త్యుఁ డాసీతఁ గొంపోవఁగా దండకారణ్యముల్ రోయుచున్
దక్కబంధున్ విదారించి భిల్లాంగనన్ గాంచి సుగ్రీవుఁ జేపట్టి వాలిన్
వడిన్ ద్రుంచి కీశాళి గొల్వంగ నంభోధి బంధించి లంకం బ్రవేశించి
ఘోరాజిలో నింద్రజిన్ముఖ్యరక్షస్సమూహంబు మర్దించి యక్కుంభకర్ణున్
దశాస్యున్ శరౌఘంబుతోఁ దూల్చి తత్సోదరుం బ్రోచి వహ్నిప్రపూతాత్మ
యైనట్టి శ్రీసీత కేల్పట్టి సాకేతముం జొచ్చి నూఱశ్వమేధంబులం జేసి
ధర్మంబు రక్షించు శ్రీరామచంద్రప్రభూ! దేవ! మామ్రొక్కు గైకొమ్ము!

శ్రీరామకృష్ణాకృతుల్ దాల్చి యాపూతనన్ దూల్చి వే బండిరాకాసి కీలూడఁగాఁ గూల్చి వ్రేపల్లెలో నాడి గోపీతతిం గూడి చాణూరవత్సాసుకంసాదిహింసాత్ములన్ బట్టి హింసించి పాంచాలి మానంబు గాపాడి కౌంతేయులన్ గాచి శ్రీగీత బోధించి కౌరవ్యులన్ బట్టి చంపించి భూభారమున్ బాపి ధర్మంబు రక్షించు సర్వేశ్వరా! దేవ! మా మ్రొక్కు గైకొమ్ము! సత్యం బహింసాధ్వమున్ శాంతమున్ ధర్మమున్ న్యాయమున్ బాదుకొల్పంగ లో నెంచుచున్ గీకటాఖ్యప్రదేశంబునన్ సార్వభౌముండవై యొప్పియున్ బచ్చిబాలెంతరాలైన యాలిన్ గసుంగందునిన్ వీడి సన్న్యాసమున్ బూని ధర్మంబు బోధించు బుద్ధేశ్వరా! దేవ! మా మ్రొక్కు గైకొమ్ము! భూమండలిన్ మెండుగాఁ గ్రౌర్యమున్ హింసయున్ హేయమౌ మార్గముల్ నిండఁగాఁ గుచ్ఛితుల్ హెచ్చఁగా వేదముల్ లోఁగఁగా ధర్మముల్ గ్రాఁగఁగా నాకలీటుప్పురుషుం డెంతయున్ దాండవం బాడఁగాఁ బాపముల్ పండఁగా శంభలగ్రామమందున్ మహీదేవతావంశమందున్ బ్రజల్కుల్కఁ గల్కిస్వరూపుండవై పుట్టి ఖడ్గంబు చేపట్టి దివ్యాశ్వమున్ మెట్టి పాపంబులన్ నెట్టి దుష్టాత్ములన్ గొట్టి వేదాధ్వముం బట్టి ధర్మంబు రక్షించు పద్మావతీనాథ! నారాయణా! దేవ! మా మ్రొక్కు గైకొమ్ము! కర్మంబులున్ నీవ ధర్మంబులున్ నీవ యాగంబులున్ నీవ యోగంబులున్ నీవ వేదంబులున్ నీవ శాస్త్రంబులున్ నీవ వాణీశుఁడున్ నీవ విష్ణుండవున్ నీవ రుద్రుండవున్ నీవ యింద్రుండవున్ నీవ సూర్యుం డవున్ నీవ చంద్రుండవున్ నీవ నక్షత్రముల్ నీవ సర్వంబవున్ నీవ దుగ్ధాబ్ధిశాయీ! మహాముక్తిదాయీ! వికుంఠాధివాసా! లసన్మందహాసా! కనద్దంతకోటీ విటంకస్థధాత్రీ! మహాశ్వేతపోత్రీ! నమస్తే! నమస్తే! నమస్తే! నమః.

మ. అని యీరీతి విరించి శంకరుఁడు శక్రాద్యాదితేయుల్ మునుల్
జనలోకప్రజలున్ నుతింప దరహాసం బొప్పఁగా స్తోత్రమున్
విని శ్రీయజ్ఞవరాహమూర్తి యటు లుర్విన్ నిల్పఁగా భాసిలెన్
వనధిన్ నౌకను బోలెఁ గైకొనె జగన్నాధుండు నైజాకృతిన్.

తే.గీ. ఇట్లు శ్రీహరి భూతలంబేర్పరింపఁ
బూర్వకల్పాంతమందునఁ బోయి నట్టి

సర్వవస్తువులను యథాపూర్వముగను
మఱల సృష్టింపఁగా బ్రహ్మమదిఁ దలంచె. 224

క. అని సూతుఁడు కల్పాంతం
బునఁ బాథోనిధిని భూమిమునుఁగుట కిటియై
వనమాలి యెత్తి బ్రోచుట
వినిపించెను మౌనులెల్లవినతు లొనర్పన్. 225

10. బ్రహ్మ సృష్టి కథనము

తే.గీ. ప్రీతి విని నైమిశీయులు సూతు మ్రొక్కి-
యాప్రజాపతి సకలచరాచరంబు
నెట్లు సృజియించె నద్దాని నేర్పరింపు
మనుచు వేఁడంగ సూతుండు వినిచె నిట్లు. 226

తే.గి. అంత శ్రీమన్మహేశ్వరు నాజ్ఞ చేత
శ్రీప్రజాపతి కపుడు సిసృక్ష వొడమఁ
బూర్వకల్పంబు వోలె నబుద్ధిపూర్వ
కమ్ము తమోమయ మైన సర్గంబు గలిగె. 227

వ. తామసంబగు నాసర్గంబు తమంబు మోహంబు మహా మోహంబు తామిస్రంబు నంధతామిస్రంబు ననఁ బంచపర్వంబులు గల యవిద్యాత్మకంబై పంచవిధంబులఁ బ్రవర్తిల్లె. 228

తే.గీ. వెలుపలను లోపల నొకింత వెలుఁగు లేక
స్తబ్ధమై పేళ్ళు లేక నిస్సంజ్ఞ మగుచు
వృక్షములు పర్వతంబులు వెలయుచుండ
స్థావరాత్మక మైనట్టి సర్గ మొప్పె. 229

వ. స్థావరాత్మకంబగు నద్దానిని గాంచి విరించి యది యైహికాముష్మిక హితాహితతదుపాయతత్ప్రతీకారవిరహం బగుటచే నసాధకం బని యెంచి మఱల సృష్టింపఁ గోర దుఃఖాద్యమై తిర్యక్స్రోతంబగుపశ్వాదిసర్గంబు ప్రవర్తిల్లె నదియు నసాధకం బని యెంచి ప్రజాపతి మఱల సృష్టింప గోర సాత్త్వికంబును సుఖావహంబు నూర్ధ్వస్రోతంబు నగు దేవసర్గంబు

ప్రవర్తిల్లె నదియును గర్మభూమికసాధకంబని యెంచి బ్రహ్మ మఱల సృష్టింపఁ గోరఁ బరమశివు నాజ్ఞచే రాజసంబు నర్వాక్స్రోతంబు నగు మానుషసర్గంబు ప్రవర్తిల్లె మఱల స్రష్ట సృష్టింపఁగోర శ్రీమహాదేవు నాజ్ఞచే భూతప్రేతపిశాచాత్మకం బగు సర్గంబు ప్రవర్తిల్లె నిట్లు పరమేష్ఠి బుద్ధిపూర్వకంబుగ సృజించిన సర్గంబు లైదు విధంబులై యొప్పారె నందుఁ బరమాత్మసకాశంబున మహత్తత్త్వంబు ప్రథమసర్గంబై యొప్పె. శబ్దస్పర్శరూపరసగంధంబులను పంచతన్మాత్రంబులయు నాకాశవాయు తేజోజలపృథువులను పంచసూక్ష్మభూతంబులయు సర్గంబు ద్వితీయంబై పొలిచె. శ్రోత్రత్వక్చక్షూరసనాఘ్రాణంబులను పంచజ్ఞానేంద్రియంబులును వాక్పాణిపాదపాయూపస్థలను పంచకర్మేంద్రియంబులును గల వైకారి కాఖ్యంబగు నైంద్రియికసర్గంబు మూఁడవదియై జనియించె నివి మూఁడును ప్రాకృతసర్గంబులు. స్థావరాదికంబగు ముఖ్యసర్గంబు నాలవది. తిర్యక్స్రోతంబగు పశ్వాదిసర్గం బైదవది. ఊర్ధ్వస్రోతంబగు దేవసర్గం బాఱవది. అర్వాక్స్రోతంబగు మానుషసర్గం బేడవది భూతప్రేతాదిసర్గం బెనిమిదవది, ఇవియైదును వైకృతసర్గంబులు. ప్రాకృతవైకృతోభయాత్మకంబగు సనకాదికౌమారసర్గంబు తొమ్మిదవది. వీని యవాంతర భేదంబు వివరించుట కలవి గామి ప్రయోజనంబు లేమి నుడువ నొల్ల. నవమంబగు కౌమారసర్గంబును వినుండు. 230

క. సనకుని సనత్కుమారున్
సనందనుని బుధుని శ్రీసనాతనఋషినిన్
మును సృష్టించెఁ బ్రజాపతి
తన మానసపుత్రు లగుచుఁ దగు నైదుగురన్ 231

క. వారలు భగవద్భక్తులు
వైరాగ్యోపేతు లాత్మవర్తను లగుటన్
వారిజగర్భుఁడు సృష్టిని
గోరి మహామోహ మొందెఁ గురుతరమాయన్. 232

తె.గీ. అట్లు మోహితుఁ డైనట్టియజుని యెదుట
శ్రీధరుం డంతఁ బొడసూపి బోధసేయ

నాసనాతను గోవిందు నాత్మమందుఁ
బదిలపఱిచి విరించి తపం బొనర్చె. 233

తే. గీ. తమ్మిచూలి మహాఘోర తప మొనర్చి
చాలకాలము ఫల మొందఁ జాలఁ డయ్యె
వాని కంతటఁ గ్రోధ ముత్పన్నమయ్యెఁ
జఘవుల నుండి యశ్రువుల్ జాలువాఱె. 234

క. తఱి యెఱిఁగి యభవుఁ డురుదయ
తుఱంగలింపంగ బుద్ధి తోడ్తో నొసఁగెన్
గఱకంఠు గుఱిచి తప మే
కొఱ లేక యొనర్చె ధాత గురుతరభక్తిన్. 235

తే.గీ. శ్రీమహాదేవదేవుండు కృప దలిర్ప
సృష్టికై తపియించెడి స్రష్ట యొక్క
భ్రూయుగఘ్రాణమధ్యావిముక్తసీమ
నుండి తా నర్ధనారీశ్వరుండు పుట్టె. 236

తే.గీ. అర్ధనారీశ్వరుం డైన యాదిదేవుఁ
జంద్రశేఖరు సర్వజ్ఞు సర్వకర్త
నీలలోహితు శంకరు శూలపాణిఁ
గాంచి కైవార మొనరించెఁ గమలజుండు. 237

క. అఱమేన గరితఁ దాల్చిన
కఱకంఠుని గాంచి భక్తి గడలుకొనం గ్రి
చ్చఱ నర్చించుచుఁ బ్రజ నే
ర్పఱ సృజియింపంగ భారతీపతి వేఁడెన్. 238

తే.గీ. అబ్జగర్భుని విన్నపం బాలకించి
యాత్మతుల్యుల రుద్రుల నభవుఁ డంత
సృజన నేయంగ విధి జన్మ మృత్యుభీతు
లైన ప్రజలను సృజియింపు మనుచు వేఁడె. 239

తె.గీ. అద్ది విని శూలి దరహాస మాచరించి
యొనర దుఃఖాబ్ధిమగ్నుల నుద్ధరింతుఁ

గాని సృజియింప దుఃఖాఢ్యులైన జనుల
నల్వ! సృజియింపు మనుచు నంతర్ధినొందె. 240

తే.గీ. అంతట విరించి సృష్టింపనభిలషించి
చెలఁగి సూక్ష్మభూతములఁ బంచీకరించి
గగనవాయ్వగ్నిజలమహీఖ్యాతములగు
స్థూలపంచభూతంబులనొరిదిఁ జేసె. 241

తే.గీ. ఇట్లు పంచభూతంబులనేర్పరించి
పర్వతంబుల నబ్ధులఁబాదపములఁ
గళలు కాష్ఠలు మొదలైనకాలములను
సృజన చేసె సాధకులైనఋషుల తోడ. 242

వ. తన లోచనద్వయంబునను మరీచిని
హృదయంబు నందుండిభృగుమహర్షి
నమలమూర్ధంబు నంగిరోమౌని ను
దానంబునన్ బులస్త్యర్షిచంద్రు
వ్యానంబునన్ బులహాఖ్యమునీంద్రు న
పానంబునన్ గ్రతుమౌనివర్యుఁ
దనరి ప్రాణంబునదక్షప్రజాపతి
శ్రోత్రంబు లందుండియత్రిమౌని

తే.గీ. నల సమానంబునన్వసిష్ఠాఖ్యఋషిని
దనదు సంకల్ప మందుండిధర్మసంజ్ఞు
నిట్లు పదుగుర మౌనులనెసక మెసఁగ
స్రష్టసాధకోత్తములుగాసృష్టిచేసె. 243

క. పంకరుహగర్భు నాజ్ఞను
సంకల్పజుఁడైన ధర్మసంజ్ఞుఁడు నవఋ
ష్యంకప్రవర్తితుండై
పొంకంబుగ మనువు రూపమును ధరియించెన్. 244

సీ. జఘనంబు నుండి రాక్షసుల సృష్టించి యా
గాత్రంబువిధి వీడరాత్రి యయ్యె

వక్త్రంబు నుండి దేవతల సృష్టించి యా
దేహంబు విధి వీడ దినము నయ్యె
వేఱొక్క తను వొందిపితరులఁ బుట్టించి
స్రష్ట దానిని వీడ సంధ్య యయ్యె
వేఱొక్క రాజసవిగ్రహంబున మను
ష్యులు పుట్ట విధి వీడ జ్యోత్స్న యయ్యె
తే.గీ. ధాత వేఱొక్క రాజసతనువు దాల్ప
దైత్యపన్నగభూతగంధర్వగణము
పుట్టె వేఱొక్క యొడలొందఁ బుట్టెఁ బక్షి
జాల మిభగజతురగాదిజంతుగణము. 245

వ. ఇట్లు విశ్వజగత్పతి యగు ప్రజాపతి వివిధప్రాణికోటిని సృష్టించి తదనంతరంబు ఋగ్వేదంబును యజుర్వేదంబును సామవేదంబును ఛందంబులను నౌద్గాత్రంబును యజ్ఞంబులను త్రివృత్స్తోమంబును రథంతరంబు నగ్నిష్టోమాదులను సర్వంబును సాంగంబుగ సృష్టించి వేదశబ్దంబుల నుండి వివిధకర్మంబులను వివిధనామంబులను నిర్మించె. 246

క. అంచితముగ నిట్లంగి వి
రించి మహాసూక్ష్మబుద్ధిసృష్టించిన యా
పంచీకృతభూతములు ప్ర
పంచకకారణము లంద్రుబహుతత్త్వజ్ఞుల్. 247

తే.గీ. అంబికాధవు సత్ప్రసాదంబు చేత
స్వప్నతుల్యంబు చిత్రమౌజగ మొనర్చి
జ్ఞానవైరాగ్యసంపన్నుఁడైన యజుఁడు
వడిఁ దమోమయ మైన రూపంబు నొందె. 248

## 11. హిరణ్యగర్భునివిశేషసృష్టికథనము

తే.గీ. అని వచించిన విని శౌనకాదిమునులు
స్థావరంబులఁ జరములజలజభవుఁడు
సృజన చేసి పదంపడియేమి చేసె?
మాకు నెఱిఁగింపు మన సూతమౌని పలికె. 249

తే.గీ. సంసృతికి హేతుభూతమౌ సంతమసము
వలనఁ బరివేష్టితుండైన నలువ తమము
వీడిసృష్టవస్తుల యభివృద్ధిఁ గోరి
తా హిరణ్యగర్భబ్రహ్మదేహ మొందె. 250

వ. ఆహిరణ్యగర్భు నుత్పత్తియు నంతర్యామి యుత్పత్తియుఁ దదు పాధిత్రయోత్పత్తి ప్రకారంబును సవిస్తరంబుగ వక్కాణించెద. సావధా నంబుగ వినుండు. అవిద్యయు నస్మితయు రాగంబును ద్వేషంబు నభి నివేశంబు నను క్లేశపంచకమునకు మూలంబయిన కర్మాశయంబు ప్రాణులచే నిహంబునఁ బరంబున భోక్తవ్యంబగు. కర్మంబులకు మూలభూతంబగు క్లేశపంచకం బెందాఁక నను వర్తించు నందాఁక సర్వ ప్రాణులకు నానావిధయోనిజన్మప్రాప్తియు నాయువును సుఖదుఃఖలక్షణ ఫలోపభోగంబు నను త్రివిధకర్మాశయపరిపాకంబు గలుగు. గతసర్గం బునఁ గొందఱకు జన్మహేతుభూతంబులగు కర్మంబులు చరితార్థత్వము నొందినను మఱికొందఱ కాయుర్హేతుభూతంబులగు కర్మంబులను దత్ఫ లంబుల ననుసంధించుటకై జగత్కర్త యగు ప్రజాపతి తమోరూపం బును వీడి హిరణ్యగర్భరూపంబు నొందె నిట్లు. 251

సీ. తత్సృష్టి శబ్దాదితన్మాత్రముల నుండి
పంచభూతంబులు పరిఢవిల్లె
నాపంచభూతంబులందుండి సాత్త్వక
గుణముచే జ్ఞానశక్తులు జనించె
నట్లె సమష్టిభూతాళి నుండియె రాజ
సుగుణంబుచేఁ గ్రియాశక్తు లొదవె
సరవి భూతస్థితజ్ఞానశక్తులు నైదుఁ
గలియంగ మానసకరణమయ్యెఁ

తే.గీ. దద్గతుండైన పరమాత్మ తా హిరణ్య
గర్భుఁ డనఁగను మునులచే గడితుఁ డయ్యె
బ్రహ్మవిష్ణుమహేశ్వరత్రయము నందు
బ్రహ్మదేవుం డన నతండు పరగుచుండు. 252

వ. అది యెట్లనిన నబుద్ధిపూర్వకంబును దమోరూపంబు నవ్యక్తంబు నగు మూలప్రకృతి తొలుదొల్త నుత్పన్నం బయ్యెఁ దదధిష్ఠితనిష్కలుండగు పరమేశ్వరుండు సగుణబ్రహ్మం బనంబడు నప్పరమశివునుండి సత్త్వరజస్తమోగుణత్రియాత్మకంబగు మహత్తత్త్వంబు జనించె నందుండి శబ్దంబును స్పర్శంబును రూపంబును రసంబును గంధంబు నను పంచతన్మాత్రంబు లగుసూక్ష్మభూతంబులును వాని నుండి సత్త్వగుణనిబంధనంబు లగు నైదు జ్ఞానశక్తు లుప్పతిల్లి వేర్వేఱ శ్రోత్రంబును దక్కును నేత్రంబును జిహ్వయు ఘ్రాణంబు నను పంచజ్ఞానేంద్రియంబులఁ బుట్టించె. ఆసూక్ష్మభూతంబులంద రజోగుణంబుచే సమష్టిభూతంబుల నుండి క్రియాశక్తులు గలిగి వేర్వేఱ వాక్కును బాణియుఁ బాదంబును బాయువు నుపస్థము నను పంచకర్మేంద్రియంబుల నుత్పాదించె. ఇట్లు వ్యష్టిభూతస్థూలభూతసూక్ష్మకారణోపాధులచే నుపహితంబగు తత్త్వత్రయంబు విశ్వుఁడు తైజసుఁడు ప్రాజ్ఞుఁడు ననియు సమష్టిభూతంబులచే నుపహితంబగు తత్త్వత్రయంబు వైశ్వానరుండు హిరణ్యగర్భుండు నీశ్వరుండు ననియు వ్యవహరింపంబడు. ఇట్లు సమష్టిభూతంబు లైదింట నున్న జ్ఞానశక్తుల కలయికచే మనోబుద్ధ్యాదిశబ్దంబులచే వ్యవహరింపఁబడు సమష్టిభూతం బగు నంతఃకరణంబు జనించు నయ్యంతఃకరణోపహితుండగు పరమాత్మ హిరణ్యగర్భుం డయ్యె నిది హిరణ్యగర్భోత్పత్తి ప్రకారంబు.

తే.గీ. అట్లు సూక్ష్మభూతంబులక్రియందు నలరు
నైదు కృతిశక్తు లొలసి సక్రమష్టిభూత
మైన ప్రాణంబుగా నయ్యెక్రనందు నున్న
హరియె పరమాత్మ సూత్రాత్ముఁక్రడనఁగ నొప్పు. 254

క. ఉభయత్ర సంస్థితుండై
యభవుండు మహామహేశుఁక్రడలరుచు సర్వ
ప్రభవుం డగుటను గిరిజా
విభు నంతర్యామి యనుచుక్రవేదము పొగడున్. 255

తే.గీ. మఱలఁ బరమేష్ఠి స్వీయమాక్రమాయ చేతఁ
దనదు దేహంబు నంత ద్విక్రధాకరింప

సగము పురుషుండు సగము స్త్రీయగుచు నయ్యె
వారికి జనించె శ్రీవిరాడ్బ్రహ్మమూర్తి. 256

తే.గీ. మఱల నలువ యర్ధాంగియౌ మగువ యందుఁ
దా స్వరాట్టును సమార్టుఁ దగ సృజించె
నమ్మగురు బ్రహ్మపుత్త్రికు లఖిలకమల
జాండమండల మెల్ల నిండి రెలమి. 2 7

వ. అందు విరాడ్బ్రహ్మ సమష్టిరూపస్థూలభూతపంచకబ్రహ్మాండాభిమాని యయ్యె. స్వరాడ్బ్రహ్మ బ్రహ్మాండాంతరవర్తి సమష్టిలింగశరీరాభిమాని యయ్యె. సమార్డ్బ్రహ్మ తదుభయకారణావ్యక్తాభిమాని యయ్యె.

తే.గీ. ఆవిరాడ్బ్రహ్మ స్వాయంభువాఖ్యపుత్త్రి
సతిని శతరూప యనియెడు సుతను గాంచె
వారలు ప్రియవ్రతోత్తానపాదులఁ బడ
సి ప్రసూతి నాకూతిని బడసి రంత. 259

క. ఆతతవైభవ మొప్పఁ బ్ర
సూతిని దక్షుఁడు వరించె సుందరి యౌ నా
కూతిని రుచిప్రజాపతి
ప్రీతాత్ముండగుచు వేడ్కఁ బెండ్లియయ్యెన్. 260

తే.గీ. ఆరుచిబ్రహ్మ యాకూతి యందుఁ గాంచె
యజ్ఞుఁడను పుత్త్రి దక్షిణ యనెడు కన్య
వార లిద్దఱు దంపతీభావ మొంద
మునులు ద్వాదశపుత్త్రిలు పుట్టి రెలమి. 261

క. దక్షుఁడు ప్రసూతికాంతా
వక్షోరుహగంధకలిత వక్షుఁడు లోకా
ధ్యక్షుం డిరువది నలువుర
లక్షణవతులైన యట్టి లలనలఁ గనియెన్. 262

వ. వారి యందు శ్రద్ధయు లక్ష్మియు ధృతియుఁ దుష్టియుఁ బుష్టియు మేధయుఁ గ్రియయు బుద్ధియు లజ్జయు వపువు శాంతియు సిద్ధియుఁ గీర్తియు నను పదుమువ్వురు కన్యల ధర్ముండు భార్యలుగాఁ గైకొనియె.

ఖ్యాతిని భృగుండును, సతిని భవుండును, సంభూతిని మరీచియు, స్మృతి నంగిరసుండును, ప్రీతిని బులస్త్యుండును, క్షమను బులహుండును, సన్నతిని గ్రతుండును, ననసూయ నత్రియు, నూర్జను వసిష్ఠుండును, స్వాహను వహ్నియు, స్వధను బితరులును బెండ్లాడిరి. 263

ఉ. ఈపగిదిన్ బ్రజాపతి యనేకవిధాకృతులన్ ధరించుచున్
శ్రీపరమేశ్వరాజ్ఞ మెయిసృష్టి యొనర్ప నసంఖ్యులైన జా
యాపతులైరి పూర్వజనురార్జితకర్మముఁబట్టి యట్లు త
ద్వ్యాపితమైన సంతతులుతామరతంపరలై విరాజిలెన్. 264

క. కొందఱు స్వాభావిక మని
యందురు సృష్టిని గుఱించియది తప్పనుఁడీ!
కొందఱు కర్మము మూలం
బందు రదియు శ్రుతికి స్మృతికి నపవాద మగున్. 265

వ. కొన్ని వస్తువులు కాలాపేక్షను మఱికొన్ని వస్తువులు దేశాపేక్ష నింకఁ గొన్ని వస్తువు లదృష్టాపేక్షను సర్వవస్తువులు నీశ్వరాపేక్షను గలిగియుండు నదెట్లనిన 266

తే.గీ. పవలు కమలముల్ రాత్రినిదొవలు విరియుఁ
గుంకుమము పుట్టుఁగాశ్మీరకుతలమందుఁ
బుణ్యపాపాళి సుఖదుఃఖములును గలుగు
సర్వము మహేశ్వరాజ్ఞ చేసంభవించు. 267

వ. ఈయర్థంబు తేటపడ నొక పురావృత్తంబు వర్ణింతు నాకర్ణింపుఁడు.

సీ. అంగిరోమౌనియునక్షపాదుండును
గపిలకపిధ్వజకణభుజులును
గాలరూపుఁడుఁ గలామాలిపరంతప
కామరూపసుమంతుజైమినులును
బావనాశపవిత్రిపైలపతంజలి
బకులబాల్వలవేణువాహనులును
వజ్రిదండముకుందవహ్నిమహాకాల
వేదజ్ఞవిద్వేషిపైదికులును

తే. గీ. పండితుండు వైశంపాయనుండు మోచ
కుఁడు మహామతి ద్వైపాయనుఁడు మొదలగు
మునులు గుమి గూడి హిమశైలభూమి చేరి
తప మొనర్చిరి పార్వతీధవుని గూర్చి. 269

శా. రుంద్రంబైన మహాతపంబును మునీంద్రుల్ భక్తితోఁ జేయఁగాఁ
జంద్రోత్తంసుఁడు భక్తవత్సలుఁ డుమాచంద్రాననం గూడి ని
స్తంద్రంబౌ కరుణాకటాక్షమున సాక్షాత్కారముం జెందినన్
సాంద్రానందము నొంది మ్రొక్కిరి వడిన్ సాష్టాంగదండంబులన్

క. నిటలతటీఘటితాంజలి
పుటులగుచున్ నిటలనయనుఁ బురుషుఁ బురాణున్
బటుభక్తితోడ మ్రొక్కుచు
నిటుపల్కిరి సృష్టిమూల మెఱుఁగుట కొఱకై. 271

మత్తకోకిల:
ఫాలలోచన! వేదసూచన! భక్తబంధవిమోచనా!
మూలకారణ! దుష్టవారణ! ముక్తిమార్గవిచారణా!
కాలకాల! మహేశ్వరా! మిహికాకరోజ్జ్వలశేఖరా!
నీలకంధర! యంజలింతుము నీతదర్థము భక్తితోన్. 272

తే. గీ. సృష్టి స్వాభావికంబుగా నెసఁగు నొక్కొ?
కాక సృష్టికిఁ గర్మంబు కారణంబొ?
లేక నీవొనరింతువో? లీల గాఁగ
నేతదర్థము వివరింపు మేర్పడంగ. 273

మ. ఎఱుఁగం గోరెద మానతిమ్మని మునీద్బృందంబు వేఁడంగ నా
కఱకంఠుండు దయామయుం డగుచు వక్కాణించె నెమ్మోమునన్
జిఱునవ్వొప్పఁ దనంతఁ దాను జగమైసృష్టంబు గానోపునే?
నెఱిఁ గర్మంబు సృజించునొక్కొ? విడిగా నేఁగర్తగా నుందునే?

ఉ. కేవలమెద్దియున్ జగతికిన్ గరణంబును గాదు చూడఁగా
జీవుల కర్మపాకమునఁ జెచ్చెర నేను సృజింపఁగా జగ

ద్భావము నొందు నీప్రకృతి వర్ధిలు నంతము నందు డిందు నో
పావనులార! యిద్ది శ్రుతిభాషిత మంచు నెఱుంగుఁ డెప్పుడున్.

తే.గీ. ఇట్లు వివరించి మాయ మయ్యెను హరుండు
మును లది యెఱింగి వేడ్కమైఁ జనిరి గానఁ
ప్రాణికర్మానురూపమై నట్టి జగము
సృజన చేసి హరించు మహేశ్వరుండు. 276

## 12. జాతినిర్ణయకథనము

తే.గీ. అఖిలసృష్టిని గూర్చి యిట్లానతీయ
నైమిశీయులు విని వేడ్క నలువ జనుల
సృజన మొనరించి వేదదర్శితములైన
జాతు లేర్పరించెనో సూత! చెప్పు. 277

క. అనవుడు సూతుఁడు పలికెను
వినుఁడు మునులు! వివిధజాతి విధనిర్ణయముల్
మును కుంభసంభవునకున్
వినిపించె శివుండు దాని వివరింతు నొగిన్. 278

సీ. పూర్వకల్పంబున సర్వజగంబును
ప్రళయకాలమునందు విలయ మొందె
లోకంబు నందెల్లఁ జీకట్లు గ్రమ్మంగ
నంత సూర్యసహస్ర కాంతిమూర్తి
వేయిశీర్షముల నారాయణుండు పయోఽబ్ధి
రుద్రుఁ జింతించుచు నిద్ర వోయె
నాభగవంతుని నాభిరంధ్రము నుండి
కమ్మపుత్తడి విరి దమ్మి మొలచెఁ

తే.గీ. తావు లెగఁజిమ్ము నాతమ్మి పూవునందు
నాలుగాననములు గల వేలు పుదయ
మొందె నాతండు గతకల్పమందుఁ బోలె
మృడుని యానతి సృష్టికిఁ గడఁగెఁ గడిమి. 279

సీ. ఆ చతురాస్యుని యాస్యంబు లందుండి
సతులతో బ్రాహ్మణుల్ జనన మొంది
రా శతానందుని హస్తంబు లందుండి
రాజులు వొడమిరి రాణు లొలయ
నా ప్రజాపతి యూరు లందుండి కలిగిరి
కోమటుల్ తత్కుల కువలయాక్షు
లా యబ్జగర్భుని యంఘ్రుల యందుండి
పుట్టిరి శూద్రులు పొలఁతుకలును

తే.గీ. వారివారికి జంపతి భావ మొప్ప
నుత్తముని చేత నవరకు నుద్భవించు
నాతఁ డతిలోముఁ డనఁబడు నవరు వలన
నుత్తమకుఁ బుట్టుఁ బ్రతిలోముఁ డుర్వి యందు. 280

వ. అది యెట్లనిన వర్ణ స్త్రీలయం దనులోమముగా జనించినవాఁ డాంతరాలికుం డనంబడు. వర్ణ స్త్రీల యందుఁ బ్రతిలోమంబుగ జన్మించిన వాఁడు వ్రాత్యుండు నాఁబడు.

బ్రాహ్మణునకు—సధవ యగు బ్రాహ్మణి యందుఁ జౌర్యంబునఁ బుట్టిన వాఁడు కుండుండగు. విధవ యగు బ్రాహ్మణి యందట్లు పొడమిన వాఁడు గోలకుండగు. క్షత్రియకాంత యందు జనించిన వాఁడు సవర్ణుండగుఁ జౌర్యంబున జనించిన వాఁడు నక్షత్రజీవనుండగు. వైశ్య యందు జనించిన వాఁడు నిషాదుండగుఁజౌర్యంబున జనించిన వాఁడు కుంభకారుండగు. వాఁడ యూర్ధ్వనాపితుం డనంబడు శూద్రకాంత యందు జనించిన వాఁడు పారాశవుండగుఁ జౌర్యంబున జనించిన వాఁడు నిషాదుండగు శూద్ర యందు క్షత్రియునకు జనించిన దౌష్యంతి యందుఁ బుట్టినవాఁ డాపీతుండగు శూద్ర యందు వైశ్యునకు జనించిన యాయోగవి యందుఁ బొడమిన వాఁడు పింగలుండగు.

క్షత్రియునకు—విప్రకాంత యందు జనించిన వాఁడు సూతుం డగుఁ జౌర్యంబున జనించిన వాఁడు రథకారుండగు. వైశ్యయందు జనించిన వాఁడు మాహిష్యుండగు వాఁడ యంబష్ఠుం డనంబడు. అట్లు

చౌర్యంబున జనించిన వాఁడవికుండగు. శూద్ర యందు జనించిన వాఁడు దౌష్యంతుండగు నట్లు చౌర్యంబున జనించిన వాఁడు శాలికుండగు.

వైశ్యునకు—బ్రాహ్మణి యందు జనించిన వాఁడు క్షత్త యగు నట్లు చౌర్యంబున జనించిన వాఁడు మ్లేచ్ఛుండగు. నృపకాంత యందు జనించిన వాఁడు శాలికుండగు. వాఁడ మాగధుండు నాఁబడు. అట్లు చౌర్యంబున జనించిన వాఁడు పుళిందుండగు. వాఁడ భోజుండనంబడు. వైశ్యకాంత యందుఁ జౌర్యంబున జనించిన వాఁడు మణికారుండగు. శూద్రయందు జనించిన వాఁ డుగ్రుండగుఁ జౌర్యంబున జనించిన వాఁడు కటకారుండగు.

శూద్రునకు—బ్రాహ్మణి యందు జనించిన వాఁడు చండాలుం డగు. అట్లు చౌర్యంబున జనించిన వాఁడు బాహ్యదాసుండగు. రాజన్య యందు జనించిన వాఁడు వైదేహుండగు. వాఁడ పుల్కసుం డనంబడు. అట్లు చౌర్యంబున జనించిన వాఁడు వేలవుండగు. వైశ్యయందు జనించిన వాఁడు పత్తనశాలికుం డగు. అట్లు చౌర్యంబున జనించిన వాఁడు చక్రి యగు శూద్ర యందుఁ జౌర్యంబున జనించిన వాఁడు మాణవకుండగు.

అంబష్ఠ యందు సవర్ణునకు జనించిన వాఁ డాగ్నేయనర్తకుండగు. వైశ్యునకు శూద్రయం దుత్పన్నయగు కరణయందు మాహిష్యునకు జనించిన వాఁడు తక్ష యనియు రథకారుం డనియు శిల్పి యనియు వర్ధకి యనియు లోహకారుం డనియుఁ గర్మారుం డనియుఁ జెప్పంబడు. ఉగ్రునకు విప్రియందు జనించిన వాఁడు తక్షవృత్తియు వైశ్య యందు జనించిన వాఁడు సముద్రుండు నగుదురు. నిషాదునకు—బ్రాహ్మణి యందు జనించిన వాఁడు నాపితుండును నృప యందు జనించిన వాఁ డధోనాపితుండును వైశ్య యందు జనించిన వాఁడు సునిషాదుండు నగుదురు. నాపితునకు విప్రి యందు జనించిన వాఁడు వేణుకుండును రాజ్ఞి యందు జనించిన వాఁడుకర్మకారుండు నగుదురు. దౌష్యంతునకు ద్విజోత్తమ యందు జనించిన వాఁడు భాగలబ్ధుండగు. వైదేహునకు బ్రాహ్మణి యందు జనించిన వాఁడు రజకుండగు. చండాలునకు ద్విజోత్తమ యందు జనించిన వాఁడు పుమాంసుండగు. వాఁడ శ్వపచుండు నాఁబడు. శ్వపచు

నకు విప్రకన్యయందు జనించిన వాఁడు గుహకుండగు. చండాలునకు వైశ్య యందు జనించిన వాఁడు దంతకవేలకుండును శూద్ర యందు జనించిన వాఁ డాశ్రమకుండు నగుదురు. ప్రతిలోమనిషాదునకు శూద్ర యందు జనించిన వాఁడు భైరవుండగు. మాగధునకు శూద్ర యందు జనించిన వాఁడు కుకుందుండును నృపయందు జనించిన వాఁడు ఖనకుండు నగుదురు. ఖనకునకు రాజకన్యయందు జనించిన వాఁ డుద్బంధుండగు. అయోగవునకు బ్రాహ్మణి యందు జనించిన వాఁడు చర్మకారుండగు. విప్రవ్రాత్యునకు విప్ర యందు జనించిన వాఁడు బందికుండగు. క్షత్త్రి వ్రాత్యునకు క్షత్రియకాంత యందు జనించిన వాఁడు ఖల్లుండగు. వాఁడ మత్తుం డనియు మల్లకుం డనియుఁ జెప్పంబడు. మల్లునకుఁ బిచ్ఛలుం డును వానికి నటుండును నటునకుఁ గరణుండును జనింతురు. కరణునకు క్షత్త్రియకాంత యందు జనించిన వాఁడు ద్రమిలుండగు. వైశ్యవ్రాత్యునకు వైశ్య యందు జనించిన వాఁడు సుధన్వుండగు. సుధన్వున కావార్యుండును వానికి భారుషుండును భారుషునకు ద్విజన్ముండును వానికి మైత్రుండును జనింతురు. మైత్రునకు జనించిన వాఁడు సాత్వతుండగు. వాఁడ వైదేహకుం డనియు మాతంగుం డనియుఁ జెప్పంబడు. మాతంగునకు వైశ్య యందు సూతుండును సూతునకు దస్యుండును దస్యునకు మాలాకారుండును జనింతురు. ప్రతిలోమనిషాదునకుఁ గైవర్తుండు జనించు. అయోగునకుఁ దిలకారస్త్రీ యందు జనించిన వాఁడు నీలాదివర్ణ విక్రేత యగు. నిషాదునకుఁ గారుస్త్రీ యందుఁ బుట్టిన వాఁడు చర్మజీవి యగు. 281

తే గీ. ఇట్లు జాతు లనంతమై యెసఁగు జగతి
జాతినిర్ణయపద్ధతి సంగ్రహముగఁ
బలికినాఁడను నైమిశవాసులార!
శివుఁ డగస్త్యమహర్షికిఁ జెప్పి నట్లు. 282

క. నిజజాతివిహితకర్మము
ఋజుమతి నొనరించు పుణ్యు లిహమున్ బరమున్
నిజముగఁ గొందురు ముక్తిని
విజయం చేయుదు రటంచు వేదము చెప్పున్. 283

తే.గీ. జన్మమునఁ జేసి జంతుల జాతు లట్లు
జన్మమును దొట్టి వర్ణంబు సంభవించు
గర్మమును బట్టి వర్ణంబు గాదటంచుఁ
బలుకు పలుకున వేదంబు పలుకుఁ గాదె. 284

తె.గి. భౌతికస్థూలదేహంబు వడయు జాతి
నాత్మునకు వర్ణభేదంబు లంటఁ బోవు
గాని దేహంబునం దహమ్మాన ముంట
నాత్మ విప్రాదిసంజ్ఞలు నలరు చుండు. 85

తె.గీ. స్వస్వరూపపరిజ్ఞాన సరణి లేమి
మేను నందుండు నాత్మాభిమాన మద్ది
పోవు విజ్ఞాన ముదయింప భావమునను
బ్రాగభావ మనాదియై పాయు కరణి. 286

తె గీ. జ్ఞాన మన నిగమాంతవి జ్ఞానము సుఁడి
సకలవేదాంతసద్వాక్య జాత మైన
యట్టి యపరోక్షవిజ్ఞాన మందు నెవ్వఁ
డతని విధులు నిషేధంబు లంట వెపుడు. 287

క. వర్ణాశ్రమధర్మంబుల
నిర్ణయ మొనరించుచుండు నిగమాగమముల్
వర్ణస్థులె కర్మంబులు
దీర్ణగతిం జేయ నధ కృతిం గాంతు రిలన్. 288

తే.గి. మగువ యగుఁగాక మగవాఁడె యగునుగాక
యొప్పుగా బ్రహ్మవిజ్ఞాన మొప్పు నట్టి
వారి కెట్టి వర్ణాశ్రమా చారధర్మ
ములు గలుగ వంచు నుపనిషత్తులు వచించు. 289

క: ఆత్మత్వంబును జెందక
యాత్మంభరి యగుచు నెవ్వఁ డాశ్రమవిధి మూ
ఢాత్ముఁ డయి విడుచు నతఁడ
ధ్యాత్మగతికి దూర మగుచు నందు నరకమున్. 290

తే.గీ. కాన మోక్షంబు కాంక్షించు ఘనమనీషి
స్వీయవర్ణాశ్రమాచార విహిత మైన
శ్రౌతకర్మంబు స్మార్త కర్మంబు నెపుడు
సర్వయత్నపూర్వకముగాఁ జలుపవలయు. 291

వ. అని యిట్లనుగున. 292

శా. శ్రుత్యుక్తంబుగ సూరిసమ్మతముగా సూతుండు వర్ణింపఁగన్
సత్యానంతసుఖప్రకాశపరమున్ బ్రహ్మాత్మవిజ్ఞానదం
బత్యంతాద్భుతజాతినిర్ణయవిధం బాలించి మౌనీంద్రులున్
సత్యాస్తేయదయార్జవాదియుతులై సంతుష్టులై రయ్యెడన్. 293

## 13. తీర్థ మాహాత్మ్య కథనము

తే.గీ. జాతిధర్మంబు వీడుట పాతక మని
యానతీయంగ నాలించి శౌనకాది
మునులు తీర్థమాహాత్మ్యంబు జనహితముగఁ
దెలుపు మని వేఁడ సూతుండు పలికె నిట్లు. 294

క. శ్రీరమ్యంబగు గంగా
ద్వారంబున మేషరాశిఁ బ్రథమర్క్షమునన్
సూరుం డుండఁగఁ దోఁగిన
వారికి మోక్షంబు కొంగుబంగార మగున్. 295

సీ. యోజనాయతమయి యోజనవిస్తీర్ణ
మును గల్గి దేవతా పూజితమయి
పశ్చిమాంభోనిధి ప్రాంతభాగంబున
దీపించు శ్రీసోమ తీర్థ మందు
నార్ద్రాదినంబుల నష్టమీతిథులందుఁ
బర్వంబులను వ్యతీపాతములను
బుణ్యచతుర్దశీ పూషవారంబుల
ఘోరాఘములు వాయఁ గ్రుంకు వెట్టి

తే.గీ. యొడల భస్మంబు ధరియించి యుపవసించి
శంభుభక్తుల కెల్ల భోజనము పెట్టి

చంద్రశేఖరుఁ గొల్చినసజ్జనుండు
భవ్యశంకరకైవల్యపదము గాంచు. 296

సీ. ప్రవహించు నెచ్చోటభవజూటమున కెల్లి
ఖనదీమతల్లి గంగమ్మతల్లి
వసియించు నెచ్చోటఁబండితాంతర్యామి
విశ్వేశ్వరస్వామివేదగామి
విహరించు నెచ్చోటవిపులభోజనపాణి
శ్రీమద్విశాలాక్షిచిగురుబోణి
చరియించు నెచ్చోటశైశవక్రీడల
సామజముఖునితోషణ్ముఖుండు

తే.గీ. అట్టి వారాణసీదివ్యపట్టణమున
మహితమణికర్ణికాతీర్థలహరి యందు
మజ్జనం బాడి పాపములుజ్జగించి
భక్తి శివుఁ గొల్చిన నరుండుముక్తి నొందు. 297

సీ. సోమిదమ్మగ వాణిసోమింపఁగా బ్రహ్మ
బహుయజ్ఞముల నెందుఁబరిఢవించు
సంపూర్ణ పూర్ణిమాచంద్రి చంద్రిక వోలె
గంగమ్మ యెచ్చోటఁబొంగి పొరలు
ఘనకుచద్వయలిప్తకస్తూరికారుచిఁ
గాళింది యెచ్చోటజాలువాఱు
మిసిమి గుబ్బల పచ్చపసుపుఁ గాంతుల తోడ
శ్రీసరస్వతి యెందుఁజెలువు నొందు

తే.గీ. నట్టి శ్రీమత్త్రివేణిఁ బ్రయాగ యందు
భరణిఁ గృత్తికారోహిణీభంబు లందు
మేషరాశి నుచ్చస్థితిఁబూషుఁడుండ
స్నాన మాడిన మోక్షంబునరుఁడు గాంచు. 298

క. గంగాసాగరసంగమ
మంగళతీర్థంబు నందుమార్గశిరమునన్

బొంగుచు మునుకలు వెట్టిన
గంగాధరభక్తుఁ డొందుఁ గైవల్యంబున్. 299

క. నర్మద శమితార్తజనాం
తర్మద విధివిష్ణురుద్రనాకేశ్వరసం
శర్మద నరకద్వాఃపథ
మర్మదఁ దోఁగినఁ విముక్తి మనుజుఁడు గాంచున్. 300

తె.గీ. వృషభరాశిని సూర్యుండు వెలయఁగా వి
శాఖ రిక్కను భానువాసరము నందు
యమనిషేవిత యైనట్టి యమున మునిఁగి
భోజనము విప్రులకుఁ బెట్ట మోక్షసిద్ధి. 301

తే.గీ. సకలవిద్యాస్వరూపిణి శారదాంబ
వరద వసియించు శ్రీసరస్వతిని నార్ద్రి
యందుఁ దోఁగాడి శివయోగి సత్కృ చేసి
భవుని బూజించి నరుఁ డొందు స్వర్గపదము. 302

సీ. ఆవుఁ జంపిన యట్టి యఘ మెల్లఁ బాయంగ
దక్షిణగంగ గౌతముఁడు తెచ్చె
దాన వసిష్ఠుండు తనపాయ గైకొనెఁ
గౌశికుం డొకపాయ గరిమ నిలిపె
శ్రీభరద్వాజుండు చేకొనె నొకపాయ
నత్రియు నొకపాయ నందు కొనియెఁ
గశ్యపాత్మజులైన గరుడుండు సూర్యుండు
నొక్కొక్క తమపాయ లొంది రట్టి

తే.గీ. పుణ్యసప్తగోదావర పుష్కరముల
సింహరాశిని రవిగురుల్ సెలఁగు వేళ
స్నానమొనరించి శివుఁగొల్చు ధన్యు ముక్తి
ముద్దియ వరించి శుద్ధుఁడై శుద్ధుఁ డెట్లు. 303

సీ. శ్రీవిష్ణు మార్త్యాది దేవతా కోటితో
నీశ్వరుం డెందేని యీఁతలాడు

నెందుఁ గ్రుంకులు వెట్టి యింద్రనీలగిరీంద్ర
మభవున కావాస మయ్యె జగతి
సకలయోగీంద్రులు సర్వమౌనీశ్వరుల్
యత్తటంబునఁ దపం బాచరింత్రు
సహ్యపర్వతరాజ చారుశృంగమునుండి
యే నదీమణి జని యించి మించె
తే.గీ. నట్టి కైవల్యనిశ్శ్రేణి నబ్ధిరాణిఁ
గేవలామృతవేణి శ్రీ కృష్ణవేణి
నుభయపర్వంబులను బోఁగి యుపవసించు
నరుల కొసఁగును శబరశంకరుఁడు ముక్తి. 304

సీ. మాఘమాసంబున మఘ రిక్క యందునఁ
బంచపర్వంబుల భక్తి తోడ
దక్షిణకైలాస మోక్షభూమికి నేఁగి
సంసారబంధంబు సమయఁ జేయు
స్వర్ణముఖీనదీ వారిప్రవాహంబు
నందు మజ్జన మాడి యఘము వీడి
శ్రీకాళహస్తీశు సేవనం బొనరించి
జ్ఞానప్రసూనాంబ సంభజించి
తే.గీ. యచటి పాతాళగణపతి నభినుతించి
తిన్ననిం గాంచి సాలీని సన్నుతించి
కాళమును మ్రొక్కి హస్తికిఁ గైమొగుడ్చు
పుణ్యపురుషుని వరియించు మోక్ష లక్ష్మి. 305

క. పంపన్ బోయన్నపితని
లింపన్ గల్లోలకాంతి లీలాజితస
చ్ఛంపన్ బోఁగిన శివు నను
కంపన్ గని భక్తులెల్లఁ గాంతురు ముక్తిన్. 306

తే.గీ. హస్త నుత్తరఫల్గుని నాదివార
మందు శౌరికిఁ బ్రియమైన యాదిలింగ

తీర్థమున మున్గి హరుఁ గొల్చి ద్విజున కెలమి
భోజనము పెట్టి నరుఁ డొందు ముక్తిపదము 307

సీ. గీర్వాణులకుఁ బూర్వ గీర్వాణులకుఁ దెంకి
యప్సరసలు నాట్య మాడు భూమి
యాదిత్యనిర్మితం బై యధికాఖ్యతో
నగ రొప్పు నప్పట్టణంబు చక్కఁ
గుటిలాసమాహ్వయ తటినీతటంబున
వీరాఖ్యయై యుండు గౌరి యామె
శ్రావణ పౌర్ణమాస్యను గుటిలాంబుల
హరునకు నభిషేక మాచరించి

తే.గీ. భక్తిఁ గుటిలానదిం దోఁగి పండితులకు
వస్త్రధనధాన్యము లొసంగు వాని కిమ్మ
భుక్తిముక్తు లటంచును మ్రొక్కి వేఁడె
భవుఁడును దథాస్తటంచును వర మొసంగె. 308

మ. కుటిలాప్రోదిని భానువారమునఁ గ్రుంకుల్ వెట్టి శ్రీశ్రావణిన్
నిటలాక్షున్ భజియించి యీశ్వరుని రాజిన్ వీర సేవించుచున్
జటిలాఘంబులు వాయ భక్తులకుఁ బూజల్ సల్పు విన్నాణికిన్
బటులాస్యంబున ముక్తికాంత యొసఁగున్ బాహాపరిష్వంగమున్.

మ. గణరాడ్విష్ణుకుబేరవహ్నివసుశక్ర బ్రహ్మవిద్యామరుల్
అణిమాద్యష్టవిభూతు లొందిరట వృద్ధాహార్యసీమన్ నభో
మణి చాపంబున వెల్గ నార్ద్రిను జగన్మాతన్ బితన్ గొల్చుచున్
మణిముక్తానదిఁ దోఁగు మానవులకుం బ్రాప్తించుఁ గైవల్యముల్

తే గీ. పృథివి దుర్వృత్తుఁడైన సువృత్తుఁడైనఁ
బండితుండైనఁ బరమమూర్ఖుండె యైనఁ
బ్రాహ్మణుండైనఁ గడజాతివాఁడె యైనఁ
బుణ్యమణిముక్త మునిఁగినఁ బొందు ముక్తి. 311

శా. శ్రీలక్ష్మీలలనానివాస మయి విశ్వేదేవపద్మాక్షది
క్పాలబ్రహ్మమహేంద్రదేవమునిముఖ్యస్థానమై పార్వతీ

కైలాసేశ్వరనాట్యరంగ మగు వ్యాఘ్రక్షేత్రమున మాఘీమహా
వేళన్ శ్రీశివగంగఁ దోఁగిన నరుల్ వేగాంత్రు సాయుజ్యమున్.

క. వరుణుఁడు ప్రమాదమున మును
ధరణీసురు నొకని జంపి తత్పాపాబ్ధిన్
దరియింప వ్యాఘ్రపాన్ముని
గురువచనము లాలకించి కొందలపడుచున్. 313

తే.గీ. మాఘమాసమహాపూర్ణిమాదినమున
గుహ్యతీర్థజలంబులఁ గ్రుంకు వెట్టి
బ్రహ్మహత్యామహాఘంబుఁ బాయఁ గౌరి
దేవదేవుని సేవించె దీక్ష తోడ. 314

క. ఋఙ్మఖదివ్యోపనిష
ద్వాఙ్మయగోచరుఁడు పాపభంజనచణుఁడున్
వాఙ్మనసాతీతుఁడు హిమ
రుఙ్మకుటుఁడు వరుణు కడకుఁ బ్రోవఁగ వచ్చెన్. 325

తే.గీ. భవుని దర్శించి నంతనే పాప మెడల
మ్రొక్కి గుహ్యతీర్థంబున మునుక పెట్టు
వారలకు మోక్షమిమ్మని వరుణుఁ డడిగె
నట్ల యగుఁగాక యని పల్కి హరుఁడు వెడలె. 3 6

తే.గీ. మాఘమాసపర్వంబుల మహిత భక్తి
వ్యాఘ్రపట్టణ ప్రాగుదగ్భాగమందు
గుహ్యతీర్థపుష్కరములఁ గుర్తింకు నరుఁడు
ఘోరభవనరకాబ్ధిలోఁ గ్రుంకఁ డెపుడు. 317

తే.గీ. జలజభవరోమశుల తపస్స్థానమైన
బ్రహ్మపురి బ్రహ్మతీర్థంబు వారి మునిఁగి
గ్రహణపర్వంబులను హరుఁ గను జనులకుఁ
గరతలామలకంబు శంకరపదంబు. 318

మధురాక్కర:
శివుని వెలిపెట్టి దక్షుండు చేయు యజ్ఞంబునందుఁ
దవిలి వీరభద్రుఁడు దేవతల తలల్ దట్టింపఁగా

రవికిఁ బండ్లూడ బ్రహ్మపురమునం దపం బొనర్చి
సవిత పండ్లొందె సూర్యపుష్కరిణి యయ్యెను సరస్సు. 319

మధ్యాక్కర:

ఇంద్రాది దేవాళి గెల్చి యేడ్తెఱ యేపారఁ దొల్లి
నింద్రజి రథముపై నేఁగ నిచ్చోట నెటుసాఁగ కాఁగ
సాంద్రభక్తిని దేరు డిగ్గి సవిత్రపుష్కరిణిని దోఁగి
చంద్రమోమకుటలింగంబు స్థాపించి సరిగొల్చి యేఁగె. 320

తే.గీ. అట్టి సూర్యపుష్కరిణీశుభాంబువులను
గ్రహణముల విషువాయన కాలములను
బర్వముల నార్ద్రి భాస్కర వారములను
మునిఁగి విప్రిలఁ దనియింప మోక్ష మబ్బు. 321

తె.గీ. వనధిసంగమమంగళ వంశకముల
నామ్రతీర్థంబు నందు మధ్యార్జునమునఁ
గుంభకోణత్రికోటిహాకుతలములను
బుణ్యమైన శ్వేతారణ్య భూమి యందు. 322

క. కావేరిని రత్నాకరు
దేవేరిని నిత్యనృత్య దీప్తతరంగ
శ్రీవారిని నరుఁ డెప్పుడు
దైవాఱిన భక్తి మునుఁగ ధన్యతఁ గాంచున్. 323

తే.గీ. పర్వముల యందు భాస్కర వార మందు
భక్తిఁ గావేరిలోఁ దోఁగి పార్వతీశుఁ
బ్రణతు లొనరించి సప్తతీర్థముల యందు
మరణ మొందిన నరుఁ డొందుఁ బరమపదము. 324

తే.గీ. మహితవల్మీకసుక్షేత్ర మధ్య మందు
నొప్పు శ్రీక్షీరకుండది వ్యాప్తి అందు
ఫాల్గునంబున నుత్తర ఫల్గునిని జ
లంబులాడిన జనుఁడు కైలాస మొందు. 325

తే.గీ. క్షీరకుండంబు పశ్చిమక్రేసమ నొప్పు
తీర్థమునఁ దొల్లి నొకయేఁడుఁదేవరాజు
పర్వముల మున్గి వల్మీకపర్వతేశుఁ
దివిరి పూజింప నది దేవతీర్థ మయ్యె. 326

తే.గీ. ఫాల్గునంబున నార్ద్రినుభానువార
ములను గృష్ణాష్టమిని బర్వములను దేవ
తీర్థమునఁ దీర్థమాడినత్రైరికులకు
శివుఁడు దయ తోడ నొసఁగు నిశ్శ్రేయసంబు 327

ద్విపద :

శ్రీసూర్యవంశాబ్ధిశిశిరభానుండు
కోసలనృపపుత్త్రికోర్కుల పంట
దశరథక్ష్మాపాలుతపముల ఫలము
ప్రశమితపాపుండుపరమపావనుఁడు
శ్రీరామచంద్రుండుసీతాప్రియుండు
ఘోరయుద్ధమునందుఁగుత్సితకర్మ
దారాపహారకుదైత్యలోకేంద్రు
నారావణుని జంపియవనిపైఁ గూల్చి
లక్ష్మీస్వరూపిణిలలనను గూడి
లక్ష్మణస్వామి ముఖ్యలలి విభీషణుఁడు
గాలిపట్టియు రుమాకాంతుండు నలుఁడు
వాలిబిడ్డఁడు జాంబవంతుండు మొదలు
సర్వకపీశ్వరసంఘంబు కొలువ
గీర్వాణదిక్పాలకిన్నరగరుడ
గంధర్వులును మునుల్కరము కీర్తింప
గంధమాదనమహాక్ష్మాధరంబందు
సేతుమంగళశుభక్షేత్రతీర్థమున
స్నాతుఁడై యానందజలధిని దోఁగి
బ్రహ్మహత్యామహాపాతకం బీఁగ

బ్రహ్మాదిసురవంద్యుఁ బార్వతీనాథు
రామేశ్వరస్వామి రమ్యలింగంబు
గోముగా స్థాపించి కోరి సహస్ర
నామాళితో బిల్వ నవపత్రములను
గామితార్థప్రదుఁ గారుణ్యపూర్ణు
శ్రీకంఠుఁ బూజించి చెచ్చెర మ్రొక్కి
సాకేతపురికిఁ బుష్పకముపై నేఁగె. 328

తే.గీ. చంద్రసూర్యోపరాగస త్సమయములను
బర్వవిషువాయనవ్యతీ పాతములను
బుణ్యదినముల షడశీతి ముఖము లందు
నాదిశుక్రవారముల న ర్ధోదయముల. 329

క. శ్రీమద్రామేశ్వరతీ
ర్థామలతోయములఁ గ్రుంకి హరు రామేశున్
బ్రామినుకుల వినుతించిన
బాములు పాపములు పంచ బంగాళమగున్. 330

తె.గీ. అమల రామేశతీర్థంబు లందుఁ దోఁగి
భక్తి ముమ్మాఱు వలగొని పార్వతీశు
దాశరథిపూజితుని గొల్వఁ దక్షణంబ
బ్రహ్మహత్యాదిఘోరపా పములు వాయు. 331

తే.గీ. ఒక్క మాసంబు ప్రతిదినం బుదధి మునిఁగి
రామనాథుని దర్శించి రజని యందు
నొక్క దిన మందు భక్తితో నుపవసించి
పాఱునకు నిష్కమాత్రసు వర్ణ మీయ. 332

తే.గీ. బ్రహ్మహత్యాసురాపాన పాతకములు
స్వర్ణసంస్తేయగురుతల్ప పాతకములు
పాపకృత్సఙ్గసంభూత పాతకములు
తొలఁగి జనులకు మోక్షంబు తుదఁగలించు. 333

తే.గీ. ఒక్క మాత్రైన రామేశ్వరోర్వి నుదధి
నూర్మికాడోలికల యందు నోలలాడి
మ్రొక్కి శివుఁగొల్చు ధన్యుని ముక్తిలలన
కౌఁగిటఁ గదించి సుఖడోలికల నూఁపు. 334

ఆ.వె. సకలవేదములను శైవాగమంబుల
రమ్యశాస్త్రములఁ బురాణములను
దెలుపఁబడిన పుణ్యతీర్థమాహాత్మ్యంబు
తెలిపినాఁడ మీకు దేటపడఁగ. 335

సీ. ఈ తీర్థమాహాత్మ్య మీశుండు తొలుదొల్త
నంబికాదేవికి నానతిచ్చె
నా యంబికాదేవి యనుఁగుఁ గుమారుఁడౌ
కొమరసామికిఁ జెప్పెఁ గూర్మి తోడ
నా కుమారస్వామి యంభోజగర్భున
కుపదేశ మొనరించె నొప్పు మీఱ
నా చతురాననుం డస్మద్గురుం డైన
వ్యాసర్షికిని దెల్పె వత్సలతను

ఆ.వె. ఆ మహానుభావుఁ డామ్నాయపద్మార్కుఁ
డాదిముని పరాశరాత్మజుండు
పరమకృపను నాకు బాఠంబుగాఁ జెప్పె
దాని జెప్పి నాఁడఁ దఱిని మీకు. 336

ఆ.వె. భక్తితోడ మీరు ప్రార్థింపఁగా జగ
ద్ధితము గోరి దీనిఁ దెల్పినాఁడ
దివ్యమైన యట్టి తీర్థమాహాత్మ్యంబు
శిష్యగణములకును జెప్పుఁ డెపుడు. 337

ఆ.వె. దేవదేవహితము తీర్థమాహాత్మ్యంబు
ప్రత్యహం బెవండు పఠన సేయు
వాఁ డఘంబు పంచ బంగాళ మొనరించి
భవుని కృపను బరమపదము గాంచు. 338

ఆ.వె. శుభదినంబు లందుశుద్ధుఁడై తీర్థమా
హాత్మ్య మెల్ల వీనులార విన్న
నరుఁడు పాపరాశి నలినలి గావించి
పార్వతీశదివ్యపదము గాంచు. 339

తే.గీ. శ్రాద్ధదినములఁ బుణ్యతీర్థంబు లందుఁ
దీర్థమాహాత్మ్య మెవ్వండు తెలియఁ బలుకు
వాఁడు దారిద్ర్యమును బటాపంచచేసి
భాగ్యగరిమఁ గుబేరుని బరిభవించు. 340

ఆ.వె. అర్థితోడ నెవఁడు తీర్థమాహాత్మ్యంబు
చెలఁగి వినుచు దేవతలను గొలుచు
నతని బ్రహ్మవిష్ణు శితికంఠు లురుదయఁ
గనిన బిడ్డ వోలె మనుతు రెపుడు. 341

మత్తకోకిల :
కంఠపాఠము గాఁగ నెప్పుడు కంజనేత్రుఁడు దివ్యవై
కుంఠవాసుఁడు విష్ణుమూర్తి య కుంఠభక్తి దలిర్ప శ్రీ
కంఠసత్కరుణాకటాక్షము గాంచఁ దీర్థమహత్త్వ ము
త్కంఠతోడఁ బఠించు శ్రీకల కంఠిఁగూడి ముదంబునన్. 342

క. కానన్ నిచ్చలు చదువుం
డో నైమిశవాసులార! యుత్సుకులై యీ
శానప్రసాదసిద్ధికి
మానిత సద్భక్తిఁ దీర్థమాహాత్మ్యంబున్. 343

మ. అని యీరీతిని దేవదేవశివమాహాత్మ్యంబు తెల్లంబుగా
ముని శ్రీనైమివాసులౌ మునులకున్ బోధించి వీడ్కొంచు స
న్మునివర్యుండగు బాదరాయణు పదాంభోజాతముల్ గొల్చి యీ
శుని దుర్గావరుఁ జంద్రశేఖరు హరున్ శుద్ధాత్మ భావించుచున్.

శా. శ్రీసూతర్షి గమించె యోగమహిమన్ శ్రీశంకరీశంకరా
వాసంబున్ రజతోరుకూటనికరోద్భాసంబు నిత్యాప్సరో
లాసంబున్ గజవక్త్రషణ్ముఖమహోల్లాసంబు ముక్త్యంగనా
న్యాసంబున్ గృతనందికేశఖురవిన్యాసంబుఁ గైలాసమున్.

చ. సరసమృదూక్తి బుధవరసత్కవిచంద్రుఁడు సూతసంహితన్
వరుసను రెండు మూఁడు మఱి నాలుగు ఖండములున్ రచించె నీ
కరుణను నాద్యమైన శివఖండము చెప్పితిఁ బార్వతీమనో
హర! హర! శర్వ! సర్వభువనార్చిత! నన్ దయఁ జూడు మెప్పుడున్

సీ. ఇది సదాపరమేశ్వరదయాదృగాలబ్ధ
కవితాంకుర బుధేంద్రకవివిధేయ
శ్రీపరాశరసగోత్రీయ గర్మైశ్యకి
ష్టయపౌత్త్రి సూర్యనారాయణార్య
సూర్యకాంతాంబికాసూన్వగ్ర సహజపాం
డిత్య భక్త్యుత్యతిసత్యశేష
గిరిసోమయాజిశర్మరచిత శ్రీసూత
సంహితాదిమఖండసత్కృతిమణి

తే.గీ. ధరణి బుధకవిసత్తమాదరణ గలిగి
యాసుధాకరతారార్కమై కరంబు
వఱలుఁగాత భవత్కృపాపాంగ మొప్ప
భాసురశుభాంగ! యవిడికైలాసలింగ 347

పృథ్వీవృత్తము :
పురాణగణభాషణా! భుజగరాజిసద్భూషణా!
పురాతనమునీశ్వరా! భువనజాలవిశ్వేశ్వరా!
పురత్రయవిభంజనా! మునిజనావళీరంజనా!
పురందరపదావనా! ముదితభావనా! పావనా! 348

క. జలజాసనబలశాసన
కలహాశనవినుతనామ! కరుణాధామా!
లలితాఞ్చితకిలికించిత
కలితాంచితహాసభాష! కైలావేశా! 349

మాలిని : సుకవినికరపోషా! సూరిరక్షాభిలాషా!
ప్రకటనిగమబోధా! పార్వతీచిత్తనాథా!
మకుటితశశిరేఖా! మంజుపాదస్థలేఖా!
సకలభువనదీపా! సచ్చిదానందరూపా! 350

—: గ ద్య ము :—

ఇది 'కవితావిశారద' శ్రీబుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతంబైన శ్రీమ
దాంధ్రసూతసంహితామహాగ్రంథంబునందు శ్రీమత్పరమేశ్వరకరుణా
కటాక్షలబ్ధకవితావిచిత్ర పరాశరసగోత్ర శ్రీగరిమెళ్ళకృష్ణావధాని
పౌత్రసూర్యనారాయణసూర్యకాంతాంబికాపుత్ర సకలసుకవిబుధ
జనవిధేయ 'సహజపాండిత్య' అచ్యుత సత్య శేషగిరి సోమ
యాజి శర్మ నామధేయప్రణీతంబైన శ్రీశివమాహాత్మ్యఖం
డంబునందు గ్రంథావతారంబును పాశుపతవ్రతంబును
నందీశ్వరవిష్ణుసంవాదాత్మకంబగు నీశ్వరప్రతిపాద నం
బును నీశ్వరపూజావిధానంబును శక్తి పూజావిధానం
బును శివభక్త పూజావిధానంబును ముక్తిసాధన
కథనంబును గాలపరిమాణతదనవచ్ఛిన్నశివస్వ
రూపకథనంబును బృథివ్యుద్ధరణకథనంబును
బ్రహ్మసృష్టికథనంబును హిరణ్యగర్భాది
విశేషసృష్టికథనంబును జాతినిర్ణయకథ
నంబును దీర్ఘమాహాత్మ్యకథనంబు
నను విషయములు గల ప్రథమ
ఖండము సమాప్తము.

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు.

శ్రీరస్తు

# శ్రీ సూతసంహిత

## జ్ఞానయోగఖండము

### 1. జ్ఞానయోగ సంప్రదాయ పరంపరాకథనము

సీ. ఒకచోట నానాలతోర్వీజసముదయ
మ్మొకట నానాలతాంతోత్కరమ్ము
నొక సీమ నానాఫలోత్కృష్టకందౌఘ
మొకట నానాస్వాదుయోగ్యసలిల
మొకత్రేవ నానావిధోజ్జ్వలమణిగణ
మ్మొకట నానాకురంగకబలమ్ము
నొకచాయ నానాసురకృతార్ధబృందమ్ము
నొకట నానాకిన్నరకృతివితతి

తే.గీ. చెలువు దయివార నమృతాంశుశేఖరాల
యమ్ము సొమ్ముల కెల్లను సొమ్ము నగుచు
వెలయు ముల్లోకములఁ బేరు పెంపుఁగని వి
లాససంపద నడరి కైలాసశిఖరి. 1

ఉ. అందున నొక్క రత్నరుచిరాసన మందు వసించి మేనజా
నొందగ బూదిఁ బూసి మెడ నొప్పుగఁ బెన్ రుదురాక్షతావళం
బుం దగఁ దాల్చి కన్నుఁగవ మూసి దనుందనుఁ గాంచుచుండి చూ
డం దగు రీతి సూతుఁడు బెడంగుల తానకమై విరాజిలెన్॥ 2

క. అపరవ్యాసుం డన ని
ష్కపటమ్మునఁ గోర్కె లెల్ల సతతము విడియె
ట్లుపమింప రాని తేజు నె
రపుచు నతం డడరుచుండె రాజతగిరిపై॥ 3

కం, స్మితభూషితాననుం డయి
జితేంద్రియసమాజుఁ డయి విసర్జితరాగక్రో
ధతతి యయి నిర్మలుండయి
యతిలోకాకారుఁ డగుచుఁ దా నాతం డలరున్॥ 4

వ. అనుత్తమార్తామలక ప్రియారణులు నుత్తమోద్దాలకోగ్రవీర్యులును గణ్వాకరుణ కంకణ కల్పాంతకళాధర కాలకాలాగ్నిరుద్రక కైవల్యులును జయజంగమ జర్జర జాబాల జమదగ్నులును బక పరాశర పార పారగ పండితపండితోత్తములును మహాకాయ మహాగ్రీవ మహాబాహు మహాసేన మహాప్రాజ్ఞ మహావీర్యులును వత్సవిష్ణువృద్ధవిశాలాక్షులును శ్వేతబాహు శ్వేతాశ్వతరులును దచ్ఛిష్యప్రశిష్య గణంబులతో భవపాశనిరసనవ్యసనులయి సూతసన్నిధిం జేరి దండప్రణామంబు లర్పించి యిట్లనిరి, 5

ఉ వ్యాసమహర్షి యన్న యొకఁడా పాటి తపస్వియె? వాసుదేవుఁడై
భాసిలు వ్యాసరూపమునఁ బ్రజ్ఞ నెవండిటు నాల్గు వేదముల్
జేసి వ్యవస్థలన్ నిలిపి తా చేవఁ జెలంగిడి వాఁ డిలాస్థలిన్
వాసి గనున్ బురాణ రచనాచణుఁ డంచు నుతింప నెల్లరున్॥ 6

కం. వ్యాసాచార్యుల కడ న
భ్యాసం బొనరించి నాఁడ వఖిలపురాణ
ప్రాసంగికవైఖరి, నీతి
హాసాంచితరీతి నీకు నన్యులు సరియే! 7

వ. అని నుతియించి 8

మ. ఉపదేశించితి వయ్య యింత వరకీ వుద్యన్మనీషావిశే
షపరీపాకసమృద్ధిఁ జేయుమని భాస్వద్బ్రహ్మతత్వం బికన్!
గృపఁ దత్ప్రాప్తి కుపాయవర్గము నొగిన్ గిర్తింపఁ బ్రార్థింతుమ
య్యా! పరాకించుక లేక మా మనవి నీ వాలింపవే పెంపుమై 9

చ. అని వచియింప నా ఘనుఁడు సాంబశివున్ మది నిల్పి బాదరా
యణు వరసన్నిధానము హృదబ్జమునన్ గలిపించు కొంచుఁబల్
వినయసుధామధూరుతరలీల లెలర్పఁగఁ బల్కెఁ జొచ్చెనా
యనఘులు వీను లొగ్గివినునంతటి వారయి డాసియుండగన్॥ 10

వ. అది యెట్లందురేని 11

చ. పరమశివుం డొకప్డు స్వతపః ఫలమైన యుమాలతాంగి డ
గ్గరి యుపచారమీ యసురకాండము గొల్వ సభాంతరమ్మునన్
సురగురునిన్ బృహస్పతిఁ గనుంగొన నాతఁడు మంచివేళయం
చురుముద మొంది లోకహితమూహ యొనర్చి యొనర్చెఁ బ్రశ్న
మున్ 12

మ. అరయన్ లోకమునందు నెయ్యెడల మోక్షార్థిత్వముల్ లేకపో
వరుదొంచుందురు ముక్తిఁ బొందు జనులయ్యా! హేతు వూహిం
పఁగాన్
వరమోక్షంపుఁ దెఱం గెఱుంగమిఁ గదా నాకాదిలోకంబులన్
గరుణన్ ముక్తికిఁ జేర్చు త్రోవల నెఱుంగగన్ జెప్పి బ్రోవంగదే

వ. అని దీనానూనాలాపంబుల వేడ గిరిశుండు సహజకరుణాంత
రంగుం డగుట నిజతరుణీ మణి సుందరవదనం బాలోకించి నీలాం
భోదగంభీరరవంబులు సెలంగ సురాచార్యుల కుత్తరం బిడె.
గిరిసార్వభౌము ముద్దుపట్టి యూరుతలంబున వసించి కుమారుం
డపుడు సావధానంబుగా వినియె. స్కందశిష్యుం డైన వశిష్ఠుండు
తన పూర్వజన్మకృత తపఃపుణ్యప్రభావంబున నవ్విద్య గ్రహిం
పఁగలిగె. అతఁడు నిజజ్యేష్ఠకుమారుం డగు శక్తి కుపదేశించె
శక్తివలనఁ బరాశరుండును, బరాశరుని వలన భగవంతుండగు
వ్యాసుండును నమ్మహామహు వలన నేను నావిద్య సంపాదించితి
మిది దీని సంప్రదాయ వృత్తాంతంబు. 14

క. నే విన్నయట్లు మీకున్
నే విన్నపముం బొనర్తు వినుమీ భాగ్యం

బే వర్ణింపఁగ నేర్తునె
మీ వీనుల పున్నె మెంతకమిన్న యగునొకో

## 2. ఆత్మచే సృష్టికథనము

వ. ఇందుధరుండు బృందారక గురున కిట్లానతిచ్చె. 15

తే. పరమ గోప్యంబు శ్రేష్ఠంబు కవంత లెల్ల
నవల నెట్టంగ జాలిసకయరిది యూత
కోల జ్ఞానంబు దీని నెకక్కాల మందొ
సంగకూడ దనధికారికజనములకును.

వ. జ్ఞానాధికారు లుత్తమ మధ్యమాధము లన ముత్తెఅంగులై యుం దురు. అందు విశుద్ధాంతఃకరణులును సమాహిత చిత్తాభరణ లును నగు వార లగ్రిగణ్యులు. వారు పనిషద్వాక్యశ్రవణమన ననిధిధ్యాసముల వలన సిద్ధిఁ బొందుదురు. ఆత్మానాత్మ వివేక యుక్తులు రజోలేశానుషక్తులు నగువారు మధ్యములు. వారేకాగ్రి మనస్కులు గామి నష్టాంగయోగమున జ్ఞానముం బొరయుదురు. సాంద్రోపరోధబలాయత్తచిత్తులగు వారధములు. వార లప్రి తిష్ఠతజిజ్ఞాసులై వర్ణాశ్రిమ ధర్మపరులై తద్వ్యతిక్రిమనిమిత్త పాపంబుఁ బ్రాయశ్చిత్తాదుల వలన నపనయించుకొనుచుఁ దన్ని మిత్తక దానాదుల వలన వైరాగ్యమును జ్ఞానమునుఁ గాంతురు. ఈ కిడమవారి కొఱకయి సృష్టిక్రిమం బభివర్ణింతు. తొలుత జగమాత్మాభిన్నంబ కాని వేఱుగాదు. పిదప సత్వరజస్తమో గుణాధిక్యంబుల నాత్మఁడే హరవిరించులు గుణత్రయ వైషమ్య ములు దక్కఁ నామరూపధారులకు హేతువగును. సర్వజగములు వికృతి స్యూతములు హిరణ్యాగర్భుండు ప్రిథమశరీరి. మర్త్య సావబలమ్మున నతండు నరసురాది లోకంబుల నిర్మించు మదను గ్రిహంబున విష్ణుఁడు విష్ణుత్వంబు రుద్రుఁడు రుద్రిపదమ్మును బొందుదురు. చతుర్వర్ణ చతురాశ్రిమవాసులకు నెన పూజ్యుఁడ.

తత్తద్ధర్మ నిర్వహణ ఫలం బీశ్వర ప్రసాదంబు అందు నవిద్య కర్మములవలనఁ గాక జ్ఞానము వలనన తొలంగు. జ్ఞానము ముక్తికి నజ్ఞానము సంసృతికి వలె హేతు వగును. 18

క. విను మిది బ్రహ్మప్రాప్తికి
ననువగు సాధనము సంగ్రహంబుగ దీనిన్
వినిపించి నాఁడ నని హరుఁ
డనఁ బులకలు మొలక లెత్తనమరుగురుఁ డొగిన్॥ 19

క. బత్తిమెయిం బ్రణమిల్లుచు
నెత్తుచుఁ గేల్దోయి గిరిశునెదుటను స్తోత్రం
బత్తరి విబుధులు మెచ్చఁగఁ
జిత్తోన్నతి సలిపె నట్లుచింతలు దొలఁగన్॥ 20

క. హరునకు విజితస్మరునకు
ధరజాకాంతునకుఁ బర్వతనిశాంతునకున్
బరమశివున కభవునకున్
గిరిశునకున్ బ్రణతి వితతిఁగీలింతు వెసన్॥ 21

క. మౌనిప్రభునకుఁ దత్త్వ
జ్ఞానప్రదవిభున కఖిలసారవిభునకున్
మానితహయ ఋషభునకున్
నే నభివాదశతములనునిరత మొనర్తున్॥ 22

క. శూలికి మాయాశాలికిఁ
బాలితదేవాలి కఖిలపాపైకవనీ
కీలికిఁ గపాల మాలికిఁ
జాలగ సాష్టాంగవినతిసమితి నొసఁగెదన్॥ 23

క. రుద్రునకుఁ గృపాపూర్ణస
ముద్రునకును సాంద్రితరతమోఽహస్కరని
ర్ణిద్రునకు భూతితృప్తద
రిద్రునకున్ నే నమస్కరింతున్ బత్తిన్॥ 24

క. విశ్వాకారున కురుతర
విశ్వాధారునకు భూతివిస్తారునకున్।
విశ్వాభిరామనాసా
నిశ్శ్వాసాగమున కెపుడుఁనే నతి నిడుదున్॥ 25

క. కాలునకుఁ గాలగళునకు
కాలాపీడునకుఁ గాలకాలునకు మహా
కాళీవామాంగునకున్
కేలుంగవ మోడ్తు నేనుకృతవినయుఁడనై 26

క. లోకాద్భుత విక్రమునకు
లోకాద్భుత విగ్రహునకులోకేశునకున్
లోకాద్భుత తాండవునకు
వాకొందును నుడిశతంబువఱలినభక్తిన్॥

క. ప్రాణాయామపరాయణు
లై నిచ్చలు మనఁగఁ జాలునల యోగుల బల్
ప్రాణములను రక్షించెడి
జాణకు జోహారొనర్తుసతతం బేనున్ 28

క. మూలాధారోదితయై
వ్రీల షడబ్జములు శీర్షవీధీగమన
శ్రీలబ్ధమధురసుధలన్
గ్రోలు లలన నేలు వానిగొలుతున్ మదిలోన్ 29

క. ఏచిచ్ఛక్తి మెయిన్ దా
రాచంద్రార్కాగ్నిగణమురాజిల నగునో
యాచిన్మయదీప్తునకున్
ప్రాచుర్యప్రణతులనఁ గరంబర్పింతున్॥ 30

క. అక్షయచిన్మోదునకున్
సాక్షాత్పరమాత్మునకునుశంకరునకునున్।

మోక్షప్రదునకు హృదయా
ధ్యక్షునకున్ నిరతమేఁ గృతాంజలి నగుదున్॥ 21

క. వినుఁడు బృహస్పతి గిరిశున
కును సలిపిన స్తవముఁ జదువుకొన్నన్ విన్నన్
గనఁదగు నేరికి నైనను
వినుత మ్మగు ముక్తి యింక వేయునునేలా? 22

చ. ప్రతిదిన మీస్తవంబును నెవండు పఠించిన వాని కబ్బు ను
న్నతమగు విద్య వాఁడది మనమ్మునఁ గోరెన యేనిపెండ్లియా
మతిగలదేని పెండ్లిపయి మానుగ జ్ఞానము గల్గు ఘోరసం
సృతి దరియింపఁ గోరికలు జిత్తమునందలరారు నేనియున్ 33

### 3. బ్రహ్మచర్యాశ్రమ విధి నిరూపణము

వ. మహాదేవుండు దేవగురుని కిట్లానతిచ్చెసర్వాశ్రమములకు మొద టిది బ్రహ్మచర్యంబు తద్విధం బభివర్ణించెద. స్వసూత్రక్రమ మున నుపనీతుండగు వాఁడధ్యయన పరాయణుండు గావలెను. ప్రాతః సాయంకాలముల నగ్నిని వేల్చునది. దేవర్షి పితృతర్ప ణమ్ముల యథావిధి నొనర్చునది. నిజమస్తకోన్నతి నొప్పు మోదుగుదండంబుఁగాని, మారేడు దండంబుగాని త్వగ్విభూషితం బయిన దానిని గ్రహింపవలెను. శివాగ్నిచేఁగాని, విరజాగ్నిచేఁ గాని మంత్రపూర్వకముగా సంగ్రహించి భస్మము సజలమ్ముగాఁ గరోరః కంధరలలాట ప్రదేశమ్ముల నలంకరించునది. అత్తరి శివశివాన్యతర ధ్యాన మొనర్చునది. శ్రోత్రియబ్రాహ్మణగృహం బులనుండి తదలభ్యసందర్భంబయిన నన్యగృహంబుననుండి భిక్షాగ్రహణ మ్మొనర్చి గురునివేదనమ్ము సలిపి తదనుజ్ఞను భుజించునది.భవత్పూర్వమధ్యమావసానముగా 'భిక్షాందేహి' యని యథాక్రమముగా బ్రహ్మక్షత్రియ వైశ్యవటువులు భిక్ష యాచించు నది. తల్లిదండ్రులయు, నొజ్జలయుఁ బెద్దలయు నన్నలయు, జ్ఞానులయు దర్శన మాత్రమున నుత్తిష్ఠుఁడయి 'యసావహం

భోనామాస్మి' యని యభివాదం బొనర్చునది వారిలో జ్ఞానాధిక లకుఁ దొలుత వందన మిడునది. 'ఆయుష్మాన్ భవసోమ్య' యని వారిచ్చు ప్రత్యభివాదనము శిరమున వహించునది. మాతృ పితృవంశ్యలను, గుణాధికులను, గురువంశులననువర్తించునది. అధ్యాపకుఁడు కంటఁబడిన నిలిచి నమస్కరించి తదనుజ్ఞ నాసీ నుండగునది. సత్యముఁ దప్పకుండునది. చదివినది మఱవ కుండునది. మోక్షకాంక్షను గాని, విష్యక్తమను బుద్ధిని గాని నిత్యనైమిత్తిక కలాపంబు శ్రద్ధతో నిర్వర్తించునది. కాలు చేతులు గడిగికొని సూర్యాభిముఖుండయి కాని పూర్వాభి ముఖుండయిగాని యాహరించునది, 'ప్రాణాయస్వాహా' యను మంత్రాదుల వలన నాహుతులు గొనునది, ఇటుల వ్రతమాచ రింపుచు వేదాధ్యయనమునఁ దప్ప నితరముల యందు మనము లగ్నము సేయకుండునది. ఇట్లు బ్రహ్మచర్యవ్రత మాచరించిన యెడలఁ గొంతకాలమునకు వైరాగ్యోదయ మైనచో సన్యసించు నది. కానిచో నైష్ఠిక బ్రహ్మచారిగాని, గృహమేధిగాని యగు చొప్పునది.

### 4. గృహస్థాశ్రమ విధి నిరూపణము.

వ. బ్రహ్మచర్యాశ్రమవిధి సంక్షేపంబుగా వివరించితి. తదాశ్రమ నివాసి వేదములలో నొకటి గాని, రెండు గాని మూఁడు గాని యభ్యసించి యాచార్యానుజ్ఞాతుండయి భిన్నగోత్రోద్భవయు, సర్వలక్షణ సంప న్నయు, నదీ వృక్ష నక్షత్రేతర నామయు సాధ్వియు నగు కన్నెం బరి ణయ మగునది. పితృసహితుఁడయి యౌపాసనపురస్సరమ్ముగా ధర్మము నిర్వహించునది. నిరగ్నిపతితుఁడు ఋతుకాల మెఱిఁగిన నిజాంగనా సాంగత్యమున సమంత్రకముగ నుండునది. అతిథేయా తిథినిమిత్తము గాక యాత్మార్థమన్నము పచనము గావించు వాఁడు నరకనివాసి యగుటకు సందియములేదు. ధర్మార్థ జీవనుఁడును సంతానార్థమైధునుఁడును ముక్త సంసారభీరు లగుదురు, తదితరులు నిరయయోగ్యులు. యాజనాధ్యాప

నముల వలన, విశుద్ధులవలన, దేహయాత్రార్థమాత్రము గాని యాగార మాత్రముగాని ప్రతిగ్రహణ మొనర్పవచ్చును.

నిర్జన నిర్భయ ప్రదేశమ్మున విణ్మూత్రముల విసర్జించి మృజ్జలంబులతో గుహ్యాంగపరిక్షాళన మొనర్చి హస్తపాదములఁ గడిగికొని గంధలేపనివృత్తి యయ్యెనని తృప్తి కలుగు వఱకు శౌచము తీర్చునది. దంతధావనానంతరము కృతస్నానుండయి ప్రాణాయామత్రయానంతరమున, గాయత్రిం జపియించి యుపస్థానంబు నిర్వర్తించి వేదపారాయణంబు నెఱపి మధ్యాహ్నమున బ్రహ్మయజ్ఞ మనుష్ఠించునది. పిదప నగ్నికార్యమును బలికార్యము ము న్నగువాని నాచరించునది. నిత్యశ్రాద్ధమును దానాదుల నశక్తి దక్షిణాదుల నేమరఁగూడదు. సర్వభూత హిత రతుఁడై మెలఁగవలయుఁ బక్వాన్నమునకు యతి బ్రహ్మచారులు భాగస్వాములని యనవచ్చు. వారి కిడక భుజించు వాఁడు చాంద్రాయణ మాచరింపవలెను. కర్మంది హస్తంబు నం దుదక ముంచి భిక్ష నిడి యనంతరమునఁ బునర్హస్తోదకం బొసంగు వానికిఁదద్భైక్ష్యము మేరు సమానమ్మును సాగరోపమమును నగును.

గృహస్థుఁడు దినమున కొక్కసారి భుజించునది. దినమునకు రెండు పర్యాయంబు లాహారంబుఁ గొను నెడల సారెకు ముప్పదిరెండు కుక్కుటోదర ప్రమాణకబళములు మాత్రము గొనునది. హర్ష విషాదములఁ బొరయకుండునది. జపహోమభోజనములను గురువృద్ధాద్యుపాసనాభిమానములను జన్నిదముండి తీరవలెను, వేణుమయదండంబును సోదకకమండలువును ధరించునది. ప్రణవపంచాక్షర మంత్రపూర్వకము "త్ర్యంబకం యజామహే" యను మంత్రముతో భస్మమునఁదిపుండ్రములను భక్తితో ధరించునది. అటు లాచరించు గేస్తునకు సకల శ్రుతి పఠన శ్రవణఫలంబు సిద్ధించు. భస్మధారణము శ్రుతి విహితము గావునఁ దద్వర్జనమునఁ బతితుఁడగు రుద్రాక్షధారణ మావశ్యకము. మృణ్మయాది లింగముల మదర్చన సల్పునది, యజ్ఞము వలన సర్వకిల్బిష నాశనమ్మునందున చిత్తసంశుద్ధియు నందున బ్రహ్మజిజ్ఞాసయును జనించు. మఱియు యజ్వలు పుత్రాదికాములై పుత్రాదులను స్వర్గాదికాములై స్వర్గాదులను

బొందుదురు. సత్యప్రియము లన్యోన్యరహిత మగునటుల భాషింపఁ గూడదు, ఇటుల గృహస్థాశ్రమము నిర్వహించిన పుణ్యునకు వైరాగ్య ముముక్షుత్వములు గలుగు నేని సర్వకర్మసన్యాస మొనర్చి వేదాంత శ్రవణ ప్రవణుండయి పరమహంస యగునది. వైరాగ్యసంపన్నుఁ డయ్యు ముముక్షువు గాఁడేని యథాశక్తి హంసబహూదక కుటీచకా శ్రమముల స్వీకరించునది. వైరాగ్య మొదవని యెడ గార్హస్థ్యమును బొడిగించుట గాని వానప్రస్థమునఁ బ్రవేశించుట గాని యుక్తము. 35

కం. సర్వాశ్రమావనార్థం
బుర్వి గృహస్థాశ్రమంబు యోగ్యతమం బై
సర్వాశ్రమకందమన న
ఖర్వయశోరాశి యయి జగమ్ముల వెలయున్ 36

కం. వైరాగ్యం బొదవని సం
సారులకు గృహస్థధర్మ సంగతి మేలౌ
సారవిధి గృహస్థాశ్రమ
మౌరా యది యలఁతియే సుకరాచార్యమణీ! 37

5. వానప్రస్థాశ్రమ విధి నిరూపణము

వ. ఇఁక వానప్రస్థాశ్రమం బభివర్ణింతు 38

ఆ.వె. జాయఁ గూడి గాని జాయను విడి గాని
యుత్తరాయణమున నొయ్య శుక్ల
పక్షమందు నొక్క భద్రవాసర మందు
శుభముహూర్తమందు శుభము గోరి. 39

ఆ.వె. వనికిఁ బోయి యటని వాసంబు సల్పుచు
యమము మున్ను గల్గునవి గయికొని
శుద్ధుఁ డౌచు జిత్త శుద్ధి నొప్పారుచుఁ
దపము సేయవలయు దక్షుఁ డగుచు. 40

కం. పండులఁ గూరల దుంపలఁ
దిండిగ నమరించుకొనుచు త్రిణయను నీశున్

నిండిన బత్తిం గొలుచుచు
నుండన్ వలె నతని మెచ్చుచుండ జగమ్ముల్। 41

క. ఎనిమిది కబళమ్ముల ముని
వనిఁ గబళమ్ములఁ బదారువరగృహపతి రెం
డును ముప్పది కబళమ్ములఁ
దినుటొప్పును బ్రహ్మచారిఁదిను నిచ్చమెయిన్ 42

కం. జడల ధరియించి యొదల
నొడలన్ నారల ధరించినురునఖముల నె
ప్పుడు దరుగకుండఁ దగ నా
తఁడు వానప్రస్థవృత్తిఁదా మెలఁగ వలెన్॥ 43

సీ. వాఙ్నియమాభ్యాసపరుఁడయి యాగమ
వితతి వాకుృచ్చునే వేళలందు
నగ్నిహోత్రార్చనంబాచరించును బంచ
యజ్ఞనిర్వహణమ్మునలరి చేయు
త్రిషవణస్నానమ్ము దీర్చు ముప్రొద్దులు
భూతానుకంపయిమ్ములను దాల్చుఁ
జేసాపఁ బోవఁ దిచ్చిన నెయ్యా దెవఁడేని
దినమున కొకపరితినును తిండి

తే.గీ. భక్ష్యములుగాని వెల్లను పరిహరించి
మధువు మాంసంబు విశనాదిమధురఫలర
సములఁ గ్రోలుచు రేయెల్లశర్వు శంభు
మానసమ్మున ధ్యానించిమనుచునుండు. 44

తే.గీ. క్రోధ ముడుపును గోర్కులఁగోసి విడచుఁ
బుడమి నిదురించు గాయత్రిఁగడు జపించుఁ
గృచ్ఛ చాంద్రాయణమ్మొనరించు మాస
మాసమునఁ గల్గునేః వానితో సముండు. 45

సీ. పంచాగ్నిమధ్యనివాసం బొనర్చుచు
జపియించు మండువేసవి నతండు

నింగికిఁ బ్రిందన నిల్చినవాఁడమై తప
మ్మాచరించ తఁడు వర్షాగమమునఁ
దడివల్వ ధరియించి యడరుఁ బల్విష్టహే
మంతంబునన్ సీతునకింత వెరక
పాలుఁ గ్రోలును శుక్లపక్షమ్మునను గోమ
యమ్మును గృష్ణపక్షమ్ము నఁదిను

తే॥గీ॥ శీర్ణపర్ణాశనమ్మునుఁ జేయు నొకట
కృచ్ఛ్రచాంద్రాయణమ్ము సాగించు నొకట
సొరిది యోగమ్ము నభ్యసించుచును శివుని
బశుపతిన్ ధ్యానముంజేయుఁ బ్రతిదినమ్ము 46

క. తెల్లని జందెమ్ములు గడు
నల్లని మృగచర్మ మొకట నాణెపు సాలుం
దెల్ల ముగఁ బూని నగజా
వల్లభు ధ్యానించు యోగవైభవ మెసఁగన్। 47

చ. అటువలెఁ గాక యాతఁడు హుతాశనుకిల నిజాత్మసీమఁ బ్ర
స్ఫుటగతి వేల్చి ధ్యానమునఁ జొక్కుచు భౌతికవహ్ని మాని దు
ర్ఘటమగు ద్రోవలన్ మెలఁగి రక్తి త్యజించి భజించి ముక్తి నె
చ్చట నొక గీములేక యొకసంయమియై చరియించు నుర్విపై

క. బూదిమెయి నలఁది విలస
ద్వేదాంతవచోవిహారవిస్రంభుండై
ప్రాదుర్భూత విరక్తుం
డై దురితము దవులఁ ద్రోసి యతఁడు యతి యగున్. 49

వ. అతఁడు యథాశక్తి హంస పరమహంస కుటీచక బహూదకాశ్రమంబులఁ బ్రవేశించి తుదకు ముక్తుండగు. 50

### ౯. సన్యాసాశ్రమ విధి నిరూపణము

వ. ఇది వానప్రస్థాశ్రమ క్రమంబు సంక్షేపంబుగాఁ జెప్పితిని. ఆశ్రమోత్తమంబు సన్యాసాశ్రమము నెఱుంగం జెప్పెద. 51

కుటీచక బహూదక హంస పరమహంసులని సన్యాసులు నాలుగు విధముల వారయి యుందురు. వారిలో మొదటి యిర్వురు త్రిదండమండితులు. వారిలోఁ గుటీచకులు శిఖాయజ్ఞోపవీతులును, జలకమండలు సహితులును గాషాయవస్త్రాలంకృతులును గాయత్రీ జపితలును త్రిసంధుల యందుఁ ద్రిపుండ్రాంకితులును సర్వాంగభస్మ విస్తృతులునునై స్వస్వ మార్గములయందు స్వబంధుగృహముల భిక్షాదానము గ్రహించుచుఁ బవిత్రవృత్తిఁ గాలంబు గడపుచుందురు.

బహూదకకర్మంది బంధుపుత్రాదుల వర్జించి యేకాన్నము త్యజించి సప్తగృహముల యందు భిక్షఁ గొనును. అయ్యనఘుని త్రిదండంబు గోవాలరజ్జుసంబద్ధంబును బాత్రమును గమండలువును బాదుకాచ్ఛత్రములును నతని సామగ్రి. అజిన, కౌపీన, కంథాచ్ఛాదన బహిర్వస్త్రముల ధరించును. సూచీ ఖనిత్రకృపాణమ్ములు సాధనమ్ములు గాఁగోరును. ఏకగృహభిక్షాగ్రాహి గాక యేడుగురు గేస్తులయిండ్ల కడభిక్షఁ గైకొనును. సర్వాంగ భస్మాలంకృతుండయి త్రిసంధ్యలను ద్రిపుండ్రములను ధరించును. స్ఫటికాక్షమాలికా ధారణం బొనర్చు. యోగపీఠాధి రూఢుండయి యుండు. సంధ్యాకాలమున సావిత్రిం జపియించు స్వాధ్యాయోచ్చారణము నంద వాగింద్రియ ప్రయోగము సల్పును. సర్వదా దేవతా ధ్యానార్చనాతత్పరుఁడై యుండును. ఇఁక హంసపరివ్రాట్టున కేకదండంబు శిక్యంబు భిక్షాపాత్రము కమండలువును గంథాకౌపీన బహిఃపటములును దిృపుండ్రోద్ధూళనంబును శివలింగార్చనమును సంధ్యాకృత సావిత్రీ జపమును, మౌనమును నధ్యాత్మ సేవనమును గృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతాచరణములును దత్కృత్యములు సశిఖాభవనమును గ్రామైకరాత్ర వాసమును ప్రదాచరణీయములు. పరమహంసాశ్రమికి గోవాలనిర్మిత రజ్జువు కమండలువును, ద్రిదండమును, జిక్యమును సూచీఖనిత్రాజిన కృపాణకమ్ములును శిఖాయజ్ఞోపవీతములును నిత్య కర్మములును వర్జ్యములు. చలి నుడుపుటకు బొంతయును గొపీనము నాచ్ఛాదన వస్త్రమును యోగి కట్టుకో బహిర్వస్త్రములును బాదుకా చ్ఛత్రములును త్వగ్విభూషితైక వేణుదండము నక్షమాలయుఁ దద్గ్రిహాణీయములు

అగ్నిరిత్యాది మంత్రములచే భస్మోద్ధూళనమ్మును 'ఓమోమోమో'మను జపాసహిత ప్రణవమునఁ ద్రిపుండ్రములను నాయతివరుండు ధరించును. మృత్కాంస్యదారువేణుమయ పాత్రములలో నొకటి పాణిపాత్రమును దదాశ్రమవాసి పాత్రములు.

మధుకరాన్నము మాత్రము భుజించునది. కేవల మాహారము వర్జించువానికి మిక్కుటముగ భుజించువానికిని యోగార్హత లేదు. కనుక యోగానుగుణముగఁ బరమహంసుఁడు భుజించునది. అభిశస్తునివలనఁ గాని సర్వవర్ణముల నుండిగాని భిక్షఁగొనును. వర్ణముల నుత్తరోత్తరములు భిక్ష నొసఁగ సమకూరు నెడఁదత్తదపరవర్ణములవారి భిక్షవర్జించును. గురుశుశ్రూషాపరుఁడయి యాత్మజ్ఞాన మన్వేషించును. లోభాద్యాంతర రిపువర్గముల నిర్మూలన మొనర్చును. చాతుర్మాస్యదీక్ష సకల యత్యాశ్రమములకు సమానము. మోక్షకారణమగుట హంస కుటీచక, బహూదకులకుసావిత్రియజప్యమంత్రముప్రణవవాదులు సర్వవేదములు, సకల శ్రుతులు, ప్రణవపర్యవసానములు పరమహంసుఁ డెల్లకాలమును బ్రణవజప మొనరించును. ఆరు ప్రాణాయామము లొనర్చి నూటయెన్మిది సారులు ప్రణవము జపించుట విధి, జపరహితై కొంత మునఁదద్ధ్యాననిష్ఠుఁడై మెలఁగ వలయు. సర్వలోకోత్కృష్ట వృత్తిమంతునిగా నతని నెఱుఁగవలెను. ఒకసారి యుత్తమవృత్తిఁ జరించి పిదప నీచవృత్తి ననుసరించువాఁ డారూఢపతితుఁడు. సర్వకర్మసన్యాస మొనర్చి పరమహంసాశ్రమములఁ గైకొను యతినిఁ జూచి లోకసాక్షి యైన సూర్యభగవానుఁడీ యతి నన్ను భేదించి బ్రహ్మలోకము నొందునని గడగడ వడఁకును. ఈశ్వరుని చరరూపము కర్మసన్యాసులును దదచరరూపము మృణ్మయలింగాదిక మనియును తెలియునది. ఆతేజఃపుంజమునకుఁ ద్రిలోకములయందుఁ జొరరాని వస్తువు గలుగదు. మరియు యతి దుర్వృత్తుఁడైనఁ గాని, సువృత్తుఁడైనఁగాని, మూర్ఖుఁ డయినఁ గాని, పండితుఁ డయినఁగాని వేషమాత్రముననే యెల్లరకుఁ బూజ్యుండు. యతి దర్శన స్పర్శనములు పాపకర్శనములగును. పరమహంసుఁడు మృతి నొందిన తరువాతఁదత్కళేబరము దహింపఁ గూడదు. అమ్మహామహా

శరీరమునందశుచిలేదు. దానింగూర్చి యుదకకార్యములు నెఱప నవసరము లేదు. తత్కుణపమును భూబిలవిన్యాస మొనర్చిన తావున నశ్వత్థవృక్షము స్థాపింపఁజేయవలెను. అట్లొనరించిన యధ్వర్యున కీశ్వరస్థాపనపుణ్యము గలుగును. తదశ్వత్థ దర్శన స్పర్శనముల సర్వపాతకనికర్శనమగు. శిష్టభిక్షులకు ఖననముననే యంత్యకార్యము తీర్పవలయును. 52

కం. కూరిమి గల శిష్యుండవు
ధీరుండవు గాన నీకుఁ దెల్పితిని యతి
స్వారోదంతము సాంతము
గా రూఢి నెఱుంగు దివిజగణగురువర్యా॥ 53

కం. ధీరుఁడగు శిష్యుఁ డవుదని
సౌరగుచూ నీకు నేను సంక్షేపముగా
పారివ్రాజక విషయముఁ
గారుణ్యము తోడఁ బల్కఁగా నెఱిఁగితివేః 54

కం. సన్న్యాసము శ్రుత్యంతో
పన్యాసరమావిలాసభాసుర మగుటన్
ధన్యతమాశ్రమమది సా
మాన్యులకు నలభ్య మగుసుమ గురువర్యాః 55

7. ప్రాయశ్చిత్త విధి నిరూపణము

క. చతురాశ్రమముల నుడివితిఁ
జతురాశ్రమధర్మముల నెసంగ నుడివితిన్
పతితుఁడగు వాని నెరపక
కృతప్రాయశ్చిత్తుఁడైనఁ గీడున్ దొలఁగున్. 56

క. దురితములు దొరఁగుటకు నే
కరుణన్ సంగ్రహముగా నఘధ్వాంతవిభా
కరమగుఁ బ్రాయశ్చిత్తము
సురదేశికః పల్కువాఁడ శుభమిది వినుమాః 57

క. బాపనిఁ జంపెడు వాఁడుం
బాప మనక కల్లుఁ ద్రావు వాఁ డన్యసువ
ర్ణాపహరణకర్త యు న
ధ్యాపకసతిఁ గూడు వాఁడు తత్సఖుఁడున్. 58

క. పంచమహాపాతకులని
కొంచకశాస్త్రము వచించు ఘోరగతులు ప్రా
ప్తించును వారికిఁ గనుక ప్ర
పంచక్షేమమగు నాదు పల్కుల నయ్యా! 59

ఉ. భూసురమారకుండు జనముల్ వసియింపని కాననంబులో
వాస మొనర్చి వన్యతరుపర్ణగృహంబున బ్రహ్మహత్యకున్
గాసిలుచున్ సతంబు తన గ్రాసము పల్లెల బిచ్చ మెత్తి త
ద్వాసులకున్ స్వదోషమును దాన వచింపుచు పశ్యబుద్ధియై 60

క. పదిరెండేఁడులు గడవన్
దుది శుద్ధుండగును మరియు దుంపలు గూరల్
మృదుఫలములఁ దిని శివశిర
ముఁదాల్చి యగ్గడువుఁ గడప ముక్తుఁడగున్. 61

క. అవనీసురవధము ప్రమా
దవశమ్మున సంభవింపఁ దగుఁ బ్రాయశ్చి
త్తవిధియిటు కోర్కెతో వి
ప్రవధము నొనరింపఁ దొసఁగుఁ బాయుట గలదే? 62

తే. బుద్ధిపూర్వకముగ విప్రుఁ బూని చంపు
వాఁడు గుందుచుఁ జేరువ పల్లెనుండి.
యగ్గి గ్రహించియిచి చితి పేర్చి యందును దిగి
స్వీయకాయలయక్రియఁ జేయవలయు 63

ఉ. బోనము పీడి ధర్మరిణమో జలమో యనలమ్మొ నొచ్చియో
ధేనునిమిత్తమో యవని దేవునిమిత్తమొ యంత్యమైన ప్ర
స్థానము సేసియో తనువు తాను త్యజించుట విప్రహంత కెం
తేని యవశ్యకృత్యమని యెంతురు ధర్మవిచారతత్పరుల్. 64

చ　అనలసమానవర్ణ మగు నట్టులఁ గ్రాఁగిన కల్లుగాని వె
చ్చనిదగు గోమయాంబువులు జానగు నావుల మూత్రమున్ ఘృతం
బును సలిలంబు గాని కరమున్ సహియింపఁగ రాని వానిఁ గ్ర
క్కున దిగఁద్రావి ప్రాణములఁ గోల్పడుటొప్పును మద్య
పాయికిన్ 65

ఉ.　బంగరుదొంగ తాన నరపాలుని సన్నిధి కేఁగి నేర మొ
య్యంగడు నమ్రుఁడై బలికియర్థుఁడ దండనమున్ విధింపుమం
చుం గృప పుట్ట వేడ దయఁజూచి యతండొక యిన్పరోఁకటన్
బ్రుంగెడు నట్లు గొట్ట నసువున్ విడ దోసము వాయు సం
దొగిన్. 66

క.　ఇమ్మెయి శాసించినచో
నమ్మహిపుఁడు బోరయఁడెట్టియఘమును నిజధ
ర్మమ్మును నెరవేర్చుటనే
మమ్మ గదా యేలికలకు మాన్యచరిత్రా. 67

చ.　గురుసతి మారుపోరునకు గూడిన వాఁడు విశుద్ధుఁడౌను దా
నురితరవహ్నితప్తమగు నొక్క మహాయసనిర్మితాంగనా
స్ఫురదమలాంగక మ్మనువు వోయెడి దన్కను గౌఁగిలించినన్
మరణము నొందు నంతకును మానక యంతకు దిక్కు కేఁగినన్.
68

క.　ఏ పురుషుఁడీ చతుర్విధ
పాపుల సహవాసమునను బాపుఁడగును వాఁ
డా పాప ముడుగ నొక యే
డోపికతోఁ దప్తకృచ్ఛ్ర మొనరింప వలెన్. 69

కం.　తల్లిని దల్లింబోలెడు
పుల్లాఁబుజనేత్రియొక్క పుత్రికిఁ గని రా
గిల్లిన దురితముఁ బాపం
జెల్లును దద్దీక్ష వాఁడు సేసిన యేనిన్. 70

క. మూన్నాళ్ళు వేఁడి నీళ్ళన్
మూన్నాళ్లన్ వేఁడిపాలు మూన్నాళ్ళుష్ణం
బున్నెయి గాలి మాత్రము
మూన్నాళ్ళన్ గొనుట తప్తకృచ్ఛ్ర మగున్. 71

క. సీతువ నశీతవస్తూ
పేతమ్ముగ కృచ్ఛ్రవ్రతము నెనయించినచో
ఖ్యాతమగు శీతకృచ్ఛ్రము
భూతలమున దురితమెల్లఁ బోవును దీనన్. 72

క. పలమెత్తు నేయి మరియుఁ ది
పలముల యెత్తయిన యట్టి పాలున్ నీరున్
బలముల నీరము పరిమితి 73
గలవానిన్ దప్తకృచ్ఛ్రకలనఁ గొనవలెన్.

తే.గీ. తల్లి చెల్లెలి యెడఁ గామతంత్రుఁడైన
వాఁడు కృచ్ఛ్రాతికృచ్ఛ్రమన్ వ్రతము రెండు
సారులం జేయవలెను దక్ క్షాంతి యెన్నఁ
డావవ దన్యవ్రతమ్ము నొకట నైన. 74

వ. కృచ్ఛ్రాతికృచ్ఛ్రమన నిరువది యొక్క దినము కేవలపయోభోజనుఁడై యుపవసించుట యగు. 75

తే.గీ. సోదరిం గాని సుతఁగాని పొక్కఁ గవయు
దారుణాఘం బుడుగును సాంతపనకృచ్ఛ్ర
దీక్ష సలుపఁగ నద్దాని తెఱఁ గొకింత
తెలియవలె నీవు దైవతదేశికేంద్ర! 76

వ గోమూత్ర, గోమయ, గోక్షీర, గోదధి గోఘృతంబులను కుశోదకమ్మును బగలునాహరించి, యొకరేయి యుపవసించిన యావ్రతము సాంతపనకృచ్ఛ్రమ్మని బుధు లందురు. 77

సీ. భ్రాతృభార్యం బొందుపాపంబు వోఁజతు
శ్చాంద్రాయణమ్ములన్ సలుప వలయుఁ
దండ్రిసోదరి యన్యతనయఁ గామించిన
నొక్క చాంద్రాయణమ్మొనరుపవలె
తల్లి సోదరుఁ గూఁతుఁదవిలిన నొక్కచాం
ద్రాయణవ్రత మొనర్పంగవలయుఁ
దక్కఁ బాపనబొంట్లనుక్కివుఁడై గూడి
యేకకృచ్ఛ్రం బాచరింపవలయు.

తే. గీ. నగ్రిజుండయ్యు క్షత్రవైశ్యాంత్రిజకుల
కుటిలకుంతలలం దమిఁగూటమిఁ గను
నఘము వాయును గృచ్ఛ్రచాంద్రాయణమ్మొ
కండు సలిపిన బృందారక గురువర్య! 78

తె గీ. వనితఁ గామించి పతితుఁడౌ బ్రహ్మచారి
గర్ధభాజనధారియై కడుపు కొఱకు
బిచ్చమెత్తుచుఁ దనపాపవిధముఁ జెప్పి
కొనుచు నొకయేడు త్రిషవణమును నొనర్చి. 79

తె గీ ఎట్టి కోర్కెల మదిలోన బుట్ట నీక
నారు నెలలను గడుపఁగానవల నతఁడు
వద్దురితమః నడంచుటకలవి యగును
తెలియు మియ్యెడ వాచస్పతీ! వశీంద్ర! 80

వ. మరియు నగ్నికార్య పరిత్యాగము రేతోత్స్వర్గమ్మును సంభవించిన గృహమేధి స్నాన మొనరించి సప్రణవవ్యాహృతికముగాను సశిరముగాను దశసహస్ర గాయత్రి జపింపవలెను. ఇంద్రియోత్సర్గ మొందిన యదియును స్నానశుద్ధుండయి సమాహిత చిత్తుండయి పరమాత్మ స్వరూప మైన ప్రణవమును నయిదు పర్యాయములు జపింపవలెను. బిక్షువు విప్రవనితా గమనదోష దూషితుం

డయి యవకీర్ణ వ్రతమ్మును నృత్యస్త్రీరత పతితుండయి కృచ్ఛ్ర
వ్రతమ్మును దీర్చునది. శూద్ర వైశ్య క్షత్రియ హంతయైన
భూసురుం డర్ధమాస త్రిమాసషణ్మాస పరిమితిఁ గల బ్రహ్మ
హత్యావ్రత మాచరించి శుద్ధుండగును. విహితకారణ ప్రతిషిద్ధ
సేవనము వలనను వేదవిప్లావన గురుద్రోహముల వలనను దది
తరసకలపాపముల వలనను దూష్యుండగు మనుష్యుండు విశుద్ధి
ప్రాప్తికయి తప్తకృచ్ఛ్రం బాచరింపవలె. ఇయ్యది వివిధ పాపం
బుల నుండి ముక్తుం డగుటకు వివిధప్రాయశ్చిత్త విధానంబు
సర్వపాపనాశకరమగు నొక్క యుపాయముఁ జెప్పెద నాలకిం
పుము శ్రద్ధాపినయ సంపన్నుండయి శమాదిషట్కసంపాది యయి
యుపనిషద్వాక్య జ్ఞానను సంపూర్ణముగాఁ దెలియునంతవఱకు
నుపనిషచ్ఛాస్త్రార్థచర్చలు జరుగు తావున కేఁగి యచటి సంభా
షణముల వినిన యెడల సర్వపంకముక్తుఁడగును. జ్ఞానము
పరమపవిత్రం బగుట సర్వకిల్బిషవినాశకర మగుటకు సంది
యము లేదు. అక్షీణపాపాటవీదహన దక్షోపాయముల జ్ఞానము
కన్న నెక్కు డగునది వేఱొండు లేదు. 81

శా. వేదాంతశ్రవణమ్ము మాస మొగిఁగాళ్వింపన్ నశించున్ జుమీ
క్షోదీయాఘము లాఱు మాసములకున్ శ్రుత్యంతముల్ విన్న వి
చ్ఛేదం బొందును బాతకంబులు గడున్ క్షీణించు నొక్కేడు ని
ష్ఠేదబ్రహ్మ విచారముల్సతము భాసిల్లన్ మహాపాపముల్। 82

క. ఏ వాఁ డనిశమ్మును శ్ర
ద్ధావంతుం డగుచు శ్రుతిశిఖాంతములన్।
భావించు నాజవంజవ
మావానికిఁ దొలఁగు నందు నమరాచార్యా॥ 83

మ. నిగమాంతంబుల నభ్యసించు నెడనేదే విఘ్నముల్గల భో
గ్యగరిష్ఠస్తవనీయకీర్తిఁ దగు నాయాలోకముల్ గొన్ని నా

ష్య గరమ్మున్ భజియించియాపిదప భూలోకమ్మనన్ విప్రవం
శగుఁడై సత్యపరాయణుండయి మహాశాంతుండునై యొప్పెడున్। 84

ఉ. అతఁడు సర్వలక్షణసమన్వితుఁడై యతిమాతృమార్గవో
పేతుఁడునై మెలంగుచు నహీనమనీష లసద్వివేకవి
ఖ్యాతుని నొక్క దేశికుని గాంచి తదంఘ్రుల మ్రొక్కి తత్ప్రసా
దాతిశయమ్ము చేత నపరోక్షవిభూతి ముదంబుఁ జెందెడున్॥ 85

తె. దుర్భరంబైన సంసారదురిత ముడుపు
నుపనిషద్విద్య గీప్పతీ! యుల్ల మలర
నభ్యసింపుము తక్కు కార్యములు వేయు
నైన త్యజియింపు మిదియ నాకభిమతమ్ము. 86

## 8. దాన ధర్మఫల కథనము

వ. మరియుఁ బాలితార్యుఁడు సురాచార్యుల కిట్లనియె. 87

కం. ప్రాయశ్చిత్తానేకో
పాయములఁ బునీతుఁడైన-వాఁడు వితరణ
శ్రీయుతుఁడయి విపిధాంచిత
దేయమ్ముల దాన మొసఁగి ద్రెంపు భవలతల్॥ 88

తె. జీవులకు ముక్తి హేతువై చెలఁగుఁ గాన
విద్యకును సాటి లేదెందు వెదకి చూడఁ
దానఁ దద్దాన మవనిపై దానములను
నుత్తమంబని కొనియాడు చుందురి విన మె. 89

తె. పాపములఁ ద్రోలి సంస్కృతి మేపు నుడిపి
శ్రద్ధ వినయమ్ము భక్తి యున్ జాల గల్గి
చేరు శిష్యున కాగమసిద్ధమైన
యెఱుకఁ గఱపెడు గురువునకె సఁగు ముక్తి. 90

తే. శక్తికిఁ గొదువ గాకుండ సంతతమ్ము
మతము నన్నం బొసంగిన మహితునకును
తొలఁగు సంసారబంధంబు కలుగ దెపుడు
పుట్టు వన్నది కర్మిమ్మ రపూత చరిత 81

వ. మరియు ననసూయాదిదోషరహితుఁ డైన యవనీసురున కమృ తాంశమౌళి ప్రీతికయి యమావాస్య నన్నంబిడు నలఘున కది యక్షయఫలదమ్మై యొప్పు నతఁడందు వలన నంత కాంత కతుల్యుం డగు. అంతకుం దొలినాఁడు శ్రద్ధాసమన్వితుండయి యగ్రజన్ము నద్విజాపతిగా నారాధించి యన్నమిడిన నది ముక్తిహేతు వగును. అసితపక్షత్రయోదశినాఁ డమలాంబువులఁదోగి యజు నిజరూపముగా నచలాసురవర్యున కతిభక్తి యుక్తుండై యన్న మిడి యర్పించిన నద్దాన నంబుజాసన లోకనివాసియయి యజ్ఞ జుతోఁ గ్రమముక్తి నొందు. అద్దివసమునకుం బూర్వదివసం బున నమలజలావగాహియయి యంబుజోదరు నాత్మ నరసి యతి మాత్రభక్తి సక్తాంతరంగుఁడయి యవనీదేవున కన్నంబిడిన నఖిలాఘవినిర్ముక్తుండయి యంబుజాక్షు నక్షీణలోకంబు లందును అన్యతరై కాదశి నాఁడా హరింప కా మరునాఁ డచ్యుతార్చనముగా నగ్రికులున కన్నంబిడిన నక్కాతమున నారునొక్క పుట్టువుల యఘములత్యంత దూరంబులై యరుగు నంతకుఁ దొలినాఁ డమరస్వామి నుద్దేశించి యన్నముఁగాని తండులములఁ గాని విప్రులకు దానమొసఁగిన నమరాధిపాధి పత్యముఁ జేకురు నం తకునుద్దేశించి నవమినాఁడు బ్రాహ్మణుల కన్నంబుఁ బెట్టిన యముఁడు ప్రసన్నుండగు. అష్టమి నాఁడు పరమశివు నుద్దేశించి బ్రాహ్మణుల కన్నమిడిన నఖిల దురితములఁ బాసి శివసాయుజ్య ముఁ గాంచును. అంబుజారి నుద్దేశించి సప్తమినాఁడు పారున కన్నవితరణ మొసఁగినఁ జంద్రలోకప్రాప్తి యగును. ఆదిత్యు నుద్దేశించి షష్టినాఁడు జన్నికట్టున కన్నమీయ సూర్యలోకంబుల సుఖించు నవనీధరాత్మజ నుద్దేశించి పంచమిని బాపని కన్నం

బిచ్చిన సకలపాపముక్తుఁడయి జ్ఞానసంపన్నుఁడగు సంబుధికన్యా
మణి నుద్దేశించి చవితినాఁడు బాడబున కన్నము సమర్పించిన
లేమి వీడి లక్ష్మీనిలయుండగు. ఆదరమ్మునఁ దదియనాఁడు
భూసురునకన్నంబు నివేదింప హరిహరసరసిజాసనులు వశులగు
దురు. అజముఖసంభవులకు విదియనాఁడన్న మర్పించిన జిహ్వా
గ్రమున నిగమములు నిత్యనృత్యము సలుపును. ఆదితిధిని పర
బ్రహ్మార్పణముగా వసుంధరాసురున కన్నమిడినఁ గేవల బ్రహ్మ
యగును. 92

క. వెల్లా వొక్కటి భూసుర
తల్లజునకు దానమీయ వళితాఘుండై
యుల్లమునన్ బ్రమదము సం
ధిల్లన్ బ్రహ్మంబుఁ గాంచి నెగడున్ జగతిన్॥ 93

క. సాలంకృత కన్యాదా
నాలంకృతు విప్రుఁజేయ నఘములు దొలఁగున్
నీలగ్రీవావాసం
బేలున్ శివు పజ్జ మెలఁగు నెల్లరు మెచ్చన్॥ 94

క. ఏ యే తనువులఁ గోరిన
నా యా పుట్టువులు గల్గు నాత్మజ్ఞాన
శ్రేయోఽధికుఁ బూజించిన
వేయున్ జ్ఞానమున కెనయె వేలుపుటొజ్జా. 95

సీ. క్రిమికీటఖేటగణము కంటెఁ బశువులు
వాని కంటెను నరుల్ వారి కంటె
బాపనయ్యలును నవ్వారి కంటెను బండి
తుల్ వారికంటెను దొడ్డబుద్ధి
నలరువారలువారి కంటెఁ గర్మఠులును
వారికంటెను బరివ్రాజకులును

సన్న్యాసులున్ గుటీచకులు వారల కంటె
నలఘుబహూదకాఖ్యులును వారి

తే. గీ. కంటె హంసలు నవ్వారికంటె పరమ
హంసు లవ్వారి కంటెసునాత్మవేత్త
లరయ మిన్నలు జ్ఞానులకధికుల నెట
నరయఁగా లేము సర్వలోకాళి నరసి. 96

సీ. బ్రహ్మ నారాధింపవలె బ్రహ్మవర్చోఽభి
లాషుఁడై యారోగ్యలక్ష్మిఁ గోరి
భాస్కరారాధనపరుఁడు గావలె బల
కాముం డనిలసేవఁగడఁగ వలయు
కీర్తి వాంఛించి యగ్నిం గొల్వఁ గావలెన్
జ్ఞానలాభేచ్ఛుమైశంభుపూజ
లొనరింపవలె మేధనొందంగఁ గాంక్షించి
వాగ్దేవి కంజలింబట్టవలయు.

తే.గీ. సిద్ధి నెదనిడి వెనకయ్యఁజేతులెత్తి
మ్రొక్కవలె మోక్షకామమ్ము మొలకలెత్త
గిరిశుఁ బ్రణమిల్లవలెను భోగరుచు లెసఁగ
శీతకరునకు బల్నతుల్ సేయ వలయు. 97

తే. పుష్టిఁ గోరి పురందరుపూజనం బొ
నర్పవలెను విరక్తినింగూర్ప నెంచి
యాత్మ నాత్మేతర మెఱుఁగునట్టి విబుధ
సాధుచరణాబ్జముల సేవ సలుప వలయు. 98

క. వ్రతముల శ్రద్ధాభక్తుల
నతిశుచియై యాచరింపనఘసంఘంబుల్
ద్రుతగతి రూపరు ననుచున్
శ్రుతివితతు ల్సమ్మతించుసురగురుముఖ్యా. 99

క. జ్యోతిష్టోమాదికవి
ఖ్యాతాధ్వరసంచయమ్ము శ్రీనాగమనిధియై
జేతోముదమున సల్పిన
జాతామరమూర్తి యగుచు సౌఖ్యముఁ గాంచున్. 100

ఉ. చిచ్చును బెట్టు పాపము రుచించిగని కల్లును ద్రావు పంకమున్
క్రచ్చరఁ బారఁజంపిన యఘమ్ము నకార్యమొనర్చు టోసమున్
బుచ్చగవచ్చుఁ బాపచయమోచకమౌ శతరుద్రియం బొగిన్
మెచ్చి పఠింప నంచు శ్రుతి నిక్కముగా వచియించు గిప్పతీ! 101

క. నమకముఁ జమకము జపియిం
చుమహాత్మున కఘము లెల్ల నున్నలగుఁజుమీ
యమరాచార్యా! తన్మం
త్రములఁ బఠింపంగ నొప్పు ధర విప్రులకున్. 102

క. శివసంకల్పమ్మైనన్
సువిహితమగు నట్టి పురుష సూక్తంబైనన్
శివపంచాక్షరినైనన్
శివలోకావాప్తి కెదనుఁ జింతింప వలెన్. 103

క. అయ్యా! యటు లొనరించిన
ముయ్యేడు తరాల వారిఁ బ్రోచిన వాఁడ
క్షయ్యసుఖమ్ము లనేకము
లొయ్యన్ శివలోక మందు పొందున్ జుమ్మీ. 104

క. ఘనకర్మఫలము దరిగినఁ
జనియించును భూమి పైని సత్కర్మంబున్
బొనరించుచు దుష్కర్మము
నొనరించుచుఁ బుట్టు చావు పొందుచు నుండున్ 105

క. జ్ఞానోదయపర్యంతము
జానని సంసారచక్ర పరిణిం బడి సు

జ్ఞానము గలిగిన పిమ్మట
మానున్ సంసారవిభ్రమణదుఃఖంబుల్. 106

క. అసుఖాత్మక విషయమ్ముల
ను సుఖమ్మారోపణమ్మునుం జేసి క్రియా
వసరమునఁ దవిలి తత్ఫల
ము సతతము భుజించుఁ దత్త్వమూఢుండౌరా. 107

ఉ. ఏమి వచింపవాఁడ జగమెల్ల నఖండచిదాత్మమోదసో
ధామలపూర్ణముం గొనక యల్పఫలాత్మక కర్మజాతకా
యామయమైన సంసృతి రతింతయు రోయక సంతతమ్ము మా
యామయలోకవాసన నందుదు రేలొకొ చిత్రమయ్యెడున్. 108

ఉ. కావున సద్వివేకమును గల్గి కడుంగడు నీరసస్వరూ
పావిలతుచ్ఛసౌఖ్యములకాసలఁ గూర్పక యచ్ఛనిత్యమో
దావహమైన బ్రహ్మపదమాత్మ నెఱింగి తదేకనిష్ఠయై
యే విధినైనఁ గోవిదుఁడు హీనగతిం జరియించు టొప్పగున్. 109

క. ఏ నిటు సౌహార్దంబును
బూని వచించితిని దేవబుధతల్లజ నీ
వానందాత్మునిఁ గొల్వుము
జ్ఞానాధ్వం బనుసరించి సరగ సతమ్మున్. 110

## 9. పాపకర్మఫల నిరూపణము

క. ధర్మం బానతి నిడె నప
వర్గమ్మును గొనఁగ జ్ఞానపథమున్ మరియున్
స్వర్గాదులఁ బొందఁగ విధి
వర్గము సాధనము లనుచుఁ బదపడి దొలుతన్. 111

క. ఆరయ విధిశాస్త్రమ్ముల
నేరిచి శ్రద్ధయును భక్తి నిండారంగా
సారెకుఁ జేసిన వైనను
జేరెడు సద్గతికి దాసిసిద్ధమొనర్పన్. 112

క. సేవించుకొఱకు ధర్మము
సేవింపక మాను కొఱకు శేషాధర్మం
బీవెరవుల వేదము వే
శేవెరుగఁ బల్కుఁ దెలియ రెండు విధములన్. 113

క. కావునఁ బాపాచరణం
బేవిధి నైనన్ ద్యజింపనెఱుఁగుటకొఱకై
యే వివరించెద విను నా
నా విధదురితౌఘజాత నానాఫలముల్. 114

సీ. అవనీసురుం జంపనందు ఖరోష్ట్రి సూ
కర మేష కావిక కరితురంగ
మృగపక్షిచండాల నృశరీరములఁ గ్రిమం
బుగఁ గల్గుఁ గొను బాడబునకు నగును
క్రిమికీటకపతంగ కేవలవిడ్భుగం
డజదస్యుగర్భ వాసములు పెక్కు
గురుతల్పగుం డొందుఁ గ్రూరకర్మాసక్త
శార్వరక్రవ్యాద జన్మములను

తే గీ. జననమందును రక్షఃపిశాచయోను
లందుఁ జోరుండు విప్రధనావనీహ
రుండగును బ్రహ్మరక్షోనిరూఢిజన్మ
శతసహస్రము దివిషదాచార్యవర్య! 115

సీ. కొలుచు దొంగిలి యెత్తునెలుకపుట్టువు నీరు
హరియించి బలుకప్పయగును కంచు
తెక్కలి యంచయౌఁ గుక్కయౌ రసహర్త
నిజము ముంగిస యౌను నేతిదొంగ
పాలు ముచ్చిలి కాకిభవమొందు మాంసమ్ము
లపహరణ మొనర్చియగును గ్రద్ద

ఉప్పునుం గికురించిన తప్పక జక్కువ
యగు తైలతస్కరుండు గను గొంగ

తే.గి. పట్టు పుట్టంబు చేవాఁడు బట్టి పుట్టు
తీతువయి వల్వఁ గొంపోయి తెచ్చు కొనును
భేకజన్మంబు నట్టువు పిట్టయ యగు
నాకుకూరల నెత్తి నరాధముండు. 116

ఆ.వె. అన్న మపహరించి యగు కుక్క, పూవుల
నపహరించి కోతి యగును యాన
మపహరించి పోవ నగు లొట్టిపిట్టయు
నేనుఁగగును పశువు నెత్తికొనిన. 117

వ. మరియు దురితములం దొరయు ఫల మింత మాత్రింప రాదు. పాపదూషితులకు ఘోరనరకావాసముఁ దప్పదు. సంకెల కేల బంధించి జ్వాలాయుతాభీలాగ్ని విపరిహంత ద్రోయంబడి యా చంద్రతారార్కము గాసిల్లి జీవహింసాపరుని యమదూత లెఱ్ఱగాఁ గాల్చిన యినుపకోల లనేకకల్పంబులవఱకుఁ గొట్టి బాధింతురు. నూనెదొంగం బట్టి కాలుసేతులు బంధించి సలసల మరిగెడి నూనెగాబులలో యమకింకరులు ద్రోసి మూఁతనిడి యందుంతురు. పరుల యందు దొసఁగులు లేకున్నను దొసఁగు నారోపించు నధము నాలుకఁ గోసి నిప్పువలెఁ గ్రాఁగిన రాగి గంగాళములలో మాటిమాటికి యమభటులు ద్రోయుదురు. కల్లు ద్రావిన కటారం బట్టి యినుపదుడ్డులతోఁ గొట్టుచు వైవస్వతదూతలు త్రాగుత్రాగు మని కరిగిన రాగి నోటఁ బోయుదురు. ఒజ్జచెలువ సెజ్జఁ జేరిన వానిఁ గోసికోసి కాల్చికాల్చి పొడిచేసి పొడిచేసి చీము నింపిన బానలలోఁ బ్రేతపతికింకరులు ద్రోసియుంతురు.

అమ్మ నయ్య నన్న యగారి నాత్మవేత్త నచ్యుతు నాదిదేవు నాగ మఘు నవనిసురు నాదిత్యు నమృతకరు నగ్ని ననలు నిందించిన మందబుద్ధుల కమందతాపసందోహోపేత నరకాల యావాసమ్మ

కల్పశతములవఱకుఁ దప్పదు. చతుర్థాశ్రమవాసుల కన్న పానంబు లిడకయు, తద్వస్త్రోదకదాన మిడకయు మిడుకు దుష్టుప నినపకోలల గానుగం బెట్టి చెఱుకు గడవలె మృత్యుసేవకులు పిండుదురు. అర్థాపహారి నడుఁగుల నఖల నాననంబున నిరు ప్రక్కలను నాభిని గాలిన మేకులునాటి యంతకు పరిచారకులు బాధింతురు. పరనారీపరిగ్రహాఁడయోనిర్మితఘర్ఘరీ భూతసుత ప్తాంగనాగాఢాలింగన దండము నొందును. పెఱచవుల మరుఁగు తరుణి తప్తాయఃపురుషపరిష్వంగమునకుఁ బట్టిత్రోయంబడుదురు. విధినిషేధత్యాగాచరణమ్ము లచిరకాలము నరుండు రునరకనివాసి యగు మరియు నరవరులమను గరువమ్మును దేవళములకుఁదోఁ టలకు నీటిబావులకు గీములకు నుపద్రవంబు లాపాదించు వారును, ద్యూతమైథునాదికీడలఁ బుణ్యస్థలంబుల సలుపువారును గానుగకోలల నడుమ నుంచి పీడింపఁ బడుదురు. వేదమార్గసక్తు లయు, గురువులయు నింద వినువారి చెవుల తప్తతామ్రద్రవం బున నింపి యావదిందునక్షత్రముగ బాధింతురు. నరకములు బలుతెఱంగులై యుండును. 1. ఘోరమును 2. సుఘోరమును 3. నతిఘోరమును 4. మహాఘోరమును 5. కరాళమును 6. వికరాళము 7. కాళరాత్రియు 8. చండము 9. మహా చండము 10. చండకోలాహలము 11. ప్రచండకోలాహలము 12. పద్మము 13. పద్మకోణము 14. భయానకము 15. పద్మా వలి 16. భీమము 17. భీషణము 18 వజ్రము 19. వర్తు లము 20. గుప్తక్షేమము 21. నష్టక్షేమము 22. దీప్తము 23. రౌరవము వానిలో ముఖ్యమైనవి. వాని యందు పాపులు హాహాకారములతోఁ డపించుచుందురు. పాపకర్మఫలోదయ మెంతటి యిక్కట్టుల పాలుసేయును. 118

క. వాపఫల మిట్టిదని నరుఁ
డేపగిదినినైన జ్ఞానకమిరవొందంగాఁ

జేపట్టు ముక్తిఁ గనుటకు
నోపుం గావునను జ్ఞానమొయ్యం గనుమా. 119

ఉ. జ్ఞానమహత్వ మిట్టిది వెసన్గ్రహియింపక యేల కర్మసం
తాన నిమగ్నులై వివిధదారుణము ల్బొనరించి నారక
స్థానము నందు యాతనలస్వప్నమునందు బలెన్దపింతురెం
తేని నరాధముల్ దవులరేబలుమాయను రేబవళ్ళలో. 120

కం. గురుఁ డెరుకఁ బరచు జ్ఞానము
పరొక్షమయినన్ దహించిభస్మమొనర్చున్
ధర బుద్ధిపూర్వముగనా
చరించు దురితములనెల్లసరగున నొకటన్. 121

కం. అపరోక్షజ్ఞానము గురుఁ
డుపదేశింపన్ భవోదయోగగ్రిధ్వాంత
మ్మపహరణ మ్మొనరింపఁగ
తపనోదయమనఁగ జ్ఞానధామము వెలయున్. 122

కం. జ్ఞానము గలుఁగని యంతకు
తానొనరుచు కర్మమునకుఁదగిన తనువునన్
బూనుచుఁ జచ్చుచు నరకము
లోనం బడుమన్ నరుండులోకము లందున్॥ 123

10. పిండోత్పత్తి కథనము

వ. మరియు హరుఁడు సురగురున కిట్లనియె 124

క. అధికారుల నుత్తములగు
నధికారుల కెల్ల నాగమాంతశ్రవణం
బధిముఖ్యంబు నద్వైరాదుల
విధియింతురు కృత్యమనుచువిద్వద్గణముల్. 125

క. వైరాగ్య మింత యొదవని
పూరుషునకు జ్ఞాన మెట్లుబుట్టఁగ నేర్చున్

వైరాగ్య మ్మజ్ఞానికిఁ
గారాబయి తల్లియండుఁ బ్రగడ తత్వజ్ఞుల్. 126

క. కానన్ బిండోత్పత్తివి
ధానము వివరించువాఁడ నతచ్ఛ్రవణమునన్
జానుగ వైరాగ్యోదయ
మౌనని మదినెంచి తెలియు మమరగురువరా! 127

తే. పుణ్యకర్మమ్ములను వేల్పు పుట్టు వొదవుఁ
బాపకర్మంబులను గల్గు భవము స్థావ
రమ్ములను బుణ్యపాపమిశ్రములఁ గల్గు
మానుషంబుగ జన్మంబు మఱియు మఱియు. 128

క యజమానుఁడు ప్రోజ్వలద
గ్నిఁ జక్కగను వ్రేల్చు ద్రవ్య నిచయముచే న
క్కజమగు తేజం గాంచుచుఁ
బ్రజదన్నం గొల్వ వెలయు భానుఁడు నింగిన్. 1 9

క. ఇనువలనఁ బుట్టు మబ్బులు
ఘనముల వలనన్ సువృష్టి గలుగుం దానన్
జనియించు నౌషధీచయ
మునందునఁ జనించు నన్న మున్ గ్రమమొప్పన్. 130

వ. మనుజులు నిత్య మాహరించు పదార్థములు కిట్టములును, సార ములునను రెండుతెఱఁగులు నందు సారములు స్థూలసూక్ష్మము లన రెండు విధములు కిట్టమైన తేజోఽబన్నము లస్థిమూత్ర పురీషరూపమునఁ బరిణమించును. సారమును స్థూలమునైన యవ్వానివలన మజ్జాలోహిత మాంసంబులు గల్గును. సారము సూక్ష్మమునైన తేజోఽబన్నముల వలన వాక్ప్రాణమనస్సులు నుద్భవించు. మరియు సారములలో స్థూలపంచాంశకముల వలన సర్వధాతువులు వృద్ధినొందు. వానిలో నాకాశాంశయవకాశ దాన ములను అనిలాంశము వ్యూహనమును ననుగ్రహించి సర్వధాతు

వృద్ధికరంబు లగును. అనలాంశము వలన మజ్జావృద్ధి యగు. అబంశము వలన రక్తవృద్ధియగు. అవన్యంశము వలన మాంస వృద్ధి యగు. సారములలో సూక్ష్మములు సత్వగుణప్రధాన ములు. రజోగుణ ప్రధానములు నని రెండు తెఱంగులు. వానిలో సత్వప్రధాన పంచాంశకములలో భూతతత్వము వలన ఘ్రాణేంద్రియ పాయ్వింద్రియములు వృద్ధియు, జలతత్వము వలన జిహ్వోపస్థల వృద్ధియు. నగ్నితత్వము వలన వాఙ్నేత్ర ములవృద్ధియు, వాయుతత్వము వలనఁ జర్మహస్తవృద్ధియు, నాకాశతత్వము వలనఁ బావశ్రోత్రవృద్ధియు, సర్వాంశము వలన మనఃప్రాణవృద్ధియు నగును. మరియు అన్నమయం హంసోయ్యమనః అనియు ఆపోమయః ప్రాణమనియు శ్రుతులు వచించుటకుఁ గ్రమముగా పృధివీజుల తత్వములు మనఃప్రాణ హేతువులలో శేషించిన భూతములకంటె బహుళముగా నుండు టం బట్టి లక్షణ నాశ్రయించుటయే యని యెఱుంగునది. రజో గుణము నుండి రక్తమును, రక్తము నుంచి మాంసమును, మాంసము నుండి మేధస్సును. మేధస్సు నుండి స్నాయువును. స్నాయువు నుండి నెమ్మును, నెమ్మ నుండి మజ్జయును, మజ్జ నుండి శుక్రమును గలుగును. శుక్రశోణిత సంయోగము వలన సంతతి కలుఁగు. ఋతుకాలమందు శోణితముతో నిర్దోషమైన శుక్రము సంయోగమునొందిన సంఘాతమునకు ఁగలల మని పేరు తత్ప్రధమరాత్రి మొద లేడు రాత్రుల వరకును గలలా వస్థయే యుండును. సప్తరాత్రానంతర మయ్యది బుద్బుదమగు. పక్షాంతరమునఁ బిండ మగును. మాసాంతరమున ద్రవావస్థ మాని కఠినమగును. రెండు మాసముల పిమ్మట ఁదలయు మూఁడు నెలలకు నడుగులును వేరువడును. నాల్గవ మాసమున వ్రేళ్ళును, గడుపును దుంటులును నిర్మాణమగును. మీది నెలలో వెన్నెముకయు దరువాతి నెలలో ముక్కు నెవులును గండ్లును నుద్భవించును. ఏడవ నెల జీవుఁ డందుఁ బ్రవేశించు.

ఎనిమిదవ నెల విగ్రహసంపూర్ణ మగును. తొమ్మిదవ నెల రౌరవనరకమున నెట్లు బాధలొంద నగునో యట్టి బాధలన నుభవించుచు గర్భస్థశిశువు పూర్వజన్మకృతాకృతము లిట్టి బాధలకు హేతువు లయ్యెం గదా యని శోకించుచు నిట్లు విలపించుచుండును. 131

ఉ. ఎత్తితి నెన్నొ పుట్టువుల నెందఱొ తల్లుల చన్నుఁ ద్రావితిన్
గుత్తుక నిండఁ గొంటిఁ బలుకూళ్ళను నెన్నిటినో యెఱుంగఁగా
నెత్తు సుఖమ్ము గాంచని కనేగతి దుఃఖమహాబ్ధి దాఁటి యే
నెత్తని త్రోవఁ బోవుదు మదీయభరమ్మును మాన్ప రెవ్వరున్
132

ఉ. నాకు నుపాయ మియ్యెడ మనంబునఁ దోఁపదు సుంతయేని సౌ
ఖ్యాకరమైన తావును రయంబునఁ జేరుట కయ్యె దైవమా
ప్రాకటగర్భయాతనలఁ బాసి బయల్పడు భాగ్యమెన్నఁడేన్
నా కొనఁగూడె నేని భవనాశముకై జతనమ్ము సల్పెదన్. 133

చ. గురువుల పాదసన్నిధినిఁ గోరక తాఁ జతురాగమంబులన్
సరసవిశాలభాష్యములసాంగముగాఁ బఠనం బొనర్తు నె
త్తరి వినయంబు పీద గురుతల్లజు నొద్ద మెలంగు పట్ల నె
ల్లరు నను గాంచి మెచ్చునటులన్ జరియించెదఁ దప్పకెప్పుడున్.
134

తే. నిత్యనైమిత్తికమ్ముల నిరత మేను
శ్రద్ధయె నాచరించెద జన్మములను
సాదరంబుగ సల్పి నేనఘము లెల్లఁ
బాపుకొని చిత్తశాంతినిఁ బడయువాఁడ. 135

క. సంసారసుఖములను వి
ద్వాంసుండంగికరింప దగునే యతివి
ధ్వంసనశీలము లందు రి
రంసను నేఁ గూర్తు సెనిర క్తిం గనెదన్. 136

క. వైరాగ్యము నా కొదవిన
కారణమున నగును మోక్షకామ మ్మటుపై
నేర మదిఁ గర్మ మొనరుప
నేరుతు నింద్రియజయమ్ము నిరత మటుపయిన్. 137

క. విరజానల భస్మము శుభ
తరాగ్నిహోత్రిజ పవిత్రతమభస్మమ్మో
శిరము మొదలు చరణము వఱ
కు రహిన్ మెయిఁ బూయు వాఁడ కోర్కులు నిండన్. 138

క. సారాధర్వణమంత్రము
లాఱింటిని బూది మేన నలఁదెడి పట్లన్
నోరారఁగఁ బఠియింతున్
సూరివరుల్ నన్ను మెచ్చి చొక్కుచు నుండన్. 139

క. ఎన్నటికిన్ సంసారపుఁ
దెన్నెల్లను శాస్త్రదృష్టిఁ దెలిసి పరబ్ర
హ్మోన్నతపదవిం గాంతును
నన్నే నెఱిఁగికొంట నాకు శుభంబౌ. 140

క. అని పలుమరు తలపోయుచు
జననీగర్భమున నుండి నైపక పుడమిన్
జననంబుఁ గాంచి హరిమా
యను దొల్లిటి తెల్వి వాసి యా శిశు వలరున్. 141

క. భాసిల్లిన వైరాగ్యముఁ
బాసి యథాపూర్వవృత్తి వఱలుచు నజ్ఞా
నాసివిదారితసుజ్ఞా
నాసక్తుం డగుచు ముదము నందుం దానన్. 142

క. రాగాదులఁ బెంపొందిన
భోగాదుల ననుభవించు బుద్ధియును గ్రియా

ప్రాగాచరణమనీషయు
వేగాంచి యనేకజన్మపీడకు గుఱియౌ. 143

క. చావును బుట్టువు నెట్టుల
కేవిధి నైనను నవిద్యనెఱుకన్ బల్మిన్
బోవన్ దోలంజాలున్
బ్రోవున్ సంసృతి నకర్మములు సంతతమున్. 144

తె. కలుషుడుం గర్తయుం భోక్తగాడు జీవు
డరయుమా తత్స్వభావంబు నమలు డనుచు
కర్త యనుచు నభోక్తయు గాదలంపు
కాకయుండిన మోక్షంబు కలుగ దెపుడు. 145

ఉ. జీవుడు నిర్మలుండును నశేషతనుప్రకటోజ్జ్వలుండునున్
గేవలుడున్ సనాతనుడు నిత్యుడు శాంతుడు సూక్ష్మసూక్ష్ముడున్
దేవుడు సర్వసాక్షియును దెల్వి యనంతముదంబు నొచు సం
భావితు డౌనుకాడనృతభావుడు నజ్ఞుడు దుఃఖరూపుడున్. 146

ఉ. జీవుడు బద్మసంభవుడు జిష్ణుడు విష్ణుడు నగ్ని వాయువున్
జీవనదీతరంగచయచిత్రవిచిత్రవిలాసకోటినా
వ్యావృతశస్తమస్తకుడు వ్యాపృతసర్వు డశేషవిస్ఫుర
ద్దేవనికాయుడున్ బరు డెదం దలపోయుమ పండితోత్తమా. 147

క. అటుగా దనుచుం గొందఱు
కుటిలమతులు బల్కుచుందు రకూళల్ వారల్
పటుచౌర్యవిప్రహత్యో
త్కటపాపాచరణసములు గద వారెన్నన్. 148

క. వినుటకు జెవియున్ బల్కర
సన మెనసియు నాగమార్తిసమితిన్ శ్రవణం

బును బఠనంబును నొనరిం
పనివాఁడే బ్రహ్మహననపాతకుఁడనఘా 149

శా. ఏనే దేవుఁడ నంచెఱుంగు నతఁడెందేనేమి వాంఛించి యె
వ్వానిన్ సంతసపెట్టు కర్జమునకై బల్పుట్టువు ల్గాంచియీ
మెనన్ దుఃఖము నొంది నొంది సుతులన్ బ్రేమించి కర్మంబు
లన్
బూనుం జేయ బృహస్పతీ వినుమ సద్బుద్ధిన్ గ్రహింపంగదే! 150

కం. భేదిల్లున్ హృద్గ్రంధియు
ఛేదిల్లున్ సంశయములశేషక్రియలున్
పేదొరఁగు నాత్మదర్శన
మేదురభాగ్యం బొకింతమెకొనె నేనిన్. 151

క. డెందంబునఁ బలుకులు నే
చందంబున నేనిఁ జేరఁజాలవొ యాయా
నందస్వరూపుఁ గాంచిన
నెందున్ భయమొందఁడెవ్వఁడింత నిజంబో॥ 152

క. కావున గురుచరణసరో
జావిష్కృతభక్తితోడనానందాత్మున్
భావించి శివోఽహంబని
ధీపై భవ మొప్పవలయుదేశికవర్యా. 153

క. ఎల్లర కిది పుట్టువునకుఁ
జెల్లున్ సాఫల్యమయివిశేషించి సుధీ
తల్లజులగు విప్రుల కిది
సల్లలితవిభూష యగుచుజగతిన్ బరగున్. 154

క. జ్ఞాన మది గల్గియుండిన
వానిన్ ద్విజుఁ డనఁగ వచ్చుబ్రహ్మాత్మక

జ్ఞానవిహీనుఁడు ద్విజుఁడని
మౌనివరాః పిల్వ వట్టిమాట యది సుమా. 155

క. సకలాగమగోప్యంబులఁ
బ్రకటించితి నిపుడు నీకు శ్రద్ధాన్వితుఁడై
సుకవీః తెలియుము బలుసి
ద్ధకారణ మశేషసిద్ధి దైవారుటకున్॥ 156

క. అని శివుఁడన విని గిప్పతి
ఘనభక్తిన్ దేవదేవుఁ గాలగ్రీవున్
వినమితకృపాస్వభావున్
మన మలరఁగ బొగడెనిట్లు మాన్యులు వినుఁడీ. 157

క. శివునకు సోమునకున్ స
ర్వవిదునకున్ శంకరునకుఁ బ్రభువర్యునకున్
భవునకుఁ బ్రధానపురుషున
కవిరళలయసృష్టికారణాలంకృతికిన్. 158

క. భవహరునకున్ మహాత్మున
కు వరేణ్యున కుపనిషన్నిగూఢచరునకున్
బ్రవిమలునకుఁ జిన్మాత్రున
కమృతావిద్యునకు హరునకు కార్తిహరునకున్. 159

క. స్తవనీయమహాత్మునకున్
భువనానీకేశ్వరునకుఁ బూజ్యునకు మనో
భవదర్పనాశకునకున్
ధ్రువతరతేజోవిశాలదీప్తాంగునకున్. 160

క. సువివేకరమ్యమూర్తికి
దివిషద్వర్యునకు దేవదేవునకును వా
స్తవదేవునకున్ సత్యున
కు వజలు ఋతునకును దత్త్వకోవిదునకునున్. 161

క. ఇవపుమల కూర్మి యల్లున
కు విశ్వనకు విశ్వభర్తకు విశ్వాతీ
తవిభునకు విశ్వరూపున
కు విజితసర్వేంద్రియునకు గురుగురువునకున్. 162

క. నవమన్మథరమణీయున
కు విరూపాక్షునకు హృదయగోచరునకుఁ దీ
ప్త వృషభకేతున కగజా
ధవునకు రుద్రునకుఁ జంద్రధరున కెఱగెదన్॥ 163

క. ఎనిమిదగు దెసల యెకిమీం
డ్లనువుగ నెవఁడై ప్రసిద్ధినందుదురో యతం
డినకోటితుల్యభాసుం
డనుపముఁ డతనికినినేఁగృతాంజలి నిడుదున్. 164

చ. దెసమొలమాయలాఁడు క్రుతిదేశవిహారసమర్థుఁడున్ మఱిన్
వసతి గలట్టివాఁడు భువనప్రకరప్రకటైకవాసుఁడున్
బసినొక టెక్కువాఁడు బుధవారపవిత్రమనోధిరూఢుఁడున్
విసపుగళంబువాఁడు శుభవిస్తృతవాఙ్నిచయుండు శూలియౌ
165

స. ఓంకారశబ్దవాచ్యోత్కృష్టనిజరూప!
మనసార నిడుదు నమస్సు నీకు
కారణకారణాఖ్యానిరూపితరూప!
మనసార నిడుదు నమస్సు నీకు
మంగళమంగళాత్మఖ్యాతభారూప!
మనసార నిడుదు నమస్సు నీకు
వేదవిద్విద్వద్విరక్తసేవితరూప!
మనసార నిడుదు నమస్సు నీకు

తె.గీ. మాయఁజేఁబట్టువాఁడ! నమస్సు నీకు
మహితసూక్ష్మాతిసూక్ష్మ! నమస్సు నీకు

మౌనిజనహృన్నివాస! నమస్సు నీకు
మమ్ముఁదరిఁజేర్చువాఁడ! నమస్సు నీకు. 166

## 11. నాడీచక్ర నిరూపణము

వ. పదపడి పరమేశ్వరుండు సురగురున కిట్లనియె. 167

క. నాడీచక్రము నందున
నాడెడి వాయువులఁ బుణ్యమగు తీర్థములన్
వేడుక సేవింపం దగు
నాడులఁ బూజార్హుఁడైనవాని బలికెదన్. 168

క. తొంబదియాఱంగుళమ్ము
లం బొడవుగు తనువు స్వాంగుళమ్ముల కొల నే
మంబునఁ గొలచిన మనుజకు
లంబందున సత్య మిమ్ముఖలం గన్గొనుమా! 169

వ. పాయుస్థానమునకు రెండంగుళముల మీఁదున నుపస్థాస్థానము నకు రెండంగుళముల క్రిందున మనుజశరీరములందు ముక్కోణముల వెలసి, కరఁగిన బంగారుపన్నె మెరయు తేజస్థాన మ్మొందగలదు దానిని దేహమధ్యమును. మూలాధారముగా వ్యవహరింతురు. దానికిఁ దొమ్మిదంగుళముల యెత్తుఁ జతురంగుళపరిమితిఁ గలిగి కుక్కుటాండాకారమునఁ గనఁదగి తృణాది విభూషితంబగు నొక కందంబు చెలువొందు కంద మధ్యమునకు నాభి యని పేరు. కందమధ్యమున సుషుమ్నా నామకనాడి యున్నది. దానిని డెబ్బదిరెండువేల నాడులును బరివేష్టించి యున్నవి. నాడులలోఁ బదునాలుగు మాత్రము ముఖ్యమైనవి. వాని యందు మూఁడును వానియం దొకటియు ముఖ్యములు. అదియే సుషుమ్న. దీనిని బ్రహ్మదండి యని యందురు. అది వెన్నెముక నడమ నుండి తల వఱకు వ్యాపించును. సర్పాకారము వహించి నాభీకందమునకు రెండంగుళముల పడగతో నల రారు బ్రహ్మరంధ్రమును దానితోక మూలమును. మూల

ప్రకృతియు మహదాది ప్రకృతి వికృతులును గలసి యెనిమిది ప్రకృతు లనఁబడును. అది తద్రూపమైయుండు. ప్రకృతి వికృతులేడును సుషుమ్నతో గుండలాకారము నొంది తద్గ్రీవ బంధకములై యుండు మూలాధారో త్థితమారుతమ్మును గుక్షి స్థాసితపీతాది సారమును దనముఖమున నిరోధించి యది యుని కిఁ గనును. దాని పడగ సుషుమ్నా మూలరంధ్రము నాచ్ఛాద నము చేసి యుంచును. సుషుమ్న సర్వనాడీ మధ్యమునందును దానికి సవ్యపక్షమున "నిడ"యును, దక్షిణపక్షమునఁ "బింగళ" యును, బురోభాగమున 'సరస్వతి' యును బృష్ఠభాగమున "గుహూ" అను నాడులుండును. వానిలో నిడకు గాంధారియు, హస్త జిహ్వయు నను నాడులు పింగళకుఁ బూషయు యశస్వినియు నను నాడులు పూర్వపూర్వభాగముల నుండును. కుహూహస్తి జిహ్వలకు మధ్యవిశ్వోదరయు, కుహూయశశ్వినులకు నడుమ వారుణయు, పూషాసరస్వతుల కుత్తరమున నపయశస్వినియు, గాంధారాసరస్వతులకుఁ గల యవకాశమున శంఖినియు నను నాడులుండును, ఇఁకఁ బదునాల్గవ నాడి యలంబుష యనఁ బడును. అది కందమధ్యమున నుండి వాయువు పర్యంతము వ్యాపించును. కుహూనాడి సుషుమ్నకు వెనుకభాగమున లింగాం తము వఱకును, దానికిం బయిని సర్వవ్యాపినియై వారుణయుఁ బింగళ వామనాసాంతము వఱకును, ఇడ దక్షిణనాసాంతము వఱకును, యశస్విని పాదాంగుష్ఠాంతము వఱకును, పూష అయా మ్యాక్షి పర్యంతమును నవయశస్విని పాదకర్ణాంతము వఱకును, సరస్వతి జిహ్వాంతము వఱకును,హస్తిజిహ్వ వామపాదాంగుష్ఠాం తము వఱకును శంఖిని వామకర్ణాంతము వఱకును, గాంధారి సవ్యనేత్రాంతము వఱకును, విశ్వోదర కందమధ్యము నను వ్యాపించును. ప్రాణాపాన వ్యానోదాన సమానములను నైదు ముఖ్యవాయువులు నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ ములను నైదు నుపవాయువులు, నాడులయందు సంచారం

బొనర్చును. వానిలోఁ బ్రాణము సంచరించు స్థానములు ముఖనాసికా హృదయ నాభిమధ్యములు పాయూపస్థల యందును నాభీవృషణముల యందును గటిద్వయమునందు నపానము చలించును. వ్యానము ముక్కు చెవుల యందును ముచ్చిలిగుంట యందును, బొటనవ్రేలి యందును వ్యానము మఱియు నది ఘ్రాణము నందును గుదము నందును గూఢ నుండును. ఉదానము సర్వసంధిస్థమై పాదహస్తముల యందును సమాన మొడలెల్లను నిండి యుండును. త్రేనుపు (వాంతి) నాగగుణము. కనుమూయుట కూర్మగుణము. ఆవలింత కృకరగుణము, తొట్రుపాటు దేవదత్తగుణము, వాపు ధనంజయగుణమునై యుండును. ఉచ్ఛ్వాసనిశ్వాసములు ప్రాణము వలనను, విణ్మూత్రాదివిసర్జనమపానము వలనను, సర్వసామీప్యము సమానము వలనను నూర్ధ్వగమన ముదానము వలనను, వివాదము వ్యానము వలనను గలుగును. సుషుమ్నకు హరుఁడును, నిడకు హరియుఁ, బింగళకంబుజగర్భుండును, సరస్వతికిఁ బక్షిరాజును పూషకు దిక్కులును. వరుణకు వాయువును, హస్తజిహ్వకు వరుణుఁడును, యశస్వినికి భాస్కరుఁడును, నాలంబనకు వరుణుండు నధిదేవతలు. కుహూవునకు భూమియు, గాంధారీశంఖినులకు నిందుఁడును, యశస్వినికిఁ బ్రజాపతియు, విశ్వోదర కగ్నియు నిడకుఁ జంద్రుఁడు పింగళకు సూర్యుండును నధిదైవతములు. పింగళ యందలి సంచారము మాని యిడయందు సంచరించు కాల ముత్తరాయణమును నిడ యందు సంచారమును మాని పింగళయందు వాయువు సంచరించు కాలము దక్షిణాయనమును నిడావర్తి ప్రాణము చంద్రుఁడు. పింగళావర్తి ప్రాణము భాస్కరుండును గనుక తదుభయవాయు సంధికాల మమావాస్యయును మూలాధారమున బ్రాణము ప్రవేశించు కాల మాద్యవిషువును సహస్రారములఁ బ్రవేశించు కాల మంత్యవిషువ నని వేదాంత రహస్యజ్ఞులు నుడువుదురు. ఇడా సంచారులగు నిశ్వాసోచ్ఛ్వాసములు మాసపంక్రాంతి యనఁబడు.

ఇడాగతప్రాణము కుండలి కందినపుడు చంద్రగ్రహణమును
పింగళాగతప్రాణము నట్లు యగునపుడు సూర్యగ్రహణమును
నగు. మరియు శిరమున శ్రీశైలము నొసటఁ గేదారము భ్రూ
మధ్యమునఁ గాశి యక్కునఁ గురుక్షేత్రము హృదయకమలమునఁ
బ్రయాగ హార్దాకాశమునఁ జిదంబరము మూలాధారమున
శ్రీకూర్మమును నరదేహమునందుఁ గలవు. వీనిని భావతీర్థము
లందురు. 170

తే.గీ. భావతీర్థము లివి యెల్లఁ బరగ నాత్మ
దేహమున వెలవనిమావి దేశదేశ
ముల బహిస్తీర్థములకయి పోవు టెల్ల
హస్తమణి మాని గాజుకై యరయుట గద. 171

తే. స్వాంగమందున నలరారు నాత్మతీర్థ
రాజముల మాని మృద్దారురచితవిగ్రహ
ముల బహిస్తీర్థములఁ గని మ్రొక్కఁ దెప్పు
డాత్మవిస్రంభవిజయంబు నందు యోగి 172

తే. చిత్తసంశుద్ధి లేక యశేషపూత
తీర్థముల నెల్ల సేవింపఁ దృఢతరైక
శుద్ధి నొందఁడు నరుఁడు విశుద్ధగాంగ
సలిలమునఁ గల్లుముంతకుఁ గలదె శుద్ధి. 173

చ. పరమపవిత్రతీర్థములభవ్యనదీసలిలంబులందు భా
సురతరపుణ్యకాలములఁ జొప్పలెఱుంగుచు దోఁగు పున్నెపున్.
సిరి తుల యౌనె బ్రహ్మపదనిష్ఠుని పాదసరోజయుగ్మమున్
గరముల ముట్టి తజ్జలముఁ గ్రక్కునఁ ద్రావెడి పుణ్యలక్ష్మికిన్.
174

చ. శివుఁడు స్వకీయదేహములఁ జెన్నలరారుచునుండు నాయుమా
ధవు నటఁ గొల్వకే యెడనొ దారుశిలామయ విగ్రహాంచితున్
వివిధములైన దానజపవిద్యలఁ గొల్వఁగ నెంచువారలెం
త వెఱవు మాలుమూఢులొ గదా! తలపోయఁగ దే! బుధాగ్రణీ!
175

క. చేతోమందిరమున శివు
నేతరి భజియింపకెటొ భజించుట యన్నన్
జేతఁ గల జున్నుఁగొన మో
చెతిని నాకుటకు నుపమఁ జెప్పఁగ వచ్చున్. 176

క. రంగులలంగా కట్టుత
బంగరుసొమ్ములను మేనఁ బైఁబెట్టుత బల్
సింగార మెసఁగు తన్ బ్రియుఁ
గొంగునముడిపైచుకొంచుఁ గులుకుత నెపుడున్. 177

క. స్మరహరురూపము ప్రవిమల
మరయరు సుజ్ఞాను లెన్నఁ డవి మూఢులదె
ల్ప రచించు నుపాయంబని
సురదేశిక: బుధులు సెప్పుఁ సూక్తులు వినవే. 178

క. ఎల్లెడ వెలసియ యున్నన్
జల్లవెలుఁగు సొమ్ముగల్గుఁ సామిన్ భూమిన్
దెల్లముగఁ దెలియ రెవ్వరు
నుల్లంబుల మాయఁ దవిలి యుండుటఁ జుమ్మీ॥ 179

క. అపరున్ నిత్యుని నద్వయు
నపూర్వుఁ బర్విజ్ఞానరూపు నానందున్ బు
ద్ధిపటుత్వంబెనయగు బ్ర
హ్మపదార్థ మ్మనెడి వాఁడె యరసిన వాఁడౌ. 180

ఆ.వె. సకలజంతుహృదయ సాక్షిగాఁ జైతన్య
మయునిగాఁగ నాత్మ మనన మెవఁడు
సలుపకన్దరించుఁ బలఁచెడి మనుజుండు
చూచువాఁడు నయ్యుఁ జూడఁ డెపుడు. 181

క. ఏననిదలఁపకుమా నీ
వీ నాడీపుంజమిద్ది యెంచ నసాధ్యం
బౌ నేనని జీవుని నీ
మానసమున నెంచుమయ్య మౌనివరేణ్యా: 182

ఉ. ఎల్లశరీరబృందములఁ నింతశరీరము గాక వేరయై
జెల్లెడి వాని నీశ్వరు నశేషదిగంతరపూర్ణు నాత్మనిన్
ముల్లలితస్వరూపుఁ గని మోదము నొందు మహానుభావు జో
భిల్లఁగఁ జేయలేవు గద పెన్నడగంట్లును మౌనిపుంగవా. 183

క. జ్ఞానబలంబున భేద
జ్ఞానము నశియింప జీవసత్పరమార్థై
క్యానూనజ్ఞానోదయ
మౌనెడఁ గర్మంబు లెవ్వఁడయ్యా చేయున్. 184

క. మాయామయము నసత్యము
కాయంబని యెఱిఁగిదాస కాదని దేవుం
డే యీవని యెఱుఁగుమ యా
ర్యాః యయ్యది పల్కినాఁడ నాదృతిఁగొనుమా. 185

క. అని పరమశివుం డమరగు
రుని఼ బల్కిన బత్తి యెద సిరూఢము గాగన్
మినువాకనొమ్మువానిన్
గనుఁగొని పొగడంగ సాగె ఘనులు వినుండీ. 186

విజయమంగళరగడ :-

జయము జయము దేవదేవ జయము విజయమంగళంబు
జయ మవాప్త కామ జయము జయము సోమ సంతతంబు
జయము సర్వకలుషనాశ సత్కవీశ శోభనంబు
జయము త్రిపురభేదముక్త సౌఖ్యఖేద బల్మిభంబు
జయము భవహరా హిమాద్రిజా మనోహరా గిరీశ
జయమనంగదాహ విగత సర్వమోహ భిన్నపాశ
జయము త్రిపురభంజనా ప్రశాంతిరంజనా పురేశ
జయము శత్రుఖండనా భుజంగమండనా మహేశ
జయ మవాప్తసర్వకామ సకలదేహి హృదయధామ
జయము కోటిభానుధామ జ్ఞానసత్యమోదభూమ

జయము రూపవిజితకామ సంగరాంగణైక భీమ
జయము వామదేహిభీమ సన్నుతాతిపూతనామ
జయము మాట కందరాని సామవేదములకుఁ దావు
జయము వేల్పులెల్ల మ్రొక్కు సామి జ్ఞానులకును తావు
జయము గొల్చువారిగాంచు సామి మెలుగొలుపు బ్రోవు
జయము మాకుఁ దెల్వినొసఁగి సంతతమ్ము బ్రోవు మీవు
జయము బూది మేనఁ బూయు జనములకును బ్రదుకు మ్రాకు
జయము బూది మేనఁ బూయు సౌరు మేని హొన్ను రేను
జయము రక్కసులకుఁ బ్రిక్కు జరుగుమూఁడుమొనలబాకు
జయము నీకు దేవదేవ చాల యెఱుక లొసఁగు మాకు
జయము జయము చిత్స్వరూప జయము విజయమంగళంబు
జయము జయము సత్స్వరూప జయము విజయమంగళంబు
జయము జయము ముత్స్వరూప జయము విజయమంగళంబు
జయము సచ్చిదమలరూప జయము విజయమంగళంబు. 187

క. పంకేరుహసన్నుతున క
హంకారజయోన్నతున కహమ్మతిదుష్టా
లంకారమదనవిదళన
హుంకృతిరతునకు నమస్కృతి లొగినర్పింతున్. 188

క. యతిజనమాన్యునకున్ సం
తతభూతివిభూషణాంగ ధన్యజనార్ధాం
చితభవ్యమోక్షసాక్షా
ద్వితరణ పర్జన్యునకు నివె నుతిశతముల్. 189

క. స్తుతిచేసిపరేశ్వరు నిటు
నతులితకృతి యయ్యో నాబృహస్పతి గానన్
మతిమంతు లగుచు మీరున్
బతితావను శివునిఁ గొల్చి పఱలుఁడు బత్తిన్. 190

క. పొంగుచు సంజల రెంట న
నంగహరస్తోత్ర మెవ్వఁ డతిభక్తి నొన

ర్చుం గడు నాతని కబ్బుం
గంగా స్రోతోజవోరు కలితోక్తిఝురుల్॥ 191

క. పుత్రార్థిఁ గొడుకుఁ గను శత
పత్రేక్షణ పెండ్లియౌను పరిణయవాంఛా
పాత్రుఁడగు నేని వినుఁడీ
స్తోత్రింబుఁ బఠింపఁ బత్తి తో మునులారా! 192

క. కావున రెండగు సంజల
పావనశివుమహిమఁ బొగడు వారయి మీరల్
జీవశివాద్వయులై స
ద్భావాంచితు లటుచు ముక్తి భాగ్యముఁ గనుఁడీ. 193

## 12. నాడీశుద్ధి నిరూపణము

వ. పిమ్మటఁ బశుపతి తారాపతి కిట్లనియె. 194

క. నాడీశుద్ధిని నీకై
యాదెద సంగ్రహముగా బృహస్పతి వినుమా!
నాడీస్ఖలనంబెన్నఁడుఁ
గూడదు తచ్ఛుద్ధిఁజేసికొను సమయమునన్. 195

వ. యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధారణాధ్యాన సమాధులను నష్టాంగముల నారితెరి, వివిధవిహితకర్మాసక్తుండు కామ సంకల్పాది విరక్తుండును నయి మాతృ పితృగురుజన శుశ్రూషాత్వంబున నెనసి, సమ్యగ్జ్ఞానశిక్షితాత్మజ్ఞానంబున వఱలి కాంతారాంతరమునసైనను, భూధరశిఖరమున నైనను, తరంగిణీపరిసరమ్మున నైనను, శ్రీఫలమూలతలంబుననైనను, వేదఘోషపరిపూతమును ఫలమూలసలిల లలితంబును రమణీయమును, శుచియు నగు నొక తావు వెదకి యందు సర్వరక్షాబంధురంబగు సుందరమందిరం బొండు నిర్మించి త్రిషవణ స్నానశ్రద్ధాసమంచితుండయి, సమంత్రముగా విరజానలాగ్నిహోత్రజనిత భస్మము శిరోబాహు మూలోరుస్థలంబుల నద్దసాలుగాఁ దిత్రిపుండ్రముల

రచించి, మించినభక్తి దేవదేవు నెదఁ దలఁచి, వాగ్దేవికి నమస్కరించి, గురు విఘ్నేశ్వరపూజనం బాచరించి, యజ్ఞానలాదిత్యుల కంజలి నర్పించి, తూర్పుదెసఁ గాని, యుత్తరదిక్కునకుఁ గాని మొగంబయి శిరోసమశిరఃకంధరశరీరుండయి, సంవృతాస్యుండయి నాసాగ్రసీమ యందలి యిందునందు గల బిందువునఁ దోఁచు నకారమును దర్శించి, తన్నిస్స్రుతామృత సుఖితనేత్రుండయి, నాదానుసంధానంబొనరించి ముముక్షునిజోదరస్థితవాయువు నిడానాడిచే నాకర్షించి పూరించి దేహమధ్యస్థ జ్వాలాసయుతాగ్నిని ధ్యానించి, బిందునాదసంయుక్తాగ్నిబీజమును స్మరించి, స్మరించి పింగళాద్వారమున మారుతము మెల్ల మెల్ల వెలుపుచ్చవలయు. మఱలఁ బింగళచే గ్రహించి వాయువు పూరించి, యగ్నిబీజమును నెంచి యిడాముఖమున బహిష్కరించునది. ఇటుల దినమున కారుతడవులఁ బ్రతిసంధ్య యందును మూడునాల్గేఁడులు గాని యన్నియ నెలలు గాని నాడీశుద్ధి కృద్విధాన మాచరించునది. అందువలన నొడలి చులకందనము, నాకలియు నాదాభివ్యక్తి యుఁగలుఁగు, అవి కలిగిన వెనుక తత్ప్రయత్నము మాని యాత్మశుద్ధికై కడఁగుటొప్పగు. 196

క. జీవుఁడు నిత్యుఁడు ప్రభుడున్
జీవుఁడు శుద్ధస్వభావదీప్తుఁడు సుఖుఁడై
చావుం బుట్టువుఁ గనుబో
దావిర్భావంబు లేనిదయంతకు సతమున్. 197

క. ఎన్నఁడు జీవుఁడు నిజబో
ధోన్నతిఁగనునప్పుఁడే మదరొండగు జతనం
బున్నెరిమొనరింపకయే
జెన్నలరు విశుద్ధుఁడగుచు శిష్టజనమణీ. 198

క. జ్ఞానోదకముల నెవఁడ
జ్ఞాన మనెడి రొంపిఁ గడఁగడఁజాలున్ వాఁడే

యౌను పవిత్రీంచీక య
జ్ఞాని సములఁ దెంచఁగర్మసంగుండు గదా! 199

క. ఎఱుకలు కదలని మొఱకులఁ
గరమున్ ప్రేరేపవలయుఁ గర్మాచరణం
బెఱుక గలసరసమతులకె
గరమున్ బోధింప వలయుఁ జ్ఞానపథంబుల్. 200

## 13. అష్టాంగయోగము — యమవిధి

క. అష్టాంగవివరణము వి
స్పష్టముగాఁ దెలియనగు నజరగురువర్యా!
ఇష్టానిష్టము లెఱుఁగని
తుష్టిం గను తెరువుఁ జెప్పు మను వినుమయ్యా! 201

క. యమమష్టాంగంబులఁ బ్రథ
మము తల్లక్షణము నెఱుఁగుమా దశవిధమౌ
నమరగురూత్తమ నుడివెద
విమలాంతఃకరణచణవివేకం బొదవన్. 202

తే. అగు నహింసయు బ్రహ్మచర్యమ్ము సత్య
మార్జవమ్మును నస్తేయమతుల కృపయు
క్షమయు ధృతియు మితాహారశౌచములును
బదివిధంబులు యమమన్న వ్రతమునకును 203

తే. ఆగమప్రోక్తమైనట్టి యజ్ఞములను
గాక మఱియెల్ల తావులఁ గాయికమ్ము
మానసికమును వాచకమైన హింస
నింత యొనరింపకుంట యహింస యగును. 204

క. సర్వగతుం డచ్ఛేద్యుఁడ
ఖర్వుఁ డదాహ్యుండ నంచుఁ గననేరక యీ
యుర్విం జీవుని నెరసుగ
గుర్వజ్ఞానమునఁ దెలసికొన హింసయగున్॥ 205

తే. ఒనర సత్యంబు బ్రహ్మంబనఁ దొండు దక్క-
నన్యమెల్ల యసత్యంబనఁ యనెడు బుద్ధి
సత్య మనుపేర జగములఁ జరుగుచుండు
నన్యబుద్ధు లసత్యమౌ నరయ నెపుడు. 206

తె. దుష్కరణసహాయంబుఁ దొరఁగియ కద
శ్రుతికథితవాక్యజాలంబుఁ నుతికి నెక్క-
వానికన్నను సత్యమైఁ పరిఢవిల్లు
పల్కు-లెచ్చోటఁ గనవచ్చుఁ బ్రౌఢి నరయ. 207

క. పరవిత్తము తృణమైనన్
సురుచిరరత్నంబ యైనఁ జూడక వాంఛన్
బరపక యుండుట యస్తే
యరమ్యగుణమనుచుఁ బల్కు-ఁనగు గురువర్యా 208

క. ఆత్మ ననాత్మం డనుచు ని
జాత్మం దలపోసి యట్లఁ వ్యవహారము పా
పాత్ముండు సలుపుఁ గావున
స్వాత్మజ్ఞుం డట్లొనర్పఁ జాలండు గదా॥ 209

తె. ఆత్మ నాత్మనిగా హృదఁయంబు నందు
గురుతు నెఱిఁగిన కోవిదుఁ చరిత మెల్ల
సరగ నస్తేయవిఖ్యాతఁ సంజ్ఞఁ దనరి
సుప్రసిద్ధినిఁ గను దానిఁ చొప్పు నెఱుఁగు. 210

మ. ఋతుకాలంబు నెఱింగి స్వీయ మగు నాఁ రీరత్నముఁ దప్పనొ
క్క-తె నన్యాంగన నెన్నఁడున్ హృదయవాఁ క్కాయంబులన్ గోరకుం
డి తగన్ గేస్తు వ్రతంబుఁ దీరుచు నతంఁ డే బ్రహ్మచర్యః బునం
చితరీతిన్ బొనరించు వాఁడని బుధుల్ఁ జింతింతు రార్యోత్తమా! 211

క. జీవబ్రహ్మము లొక్కఁ
డై విలసిల్లునని యెడఁదయందున దృఢమౌ
భావమునఁ జెలఁగ నదియున్
ధీవర్యు లిది బ్రహ్మచర్యదీక్ష యని రోగిన్. 212

క. తన కెట్టు లొరుల కట్టుల
యని త్రికరణములను నరసియందఱి యెద మె
త్తనియెదఁ బెనుచుట దయ యని
యనిమిషగురువర్య! విబుధులందురు సుమ్మా! 213

క. సుతునందు విమతునందున్
సతియందును మిత్రునందు సమవృత్తంబున్
కృతి సల్ప నార్జవంబని
మతిమంతులు నుడువుచుందురు మహితాచార్యా! 214

క. త్రికరణము లొకటఁ బెనుగా
సికి గురియైనను నొకింత చిత్తము నందున్
వికలత్వ మొందకుండుట
నకలంకవివేకు లోర్పటందురు మహాత్మా! 215

ఉ. వేదవచఃపరిభావముల విశ్రుత మోక్షము గల్గుఁగాని యిం
కేది యుపాయమై దనరు నీభవవారధినిం దరింప నం
చూది దిటం బెసంగు నెడ యొప్పిదమే శ్రుతి యంచు నెయ్యెడన్
వేదవిదుల్ వచింతురు మునిప్రవరా! వినుమయ్య! శ్రద్ధమై 216

శా. ఏ నాత్మండను గాక యన్యుఁడను నే నెన్నఁడునున్ గాను నే
నానందాత్ముఁడఁ జిత్స్వరూపుఁడను దుఃఖాసంగుఁడన్ ముక్తుఁడన్
నేనంచున్ గడు నిశ్చయించుకొని నిర్ణిద్రస్వరూపంబుతో
జానుం గాంచు మతిస్థితిన్ ధృతిగ సుజ్ఞానుల్ వచింత్రెల్లెడన్. 217

తే. అల్ప మైనను భోజనం బధిక మైనఁ
జెడును యోగంబు గాన నెవ్వఁడు సమవిధిఁ
బరగ యోగానుకూల మౌ తెఱఁగు నెఱిఁగి
మితముగా నాహరించు టే మేలిగుణము. 218

క. సలిలాదుల మైదవిలిన
మలమును బోఁగడుగ బాహ్య మల మెడలున్ లో
పలిమలము చిత్త శుద్ధిన్
దొలఁగున్ శౌచంబు రెండు ద్రోవలిది సుమా॥ 219

తే గీ. ఏను శుద్ధుండ ననుతెల్వి యౌను శౌచ
మందురు విద్వాంసు లొడలెల్ల యగును ముఱికి
యెడలఁ గల జీవుఁడగు శుద్ధుఁ డొప్పు. మీఱ
నని యెఱింగినచో శౌచ మది యెవరికి? 220

క. జ్ఞానజలంబుల శౌచవి
ధానమ్మును దీర్చ మాని తాను బహిశ్శౌ
చానూన విధులఁ గనువాఁ
డూనను చే గాజు కనక మొప్పని వాఁడై. 221

క. జ్ఞానస్నానాధికునకు
నౌనే కర్తవ్య మొక్కఁడది గల్గినచో
జ్ఞానియ కాదనవచ్చున్
జ్ఞానియె సశరీరముక్తి సంజ్ఞకుఁ జాలున్॥ 222

క. జ్ఞానుల జీవన్ముక్తులు
గా నెఱి వేదంబు బల్కెఁ గావున నీమే
లై నయహింసాదులచే
జ్ఞానము నీసొమ్ము గాఁగ సల్పుము వ్రతమున్. 223

క. శ్రుతివాక్యజ్ఞానంబున
చతురత గ్రహియించి యాత్మ సాక్షాత్కారం
బతులితగతి నొందఁ దగదె
మతిమంతుం డగుచు బుధుఁడు మాన్యవివేకా! 224

## 14. నియమవిధి

క. యమమువలెఁ బదివిధములు ని
యమ మొప్పును వాని నెల్ల నరయఁగఁ దగు మో
క్షముఁ గోరు ధీరుఁడిది స
త్యము సుమి బల్కెదను నే బృహస్పతి వినుమా! 225

తే. తపము సంతోష మాస్తిక్య దానమీశ్వ
రార్చనమ్ములు దత్వమస్యాది శ్రుతిశి
రోఽర్థముల విన్కి లజ్జయు నమల మతియు
జపము వ్రతమును నియమంబు సరణు లగును. 226

క. శ్రుతి పల్కిన గతి కృచ్ఛ్ర
వ్రతాదులను మేను గాసిపరచుట నొగిఁ బం
డితులు తపం బని యందురు
క్షితి వానిని సల్ప శుద్ధి చిత్తమ్మునకౌ. 227

క. ఎవఁడను నే నెవ్విధమున
నవు మోక్షము నాకు నంతమగు సంసారం
పువిషాదబాధలని పె
ల్లవు చర్చలొనర్పఁ దపము నందురు జ్ఞానుల్. 228

ఆ. జతన మింత లేక సమకొను లాభంబొ
సంగుఁ బ్రీతి సంతసం బొకండు
బ్రహ్మమందిరాది పర్యంతవై రాగ్య
జాత్మప్రీతి యొక్కటగు ముదంబు. 229

క. శ్రౌతస్మార్త వ్రతసం
జాతశ్రద్ధకుఁ జెల్వొసఁగు నాస్తిక్య
ఖ్యాతాంకం బద్దానిన్
జేతోగతి నిల్వకున్నఁ జెడుఁ గర్మంబుల్. 230

క. న్యాయార్జిత ద్రవ్యంబుల
దేయంబని శాంతునకు శ్రుతి ప్రకటాస్తి

క్యాయత్త చిత్తు నకు నిడు
చేయగు జనమెల్లఁ బొగడు నీగి ధరిత్రిన్. 231

క. వైదికుఁడు గాని వానికి
నేదైనను దాన మీయ నిద్ధహవిస్సున్
బూదిని హోమముఁ జేయుట
గాదే యాదానము నుపకారియు నగునే? 232

తే.గీ. కోమటులు బ్రహ్మక్షత్రియుల్ కుసుమ విశిఖ
గురుని బాపలు కైలాసకూటవాసు
బత్తి సతతమ్ము గొల్చినఁ బరఁగు నీశ్వ
రార్చనంబను సన్నియమాంగమిలను. 233

శా. రాగాదుల్ జనియించి మానసము బల్ రాపిళ్ళనుం బెట్టవేన్
నేగిన్ వీడి యసత్యముల్ నుడువగా జిహ్వేంద్రియం బొప్పదే
నేగాసిం బొనరింపకుండఁ దనువెం దేఁబున్నెమున్ గాంచునే
బాగా నీశ్వరపూజనం బదియగా భావింతు రార్యోత్తముల్. 234

క. జ్ఞానము సత్య మనంతం
బానందము ధ్రువము ప్రత్యగాత్మంచని సం
ధానం బెద సల్పినచో
నౌనది వేదాంతశ్రవణ మను నియమంబున్. 235

క. పాదజులున్ ద్విజకులశా
ఖోదరులున్ నేర్పుతోడ సురుసిద్ధాంత
స్వాదుజ్ఞానమును బురా
ణాదుల విని తెలియఁదగుదు రందురు విబుధుల్ 236

క. వైదికలౌకికమార్గ
ప్రాదుర్భవ దఘములకును వరలెడి సిగ్గున్
శ్రీదయివారెడి హ్రీ యని
వేదవిదుల్ బల్కుచుందు రివేలుపుమిన్నా! 237

క. సకలాగమోక్తసూక్త
ప్రకరంబులఁ గల్గు శ్రద్ధ బావనమతిగా

నకలంకమతులు బల్కుదు
రిఁక నియమాంగముల దీనిఁ దెలుఁగు మొకటిగన్. 238

క. తంత్రింబుల దరిఁజేరక
మంత్రింబుల నాగమోక్తమార్గంబున ధీ
యంత్రింబున నిడికొని సే
వింత్రిలఘులదే జపమ్ము వినుదేవగురూ! 239

వ. మఱియుఁ గల్పసూత్ర ధర్మశాస్త్ర పురాణేతిహాస ప్రోక్త విధం బున నైనను జప మిరుతెఱంగులు వానిలో వాచికముచ్చైరుచ్చా రితమును బాంశువు నని రెండు విధములై యుండు. మ్లేచ్ఛాదు లనిన నవకాశము లేని నిర్జరారణ్యాదులలోఁ గుత్తుకెత్తి యుచ్చై ర్గతిని సల్ప జపము యథోక్తఫలము నిచ్చును. దానికంటె ధ్వని బహిర్గతము కాని యటు నధరస్పందనమాత్రికార్య మగు నుపాంశుజపమ్ము వేయిమడుంగు లెక్కుడు. దానికి మానసిక జపము సహస్రగుణమై జాననగును. ఋషిచ్ఛందోదేవతాసమేత ముగా మంత్రజప మాచరింపవలెను. శ్రుతి బాహ్యాస్మృతులు నగు దృష్టి నుపదేశించు ప్రవక్తృవాగ్గతులు న నాదరణీయములు గావు. అవి యెల్ల గతాసుల నరకనివాసులఁ జేయు. ధర్మార్థకామ సిద్ధ్యుపాయము వ్రతమనఁబడు ఆథర్వణమంత్రపూర్వక సర్వాంగ భస్మధారణమును బాశుపతమనియు, శాంభవ మనియు నైశ్వర్య మనియు, శిరోవ్రత మనియు నత్యాశ్రమవ్రత మనియు వెఱు వేఱు పేళ్ళ నార్యులు వ్యవహరింతురు. ఇది వ్రతోత్తమంబు. పాశుపతవ్రత మాచరించి సహజపశుత్వముఁ బాపికొనఁ జాలని దుశ్శీలు గుండెలు వ్రీలఁజేసినను బాపము లేదని శ్రుతిజాలము వల్కు. ఏతద్వ్రతపూతునకే సకలకర్మజాతాధికారములు గలవు.

## 15. ఆసనవిధి

వ. యమనియమంబుల నుడివితి నిఁక నాసనప్రకారం బభి వర్ణింతు ముఖ్యాసనములు తొమ్మిది స్వస్తికాసనము గోముఖాస నము, పద్మాసనము, వీరాసనము, సింహాసనము, భద్రాసనము,

ముక్తాసనము, మయూరాసనము, సుఖాసనము నను నీ నామ ధేయముల నవి ప్రసిద్ధంబులై యుండు. రెండు మోకాళ్ళ మధ్య రెండు పాదములు నుంచి సమగ్రీవశిరఃకాయుఁడగుట స్వస్తికాసన మగును. ఎడమపృష్ఠపార్శ్వమునఁ గుడిసీలమండయును గుడి పృష్ఠపార్శ్వమున నెడమసీల మండయు నుంచుట గోముఖా సనమగును. సవ్యదక్షిణాద్యుపరిభాగముల యందు దక్షిణసవ్య పాదము లుంచి తదంగుళసవ్యదక్షిణహస్తములఁ గ్రమముగ నేకకాలమందుఁ బట్టి యుంచిన పద్మాసనమ్మగును. కుడితొడపై నెడమ యడుగును నెడమతొడపైఁ గుడియడుగును మెడయుఁ దలయు మేనును వంకర లేక నిబ్బరముగ నుంచుట వీరాసనము వృషణద్వయమునకు మధ్యఁ గల కుట్టువలెఁ గనుపించు గీత "సీవని" యనఁబడును. దాని కిరువైపుల నండముల క్రింద గుల్ఫముల వ్యత్యస్తముగా నుంచి చేతులఁ జానుభాగముల నుంచి యంగుళులు కేల గ్రహించి నాసాగ్రమును సందర్శిం చుట సింహాసనమగును. సివనికి వామపార్శ్వమున వామగుల్ఫ మును దక్షిణపార్శ్వమున దక్షిణగుల్ఫమును వృషణముల కడుగు భాగమున నుంచి యఱకాళ్ళు పరస్పరాభిముఖమగు నటుల నిలిపి దక్షిణోరువును దక్షిణహస్తముననుం, వామోరువును వామహస్తము నను నదిమిపట్టిన భద్రాసనమ్మగును. లింగమునకు క్రైన యెడమసీలమండను, దానిపైన కుడిసీలమండను నుంచిన ముక్తా సనమగును. ఇరుకరంబుల నిలను నిలిపి మోచేతుల నాభి కిరు వైపుల నుంచి పుడమిపై శిరఃపాదముల నంటకుండ నంతరాళం బున నుంచి యేకాగ్రమనస్కుఁడై యుంట మయూరాసనము. సర్వపాపహరము. పై యాసనముల కశక్తుఁడైనవాఁ డేయాస నంబున సుఖమును జిత్తస్థైర్యమును నొందునో యా యాసన మున నుండుట సుఖాసనము. ఆసనవిజయము త్రిలోకవిజయము మనఁదగు. ఆసనాసీనుఁడు ప్రాణాయామాధికారి. ఇఁకఁ బ్రాణా యామ మెఱిఁగెంతు.

## 16. ప్రాణాయామవిధి

వ. ప్రాణాయామము రేచక, పూరక, కుంభక, క్రియాత్మకము. ఉదరస్థితవాయువు నిడానాడిచే నాకర్షించి పదియాఱు మాత్రల కాలము బ్రహ్మాత్మకమైన యకారము స్మరించుచు మెల్లమెల్లనఁ బూరించునది. ఆత్మహస్తమున నాత్మజానుమండలమునంతయుఁ దాఁకు గడవునకు మాత్ర యని పేరు. పూరితా నిలయము నఱువది నాలుగు మాత్రల కాలము చలింపకుండ నిలుపుఁ జేసి విష్ణ్వాత్మకమైన యుకారము స్మరించుచుఁ బ్రణవముఁ జపించునది. అంతకాలము వాయుకుంభక మొనరింప లేనిచో నోపినంత కాలము మాత్రమే జపయుక్తముగా నది యొనరుపవలెను. రుద్రరూపమైన మకారము స్మరించుచు ముప్పదిరెండు మాత్రల కాలమున పింగళానాడీద్వారమున వెలిబుచ్చుట రేచకము నాఁబడు. ఇది యొకప్రాణాయామము. పింగళాముఖమునఁ బదాఱు మాత్రల కాలము మకారము స్మరించుటయు నుపకారస్మరణముతో నిరువది మూఁడు మాత్రల కాలపర్యంతము వాయువుఁ గుంభించుటయు నిడాద్వారమున ధృతానిలము బహిర్గత మొనరించుటయు నొకప్రాణాయామ మగును. ఇటు లనేక పర్యాయములు ప్రాణాయామ మొనర్పవలెను. ఇది యతి ప్రాణాయామవిధము.

ఇఁక గృహస్థ ప్రాణాయామసరణి నుడివెద. కుక్షిస్థితానిలము నాకర్షించి పూరించి, వ్యాహృతిప్రణవయుక్త గాయత్రిం జపించుచు (ప్రాతఃసాయముల ముమ్మాఱును మధ్యాహ్నమున నాలుగు పర్యాయములును ప్రాణాయామము గృహస్థుఁ డొనరించి శుద్ధుండు గావలెను. బ్రహ్మచర్య వానప్రస్థాశ్రమములకు ప్రాణాయామ మైచ్ఛికము గాని విధి కాదు. వక్త్రజుల వలెనే బాహుజులును ప్రాణాయామ మాచరింపవలెను. వైరాగ్యాన్వితులును, ప్రబుద్ధులు నగు వైశ్యులకును విప్రక్షత్రియులకు వలెఁ బ్రాణాయామ మగును. స్త్రీశూద్రులకు శివమంత్రముఁ గాని వైష్ణవ

మంత్రము(గాని నమోఽంతముగా నన(గా "శివాయనమః" యనియు "నారాయణాయనమః" యని యుచ్చరించుచు (ప్రాణా యామ మొనర్చుట విధింప( బడినది. పదియాఱు పర్యాయము లనుదినమును ప్రాణాయామ మొనర్చినందు వలన బ్రహ్మ హత్యాది పాతకములు తొలఁగు. ఆఱునెలలు యథావిధిగాఁ బ్రాణాయామ మొనరించిన యెడల జిజ్ఞాసువును సుతకు రెట్టింపు కాల మాచరించిన యెడల బ్రహ్మవేత్త యగును. సర్వధర్మ శీలుఁడై యోగాభ్యాసరతుఁ డగువాఁడు జ్ఞానవంతుఁడయి ముక్తుఁ డగును. ప్రస్వేదకంపనోత్థానపర్యంతము నిర్వహింపఁబడిన ప్రాణాయామ మధమ మధ్యమోత్తమములగు. ప్రాణాయామ నిష్ఠాపరునకు వలిపలి త్రాడులు గలుగవు. అతనికి దుర్లభ మైన వస్తు వేదియు లేదు. కావునఁ దత్ప్రయత్నము సర్వవిధ ముల నేమఱకుండునది. నాసాగ్రనాభిమధ్యపాదాంగుష్ఠంబులఁ బ్రాణాయామకాలమునఁ జిత్తము నిల్పిన వాయుజయము నఖిలా మయనాశము నంగలఘుతయుఁ గల్గును. నాలుకచే వాయువు లోనికిఁ గొన మైగాసియు, దప్పియుఁ దొలఁగు మఱియుఁ దద్వాయువు జిహ్వామూలమున నిల్పి యమృతపానము సల్పిన యెడల సకలసుఖముల కాకరంబగును. ఇడాకృష్టానిలము భ్రూ మధ్యంబున నిల్పి యమృతాస్వాదన మొనర్చిన సర్వవ్యాధులు బాధితములగు. ఇడచేఁ గాని పింగళచేఁగాని గ్రహించిన మారు తముఁబొక్కిలి యందు నిల్పిన సర్వరోగనాశ మగును. జిహ్వా గ్రస్థ పవనము త్రిసంధ్యల గ్రహించి, మూఁడు నెల లమృత పాన మొనరించి నాభియందు మెల్లమెల్లగా నిల్పినయెడల వాత పిత్తాదిదోషములు హరించు. ముక్కులగాలిపట్టి కన్నుల నిలి పినఁ గంటితెవుళ్ళుమానును. అట్టి వాయువు చెవుల నిలిపిన చెవితెవుళ్ళు మళ్ళును. అట్టిగాలి తలనిల్పినయెడలఁ దలవగలు దవ్వగు. అపానము మీఁదికి నెత్తి మెల్లగా ప్రేళ్ళతోఁ జెవులు నోరు ముక్కులు కన్నులు మూసి శిరము నందానంద ముద్భ

వించు వఱకు శ్వాసనిరోధము సల్పిన వాయువు బ్రహ్మరంధ్రి ము౯ జొచ్చును. పిమ్మట శంఖధ్వనివంటి నాద ముద్భవించును. పిమ్మట నాధ్వని యలుగు రొదవలె వినిపించును. పిదప సెల యేటి స్రోతవలె విన నగును. తరువాయి చిత్తము బ్రహ్మ సాక్షాత్కారార్హ మగును. జ్ఞానోదయమై సంసారపాశనాశ మగును. మఱియు నుత్కర్ష ప్రాణాయామమను నొక ప్రక్రియ గలదు. సీవనీనాళము నెడమచీలమండ నదిమిపట్టి రెండవచీల మండ నద్దానిపై నుంచి తొడకు౯ బిక్కకు నిసుమంతయు సందు లేకుండ౯ జేసి త్రిమూర్తులయం దొకని౯ గాని వినాయకుని౯ గాని ధ్యానించుచు లింగనాళము నుండి వాయువును సప్రణవముగ మూలాధారమధ్యమున నిరోధించి తద్వాయుసందీప్తవహ్ని౯ కుండలిం దహించి యగ్నిసహితమారుతము సుషుమ్నాద్వార మున విడచుట కుత్కర్షప్రాణాయామ మని పేరుదీన వాయు జయము గలుగును. తొలుత౯ గడ చెమరించుటయు౯ బిదప మేనెల్ల వణ౯కుటయు నవ్వల నొడలు గాలిలో౯ దేలుటయు ననిల జయమున కానవాలు. దానివలన మూలరోగము భగంధరాది వ్యాధులును గుదురును. మఱియు నది సర్వకిల్బిషహారము. ప్రతిబంధము వెడలిన నెడంద తుడిచిన యద్దమువలె౯ బ్రకా శించును. అత్తఱి విరక్తియు నుద్భవించు. దాన౯ గైవల్య సాధనము జ్ఞానము౯ దోచు. ముక్తిసిద్ధించుట కిదియ యుపా యము. 242

క. జ్ఞానసుధ౯ గ్రోల జాలక
హీనపుసంసారసుఖముగలెదె౯దవుల౯గ మో
హాన౯ జెడి సారెసారెకు౯
దీనులగుచు మొఱకులెల్ల౯దిరుగుదు రహహా॥ 243

క. జ్ఞానామృత మొకపరి యే
నానిన సుజ్ఞాని దానిగననిశము గ్రోల౯

మానక దఖిలకార్యంబుల
మానుచుఁ బర్వెత్తు నమృతమాధురి నరయన్. 244

క. జ్ఞానామృతరసమెన్నం
డేని చవింగొనక యితరమెల్లప్పుడు దు
ర్జ్ఞానాధీనుండయి యెడ
నూను నతనికంటెఁ గుమతియొరుఁడున్నాఁడే? 245

క. జ్ఞానస్వరూప మీజగ
మౌ నని సుజ్ఞానిఁ దలఁచునంతకు వేత్తై
జ్ఞానొందు నీజగంబని
మానసమున నెంచువాఁడుమంధధిషణుఁడౌ. 246

క. దానమున భోగమున్ జ
న్నానన్ దెలిగంటి తనముననాశికజని
స్థానముఁ దపమున నిస్సీ
మానందము జ్ఞానముననుప్రాప్తంబ యగున్. 247

క. జ్ఞానమునఁ గాదు కర్మము
చే నౌఁ గైవల్య మంచుఁజెనఁటులు మౌఢ్యం
బూని వచింతురు శ్రుతి కది
యౌను విరుద్ధం బదింతనరయరు గాదే. 248

క. తానే యీసర్వం బని
జ్ఞానియె యెఱుఁగున్ సతంబుజ్ఞానవిహీనుం
డెనచలతత్వ మీశుఁడ
నేనని తలఁపంగఁ బోవఁదెన్నటికైనన్. 249

క. ఏనరుఁడు గట్టువడు న
జ్ఞానాలఘుపాశముల నసంగుండయ్యున్
వానికి ముక్తియు లేద
వ్వానికి జ్ఞానంబుకలుగభవములు దొలఁగున్. 250

క. జ్ఞానాహస్కరుచే న
జ్ఞానాంధతమమ్ము వెడలఁజయ్యన నాయ

జ్ఞానము నడుపు నుపాయము
జ్ఞానమె జ్ఞానమున కౌకటికి సమము గలదే. 251

క. ఏ నిముసమ్మున గడు న
జ్ఞానమ్ములు గల్గి నట్టి జ్ఞానికి మఱలన్
మేనులు గలనె కలవు
మేనందక యుంట జ్ఞానమేదురఫలమౌ. 252

క. ఎనికి రాగద్వేషా
జ్ఞానమ్ములు గలవట్టి జ్ఞానికిమరలన్
మెనులు గలనె కలవు
మెనందక యుంట జ్ఞానమేధురఫలమౌ. 253

క. మెనే యెన్నడ సంభవ
మౌ నయ్యెడ సుఖము దుఃఖమను పల్కులకే
తానకము లేమిచే గ్లే
శానుభవము సున్న ముక్తినందురు దానిన. 254

క. ఏనరునకు నేదుఃఖం
బైనను నజ్ఞానమునకె యగుఁ గావున న
జ్ఞానముఁ బుచ్చఁగ సాధన
మౌనేకర్మంబు జ్ఞానమడపును దానిన్. 255

క. సంసారమహావృక్ష
ధ్వంసము జ్ఞానాయుధావతంసముచె వి
ధ్వాంసుండు నెఱప వరమీ
మాంసాదక్షుఁ డయి లోకమాన్యుఁడగుఁ జుమీ. 256

క. ఇది యుపనిషదర్థం
బిది కడు గోప్యంబు నియ్యదియ్యెడ నీకున్
విదితమ్ముగాఁగ నుడివితిఁ
గద బుధవర చెప్ప నొప్పగద ధీరులకున్. 257

## 17. ప్రత్యాహారవిధి

క. పొలుపుగ బ్రత్యాహారముఁ
బలుకుదుఁ దద్విభము లెల్లఁ బలుకుదు నీ వీ
నల కొక పండువుగా విను
మలఘుఁడ నీవంటి వానికగు నిది వినఁగన్. 258

కం. కరణార్థంబుల వెంబడి
కరణమ్ములు పర్వువెట్టఁగా సహజంబౌ
కరణముల నెల్ల విషయో
త్కరములఁ బడి పోవకుండఁగాంచుట యొప్పున్. 259

చ. పరిపరి రేబవల్ విషయపద్ధతులం బడి పోయిపోయి వె
సరక నిరంతరంబు కొనసాగెడు నింద్రియముల్ మఱల్చి సు
స్థిరముగ బ్రహ్మవస్తువునఁ జిత్తముఁ జేరిచి కార్యకోటి నా
మరణము బ్రహ్మమందున సమర్పణముం బొనరించు టొప్ప
గున్. 260

తే.గీ. నిత్యనైమిత్తికమ్ముల నెఱపు పట్లఁ
గామ్యదీక్షల నెఱవేర్చు కాలమందు
మనము నందున ఫలకాంక్ష మనగఁ నీక
బ్రహ్మసేవయ యను బుద్ధి పఱపు టొప్పు. 261

సీ. మొనసి గాలిని దంతమూలమ్ములను నిల్పి
యటనుండి కంఠంబునందుఁ జేర్చి
గళసీమ నుండి వక్షఃస్థలమ్మున కంపి
యటనుండి పొక్కిటయందుఁ బఱపి
నాభిని బాపి కుండలి నుండగాఁ జేసి
యటనుండి జొన్పి మూలాంతమున
నవల మూలాధారమందుండి కటియుగం
బటనుండి యూరుద్వయమ్ము గ్రమ్మ

తే.గీ. నట్టు లొనరించి యటనుండి యాత్మజాను
వులను బొనిచ్చి యఁటనుండి పొసఁగఁ బిక్క

లందు వెలయించి యాతావు నందు మాన్పి
కాలిబొట్టనవ్రేలునం గలఁపు టొప్పు. 262

సి. సరగున స్వస్తికాసనమునన్ గూర్చుండి
ముకుపుటంబుల గాలి మురిసి గ్రోలి
తల మొదలఁ గాలిదనుకఁ బూరించి య
వ్వల హజ్జబోయి పై నిలపి యవల
నల్ల మూలాధారమందుననాగి య
వ్వల నాభికందహృత్పద్మములను
వ్యాపింపఁ జేసి య వ్వలఁగంఠతాలుసీ
మలఁ జొన్పి యవల భ్రూమధ్యనిటల

తే. దేశములకునుఁ గొనివచ్చి తివిరి శిరము
నందు హత్తించి మొదలిటి యక్కరము మ
కారమును బిందువుం గూర్చి కడ నమశ్శి
వాయ యని మోమునుంగూడ పల్కుటొప్పు. 263

వ. పూర్వోదాహృతపంచవిధములను బహిత్యాహారభేదములు సర్వో
త్కృష్టంబైన ప్రత్యాహారవిధానం బొండుగలదు. దానిఁ బలి
కెద నాకర్ణింపుము. 264

క. దేహాదులు నేననియెడి
మోహమ్మును విడచి ద్వంద్వముక్తాత్మ నేదం
సోఽహమ్మవి దలపోసి స
మాహితచిత్తమున మెలఁగ నమలుఁ డనఘుఁడో. 265

క. ప్రత్యాహారమ్మును ని
ప్రత్యూహమ్ముగ నొనర్చు పండితవర్యుం
డత్యాయతశుభములఁ గని
ధృత్యుత్సాహముల నెగడి కృతకృత్యుఁ డగున్ 266

క. ఈరీతిన్ దగుఁ బహిత్యా
హారమును నొనర్చు నాతఁడగుఁబన్నగకే

యూరుఁడు పుణ్యాపుణ్యవి
దూరుఁడు బ్రహ్మాత్మతత్త్వధుర్యుండార్యా॥ 267

క. ఇంకన్ నీవెన్నటికిన్
శంకింపకుమా మదుక్తిసారార్థంబుల్
పంకంబుకుగు భవాంబుధు
లింకున్ మద్వచనసారమెవ్వరు విన్నన్॥ 268

## 18. ధారణావిధి

వ. ప్రత్యాహారవశీకృతచిత్తుఁడు ధారణాధికారి కావున ధారణాక్రమం బెఱిఁగింతు. బహిర్గతపృథివ్యప్తేజో వాయ్వాకాశములు శరీరగతములగు పంచభూతములు నొకటి యని తెలియుట ధారణ యనంబడు దీనఁ బాపములు దొలఁగు. మోఁకాళ్ళసంధుల భూమి, పాయువున జలము హృదయమున నగ్ని. భ్రూమధ్యమున ననిలము, శిరమున నాకాశమును ధ్యానించి బ్రహ్మవిష్ణు మహేశ్వరేశ్వరసదాశివులును వరుసగా భూమ్యాపోనలానిలాభ్రదేశమ్ముల నిలిపి కొలుచునది. ఇది యొక తెరువు వేఱొక తెరువునుగలదు. అది యోగశాస్త్రప్రసిద్ధంబు. 269

సీ. కడలెల్లఁ జెవులనుగంజారి నెదయందు
నగ్గిఁ బల్కున బలంబును సింధురిఁ
బాదమ్మునను విష్ణుఁబాయువునను మిత్రి
వరప్రజాపతిని నుపస్థయందుఁ
గన్నవ సూర్యు నాల్కను వరుణుని ముక్కు
నందు భూదేవినినంగమందు
ననిలుని జీవునియందు సర్వాంతరు
సర్వనియంతనుసర్వవిభుని

తె.గీ. సంవిదాకారు నానందసహజరూపు
దేశకాలగుణాతీతుదివ్యమూర్తిఁ
బరమశివు నిల్పి ధారణవఱలఁ జేయ
సర్వపాపవినిర్ముక్తసరణిఁ దొరకు. 270

వ. మూఁడవవిధమగు ధారణయుఁ గలదు అది ధార్మికజన ప్రసి
ద్ధంబు. 271

శా. ప్రాదుర్భావము నొంది గోచరమునై వ్యాపారముం గాంచు బ్ర
హ్మాదిస్థావర మీజగం బఖిలమాయాకారణానీకమం
దేదైనన్ లయముం బొనర్చి తుదకెట్లేనిన్ బ్రధానంబునుం
గాదే చేరుదు రెల్లవార లురుతర్కప్రక్రియాధీరులై. 272

తే. కార్యముల కెల్లనుం దొలికారణమ్ము
ప్రకృతి యైనను నయ్యవ్యక్తమైన
నది జడంబను పల్కు తథ్యంబు గాన
దానికెట్లబ్బు సృష్టించుదార్ఢ్య మరయ. 273

తే. కాన నద్దాని చైతన్యఘనుఁ బరాత్మ
నందుఁ బ్రవిలాపముం జేసి యవల మోద
మెదురాంబుధి వీచికామేయసుఖవి
లాసరాశుల మున్గి తేలంగవలయు. 274

క. వెలికిం బర్వెడి యింద్రియ
ముల లోపలికిన్ మఱల్చి బుద్ధిం బరమా
త్మలలితామూర్తిం జూడఁగ
నెలకొల్పు క్షణంబయైన నిక్క మలఁతియే. 275

క. మరియొక ధారణవిధముం
బరగును నేదేవదానవప్రముఖుల నొ
క్కరుండఁగా నేనౌదును
పరమబ్రహ్మంబు నంచు భావింపఁ దగున్. 276

క. కరణంబుల నొక్కటిగా
నరయ మదియుఁ గాని మాయకవ్వలి వాఁడన్
పరుఁడం గాను బరాత్పర
వరణీయబ్రహ్మ మంచు వఱలెడి వాఁడన్. 277

క. అని యెదలో నొక నిశ్చయ
మునఁ జేసినవాఁడ యుత్తముండగు శ్రుతిపా

వనమత మిది దీనిం గై
కొనుమా కడు శ్రద్ధదేవ గురువర వినుమా॥ 278

క. నరసురులకు మాత్రముగా
కురులోకములకు మహేశ్వరోత్కృష్టునకున్
వర వేదములు ప్రమాణము
లరయఁగ నన్యప్రమాణ మరయంగలదే॥ 279

## 19. ధ్యానవిధి

వ. అష్టాంగంబుల షష్ఠంబు నుడివితి నేడవది యగు ధ్యానం బుప
న్యసింతు. సావధానుఁడవై విను. ధ్యానంబు పలుతెఱఁగులై
యొప్పు అందుఁ దొమ్మిదింటిమాత్రము బేర్కొందు. 280

మ. తొలుతన్ నిర్మలమైన యాకసమునందున్ జల్లనై యొప్పుచా
యల జానుంగని నింగిఁ బొంగుచు విహారానేక చారుత్వముల్
వెలయన్ దర్శనయోగ్యమైన యుడురాడ్బింబంబు నాపిమ్మటన్
చెలువారన్ మదినెంచి యానడుమ వాసిన్ బార్వతీనాధునిన్. 281

సీ. పటికంపు టాదర్శ పరిధవిల్లెడి మేని
వాని రేతేఁకుసొమ్మైన వాని
వలిమలజేనిముద్దులపట్టి సామేనఁ
గలవాని మెడకప్పుగలుగు వాని
ఇరుకేలఁదోయి పెంపెసఁగు తోయగముల
వానిఁ గన్నులుమూఁడవఱలు వాని
వెల్పులందఱుఁ జేరి వేవిధంబుల మ్రొక్కు
లిడువాని సంతసంబెనయు వానిఁ

తే. బరముఁడగు వాని నానందపరమధామ
మగుచు నొప్పారువానినిర్నమలుఁడైన
వాని వేల్పుల మిన్నయౌవాని నిల్పి
•సోఽహ మని ధ్యానముం జేయుచా ప్రొకండు. 282

ఉ. తోయదబృంద మయ్యెడలఁ బోవకఁ నిర్మలమైననింగి ల
క్షయతవిస్తృతిం బొదలు సంబుజమిత్రుని బింబ మొయ్యనన్

ధ్యేయముగా నొనర్చి పలు తీరులనందున మధ్యభాగమం
దా యినకోటిధాముని హిమాచలజాహృదయాభిరామునిన్. 283

సీ. బంగారు పెన్నెఱుల్ బంగారు గోళ్ళును
బంగారు మీసముల్ బంగారు మెయి
కపిమొగంబు పిఱుందు గలకావి పసలేలఁ
గలమోము కావులున్ జెలఁగు వాని
వింద్రనీలంబుతో నెక్కసక్కెములాడు
నఱుత నల్పులజాల నడరు వాని
నొకపగమున మేన నుత్పలాక్షీవిలా
సము లొప్ప జాణయై యమరు వాని

తె.గీ. సకలలోకవిధానై క శక్తిఁ గూడి
వఱలువాని త్రినేత్రవి స్ఫురితఫాల
భాగవిస్తారు నెలకొల్పి పరమభక్తి
సోఽహ మని ధ్యానముం జేయు చాప్పాకండు. 284

తె. శ్రుతివిధానముఁ బూనివి శుద్ధగతినిఁ
గూర్చఁబడు వెదికకు మధ్యఁ గోచరించు
పావకుని నెంచి తన్మధ్య భాగమందు
గట్టుకన్నెను జేపట్టు దిట్టరి నొగి. 285

సీ. పెను నట్టువుల నీను మినువాక తరగల
నందమౌ నొఁదల నలరు వాని
బలుమూఁపు చెలువారు పసి జక్కిగా నెక్కి
యెనసి వాహ్యాళియై యేఁగువాని
వెల్పు టేటిని దలన్ దాల్పఁ గట్టిన జుట్టు
గట్టునా బలుజడల్ గల్గు వాని
ఐశ్వర్యమున్నజ పాసక్తి మేలని
చెప్పనా రుదురాకు లొప్పు వాని

తె.గీ. నాల్గుభుజములవాని ద్రినయనములను
నొప్పువానిని బాలతె ల్పొప్పువాని

సర్వభువనాశ్రియానందు సరగ నిలిపి
సోఽహ మని ధ్యానముం జేయుచు నొప్పుకంటు. 285

తే. అష్టభూతులు దళములై యమరుచుండ
విద్యలెల్లను నకరులవిధముఁ బోప
దంబుమీఁదెడి జ్ఞానశాంబు దనర
నీశు వాసంబు హృదయాబ్జమిందుఁ గలదు. 287

క. ఆనలిన మధోముఖమై
గానంబడు దాని రేచకప్రాణాయా
మానన్ మీఁదికి నెత్తుచు
లోనం దలపంగ వలెనులోకేశ్వరునిన్. 288

సీ. వేతలన్ వేకాళ్ళవేయిగన్నుల నొప్పి
సర్వలోకాధారచణత వెలసి
వేమొగంబుల పేరివేమంటలోపోరి
యగ్గిఁ బోలిన తేజుఁ గాంది మెరసి
నల్లనిమబ్బుపైనాణెంపు మెఱుఁగుతీ
వియ తళుక్కు మొత్తంపు పెంపుఁదనర
గాలిచేఁ గదలికఁగనని దీపము వోలి
నిశ్చలంబైన కాంతినిఁదలిర్చి

తె. నిశితనీవారశూకసన్నిభము నగుచు
సన్నముగ వెల్గు కణికలోశంభు విష్ణు
పద్మజధ్యేయుఁబరమాత్మభక్తిఁ గొల్చి
సోఽహ మని ధ్యానముంజేయు చొప్పుకండు. 289

సీ. అవ్యయుం డాదిమధ్యాంతశూన్యుఁ డనంతుఁ
డనలుఁ డద్వయుఁడు నఘనఘుఁడు పుణ్యుఁ
డహ్రస్వుఁ డస్థూలుఁడస్పృశ్యుఁ డదీర్ఘుఁ
డంసుఁ డగంధుండునప్రమేయుఁ
డనుపముఁ డక్రియుఁ డజ్ఞాతరూపుండు
సర్వతోముఖుఁడును సర్వగుండు,

సర్వజ్ఞుఁడును సర్వ సాక్షియు సచ్చిదా
నందస్వరూపుఁడా నందమయుఁడు
తే.గీ. కారణంబులకెల్లను గారణంబు
నద్భుతుం డార్తిహరుఁడగు హరు హిమాద్రి
జామనోహరు నెద నిల్పి సంతతమ్ము
సోఽహ మని ధ్యానముం జేయు చొప్పెకండు. 290
క. ధ్యేయాతీతు ననంతున్
గేయానందస్వరూపు గేవలు నెదనే
నే యాతఁ డనుచు నెంచిన
శ్రేయంబగు సోఽహమని ప్రవించెడి చొప్పున్. 291
ఆ.వె. ఇంత యంత యనుచు నీశు నెన్నండును
కొలఁది గొప్పలెంచి కొల్వ వలదు
శ్రుతులు పల్కు ప్రమితి చతురత కఁదలి
తత్వ మౌను నీశు తత్వ మనుచు 292
ఆ.వె. సర్వసాక్షి యైన శంభునిఁ దలపఁగా
నే ప్రమాణములకు నింత శక్తిఁ
జాల దంచు నుడువు శాస్త్రంబు గావునఁ
బ్రమితి గల్గదీశు బత్తిఁ గొలువ. 293
సీ. పసుపుముంజాయ జల పసలొల్కు పచ్చని
పట్టుఁబుట్టము మేనఁ గట్టు వాని
నొకచేత శంఖంబు నొకచేత (చక్ర)ంబు
నిరుకేలఁ దమ్మిపూ లెనయు వానిఁ
దలఁగిరీటంబు బాహులను గేయూరంబు
లధరోష్ఠమున నవ్వు లలరు వాని
నెదను శ్రీవత్సమ్ము నిందిరాదేవితో
సమముగా ధరియింపఁ జాలు వానిఁ
తే గీ. బద్మలోచనుఁ బద్మాస్యుఁ బద్మనాభుఁ
బద్మభవుతండ్రిఁ బద్మకుఁ బ్రాణనాథు

విష్ణు మనమున నెలకొల్పి వైభవ మెసఁగ
సోఽహ మని ధ్యానముం జేయు చొప్పొకండు. 294

సీ. తన యెద నిర్మలంబని దెల్పు కైవడి
స్ఫటికాక్షమాలఁ జేఁబట్టు వాని
తా నిండుకుండనితగఁ జెప్పనో యన
జలకమండలువు చేనిలుపు వాని
నిరుచేతులం గల్గనీగియే ఫలమన
వరదాభయదకరద్వయమువానిఁ
బల్కుఁబల్కునఁ బ్రియవలె డోఁచవలె ననఁ
బలుకులచెలి పజ్జమెలఁగువాని

తే. స్వచ్ఛకుందేందునీహారవర్ణ మొప్పు
వాని భువనప్రణేతయౌ వాని నజుని
నల సురజ్యేష్ఠు నంతరంగాంతరమున
సోఽహ మని ధ్యానముం జేయు చొప్పొకండు. 295

తే. హవ్యవాహనదేవుని నర్కదేవు
నోషధీశ్వరదేవుని నొండువేల్పు
శ్రుతివిహితగతిఁ బూజించి మతి నెఱింగి
సోఽహ మని ధ్యానముం జేయు చొప్పొకండు. 296

తే. నవవిధధ్యానములఁ దెల్పినాఁడ నిట్టు
లభ్యసించిన ధ్యానమ్ము నతులమైన
జ్ఞాన మొదవును దాన నజ్ఞానమెడలుఁ
దాన సంసృతి నశియించు దథ్యమిదియ. 297

## 20. సమాధివిధి

వ. అష్టమాంగంబయిన సమాధిం బలికెద జీవాత్మపరమాత్మైక్య సంధానమే సమాధి. పరునికంటె జీవుండు భిన్నభావుండేయైన జీవునికిఁ గార్యత్వ, జడత్వ, వినాశత్వములు తటస్థించు. ద్వైత భావమే భయహేతువు. వాస్తవముగా జీవుఁడు నిత్యత్వసర్వ గతత్వ కూటస్థత్వ నిర్దోషత్వ గుణవిశిష్టుండు. అజ్ఞానబలమున

జీవుఁ డనేకులవలెఁ గన్పట్టును. స్వభావము నాలోచించిన జీవుఁ డద్వయుఁడు కానఁ బ్రపంచమును సంసారమును సత్యేతరములు జీవుండు మాత్రము సత్యుండు. ఆకాశము ఘటమఠోపాదులఁ దవిలి నప్పుడు ఘటాకాశమఠాకాశము లనఁబడు నట్లు జీవేశ్వర సంజ్ఞ లౌపాధికములు. భ్రాంతిమూలంబులు గాని వాస్తవ భిన్న వస్తువులు గావు.

తే. ఏను దేహంబునుంగానఁ గాను ప్రాణ
మింద్రియంబులునుం గానొకింత యంత
రంగముం గాన హం ప్రతీనరయఁ గాను
పంచభూతములుం గానఁ పండితవర! 299

తే. కాను తన్మాత్రలెంచగఁ గాను భవముఁ
గాను మాయయుఁ గేవలుఁ డేన యాదు
రూఢిగా నేను సాక్షిస్వరూపుఁడౌదు
నంచుఁ దలపోయ నగును సమాధి విధము. 300

చ. జలజభవాండ మెంచగ నెసంగును భూతములైదుగూడ నా
నిలయము సూక్ష్మభూతములనిక్కముగాఁ దెలియంగ నౌను మా
య లయముఁ బొందు నయ్యవియునయ్యెడ జీవునియందు లీనమౌ
వెలయుదు బ్రహ్మమేన యయి భిన్నుఁడగా ననఁగా సమాధియౌ
301

వ. మరియొక విధసమాధియుం గలదు. ఋగ్యజుస్సామవేదముల యం దకారోకారమకారముల నాధర్వణంబున నోంకారధ్వనిని నారోపించి వాని కధిదైవతములు బ్రహ్మవిష్ణుమహేశానులని యెఱిఁగి, గార్హపత్య, దక్షిణాహవనీయ సంవర్తకములను నాలు గగ్నులును బృథివ్యంతరిక్షద్యుసోమలోకమ్ములను నాల్గులోకములను జాగ్రత్స్వప్నసుషుప్తితురీయములను నాల్గవస్థలను నాభిహృదయకంఠమూర్ధములను నాలుగు స్థానములును, భూతభవిష్యద్వర్తమానసాధారణములను నాల్గుకాలములును నుదాత్తానుదాత్తస్వరితప్రచయములను నాల్గుస్వరములును నకారోకారమకారము

లను నాదములను దెలిసి యకారం ముకారమునందు నుకారమును నుకారము మకారమునందును మకారము నాదమునందును ప్రవిలాపించి నాదమును మాయ యందును, మాయను జీవాత్మ నందును, జీవునిఁ బరమాత్మనందు నూహించి యాపరమాత్మఁ నేనని తెలియుటయు సమాధి యందురు. 302

తే. కడలి నురుగుల తరగలున్ వెడలి కలియు
జగము నాయందు జనియించి సమసి పోవు
నన్యమిదికాదు నాకంటె ననుచు నెంచి
నాది లేకుండుటయును సమాధియండ్రు. 303

తే. ప్రత్యగాత్మఁడె బ్రహ్మమై పరగు నెవని
తఁడు బరమాత్మభావుఁడై యలరు నిజము
నతఁడు ముక్తిస్వరూపాత్మఁ డగును గాన
నతని మించిన పూజ్యులనరయ మెందు. 304

సీ. దెసదెసల్ వ్యాపించి యెసఁగెడు బలుతెల్వి
యేవేళ నెడలేక యెదను నిలుచుఁ
దనయంద జీవులు తాన జీవుల యంద
నేవేళ వెరసులేక కేక మగును
డెందంబు నొకమేలి టెంకిగాఁ గొనుకోర్కు
లేవేళ రూపరి బోవు నెటకొ
జగము మాయామాత్ర మగు బహ్మ నిజ మంచు
నేవేళ నిశ్చయం బిరవుఁ గనునొ

తే. అపుడ యపరోక్ష మగును బ్రహ్మంబు ముక్తి
యగును నప్పుడ కేవలుఁ డగును జ్ఞాని
యపుడె సంసృతియు న్నాశమందు నపుడ.
పరమశివుఁడొచు సుజ్ఞాని వలలు నపుడ 305

తే. కర్మకోటిశతంబులఁ గాదు ముక్తి
జ్ఞానమునఁగాని యన్యధా జనన మొందు
ముక్తి నిత్యంబునుం గాదు పోవునేఁడొ
రేపొ యని చెప్పవచ్చు నిర్లేపవర్య. 306

తే. ఉపనిషద్వాక్యవిజ్ఞాన మొక్కటి యగు
నుత్తమజ్ఞాన మరయఁగా నొండు జ్ఞాన
మనఁగ వచ్చునె జ్ఞానంబు యనుచు నెన్నఁ
డైన జ్ఞానంబు వర్ణింప నలవి యగునె. 307

ఆ.వె. చిన్నదయ్యు దివ్వె చీఁకటి హరియించు
నల్పమయ్యు జ్ఞాన మడపుఁ దమము
నలఁతియైన జ్ఞాన మభ్యాస మొనరింప
గొప్ప దురితములును గూలిపోవు. 308

ఆ.వె. కడఁగి యెండుకట్టె దడసినకట్టెను
బూదిచేయు నగ్గిఁ బోలె జ్ఞాన
హవ్యవాహనుఁడు శుభాశుభకర్మంబు
నెల్లఁగాల్చివైచు నేపుమీఱి. 309

చ. పటుతరమంత్రశాలి యగు పాములవాఁడు భుజంగరాజి ము
చ్చటకయి పెంచి యాటలకు సాగిన వానిని క్రూరదంష్ట్రికో
త్కటహతిఁ బాలుసేయవుగ దా యటు జ్ఞానియు నింద్రియాలతో
నిటనఁటనాడుచుండియును నెయ్యెడ ఖిన్నము బొందఁ డింతయున్. 310

మ. తనపై నాడెడి తోయబిందువులతో దైవారి తల్లేపమున్
గనరా కుండెడి తామరాకు వలె నానారూపసంబంధబం
ధనికాయేంద్రియజాలవాంఛితపదార్థప్రాప్తి దైవారియున్
దనుసంపర్కము వాని తోడఁ గనఁ డాత్మజ్ఞాని యెన్నండునున్. 311

చ. విసము భుజించి యోషధుల వీర్యము చేతను మంత్రశక్తిచే
విసమరుగంగఁ జేసికొని పెంపునఁ గాంచిన దంటవోలె జ్ఞా
నసహితుఁ డైన పండితుఁ డనంతమహాదురితవ్రటాటవిన్
బసుమ మొనర్చి మించుఁ గడ వానికి సీడెవఁ డయ్యా నారయన్. 312

సీ. ఏదేని వినినప్పు డేదేని గనునప్పు
డేదేనిఁ దినునప్పు డెందు నైన
జనునప్పుఁ డేదెని నునువుగా మూర్కొను
నప్పుడు నేదేని నంటునప్పు
డెందేని యూపిరి నిడునప్డు గొనునప్పు
డెందేని నిద్దుర జెందునప్పు
డెందేని మేల్కాని యెడు నప్పుఁ డేదేని
విడుచునప్పుడు చేత ముడుచునప్పు
తే.గీ. దేను కర్తయు భోక్తయుఁ గా నసంగుఁ
డౌదుఁ బరమేశ్వరుండ నే నౌను నాదు
చెంగటను సర్వవర్ణముల్ చేష్టఁ గాంచు
నంచు నెంచిన నిర్లేపుఁ డగు నిజము. 313

తే. మరియు సుజ్ఞాని నిందించు నరున కగును
ఘోరరౌరవయాతనా కోటి పెక్కు
కల్పములదాఁకఁ గావున ఘనుల కైన
జ్ఞాని దూషింపఁ గూడదు మానవనీయ. 314

క. గురుతరమౌ సుజ్ఞానం
బిరవొందెడి వాని వృత్త మెట్టిది యైనన్
బరిశీలించుట గూడదు
పరిశీలన కగునె తల్లి వర్తన మెందున్. 315

క. జ్ఞానాభ్యాస మొనర్చెడి
వానిం గని వాని శీల వర్తనముల నిం
తేని విమర్శించుట దగ
దీ నియమముఁ గొనుట యొప్పు నెల్లజనులకున్. 316

క. నిరపేక్ష మునిని శాంతున్
బరాజితమదాదిశత్రుఁ బొడితుఁ గని నే
నరిగి వెనువెన్కఁ దత్పా
దరేణువుల చేత నెత్తి తాల్తున్ దలపై. 317

క. నరులకును రాజు పూజ్యుఁడు
సురలకు మునివరుల కెంచ సుజ్ఞానియ యే
వెఱవున నైనను బూజ్యుం
డరిది గదా జ్ఞాని యొక్కఁ డఖిలం బరయన్. 318

ఉ. ఏని గృహాంగణమ్మున రహిం దనపాదము పెట్టు జ్ఞాని య
వ్వాని పితృప్రతానములు పండుగునం బలెఁ దాండవింతు రెం
తేని ముదమ్ము లొంది మరి యేగతి నైనను బొందరాని య
మ్మానితముక్తి పై భవ మమందముదంబుల నొందు వాఁడొగిన్. 319

సీ. జ్ఞాని కన్దవ విప్పి కన్గొన్న మాత్రాన
సర్వపాపమ్ములు సమసిపోవు
జ్ఞాని పుట్టిన యంత కన్నతల్లియుఁ గన్న
పృథ్వియుఁ గులముఁ బవిత్రమగును
జ్ఞాని కన్పడు మాత్ర నాకాదిలోకాధి
పత్యాధికైశ్వర్య భాగ్యమమరు
జ్ఞాని పజ్జను నిల్వఁ జటుల సంసారాఖ్య
చక్రంబు ముక్కలై జన్మ ముడుపు

తే.గీ. నట్టి వాఁడుగదా జ్ఞాని యిట్టియతని
బూజ్యుఁ బరమార్థదర్శను బూజసేయ
కిట్టి మోహానఁ బడి భవం బెత్తు వారు
జ్ఞానహీనులు నుడువ వశంబె నాకు. 320

క. జ్ఞానిం బూజింపక సం
ధానించి న వన్యకర్మ తతి నజ్ఞానన్
మౌనీ యమృతముఁ గ్రోలన్
మాని బలువిసంబు గొనుట మాడ్కి యగుఁజుమీ. 321

ఉ. వేయును బల్కు లింక నర విన్ నుడువంగఁ బనేమి శాశ్వత
శ్రేయ మొసంగు నిద్దియును జెప్పిన వాఁడను శ్రద్ధతో సుధీ

గేయచరిత్రి దీని పరీక్షించి గ్రహింపుము దీని బల్మినే
సాయము లేక ముక్తికథకసారమునుం గొని మోద మందుమా.
22

క. దేవుని యెడఁబలె శ్రీగురు
దేవుని యెడఁ బరమభక్తిదీపించినచో
నీవెదాంతార్థంబుల
త్రోవల్ దగఁ బోధపడు నిరూపించు తరిన్. 323

క. పలికి యిటు నుడువ వలసిన
పలుకులు గలుగమిని శివుఁడు పలుకక యుండన్
వెలయఁగఁ దద్భావంబును
దెలియ బృహస్పతికి మేనదేరెన్ బులకల్. 324

క. ఆనందాంభోనిధిపీ
చీనిచయనిమగ్నుఁ డగుచుఁజిత్తంబు నిజా
త్మానందవశము గాఁగా
నానందపరవశుఁడయ్యెనమరగురుండున్. 325

ఉ. నాఎలనన్ మహాత్ములరునవ్యసుధామధురాత్మతత్వసం
భావితవాక్ప్రకాండములమానితరీతిని విన్న వారలుం
గావున నచ్చమైన యెఱుకకన్ గృతకృత్యులరైరె తీరకో
పావనవిప్రులార యనిపల్కెను సూతుఁడు జ్ఞానపూతుఁడై. 326

వ. మఱియు నిట్టుల సూతుఁ డుపన్యసించె. 327

మ. ఇది వేదాంతవిశుద్ధమార్గ మిఁక మీరెల్లప్పుడున్ శ్రద్ధమై
పదిలంబున్ బొనరించి లోకములకున్ భద్రమ్ము లూహించి పెం
పు దలిర్పన్ నెలకొల్పుఁ డయ్య! జతనంబుల్ పెక్కులున్ సల్పి మో
క్షదమౌ విద్యనొసంగినాడఁ నిఁటుపై శంకింపకుం డింతయున్.
328

క. ఎవఁడిది నిలుపఁగ దక్షతఁ
దవిలియు నిలుపంగ మానుతన్నరకీటం

బు వథము బొవరించినచోఁ
దవులదు దొసఁగించుకంచుఁ దజ్ఞుల పలుకొ. 329

క. సామర్ధ్యము లేకుండిన
నే మనుజుండైనఁ గానియీవేదాంతం
బీమహి నిలుపం జూచిన
నామర్త్యుని దొసఁగు లెల్లహరియించుఁ జుడీ 330

చ. చదివినవాఁడఁ బెక్కులగుశాస్త్రము లంచు నహంకరించి యే
యదనున నైన జ్ఞాని బరిహాసమొనర్చిన నింద చేసినన్
వదరిననుం గువాదములువల్కిన నెగ్గులు వాఁడు పాతకా
స్పదుఁ డగు జ్ఞానహీనుఁ డయిజన్మపరంపర లొందుచుండెడున్ 331

క. జ్ఞానాఖ్యఖండ మిది యే
మానవుఁ డైనన్ బఠింపమహితశ్రద్ధన్
బూనఁడు క్రిమ్మరఁ దనువున్
గానఁడు సంసారఘోరగతి నెన్నండున్. 332

క. జ్ఞానము రాజ్యము కామము
జానగు సౌఖ్యంబు నేర్పుశాస్త్రము శ్రుతిసం
తానమును గోరకిదియే
దేనియు లభియించు జదువనీఖండంబున్. 333

తె. యత్న మెంతేని సల్పిగుణాఢ్యుఁడైన
శిష్యవరునకు నిది బోధచేయవలయు
వానిచేతను జదివింపవలయు దీని
వానికిన్ బొరముును జెప్పవలయు బుధుఁడు. 334

—: గద్యము :—

ఇది 'కవితావిశారద' శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతంబైన
శ్రీమదాంధ్ర సూతసంహితా మహాగ్రంథంబునందు జ్ఞానయోగ
సంప్రదాయ పరంపరాకథనంబు నాత్మచే సృష్టికథనంబును బ్రహ్మ
చర్యాశ్రమవిధి నిరూపణంబును గృహస్థాశ్రమ విధినిరూపణం
బును వానప్రస్థా శ్రమవిధినిరూపణంబును, సంన్యాసవిధి
నిరూపణంబును, ప్రాయశ్చిత్త విధి నిరూపణంబును,
దానధర్మ ఫలకథనంబును, పాపకర్మ ఫలనిరూపణం
బును, పిండోత్పత్తి కథనంబును, నాడీచక్ర
నిరూపణంబును, నాడీశుద్ధి నిరూపణంబు
నష్టాంగయోగమునందలి యమవిధి
యును నియమవిధియు, నాసనవిధి
యును ప్రాణాయామవిధియును.
ప్రత్యాహారవిధియును ధార
ణావిధియును, ధ్యానవిధి
యును, సమాధివిధియు
నను విషయములుగల జ్ఞానయోగఖండము
సమాప్తము

# శ్రీ సూతసంహిత

## ముక్తి ఖండము

### ముక్తి ముక్త్యుపాయ మోచక మోచకప్రద చతుర్విధ ప్రశ్నములు

చ. పరమముదంబు తోడ నెడఁ భావనఁ జేసి నమస్కరింతు నీ
శ్వరు, శివు, సత్యు నవ్యయుని సౌమ్యుని సంసృతిరోగవైద్యు వి
స్ఫురదురుసంవిధాత్ము భవశోకము లార నుపాయమెందునే
నరయు దయామయుండు సకలాంతరుఁ డోముత నన్ను
నెప్పుఁడున్ 1

తే. ముజ్జగమ్ములఁ గన్నట్టి ముత్తయిదువ
వేదమయి మాయ నాఁజను వింతచెలువ
యెవని కిల్లాలొ యవ్వాని నెనయు భక్తి
మానసంబున నెంతు నామాయ దొలఁగ 2

తే. విఘ్నరా జని పేరొందు బిడ్డ నొకని
సురచమూనాథుఁ డనఁ జను సుతుని నొకని
కన్నతండ్రిని గొల్తు విఘ్నములు దొలఁగ
వీర్యవత్కార్యములఁ జేయు పెంపు గలుగ. 3

ఉ. ఏని ప్రసాదలేశలవ మింత లభించిన సర్వజంతుసం
తాన మనన్యలభ్యమగు స్థానముముక్తిని గాంచఁ గల్గు నె
వ్వాని కృపాకటాక్షములు వంధ్యములన్ బిరుదంబు నొందునో
దీనదయాపరున్ బరము దేవమణిన్ శివుఁ గొల్తు నిచ్చలున్. 4

సీ. ఏని లింగార్చనం బూని యా వ్యాసమ
హర్షి వేదవ్యాసుఁ డనగఁ బరగు
నేని యీక్షణ మాత్ర నీజగంబంతయు
జనియించి వర్ధిల్లి సమయుఁదుదిని
నేని తత్త్వము చిజ్జడానీకసాక్షియై
సర్వాంతరం బన జరుగు జగతి
నేని వేదాంతప్రశాంతవిచారులై
శాంతులై శిష్టులు గాంతు రెపుడు

గీ. అట్టి సచ్చిత్సుఖాత్ముఁ బరాత్మ స్వాత్మ
దేవదేవుని గొల్తు నేఁ బావనాత్మ
వాస్తవస్థితిఁ దెలియంగ వాంఛచేసి
పార్వతీపతికంటె నుపాస్యుఁడేడి? 5

వ. అణిమాండుండు నత్యుగ్రుండు నతిప్రసన్నుండు నారుణియు నారుణేయుండు, నారుణ్యుపనిషత్ప్రియుండు నాత్మవిద్యారతుండు నూర్ధ్వరేతుండు, నుమాభక్తుండు, నోంకారవల్లభుండును, కాలరూప, కాలమావి, కాలధర్మ విశారదులును, కైవల్యోపనిషత్పరుండును, క్లాంతక్లేశహరుండును, క్లీబుండును, గ్రాహ్యాయణస్తుత గ్రాహభంగపరాయణుండును, గ్రిష్మండును, జాబాల్యధ్యయనధ్వస్త పాపపంకుండును, బంకజసుందరుండును, బంకజారుణలోచనుండును, బంచాక్షరీప్రియుండును, బంచప్రస్థానహేతువును, బరముండును, బవిత్రుండును, బురాణుండును, బుణ్యకర్ముండును, బురుషార్థప్రవర్తకుండును, బ్రభుండును, బ్రమాణజ్ఞానవర్ధనుండును, బ్రాతస్నాయియును, బ్రహ్మవిద్యా రతుండును, బాష్కళాధ్యాయనరతుండును, భగవంతుండును, భగ్నపాపుండును, భవోద్భవభయాపహరుండును, భగ్నదర్పుండును, భవప్రీతుండును, భంగురాశుభుండును. మహాధీర, మహాప్రాజ్ఞ మహాబాహు, మహామైత్రాయణ, మహాధర్మ, మహాధీమన్మహాతేజులును, ముకుందముని శ్రేష్ఠులును, ముసలియు, మూలకారణుండును మైత్రాయణుండును, యాచకుండును, లుబ్ధలోలుపలోలలోచన లంబకర్ణ లంబపింగజటాధరలోకాక్షిత, నమోద్భూతలోకయాత్రాపరాయణులును, లింగసూక్తప్రియుండును, విరక్త విరజులును, విద్వత్ విద్వత్పాదపరాయణులును, విశ్వవిశ్వవద్, విశ్వధృత దృతులును, విశాలహృదయుండును, వేదవిద్ వేదవిన్ముఖ్య వేదపారాయణులును, వంశకాండుండును, శక్తి శక్తిమంతులును శతరుద్ర శతరుద్రియ భక్తిమంతులును, శనైశ్చరుండును, శత్రుమిత్రవివర్జితుండును, శాకలాధ్యయనరతుండును, శివ

సంకల్పభక్తుండును, శివసూక్తప్రవర్తకుండును, శ్రీమంతుండును, శ్రుతి
స్నేహియు, శ్వేతాశ్వతరప్రవర్తకుండును, సమచిత్త, సమగ్రీవ, సమలో
ష్టాశ్మకాంచనులును, సర్వజ్ఞు, సర్వవిత్, సర్వశాఖారతసర్వప్రాణహిత
రతులును, సుధియుసోమనాథప్రియుండును, సంగముండును, హర
భక్తహిరణ్యాక్షులును, అగ్నివరణజపావర్ణబంధూక కుసుమవర్ణులును,
నశ్వలాయనపుత్ర, జైగిషవ్యపుత్ర, శ్వేతాశ్వతరపుత్ర వత్సపుత్రు
లును, అంబికాచరణస్నేహుండు నీశపూజాపరాయ ణేశ్వరాంఘ్రిపరా
యణ, శైవపూజాపరాయణులును, శాకాశియు, ఫలమూలాశియు
మున్నగాఁగల డెబ్బదిరెండు వేల పన్నెండుగురు మునిసత్తములు
శమదమాదిగుణోత్తములు, భస్మోద్ధూళిత తనుభానుప్రభాజీర్ణఖిలదుస్త
ములు, రుద్రాక్షమాలాలంకరణవిరాజితులును, లలాటఫలార్పితత్రిపుండ్ర
రేఖాపరాజితకైరవిణీపతులును, నమితతేజోవిరాజమాన శివలింగార్చన
రతులును, లోకహితులును, గృపామతులును సత్రయాగార్ధ మరుదెంచి
పరస్పరప్రజ్ఞావిస్మయజనితశ్రద్ధోపేత చేతస్కులై పెద్దకాలం బన్యోన్య
సమాగమానందతత్పరులైరి. సత్రావసానమున వారు సభాసీనులై.
ముక్తిముక్త్యుపాయ. ముక్తిప్రద, ముక్తప్రదప్రదులం గూర్చి యన్యో
న్యము లోకహితార్థమై చర్చించి తృప్తిఁ గనకుండిరి.

గీ. తపముననె కాని యిటువంటి ధన్యకార్య
ములను సాధింప నెవ్వరి కలవి యగునె
యన్యు మతిసూక్ష్మతలనెంచి యభవుఁ గూర్చి
తప మొనర్చిరి మేరుభూ ధరమునందు. 7

కం. శివుని దయ గల్గనా వి
ర్భవ మయ్యెను వారి నడుమ వ్యాసాంతేవా
సివరుఁడు పౌరాణికచ
క్రవర్తి సూతుండు ధీవర ఖ్యాతుఁ డిటన్. 8

కం. కనువిప్పి సూతుఁ గనుఁగొని
మును లెల్లరు వేచి ముదము ముప్పిరిగొన నె

మ్మనములఁ దొట్రిలి కంఠం
బున డగ్గుత్తికయు నొదవఁ బులకలు మొలవన్. 9

గీ. స్వాంతము చెంగల్గు భక్తిపెంపెసఁగ దొరలఁ
బలుకు లొలికించి దండవత్ప్రణతి సలిపి
అర్ఘ్యపాద్యము లర్పించి యవల స్వాగ
తమ్ము వచియించి మార్గశ్రమమ్ము వోవ. 10

క. వివిధోపచారములు స
ల్పి వివేకం బొదవ ముక్తివిధము నుపాయం
పువిధము మోచకవిధమున్
వివరింపుము దత్ప్రదాతృవిధమని రొయ్యన్. 11

క. మీపలుకు లోకహితమై
యేపున్ గనుఁగాన మీకునే విన్నంతన్
దాపకి నుకువఁగఁ గడఁగుమఁ
దాపసవరులార! యని యత్తం డీయకొనెన్. 12

గీ. కృత్తివాసునకును దొల్తకేలు మోడ్చి
మహితు నా వ్యాసమునికి నమస్కరించి
వారలకు దండనతుఁ నుదారభక్తి
నొసఁగి మేనెల్లఁ బరవశమెసఁగ నతఁడు॥ 13

కం లోకహితం బూహించుచు
వాకొనగాఁ దొడఁగె మౌనివరులకు వారల్
శ్రీకరమిది యని నెమ్మది
నాకొనఁగాఁ దొడఁగి రట్టివొప్పదె యెపుడున్. 14

## 2. ముక్తిభేదకథనము

ఉ. అందఱునున్ వినుండు చెవులార మహామునులార చెప్పెదన్
ముందరి కొక్కనాఁడు హరిభూతములం గరుణింప నెంచి చ
క్కందన మొప్పు సొమ్ములను గ్రక్కున మైనిడి శంఖచక్రముల్
పొందుగఁ దాల్చి మేల్పసిడిపట్టము భాసిల వెండికొండకున్. 15

క. మునులుం గంధర్వులు ది
వ్యనికాయము దన్ను గొల్వ పయనంబయి యొ
య్యనఁ బర్వతరాజంబన
వినుతిశతము గాంచునట్టి విమలాచలమున్. 16

క. ఉత్తరకైలాసంబును
నత్తరి వీక్షించి యచటి యమలత లెల్లన్
చిత్తోన్నతి నీనఁగఁ గని
హత్తించెను మనసు దాని యందున మిగులన్. 17

క. మల యది సామాన్యంబే
యిల మనుజుఁ డొనర్చునట్టి యెంతటి యఘముల్
దలఁపున నది చొచ్చినపుడె
తొలఁగున్ మరిపుట్టుచావు దొలఁగున్ గాదే. 18

క. పలుబాములఁ బావనులై
మెలఁగిన శివభక్తపరులు మేదురలీలల్
వెలయఁగ గిరిసానువుల
నెలఁగుచు దపమున్ బొనర్చి నెగడుదు రచటన్. 19

కం. వేదాధ్వము విడుచు నరుల్
వేదమ్ములఁ దెగడు నట్టి వెంగలులును దే
వాదులఁ దిట్టెడి వారున్
పాదమ్మటు పెట్ట లేరు పండితులారా! 20

కం. రమణీయతలకు నాకై
లము బుట్టినయిల్లు కల్ప లతలివియో నా
భ్రమకారణములు నగు ను
త్తమకుసుమపత్రికరలతలు దైవారి యటన్. 21

కం. మూర్తిత్రయమేనులసత్
కీర్తిమదాచార్యవరుఁడు గిరిరాజమునన్
వర్తిలు మాహాత్మ్యంబును
నేర్తుమె కీర్తింప విబుధ నికరములారా. 22

కం లోకేశ్వరుఁడయ్యున్ హరి
యా కైలాసాద్రిఁజేరి యచ్చట దీక్షన్
లోకము లచ్చెరు వందఁగ
గైకొని మూఁడేండ్లు తపముఁ గావించె వెసన్. 23

సీ. సర్వాంతరుండును సర్వజ్ఞుఁడున్ సర్వ
విదుఁ డయి యెవ్వాఁడు వెలయువాఁడు
చెలఁగి లోకముల సృష్టించి పెంచియు ద్రుంచి
క్రీడల నెవ్వాఁడు కెరలువాఁడు
ముమ్మూర్తులును నొక్కఁడిమ్ముగా దానయి
వ్యాపించి యెవ్వాఁడు వఱలువాఁడు
సర్వలోకాధార నిర్వాహకుండయి
గర్వ మెవ్వాఁడింతఁ గననివాఁడు

గీ. దేవతాపతి పరమాత్మ భావుఁ డక్ష
రుండు మునిజనహృదయ సేవ్యుం డనంతుఁ
డభవుఁడు శివుండు పార్వతీహస్తకిసల
యంబు చేఁబట్టి ప్రత్యక్షమయ్యె నచటఁ 24

క. త్ర్యక్షుఁడు పద్మాక్షి! యే
నిక్షేపముఁగోరి తపము నీవిచ్చటని
ట్లక్షయ్యమ్ముగఁ జేయుదు
విక్షేపము లేక యంచు వెసఁబలుకాడెన్॥ 25

క. సంతోషించితి నయ్యా య
నంతా నీభక్తి కెంతొ నాభక్తుఁడొగిన్
స్వాంతమునఁ గోరఁ బడయని
దింతయు లేదయ్యాయని వచించెను గృపతో॥ 26

క. పిమ్మటఁ బ్రిదక్షిణమ్ముల
నిమ్ముగ నొనరించి బత్తి యెదఁ గుదరగ నే
మమ్మున దండప్రణతుల
ముమ్మారొనరించి మేనఁ బులకలు నిండన్. 27

క. హరి విన్నప మొనరించెను
హర యీశ జగన్నివాస యచలావాసా!
పరమదయానిధి యభవా!
వరసురవాణీలరత్న భాస్వద్గ్రీవా! 28

క. నిను జూచినంత నేనో
మన మేమరెనిన్ను దక్క మఱి యితరములన్
నినుగనజననంబందెడి
ఘనమోదామృతము జుఱ్ఱఁగఱ్ఱున ద్రేన్చున్. 29

క. నను నీవు బల్కరించిన
యనుపమకారుణ్యమునకు నంజలి గూర్తున్
వినువాకొదలఁదాల్పా!
విను వాకొనువాఁడ నాదు విన్నప మొండున్॥ 30

మ. నెలవీయంగదె దేవదేవగిరిజా చిత్తాబ్జమాధుర్యలు
బ్ధలసత్షట్పదభావముక్తిగతి సొపాయమ్ముగా మోచకున్
లలి మోక్షప్రదదేశికోత్తముని జాడంబింతయున్ లేక ని
ర్మల మీజ్ఞానము బోధసెయఁ గదవే మౌనీంద్రరక్షామణీ! 31

క. యోగీశ్వరేశ్వరా! నా
యోగము బాగుండెఁగాన యోగ్యతమార్గం
బై గురుశుభముల నిడు నీ
యాగమ మిది నాకు లబ్ధమయ్యెఁ బరేశా॥ 32

వ. అయ్యెడ 33

చ. అడిగెడి వాఁడు వెన్నుఁడుగదా! యగజాసుత యంచు వెన్నెలన్
పుడికెడి లేఁత నవ్వు మొగమున్ దళుకీనగఁ జేయఁ జాయ బల్
పడఁతుల మేలుబంతి ముఖపద్మము పై పున కొక్కసారి య
య్యుడుపతిశేఖరుండు ప్రియమొప్పఁగ నారసి పల్కె వేడుకన్ 3.

చ. అడిగితివయ్య! లోకహితమాదరణంబు నొనర్చి యిప్పుడీ
వడిగినదెల్ల లోకశుభమయ్యెడు ప్రశ్నయు మంగళప్రదం

బడిగినవాఁడవై తి పరగమార్థము సర్వజగద్ధితమ్ముగా
నుడివెద సాదరంబున విగనూత్నసుధామధురోక్తిసూక్తులన్ 3౫

వ. ఉపాసనాయత్తములగు ముక్తులు నలువిధములు తత్తద్దేవతా
రాధనతారతమ్యముల ననుసరించి తత్తద్దేవతాసాలోక్య, సామీప్య
సారూప్య, సాయుజ్యముక్తులు తత్తదుపాసకులకు లభ్యములగు
వానిలో నుత్తమము కడమది. ఆ నాలుగు ప్రతీకోపాసనలయ్యు
మొదటి మూఁడు నుపాస్యోపాసక భేదాధారములు, నాల్గవది
యహంగ్రహోపాసనోధారము. ఈనాలుగుఁ గర్మఫల భూత
ములు కేవల బ్రహ్మాత్మరూపముక్తి సర్వదా సిద్ధము సుఖదుఃఖాది
ద్వంద్వవర్జితము. "జాయతే అస్తి విపరిణమతే వివర్ధతే అప
క్షీయత నశ్యతి" అను షడ్భావవికారముల నొందక హేయోపా
దేయసంజ్ఞల కందక సంవిద్రూపమును మాత్రము గాంచి యన
న్యాశ్రియమయి, నిత్యానందసంధాయకమయి, స్వయంజ్యోతిష్ట్వ
విరాజితమయి, వాచ్యవాచకలక్ష్యలక్షణసంబంధదూరంబయి, సర్వ
జీవాత్మభూతమునయి, యపాస్తావరణ విక్షేపాత్మకాజ్ఞానంబయి
దూరీకృతప్రతిబంధమ్మయి అదృశ్యాత్రావ్యానోపాద్యాతి సంయుత
విశేషణమ్ముల కాలవాలమ్మయి, విశుద్ధముక్తి యొప్పారు. అవి
చారదశలయందు మాయావృతమయి భగవదాదిరూపముల నా
ముక్తి దోఁచునది పరమముక్తి తక్కు ముక్తుల పరముక్తులు.
3౬

క. పరిశుద్ధహృదయనీరే
జరహితులకు నపరముక్తిగసక్తి యలవడున్
పరిశుద్ధహృదయపంకజ
సరసులకును బరమముక్తిగసక్తి యలవడున్. 37

క. పరిశుద్ధచిత్తమొక్కటి
వలవినమాత్రిన ఁగలదెగపరమోక్షం బె
వ్వరికైన నాయనుగ్రహ
పరిపూర్ణత గల్గకున్నగపంకజనాభా॥ 3౮

ఆ.వె. ఎవఁడనిత్యముక్తి కెదఁగోరి చరియించు
నతని కెట్టు లబ్బు నాగమైక
మార్గగమనశీల మద్భక్త జనలభ్య
నిత్యముక్తి యింత నిజము సుమ్ము. 39

కం. ఏయెడ జీవపరాత్మల
సాయుజ్యము గల్గ నదియె సాగున్ జగతిన్
శ్రేయంబనఁ దత్ప్రాప్తి కు
పాయమ్ము నివృత్తిరూప పరమవ్రతమౌ॥ 40

క. అజ్ఞాననాశనమ్మున
సుజ్ఞానికి నద్వయైక్య శుద్ధి యొదవు భే
దజ్ఞానికి ద్వయభావమ
భిజ్ఞానము సుమ్ము యెఱుఁగ వే! గోవిందా! 41

గీ. చిత్తమందున మోక్షంబు సిద్ధమనుచు
సాధ్య మెన్నరు గాదంచు సత్య మైన
జ్ఞాన మేనికిఁగల్గు నా జ్ఞానమాన్యుఁ
డేన యగుటకు వింతయుఁ జింత లేదు. 42

వ. మాయావస్థలు మూఁడు. అందు మొదటిది దృశ్యమాన ప్రపంచము నందు వాస్తవత్వబుద్ధి యగు. అది యాత్మానాత్మవివేకమున శాస్త్రజన్యజ్ఞానమునఁ దొలఁగు. తొలి యవస్థ నిరస్తమైనను సాభినివేశవ్యవహారహేతువు. రెండవ యవస్థ యగునది తత్వసాక్షాత్కారమున నివృత్తమగు. వ్యవహారము రూపరినను దేహావభాసజగదవభాసమాత్రమయి దేహము, జగము వ్యవహారయోగ్యము కాకుండు నది మూఁడవ యవస్థ. అది ప్రారబ్ధకర్మాంతము వఱకుఁ గలుగు దేహానవభాస జగదనవభాస రూపమైన జ్ఞానము ప్రారబ్ధకర్మావసానమున గలుగు. ప్రారబ్ధకర్మాంతము వఱకు జీవన్ముక్తి యనియుఁ దదనంతరమున విదేహముక్తి యనియుఁ బూర్వోదాహృత తృతీయతురీయావస్థలు వ్యవహరింపఁబడుచున్నవి. మూఁడవ యవస్థలో దగ్ధపటము, పటా

కారము మాత్రము గలిగి పటకార్యములగు ప్రావరణాదుల కుప యోగము కానటుల జగదాదు లవభాసనమాత్రమయి వ్యవహార క్షమములు కాకయుండు నని వేదాంతసిద్ధాంతము. 43

కం. ప్రారబ్ధకర్మ మెన్నం
డారదు భోగమునఁగాక యన్యవిధానమునన్
నేఁరడు జీవన్ముక్తుఁడు
ప్రారబ్ధము ద్రోసిపుచ్చఁ బద్మదళాక్షా!

క. ప్రారబ్ధము క్షీణించిన
కారణమున (గలుగు. నీజగత్ప్రతిభాసాం
కూరవినాశం బెవనికి
నారయముక్తుండు వాఁడె యగుఁజుమి కృష్ణా! 45

మ. కలలోఁ జూచిన వస్తువుల్ వలెను జాగ్రద్దృశ్యసంఘాత మొ
క్కఁ లవంబెంచ నసత్యమౌ ననుచు నిక్కంబెంచు జానాధికుం
డిల ముక్తుండని చెప్పవచ్చు నటుగాకింతేని యవ్వాని చూ
చి లసద్వాస్తవ మంచు నెంచు జనునిన్ శ్రేయంబుచేవట్టునే. 46

గీ. బద్ధుఁడున్ వేడు మోక్షార్తి బంధముక్తి
వాస్తవమ్ముగ లేదని భావ మందు
తెలియు నాతఁడె ముక్తుఁడౌ తెలియ నియ్యె
దగును జ్ఞానంబు వారికి న్యాధినాథ!

క. ఈ విధమున నాత్మ నెదని
భావింపంగల మహానుభావుఁడు సంచిత్
పావనుఁడు జ్ఞాని యగు మా
యావృతుఁ డితరుండు జ్ఞాని యగునే యెందున్? 48

కం. ఏవంవిధుఁడీ యాత్మం
ద్వైవర్తులు నంచుఁ దలఁచునతఁడొక మూర్ఖుం
డై వెతఁ బడు నాత్మవిధం
బీ వెఱవని తెలుప నలవియే నాకు హరీ! 49

గీ. మనకు "యస్యామతం తస్యమత" మనియెడు
తలవకారోపనిషదుక్తి గలుగుఁగాన
తెలిసె బ్రహ్మంబు నాకని పలుకఁ దగదు
తెలియ దది బ్రహ్మమనుచును పలుకఁ దగదు. 50

కం. సూత్రింపఁగ ముక్తిని లప
మాత్రంబును నాకు నిగమ మంత్రంబులకున్
చిత్రము స్వానుభవమునకు
బాత్రిత లొప్పార వనెడు పలుకు నిజంబే? 51

గీ. నిష్ప్రకారకమగు ముక్తి నిత్యముక్తి
నిర్ణయింపఁగ నిటులంచు నేర్పఁ డెవ్వఁ
డిట్టి లిట్టని ముక్తిని బట్టి పలుకు
వాఁడు లేఁడని నుడువుదు వారిజాక్ష. 52

గీ. ముక్తి రీతులఁ బల్కంగఁ బోలు నొక్క
అడుగువాఁ డెంత వెఱ్ఱివాఁ డైనఁగాని
చెప్పువానికిఁ బెదవె త్తి చెప్ప నగునె
మౌన మూనుటయే యగు మంచి పలుకు. 53

క. నుడివితి శ్రద్ధన్ ముక్తిన్
కడు శ్రద్ధను వింటి వీవు కమలాపతి! య
య్యెడు శశ్వచ్ఛ్రేయమ్మొ
యెడనైనన్ దీనిఁ దెలియు నేరికి నైనన్. 54

క. అని శివుఁడన గిరిజాసహి
తుని శివు మున్ముగ్గు చుట్టి తోరపు బత్తిన్
గని తిరిగి యమలదండ
ప్రణతుల నర్పించి పూజ భక్తి నొనర్చెన్. 55

### 3. ముక్త్యుపాయ కథనము

వ. మఱియు నీశ్వరుండు ముక్త్యుపాయము గరుడగమనున కుపన్య
సింపఁ దొడఁగె. 56

క. వేదాంతమహావాక్య
ప్రాదుర్భవదీర్ఘబోధ శమ్యజ్ఞానా
పాదితము ముక్తి కర్మా
పాదిత మెన్నండు గాదు కల్పశతములకున్ 57

వ. "తత్వమస్యా"ది మహావాక్యార్థసమ్యజ్జ్ఞానధారణమువలనఁ గలుగు మనోవృత్తి యందు బ్రహ్మవిచారము కార్యము, బ్రహ్మవిషయకజ్ఞానము బ్రహ్మమందు లీన మగుతరి సనాత్మవిషయకజ్ఞాన మంతరించు. ద్వైతమంతయు రూపు మాయు. ద్వైతవస్తునాశమునఁ బుణ్యాపుణ్యమతియుఁ దన్నాశమున రాగద్వేషనాశమును, దన్నాశమున ధర్మాధర్మనాశమును, దన్నాశమున విషయేంద్రియనాశమును సంభవించును. ఘటాజ్ఞానము, ఘటజ్ఞానమునను, రజ్జ్వజ్ఞానము రజ్జుజ్ఞానము వలనను నశించు నటు లాత్మజ్ఞానము వలన నాత్మాజ్ఞానము నశించు. అదియే సంసారనాశము. ఆరోపితసర్పాంశ మిదమంశమగు నది విచారించిన దాని వాస్తవము రజ్జ్వాదియగు. ఆరోపితసంసార మిదమంశమగు నది విచారించిన దాని వాస్తవము బ్రహ్మోఽనన్యము. క్రియా కర్తృత్వకారకత్వాద్యంశముల జ్ఞానకార్యములు కర్మమజ్ఞానమునకు విరోధికాదు. కాని కర్మము ముక్తిహేతువుం గాదు. ముక్తి కర్మసాధ్యమైనచోఁ గర్మసాధ్యములైన స్వర్గాదులవలె ముక్తియు నశ్యంబ యగు. కాన కల్పకోటిశతములకైనఁ గర్మమున ముక్తి కలుగదు. కర్మము బాహ్యము నాంతరము నన నిరుతెఱఁగులు. అందు వాచిక కాయిక కర్మములు బాహ్యములు. మానసికకర్మ మాంతరమ్మును నగు "సర్వం ఖల్విదం బ్రహ్మ" యని మానసిక కర్మ మాచరించిన సమ్యజ్ఞాన సంపన్నుండగు. 58

ఉ. క్రొన్నెలదాల్పు వేల్పు వలికొండలరాయలముద్దుపట్టి మే
నన్నెటివంటమై వలపుకానంబలెఁ బ్రోచెడు బ్రోడ బొమ్మయున్

వెన్నుఁడునుఁ మహేశ్వరుఁడు నిచ్చలు గొల్చెడి దైవతంబు ధీ
మన్నికరైకసేవ్యుఁడు విశుద్ధుఁడు మౌనిమనోబ్జభానుఁడౌ 59

క. తన్మూర్తి నుపాసించిన
చిన్మాత్రవిజ్ఞాన మొదవి చిక్కక మాయన్
జన్మం బెన్నఁడు గనకయు
మున్మయుఁడై యలరుఁ గాదె మురవిద్వేషీ! 60

వ. గుణమూర్తుల లోనొకనిగాఁ గలుషచిత్తుండై శివునారాధించి శివసారూప్యము నొంది తద్భోగానంతరమునఁ గ్రమముక్తి నొందు శివు సపరమూర్తిగా నారాధించు వారికి శివసామీప్యముక్తి జనించు. శివజ్ఞానమువలన శివసాయుజ్యము లభించు. అత్యంత పరమశివమూర్తి ధ్యానమున రుద్రసాలోక్యము గలుగు. శివవిద్య వలన శివసారూప్యసాయుజ్యము లుదయించు. శివవిద్యాగరిష్ఠుండు తత్తల్లోకంబులం గల సుఖము లనుభవించి, విష్ణులోకాదుల సేవించి భూతలమున నతిపవిత్రవిప్రకులమ్మునఁ బుట్టువు గాంచు. అటులనే నిన్ను నిర్గుణుగా నారాధించు శుద్ధచిత్తుఁడు నిన్నుగాని నన్నుగాని చేరి భోగము లనుభవించి, క్రమముక్తుఁడగు. నిర్మలచిత్తుఁడు గానివాఁడు విష్ణుసారూప్య, సాలోక్య, సామీప్యముల చిత్తకాలుష్యతారతమ్యముల ననుసరించి, క్రమముక్తిఁ బొందును. అటులనే బ్రహ్మాదిమూర్తిమద్దైవతముల నారాధించినవాఁడు. తత్తత్సారూప్య, సాలోక్య, సామీప్య, సాయుజ్యము లొందును. 61

మ. ఎవఁడెదేవునికిన్ సపర్యలను నెంచదే బాహ్యకర్మంబుచే
మివులన్ బత్తి నొనర్చువాఁడు గనుఁ జుమ్మీ కొంతకాలమ్మునన్
ధృవమౌ జ్ఞానము దాన మోక్షరమ నొందున్ గావునన్ బాహ్యక
ర్మవిధారాధన మంగమౌ సుమః రమాప్రాణప్రియా ముక్తికిన్ 62

తే.గీ కాంత లాత్మేశు భక్తి నేకాంతసేవ
సల్పి యవ్వానిరంజించి సరిగ కైవ

సమ్మ నొనరించు కొనుసల్లునెమ్మి భక్తి
లాంతరంగిక సేవ (బ్రియం)బు గూర్తు. 63

క. ఈశ నివాసము లనఁ దగు
కాశీప్రభృతులను మరణకాలంబున ల
క్ష్మీశా! తనువున్ విడ భవ
పాశమ్ముల నుడుగు జ్ఞానవై భవ మొదవున్. 64

క. పదిరెండువేల సారులు
మదిఁ బంచాక్షరిని బ్రణవమహితమ్ముగ భ
క్తిఁదగన్ జపియించిన యెడద
సదమలవిజ్ఞాన మొదవుజనులకు ననఘా. 65

క. అవ్వలి జన్మంబందున
నవ్వానికి నాయనుగ్రహమ్మున మివులన్
నివ్వటిలును మజ్ఞానం
బివ్విధము క్తికి నిధానమెల్ల రకు హరీ! 66

క. శతరుద్రీయము బత్తిన్
బ్రతిదినము జపించు నెవఁడువానికి నిమ్మేన్
బతితమయిన వెన్కను న
న్నుతమగు జ్ఞానంబు గలుగునమున్ ముక్తియగున్ 67

క. జ్ఞానప్రదకార్యమ్ముల
నే నుడివితిఁ జక్రపాణీ! యింత యుఁజరితం
బేనికి నింద్యంబగు న
వ్వానికి నవి గల్గునే? లవంబును దలఁపన్. 68

క. పాపిష్ఠులకున్ శ్రద్ధా
రూపల్పవజ్ఞానశూన్యరోగా ర్తులకున్
నాపుణ్యక్షేత్రంబుల
ప్రాపుల్ మోక్షం బొసంగువనజాతాక్షా! 69

వ. అందున కొక్క గాథయుం గలదు. 70

క. సునిశితకుసుమాస్త్రాంబుల
కును నోర్వక నంతరంగకోలాహలుఁడై
తన మేను గరచుకొని తిరు
గు నొకం డతనికినిఁ బేరు కోలాహలుఁడౌ. 71

కం. మదనోన్మాదంబది దన
మది కెక్కఁగఁ దండ్రిఁ జంపి మాతన్ బల్మిన్
గదిసి రమియించె వాఁడొ
క్కదినంబునఁ దనమ ముందు గతిఁ దలఁపఁ డొగిన్. 72

కం. తుద కాతఁడు వేదార
ణ్యాదేశమున నిల్వ మరణ మబ్బె నతనికి
య్యది కారణముగ జ్ఞానం
బుదయించెను దాన ముక్తి యును జేకూరెన్. 73

కం. కావునఁ బద్మాక్షి! మో
క్షావిదితెచ్ఛాపరివర్త నాధికులకుఁ బు
ణ్యావాసము లగుఁగాదే
శైవక్షేత్రములు ముక్తి జనకము లవియౌన్. 74

వ. అని యీశ్వరుండానతిచ్చిన హరి దేవా! తన్మాహాత్మ్యం బెఱుక
వడఁ దెలపవె యని వెడఁ బ్రౌఢతనపు జాడల నాతఁ డిటులాడఁ
దొడంగె. ఇది మోక్షప్రదంబు. దీని శక్తి ద్దమెయి నాలకించునది.
శ్రీమద్వాల్మీకమనుమత్పుణ్యస్థలంబు జగత్ప్రసిద్ధంబు దానికి
దక్షిణమున, నకూపారతీరమునందు మద్భక్తబృందమండితం
బగు నొక్క దివ్యస్థలంబు గలదు. ప్రళయారంభమున సర్వము
విలయమొంద నిగమములు మాత్రము నాయందు సంస్కార
రూపమున నిలయము గొన నవ్వానిం గల్పారంభంబున లోక
హితం బూహించి యెచ్చోట నేబొచ్చెము లేక నేనవానిఁ గ్రమ్మర
యథారూపముగ వెలువరించితి. అమ్మహనీయపుణ్యస్థల మప్పటి
నుండియు వేదారణ్యమ్మనఁ బ్రసిద్ధమై యుండు. దాని పొడవును
వెడల్పును నర్ధయోజనమును పాదయోజనమును నగు. తొలి

జీవులు భానువారమునను బర్వవారములను దత్తీర్థస్నాన మాచ
రించి వేదారణ్యాధిపతి నారాధించి తత్ప్రసాదము వలన మహ
త్తరపదవులఁ బడయఁ గలిగిరి.

సీ. ఇచట మజ్జన మాడి యీదేవుఁ బూజించి
తారకుం గెల్చె గుమారుఁ డిచట
దోఁగి యీసామికి వోసిలిం బట్టు స
నత్కుమారుని యొద్ద నారదుండు
సంసారమారక జ్ఞానానుసంధాన
పరుఁ డయ్యె మునీ యాజ్ఞవల్క్యుఁ డిచట
స్నానంబు చేసి యీస్వామి సేవ యొనర్చి
జ్ఞానసంపన్నుఁడై ఘనత కెక్కె

తే.గీ. పర్వముల గ్రుంకి యిచ్చటఁ బరమశివుని
కెరఁగి జ్ఞానమ్ము మోక్షమ్ము నెలమిఁ దత్ప్ర
సాదమునఁ బొందఁ గలిగిరి సరగ గార్గి
యల్ల మైత్రేయి యున్ మున్ను హరి యెఱుంగు. 76

సీ. ఇచ్చట నీరాడి యీశు ముమ్మఱు వల
గొని శ్వేతకేతుండు కూర్మి తండ్రి
యుద్దాలకుని యొద్ద నొగి జ్ఞానముం గొనె
నీతీర్థమున ముని యీశ్వరునకుఁ
త్రిప్రదక్షిణములు తీర్థయాత్రి జ్ఞాన
పూతుఁడై వరుణుండు పుణ్యుఁ డయ్యె
నతని పుత్రుఁడు భృగు వలరి యిందున తీర్థ
మాడి యీదేవున కంజలి నిడి

తే.గీ. యయ్యె బోధింప జ్ఞానియై యవని నెగడె
యీజలంబుల జొచ్చి పరేశు నిచట
దండనతులను మెప్పించి తత్ప్రసాద
మునఁ ద్రిశంకుఁడు జ్ఞానియై యనఘుఁ డయ్యె. 77

శా. వేలున్వేలు మెలంగువారు గద యీక్షేత్రం గడున్ బత్తిఁబూ
జాలంకార మొసంగి యింటఁగల తీర్థాంబుప్రకాండంబులన్
జాలన్ మజ్జన మాడి శంభుని కటాక్షస్ఫూర్తి దైవార న
న్యాలభ్యంబగు జ్ఞాన మొందు వరమోక్షానందవిభ్రాజితుల్. 78

స. పుడమి నిచ్చట దానమిడిన పుణ్యాత్ముండు
శంభుసాలోక్యం బెసంగఁగనును
ధనధాన్యముల నిటధార వోసెడి దాత
కగును గౌబేరతుల్యధనవితతి
ఇచ్చోట నన్నంబు మెచ్చి యొసంగెడు
వానికి నారోగ్యము నిరతము
తిలదాన మియ్యెడ సలుపు మహానుభా
వుని పాపసంచయంబులు నశించు

తే.గీ. కన్నె నిచ్చి యెవండైన ఘనుఁ డొకండు
యోగ్యునకు నీస్థలిని ముదమొప్పఁ బెండ్లి
సేయ నద్దాన వాఁడు ప్రాలేయశైల
రాట్సుతాలోక మందుఁ జిరంబు మెలఁగు. 79

క. వలువల నీతీర్థంబున
జెలఁగుచుఁ బలువితరణమ్ము జేయు ఘనుననుజ్ఞా
వొలుపారు సౌర పతిని
స్థలసంపదలెన్ని యేని తోయజనేత్రా! 80

వ. మఱియు విషువత్పుణ్యకాలములందు సూర్యేందుగ్రహణసమయ
ములందు, వ్యతిపాత వేళలయందుఁ, బర్వతిథులయందు నిప్పుణ్య
తీర్థవరేణ్యంబునం దెవఁడేని స్నాన మాచరించి, సాష్టాంగదండ
ప్రణామముల ద్దేవున కర్పించి, ప్రదీప మావేలుపునకు నివేదించి,
యుపవసించి, యొక్క నిష్కామైన నిచట శివయోగి కిడినవాఁడు
తప్పక ముక్తుండగును. మంచిముహూర్తంబున నామూర్తి
సందర్శించి యొక్క పణమైన శివయోగి కిడువాఁడు బ్రహ్మ
హత్యాదిమహాపాపవిముక్తుం డగును. ఇచట వసియించి మఱి

ణించువాఁడు మోక్షము గాంచు ఇచట నివసించు వాఁడు వ్యాధి రహితుండగు. 1

క. నేనును మద్దేవియు భ
క్తానీకము దీనిఁగొల్చి యలరుదు మొగి నీ
స్థానము భుక్తిన్ ముక్తిన్
నేనొసఁగుందీని బొగడ నేరఁడెవండున్. ౮2

కం. నుడివితి మోక్షోపాయము
గడితపుఁ బ్రాఁబల్కులందు గల పారంబీ
యెడ నీవు శ్రద్ధఁ వింటివి
యిడకుమ యిద్దాని భక్తిహీనుల కెపుడున్. 83

కం. శివుఁ డిటులుపన్యసించిన
చెవులారన్ విన్న శౌరి చెలఁగుచు గిరిజా
ధవునకుఁ బ్రణమిల్లుచు భ
క్తివశంవదుయి మోదజలధిఁ దేలుచు నుండెన్.  84

4. మోచక కథనము

వ. మఱియు శంకరుండు మురహరునకు మోచకప్రశంస యిట్లు లొనర్చె. 85

సి. అక్షరామ్నాయదివ్యాత్మస్వరూపమై
సకలవిద్యాలయా సంజ్ఞఁ దనరి
కుందేందుహిమబృందకోమలాకారమై
చెవులఁ గమ్మలజోడు చవుకలింప
మున్జేత కంకణాల్ మురువులు గురియంగ
చిరునగ వానన సీమ వెలయ
జాబిల్లి నునురేక సొరౌదలను మీరఁ
గడు శిరోజంబుల జడలు గట్టి
తే గీ. తోరపుం గప్పురం గుగుత్తుకనుఁ దనర
మూఁడుగన్నులు గొదలేని మురువుఁ గూర్ప

సర్వలక్షణసౌందర్యశాలిని యయి
పుండరీకాసనమ్మునఁ బొల్పు గనుచు. 83

తే.గి. జానుగాఁ బట్టి యొకచేత జ్ఞానముద్రి
నమరగాఁ జేసి యొకచేత నక్షమాల
మండనంబుగ నొకచేఁ గమండలు విడి
పొత్తముల నొక్కచెతసు హత్తనుంచి 87

కం. మునిజనములు గంధర్వులు
ననిమిష లసురులును జుట్టు నలరుచుఁ దన్నున్
వినతులు సల్పుచుఁ గొల్వఁగ
వనజాసను రాణి వాణి వైభవ మెసఁగన్. ౬8

చ. చదువులరాణి యయ్యె నెద సందియ మింతయుఁ దీరకుంట స్వీ
యదయితు పజ్జఁ జేరి ప్రియు యాదట మోదకుఁ జెప్పి ప్రోవు మీ
వు దయ దయానిధీ! యనుచు బోఁడిమి వేడిన నీతి నాతఁడిం
పు దళుకు లొత్తు చిర్నగవు మోమునఁ బల్నగయై చరింపఁగాన్. 89

చ. చదువులసాని నీవఖిల శాస్త్రము లెల్లఁ బఠించినావు నీ
కిది యెఱుగంగ రాదనుచు నెవ్వరు నమ్మరు దింతి ఛాందసుం
డిది నుడువంగలాఁడె యని యెంచి వచింతువొ నీదు ప్రశ్నమే
యదనున నీవు బల్కవుగ దాముదితా యిటు లింతవట్టుకున్. 90

చ. విదితవచోవిహారచణ విశ్రుతకీర్తిని నేన యంచు నె
మ్మది తలపోసి నీవిటుల మానిని భర్తను గేలిసేయ నీ
కుఁదగును బొత్తములఁ జదువు కొన్న చెలుల్ మగవాని నొక్కటె
క్క దయను గాంతురే యనుచు గాంతను గన్గొని బల్కె
వింతలన్. 91

వ. అంత నయ్యింతి నిజకాంతు మొగం బవలోకించి యదితన్ను గేలి
చేయుటగా గ్రహించి. 92

గీ. వేల్పుగములను లెక్కింపఁ బెద్ద లీరు
నాల్గుమోముల దైవారు నలువ లీరు

పుట్టు మొదలుగ శాస్త్రాల గుట్టులన్ని
మొట్ట మొదలుగఁ జదివిన దిట్టలేరు. ౯౩

కం. మీరెట్లాడించిన న
ట్లూరక నేనాడుదాననుద్గ్రంథంబుల్
మీరల్ చదివించినచో
నేరక చదివితిని నాదు నేరమిది గదా? ౯౪

క. ధీమదభ్రచనలు పురుషుల
కే మానవతులకుఁ గాదు కీడౌ చదువం
గామము బోంట్లకు నంచౌక
నేమన్ను రచింపరైరి నిజముగ మీరల్. ౯౫

గీ. తొల్త చదువున గర్వమ్ము తోఁచుఁ గాని
చదువు చదువంగ గర్వలేశములు బోయి
పెద్దలం గన్న విద్వాంసు నొద్ద నున్న
యప్పు డెల్లప్పుడును వినయమ్ము గదుర. ౯౬

ఆ.వె. ఎన్ని జదువుకొన్న నేమగు మోక్షం బొ
సంగు వేల్పుఁ దెలియ జాలకున్న
చదువులన్ని సున్న సర్వమోక్షప్రదుఁ
గనని కట్టెఁడికిని కమలసూతి! ౯౭

శా. సారాచారవిచారు లీర లిఁక శశ్వన్మోదసంధాయకున్
కారుణ్యాంబుధి శంభు శర్వు నహిరాడ్గ్రైవేయునిం గొల్చి బం
ధారణ్యైకదవానలాయితకటాక్షశ్రీప్రభావంబునన్
ధీరాహిత్యపదంబు ముక్తిపదమిం దేగైకొనన్ గోరెదన్ ౯౮

క. ఏదెని గోర్కె యొసవ మ
హాదేవున్ గొలువ మీకునది యమరుఁ జూడీ
సాదరబుద్ధిన్ దైవత
మై వతమున్ గొల్వఁడింక ధన్యు లగుటకున్. ౯౯

క. అని పల్కిన సూతునకున్
వినయప్రణయంబు లెసఁగ విప్రశ్రేష్ఠుల్

ఘనభక్తిం బూజల నిడి
మన మలరంగఁ జేసి రట్టిమాన్యులు గలరే? 100

5. మోచకపద్ధతి కథనము.

వ. అనంతరంబ పౌరాణికరత్నంబు బిట్లానతిచ్చెఁబదంపడి రమా జానితో నుమాజాని పలికిన సల్లాపవిధానంబు వినుఁడు. ముకుందా! మోచకపద్ధతి నన గురువు. ఉత్తమాధమమధ్యములన గురువులు బ్రాహ్మణవైశ్యక్షత్రియులు ముత్తెఱఁగులు. స్త్రీశూద్రులెవ్విధము నను గురువులగుట యొప్పదు. త్రివిధగురువులలో నుత్తరోత్త రులు తదవరజులకును, శూద్రులకు నొజ్జలగుట సమ్మతము. అవర జులుగూడ విద్యోత్కర్షబలమున నుత్తరులకుగురుత్వంబు నెరప వచ్చు నని కొందఱందురు. మరియు నాశ్రమభేదము ననుసరించి చతురాశ్రమవాసులును నతివర్ణాశ్రమియుననఁ గురువు లైదు విధము లగుదురు. పూర్వపూర్వుల కన్న నుత్తరోత్తరులు మిన్నలు. మొదటి నలువురిలోఁ బ్రహ్మచారి తక్క ముువ్వరకును, గేస్తులు తక్క తదుత్తరులగునిర్వురకు వానప్రస్థుఁడు తక్క తదుత్తరుఁడగు నొక్కనికిని విద్యాధికుఁడైన యెడల గురు స్థానాధికారియగును అతివర్ణాశ్రమియు నేను సములము. నావలె నతఁడౌరులకు శిష్యుఁడుగా సర్వాశ్రములకు గురుపదుం డగు అతఁడు పరమగురువు తత్సమాధికులు గల్గరు. 101

సీ. కాయకారణకర్మకఘను సర్వసాక్షి ను
ఖాత్మ, నాత్మ, నెఱుంగునట్టివాఁడు
జాగ్రదాదివ్యవస్థారహితోన్నతు
నన్నుఁ దానని గనుఁగొన్నవాఁడు
అరయ జ్ఞానస్వరూపాత్మనియం దాశ్ర
మాదులు కల్పితమ్మనెడివాఁడు
నిను పజ్జవలెను జేష్టించును లోకంబు
తనపజ్జ నని యెఱుఁగఁదలఁచువాఁడు

తే.గీ. హారకేయూరముద్రికాద్యఖిలభూష
ణములు బంగారునుం బలెనామరూప

మాత్రభిన్నము జగము చిన్మాత్రమనంచు
ననుచు సకలంబు తానని యలరువాఁడు. 102

సీ. ముత్తె మందున వెండిఁ బోలి ముజ్జగములును
భ్రాంతి దృష్టంబని పలుకువాఁడు
చండాలపశ్వాదిసకలమందున నింగి
వలెఁ దాన గలఁడని చెలఁగువాఁడు
దెస లసత్యములని తెలియు వానికి దెసల్
భంగి జగము దోఁచ వలుకువాఁడు
కలయందువలెను జాగ్రత్ప్రపంచము తన
యందుఁ గల్పితమని యరయు వాఁడు

తే.గీ బ్రహ్మచర్యాదులేగాను బ్రాహ్మణాదు
లేనుగా నల బ్రహ్మంబ నేన యనుచు
సంతతంబును నెంచుచు సంతసించు
బ్రహ్మనిష్ఠత నొప్పారి ప్రబలువాఁడు. 10

క శ్రుతుల శాస్త్రములగా స
మ్మతింప నవ్వాఁడు సర్వమాన్యుం డగుచున్
క్షితిఁ జేయుఁ బ్రతిష్ఠయుఁ గను
నతఁడే పూజ్యుండు గల్గ రతనికిఁ బూజ్యుల్. 11

సీ. అగుదు నా దేహంబ నగుదునా యింద్రియ
బగుదునా ప్రాణంబ నరయ సుంత
నగుదు నాచిత్తం బహంకారమగుదునా
యగుదు నాబుద్ధినే నరయ సుంత
నగుదు నామానసం బగుదు నాప్రకృతినే
నగుదు నాభూతంబు లరయ సుంత
నగుదు నాకర్తయు నగుదు నాభోక్తయు
నగుదు నాకారకుఁ డరయ సుంత

తే.గీ. కేవలము సచ్చిదానంద భావుఁడైన
నాకు సంబంధ మిసుమంత లేక యున్న

నగును సంసారభావమహంకృతి మెయి
జలము చలియింప రవికగుచలన మట్లు 105

క. అన్యాదృశయత్నాశ్రమవ
ర్ణ న్యాయము లాత్మ నందునన్ జూచుట సా
మాన్యభ్రాంతిని నియ్యది
ధన్యులకుం గాక తెలియదగ దన్యులకున్ 106

వ. మఱియు నింకొక మోచకు నుపదేశించెద నందులకొక్క చిన్న గాథయుం గలదు. బాడబులారా! శ్రద్ధమెయి వినుండు. 107

ఉ. తొల్లిటి కొక్క భూసురుడు తోరపుబత్తిని వైదికక్రియా
వల్లరి ప్రోదిసేసి కలవై భవముల్ బలుబాములందు సం
ఫుల్లమనోజ్ఞుడై భజనముం బొనరించి నిజాత్మవాని బల్
కల్లలుగా నెఱింగి తుదిగాసిలి రోసి విరక్తుడై యటన్. 108

చ. విసుగు జనించె నాకు సదవిస్మృతిపుట్టువు చావు నొందనే
దొసగుగ నెంతు నందుగలతోయజపత్రవిశాలలోచనా
దిసుఖములెల్ల గోరను మదిన్ భవజాలములింక దేవ భో
గసమితి ద్రోసిపుచ్చెదను గైకొను దీనజరామరత్వముల్. 109

క. అని యెంచి యెంచి మోచకు
లని భ్రమపడి సకలదేవతావళి నోలిం
గని మ్రొక్కి మ్రొక్కి గాసిలి
జనితాశానాశు డగుచు సదమలభక్తిన్. 110

కం. త్యజియించి యన్యదేవుల
భజియింపగ నెంచి సర్వభావితభావున్
నిజముక్తి కొఱకు దొల్లిటి
గజిబిజి లేకుండ గాలగళు సేవించెన్. 111

సీ. జడలందుగల యేటిపడతి మోమందమ్ము
నరసి కోపెలవంకయద్ద మమర
అలపాలకు దెల్లనైన నెమ్మేనుపై
పూయు బూది జగాలమోసగించ

సౌమ్ములన్ జిల్వజంకెదెమ్ములు మెలమెల
లాడుచుఁ బల్చెడఁగలరిఁజేయ
లేనవ్వు తలపువ్వులీనెడి మవ్వమ్ము
లొండొంటిఁగేరుచునొప్పుగుప్ప

తే.గీ. నొరుల నెరసుల వెలిబుచ్చుపరుసఁదనము
లూనటొప్పదు కుత్తుకనుంచుటొప్పు
ననుచుఁ దెల్పెడి కైవడియఱుఁతఁ దాల్చు
గప్పు లెవ్వారి కొదవనియొప్పు లీల. 112

సీ. వెసమొలన్ బులితోలుమిసమిసం జెలఁగుచు
పసలీను క్రొంబట్టువలువగాఁగ
పుడమిలోఁగల తత్వములు నేర్చి గూర్చిన
పటికంపుఁబూసనేపళము వెలయ
తెలివి మానికపుఁదొంగలనేలఁ బడఁద్రోసిఁ
వెనుదన్నుకాలందమినుమడింప
మిన్నుమన్నుంజేయుమేల్మోసకత్తై సా
మేన ముచ్చట లీనుజాను లెసఁగ

తే.గీ. తళిసిమిన్నలు మొగసాలఁదనరి కొల్వ
వారలై నిచ్చటన్ మెచ్చిపజ్జ మెలఁగ
నచ్చపుందెల్వి రూపొందియలరు ననఁగఁ
దెల్లనగుమేని నున్జాయలుల్లసిల్ల. 113

తే.గీ. జ్ఞానముద్రను ధరియించిసకలధర్మ
వృషవరారోహవై భవవితతిఁదనరి
నవనవోంకారపద్మాసనము సుఖాస
నమ్ముగా నిమ్ముదైవారనెమ్మిమీఱ. 114

కం. మాయావటమూలాంచ
చ్ఛాయాగేయాశ్రయావసథరాజమునన్
మాయానిరాసతజ్ఞా
నాయతముద్రం ధరించియబ్బుర మెసఁగన్. 115

కం. పరతత్వజ్ఞానంబున
వరవిద్వాంసులకు ముక్తి భాగ్యవితరణ
మ్మొ రహిం బొనరింపఁగ నిజ
కరమునఁ గంకణముఁ గట్టి కరుణానిధియై. 116

కం. సకలోపాసకులకు ని
ష్టకలాపమొసంగి పరమసౌహార్దార్ద్రా
త్మకళాపూర్ణుండయి యిం
దుకలాపర్భి శిరమునందు నూల్కొని యుండన్॥ 117

తె.గి. ధర్మనీయసుమూర్తియై తన్నుగొల్చు
ధన్యవరులకుఁ గామితదానమిచ్చు
దాతయనఁ గీర్తి నెగడిన దైవతంబు
దక్షిణామూర్తి వేల్పు ప్రత్యక్షఁడయ్యె. 118

క. నీదక్షిణముఖమున నా
కో దేవరభక్తునన్ను నోముమనుచుఁగా
కోదరభుగ్వాహనుఁడగ
జాదేవీప్రాణనాథు సన్నుతి చేసెన్. 119

చం. పరమకృపాకటాక్షములభాసిలుచూడిక ని జూచి యీశ్వరే
శ్వరుఁడు జగద్ధితంబుగను జక్రికి స్వాత్మపరైక్యబోధమ
త్తరి నొనరించి యాఘనుని ధన్యతముం బొనరించి మించె భూ
సురవరులార!యందఱిని జొక్కఁగఁజేసె విముక్తినిచ్చుచున్. 120

క. ప్రియ నాపై దయగల్గిన
నయమున మన్నించి నన్ను నాయడగినదీ
వుయదార్థము వివరింపుమ
రయమున నని మనవులన్ సరస్వతి చేసెన్॥ 121

వ అంతఁ బ్రియాలాపనమ్మోదితాంతరంగుండై యజుండిట్లువల్కె. 122

కం. తూచాలు తప్పకుండగ
నోచెలి నేఁజెప్పుదాని నొగిఁజేయుదువేన్

నీచిత్త మభిలషించిన
ప్రాచుర్యార్థములు తెలియఁ బడుఁగద నీకున్॥ 123

కం. భోగులను భోగి యగుచు వి
రాగులను విరాగియగుచు రాజితధీమ
ద్యోగులను యోగియగువాఁ
డోగిరితా! తగును నీకు నుత్తర మొసఁగన్. 124

కం. కావున బత్తిన్ రజిత
గ్రీవంబున కరిగి యభవుఁ గని మ్రొక్కిడి యా
దేవు నడుగుమీ ప్రశ్నము
దేవీ! చనుమంచుఁ బలి కె దీప్తానుఁడై. 125

ఆ.వె పతి యనుజ్ఞ వడయు భాగ్యమ్ము గల్గుట
మతి పవిత్రమగుట నతివమిన్న
మన్నగంబుఁ జేరి మత్కటాక్షమునకై
వేచియుండి చేసె విన్నపమ్ము. 126

క. దేవా మోచకుఁ గూరిచి
నీవలనన్ వినఁగఁ గోరి నే నిచ్చటికిన్
నే వచ్చితిఁ దయగనుమా
నా విజ్ఞాపనము గొనుమ నన్ బ్రోవఁగదే! 127

క. అని వేడిన పలుకులచెలిఁ
గనుగొని నేనుడువుటల్ జగద్ధితమనుచున్
మనమున నెంచుచు ముచ్చట
ల్కినరీతిని బల్కెదేనొ గిన్ వినుః కృష్ణా॥ 128

చ. కలవుగదా ప్రమాణములు కంజవిలోచన దాల్పువానిలో
పలతొలిమూఁడునుం గరణపాటవసాక్ష్యములౌట దోషసం
కలితము లింక నాల్గవది గాదుగదా యటు లాప్తవాక్యమై
చెలఁగును దానినే శ్రుతిగఁ జెప్పుదు రార్యజనావతంసముల్. 129

కం. శ్రుతికి స్వతఃపరతాదో
షత గల్గునె? మొన్నఁడైన నజ్ఞానఃయవిద్యా

తత మితరపరిమితిత్రయ
మతినింద్యము శ్రుతివిరోధమయ్యెడు నెడలన్. 130

క. స్మృతులు పురాణంబులు భా
రతేతిహాసములు సుజనరంజకములునై
క్షితి వఱలుటకున్ గతమున్
మతి నెంచిన శ్రుతులకున్ సమంజసమగుటే. 131

క. ఎంచఁగ శ్రుతిసన్మానస
మంచితములె పాంచరాత్రమార్గాదులు ధీ
ప్రాంచద్వైభవమొప్పెడు
పంచకశాస్త్రమ్ములనుచు వచియింపఁ దగున్. 132

ఉ. అందున నెందునేని శ్రుతులాదరణం బొనరించు కావ్యముల్
బొందగునేని వానికినిఁ బూజ్యత గల్గునుగాని షట్పదీ
బృందవిలాసవేణి! శ్రుతివీధిని మానియ దేచ్చఁ బోవు వా
రిందయ జూడఁబల్కఁబడు రీతిగఁ బల్కుదు రాగమంబులన్. 133

మ. వ్యవధానం బొకయింత లేక య మదీయంబైన తత్త్వంబు వే
దవితానంబుల యందెఱుంగ నగు దంతప్రక్రియాచారవై
భవసందోహములం దెఱుంగఁబడు తత్త్వం బెంచగా భావికా
ల వశంబంచు నెఱుంగ నౌనుగద శైలప్రోన్నతా! సన్నుతా! 134

శా. వేదాచారపరాయణప్రకటులౌ విద్వాంసులందున్ క్రియా
వాదుల్ గొందఱు గల్గువారుగవ యవ్వారల్ మదీయైకత
త్వాదుల్ గొంచె మెఱుంగు వారలమదీయంబైనతత్వంబు సం
పాదింత్రాత్మవిదుల్ సమస్తమును శంపాచారుతన్వంగిరో. 135

వ. నన్ను మోచకుఁడని శ్రుతులు వక్కాణించు. 136

క. సర్వజ్ఞుఁడు సర్వాత్ముఁడ
ఖర్వభవాంతకుఁ డజాండఖండానందుం
డుర్వీప్రభృతిస్రష్ట య
పూర్వుండను నేనొకండ ముక్తిప్రదుఁడన్. 137

క. నాకంటెన్ బెఱవారా
త్మైకజ్ఞానాదిహీను లందరు మాయా
లోకనివాసులు మోచ్యులు
నాకు ననుచు నెఱుఁగు మీవు నలినదళాక్షీ! 138

క. ప్రకృతివిలాసప్రకట
ప్రకరంబులఁ దవులు నట్టివారల్ మూఢుల్
వికలాత్ములు పశునికరం
బకలంకుఁడ ముక్తిదాత నగుదున్ ముగుదా! 139



కం. నాకంటెన్ మోక్షప్రదుఁ
డేకాలంబునను నెందు నెవ్వం డొకరుం
డో కంజాక్షీ కలఁడే?
యీకందువ నుడివినాఁడ నెఱుఁగుమ వాణీ! 140

క. ఏనిటులఁ బల్కఁగా శ్రీ
జానీ! పద్మజునిరాణి సకలాంచితలో
కానీకజనని శ్రుతిమయ
యై నెగడియు నాకు మివుల నర్చన లొసఁగెన్॥ 141

క. ఈవును మద్భక్తుండవు
పావనుఁడవు గుణమణీద్ధపాథోధివిస
ర్భావుండవు గావున నీ
కీ విద్యనొసంగినాఁడ నెన నీకెవఁడో? 142

మ. శ్రుతిధర్మాచరణప్రవీణులును సంశుద్ధాత్ములున్ భక్తులున్
గతదుర్మానులు నైన విప్రులకు సాకల్యంబుగా మోచకాం
చితవిజ్ఞానమెఱుంగఁజెప్పనగుఁ బ్రశ్నింపం గడున్ శ్రద్ధనో
దృతి చెప్పందగ దెన్నఁడే నిదియ శౌరీ! యన్యమానాళికిన్. 143

చ. అన విని చక్రిపాణి పకలాంతకు సర్వమయున్ గిరీంద్రజా
వనజముఖీసహాయు శివుఁ బంకజవైరికళావిభూషణున్
మునిజనగేయు సౌరజనపూతకరాంబుజపూజనీయు శం
భుని నుతియించి మ్రొక్కి భవమోచకుఁ డంచు నెఱింగె నాఘనున్

శా. సత్యాసత్యపరాపరాద్యఖిలసంకల్పాద్వంద్వవిజ్ఞానరా
హిత్యభ్రాజిత భాస్వరూపుఁ బ్రముదాహీనస్స్వరూపున్ శివున్
నిత్యున్ సర్వజగద్ధురంధరు భవానీపాణి నీరేజశో
భాత్యంతామలసైజహస్తు నుతి చేయన్ శౌరి కన్పల్కెలో॥ 145

గీ. విధివిధమ్ము నిషేధంపువిధము త్యాజ్య
వస్తు వత్యాజ్యవస్తువు వసుధ నింత
వరల నేరవు జ్ఞాని వాసుదేవ!
ఆత్మవేత్తల విధమిదియరయుమయ్య!

గీ. చర్మచక్షుః ప్రభావపరిపాదములను
బ్రహ్మవిజ్ఞాననిష్ఠాస్వభావ మొరుల
కలవి గాదు లవంబైన నరసి తెలియ
మాయత్రిప్పులఁ బడి యెడబాయలేను. 147

వ. ముక్తి స్వతఃసిద్ధ మధీతవిద్వాంసులకు మాత్ర మెఱుఁగనగు. పామరు లేవిషయ మెఱుంగక నిద్రాముద్రితులగుదురో పండితు లావిషయమున మేల్కని,వినిద్రాభద్రులగుచుం జ్ఞాని మేల్కను తావున నజ్ఞాని యెఱుక మాలి సుప్తుండగు. 148

ఉ. స్వానుభవంబు చేత విమలాప్తవచోనిచయమ్ముచేత సు
జ్ఞాని నిరంజనాదిగుణసారుబరామృతుఁగాగఁ నాత్మసం
ధానముచేయు నాశ్రమవిధానము వర్ణవిధాన మింతయున్
బూనఁడు జ్ఞాని సర్వగురుమూర్తియ జ్ఞాని యగున్ జగంబునన్

ఉ. జ్ఞానియు మోచకప్రియుఁడుజ్ఞానియె మోచకుఁ డాత్మవేత్తయౌ
జ్ఞానియ సర్వకారణుఁడుజ్ఞానియ సత్యుఁడు చిద్ఘనుండునున్
జ్ఞానియ ముక్తిసర్వుఁడునుజ్ఞానియ వేదవిదుత్తముండునున్
జ్ఞానియ భుక్తిముక్తియునుజ్ఞానియగున్ భువనావనుండునున్ 150

ఉ. వేడినవాఁడవౌట వినిపించితి భూతహితైకబుద్ధి బల్
వేడుక తోడ నీకు శ్రుతివిశ్రుతసిద్ధము మౌని దేవతా
బాడబులాదిగాఁ గలుగువారలు గోరెడి ముక్తిగానధీ
పోఁడిమిమై గ్రహించితివిపూతజనాంతిక కైటభాంతకా॥ 151

క. అని శివుఁ డుపదేశించిన
వినివినయము భక్తి గదుర వెన్నుఁడు హరపా
దనలినయుగ్మము కరముల
గొనియెత్తుచు నెత్తిఁబెట్టుకొనె ఘనులారా! 152

ఉ. నాకు లభించె నేఁటికిది నాఁకనివాసుల కందరానిదై
ప్రాకటవేదమార్గచర పండితమండనబృందలభ్యమై
శ్రీకరమైన విద్యయని చేతము రంజిల గద్గదస్వరుం
డై కమలాక్షుఁ డాహరున కర్పణముం బొనరించె వేనుతుల్ 153

గీ. కన్నుగవ హర్షజలములు గారఁ జక్రి
చక్రిభూషణు వలగొని సరసహృదయ
జలజ మాఘను చరణాంబుజముల మ్రోల
నిలిపి కృతకృత్యుఁడయ్యె నిశ్చలత గనియె. 154

ఉ. కావున మీరు నన్ హృదయకంజము నందున మోచకప్రదున్
గ్రావనివాసు నొక్కని నిరంతరబ్రహ్మపదావలంబన
ద్భావుని నొక్కనిన్ గురపదంబుగ నెంచి భజించి నన్వెసన్
పావనులార ముక్తిమయభాగ్యము కైవస మౌను మీకిటన్. 155

చ. పరమశివార్పణీయమగు భక్తిని సందియ మింత లేక స
ద్గురుచరణాంబుజమ్ములను గొల్చెడి పట్టుల నూని యున్న ధీ
వరులకు వేదశాస్త్రములు పల్కు లోకించుక బోధమౌను స
ద్గురుకృప గల్గు కాలమునఁ గోరి భజింపుఁడు దేశికోత్తముల్. 156

## 6. జ్ఞానానుత్పత్తి కారణకథనము

వ. మఱియు శివుఁ డుపన్యసించె. 157

క. జ్ఞానప్రతిబంధక మని
ధీనిధులు వచింతురే ని తెలియఁగ వలదా
వానిన్ వారిజనాభా!
యేనిట వచియింతుఁ బరిహరింపఁగ వానిన్. 158

క. ఈలోకులకున్ జ్ఞానం
బేలా యుదయింపదనుచు నెదఁబ్రశ్నింపన్

కాలగళద్రోహంబే
మూలంబని తెలుఁగా దెకభోగళయానా! 159
క. శివభక్తుల కపరాధము
శివబోధమునకును నిందశివవిద్వేషం
బవరోధించును జ్ఞానము
శివధనహరణమును నట్లచింతింపఁ దగున్. 160
వ. అటులనె యచ్యుతా నాయెడలద్రోహము నాభక్తోపచారము నీ ధన వాంఛయు, జ్ఞానాపహారకములు. మరియు బ్రహ్మద్వేష, బ్రహ్మ ద్రోహ, బ్రహ్మస్వాపహరణములు జ్ఞానోదయప్రతిబంధకములు, శ్రుతిస్మృతులయు, శ్రుత్యంతములయు, శ్రుత్యంగములయు, (బురాణేతిహాసములయు(, దచ్చ్రోతలయు(, దదధ్యేలయు నిం దయు తచ్ఛ్రోతృధ్యేతృధనముల నపహరించుటయు జ్ఞాననిరోధ కములు, వామపాశుపత. పాంచరాత్రాది స్మృతులు వేద సమ్మత ములు కావుగాన నవియు జ్ఞాన విరోధములు. శిష్టజననిక్ర తియు, శిష్టసంసర్గనిరాదృతియు, శిష్టజనధిక్కృతియు, జ్ఞానమున కంతరాయములు. దుర్వృత్తసహవాసమును, దుర్వృత్తిజన పోషణమును, దుర్వృత్తి కలనయుజ్ఞాన ధ్వంసకములు, కామక్రోధలోభ, మదమాత్సర్యాలస్యాదులు జ్ఞానముం దవ్వానరించు ధర్మాధర్మేశ్వరాస్తిత్వముల యందు సంశయబుద్ధియు నభావబుద్ధియు జ్ఞానానుత్పత్తికారణములు. మాతాపితరుల కొనర్చు ద్రోహము, సంతాపము, శుశ్రూషాకర ణము జ్ఞానమునకు వేఱుపురుగులు, ఎండవానలకును సితునకును గాసిలువాఁడు గిముఁ జేరినవానిఁ వర్జించుటయు రక్షింపమియు జ్ఞానాజనకములు. వాపీకూపతటాకాదుల కుపద్రవము గలిగిం చుట తజ్జలములఁ దొంగిలుట తన్నీరముల మలయుక్తములఁ జేసి యశుభ్రపరచుటయు జ్ఞానమొదవకుండుటకు హేతువులు. వ్యాఘ్ర, చోరాదిభీతులను గోవులను సంరక్షింపమియు, సాధువు లకు, గోభూములకు బాధ చేతయుఁ జ్ఞానము పుట్టకుండి దును మాడు. పశువులయు, మనుష్యులయుఁ, ద్రోవల ముండ్లకంపలు గొట్టుటయు నడ్డగించుటయు, జెఱచుటయు జ్ఞానానుత్పత్తి హేతువులు. వశ్యాకర్షణోచ్చాటనస్తంభనాద్యభిచారక్రియాకర

ణము జూదమాడుటయు వెలయాండ్రి నృత్యగీతములయందు లోభమోహపాశబద్ధుఁడగుట కవితలఁ గాని యితరప్రదేశములఁ గాని యపశబ్దోచ్చారణము సేయుటయు, జ్ఞానలతాలవిత్రము లనవచ్చును, వర్ణాశ్రమాచారవిశిష్టుల కవమతినొనరించుట, వారి శుశ్రూష నొనరుపకుండుటయు, జ్ఞానబీజములకు నూషరక్షేత్రములు, పుత్రమిత్రక్షేత్ర కళత్రభ్రాత్రాదులందు మాతృమతి మాతృప్రీతియు, గురుపాదులయెడలఁ దదాభావమును, లశునాద్యభక్ష్యముల శ్రద్ధయు, భక్ష్యయజ్ఞశిష్టాన్నముల యందుఁ దదభావమును బరస్త్రీ దర్శనస్పర్శనాదుల శ్రద్ధయు స్వస్త్రీదర్శనాదుల యెడఁ దదభావమును, గురుతత్పుత్రాదులయెడలను బరమగురుఁడైన యీశ్వరునెడలను, ననిష్టాచరణములయందు శ్రద్ధయుఁ, దదిష్టసేవనములయందుఁ దదభావమును, జ్ఞానము నుపదేశించు నాచార్యులకు స్వదేహార్పణము సేయమియు, ధనకాంతాదుల కాత్మార్పణము సేయుటయు, నాచార్యులయెడ చాలాశిష్టబుద్ధి సేయుటయు, నాచార్య నిందాశ్రవణమును, నాచార్యబాధయును, తద్వాధదిర్శనము, తద్వివాదమును, దదనీశ్వరమతియుఁ, దదవమతియుఁ దదుక్తవిస్మృతియుఁ దదుపేక్షేతియు, జ్ఞానసంతానమునకు వంధ్యాగర్భతుల్యములు. అశక్తుల రక్షింపమియు, దన్నిందాపరాధములును, ధనహీన రూపహీనుల కెగ్గొనరించుటయు, వారిఁ దెగడుటయు, వారిఁ బరిహసించి యవమానించుటయు జ్ఞానపరిపంథులనఁదగు. 161

క. కైలాసవాసుఁ డిమ్మెయి
నోలిన్ బలుకంగ హరియుఁ నుత్సాహమునన్
వ్రాలెన్ దత్పదములపైఁ
గలించెన్ గేలుదోయిఁ కేవలభక్తిన్॥ 162

క. మీరు శివజ్ఞానార్థం
బీరీతి నఘముల మానిశయిద్ధచరితాత్మ

కూరములు మొలక లెత్తఁగ
సూరిజనుల్ మీనుఁడి చిత్తశుద్ధిం గనుఁడీ॥ 163

7. గురూపసదన శుశ్రూషణమహిమ

చ. పరమపవిత్రి! విన్ము గురుపాదసరోజవిలగ్నచారుబం
ధురసుకుమారతావినయభావము లేమరకెంతయున్ సదా
గురువరు నొద్దఁ జేరికొనిగొల్చిన కొల్వు ఫలంబు నీకు ని
త్తు రి వచియించువాఁడ విబుధప్రకరంబులు సంతసిల్లగన్॥ 164

క. కలదొక గాథయు వినఁగా
వలయును మీరెల్ల దాసివలనన్ లోకం
బుల కుపకారము మివులన్
గలుగున్ విను భాగ్యమిపుడుగలిగెన్ మీకున్॥ 165

చ. కలుగును గాదె రత్నములుగల్గిన తావున నత్తగుల్లలున్
మలయజభూజకోటరమునన్ విషభీకరపన్నగంబులుం
గలుగును గాదె లోకములఁగాల్చు మహాదహనోగ్రమూర్తి శీ
తలజలరాశిలోఁ గలుఁగుదై వతరాజుకుఁ గల్గుఁగాకమున్॥ 166

క. ఇరుపైపు తండ్రి తాతలు
నిరతాధ్యాపనపరుల్ బ్రిణీతాధ్వరబృం
దరహస్యగ్రంధులునై
యిరవొందఁగఁ బాకయజ్ఞుఁడిద్దర వెలయున్॥ 167

చ. స్మృతులు శ్రుతుల్ బురాణములుచెప్పిన త్రోవల సంచరించు స
త్కృతి నొనరించు మాన్యులనుదీనులఁ బ్రోచును భాంధవాళిస
మ్మతిల మెలంగు దాసులనుమన్ను నుదారదయాగభీరతన్
కుతలనివాసియన్ గొదవకొంచెము గల్గిన లోపమెమగున్. 168

తే.గీ. బ్రహ్మ తద్భునుఁ జూచి మావాఁడె యనుచు
బ్రహ్మఋషులకుఁ జూపించిపరమముదము
లొందు మాత్మాంశ మీతనియొద్ద నొకటి
యభ్యసించితి నని యనునమరగురుఁడు. 169

క. పావనమౌ గోదాగం
గావరతోయములు ముజ్జగమ్ములు భవదో
షావళినందునఁ గడగన్
బావనమా విప్రచరిత పావకనిభమౌ. 170

క. ఏదోషపు బల్మి నాకో
నీదోషలతాలవాలనియతిఁ దలిర్పన్
ప్రాదుర్భవ మయ్యెను గొడు
కేది గొనములెల్ల జనకుఁడెప్పుడు గుండన్ 171

తే.గీ. చిన్నవయసున గొనముల తెన్నుఁ గనమి
పేరు శశివర్ణుఁ డని తండ్రి పెట్టెఁ గాని
గొనములను గాంచ నిశివర్ణుఁడనుచుఁ బిల్వఁ
దగియె నాతండు కర్మవిధంబు లెట్లొ. 172

ఉ. ఎక్కువతక్కువంచు గణియింపఁగ నేల తదీయచిత్తస
మ్యక్కలితాంధకారములయావసరాంబువనిలనీలభా
న్యక్కరణక్షమప్రలయనవ్యనిశీథవిధాంధకారమున్
జక్కగ నొందునారసినఁజాలును రెండవ దేల నారయన్. 173

సీ. ఆశ్రమమర్యాద నాశ్రయించుట లేదు
వెదనిందై కపరివీఱుఁడగును
ఆచరింపఁడు ధర్మమావగింజంతయు
ధర్మధార్మికుల నిందన మొనర్చు
నెనరు గల దొకింత నిసుఁగుల యందును
ప్రాణిహింసాపరత్వమున మెలఁగు
పెద్దలఁ గని లేచి భృత్యభావము గనఁ
డాత్మభృత్యులు గాఁగ నరయు వారి

తే.గీ తండ్రిఁ దిట్టును దల్లిని వేంద్రఁ బెట్టు
అన్న నడఁచును జెలియలి నడఁగఁ ద్రొక్కు
శక్తి కొలఁదిని దుర్ణయవయ మొనర్చు
మీఁదెఱుంగకుచెన్నఁటి వాదులాడు. 177

సీ. పరలోకచింత లేకప్పట్టున బుట్టవు
పరిహాస మాపిక్త్యకపరుల జేయు
నిల్లాలి చెక్కు చేకయిడి బుజ్జగింపడు
పరునాలి కౌఁగిఁటికు నైకపాత్రికులాడు
తనపంటచేను గక్కొనఁడెన్నటికిఁ బర
క్షేత్రముల్ హరియించికచెలఁగు నెదను
ఉపకారముల జేయఁకతూరకెవ్వరి కైన
నుపకారి కపకారకమోపఁ జేయుఁ

తే.గీ. దనదు త్రోవల కాదనుకతనదు వారి
నైన గరళంబు దినఁబెట్టికయంతకాంతి
కమునఁజేరుప నెంచునుకకష్టమేని
వలనఁ దోఁచిన వానిల్లుకవహ్నిఁజెల్లు. 175

కం. కాదని కొలపుంగొమ్మల
బూదలిరాకుంగటారికమునికి చిగురునన్
ఖేదిల్లి ప్రీలుగుండియ
మాదిగ లేఁజాననొకతెకమన్నించె నొగిన్. 176

వ. మఱియు వాఁడిట్లు సంచరించు. 177

కం. ఈఁడెట్లు తండ్రితాతపు
రోడాశలసద్వపాగ్రికరుచి గొనుచిడ్డో
గూడుటకున్ మాంసంబును
నేఁడున్ నాఁడనక విడకకనే తినుటకునున్. 178

క. మధుమద్యస్తుచయంబుల
మధురతమంబగుట కల్లుకమధువనఁగఁ జనున్
మధువుఁగొన నమృత మేటికి
మధువే సర్వంబు సకలకమండనమునునౌ. 179

క. మధు వొక్కటిష్టకామి
న్యధరం బొక్కటియుఁ బరధకనాగమ మొందున్

మధురమన ప్రకటమగును వ
సుధను సుధామధురమంబుకే చొప్ప మధువగున్. 180

క. ఆలన్ బొరిగొను నన్య
స్త్రీలన్ గలయంగఁ జూచుఁ జెన్నఁటి మాటన్
పూలపలెన్ దలఁదాల్చును
కాలము వ్యర్థముగఁ బుచ్చుఁ గట్టిఁడివాఁడౌ. 181

క. ఇచ్చకు వచ్చిన యట్లున్
విచ్చలవిడి వాఁడు కంటకే వేదులు కొలఁదిన్
మచ్చర మెచ్చఁగఁ దనుఁదా
మెచ్చుకొనుచుఁ దిరుగుఁ బెచ్చుకే మీరిన కడఁకన్ 182

గీ. అతని పితరులు సత్యలోకౌధివాసు
లమరలోకనివాసులుకే నతని దుష్ట
చరితవల్లను నిరయవాకే సములఁ బడిరి
కొడుకు చెడుగైనఁ గులమెల్లఁ జెడునుగాదె. 183

ఉ. కాలము కొంత యిట్లు చనఁగా శశివర్ణుఁడు రోగజాలజం
బాలవిలగ్నుఁడై తుదకుఁ బ్రాణము బాయు నవస్థజూచి ప్రా
ణాలకుఁ బుత్రికంటెమరకే ణంబులు ముందుగ ఁదానుదీర్త్తనం
చోలి విచేష్టుఁడై మరణకే మొక్కశరణ్యము గాఁగ నెంచుచున్ 184

క. పౌరలుం బుడమిపయిం బడి
పరిపరిరోదనమొనర్చు కే భవశతములకిం
తరతిం గూర్చఁగ నెంచఁడు
హర హర హర యంచు ఁబాకకే యజ్ఞుండలచున్. 185

క. పారుఁడు మద్భక్తుండగు
టారసి తద్దైన్యమపసకే యం బొనరింపన్
గారుణ్యంబున వచ్చె న
పారతపఃపూతదేవకే భక్తర్షియటన్ 186

వ. అమ్మునిసత్తముండు విప్రోత్తముం గని యిట్లు పలికె. 187

ఆ వె. లెమ్ము లెమ్ము భయము లేశమ్ము వలవదు
నీకు నీకొమరున కేకసగణి
శ్రేయమైన విధముఁ జెప్పెద నిప్పుడు
విప్రవర్య వినుము వీను లొసఁగి. 188

క. కలుగుం గాదే పుణ్య
స్థలములు మనుజులకు బాప భయముల బాపం
గలయవి భువిఁ దత్పుణ్య
స్థలముల కడుమిన్నయైన దాని నెఱుఁగుమా. 18?

క. గోపర్వతాఖ్య మయ్యది
పాపంబుల నెల్లఁ బాపు భవ్యశ్రేయం
బేపారఁ జెయుఁ గావున
నాపర్వతరాజమునకు నన్నెము సరియే. 190

క. పదియారు క్రోసుల పొడ
వది పదియార్క్రోసు వెడఁద యగు భూధరమె
న్నఁదగిన విలసనములకున్
బదిలంబగు తావు గాఁగఁ బరగున్ జగతిన్ 191

క. పరమేశ్వరి యిచ్చోటం
వరభక్తి సపర్యలొసఁగి భవలింగంబున్
ధరశక్తీశ్వరుఁ డని పే
రిర వొందఁగ బెట్టు తాగ డించె యశమ్మున్ 192

సీ. ఇచట శక్తీశుఁ బూజించి విరించి లో
కాళినిర్మాణధీ నలరెఁ దొల్త
నిచట శక్తీశు ధ్యానించి పురందరుం
డమరాధిపత్యభాగ్యంబు గాంచె
నిచట శక్తీశు కర్పించి సేవల బృహ
స్పతి సురదేశికత్వమున వఱలె
నిచట శక్తీశుభావించి శుకుఁడసుర
వరుల కాచార్యుఁడై వాసిఁ గాంచె

తే గీ. ఇచట శక్తీశు నర్చించి యెలమి నూర్వ
శివరానన దేవేంద్రు వెట్టఁబట్టె
నిచటశక్తీశు భజియించి యెందరెంద
రింతగాలేదు కోర్కులనెందు నరయ. 193

సీ. పర్వములను నీశు భజియించి యిచ్చోట
నరుఁడు సాక్షాచ్ఛంద్రధరుఁడ యగును
ధనముమున్నగు నవిదానమిచ్చటఁ బర్వ
ముల సల్పువాఁడీశవమూర్తియయగు
పుణ్యదినంబులన్ ఘూతెశుఁ గని ధన
కనకాదులిడ సుమాకాంతుఁడయగు
శుభదినంబుల నిట నభవుభక్తుల కింత
నీయ సాక్షాన్ముక్తియే యమరును

తే.గీ. పెరదినంబులలో బ్రహ్మవేత్తల కిట
ధనము నీయంగ భోగంబు తండులాదు
లొక్క పిడికెడుమాత్రంబు నొక్క ప్రస్థ
మాత్రి మొసఁగిన ముక్తియు మహితమగును. 194

క. దురితము లెన్ని యొనర్చిన
పురుషుఁడు తుదకిచటఁజేరి పొగడఁగ జగముల్
మరణించిన నతనికి నగు
పురహరు కరుణాకటాక్షమున మోక్షంబున్. 195

క. సారామ్నాయచయాంత
స్ఫారామలవిద్యయందుఁ బాండిత్యంబో
ప్పారఁ బుడమివేల్పు మహో
కారుణికాఖ్యం బ్రసిద్ధిఁగనిమను నచటన్. 196

క. ఆనందపరాయణుఁడా
మానితయోగీశ్వరుం డుమాపతి సేవన్
బూనుచు గోపర్వతమున
నే నిరతమ్మున్ వసించు నృపమణీ! వినుమా! 197

కం. వానిం దర్శింపుడు నా
సూనుండును నీవు బత్తిఁ జొక్కిన యెదలన్
దానం శ్రేయంబగు విబు
ధానీకశిరోఽవతంసమా యఁట జనుఁడీ. 198

చ. అన విని పాకయజ్ఞవసుధామరవర్యుఁడు పుత్రిరోగదో
షనిచయదుష్టగాత్రు నఘసంచయజాల్మలతాపవిత్రి నా
య్యాన నొక వాహనంబుననునౌదల మంచి రయంబు మీరఁదో
డ్కొని బహులప్రయాసమునఁగోనగసానువుఁ జేరె నంతటన్. 199

చ. కొడుకును జంక నెత్తికొనిఁగోనగభర్తకు మాటయెన్మిదా
తడవులఁ బాకయజ్ఞుఁడు బ్రదక్షిణముల్ బొనరించి బత్తి నా
ప్పెడి కనుదోయి విప్పి బలువేడుక నారసి తత్ప్రసాదమున్
బడసి జగద్గురు విబుధమాన్యుని దేశికవర్యుఁ డగ్గరెన్. 200

క. ఒకకుల మొక యాశ్రమమని
యొక యెడను నొకింతయైనఁ నుల్లమునం దెం
చక మెలఁగుచు నానందా
త్మకలాభాసురుని దైవతసమున్ గాంచెన్. 201

క. జీవన్ముక్తున్ గురువరు
నావిప్రుఁడు గాంచి మోదమందుచు సుతుతో
వే వలగొని పలుసారుల్
తా విన్నపముం బొనర్చెఁ దనదు చరిత్రన్. 202

వ. అంత నాకారుణికోత్తముండు. 203

క. కారుణికోత్తముఁడను దన
పేరికి సరిపచ్చు నట్లు విప్రకుమారున్
జేరి నిజశిష్యుగాఁ గొని
కారుణ్యముననన్ బవిత్రుగాఁ జేసె నొగిన్. 204

మ. అలఘుప్రక్రియ దేశికోత్తముడు స్వాత్మానందసంధానమో
దలసద్వీక్షణపూరభూతిభయగంధప్రస్ఫురత్తేజమి

మ్ముల వ్యాపింపఁగఁ జేయఁ గొన్ని యఘముల్ ♦ పోయెన్ దగన్
శిష్యగా
వెలయం జేయఁగఁ గొన్ని పాపచయముల్ ♦ విచ్చెన్ సరోజేక్షణా.

తే. గీ. అధియును బోయె వ్యాధియు ♦ నంతరించె
జమునిలెంకల హుంకృతుల్ ♦ శ్రవణపథము
బడుట మానెను దండ్రికి ♦ వగపు లుడిగె
అమలశశివర్ణ నామంబు ♦ సార్థ మయ్యె. 206

క. వెనుకటి శశివర్ణుఁడు వీఁ
డనఁ జెల్లదు పూతచరిత ♦ మలవడి యుంటన్
జననుతికిం బాత్రంబయి
మను శశివర్ణుండు పుణ్య ♦ మహితుం డగుచున్. 207

సీ. కందమూలఫలాదు ♦ లం దేశికప్రవ
రునకు నివేదించి ♦ కనుఁ ముదంబు
నమలసమిత్పత్ర ♦ సుమగుచ్ఛములఁ దెచ్చి
యయ్యావారి కొసంగి ♦ యలరు నెదను
కొమరు గసవుంబిళ్ళ ♦ నిమిరి యాలను మేపి
యొజ్జకు సంతోష ♦ మొదవఁ జేయు
కట్టి విడ్చిన దోవ ♦ తిట్టె నీళ్ళను గొట్టి
తడియార్చి గురువున ♦ కిడును బత్తి

తే.గీ. అదనుకై వేచి యొజ్జల ♦ యడుగుఁ దమ్మి
తొడను నిడికొని యొత్తి సం ♦ తోషమొందుఁ
జమురు మైఁబూసి తలయంటు ♦ స్వామి వేడి
నీళ్ళ స్నానంబుఁ జేయించి ♦ నెగడె నతఁడు. 208

క. గురుశుశ్రూషలఁ జేయన్
గురుతరదురితములు దొలఁగెఁ ♦ గొన్ని యతనికిన్
గురుభుక్త శేషముం గొన
నరిగె నశేషాఘములు ధ ♦ రామరున కటన్. 209

క. గురువరు పలుకులఁజెవి నిడి
గురువరు నడుగులకు నెఱఁగి గొల్చిన కతనన్
గురువునకగు బలు నెమ్మియె
గురుశోభనములకు నిరవు గురు వభవుండా. 210

ఉ. భూసురసూతి చిత్తమునఁ బొల్పగు పావనతాలతావితా
నాసమ చారుతావిలస నావళు లెల్లెడఁ బ్రాకి చూడ్కికిన్
భాసురరీతులన్ వెలయ ప్రిన్నని సన్నని కన్నెమొగ్గ నా
భాసిలె వేదశీర్షచయ పావన బోధలతాంత మయ్యెడిన్. 211

చ. గురువరుడుం జెలంగి కొన గోట విభూతిని సుంత శిష్యుఁడై
పరగ విదల్చి తొల్చదువు బత్తులలూనిన మేలితెల్వి ని
బ్బరముగ నానతిచ్చి శివ భావ మొసంగిన శిష్యవర్యుఁడున్
గరిమ పరోక్షదర్శనము కల్మినెసంగె విహంగవాహనా! 212

క. నేనే తానని యెఱుకం
బూనెన్ శశివర్ణుఁడమల ముక్తిం బోడ్తో
నూనెన్ నాళీకాక్షా!
యోనే మద్భక్తవరుల కప్రాప్యంబున్. 213

సీ. పాకయజ్ఞుఁడు జ్ఞాన పాకోన్నతిం గాంచి
నాకాధివాసుఁడై యమరుఁ డయ్యె
నరకనివాసంబుఁ బొరఁగి తత్పితరులు
నూర్ధ్వలోకసుఖంబు తొంది మనిరి
శశివర్ణుఁగన్న వంశమ్ము దేశమ్మును
గడుపవిత్రములనే ఘనత కెక్కె
ఎనరాని కూర్మిఁ గ్రొక్కున జూరుక్కునఁ జక్క
నతఁడు నొక్కెడి మోవి నలరు నట్టు

తే.గీ. కిసలయాధర కడజాతి బసివి యయ్యు
నెదురుగా వచ్చి గౌరవ మెసఁగ వేల్పు
సానిమిన్నలు కేలంటి సరస మాడి
వారి క్రేగంటి చూడ్కుల గారవించె. 214

చ. అది యటులుండనిమ్ము విహగాధిపవాహన! యింక నొక్కగా
ధ దనరు బల్కెదన్ శ్రుతిపథమ్మున కౌను సుధావిధమ్ము నె
మ్మది వినుమయ్య దానగురుమానితపాదసరోజసేవనా
భ్యుదయపరంపరల్ దెలియ మొయ్యన లోకహితంబు చేకురున్.

క. పటుధనమదములు వరలఁగ
విటపతులెల్లరును రసికవిభవమలరి ముం
గిటఁగాపులుపడి యుండగఁ
గుటిలాలక యొర్తు వారకులమున వెలయున్. 216

క. కులవిద్యయందు మిక్కిలి
వలఁతి యగుట నాటవెలఁదిపతిసందోహం
బుల కనుసన్నన ద్రిప్పున్
జలజాసను వంటిశుద్ధసత్త్వుల నైనన్. 217

క. మును లంతవార లైనను
మననంబులఁ గట్టిపెట్టి మనవుల్ చనవుల్
వినయమ్ములు పచరింపన్
జనుచుందురు దాని చెన్నుచవి దవిలినచోన్. 218

తే.గీ. బిత్తరించెడి కనుదోయి బిసరుహాక్షి
చిత్తజాశుగశతము వర్షించుపట్ల
నెట్టి జగజెట్టికానంత పెట్టఁదనము
పోకడలు గాంచుటన్న యలోకవార్త 219

సీ. అడుగులఁ జిరుమువ్వలలర నృత్యము సేయ
నలయురాయని జాలి సొలము వారు
మునిప్రేలు నునుచెక్కు గొను జేర్చి యభినయం
బొనరింప భేషభేషనెడివారు
పెదవి మెదల్చి సోరుదలిర్ప శృంగార
పదము పాడినయబ్బ పడెడివారు
అత్తరుగంధమ్ము నందీయ వలపులు
తలఁపులు గొనసాగ మెలఁగువారు

తే.గీ. పిన్నలున్ బెద్దలున్ సానిఁ మిన్నగన్న
జెన్ను నెన్నుచు నాలేమఁ జీరచెంగు
గాలి సోఁకిన ధన్యోఽస్మి కత లిఁకేల
యనుచు నెవరికి వారలే యలరు చుందు. 220

క. నీయిల్ బంగారముగా
నూ యని మున్నిచ్చ్వఁడాడెనో కాశివే
శ్యాయతనము బంగారం
బై యొప్పను సకలకనకమయ్యేడఁ జేరెన్. 221

క. కాసుకొఱకు వీసము కొఱ
కై సారెకు లేనివలపు గన్పడు నట్టుల్
జేసి విటసమితిధనముల
రాసులు రాసులుగ నిరుకరమ్ములఁ గొనియెన్. 222

ఉ. తల్లిని దండ్రి నన్నలను దమ్ముల వారి సతీసుతాదులన్
జెల్లియలన్ తదీయసుత నేతృసుతాప్రకరంబులన్
వల్లె యనంగ నోమి వరవారకులాభరణంబనంగ రా
జిల్లెను దల్లతాంగి సిరిచే నగుకార్యము లిట్టులేగదా. 223

క. మరి పదియార్వన్నెయ బం
గరు ననుడాల్ డాకు రేడు కలలకు నెచ్చో
హరువుల నీనెడి బిత్తరి
కురువులు మరువులకు నెల్ల గురువులగుఁ జుమీ. 224

సీ. ఒకనరుపై వెట్టియొలయు నూర్వశి వట్టి
బేల యీచెలి ముందు రేల నుడువ
రంభ యెంతటిది యీరామ దగ్గరఁ జేరి
దిద్దగా వలెఁగొన్ని యొద్దికలను
పరసుల బెదరుకన్ సన్నల నారయు
హరిణకు నీలేమకగునె నవతు
పేరుచేఁదెల్లమౌ తీరు తిలోత్తమ
కదిదీనితో సరియగునె యెందు.

తే.గీ పిరియులు దగ్గరి కొరలెని పెరిమ లొలుక
గులుకి కులుకించు పట్టులచేలను బార
వశ్యమున మాయఁజాలని పడఁతు లగుట
దీనికిని వేల్పుసానులు దీసిగట్టు. 225

క. మిద్దెల మేడలఁ గట్టెన్
విద్దెల నేర్పించె బంధు విసరంబులకున్
బెద్దయయి యన్నిటికి నే
యొద్దియు నెంతైనఁ గనని యొప్పుల నెనసెన్ 226

ఉ మోమున గోము సన్నగిల పొల్పగు చెక్కిలి నిగ్గు తగ్గఁగ
న్దామరలందు గంతులిడు దళ్కులు బెళ్కులు వీడికోల్ గొనం
సాములు దక్కి మన్మథుఁడు చయ్యన వెరొక తావుఁజూచి కో
నామదిరాక్షిపై ముదిమి యల్లన నల్లనఁ బ్రాకె వింతగన్. 227

క. కవివరులు గలము గైకొని
వివరించెడు చిత్రచిత్ర వివిధాంచిత్రమై
భవముల కెనయై యలరును
నవరస భావములు దాని నాట్యము లందున్. 228

క. గణికామణి విన్నాణము
గణియింపఁగ లేరు వేయి కరణాలైనన్
గుణియింప నేరరెప్పుడు
ఫణినాధుని వంటిగణక పర్యాలెలమిమై. 229

క. ఆయాటది నేర్చును శా
స్త్రీయము దేశీయ మన్య దేశీయము జా
తీయము గానము నృత్య
మ్మాయుగ్మలి కెవతె సాటి యగును దలంపన్. 230

క. మును మున్నరికం జేసిన
తనపాపములే పిశాచ తతియై వారాం
గన పయిఁబడి బాధించెను
పెనుదొసఁగుల నేతలెప్డు వితగావుగదా. 231

క. వయసు మదంబున నొకయిం
తయు నయముం గనక నిటు తాఁ గూడ సుఖా
మయమయి మెయి శాసిల్లన్
వయ సెడలిన వేళ సాని వనటం గుందెన్. 232

క. శుభశోభనముల కిరవగు
సుభగావేశ్యాలలామ సుస్రుక్కి ముదిమి రో
గభరవివశాంగియై పా్ర
ణభయమ్మునఁ దవిలి మనసునం దిగులొందన్. 233

క. అచ్చపుటుమ్మెత్తల
యొచ్చెము లెచ్చోటనైన నొగిఁ గనఁబడు నే
యచ్చెలువ గట్టు లంగా
కుచ్చెళ్ళను గాక యెవఁడు గోరినయేనిన్. 234

క. మిలమిలలాడెడు మైని
గ్గులు కళికి ధరించు జిలుఁగు కోకన్ రైకన్
వెలయించుచుఁ బైపై గం
తులనిడి చూపరకుఁ బిట్టు తొందర లొసఁగున్. 235

తే.గీ. ఎఱుఁగ కుండిన యైన యనిష్ట మింత
బ్రహ్మ విష్ణుల కొనరించు పలుగు దాని
నాకు నపరాధ మొనరించు నాలివాని
గాఁ దలంతు రమేశ నిక్కముగ నేను. 236

క. నేవేరు నాత్మనిష్ఠుం
డౌవాఁడును వేరు ననుచు నరసెడి వారల్
భావింప మూర్ఖులే గద
సేవింపఁగ రాదు వారిఁ జేరియెవండున్. 237

క. సకలోపనిషద్గ్రంథ
ప్రకటార్థంబుల నిమిడ్చి పలికితి వుద్య
ద్వికృతిం బల్కెడి యోగము
వికాయముల విడువఁదగు ముని ప్రవరునకున్. 238

ఉ. జ్ఞానవిభూషితాత్ముఁడయి వక్రిధరా యొక యోగివర్యుఁ డ
జ్ఞానియుఁబోలె నాఁకలి నైఁపక కాలెడి కుక్షిమంట నె
ద్దానను నైన నార్పుకొని దా నసువు ల్నిలుపంగ నెంచి య
మ్మానిని యిల్లు సొచ్చె నరమాత్రుఁడు నైఁపఁగలాఁడె యాఁకలిన్

వ. ఆయక్షరయోగి విలక్షణయోగినామధేయుండు. 240

క. సారబ్రహ్మపదస్థుం
డై రాజిలు యోగి తనగృహాభ్యంతరమున్
జేరఁగ వారసతీమణి
యారసి తా లేని శక్తి నందుచు నంతన్ 241

సీ. బత్తి తోడుత నిల్వఁబడి హజ్జ కెందమ్మి
కెంపులు దనే దల పెంపుఁ జివురు
టాకు కెంజిగి సరిమై కనుపట్టు సా
ష్టాంగదండప్రణామాళి నొసఁగి
వలపులన్ మొలపించు పన్నిటితోఁ బాద
యుగళమ్ముఁ గడగి బాగొప్ప జిలుఁగు
సరిగ పయ్యెద నొత్తి సరగఁ దత్పదతోయ
ములఁబుడిసెళ్ళతోఁ బొసగఁ ద్రావి

తే.గీ. పూజ లతనికి నొనరింప భోగయువతి
కగద మానె పిశాచంబు లవలి కేఁగె
చేతితో ముట్టి దీసిన భాతి మీర
మనమునను బొల్చె స్వస్థత మగువ కపుడు 242

సీ. గంధంపుఁ బూఁతచల్లందన మొప్పారు
డెందంపు బాపఁడా చందన మిదె
కంబూర పల్కు దే కప్పురంబును నెక్కు
సక్కు మాడెడి కీర్తి జాలువాఁడ
కెంపుసొంపుల నింపు కెంగేలి డాల్వాడ
నర్పింతుఁ గుంకుమం బందు మిదియె

గానుము తమ్మంమిదె గానబైన కెమ్మోవి
బలుకాలి జిగిసిరి వరలువాడ

తె.గీ. యనుచు నుపచారవాక్యమ్ము లతివమిన్న
జాణ గావునఁ బచరించి జ్ఞానయోగి
వరున కొసఁగె నపూపాది భక్ష్యములను
సత్కృతులకును నాతఁడు సంతసించె. 43

క. సన్నని వలువ లొసంగెను
చెన్నగు పూవుల నొసంగెఁ జెలఁగుచు నటుఁతన్
హొన్నుజగా నేరళమిడె
నన్నెలఁతుక దానికాతఁ డందె ముదమ్మల్. 244

వ. అది యెందేని నపపాదించిన పుణ్యలేశంబున నిట్లువేడె. 245

ఉ. నీవు పరాత్మనిష్ఠుఁడవు నిన్ననినంత మదీయరోగముల్
బోవుట గల్గె నాయసువు బొందిని గల్గెడు నంతవట్టుకున్
నీవ కదా పరిపూజ్యుఁడవు నేజగతిన్ మనునన్నినాళ్ళు బూ
జావిధి నిన్నుఁ గొల్చుటకు సమ్మతి లంగదె యోగిపుంగవా. 246

క. అన విని ప్రారబ్ధవశం
బున నాతండీయకొనెను పోవదుగాదే
తన ప్రారబ్ధం బనుభవ
మునఁ గాక మరొక్కమార్గమున గోవిందా! 247

క. మూఁడేఁడు లిట్లుభోగపుఁ
జేడియ తలమానికంబు చేయు సపర్యన్
బోఁడిమిమెయి ముక్తిఁ గనెన్
చూడన్ ముక్తికిని వేరె చొప్పులు గలవే. 248

ఆ.వె. వారవనిత దాసి పరివారమును బాంధ
వాళి ముక్తిఁగాంచి నారు జ్ఞాని
నెఱిఁగి పూజఁజేసి యెందరెందరు ముక్తి
నొందలేదు మున్ను కుంద వినుము. 249

తే. గీ. ఎచ్చటెచ్చట సుజ్ఞాని మైనయు నిరత
మచ్చటచ్చటనే సుందు రంబుజాక్ష
యెంత దవ్వుల నున్నను నెఱిఁగి జ్ఞాని
కెఱఁగ వలయును మోక్షార్థి యింత నిజము. 250

మ. నిమిసంబైన తదర్ధకాలమయినన్ నిల్చున్ లసద్జ్ఞానయో
గి ముదంబందుచు నెచ్చటెచ్చటను చక్రీ! సర్వతీర్థంబులన్
విమలోర్మిప్రకరోరునృత్యములతో విచ్చేసి నిల్చున్ సదా
సముఁడున్ గల్గఁ దొకండు నెందు మది నెంచన్ జ్ఞానపూతాత్మ
తోన్ 251

చ. వలిమల కూర్మిపట్టి పయి వత్తిలు నెమ్మిని మీరుచుండు ని
మ్ముల నెదయందు జ్ఞానమణి పొల్పుఁగ నిల్పు మహాత్ముపైన నా
కలరెడి నెమ్మి జ్ఞానియొకఁ డాత్మఁ డయౌనని నిశ్చయించితిన్
దలపఁ దదన్యులందరు సుదారులె యైన మదన్యులేగదా. 252

తే.గీ. నే వచించిన విద్దెను నిక్కమెవ్వఁ
డాత్మ గ్రహించు నవ్వాఁడనంత విద్య
లాదరింపక విడుచు ధాన్యములఁగొన్న
వాఁడు పొల్లును విడువఁ దే పంకజాక్షి. 253

క. ధర యెల్ల జలప్లుతమై
వరలెడి సమయమున దప్పి వారింపఁగఁ గూ
పరసంబుల ఁగోరని వడ
యరయఁడు సుజ్ఞాని యెన్నఁ డామ్నాయములన్ 254

క. సులభంబే నరజన్మము
సులభమె త్రైవర్ణికైక శుభజన్మంబున్
సులభమె బ్రహ్మజ్ఞానం
బలఘుశ్రుతివాక్యమనన మదిసులభంబే. 55

క. అతివర్ణాశ్రమి నద్వయ
సతతానందస్వరూపు సద్గురు నొకనిన్

మతి నెఱుఁగని వానికి నే
గతినై నను నెన్నఁడైనఁ గలుఁగును ముక్తుల్. 256

ఉ. నన్ను నెఱుంగకుండఁగ మనంబున మోక్షము నొందఁగోరు వాఁ
డెన్నఁగ నాకసంబు గొనియే దెరచాపను చుట్టునట్లు జో
కన్నెరి చుట్లు చుట్టుగొనఁ గాఁదమకించెడి మూర్ఖుఁడించుబ
ల్కన్నడి బీరువోదుగద జ్ఞానియె ముక్తికి నర్హుఁడేఁ జుమీ! 257

ఉ. ఎత్తిన యట్టిపుట్టువుల నెయ్యెడ నించుకయైన పాపపున్
వృత్తుల పొంతఁ బోక కడు సెంపుఁ దలిర్చెడి పుణ్యశీలసం
పత్తిని బూనువాఁడగును బ్రహ్మవిదుండు మదీయమౌ దయన్
జిత్తవినిర్మలత్వములు జేకొను వారలె జ్ఞానపాత్రముల్. 258

క. అపరోక్షజ్ఞానము దృఢ
మెపుఁడగు దేహికిని నప్పుడే పుడమిని నో
యపఘనముం బడుగు నంత
నపనయముం గాదు భేదమవ్వలఁ బోవున్. 259

క. తొలుతనె నిక్కంబెంచిన
కలుగని సంసారమెఱుక గలిగినచో న
వ్వల కాయమెడల నింకం
గలుగునె సంసారచక్రగతులిట్టివియా. 260

క. కానన్ బ్రహ్మాత్మజ్ఞా
నానూనశ్రీలెసంగు నంత్యభవంబం
దోనళిననేత్ర! యనియా
శానుం డానతి నొసంగె సంయములారా! 261

చ. పలికి యిటుల్ త్రయీమయుఁడు పర్వతమూర్ధనివాసుఁ డాత్మభ
క్తులకు ఫలప్రదానములు కోర్కె కొలంది నొసంగు వాఁ డుమా
లలితకరాంబుజగ్రహణలాలసుఁ డీశుఁడు బల్కె నేమియుం
గలఁగమి నూరకుండెఁ బలుకంగల దున్నదె యన్నె మెన్నగన్

శా. వేదార్థంబుల నెల్ల నీశువలనన్ విన్నంతనే బత్తితో
యాదోనాథసుతామనోహరుఁడు శీతాంశుస్ఫురన్మస్తకున్

వేదండోజ్వలచర్మచారువసనుఁ డై పేమారుకీర్తించి త
త్పాదద్వంద్వము గేలుదోయి గొనె మోదంబొప్పు డెందంబునన్

క. మోకరించుచుఁ దలపై
ప్రాకటభూషణము గాఁగ పద్మదళాక్షుం
డా కైలాసనివాసా
స్తోకామలపాదయుగము జొక్కుచు నిలిపెన్. 264

క. శివునిప్రసాదమునఁగే
శవునికిదొరఁగుటయుఁగల్గె సంస్కృతిగతిప్రా
భవమునఁ నభవుఁడు ఖగవా
హనుముందటదివ్యనృత్య మాదృతి సలిపెన్. 265

క. సురలును సురపతియును దన
పరివారము గాఁగ తనదు పజ్జల మెలఁగన్
హరుఁ డందరితో జనెఁ బుం
డరీకపురవరము నెనసి నన్ ముదముండున్. 266

క. అని సూతుఁడు వినిపింపన్
విని మునిజననివహ మంత వినయ మ్మొదలన్
జనియింప దండ నతిశత
మొనరించిరి సూతునకు న హో! యదితగదే? 267

8. వ్యాఘ్రపురమున దేవోపదేశము

క. పిదప సభాసదు లెడఁదన్
ముదమును సంభ్రమము జెలఁగి ముప్పిరిగొనఁగా
సదమలవదనాలంకృతి
బొదలఁగఁ బ్రశ్నించి రతుల పూతున్ సూతున్. 288

చ. గిరిశుని వల్ల జ్ఞానమిటు కేశవుఁ డాత్రముతో గ్రహించి భా
సురమతిమద్వరిష్ఠుఁడయి సుత్యచరిత్రుఁడు నయ్యెనంచు బం
ధురతర వాగ్విజృంభణము నాల్కొనఁబల్కితివీవు పిమ్మటన్
హరి చరియించె నెట్లు కరుణాకరవాకొని మమ్ముఁ బ్రోవవే! 269

ఎ. అంత లోకవిఖ్యాతుఁడైన సూతుండుపన్యసింపందొడంగె. 270

చ. ప్రతిజనముఖ్యులార! గడు శ్రద్ధమెయిన్ వినుఁడీవచింతు దై
వతమణి శర్వుతోడ హరి వ్యాఘ్రపురంబును జేరుచున్ నమ
స్కృతు లొనరించి స్తోత్రములఁ జేసి తదాజ్ఞను బొంది గారుడాం
చితనుతవాహనుండగుచుఁ జేరె వికుంఠపురంబు నాదటన్. 271

ఉ. ఎంతటి ధన్యుఁడయ్యెఁ బర మేశ్వరపాదసరోజభక్తుఁడై
అంతము లేని సంస్కృతికి నంత మొనర్చి రథాంగపాణి ని
శ్చింతగ నేగువాఁడని య శేషసురల్ నుతియింపుసొంపు ల
త్యంతముద మ్మొనర్ప నసు రారి వికుంఠముఁజేరి రాజిల్లెన్. 272

ఉ. పిమ్మట విప్రులార! బలు వెల్వులు వేలుపుఁబెద్ద నగ్రభా
గమ్మున నుంచికొంచుఁ గర కంజము లెత్తుచు భక్తితోఁ బ్రణా
మమ్ము లొనర్చి స్తోత్రములు మానితరీతిఁ బఠించి మేలిప్ర
శ్నమ్ము జగమ్ము మెచ్చ ఫణి శాయికి డగ్గరఁబల్కె రొయ్యనన్

తే.గి. దోయిలించిన చేతుల తోయజాక్షి
మనవిఁజేయుదుమానతి మాకొసంగు
మయ్య వెనకయ్యయయ్య నొయ్యనీవు
విన్న గోప్యంబులం దెల్ప వేడెద మిట. 2 4

క. అని పలికిన హరిమీరడి
గిన యార్థము లోకహితము కేవలశుభదం
బును నైన మీకునేఁ జె
ప్పను శివుఁడే మీకుఁ జెప్పుఁ బదుఁ డయ్యెడకున్. 275

క. హరుఁ డిప్పుడు నుండును బుం
డరీకపురవరమునందు నం గావున మీ
రరుఁగుం డానగరము జను
స్వరాట్పురుషహృదయజలజ వరమధ్యమనన్. 276

చ. ప్రతిదినపక్షమాసఋతు వర్షములన్ గడు శ్రద్ధతోడ నే
ప్రతియయినన్ బురంబు జన వానికి మోక్షము లభ్యమెన్నఁ గా

మితములకెల్ల ప్రాపుమితి మీరు నఘంబులనెల్లఁ ద్రోఁపు ను
చతిశయముల్ వచింపవలె నాపురి ప్రాభవ ముగ్గడించుచో

క. జపియింపుఁడు పంచాక్షరి
తపముల నొనరింపుఁ డచట దర్శింపుఁడు వే
లుపులకు వేల్పనఁ జను ఘన
కృపామయుని శంభు శర్వుఁ గీర్తింపుఁ డొగిన్. 278

క. మీపున్నెమ్మున నభ్రిస
భాపతి ప్రత్యక్షుఁ డగును పావనులారా!
రేపో నేఁడో యయ్యెడ
కే పయనం బవుఁడు మీర లిందఱు వినుఁడీ. 279

సీ. సిగమీఁద సొగసు నిం పఁగఁ గూర్చి దిద్దిన
చిన్నారి జాబిల్లి చిందులాడఁ
జక్కనై యొప్పు కెం జడల నడుమ వేల్పు
టేరు ముత్తిరులై పారె తొలక
సన్నని నూనూఁగు సౌరులందెడి పాప
జందెముల్ చిఱుత బొజ్జను నటింపఁ
గుత్తుకఁ గలనల్పు కోర్కెలీనెడి యాగి
మానికంబన తళ్కులూని మెలఁగ

గీ. మేల్మి బంగారు కడియముల్ చాల మ్రోయ
మొనసి రుద్రాక్ష తావళంబులును గదల
మహితతాండవపాండిత్య మండితుఁ డగు
నభవుఁ డచ్చట మీకుఁ బ్రత్యక్షమగును. 280

ఉ. భాను గృశానునిన్ శిశిరభానుని గన్నులు గాగఁ నేలి యా
జానుకరద్వయుం డునయి స్వర్ణవిభూషణమండితుండునై
మేనున బూది బూసికొని మేదురహారము లుల్లసిల్ల నీ
శానుఁడు మీకుఁ గానఁబడుఁ జయ్యన నేఁగుడు మీరలియ్యెడన్.

క. మెరసెడి చిరునవ్వులతో
వఱలెడి మొలనూలు వెలయ ప్రసన్నని మొల్లల్

కరణిని జందుర పగిదిన్
మురు వెనసెడి తనువుతోడ పురహరుఁ దలరున్. 282

మ. భవభీతాత్ముల నోముచే యొకటియున్ భక్తేఘముం గాంచి చె
ల్వవు చే యొక్కట నొక్క ఢక్కఁగొని మోక్షయంజేయు చేయొ
క్కట
క్షవినోదోజ్జ్వలహవ్యవాహను నొగిన్ గెలించు చేయొందు పై
భవముల్ జూపఁగ దర్శనం బిడు శివావామాంగుఁ డత్తావునన్ 2*3

క. ఇంచుకయును నాత్మానం
దాంచితభూజాగ్రభాగమందుండ చ్యుతిన్
గాంచక యభ్రసభాపతి
నించుచు మీకోర్కి దర్శనీయుఁడు మీకౌ. 284

క. రాగాదిదుష్టకల్మష
పూగంబుల నంటకుండి పూతంబయి నీ
రోగము ను ప్రసన్నంబగు
భోగివిభూషణుని మూర్తి పొలుపులఁ గులుకున్. 285

క. ఉపదేశించును శంభుం
డపరోక్షజ్ఞాన మంత్ర కన్నన్ మరి మో
క్షపదము వేరే గలదే
సుపర్వపర్వేందులార సుమతిన్ గనుఁడీ. 286

క. అని పల్కిన పలువల్కులు
విని వారలు పుండరీక విమలపురమ్మున్
జని జనితభక్తితాండవ
ఘను ఘనకారుణ్యవర్ష ఘను గాంచి రొగిన్. 287

వ. అచ్చట. 288

సీ. పూతభస్మోద్ధూళ నాతినిర్మలతను
సంగతిన్ తపముల సల్పినారు
పంచాక్షరీమంత్ర పాటవమ్ము లెఱింగి
మించి లక్షలను జపించినారు

ఉత్తమోత్తమధనా లుర్వీసుపర్వుల
కెఱఁగి దానమ్ముల నిచ్చినారు
ఆత్మార్పణముఁ జేసి యభవదేవుని మనః
కుసుమంబు లర్పించి గొలిచినారు

తే.గీ. భావముల యందు నభ్రిసభాపతిప్రి
భావముల నిల్పి కోర్కులు పండు ననుచు
సేవ లొనరించినారు సంసేవ్యులైన
దైవతజ్యేష్ఠుఁడాదిగాఁ దనరువారు. 289

ఆ.వె పరమమంత్ర మగును బంచాక్షరపవిత్ర
మంత్రరాజ మెంచ మహితశివుఁడు
లోకగురువు నగును లోకమంగళ మగు
సప్రణవము జపము సల్పునెడను. 290

కం. పంచాక్షరమంత్రం బిది
యెంచన్ వేదాంతసార మెద నిల్పిన వాం
ఛించిన దేయదియును లభి
యించున్ భూసురులు వినుఁడి యిది నిక్కువమౌ. 291

కం. శక్తి కొలఁది నెవఁడేనియు
భక్తిన్ గిరిశునకుఁ గడు సపర్యలు సలుపన్
భుక్తియు ముక్తియుఁ గాంచున్
త్యక్తభవుండగుచుఁ బరమతత్వ మ్మరయున్. 292

క. లౌకికవైదికనుతవాక్
ప్రాకటసన్నుతుల నతుల పరమేశ్వరునిన్
లోకార్తిహరుని హరునిన్
పాకారిప్రభృతిసురలు వల్కిరి భక్తిన్. 293

చ. పరమకృపాకటాక్షరస భాసురవీక్షణుఁ డార్తరక్షణుం
డరసి సురేశ్వరాదుల నిరస్తసమస్తదురంతపాపులన్
గర మొనరించి ముక్తినయ కమ్రవచఃప్రకరైకపారసుం
దరతరనవ్యనవ్యవర తాండవలీలలు సూపెవారికిన్. 294

తే.గీ. తాండవంబును దర్శింపఁ దనర ముదము
తోడ వినయంబుతో భక్తితో మహేశ్వ
రునకుఁ బ్రణమిల్లి దివిజవరుల్ ప్రియంబు
గదుర సల్పిరి మేలి విజ్ఞాపనమ్ము. 295

క. మాభాగ్యము సామాన్యం
బే భావాతీత మాకు నిచ్చట నీవున్
నీ భార్యామణి దర్శన
లాభమ్ము లొసంగి నార లభ్యుల్ మీరల్. 296

క. అమ్మా యయ్యా యుపదే
శమ్మొనరింపుఁ డపార సంసారవినా
శమ్మొనరింప నుపాయ
మిమ్ముల మీకొసఁగు వార మిదె నతిశతముల్. 297

క. అవ్వేడికోలుఁ గొని తోల్
దువ్వలు వలవారు వేల్పు దొసఁగు తొలఁగ వా
కుప్రువ్వంగఁ జొచ్చె నటుపై
నవ్వడు వెఱఁగింతు విప్రులార! వినుండీ! 298

వ. ఈశ్వరేశ్వరుం డిట్లుపన్యసించె. సర్వజగదాస్పదమ్మును నైన యాత్మతత్వ మ్మొకండు మాత్రమ్ము తొల్త యుండె డిది అది చిదానందస్వరూపంబు. ఆతత్త్వం బేననుటకు సందియమ్ము లేదు. సర్వమోహిసమార్థ్యంబుగలుఁగు మాయాభిధానశక్తి తచ్ఛక్తియ యగు. అయ్యది యాత్మావిచార సమయములనఁగాని యన్యసమయమ్ములఁ బొడఁగట్టదు. ప్రళయవేళల సర్వనాశము సంభవించినను నాత్మఁ డొక్కఁ డెట్టుమార్పుఁ గనకుండును. వాని యంద ప్రపంచ సంస్కారబీజమ్ములు ప్రతిష్ఠితములు. తా నవిక్రియుఁడయ్యుఁ బ్రకృతివశుఁడై కాలవశుఁడై కర్మవాసనావశుఁడై యాక్షణపూర్వకమ్ముగ సృష్టి నొనరించి యందునఁ బ్రవేశించి తన్మోహితుండయి జ్ఞాతృజ్ఞేయజ్ఞానాత్మక త్రిపుటీఘటితచటుల సంసారచక్రబద్ధుండయి చిత్రవిచిత్ర

గర్భసంభూతుండయి సుఖదుఃఖాదిద్వంద్వపరాభూతుండయి యిప్పుడమిఁ బుట్టువుఁ గనును. పుణ్యకర్మ మొనరించిన నరజన్మము గలుగు శ్రుతి విహితకర్మతతి సాగించి మదనుగ్రహంబున విశుద్ధమతియయి యనృత జడదుఃఖోపేతంబయిన కరచరణాది సంఘాతంబున నపేతాసక్తుండయి ముక్తికాంతాలలితాంగుళీకరస్పర్శన కుతూహలోత్పులకితగాత్రుండయి చిన్మాత్రు నపరోక్షముగ నెఱుఁగును. 299

క. జ్ఞానమ్ము వలన మోక్షము
జ్ఞానాన్యమువలన నితరగతులుం గలుగన్
జ్ఞానేతరమ్ములును వి
జ్ఞానోపాయమ్ము లనఁగఁజను సురలారా! 300

క. పుణ్యస్థలసంచార మ
గణ్యాత్మజ్ఞానసాధకమ్మగు వేదా
రణ్యాదిసమ లగును శ
రణ్యమ్ములు మోక్షకాంక్షరంజిలు నేనిన్. 301

ఆ.వె. వేలుపులను నేను వేదముల్ చదువులఁ
దీర్థములను శైవతీర్థములను
ముక్తి తెరవులం దమోఘశ్రీతిస్ఫుర
న్మార్గములును గామె మహితుల కిల

తే.గీ. అలఘుపుణ్యఫలమ్ము వృద్ధాచలమ్ము
నాశవిధ్వస్తదురితవారాశి కాశి
సాంద్రభీషణభవతమోజాలములకు
ఘనతరోష్ణగభస్తి శ్రీకాళహస్తి. 303

క. శ్రీమద్వల్మీకాఖ్యపు
రీమహితస్థలము పుండరీకపురవర
మ్మీ మహిని వెలయ శ్రేయ
స్కాములు విచ్చేయఁదగిన శైవస్థలముల్ 304

క. ఏ నుడివితి నుత్తమవి
జ్ఞానము సర్వార్థపారగమనుచు మీరల్

బూనుఁడు పుండరీకపు
రీనుత సేవనము ముక్తికిఁ బ్రోతి నెఱుఁగుఁడీ. 305

క. శ్రుతిసమ్మత మియ్యది నే
నతిమోదమున మీకుఁ బల్కితి యలరుఁడు సత్య
వ్రతులార! దివిజులారా!
మతిమద్వరులార! విబుధమండనులారా! 306

చ. అని వచియించె దివ్యులకు నభ్రసభాపతి యద్రిజాప్రియుం
డినశశివహ్నిదృక్కుఁ డకహీనజగత్పరిపాలకుండు బం
ధనకృతబద్ధజీవశుభప్రదమోచకచక్రవర్తి పా
వనసకలశ్రుతిప్రకటవైభవుఁ డీశుఁడు శర్వుఁ డయ్యెడన్. 307

మ. విని వైకుంఠనివాసభాసురసురల్ వేసార్లు భూమీతలం
బున సాష్టాంగనతిప్రతానముల శర్వున్ బ్రీతునింజేసి స్తో
త్రనికాయంబుల నర్పణమ్మొనిడి శుద్ధస్వాంతులై ముక్తిబం
ధనులై యచ్చట నుండి యేఁగిరి విహంగతంబున్ దగన్ జేరఁగన్

## 9. ఈశ్వరనృత్తదర్శనము

వ. అంత నయ్యణిమాండాదిప్రభృతిమహర్షిఋషభులు సూతునకుఁ బ్రముదితాంతరంగులయి యిట్లు విన్నవించిరి. పూజ్యవరా! ప్రాజ్యసాయుజ్యసామ్రాజ్యంబు తెఱంగు సంక్షేపవిస్తారసారవచోనిచయంబుల నుడివితివి భవత్ప్రసాదవిశేషంబున భవదుపన్యాసం బెఱుఁగఁగలిఁగితిమి. పుండరీకచర్మాంబరధరుండు పుండకరీరాక్షి నండ నఖండతాండవమొనరించి నట్లుబలికితి వది వినినప్పటినుండియు దన్నిరీక్షణకుతూహల దోహలుల మైతిమి. కాన నదుపాయము దయామయుండవై మాకానతీగదే యని వేడిన సూతుం డిట్లాడందొడంగె. నందీశ్వరశౌనకసంవాదము తొల్లి ప్రవర్తిల్లె. శౌనకుం డొకపరి నందీశ్వరుఁ జేరి నీవీశ్వరసన్నిధానవర్తివి కదా నటరాజనృత్యంబులు నీకంటికిఁ బలుసారులు వినోదంబులం గూర్చియుండుమమ్మొఁ గరుణించి మాకుం జూపింపుమా యని ప్రశ్నించిన నందీశ్వరుండు కరుణాకరుండగు పార్వతీశ్వరునకుఁ బ్రణమిల్లి యిట్లు వలికె. కైలాసాద్రిని భద్రనృత్యం బిరుసంజల రుద్రుం డొనరించు

నయ్యాది యుమాదేవికిని స్కందవిఘ్నేశ్వరులకు నాకును మాత్రము చూడనగును. మఱియు శివప్రసాద మేరి యెడ మేదురమై విలసిల్లు వారును మహానటనాట్యవిభూతి నచట దర్శింప యోగ్యులుకాన తత్ప్రసాదంబు సంపాదించు వడువు నుడివెద. పుండరీకపురమున కరిగి యరుణ గభస్తి నభోభాగ మలంకరింపక మున్న ప్రాతఃకాలమున నార్ద్రానక్షత్ర ముసందు మహనీయమైన శివగంగను గ్రుంకులిడి, యకలంకశుచిసమీచీనబహిరంతఃకరణమున విలసిల్లి యీసు గల్గని భూసురు నన్వేషించి ధనధాన్యంబులఁ గాని తదితరవస్తువులఁ గాని శక్తి కొలఁది దానంబొసఁగి యేకదినమైన నుపవసించి శ్రీమూలస్థాననాయకునకుఁ బ్రదక్షిణంబు లర్పించి సాష్టాంగదండప్రణామంబులఁ గానుక వెట్టి శ్రీమత్పంచాక్షర దివ్యమంత్రంబు పదివేలు జపియించి యనుదినము నొకవత్సరము పాటు శివగంగాస్నానాంతరమున క్షేత్రపాలకు నుపాసించుచు శ్రీమదభ్రసభాపతిని వాని సతిని దర్శించుచు దండనతుల నెఱగుచు యథాశక్తిఁ దను మనోధనములు తదాయత్తములని నివేదించి నియమంబు నడిపిన పుణ్యులకు మహాదేవప్రసాదం బెసంగు నిటులొనరించి పారికాంక్షిజనంబు లెందఱెందఱో యీశ్వరనృత్యదర్శనభాగ్యము లొందఁగలిగి సఫలీకృత మనోరథులైరన విందుము. అని నందీశ్వరుం డానతిచ్చిన నాకర్ణించి తత్ప్రకారం బొనరించినఁ దృప్తుండై గిరిశుండు నృత్యవైభవమ్ముఁ జూపించి కృతార్థుఁ జేసి శౌనకా! శాకల్యకృతపదవిభాగ మనుసరించి యాదివేదమైన ఋగ్వేదము నిర్వహించునది యని యానతీయ నట్లొనరించెను. శౌనకుఁడే తద్రహస్యమును నిజశిష్యరత్నమైన యాజ్ఞవల్క్యున కుపదేశింప నతఁడును దాని ననుసరించి కృతకృత్యుఁడై తాండవదర్శన బలజనితబుద్ధివైభవమున (దన్నామప్రసిద్ధసూత్రముల రచియింపంగలిగె. కావున విప్రాగ్రేసరులారా! మీరునట్టు లాచరించి మీయభీష్టము నెరవేర్చు కొనుండని మద్గురుండు పద్మనాభాంశసంభూతుండునగు వ్యాసుండు నా కుపన్యసించిన రహస్యము మీకెఱిఁగించినాఁడ నని సూతుఁడు పలికి పారాశరు స్మరియించె నంత. 309

సీ. మేలైన బలులేడిక తోలుసాలు చెఱంగు
లీలమై భుజముపైఁ గ్రేలుచుండఁ
గెంగేల రతనాల కరంగుల బెత్తమ్ము
కరణి మోదుగజువ్వ వఱలుచుండ
తెల్లక ప్రపుఁబల్కుఁ దేజుఁ జిమ్మెడి బూది
పూఁతదళ్కులు మెనమెరులుచుచుండ
నదురైన రుదురాక్ష నాణెంపుఁ బేర్లెద
వెలలేని సొమ్ములై వెలయుచుండ
తే గీ. అలరి నాలుకపైన పంచాక్షరమ్ము
తాండవము సేయుచుండగా దన్నుఁబోలు
శిష్యులెల్లరు దనచుట్టుఁ జేరి కొల్చు
చుండ సాక్షాత్కరించె వ్యాసుండు చెంత. 310

చ. అరసి మహర్షిసత్తము రయమ్మున శిష్యులతోడలేచి యు
ద్వర పయి వ్రాలి దండ నతిభక్తిని సల్పి తదీయపాదయు
గ్మరుచిరవారిజద్వితయకాంతి లతాంతముఁ బోలెనొదలన్
వఱలఁగఁ జేసి సూతుఁ డటుపైన నెదన్ గనుదోయి నద్దుచున్.

క. పరమముదం బెదఁ గదురఁగ
స్వరమున గాద్గద్య మొదవ సదమలవారిన్
గురువరు పదసరసిజముల
సరసంబుగ గడిగి పిదపఁ జవిఁ గొనెఁ దానిన్. 312

కం. అంతేవాసిగణాంతరు
శాంతిపరున్ సుజనగేయు సాత్యవతేయున్
సంతసమునఁ బూజించి య
నంతముదం బొందె సూతుఁ డయ్యెడనొయ్యన్. 313

మ. కరుణావార్నిధియైన వ్యాసముని వాక్యంబౌదలం దాల్చి స
త్వరుఁడై సూతుఁడు మౌనిబృందములతో వ్యాసార్యుని మ్ముందటన్
వరలం జేయుచుఁ బుండరీకపుర మొప్పం జేరి మేల్తారలోన్
వరబాణాసనరాశి భానుఁడు రహింపం గ్రుంకెఁ దీర్థాంబులన్ 314

క. తొలిదిన ముపవాసమ్మున్
సలిపి బుధావళికి దానసత్కారంబుల్
వెలయంగఁ జేసి యవ్వలఁ
గొలిచిరి శ్రీమూలనాయకుని నవ్వారల్. 315

క. అమ్మూలస్థానాధిపు
ముమ్మార్లు ప్రదక్షిణమ్ముఁ బొనరిచి నతిపూ
తమ్మయిన షడక్షరమం
త్రమ్మున్ జపియించి భక్తిఁ దనిపిరి పిదపన్. 316

గీ. ఏటిపొడుగున నిట్లాచరించి యవల
నుచితదానమ్ములన్ బందితోత్కరముల
కొసఁగి శ్రీమూలనాయకునొయ్య గొప్ప
భావమున నిల్పి రభ్రిసభాపతినఁట. 317

క. వేదాంతసభాపతి స
మ్మోదంబున మౌనిపతులమ్రోలన్ గడు నా
ట్యాదరలీలలఁ జూపుచు
వె దర్శన మిచ్చి బ్రోచె వేడుక లలరన్. 318

క. ఒకకోటిపద్మమిత్ర
ప్రకరాభల నేలువాఁడు బహుళార్తిహరుం
డకళంకుండు కవాట
ప్రకటాయతవక్షుఁ డభ్రిపతి రాజిల్లెన్. 319

క. భాసురతద్రూపంబును
వ్యాసాదిమహర్షు లరసి యలరి నమస్సుల్
జేసి మెయి మఱచి భవమున్
బ్రోసిరి భవమట్లుగాకఁ దొలఁగుట యెట్టుల్? 320

క. కురిసెన్ పువ్వులసోనల్
మొరసెన్ దుందుభులు బూరలున్ మహనీయో
త్కరములు బరమముదంబులఁ
బొరసిరి జగమెల్ల మోదముంగని రొయ్యన్. 321

క. సుర లసురులు నచ్చరులున్
పరివారము లగుచు తనదుపజ్జల వెనుముం
దర సందడించుచున్ రా
నిరువురు కొమరులును గిరిజయెలమిఁ జరింపన్. 322

తె.గీ. నీలకంఠుఁడు త్రిభువననేతయయ్యెఁ
బుండరీకపురీవరమునకుఁ దాఁ బ్రి
దక్షిణమ్ము నొనర్చి యంత శివగంగ
మజ్జనం బాడి తీర్థసన్మాన మొసఁగె. 323

మ. కని నెందున్ దులలేని యట్టి శివగంగన్ గ్రుంకి యాపిమ్మటన్
ఘనపుణ్యుల్ దివిజాసురప్రకరముల్ కైవల్యముం గోరి బల్
ధనధాన్యంబులు వస్త్రవాహనములున్ దై వారు గోభూములో
య్యన దానంబు లొసంగి ధన్యతములై హర్షించి రెంతేనియున్

వ. శివగంగావిమలసలిలలులితమనఃకలితులై వారలెల్లరు పరాత్పరు
నకు నిట్లు నమోవాకానేకంబులర్పించిరి. 3.5

క. భీమాఖిలాఘసంఘము
లే మన్యువుచే నశించు నెంతయు దృటిలో
నామన్యువునకు నంజలి
మేము సమర్పింతు మయ్య మృడ! దేవేశా! 325

క. ఏ కఱకుటమ్ము తాఁకునఁ
జీకాకున్ బొంది సొమ్మసిలు నరిలోకం
బా కఱకుటమ్ము నీయది
మాకు నమస్కార్య మగును మాధవ యెపుడున్. 327

క. చెంగున నే బాహువులం
బంగరుకొండంత విల్లు బట్టెదవు మృడా!
గంగాధర! యాబాహుల
కుం గడు బ్రణమిల్లుదేము కోరిక నిండన్. 328

క. ఏకార్ముకమ్ము నీదుపి
నాకమ్మన కుద్దియొ గనన్ సత్యము గా

రీకాంత విల్లుఁగొను నీ
యాకారము మాకు వంద్యమనిశమ్ము హరా! 324

క. నీరూపమ్ములనే యవ
ఘోరమ్మును సౌమ్యమగునుగోర్కు లెడఁద నిం
డారఁగ నవ్వానిం గను
లారంగను గొందుమెమహార్యనివాసా! 330

క. నీలగ్రీవునకున్ వే
వేలుంగన్నులను జెలఁగువేల్పునకుం వే
వేలుంగేలుం బొలిచెడి
వేలుపుమిన్నకును నతులివే యార్పణమౌ! 331

క. కాలాత్మునకున్ సాంద్రిజ
టాలీలామస్తకునకుదండంబుగ ఁగేలన్
శూలమ్ముఁ దాల్చు దొరకున్
చాలగ మ్రొక్కెదము సుప్రసాదము గలుగన్. 332

క. అంజలి హిరణ్యపాణికి
నంజలియు హిరణ్యపతికి నంజలి భూరు
ణ్మంజులసదూప్రునకును
నంజలి హరికేశునకు సమర్పింతు మొగిన్. 333

క. పశుపతికిన్ వాగింద్రియ
పశుధనసంవిద్గృహాత్మభవశాశ్వతధ
ర్మశరీరగాత్రిమాంచిత
దశవిధపుష్టిపతి కెలమిదండ నతులివే! 334

క. శ్రుతిమార్గపతికి జగతి
వితతిస్థపతికిని భూతివిస్తృతిపతి కం
చితఋషభతురగపతికిన్
నతిశత మర్పింతు మేము నగజాపతికిన్. 335

తే.గీ. నారి వింటను దొడఁగినవీరునకును
మద్దిచెట్టున కుద్దియౌ మానితోన్న

తాంగునకుఁ బత్తిపతికి న నంతసత్వ
పతికి వీర్యవదోషధీ పతికి నతులు 33,

తె.గీ. వ్యాధు లెల్లను దొలఁగించు వైద్యమణికి
ఆధు లెల్లను బోకార్చు నమరమణికి
మంత్రరాజము లెఱిఁగిన మంత్రిమణికి
భావనాతీతుఁడై యొప్పు దేవమణికి. 337

వ. సాష్టాంగదండప్రణామమ్ము లర్పింతుము. మఱియు 338

తె. పలుతెఱంగుల దొంగల పాలి యొజ్జ
తలరుమాల్ దగఁజుట్టిన దంటమిన్న
యొలగము రూపమును గాంచి యొలగంపు
ఛేలికై యొప్పు వానికి నెఱఁగెదమిట. 339

తే.గి. నిదురఁ జెందిన గూర్చున్న నిలువఁబడిన
మేలుకొన్న నెవండు మ మ్మేలువాఁడు
వాని కెల్లప్పుడును మే మ నూనదండ
నతిసహస్రము లర్పింతు మతిముదమున. 340

గీ. సర్వసాక్షికి దండంబు శర్వునకును
దండమజునకు దండంబు ధరనివాసు
నకును దండంబు నంచు స న్నుతులొనర్చి
ధన్యతములై రి సాంద్రమో దమ్ము గనిరి. 341

వ. మఱియు సూతుండు వలికె. 3 2

మ. కరుణాసింధుఁడు గాన శంకరుఁడు సాక్షాత్కార మిప్పట్టునన్
దరలన్ జేసి ప్రసన్నభావుఁడయి యంతర్ధానముం బొందెఁదాన్
సురశత్రుల్ సురిలున్ వినుండెవఁడు సంశుద్ధాత్ముఁడై వ్యాఘ్రపూ
ర్వరమాహాత్మ్యము ముక్తిఖండము బఠింపన్ మోక్ష మవ్వానిదే

తె.గీ. ముక్తిఖండంబుఁ జదివిన బుధవరుండు
ముక్తిఖండంబుఁ జెవిఁబెట్టు పుణ్యతముఁడు
శ్రీసభాపతికరుణ వర్ధిల్లఁ బరమ
మోదమునఁ గాంచుఁ గేవల ముక్తిపదము. 344

తే.గీ జ్ఞానలక్షణ మొసఁగిన సద్గురుండు
వ్యాసమూర్తికిఁ గిలింతు నంజలిపుడు
ముక్తిసదనంబుఁజేర్చెడి మోచకుండు
భవుని కర్మిలి నర్పింతుఁ బ్రణతిశతము. 345

తే.గీ. ప్రత్యగాత్ముండు తానయై పరిఢవిల్లి
గట్టుదొరపట్టిచేపట్టి ఘనత నెనసి
విపరిలోపం బెఱుంగని వీక్షణమ్ము
గాంచు శివునకు మన్నమస్కారశతము. 3.6

—: గ ద్య ము :—

ఇది 'కవితావిశారద' శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతంబైన శ్రీమదాంధ్ర సూతసంహితా మహాగ్రంథంబునందు ముక్తి ముక్త్యుపాయమోచక మోచకశబ్దార్థ చతుర్విధప్రశ్నములును ముక్తిభేద కథనంబును ముక్త్యుపాయకథనంబును మోచకకథనంబును మోచకప్రద కథనంబును జ్ఞానానుత్పత్తి కారణ కథనంబును గురూపసదన శుశ్రూషణమహిమయు వ్యాఘ్రపురంబున దేవోపదేశంబును నీశ్వర నృత్తదర్శనంబు నను విషయములు గల ముక్తిఖండము సమాప్తము.

# శ్రీ సూతసంహిత

## 4. యజ్ఞవైభవ ఖండము

### (పూర్వభాగము)

### 1. సర్వవేదార్థప్రశ్ననిరూపణము.

ఉ. ఆదియు నంతమున్ గననియిట్టిది యంచు డెందమిం
తెఁ దలపంగరానిది యనేకశుభంబులఁ గూర్పఁజాలి యే
భేదముఁ గలుగకుండునది భీకరసంసృతి మాన్పు నౌషధం
బై దయివారు నట్టిదియు నైన శివోజ్జ్వలమూర్తి నెన్నుదున్ 1

వ. సత్త్రార్థ మరుదెంచిన యశుభలతాలవిత్రులుఁ బరమపవిత్రులు స్వగాత్రోద్భూత తేజఃపుంజ నిర్జితపద్మమిత్రులు దూరీకృతాంత ర్బహిశ్శత్రులునగు వారల నభివర్ణించెద. 2

క. అతిథుల కభ్యాగతులకు
నతిముద మొదవంగఁ బ్రియాలాపము లం
చితగతిఁ బలికెడి వారికి
మతిమంతులు సర్వలోకమాన్యులు దివిజుల్. 3

సీ. ఆద్యంతముగను స్వాధ్యాయంబు కరతలా
మలకంబు నొనరించి మెలఁగువారు
తమకంటెనుం గుణధనధాన్యముల మిన్న
లగు వారిఁ గని ప్రియంబందువారు
కడగండ్లఁ బాలగు బడుగుల నూరార్చి
జాలిగుండెల ప్రీలఁజాలువారు
కుమతిసంతతి యందుఁగూడ నుపేక్షాత్మ
లగుచుఁ దాటస్థ్యంబు నెగడువారు

తే.గీ. దురభిమానమునకు దవ్వుదొలఁగువారు
దొసఁగులెల్లను గడలకుఁ దోలువారు
బుద్ధిమాంద్యంబు చెంతకుఁ బోనివారు
తమము లెడలించి భవవార్ధి దాటువారు 4

సీ. వృద్ధులన్ సేవించి వేదవేత్తలఁ జాలఁ
బూజించి లోకసంపూజ్యులైరి
మార్దవార్జవములు మానక పాటించి
ఖ్యాతయశస్కులై యలరి రెలమి
భస్మరుద్రాక్షశోభాభరణాంచితు
లై కనువిందు లై యవుసుఁ గనిరి
నారచీరలును బెన్జడలఁ దీరుగఁ దాల్చి
కరమెల్ల దొనఁగుపొగడ్త మనిరి

తె.గీ. గురువులకు గోవులకు సేవ గోరి చేసి
శ్రుతులు స్మృతులు విధించెడి గతుల నడచి
భక్తివైరాగ్యముల నెద వరలఁ జేసి
యసదృశానందముల నొందియెసఁగిరి కడు 5

క. శివలింగార్చనపరులును
శివాభిమానధనవరులు శివశబ్దజపో
త్సవతత్పరులును శివభ
క్తివివిక్తహృదంతరులు నధృతమత్సరులున్. 6

క. సారాసారము లెఱుఁగుచుఁ
బారావారాతిఘోర బహువిస్తృతసం
సారోత్తరతీరమ్ము ను
దారగతిన్ జేరువారు చారిత్రపైరుల్. 7

క. అందఱునువాంధ్రు ఋషులే
యందఱును దిర్రిలోకహితకృతాదరమతులే
యందఱును వేదవిదులే
యందఱు శ్రద్ధాసమన్వితాత్మలె తలఁపన్. 8

వ. వారందఱు సత్క్రియాగానంతరమున నొకరమ్యస్థలమందుఁ జేరికొని. 9

ఆ.వె. నిఖిలలోకహితము నెమ్మది నూహించి
పరగ శ్రుతుల యర్థమరయఁ గోరి

కార్యభరముఁ దీర్పఁగల వ్యాససంయమ
శిష్యవరుని సూతుఁ జిత్తమందు 10

ఆ. వె. సంస్మరింప జ్ఞానసాగరుఁ డాజపం
జపపయోధితరణచణవరుండు
విశ్వకారణాత్మవిద్యాగరిష్ఠుండు
సూతుఁ డచటఁ బోఁచె శుభము లిడఁగ 11

చ. అతఁడు దయామయోత్తముఁ డహస్కరకోటిమహామహుండు సం
తతమృదులాంతరంగుఁడు సుదారశుభప్రదవాగ్విలాసభూ
షితవదనుం డశేషపరశేముషియై దనరారు ధీరుఁ డం
చితనయవర్తనుండు గుణసింధువు పండితబంధు డెన్నఁగన్. 12

క. ఆరసి వారెల్లరునుం
బౌరాణికవర్యు డాసి బహుదండనవి
స్ఫారాధృతిసత్కృతి నిం
పారం బొనరించి పాద్యమర్పించిరొగిన్. 13

తే. చెలఁగి యమ్మునివరసుఖాసినుఁ జేసి
యడుగుఁ దమ్ములఁగడిగి లసితాంతగంధ
వాసితార్ఘ్యంబు లర్పించిభాసురార్చ
నంబు నొనరించి గనిరి మోదంబు మివుల. 14

వ. వా రుచితవచనంబులఁ గుశలంబడిగి సకలశ్రుతితాత్పర్యం బను
గ్రహింపవే యని వేడిన సుప్రసన్నవదనారవిందుండయి స్వాచా
ర్యుఁడైన వ్యాసవర్యునిన్ లోకాచార్యుండయిన శ్వశురీకృత
హిమాహార్యునిన్ ధ్యానించి సకలవిద్యాస్వరూపిణి యగు నంబిక
కుఁ గేలుమోడ్చి విఘ్ననివర్తకుండగు గజవక్త్రు నుపాసించి
సదాపవిత్రుండగు దివిజదండనాథునకు సాష్టాంగదండప్రణా
మంబు లర్పించి కరముల జోడించి సూతుండు విదితవ్రతులగు
మునివ్రాతంబుల నవలోకించి యుత్తమవేదార్థం బుపన్యసింపం
గడంగె.

ఉ. అంజలి గూర్తు సర్వభువనైకవిధాతకుఁ దామసచ్ఛటా
భంజనకర్త కగ్నిశశిభాస్కరవాయుముఖాదివీర్యవత్
పుంజ మెఱుంగ రాని యొకమోహనతత్త్వవిశేషవల్లరీ
మంజులసూనబృందనవమంజరికిన్ శివమూర్తి కిమ్మెడన్. 16

తే. అలఘుభవపాశనాశనియయి పరాను
భూతి యన నొప్పిబహువిధపుణ్యలోక
విభవవిగ్రహ మెసఁగంగ వెలసి చిత్త
భవ్యతను గూర్చు లేమ యుపాస్య నాకు. 17

చ. తలఁపఁగ నేలతాలలితతన్వి సదాశివు నంతవాని కు
జ్జ్వలతరభూషయై తనరిసర్వజగంబుల సర్వమంగళా
మలవినుతాఖ్యయైఁ చెలఁగిమన్ననలంగను నానతిన్ విని
శ్చలమతి ధ్యానమున్ సలిపిశాశ్వతపై భవ మేను గాంచెదన్ 18

2. పరాపరవేదార్థవిచారము

వ. అయ్యలారా! శ్రద్ధాబద్ధచేతస్కులై వినుండు శ్రద్ధావిరహితకార్యం బెన్న ఫలం బీనేరదు. వేదము పరవిద్య, యపరవిద్య యని యిరు తెఱఁగుల నెఱిఁగించు నం దపరవిద్య ధర్మాధర్మరూపయగు. అధర్మము పరిత్యజించుకొఱకే వర్ణితము. అధర్మత్యాగమున ధర్మ మకలుషితమై యుండు. దాన జ్ఞానరూప యయిన పరవిద్య యుదయించు. ఈశ్వరుఁ డధిష్ఠానము తదాశ్రియమాయ తచ్ఛక్తి యగు దానికి దుర్ఘటఘటనశక్తి గలుగు. అయ్యదనాదియయ్యు సాంతమగును. కల్పితమాయానాశమనవాస్తవాధిష్ఠానశేషమగుట కంటె వేఱుగాదు. ఇంద్రియగోచర మవాస్తవము. భావాభావ వస్తులు కల్పితములు. సర్వాధిష్ఠాననాశ మెన్నండు గలుగదు. తద్దర్శనము సంసారకర్మనమ్మగు. ఈశ్వర సాక్షాత్కారము మోక్షము కంటె వేఱుగాదు. జ్ఞానాధికారి పరమహంస. వేదాంత శ్రవణమును నవనిధిరాసుల వలన వానికి జ్ఞానము జనియించు తదితరులకు వేదాంతశ్రవణాదులు క్రమముక్తి హేతువులగు.

వానప్రస్థుఁడును బ్రహ్మచారియు సత్యలోకమును, గృహస్థుఁడు పితృలోకమును, సన్యాసి శివజ్ఞానము నుపనిషచ్ఛ్రవణమువలన నొందుదురు. మఱియు చతుర్విధసన్యాసులలో కుటీచకుఁడు జ్ఞానేచ్ఛాబాధకమైన సర్వప్రతిబంధకమునుండి విముక్తియు, బహూదకుఁడు శాంతిదాంత్యాది జ్ఞానాంగసంపాదనేచ్ఛను సర్వోపనిషద్వాక్య విమర్శేచ్ఛను బరమహంస మాత్రము కేవల జ్ఞానమును శ్రుత్యంత శ్రవణము వలనఁ గాంతురు. ఈనాల్గవ తరగతి యతియే కర్మసన్యాసి కడమ మువ్వురుం గామ్యకర్మపరిత్యాగమునం జేసి భిక్షుకులని సామాన్యముగా వ్యవహరింపఁబడుచున్నారు. గురూపదిష్టబ్రహ్మవిజ్ఞానము పరోక్షమైయది శాబ్దజ్ఞానము మాత్రమయ్యె నేని బుద్ధిపూర్వకకృత దురితములఁ దొలఁగించు. అట్టిజ్ఞాన మపరోక్షమయ్యెనేని నది యపార జన్మమృత్యుపరంపర నందఁజేయుఁ గాన భూసురప్రవరులారా! మీరెల్లరుఁ బరమహంసపదవీస్వీకరణమునకై సర్వదా ప్రయత్నింపుఁడు,యత్యాశ్రమములలోఁ దొలుతటి మూఁడును సంపాదింపఁగోరు వారు ప్రాజాపత్యేష్టిని, నాల్గవది సంపాదింపఁ గోరువా రాగ్నేయేష్టిని నిర్వహింపుడు పిమ్మట సంయతమానసులు నందరు త్రైధాతవీయేష్టి నొనరింప వలయు. అనగ్నిహోత్రులగు విప్రులకె తదిష్టికర్తృత లేదు. కానశ్రద్ధాపురస్సరస్వాగ్నినిర్వహణమెల్లరకుఁ గర్తవ్యమ్ము. విరజామంత్రపూర్వకము పూర్ణాహుతి నిర్వర్తించి ప్రేషోచ్చారణ మాచరించి యధ్వర్యుదత్త దండకాషాయాదులఁ బరిగ్రహించి, గురుపాదసరసీరుహముల కభివాదన మొసఁగి జ్ఞానార్థ మామ్నాయశిరఃశ్రవణము చేయుఁడు. ప్రతిషిద్ధంబుల వలె గ్రామ్యంబు దోషదూషితంబని యెంచి త్యజింపవలయు వేదసారం బగు ప్రణవమంత్రము కంటెఁ బరమహంసలకు వేఱె జప్యములగు మంత్రములు గల్గవు. కావునఁ దన్మంత్రంబు నిత్యయతులు జపించునది. ఓంకారము మంత్రరాజము. ఉమావామాంగుఁ డోంకారమంత్రార్థము. తదితరములగు రథాంగపాణ్యాదిదైవతము లౌకవిధముగాఁ బ్రణవార్థములనవచ్చుఁ గాని ముఖ్యముగఁ బ్రణవార్థములు గావు అవిముక్తస్థాన మీశ్వరవాసప్రథితంబయి యుండు. అది యతిజనసేవ్యము తత్క్షేత్రమునం దుపాస్యమానుఁడయి శివభగవానుఁడు ప్రత్యక్షస్వరూపం

బుతో జ్ఞానప్రదానము సేయు. విషభోజనముతోనాఁకలిఁ దీర్చుకొనువెంగలి వలె నవిముక్తక్షేత్రమునందు శివునుపాసింపనివాని ముక్తిప్రయత్న మపాయజనకమగు. సర్వాశ్రమవాసులు వారణాశీక్షేత్రమున శివుఁ గొలిచి శతరుద్రీయము జపించిరేని పాప మపనయించుటయే కాక జ్ఞానమునూనిన వారలగుదురు రుద్రైకాదశీమంత్రసమానపవిత్రమంత్ర మెచ్చటలేదు. పంచాక్షరీమంత్రప్రతిష్ఠుండయి పరమశివుండలరారు. చెట్టు మొదటఁజేయు నుదకాదిదోహదక్రియలఁ గొమ్మలు ఫలపుష్పభరితము లగు విధమున రుద్రజపంబు వలన శివుఁడు ప్రీతుఁడైన సర్వదైవతము లుం బ్రీతులగుదురు. మఱియు సత్వరజస్తమోగుణాత్మికయగు మాయ మహేశ్వరి యగు తద్వశుఁడై జీవుఁడు సంసారభావుఁడగు. సుఖజ్ఞాన వైరాగ్యవైశద్యములు సత్త్వజనితములు. తృష్ణాదుఃఖారుణిమంబులు రజోగుణములు. మోహభ్రాంత్యాలస్యవైల్యములు తామసగుణ సంభూత ములు. ఉత్తమమధ్యమాధమపదార్థములు క్రమక్రమముగా సత్త్వరజ స్తమోలభ్యము లని గ్రహించునది. కాన నెల్ల సంసారము మాయా మాత్రము గాని యన్యము గాదు. అయ్యది శివజ్ఞానమున నశించు. ఆస్తికులును మానరహితులునగు నెల్లరకు జ్ఞానయజ్ఞము పరమజ్ఞాన హేతుకమగు. యజ్ఞము స్థూలసూక్ష్మభేదముల ద్వివిధ మందు మొదటిది కర్మయజ్ఞము. రెండవది జ్ఞానయజ్ఞము. అదియ సంసారధ్వంసనక్ష మము. కాయికవాచికమానసికము లనఁ గర్మయజ్ఞము మూఁడు తెఱఁ గులు. నిత్యనైమిత్తికక్రియాచరణము కాయికము. తన్నిమిత్తమంత్రో చ్చారరూపజపము వాచికము. తద్దేవతాస్వరూపచింతనము మానసికము అవి యుత్తరోత్తరశ్రేష్ఠతరములు. మానసికము ధ్యేయభేదముం బట్టి రెండు విధములు. శివధ్యాన ముత్తమము. తదితర దైవతధ్యాన మధమము ముముక్షుజనములఁ బ్వచిత్తులు శివధ్యానాయత్తులు నగుదురు ఇయ్యది శ్రుతిప్రోక్తము. ప్రతిబంధసహితులకు విష్ణువు మోక్షదాతయని. శివుఁ డట్టిఁడుగాఁడనియుఁదోఁచు. వారి కెన్నటికిని గైవల్యమన్న దివ గతియు గాదు. మఱియబ్జభవాది దైవతములఁ బరమశివుకంటె నధికమని తలంచు వారధశ్శిరస్కులై యూర్ధ్వపాదులై నరకార్ణవపతితు లగుదురు. భవేతరు

లభవసములని యెంచువారికి మోక్షము కల లోని వార్త. కాని నికృష్ణులైన నగధరాదుల యందు బన్నగధరదృష్టినూనిన వారుబంధముక్తులగుదురు. భూపాలునియం దమాత్యబుద్ధి నిలిపి. భూపాలాగ్రహమునకు గుఱియగు మందునివలె సర్వేశ్వరుని యందుఁ దదపరదైవబుద్ధి నిలుపువాఁడు శ్రేయస్సు ఫలమగు శ్రుతిస్మృతివితతి వెదకిన జ్ఞానయజ్ఞము కన్న మిన్న మఱొండు విధింపఁ బడలేదని తెల్లమగు దురితభరితాంతఃకరణులకు జ్ఞానయజ్ఞము రుచింపక పోవుటయే గాక ద్వేష్యము నగును. ఏనికి విశుద్ధజ్ఞానము గలుగునో వాఁడు శివపర్యాయనామములను దచ్ఛిహ్నతిర్యక్త్రిపుండ్రభస్మానులేపనరుద్రాక్షమాలాభరణాదులను శివలింగార్చనలను గాశ్యాదిశివస్థానములను సర్వదాబద్ధాదరుండగు ఏనికి వానియందు ద్వేషానాదరోపేక్షాభావము లుత్పన్నమగునో వాఁడు జ్ఞానియగాఁడు వాఁడు శివజ్ఞానవంచకుండగు. సర్వాశైవాదరబుద్ధి ద్వైతసూచకమందురేని యట్లుగాదు. విదితరజ్జువునందు సర్వబుద్ధి బాధితమయి యనువృత్తిఁగనునట్లు జ్ఞానిపట్టుల శివస్థానాద్యాదరము భాధితానువృత్తిమాత్రమై యుండు. ఏతద్బాధితానువృత్తితో నైనను శివస్థలాదులయందెవనికి బుద్ధి పొడమదో వానిఁ గేవలభ్రాంతుఁ డనియు నజ్ఞాని యనియు ననవచ్చు.ఎఱుక తెరువెఱుఁగక యజ్ఞానాంధకార నిమగ్నులయ్యుఁగృతార్థులమని భావించుచుఁ గర్మలంపటులై చెడిపోవు వారు గొందఱును. నిష్కలంక జ్ఞానోదయప్రాక్కాలమున నపక్వజ్ఞానము మాత్రము చాలునని యెంచి నిత్యనైమిత్తికాది కర్మత్యాగ మొనరించి మఱికొందఱు జన్మపరంపర లొందుచుందురు. 19

తే. నేను నాయొజ్జ యొరులు నీకు జ్ఞానయజ్ఞ
వైభవమ్మును బ్రకటించుకు పలుకు నేర్పు
లింత గానము విడియాఁతకలీదిపలుకు
శాస్త్రనిర్మాతలకును వశశమ్మె తెలియ 20

తే. స్వాధికారానుసారులై శ్రద్ధతోడ
వినుతకపిలకణాదప్రభృతు లనంత
బుద్ధి విభవమ్మునం జేయు బోధలరయ
జ్ఞానములుగావు గానివిజ్ఞానములవి. 21

క. సాక్షాత్కరించి మును ఫా
లాక్షుం డెఱిఁగింప నెఱిఁగి వ్యాసాచార్యుం
డక్షీణకృపను ముని నను
శిక్షింపఁగ నైతి మేము శివవిభవజ్ఞుల్. 22

క. ఏనున్ మాగురువు శివ
జ్ఞానుల మిరువురము నింత సందేహములే
దో నళినభవముఖాబ్జా
నూనమరందములు వినఁ శివనూల్కొనుభక్తిన్. 23

క. మాగురువు నాకుఁ జెప్పిన
దీగోప్యము ముందు నెన్నఁ డెవ్వరికిని నే
నీగతిఁ బలికియెఱుంగను
ఓగుణనిధు లీరహస్య మొగిఁ గైకొనుఁడీ. 24

3. కర్మవైభవ నిరూపణము

ఆ. మఱియుఁ గర్మయజ్ఞ మార్గముల్ పూఁడగు
తెలియవలయు వానిఁ దెల్లముగను
కామ్యములను నిత్య కర్మముల్ నైమిత్తి
కములు నాఁ బ్రసిద్ధిగలదు జగతి. 25

వ. కామ్యములకుఁ గోరిక లీడేరుటయు. నిత్యకర్మములకు నాత్మశుద్ధియు, నైమిత్తికములకుఁ బ్రత్యవాయనివృత్తియుఁ బ్రాధాన్యముగా ఫలములగును. అందు మొదటికర్మమునందు మందభాగ్యులును, దక్కిన రెండు కర్మముల మహాభాగులును బ్రవేశింతురు. నిత్యనైమిత్తిక కర్మములు విధ్యుక్తములని శ్రద్ధతో నాచరించు వారికి మందఫలమును శివారాధనదృష్టితో నాచరించు వారికి శీఘ్రఫలమును గలుగును. నే నకర్త నభోక్త నసంగుఁడను కేవల శివుఁడనని యెఱిఁగి శ్రద్ధాసహితచేతస్కుఁడై కర్మయజ్ఞ మాచరించు వాఁడు శివాపరోక్షజ్ఞానము నొందును. మఱియు యజ్ఞమునందు యజ్ఞరూపుండైన విష్ణుని సందర్శించువారికిని విజ్ఞానమొదవి కైవల్యలక్ష్మి లభ్యమగు. యజ్ఞముల శివుఁ డొక్కఁడు

యష్టవ్యపురుషుఁడు తదితరపూజనము పరమశివపూజనాంగముగా నెఱుఁగునది. అటులఁ గాక శివేతరుల యజ్ఞప్రధానపూజ్యులఁగా నెఱిఁగి యజ్ఞ మొనరించువారు ఘోరనరకవాసు లగుదురు. ఏవేల్పు నామముచేత నర్థముచేతను మహేశ్వరుండగునో యట్టి వేల్పు సర్వజ్ఞుఁడైన శర్వుండ యగు. సర్వమహామహీపూజ్యుండాతండ. ఇంకొక రహస్యముం గలదు. శ్రుతివిహితములును శ్రుతినిషిద్ధములును గాని, నిమేషన కండూయానాది వ్యాపారములను శ్రుతిస్మృతినిషిద్ధ క్రియాకలాపములను గూడి శివారాధనబుద్ధితో నెవఁడాచరించిన నయ్యది మహాయజ్ఞమనఁబడు.

ఉ. ఘోరములైన పాపములఁ గూడి మహేశ్వరపూజగాఁగనే
ధీరుఁ డొనర్చువాని కగుఁ దివ్యవిశుద్ధికరాత్మబోధమ
య్యారె మహాగ్నిపచ్చిఁగను నట్టి సమిత్తతిఁ జుట్టు ముట్టి యా
పొరునటుల్ దహించి నతుఁ లందఁ డెస్సారిజనంబుచే నొగిన్. 26

శా. సారామ్నాయతతవ్రతోత్తముల కిష్టంబుల్ బొనర్పంగనౌ
ప్పారుంగాదె మహామఖంబన ననిష్టంబుల్ ప్రమాదావివే
కారంభంబున నెవ్వఁడైన నెటు చేయన్ బాతకం బొనుసం
సారం బారును మీరు నిష్టము ననిష్టంబున్ గృతంబైనచో. 27

క. సతత మ్మఖిలదురాచా
రతతిన్ దవులొందు వారి రచ్చలను నిరా
దృతిమెయిఁ గనక యుపేక్షిం
చితదృష్టి మెలంగ నౌ రుచిరయజ్ఞంబున్. 28

ఉ. ఏయెడనైన బౌద్ధమతమే ఘనమంచుఁ దలంచు వానిలో
కాయతసమ్మతంబు రుచియంచుఁ దలంచెడివాని వానిదే
వాయతనప్రతానముల నందలి విగ్రహరాజిఁ గాంచి సు
శ్రీయుత భక్తినాదరణ సేఁతయుఁ జెల్లు మహామఖంబయై. 29

ఉ. వైదికతాంత్రికక్రియల బాగు గ్రహింపక నైజబుద్ధిఁద
ర్కోదిత నూత్నపద్ధతుల నొయ్యన శ్రద్ధవహించు వారు శ్ర
ద్ధాదృతు లొప్ప దైవతము లంచెదియేన్ భజియింపగా మఖం
బై దయివారు శ్రద్ధయక దా ఫలమిచ్చును గర్మశాలికిన్. 30

ఆ. వె. బుద్ధితంత్రదృష్టిఁ పూజనంబులు గాని
శాస్త్రవిహితమైనసరణిఁ గాని
నరయ నమరఁ జేయుఁ నాస్తిక్యభావమ్ము
లందు వలన శ్రేయ మందు నరుఁడు. 31

వ. అటులైన శ్రుతివిహితమ్ములంబనియేమి యందురా యవి తదితరో పాసనలకంటె వీర్యవత్తరములు. రెండింటికి ఫలతారతమ్యామెంతైననుం గలదు. కాయికయజ్ఞవిధానంబు నుడివితిఁ గాన మీ రెల్లరుదాని నుజ్జగింపవలవదు.

## 4. వాచికయజ్ఞ నిరూపణము

వ. వాచికయజ్ఞముపన్యసింతుఁ బరుఁడనఁగ విషయభావియు ఁజిదంశ మునగు నీశ్వరుండు. వానినె బిందు వందురు. ఆపరునికిం బరుఁడును గేవలచిత్స్వరూపుండును శివుండవును. ఆపరాత్పరుఁడు కారణముగ స్వయంజ్యోతిష్ట్వస్వభావుండు పరనామధేయ శబ్దబ్రహ్మము ప్రాదుర్భవించు నయ్యది మూలాధారవాసముం గను నప్పుడుస్పందనరహితమయి పిండీభూతమగు దానిని'పర' యని యందురు ప్రాణులర్థములఁ బేర్కొన నెంచు సమయమ్మునఁ గలుగు ననిలము వలన ఁగొంచెము స్పందన మొంది నాభిస్థానవిహార మొనరించి మనోవిషయత్వ విశిష్టతగాంచి 'పశ్యంతి' నామాంకితమగు. అప్పుడు పరకంటె తేజశ్శాలియయి బంగరు రంగునం జెలంగు. అటుపైని బ్రహ్మనాడీప్రవేశముం గని తద్ద్వారా బుద్ధి కవిషమయి 'మధ్యమ' యనంబడు. మధ్యమావస్థ తత్పూర్వావస్థ కంటె నెక్కుడు తెజస్వంతమైన యగ్నివలెఁ బ్రకాశించు. పిమ్మట బ్రహ్మరంధ్రముం జేరి ప్రకాశానందలక్షణముల నొప్పారియది వైఖరీ సంజ్ఞ నెసఁగు. బ్రహ్మరంధ్రము శివాత్యంతప్రీతిస్థానము. శివునిబ్రహ్మ రంధ్రమున నుపాసించిన నతిత్వరితముగా ఁదదనుగ్రహము గలుగు. అందు మొదట మూఁడువాగ్భేదములు శ్రోత్రగ్రాహ్యములుకావు. నాల్గవది మాత్రము ప్రాణిజిహ్వాప్రయుక్తమయి కర్ణగ్రాహ్యమయిలోకమున కుపకరించి వ్యవహారము నెఱపు. మఱియు మధ్యమావస్థాపరిత్యాగానంతరము పరశ్రోత్రగ్రహణయోగ్యమగు వైఖరీస్థితినొందకుండు వాగ

వస్థ సూక్ష్మమనియుఁ కేవలవైఖరి యగు వాక్కు స్థూల మనియుఁ దెలియవలెను. చతుర్విధవాక్స్థానములలోఁ బరకు నాభియుఁ బశ్యంతికి హృదయమును మధ్యమకుబ్రహ్మరంధ్రమును వైఖరికిఁ దాల్వాదియుక్త ముఖమును స్థానములు. బ్రహ్మరంధ్రము భ్రూమధ్యాదిస్థానములకంటె నెక్కుడు పవిత్రమగుట పరమాధార మనియు వైఖరీకరణత్వ పూరక మగుట పూరక మనియు వాడఁబడును. మఱియు నగణ్యపుణ్యకర్మఫల భూతానందాభివ్యక్తిస్థానమగుట యది పుణ్యభాజనము నగును. ఆస్థాన మునఁ బ్రకృతివాచకమైన "సః" అను నక్షరమును బురుషవాచకమైన "హం" అను నక్షరమును గల హంసమంత్రమును సోఽహమనుటకుఁ బదులు సకారహకారలోపమున "ఓం" అనునేకాక్షర ముద్భూతమైనది. దానినే ప్రణవమంత్రమందురు. అది మంత్రమాత. మఱియుఁ దదర్థమైన "య" అనునది యపానవాయువాచకమును "ఉ" అనునది ప్రాణ వాయుసూచకమును నయి యారెండు నేకాక్షరమగుటయనఁ గుంభకావస్థ యయి ధ్యానస్థితి నొందుననుట సూచించును. ఈమంత్రము గురూపదేశ మున జ్ఞాని మఱియొకవిధమున నెఱుఁగఁదగదు. ఏతన్మంత్రము సర్వాం తరుఁడగు పరమశివవాచకమ్మౌట మంత్రరాజమ్మగు. ఇదిచేయెత్తి సత్య మని ముమ్మాఱును వచింతును. మంత్రవేత్త యీశ్వరాదేశానుసారి యయి మూఁడు నాలుగేండ్ల శిష్యయోగ్యతలు పరీక్షించి పిమ్మట శిష్యున కీయవలెను. అట్లు సేయక స్వేచ్ఛమెయి నయోగ్యున కొసఁగిన నకాల మరణము తటస్థించును. 33

తే. యోగ్యతాయోగ్యతలు సూడకొక్కఁడెన్నఁ
డైన నెవ్వరికీమంత్ర మాదృతి నిడు
వాఁడు గడియించుఁ బురుషార్థ పటలి నాశ
మొందు శిష్యుఁ బరీక్షించు టొప్పు నెపుడు 34

క. ఈమంత్రమహిమ మెన్నఁగ
సామర్థ్యములున్నె గగన చరవరుల కుమా
వామాంగునకున్ వ్యాసను
ధీమందనునకును వాకు దెలియుఁడు మీరల్. 35

తే. మధ్యమావస్థఁజెందినకమాట వివిధ
గతులనెనసిన మంత్రమైకడుఁబవిత్ర
మగును గ్రమముగ నదియ పశ్యంతియు నగు
తెలియఁగావలె నాదముల్తెఱఁగు లిట్లు 37

వ. ఎయ్యెడ నిష్కలుఁడైన పరాత్పరుఁడు శక్తియు శివుడునుద్వివిధ మగునో నయ్యెడ మాతృకయు రెండువిధములగును. అందొక విధమున శక్తియు నొకవిధమున శివుఁడును వాచ్యులగుదురు.

క. పదమీగతియ పదంబున
పదమున్ బదమౌ నెవంతుభావమునఁబదా
పదములకున్ భేదంబటు
పొదలు ననుచుఁ దెలియువాఁడెపో పండితుఁడౌ. 38

తే. పదమెఱింగిన మంత్రింబుపట్టువడును
బదమెఱింగినచో దుర్లభమ్ములేదు
పదముఁదలఁపంగ శోభనాస్పదము గానఁ
బదమెఱుంగక యున్న నైవశమె? ముక్తి. 39

వ. అకారాదిహకారాంతాక్షరసమామ్నాయము స్వరములు వ్యంజనములు నన ద్వివిధములు. అందు మొదటిది అకారాది విసర్గముపఱకునుబదియారు విధము లది తిరిగి యనుస్వార సాహిత్య రాహిత్య భేద మనుసరించి ముప్పది రెండు విధము లగును. రెండవది యకారాది హకారాంతము హల్లులు నందు కచటతపవర్గాక్షరము లిరువది యైదునూష్మాంతస్థవర్ణము లెనిమిదియుఁ గలసి ముప్పది మూఁడు విధములగును. వీనిలో నొక్కొక్కటియు నొక్కొక్క సిద్ధి నొసంగు. మఱియు వేదార్థాభిజ్ఞులు ఋగ్యజుస్సామాదివైదికములుగను, తాంత్రికులు హంంఫడాదితాంత్రికములుగను లౌకికులు లోకవ్యవహారములుగను వానిం బ్రయోగించి కృతార్థులగుదురు. 40

మ. జగదుత్పత్తిలయస్థితుల్ లసదధిష్ఠానంబు శంభున్ బలెన్
గగనాబ్వాయుకృపీటభూముల న విఖ్యాతోల్లసత్పంచభూ

తగణంబున్ దనుసంఘముల్ బలె సమస్త ప్రాణి సంఘంబులున్.
తగ నోంకారము నాశ్రయించికొని శబ్దప్రాభవం బొందెడున్.

క. పరదేవియు మాతృకనా
వఱలెడి యోంకార మొకటి బహువిధనాద
స్ఫురితామలవిలసద్వై
ఖరీ ప్రథిత నామమొప్పఁగాఁగను జగతిన్. 42

ఉ. వాకుల కందరాని బలువైభవముల్ దనరారు మాతృకా
ప్రాకటసూక్ష్మతాగతుల బ్రహ్మహరిప్రముఖాఖిలామరా
స్తోకమతిప్రగల్భులును జూడ సమర్థులు గారు గాన నే
నేకరణిన్ వచింపుదుఁ దదీయవిభూతిశతాయుతంబులన్. 43

మ. స్తవనీయుండును జిన్మయుండుఁ బరచిత్త్వాకల్యకల్యుండు వా
స్తవుఁడే యయ్యుమాసమేతుఁడయి భాస్వన్మంత్రరాజంబు హృ
ద్వివరంబం దనిశంబునుం జపములు విశ్వారుచుం జేయునో
శివుడుం గూడ రహస్యమందన నికన్ జెప్పంగ వేఱున్నదే. 44

ఉ. ఇట్టివి మంత్రవైభవములేనును మద్గురువర్య పాదముం
బట్టి గ్రహింప గల్గితిని పావనులార సుఖంబుగోరి యీ
గుట్టును మీరెఱింగి గురుఁగొల్చి గ్రహింపుఁడు మంత్రమెంచ నె
ప్పట్టుననైన దేశికుని పాదము వట్టక మంత్రమబ్బునే.

### 5. ప్రణవవిచార నిరూపణము

తే. ప్రణవమునుఁజెప్పవాఁడ సంగ్రహముఁగాఁగ
విస్తరింపఁబరాపర విధములయ్యె
దగును బరమనఁ బరతత్త్వమగును నపర
మన్నఁ గేవలశబ్దంబ యగునిజమ్ము. 46

ఉ. నూతనవస్తు వెట్టులఁ గనుంగవ విందులు సేయు నట్లవి
ఖ్యాతముదం బొసంగుఁ బరమార్థశివాకృతి యెల్లవేళ స
చ్చేతము మోదముంగనుట చేతఁ బ్రకృష్టనవంబు నంచు వ్యా
ఖ్యాతము నయ్యెడున్ బ్రణవమన్నది పండితకోటి కెయ్యెడన్. 47

ఉ. ఏయెడలన్ వికారమునొకింతయుఁగాంచక యుండి సంతత
శ్రేయము స్వీయరూపమయి చిద్ఘన మోదఘనామలప్రభా
వాయతమూర్తి చెన్నలరి యద్వయమై యసమానమైన ప్రీ
త్యాయతనంబు నోట ప్రణవాఖ్య పరప్రణవంబుగాంచెడున్. 48

క. పరమప్రణవప్రాప్తికిఁ
గరణమ్మగుఁ గాన ఁగార్యకారణాభేదం
బరయుచు నపరప్రణవం
బిరవొందఁగ ఁబ్రణవమని వచింతురు తజ్ఞుల్. 49

వ. తొల్లిటికొక కాలంబున ప్రజాపతి

సీ. ఒడలిపైఁ దెలిబూది యొప్పార నుదుటిపై
రహి మీరుచుండి పుండ్రములు వెలయ
నింద్రియక్షోభమ్ము నెదఁ గదురఁగ నీ
క్రోధరసమ్మల్లఁ ద్రోసి దవ్వు
నారచీరం గట్టి తోరంపునెరుల ఁగెం
జడ నౌదలను బెడంగడరఁ దాల్చి
యమలపంచాగ్నిమధ్యాసీనుఁడై ధ్యాన
మహితనిశ్చలచిత్తసహితుఁ డగుచు

తే.గీ. నేఁడులున్ మూఁడుబత్తితో నీశునభవు
సాంబునిం గూర్చి ఘోరతపంబులాచ
రించి మెప్పించినన్ శివుండంచితస్వ
రూపుఁడయి వృషవాహనారూఢుఁడగుచు. 51

తే.గీ. దర్శనం బిచ్చి సృష్టివిధం బనుగ్ర
హించినన్ బద్మసంభవుం డంచితముగ
సరవిమై భూమి నంతరిక్షంబు దినముఁ
జేసి తత్పారముల సృష్టిఁ జేయ నెంచి. 52

తే.గీ. వహ్నివిప్రార్కులం జేసి వాని సార
ములుగ ఋగ్యజుస్సామంబు లలరఁ జేసి

భూర్భువస్స్వర్లోకముల్ ప్రొసఁగ వాని
సారములు గాఁగఁ జేసెను సరవి మీర. 53

క. ఒకకోటిపద్మమిత్రా
ప్రకటాభాస్పదములయి వి రాజిలు నుతవ
ర్ణకము లకార ముకారము
మకారమనఁ జనును జగతి మహితము లగుచున్. 54

క. అమ్మూఁడక్షరముల నే
కమ్మొనరిచి "యోము" గాఁగ కంజప్రభవుం
డిమ్ములఁ బలికిన నది బ్రా
హ్మ్యమ్మయి యలరారు సర్వ సారం బగుచున్. 55

క. సర్వావభాసకుండగు
శర్వుం డోంకారమం దెగసంగుచు నిలువన్
సర్వేశ్వరునకు నయ్యద
ఖర్వోజ్జ్వలవిమలవాచ కమ్మయి వెలయున్. 56

తే. తప్తలోహంబు తద్గత దహనునకును
వేఱుపరుపకపలికెడి విధము నటుల
భవుని ప్రతిబింబముం గనుఁ బ్రణవమంత్ర
మగును భవవాచకంబయి యనువు మీఱ. 57

తే. తెలిసికొన్నట్టి విషయమ్ము తెలిసె ననుచుఁ
దెలియకున్నట్టి విషయమ్ము తెలియుననుచు
సందియమ్మైన విషయమ్ము సందియమ్మ
ననుచు నుత్తర మిడునట్టి యవసరముల. 58

తే. ప్రతివచనవర్తి యోమని బలుకుచుండుఁ
గాన జ్ఞాతార్థమునకు న జ్ఞాతమునకు
మఱియు సందిగ్ధమునకు స మంబుగాఁగ
నోమొకటి వాచకంబయి యొప్పుచుండు. 59

క. పుటకుడ్యగగనవాయు
స్ఫుటతరనామములు మాని సురుచిరమగు "నో

మో"ట వర్తింపఁగఁ బల్కిన
నటఁజెల్లును సర్వవాచకార్థం బోమా. 60

క. సకలావభాసకం బీ
యకలంకమనూత్తమ మెవఁడాదటఁ గొను వా
నికి సకలమంత్రజపఫల
నికరమ్ములు కైవసములు నిజమిది గనుఁడీ. 61

క. కావున మీరెల్ల రొగిం
బావనమంత్రముల కెల్లఁ బావనమగుటన్
భావింపుఁడు ప్రణవార్థముఁ
గావింపుఁడు తజ్జపమ్ము కడుబత్తిమెయిన్. 62

సీ. ఈమంత్రమున కెంచ ఋషి బ్రహ్మ ఛందస్సు
గాయత్త్రి పరమాత్ముఁడై యెనవెడి
శివుఁడు దేవత శక్తి చెలఁగు నకారంబు
కారమకారముల్ సారబీజ
మగుట నిక్కంబు మోక్షార్థమందున విని
యోగమీ మూఁటికి నొప్పమీర
నమలానలానిలా బ్జాప్తులు ఋషులు గా
యత్త్రి త్రిష్టుప్పు బృహతియు ఛంద

ఆ వె. ములును బ్రహ్మవిష్ణు భూతేశులును దేవ
తలును తెలుపు నెఱుపు నలుపువర్ణ
ములును మేలుకొనుట కలగనుటయు నిద్ర
మూఁడవస్థలనుచుఁ జూడనగును 63

సీ. అగును స్థానములు భూమ్యంతరిక్షస్వర్గ
ములు ఋగ్యజుస్సామములును శ్రుతులు
అగ్గులు గార్హపత్యాగ్ని దక్షిణవహ్ని
యాహవనీయాగ్ని యనఁగ మూఁడు
మఱియుఁ బ్రాతఃకాల మధ్యాహ్నకాలసా
యంకాలమనఁగఁ గాలాంతరములు

తగనుదాత్తం బనుదాత్తంబు స్వరితంబు
నగు స్వరంబులుక్రియలగును సృష్టి.

తే.గీ. స్థితియు లయమును. గుణములై చెలఁగి యలము
కొనును సత్త్వరజస్తమోగుణము బొటన
వ్రేలు మొదలుగఁ జిటికెనవ్రేలు వఱకు
వ్రేళ్ళకణుపులు తెలియుఁ డీవిబుధులార. 64

క. తొలికణు పుత్పత్తియు న
వ్వలికణుపున్ రక్షణమ్మవలికణుపు నగున్
త్రిలయంబును మూఁడక్షర
ములకుఁ గ్రమంబిటులఁ దెలియఁబోలునుజుండీ. 65

ఆ. ఎవ్వఁడైనసిద్ధినెదఁగోరు వాఁడేని
న్యాస మిట్లొనర్చినన్ గృతార్థుఁ
డగును యుక్తమంత్రమాదట నత్తరిఁ
జెప్పికొనఁగ వలయునొప్పమీర. 66

మ. వరనాభిన్ హృదయంబునన్ శిరమునన్వర్ణంబులన్ మాటుభా
సురలీలన్ దగ న్యాసమున్ సలిపి సంశుద్ధాత్ముఁడై యెవ్వఁడేన్
ధరణీభృచ్ఛిఖరాధివాసు శివు సద్భక్తిన్ భజించున్ వెసన్
స్థిరమౌవానికిఁ గల్గు సిద్ధి యనుచున్జిత్తంబునం దెంచుఁడీ. 67

క. అగు షట్కర్మము లాతని
కగు నష్టవిభూతులలరునపవర్గంబొ
ప్పగు నిష్టఫలము విద్యలు
తగువిధమునఁ బొల్చుఁ బాపతతి నశియించున్.

## 6. గాయత్రి వివరణము

వ. గాయత్రి సవ్యాహృతికముగను, సశిరస్కముగను వక్కాణింతు. "ఓంభూః, ఓంభువః, ఓగ్ంసువః, ఓమహః, ఓంజనః, ఓంతపః, ఓగ్ంసత్యం"అనునవి వ్యాహృతులు. అత్రి. భృగు, కుత్స, వసిష్ఠ, గౌతమ కాశ్యపాంగిరసులు సవ్యవ్యాహృతులకు వరుసగ ఋషులు గాయత్రియు నుష్ణిక్కును, ననుష్టుప్పును బృహతియుఁ బంక్తియు,

త్రిష్టుప్పును, జగతియుఁ గ్రమముగ ఛందస్సులు, అగ్నియు, వాయువును సూర్యుఁడును బ్రహ్మయు వరుణుఁడు నింద్రుఁడు విశ్వేదేవుఁలు క్రమముగా దేవతలును వానికి నగుదురు మఱియు గాయత్రికి ఋషి విశ్వామిత్రుఁడు ఛందస్సు గాయత్రి, దైవతము రవి, యధిదైవతము శివుఁడు, తన్మంత్రాక్షరము లిరువది నాలుగు. పదమున కెనిమిదియక్షరముల చొప్పున లెక్కించిన త్రిపదయుఁ బదమున కారక్షరముల చొప్పున లెక్కింపఁ జతుష్పదయును గాయత్త్రియగు. గాయత్త్రి జపమునఁ ద్రిపదయుఁ బూజను జతుష్పదయు నగును. "ఓమాపో జ్యోతీరసో మృతంబ్రహ్మభూర్భువస్సువరో" మను మంత్రముగాయత్త్రిశిరమనంబడు దీనికి ఋషి బ్రహ్మయు, ఛంద స్సనుష్టుప్పునుదేవత పరమాత్ముఁడును వినియోగమిష్టసాధనమందునఁ దెలియనగును. మఱియు

క. మూఁడడుగు లాఱు కడుపులు
బోఁడిమిగల తలలు నైదుకమోమునఁ గార్పి
చ్చీడైన డాలు తమ్ముల
నోడించెడి కన్ను జెన్నుకలొప్పు వలఁతియే. 70

క. చొక్కపుఁజన్నవ ఛందము
లక్కసకలధర్మనయచకయమ్మును సొబగే
పొక్కిలి పదునెన్మిదియన్
లెక్కఁదగుఁ బురాణములునుకనీటుల నొసఁగన్. 71

క. కరములు తర్కము కర్ణము
లిరుసాంఖ్యంబులును గగనకమిరవుగ నుదరాం
తరమున్ మీమాంసాఖ్యా
వరశాస్త్రము లక్షణంబుకవైభవ మీనన్.

క. స్థూలశరీరమ్మ జగ
జ్జాలము సూక్ష్మంగమఖిలకసారోపనిష
చ్ఛ్రీలలితార్థము గాఁగన్
జాలఁ బ్రసిద్ధిని వహించుకసరణి నెసంగన్. 73

క. అంతర్యామి యగుచు మద
శాంతకుఁడే సకలమైన వ్యాపారంబ
త్యంతమ్ము నిర్వహింప న
నంతగుణగణమ్ము లెనసి యందము లూరన్. 74

క. పావనతరగుణఖనియై
సావిత్రిమనులలామ సారేతరమం
తావిర్భూతప్రాశ
స్త్యావిరళశ్రీ జయించు నందురు విబుధుల్. 75

క. ఒకపాదము ఋగ్వేదం
బొకపాదము నగు యజుస్సు నొకపాదమ్మై
యకలంకసామ మొప్పను
ప్రకటము గాయత్త్రికిన్ద్రి పద యను పేరున్. 76

తే. అతిశయించు నాధర్వణ శ్రుతియ చేష్ట
శబ్దశాస్త్రంబు కల్పశి క్షానిరుక్త
ములును జ్యోతిషమను నంగ ములును బంచ
శీర్షములు గాఁగ నతులిత శ్రీ రహించు.

క. నలుదెసలు క్రిందు మీఁదులు
వెలయున్ షట్కుక్షులనఁగ విశ్రుతములునై
విలసద్గాయత్రికి నని
పలుకుదు రార్యులిది తెలియ వలయున్ మీరల్. 78

వ. మరియుఁ "తత్సవితుర్వరేణ్యంభర్గో దేవస్యధీమహి ధియోయోనః ప్రచోదయాత్త్" ను చతుర్వింశత్యక్షరములు గాయత్త్రిమంత్రము. దానికి పాదాంగుష్ఠ గుల్ఫ జంఘా జానూరు గృహ్యా వృషణ కటిప్రదేశములును నాభి, జఠర, స్తన హృదయ కంఠ వదన తాలు నాసికలును భ్రూమధ్య లలాట పూర్వదక్షిణపశ్చిమోత్తరవక్త్రిమూర్ధములునుం గ్రమముగ స్థానములు. తదక్షరములయందు ప్రథమాక్షరము చంపకవర్ణము. రెండవ యక్షరమును బదిరెండవ యక్షరమును శ్యామవర్ణములు. మూఁడవ యక్కరము పింగళవర్ణము నాల్గవయక్షరమును నిరువదియవ యక్షరము

నింద్రనీలవర్ణములు. అయిదాఱేడువర్ణము లగ్నివర్ణములు. ఎనిమిదవ యక్షరము మెఱుపుఁదీవరంగు. తొమ్మిదవ యక్కరము తారకాపుచ్ఛము, పదియవవర్ణము నలుపు. పదునొకటి పదునెనిమిది వర్ణములు రక్తగౌరవర్ణములు, పదుమూఁడు. పదునైదువర్ణములు శుక్లవర్ణములు పదునారు పద్మరాగవర్ణము, పదునేడు పాండురము. పందొమ్మిది యింద్రనీలవర్ణము. ఇరువది గోరక్తము. ఇరువదియొకటి సూర్యవర్ణము. ఇరువదిరెండు నీలోత్పలము. ఇరువదిమూఁడు శంఖకుందేందువర్ణము. ఇరువదినాలుగు దీపసన్నిభము.

తె. పాతకమ్ములు మరి యుప॥పాతకములు
క్షుద్రపాతకములుఁదొలఁ॥గుసు దదక్ష
రముల నివ్విధిఁదెలిసిన॥సుమహితులకు
మంత్రిరాజంబు దీని సరమాన మెద్ది? 80

తె. దానముల నన్నపానీయ॥దానములును
దపములందు నహింసాఖ్య॥తప మొకండు
మంత్రముల యందు గాయత్రి॥మంత్ర మొకటి
నాహుతుల యందు వ్యాహృతి॥యధిక మంత్రు. 81

సీ. కలుగు జీవాంతరం॥గముల నంతర్యామి
యగుచుఁ బ్రేరేపించు॥ననఘుఁ డెవఁడు
సర్వప్రకాశక॥స్వప్రకాశకమైన
విమలతేజము గాంచి॥వెలయు నెవఁడు
సకలచరాచర॥సంఘముల్ సృజియించు
సామర్థ్య మొప్పారు॥చతురుఁ డెవ్వఁ
డెడలేని కోర్కుల॥నెల్లజీవుల నహ
మ్మని భజియింపగా॥నలరు నెవఁడు

తె. తత్సమాఖ్యను పేరొంది॥తనరు నెవ్వఁ
డఖిల భూతాత్ముఁడై ఖ్యాతి॥నందు నెవ్వఁ
డట్టి దివ్యుని తెజంబు॥నమలమతిని
ధ్యానమును సల్పు వారమెం॥తయును మేలు. 82

మ. గురుపాదుం డుపదేశమీయఁగొని కోర్కుల్ మీరగా దక్షిణన్
గురుదేవాంఘ్రిసరోజయుగ్మము కడున్ నూల్కొల్పియా మీఁదన
క్షరలక్షల్ దగ మంత్రమాతయగు నా సావిత్రినిన్ నిర్మలాం
తరుఁడై యిర్వదినాల్గు లక్షలను సంధానించెనన్ బుణ్యుఁడౌ. 83

క. ఇరువదినాలుగు లక్షల
వరగాయత్రిన్ జపించువాఁడెంతటి ము
ష్కరుఁడైన మంత్రసిద్ధిన్
బొరయున్ దన్మహిమ నుడువ బోలు నెవనికిన్? 4

శా. ప్రాతఃస్నాన మొనర్చి యీమనువు నెవ్వాఁడైన వేసార్లొగిన్
బూతాత్ముం డగుచున్ జపంబు సలుపన్ బూర్ణంబులౌ వానికిన్
జేతోవీధిఁ జెలంగు కోరికలు బల్చిత్రంబుగాన్ దెంపమం
దేతద్వాక్యము నందు సందియము నింతేఁ బొందకుండెయ్యెడన్. 85

శా. రాహుగ్రస్తదివాకరాతివిమల ప్రాశస్త్య మొప్పారు పు
ణ్యాహంబందునఁ జంద్రకబ్జిలను నాజ్యంబందునన్ ముంచియు
త్సాహం బొప్పఁగ హవ్యవాహనుని మధ్యన్ వ్రేల్చినన్ గల్గెడున్
బాహుళ్యాంచితవిత్తవైభవము లీమంత్రప్రభావంబునన్. 86

శా. నానాభీషణనృత్యముల్ నెఱపుచున్ నాల్కన్ ప్రసారించి స్వ
ర్భానుం డుజ్జ్వలమూర్తి భాను మెయి నగ్రిస్ఫూర్తిమై నాకి దం
తానన్ గ్రుచ్చుచు నోటఁబెట్టు పనిపూర్ణంబైన వేళంజలా
నూనార్ఘ్యంబిడి యెవ్వఁడీజపమునూనున్ వానికౌ కోరికల్. 87

ఉ. గోమయపిండచూర్ణముల గోఘృతధారల తోడ నెవ్వఁడేన్
హోమము కీలలం జెలఁగు నుజ్జ్వలదగ్నినొనర్ప వానిగో
ధామము నందు బిండికొలఁదార్కొను పాలనొసంగు ధేనుకా
స్తోమము లెప్పుడున్ వెలయుఁ దోరముగా జపియింప మంత్రమున్

సీ. ధాన్యహోమము సేయఁ దనరు సంతానంబు
తండులహోమానఁ బెండిలి యగు
మోదుగన్ వ్రేల్వగా బ్రోదియగున్ ధనం
బాజ్యమాహుతి నిడ నగును గోర్కె

ప్రజ్వలిత వహ్నికర్పణ సేయ వానయు
నృపవశ్య మమరుఁ దేనియను ప్రేల్వ
స్త్రీవశ్య మబ్బును తేనెపాయస మిడ
నేతి హోమము నిడ నెగడు వాంఛ

ఆ.వె. పంచగవ్యమైనఁ బరగ నువ్వులనైన
సరిగ ప్రేల్వఁ జెల్లు శాంతినొదవు
మావిడాకు నగ్నిదేవున కర్పింప
జ్వరము వోవు మంత్రపటువు గలుగు 89

తే. ఎనిమిదివేల్గాయత్రిన్
పనిఁగొని జపియించి విమలవార్యభిషేకం
బును సలుపఁగఁ దుష్టస్వ
ప్ననివృత్తిఫలంబు గలుగు పావనులారా! 90

క. క్షీరాహారముఁగొని యే
వారలు సావిత్రి లక్షవారము మతి నై
వారఁగ జపియించిన న
వ్వారికి నపమృత్యుదోషపరిహార మగున్. 91

తే. ఎనుఁగున కేని యావున కేని గుఱ్ఱ
మునకు నేని తెవుల్లలరి మొనసి మేడి
గాని రావియ గాని హోమాన మంత్రి
మూని యిడ మాను నయ్యాదివాని కపుడు. 92

క. ఘృతమాహారము గొని శత
శతశత మీమంత్రమాత జపియించిన చో
మితి లేని విద్యలన్నియు
వ్రతమహిమం గలుగుఁ గష్టపడి చదువకయే॥ 93

క. మోఁకాలిబంటి నీటన్
పీఁక నిలిచి యెవఁడు శత్రువీరుని దెస మో
మై కనలి వేయిసార్లు
వాకొన యుద్ధమున విమతవారజయ మగున్. 94

చ. పగతుని రూపమున్ బుడమిపై లిఖియించి తదీయవక్షమం
దుఁగడిమి వాని పేరు లిపితోడ రచించి స్వకీయపాదమం
దుఁ గుదురఁ జేసి మంత్రిమునుఘోరవృత్తుల్గా జపింప శాత్రవుం
డగు మనుజుండు చచ్చిశమనాలయముం జొరఁబారు వేగియై. 95

ఉ. బాపఁడు గాని యట్టి పగవానిని జంపఁగఁ గోర్కి కల్గుచో
నాపని దీర్పఁగల్గెడి క్రియన్ వివరించెద నర్కభూజమెం
తోపని బూని దెచ్చియదితున్కల దున్కలఁ జేసి తీక్ష్ణతై
లోపచయ మ్మొనర్చి బలుహోమముఁ జేయుఁడి మంత్రయుక్తులై

తే.గీ. ఆభిచారికకర్మములందు మంత్రి
వర్ణముల సక్రమంబైనవడువు గాక
ప్రాతిలోమ్యక్రమంబుగాఁబలుక వలయు
నస్త్రముఁ గూడి బ్రతిలోమమగును లిపులు. 97

క. తుదినుండి మొదలు వఱకున్
సదమలగాయత్రిఁ బలికినన్ బ్రహ్మాస్త్రం
బుదితమ్మగు దానికి నీ
డెదియును గనరాదు గద మహీయశ్శక్తిన్. 98

తే. భక్తి సావిత్రి జపియించిపాలనైన
నేతినైనను హోమంబునిర్వహించి
దీక్షనెరపిన వానికినక్షయ మగు
శాంతి గల్గుఁ జతుష్పాదసమితి కెపుడు. 99

తే. జానుదఘ్నజలంబులసరగ నిలిచి
మనువు మంత్రించి తెల్లభస్మంబు నీయ
సకలదురితసమూహముల్సమయు నంచు
భవ్యశాస్త్రార్థకోవిదుల్ బల్కుచుందురు. 100

శా. వేయున్ బల్కఁగ నేల నింక వినుఁడీవిద్వద్వరేణ్యుల్ లస
ద్గాయత్రీమనురాజమున్ జపమొగిం గావించు పున్నెంబుచే
నీయాకోర్కనెల తెల్పు హృదయాభీష్టంబు లెల్లన్ ఫల
శ్రీయుక్తాంచితమై ప్రవర్తిలు బుధాశీర్వాదభంగిన్ సదా. 101

క. కావున జ్ఞానేచ్ఛాసం
భావితహృదయాంతరములఁ మంత్రిజపంబున్
పావనులై పొనరించు సు
ధీవర్యులు ముక్తులై సుస్థితిం గం(డ్రెపుడున్. 102

7. హంసవిద్యా వివరణము

తే. సంగ్రహము గాఁగ విస్తారసరణి గాఁగ
నాత్మమంత్రమ్ము నుడివెద నార్యులార
నరయ ఋషి బ్రహ్మయగును గాయత్రి ఛంద
మొప్పు నాత్ముండు దైవతమొగిఁగనుండు. 103

మ. సకలాజాండము లెందునం గలిగి నిశ్చల్ నిల్చియే పొంది త
ప్పక యెందున్ లయమొందు నట్టివిలసద్బ్రహ్మంబు వర్తిల్లు లో
క కలాపాంచితమూలమై యలము విఖ్యాతైకచిద్రూపత
త్ప్రకృతిప్రాకటశక్తికే యగు సభారమ్యమ్ముగా సంజ్ఞయై 104

క. సకలజగన్మూలంబయి
యకలంకము నద్వయమ్ము నగు బ్రహ్మము దా
నికి సంజ్ఞామాత్రంబగు
హకారమును బీజ మనుచు నరయఁగ వలయున్. 105

చ. ప్రకృతియ శక్తి పూరుషుఁడు రాజితబీజము నంచెఱింగి శీ
తకర శిరోఽవతంసు భవతాపనివారకు సాంబు నీశుఁ బా
యక యెద నిల్పి ద్వాదశసహస్రము హంసమనూత్తమంబు వా
చిక జపముం బొనర్పఁగ నశించుఁ బ్రమాదవశాఘబృందముల్ 106

చ. ఇది యధమాధికారి జపియించెడి పద్ధతి మధ్యమాధికా
రి దనరు నెట్టులన్న వినరే సహవర్ణములందుఁ బ్రాణమున్
విదిత మపాన మెయ్యి సరవిన్ గని శైలసుతామనోహరున్
మది నిడుచున్ జపింపఁ జను మానసపూర్వకృతాపరాధముల్ 107

తే.గీ. హంసమంత్రమ్ము నెట్లుత్తమాధికారి
కోరి భజియించు నన్న నుస్నేరికైన

నేది తెలియక యున్న నుక నేననంగ
తెలియునే గద నపరోక్షమగుట తన్ను. 108

సీ. పుట్టి పెర్గితిఁ జావుఁ బొందుదు సంసార
చక్రబద్ధుఁడ నయి జరుగు వాఁడ
బ్రాహ్మణుండ నృపుండ వైశ్యుండ శూద్రుండ
నంత్యజుండేనని యరయువాఁడ
దారసోదరపుత్ర ధనధాన్యగోగృహం
బులుగల్గు వాఁడని పలుకువాఁడ
మోదమొందెడి వాఁడ ఖేదమొందెడివాఁడ
నలుగువాఁడఁ బ్రసాద మందువాఁడ.

తే. కర్మకరణంబులై దును జ్ఞానకరణ
పంచకమ్మును నాయవి స్వప్నజాగ్రి
దాద్యవస్థలవాఁడనై యందతెఱుఁగు
వాఁడ నేనని తలఁపని వాఁడు గలఁడె? 109

క. అపరోక్షమ్ముల కెల్లను
నపరోక్షమ్మొకటి యగు నహంమతి తను దా
నెపుడైనఁ దెలియకుండునె
యపరోక్షమ్మెఱుఁగ నట్టి యంధుఁడు గలఁడే? 110

తే. అట్టి జీవునకును సంజ్ఞయగు హకార
మయ్యాదియ జీవమంత్రంబు నగు ధరిత్రి
పరమశివవాచకంబు సవర్ణమగును
హంసమంత్రంబు వర్గద్వయమ్మున మనును 111

సీ. పుట్టువొందను నేను బుట్టునా యందెల్ల
నెందు నేనుండ నా యందు నిఖిల
ముండు లయముఁ బొందకుండుదు సర్వంబు
నా యందు లీనమై పాయు రూపు
పరమేశ్వరుఁడ నేను ప్రాణిమాత్రుఁడను గా-

నింతకు సంసారవంతుఁడ నని
విభ్రాంతి పడినాఁడవెట్టినైతింత వ
ట్టునకంచు నెఱిఁగితిగట్టుతెలిసె

తె.గీ. నీశ్వరుఁడ నేను నేనాదునీశ్వరుండ
నంచు హంసాఖ్యమంత్రమ్మునెంచి తన్మ
యత్వముం గాంచి యద్వయానందుఁ డగుచు
నాత్మ నలరారువాఁ డుత్తమాధికారి. 112

క. అలసుఁడ సంసారిం గద
నలఘుఁడ సంసారి నగుదునాఃయని బలు శం
కలు పడకుఁడు భాగత్యా
గలక్షణావిధము తెలియఁగావలె మీరల్. 113

చ. నునుమెయి కోమలాంగములునూల్కొనకుండిన వార్ధకంబునన్
వెనుకటి దేవదత్తుఁడగువీఁడని గుర్తెఱుంగు పోల్కితో
త్తను సుఖిదుఃఖినం చెడఁ దలంచెడినేఁ బరమార్థమోదమౌ
దని గురుతించు టొప్పు. నజహజ్జహదంచితలక్షణాప్తమై॥ 114

శా. ఏసత్యుండ నజాండభాండమునె నేనేనిండి విజ్ఞానల
క్ష్మీసాహిత్యము నొందువాఁడ సుఖుఁడన్ చిద్రూపుఁడీశుండ నం
చే సద్భావము గల్గు నయ్యది శ్రుతిన్ జీవేశసంధానభా
షాసందర్భములందుఁ గానఁ దగుభాస్వల్లక్షణాపద్ధతిన్. 115

ఆ. వస్తుజాతమెల్ల వ్యభిచరించుచునుండు
సతతముండు సర్వసాక్షినగుచు
సత్స్వభావుఁడవుదుజ్ఞాత మజ్ఞాతంబు
నేను గేవలుండనిక్కముగను. 116

క. సకలంబు నేనెఱుంగుదు
సకలమునం దొకటి యెఱుఁగఁజాలునె నన్నున్
సకలమునకెన సాక్షిని
సకలము మత్సాక్ష్యవస్తుసమితి యగుఁ జూడీ. 117

వ. ఇయ్యది హంసమంత్రార్థంబుతత్త్వ మిట్లుండఁ గొందఱు మంద మతు లాత్మ్మండు ద్రవ్యమనియు సంవిత్తు తచ్ఛేషమని వాకొందురు. ఇంచుక తర్కబుద్ధి విమర్శించిన దర్శనమునందలి లోపములు గనుపట్టు. అయ్యది యెట్లందురేని తద్వాదిని నాత్మ ద్రవ్యరూపుఁడని నుడివితివిగదా యెటులైన నాత్మఁడచిద్రూపుఁడా?చిద్రూపుఁడా?చేతనుఁడా?యని ప్రశ్నించిన నతఁడా ముత్తె అంగుల నొక్కండని ప్రతివచనమ్ముఁ బలుక వలెఁగదా. అందు మొదటి పక్షంబు విచారింతము. ఆత్మఁ డజడుఁడనియు (జిత్తు తచ్ఛేషమనియు నందువేని జడములయిన శరావాదులును జిచ్ఛేషము లగుటఁజేతనము లనవలసి వచ్చును. కాన యిది యసంగతము. మఱి రెండవపక్ష మాలోచింతము. ఆత్మఁడు చిద్రూపుఁడయినచో (జిత్తు చిత్తు నకు శేషమెట్లగును? శేష శేషిన్యాయమున శేష, శేషులకు భేదముండ వలెను గదా! యట్టి భేదము లేని చిత్తు చిత్తునకు శేషభావ మొంద నేరదు. మరియు భిన్నభిన్నచైతన్యముల మనము ప్రత్యక్షముగా నరయు చున్నాము. కనుక (జిత్తుచిత్తునకు భేదముకుదురునని యంటిరా తద్భేధ మౌపాధికము గాని వాస్తవముగాదు. కాన రెండవపక్షము నసంగతము. ఇంక మూఁడవ పక్షము విచారింతము. ఆత్మఁడు చేతనుఁడు చిత్తు తచ్ఛే షము ననుటయన్యోన్యాశ్రియదోషదూషితము. చిద్విష్టుఁడు చేతనుఁ డనియుఁ జేతనశేషము చిత్తనియుఁ బలుకుట పొసఁగదు. కాన సంవి త్తు శేషమనఁ జనదు. చిత్తు నన్యశేషంబనుట భ్రాంతియె గాని వేఱు గాదు. 118

క. పరమప్రేమాస్పద మన
వరతము జీవుండు దేహవంతుల కగుటన్
వఱలును జీవుండానం
దరసాత్మకుఁ డన్న పలుకు తథ్యం బగుచున్. 119

శా. నానాదేశవిశిష్టవస్తువులు నానాకాలవస్తూత్కరం
బేనే పూర్ణుడఁ గాక యున్న నిఁక నాకెట్టుల్ సదా డోఁచెడిన్
గానన్ నేఁ బరిపూర్ణుఁ డౌదునని వ్యాఖ్యానమ్మగున్ హంసమం
త్రానూనార్థము నెంచి చూచిన రహస్యంబియ్యదే పల్కితిన్. 120

శా. సంసారాధ్వమునన్ జరింతును గదా సంసారసాక్షిన్ గదా
సంసారక్రమవర్జితుం డగుటకే సందేహమున్ లేదు వి
ద్వాంసుల్ గాని యెఱుంగనేరరిది నే వాక్రుచ్చితిన్ గోప్యమీ
హంసాఖ్యామలమంత్రరాజమున కీ యర్థం బెఱుంగుం డిఁకన్. 121

ఆ. హంసమంత్రమునకు నాత్మమంత్రమ్మని
ఖ్యాతి లోకములను గలుగు నట్లు
జీవపరుల కైక్య భావమ్ముఁ గను ధీరుఁ
డగును బ్రహ్మవేత్త యన్యుఁ డగునె? 122

ఆ.వె. ఇట్టి జ్ఞాన మొదవు నెవ్వని కెయ్యెడ
నట్టివాని కప్పు డతుల ఘోర
భవపరిభ్రమైక బాధలు దొలఁగును
హంసమంత్రమహిమ మరయుఁ డయ్య! 123

ఉ. హంసమనూత్తమార్థముల నాత్మ నెఱుంగక ముక్తిఁ గోరు వి
ద్వాంసుఁడు హాస్యపాత్రుఁ డగు వాఁ డరయన్ శోధమాన్పుకొంట కై
యంసవిలాసముల్ దనర నాదట నాకసమున్ గ్రహించు ధీ
పాంసను బోలువాఁ డగును బావనులార! యెఱుంగుఁ డింతయున్

ఆ.వె. అరివధం బొనర్ప నాభిచారికముల
యే పణంచు మంత్ర మియ్యది గద
దీని నెఱుఁగువాని కౌను శతాబ్దప్ర
మాణజీవనమ్ము మహితులార! 12

క. సకలైశ్వర్యనిధానము
సకలామరతృప్తికరము సకలారోగ్య
ప్రకటౌషధరాజమ్మున్
సకలాగమధీప్రమాణ చణ మిదియ యగున్. 126

క. ఇయ్యది యయ్యది యనుచున్
వెయ్యి నుడుల్ వలుక నేల విజయమ్ముల న
క్షయ్యమ్ముగ నిది గూర్చున్
గయ్యంబుల యందు సర్వ కార్యములందున్. 127

క. ఎవఁడైన హంసమంత్రము
చవులెఱిఁగి జపించువాఁడు సంసృతిమార్గ
పరివిముక్తుఁడగుచు సాక్షా
చ్ఛివుఁడేయగుఁదెలియుఁడీరు చిత్తములందున్ 128

క. ఈమంత్రమహిమ మరయఁగ
లేమంచు వచింప ననృత లేశము లేదం
చో మాన్యులార! నుడివెద
క్షేమకరమ్మిది త్రిమూర్తి సేవ్యం బగుటన్. 129

వ. మఱియును 130

ఉ. రేచకపూరకమ్ముల వరింప కపానముఁ బ్రాణమ్ముఁ దులన్
దూఁచినయట్ల నాభిగత తోరపుఁగందమునందు నిల్పినన్
మోచకు నొక్కనిన్ గడు బ్రి మోదముతోడ జప మ్మొనర్చుచున్
ప్రాచురకుంభకస్థితి వి రాజిల యోగనిరూఢిఁ జేకురన్. 131

క. చారుసహస్రారసుధా
సారమ్ముం గ్రోలి నాకు సరసామృతవాక్
పూరమ్మభిషేకం బిడి
తీరుగ నను నెదను నిల్పి ధీరవరుండై. 132

క. ఏ యనఘుం డీమంత్రము
నాయెడ వినియోగముం బొనర్చు నతనికా
నాయుష్యం బారోగ్య
మ్మాయెడ నాఘనుని డాయు నే వార్ధకమున్? 133

క. ప్రతిదినము హంసమత్రం
బతిభక్తి జపించునట్టి యలఘున కగున
ద్భుతముగ నష్టవిభూతులు
మతి మీరు జపించి దీని మహిమ మెఱుఁగుడీ. 134

క. నిరత మ్మీ మంత్రోత్తమ
మిరువొంద జపించు వానిక కీశ్వరతుల్య

స్థిరవిభవము లొప్పారున్
బరికింపుఁడు దీని మహిమఁ బావనులారా! 135

క. హంసాఖ్యమంత్రమహిమఁ బ్ర
శంసింపఁగనేల? దాని జపియించిన వి
ద్వాంసులు ముక్తులు మఱిమీ
మాంసలు వేయేల! సకలమాన్య మిది యగున్. 136

క. వరమోక్షోపాయములం
బరీక్ష యొనరింప హంసమంత్రముకన్నన్
వఱలదు వేఱొక సాధన
మరయుఁడు మీరందఱీరహస్యమ్ము నొగిన్. 137

చ. గురువుల వారి పాదములఁ గొల్చి మనూత్తమమంది యెవ్వఁడేన్
వరవినయాన్వితుం డగుచు వారక తద్గురుసేవఁ జేయఁగా
స్థిరతరమైన జ్ఞానమునఁ జేకురు బ్రహ్మపదార్థ మెంతయున్
గరబదరమ్ము వారికగుఁ గాన గురున్ నెమకుండు భక్తిమై. 138

ఉ. వేదము శాస్త్రమున్ విడిచి విప్రనృపాద్యభిమాన మెల్లనుం
గాదని త్రోసిపుచ్చి నిజ శాయభవాంచితమాతృభ్రాతృపు
త్రాదివిశేషబంధములఁ నవ్వలదూరము సేసి యొజ్జదౌ
పాదము వీడకుండుట శుభంబగు పద్ధతి లోకమందునన్. 139

క. గురువన్యుఁడు గాఁడగఁజా
వరుఁడగుఁ దద్భక్తిఁ జేయ ఏలె నెల్లరకున్
నిరతమ్మని శ్రుతి పల్కున్
వఱలున్ గురుసేవ శోభనము లెయ్యెడలన్. 140

## 8. షడక్షరవిచారము

తే. హంసమంత్రమ్ము నుడివితి నయ్యలార!
ఏ షడక్షరమంత్రమ్ము నెరుఁగఁ జెప్ప
వాఁడ నద్దాన నశియించు భవవితాన
దుఃఖచయ మంచు నెఱుఁగుఁడీ తోలుఁ దఘము. 141

వ. "ఓంనమశ్శివాయ" యను నీయాఅక్షరములు మంత్రిమగు ఋషి బ్రహ్మయు ఛందము గాయత్రియు, నద్వయుఁడును జ్ఞానమయుఁడును నగు నగజానాయకుండు దేవతయు నక్షరయు భువనేశ్వరియు నగు పరమేశ్వరి శక్తియుఁ గేవలశివుండు బీజమ్ము నేతన్మంత్రరత్నమునకు నమరు. దీని నంగన్యాస కరన్యాస పూర్వకమ్ముగా జపించునది. దాని యర్థ మిట్లగు. సత్యనిత్యానందస్వరూపమగు పరబ్రహ్మ మవాఙ్మానసగోచరమయ్యు లక్షణావృత్తి నాశ్రయించి శివపదమ్ము తద్బోధకమ్మగు నమశ్శబ్దము ప్రహ్వతావాచకము. వినమితగాత్రమునఁ గాని మనస్సు కుదురదుగదా! "శివాయ" యనుచోఁ బల్కంబడు చతుర్థి జీవునకు శివతాదాత్మ్యము సూచించు, మాయాపరికల్పితుండగు జీవుండు వాస్తవముగా శివుండే యను నభిప్రాయ "మోమ్" పూర్వకము గడు సౌకర్యార్థము నడువఁబడు చున్నది. కానఁ బరబ్రహ్మనతిరక్తుఁడైన జీవునకు సంపాదింపవలసిన హితమును దొలఁగింపవలసిన యహితమును గూడఁ గలుగవు. తదర్థమును నకారము బోధించును. "మమ" అను పదమునకు 'మ' కారము మాత్రము నిలిచి న నమశ్శబ్దము వలన జీవుఁడ నగు నాకు హేయోపాదేయములు లేవని నమశ్శబ్దార్థమగు నేను శివుఁడ నగుదు నని మంత్రార్థము. ఓంశబ్దము సర్వవస్తువాచకము. కావున సర్వమును నేనును బరశివులకును నర్థమును బోధించు మంత్రము షడక్షరమంత్రి మగు. వాస్తవముగాఁ బరమార్థనిరూపణసమయమున లక్ష్యలక్షణ వాచ్యవాచక భావంబుల కిసుమంతయుఁ దావులేదు. పరమశివాన్యంబు లేనెలేదు గావున నస్తినాస్తీత్యాది వ్యవహారంబులు పరమునియందు మాయ వలనఁ గల్పితములగు. ప్రత్యక్షాపరోక్షపరబ్రహ్మభావమునందు మాయయుఁ దత్కార్యము వాస్తవముగ లేనిదే యగు. 142

చ. విదితసమస్తశాస్త్రములు ♦ విశ్రుతతర్కములున్ బురాణముల్
సదమలమౌ శ్రుతుల్ స్మృతులు ♦ శైవమునం దపరాగమంబుల
భ్యుదయపరంపరానిలయ ♦ యోగ్యసుధీహృదయానుభూతులి
య్యది వచియించు నిక్కమని ♦ యారయ నేర్చినఁ దద్రహస్యముల్.

క. మెలకువమెయి బహుదర్శన
ములను విమర్శింప ధీరబుద్ధికిఁ బోఁచున్
లలి నిది సత్య మ్మనుచున్
దెలియుఁడు తద్విధము లేను దెలిపెదమీకున్. 144

క. తొలుతన్ సాంఖ్యముఁ బాతం
జలమును శైవాగమంబుఁ జర్చించినచోఁ
గలిగెడి నిగ్గులఁ దెలిపెద
నలఘులు వినవలయు మీరలాదరబుద్ధిన్. 145

వ. జీవుఁడు చిద్రూపుండనియు; వ్యావహారికసత్యంబయ్యు జగత్తు కైవల్యదశయం దనవభాసితమనియు వా రంగీకరింతురు జ్ఞేయము జ్ఞానాధీనమగును. రజతబుద్ది శుక్తిజ్ఞానమునఁ దొలఁగునప్పుడు రజత బుద్ధి మిథ్యాబుద్ధి యందుము గదా! యవ్వఁడువుననే ప్రకృతిపురుషవివేక రూపమైన యాత్మయథ్యాత్మవిజ్ఞానంబునఁ బ్రకృతిప్రాకృతాత్మక జగత్తు నివర్తించుటం జేసి జగత్తు మిథ్యయనుట నిర్వివాదము. ఇందుబకుఁ "గృతార్థం ప్రతినష్ట మప్యనష్టం తదన్యసాధారణత్వా" త్తని పాతంజల సూత్రము గలదు. కానే తన్మతముల ముక్తులయెడఁ బ్రపంచము లేనిదియుఁ దదితరులయెడ నది భాసించునదియు నని బోధింపఁబడు చున్నది. ఘట మెప్పుడును ఘటబుద్ధిని గలిగించు నట్లు సత్యజ్ఞాన మైకాంతికము గాన జగజ్జ్ఞానము జ్ఞాననివర్త్యమనుటవలన జగజ్జ్ఞానము మిథ్యాబుద్ధి గాని యెడలఁగైవల్యదశయందు నశించుటయుఁ బొసఁగదు. అయినచో నవి యట్లేల కంఠోక్తిగా వచియింప కన్యథా శాసించుట యేల యనిన తత్కారణము సెప్పెద వినుము శ్రోతృబుద్ధిసమాధానార్థం బని యెఱుంగునది. సర్వము మిథ్య యని మొదటన యుపదేశమారం భించినచో నెట్లది పొసఁగునని సంశయింపఁక మానండు గదా కాన నట్టి వానిం గరుణించుటకే తన్మతములు వ్యావహారికసత్యమని యొక టంగికరించి వ్యవహరించిరి. కావుననే పరమార్థదశయందు జీవేశ్వర భేదము నాత్మనానాత్వమును లేనివానిగా శాసించెను ఆయా యుహలమల వలనఁ దెలియనగు జీవేశ్వరకల్పనలను సుఖదుఃఖవ్యవస్థలును బ్రయాస

సమర్థనీయము లని తోఁచి నానాత్వమే తద్దర్శనము లంగీకరించినవి కాన వేదాంతులవలె వీరికిని ముక్తిదశఁ గేవలాత్మస్వరూపప్రతిభా సమును నాత్మాద్వితీయత్వమును సమ్మతములు మఱియు జీవుఁడానంద స్వరూపుడని పతంజలియు సూత్రించె. ఏతదర్థము జైగీషవ్యుఁడను పరమ యోగీశ్వరుని గాథవలనఁ దెల్ల మగును. 146

క. యోగాంచితమహిముం డగు
జైగిషవ్యునకు మున్నుఁజేకురెను జగ
జ్జైగీయమానపటుతర
యోగాష్టప్రథితసిద్ధులోహో యనఁగన్. 147

తే. సంసరించుచుఁగడలేనిజలజసూతి
కల్పములయందుఁ దుదకునాఘనుఁడు స్వాత్మ
తత్వమెదఁగోరి సాక్షాత్కృతిమ్మొనర్చి
కొంచు నానందవార్ధి రమించుచుండె. 148

ఉ. ఆతనినూతనప్రమదిమారసి కొందఱు మౌనిపుంగవుల్
ఖ్యాతియశస్కయోగజనితాలఘు సిద్ధుల నెన్మిదింట నే
రీతి సుఖంబు గల్గె వివరింపుమ నావుడు సుంత యేని నా
చేతము సిద్ధిసౌఖ్యము రుచింపదు పావనులార! యంచనెన్. 149

వ. అంత నమ్మునిసత్తములు యోగిజనోత్తమున కిట్లనిరి. 150

క. గణియింపరాని సుఖముల
నణిమాదులఁ బొందవచ్చునందురు విద్వ
న్మణి యిట్లు వల్కు దే.లొకొ
యణిమాదుల మహిమ మెవ్వరరయని వారల్. 151

చ. అనవుడు వారి కిట్లనియెనాఘనుఁ డోమునులార మీరు చె
ప్పునది నిజంబగున్ విషయభోగముతో నణిమాదిసిద్ధిసం
జనితసుఖంబు పోల్చునెడశాశ్వతమోదనిదానమైన యా
యనుపమ తత్వబోధమునకన్యము లెవ్వియుఁ బోల్పవచ్చునే. 152

చ. కరణసుఖంబు తుచ్ఛమగుగాదె తలంపఁగ యోగసిద్ధిసం
భరితసుఖంబుకంటెఁ బరమంబగు జ్ఞానము కంటె సిద్ధిభా

సురసుఖమెంతొ తుచ్ఛమగుకేచుక్ బరివర్జనయోగ్యమౌ సుధీ
వరులిది గుర్తెఱింగి తగుకేవర్తనముం జరియింతు రెయ్యెడన్. 103

వ. మఱియు నైయాయికవైశేషికులకు జ్ఞానము వలన మోక్షమును ముక్తునకుఁ దనకంటె వేఱైనప్రపంచము ప్రతిపత్తిఁ గనకుండుటయు వేదాంతులతో సమానమే యగును. మఱియు నాత్మాద్వయత్వము ప్రపంచ మిథ్యాత్వమును గూడ వారికిని సాంఖ్యులకును సమానము. బ్రహ్మాదిపదముల కంటె ముక్తిపదము శ్రేష్ఠమని తన్మతమున వక్కాణింపఁబడి యభ్యర్థనీయమగును. కాని సర్వగుణాభావము ముక్తి గనుకముక్తి యందు జ్ఞానమునకు నభావమువర్ణించు వారునుం గలరు. సంవిత్తు నిర్వికల్పకము. స్వవ్యతిరిక్తానన్యవ్యక్తిత్వలక్షణము నగుట తదనవభానము కేవల మభిమానమాత్రమ్మయి యావాదము సూరిజనసమ్మతమ్మగు నట్లైన నాత్మభావ మంగికరించు శూన్యవాది వాద మాదరణీయమా యన గజాద్యభావములు గజాదిసద్భావములవలె దర్శనయోగ్యములు వాస్తవము గాఁగాకపోయినను, నేను గజాభావమును దర్శించు వాఁడనని జనుఁడు పల్కుట యభావమునందు భావదర్శనాభిమానము గలుగుటచేఁ గద యని మనము తెలియుదు మటులనే నిత్యజ్ఞానమందు జ్ఞానాభావము దర్శించుట యన్న తదభిమానముచే నని తెలియనగును. కాన శూన్యమతమునందు జ్ఞానరాహిత్య మంగికరించుచో నది లౌకిక జ్ఞానాభావముగా నెఱుఁగునది. ఇఁక క్షణికవిజ్ఞానప్రవాహ మాత్మనిగా నెఱుఁగు బౌద్ధులు గలరు. తద్వాదము విమర్శింతము ఒక క్షణమున మండు తైలకణములు నశించి తర్వాతిక్షణమునఁ బూర్వకణముల వంటివి మండుట వల్ల వెనుకటి క్షణస్థకళికయె తర్వాత క్షణమున నున్నది యనుట ధీసంతానము గదా దానిం బట్టి పూర్వాపూర్వోత్తర విజ్ఞానగ్రాహక విజ్ఞాన మొక్కటి యుండుట వల్లనే దీపకళికావ్యవహారము జరుగుచున్న దని స్పష్టపడుచున్నది. కావున విజ్ఞానవాదియుఁ గూడ నాత్మాస్తిత్వవాదియే యగును. అట్లయినచో నాత్ముఁడు క్షణికుఁడని యేల తద్దర్శనకర్త నుడువు నన వాని మతమున "యత్సత్ తత్ క్షణిక మేవ" యను వ్యాప్తి నంగీకరించి తత్సంప్రదాయానుసారియై

తత్సమర్దన ప్రయోజనార్థ మట్లు శాసించె నని తెలియఁదగును. మఱియుఁ దన్మతమున "ధీసంతతిః స్ఫురతి నిర్విషయోపరాగా" యని కూడ వచింపఁబడుట వలన సద్జ్ఞానోదయమున ముక్తి యగునని తెలియుచున్నది స్వప్రతిజ్ఞానిర్వహణార్థమువాస్తవేతరకథనము ప్రవర్తకులకుఁ గూడునా యని శంకింపవలదు. ఏలయన యట్టి యాచారము భాట్టాదులయం దర యుదుము. బాహ్యార్థములు వాస్తవముగా లేవనియును సర్వము స్వజ్ఞాన ప్రకాశమే యని వక్కాణించు బౌద్ధుల మతము నిరాకరించు సందర్భమున భాట్టులు బాహ్యార్థవస్తువులు ప్రత్యక్షములు కావున వాస్తవములనియుఁ దత్ప్రకాశకజ్ఞానవ్యక్తిమాత్రము పరోక్ష మనియు నమేయ మనియు సిద్ధాంతీకరించుచు సర్వప్రకాశమును స్వానుభవసిద్ధమును నగు జ్ఞానము ప్రత్యక్షముగాదనియు ననుమానప్రమాణసిద్ధమనియు రాద్ధాంతీకరింతురు. ఇఁక మీమాంసకుల తెఱంగెఱింగించెద. వారిది వైదికమత మగుట యాగహోమాదివైదికక్రియాకలాపముల నిర్వహించి తత్తత్ఫల భోక్తయగు నాత్మయొకండవశ్యము శరీరేంద్రియవిలక్షణుండయిన వాఁ డొక్కండు గలండని స్థిరపఱచి తథావిధాత్మనిరాకరణచణులగు బౌద్ధ చార్వాకాదిమతము లశ్రద్ధేయములని బుద్ధి గఱపుదురు. వారు కర్తృత్వ భోక్తృత్వాదిసర్వవిక్రియారహితుండును వేదశిరోవిహితుండు నగునాత్మ నంగీకరించినచో స్వమతప్రయోజనము నెరవేరకపోవుటగాక స్వమతమున కుచితమైన యజ్ఞయాగాదివైదికక్రియాపాదననిరసనమును సంభవించుటంజేసి స్వమతప్రయోజనానుసారముగాఁ గర్తయనియు భోక్త యనియు నాత్మని నిర్వచింతురు. అట్లయినచో మీమాంసకమతము వైదికమత మెట్లగు నని శంకింప వలదు. ఏలయన నాత్మాస్తిత్వము వారి కంగీకారము కనుక వారి మతము వైదిక మతమనిచెప్పవచ్చును. భవాచార్యశిష్యుండగు భవనాథుండు నాస్తిక్యనిరాకరణపరాయణుండైన భవాచార్యుని నాత్మాస్తిత్వసిద్ధాంతము యుక్తిబద్ధము చేయుటకు గర్తృత్వభోక్తృత్వాదిలక్షణములచే నాత్మ నుపదేశించు నని వెల్లడించుచునుగాన సర్వదర్శనములు నుపనిషద్గమ్యాద్వైతబ్రహ్మస్వరూపమున నంగీకరించు ననియే యూహింపవలసి యున్నది. మరియుఁ బ్రమాణప్రమేయాది

షోడశపదార్థవాదులగు నైయాయికులును ద్రవ్యగుణాదిషట్పదార్థవాదులగు వైశేషికులును నవ్యక్తమహదాదిచతుర్వింశతితత్త్వవాదులగు సాంఖ్యులును శివశక్తిసదాశివేశ్వరవిద్యాదిషట్త్రింశత్తత్త్వవాదులగు శైవులును భిన్నభిన్నవాదావలంబులగుట నెట్లేకపదార్థమునందుఁ బక్యవసానము గలుగువా రగుదురని సందేహింపవలదు. మున్నిటిగరళ్ళవలె వారి మతములు పరమాత్మునందుఁ బరస్పరము బాధ్యబాధకతాభావము నొందును.

చ. నుడివినవాఁడ నింతకు మ నుప్రకటార్థము నింక మీఁద నే
నుడువఁ గడంగువాఁడను విను ండు జపం బొనరించి మించు మే
ల్వడువుల దేశికోత్తముని పాదము వట్టి గ్రహింపగావలెన్
గడు వినయంబుతో ముదముఁ గాంచుచు నీమనురత్న మొయ్యనన్

తే.గీ. సావధానమనస్కుఁడై సరగ దీని
నర్థి మెల్లను మహితుఁడౌ యయ్యవారి
చెంగట వసించి తా నభ్యసించి యవల
దక్షిణల నిచ్చి యొజ్ఞను దనుప వలయు 15

స. గురువుల సెలవందు కొని హవిష్యము గాని
పండులు గాని దుంపలును గాని
తనుధారణమునకై తినుచు గుబ్బరిచలఁ
గాని యేటొడ్డునం గాని దేవ
ళమ్మునం గాని వనమ్మునం గాని వి
శుద్ధతరంబైన చోటు నెమకి
నమరేశుదిశఁ గాని యక్షరాడ్దిశఁ గాని
యాభిముఖ్యముఁ జేసి యట సుఖాస

తె.గీ. నమ్మునం గూరుచుండి మ నమ్ము నిశ్చ
లమ్ము నొనరించి ముమ్మారు లిమ్ము మీఱఁ
బ్రాణవాయువు నాయామ దళముఁ జేసి
శ్రీకారాంచితనిష్ఠాగరిష్ఠుఁ డగుచు 157

క. మునిపతి ఛంధము దైవ
మ్మును శక్తిని బీజమెంచి పొల్పుగ డెందం

బున నివసించెడు నీశా
ముని ధ్యానింపంగవలయు నూల్కొని భక్తిన్ 158

తే.గీ. ఆచరింపంగవలెఁ గరన్యాసమంగ
పంచకన్యాస మమలహృత్పద్మమందు
మెఱుపుఁదీవను బోలుచు మిగుల వెలయు
తేజువానిని గాంచఁగా దివ్యరవలయు 159

క. హృదయాబ్జమధ్యమందున
ను దివాకరమండలమ్ము నున్ నీహారాం
శుదహనమండలములఁ గ్రమ
ము దలిర్పఁగ నిల్పి పిదప మోద మెలర్పన్. 160

క. పరశివుఁ దన్మధ్యంబున
నెఱి నిలుపుచుఁ బార్వతీశు నిన్ నియతిమెయిన్
వఱలంగ నాఱులక్షల
పురశ్చరణఁజేయుటొప్పు ముక్తిప్రదమై 161

క. క్షీరాజ్యపలాశకుసుమ
సారాహుతులన్ సహస్ర సంఖ్యాకముగా
ధీరుండు సలుపునెడ నే
పారున్ ముక్తియును భుక్తి నమలులు వినుఁడీ 162

క. అటుగాక నెమ్మనమ్మున
నటరాజున్ శివుని శర్వు నగజాధీశున్
పటుభక్తి నిల్పఁగాఁ బి
మ్మట ముక్తి కరస్థ మగుట మాన్యులు గనుడీ! 163

క. ఏనుం బ్రాకృతుఁడను గా
నేనౌదుం బరమశివుఁడ నిది నిజమని చి
త్తానఁ దలంపఁగఁ గలిగిన
వానికి వంటింటి శశము వరముక్తి యగున్ 164

వ. ఇది మంత్రసాధనక్రమం బిఁక వినియోగక్రమంబు వాకొను
వాఁడ. 165

సీ. పదిలక్షలకు జపంబు గుదితదీక్ష నొనర్ప
షట్కర్మసిద్ధి యొసంగు జగతి
నిరువదిలక్షజపింప నెన్నందగిన
నతిమాత్రమైనదీర్ఘాయు వగును
నలువదిలక్షల నెలమి సమర్థింప
నగును విరాట్స్వరూపాతిశయము
నరువదిలక్షల నిరవొందఁ జేయఁగాఁ
దమ్మిపూచూలిపదమ్ము దనరు
తే.గీ. తపము నెనుబదిలక్షలసలుపు నెడల
పద్మనేత్రత్వలక్ష్మి కైవసమ యగును
నూఱులక్షలు జపియింపఁ జారుభోగ
హారసుకుమారమూర్తిత్వమబ్బు నిజము. 166
కం. అక్షరకోటిన్ దృఢతర
దీక్షన్గొని జపమొనర్చు ధీరునకు లలా
టేక్షణపరమైశ్వర్యసు
లక్షణ విగ్రహవిశేషలాలిత్య మగున్ 167
క. ఏవాఁ డనుదినమును శ్రీ
ద్ధావంతుం డగుచు వేలు ద్వాదశవరసం
ఖ్యావంతముల జపించిన
నావానికి నిత్యముక్తియమరును జుండీ 168
క. వినియోగవిధానమ్మిది.
ఘనపూజావిధిని నింకఁ గడఁగుదుఁ బలుకన్
విని దీనివి సాంతంబుగ
ననుసరణ యొనర్పవలయు నార్యజనమ్ముల్. 169
సీ. హృదయసరోజకర్ణికమధ్యమున నైన
యాదిత్యబింబమధ్యమున నైన
మంచుఁ జాయలవేల్పుమధ్యంబునను నైన
విమలోజ్జ్వలాగ్నిమధ్యమున నైనఁ

బ్రతిమ యందైన శివస్వరూపంబు చిం
తించి షడక్షరి నెంచి పూజ
లొసఁగి యాసన మిచ్చి బొసఁగ నావాహనం
బవ్వలఁ గావించి యర్ఘ్యపాద్య

తె.గీ ములను బిమ్మట నర్పించి యెలమి నాచ
మనము చేయించి భోఁగించి మంచి వల్వ
లిచ్చి జన్నిదమును యెడ నేసి సొమ్ము
లిమ్ముగా యేనుపయి పెట్టి నెమ్మి మీఱ 170

తే. గంధసుమధూపదీపముల్ గ్రాలఁ జేసి
యోగిరమ్ము నివేదించి యుత్పలాది
మాలికలతో నలంకృతి నోలి సలిపి
సరసగంధాదిలేపన చర్చ చేసి 171

తె. చేతులును రెండు జోడించి శివున కవల
వేడికోలిచ్చి పంపగాఁ బెంపు గనెడి
విధముఁ దెలియుఁడు మీరిది విబుధులార!
భుక్తిముక్తులు నందుచేఁ బొల్చు మీరు. 1̃2

కం. ఆవాహనము విసర్జన
భావంబును నైజహృదయ పంకజమందున్
గావింపవలయు శివునకు
దేవశిఖామణికి నంచుఁ దెలియఁగవలయున్. 173

క. కావున మీరన్యంబును
వే విడి హృదయంబునందు పీడని భక్తిన్
సేవింపవలె షడక్షర
పావనమంత్రింబు చిత్త పావనులారా! 174

## 9. ధ్యానయజ్ఞ విచారము

ఉ. వాచికయజ్ఞవైభవము వాకొనినాఁడ నశేష మింతకున్
వాచికయజ్ఞమున్ గెలుచు వైభవముం గల ధ్యానయజ్ఞమున్

భ్రాచురరీతిఁ బల్కెఁదనశ్వరభంగురమౌ ఫలమబ్బు దాన స
ద్ధిచతురత్వసంపదను ధీవరులార! వినుండు శ్రద్ధమై 175

క. ధ్యేయాంచితమూర్తి విజా
తీయప్రత్యయవితానధీప్రత్యూహా
శ్రేయము గలుగని యట్టుల్
నేయుచు ధ్యానింప ధ్యానసిద్ధి యలవడున్. 176

క. ధ్యేయామలవిషయసజా
తీయప్రత్యయవితానధీసందోహ
శ్రీ యొదవఁగ ధ్యానించిన
నా యొప్పే ధ్యాన మందు రార్యవతంసుల్. 177

ఉ. భేదము భ్రాంతిమాత్రమగు భేదము గల్గ దొకింత సాక్షియై
యేదెస నైనఁ దానగలఁ డెంచ శరీరవిలక్షణాత్ముఁడై
మోదిలుఁ బ్రత్యగాత్ముఁడగు పూరుషనాముఁడు నిర్గుణుండు చి
త్తాదులఁ బట్టినిల్ప నెవరైనను నేర్చిరె యెన్నఁడేనియున్. 178

కం. కానన్ ధ్యానమొనర్పఁగఁ
బూనినచో నిర్గుణాత్మమూర్తి గొనకుఁడీ
ధ్యానార్హము మీకగు సగు
ణానూనాసందవిగ్రహంబిది గనుఁడీ 179

క. నీ రూపము ధ్యానింపఁగ
నేరం డెవ్వాఁడు ధ్యాననిష్ఠను నిలుపం
గోరికయే యొదవినచో
గౌరీవామాంగుఁ దలఁపఁ గావలె నెడఁదన్. 180

క. మెడకప్పు మూఁడుకన్నులు
జడనేఱుం బడఁతి దలను జాబిల్లి మెయిన్
గడలేనియొడికపుందొడ
వడరెడి ముక్కంటిమూర్తి ధ్యానార్హంబే 181

మ. తను దా నారయుటన్ మెయిన్ మఱచి తత్సంధానమోదంబుచే
తను జిందుల్ దయివార మేలుగతి నృత్యం బబ్బుర్ం బొప్ప నే

యనఘుం డాడఁబితామహాదు లట "ధన్యాఃస్మోవయమ్మంచు" హృ
ద్వనజాతంబున నెంతు రట్టి ఘనుఁడే ధ్యానార్హుఁడౌ నెయ్యడన్.

క. అది శ్రుతివర్ణిత రూపం
మ్మది సారసజన్మవిష్ణులనవరతము నె
మ్మది ధ్యానించెడి నిర్మల
పదార్థ మాద్యంతరహితపద మదియ యగున్. 183

వ. ఇయ్యది పరాత్పరుని సాధారణమూర్తి మఱియు మూర్తి కతి
రిక్తము లయిన యుపాధులా పరమాత్మునకు నాలుగు గలవు. సత్త్వ
గుణపరిణామ మయివిషయములఁ దెల్పు నంతఃకరణవృత్తి జ్ఞానము
నాఁబడు నది మొదటి యుపాధి. తమోగుణపరిణామమయి యప్రకాశ
కము జడాకారమునగు నంతఃకరణవృత్తి యజ్ఞాన మనంబడు నది రెం
డవ యుపాధి. స్వాశ్రయమునకుఁ గూడ మోహమును బుట్టించు
దుర్ఘటశక్తి మాయ యని పేరుగాంచు నదియ మూఁడవ యుపాధి.
స్వాశ్రయ వ్యామోహన సామర్థ్యము మాత్రము గలిగి దుర్ఘట
కిరణపాటవరహితమైన నదియే యవిద్య యని సంకేతింపఁబడు
నది నాల్గవ యుపాధి. వానిలోఁ బ్రత్యవాధి యందును నుపహితంబగు
పరమతత్వంబుస్వప్రధానసమప్రధానా.స్వప్రధానముగనుత్తమమధ్యమాధి
కారులచేతఁద్రివిధముగను పాసింపఁబడుచున్నది. మఱియుజ్ఞానాజ్ఞాన
మాయావిద్యానామకచతుర్విధోపాధివ్యతిరిక్తములును నైన యిచ్ఛాక్రియా
ద్యుపాధులంగూడి పరతత్త్వముపూర్వోక్త త్రివిధాధికారులచేస్వప్రధానాది
త్రిప్రకారంబుల సేవ్య మగుచున్నది. స్వప్రధానవిధానమన నుపాధి
నుపసర్జనముగా నొనరించి యుపధేయపరశివస్వరూపము ప్రధానముగ
స్వీకరించుట, యస్వప్రధానవిధానమన నుపధేయశివస్వరూప ముపసర్జన
ముగా నొనరించి యుపాధిం బ్రధానముగా నొనర్చుట సమప్రధాన
విధానమున నుపధేయోపాధులలో నొక్కటిం గూడ నుపసర్జనీకృతముల
నొనరింపక రెంటినిం బ్రధానములుగ గ్రహించునది. మఱియుఁ బ్రాణి
కరఫలోపభోగ నిమిత్తముగ నీక్షణాదిమాత్రమును జగత్సృష్టి సలుపం
గోరు పరతత్వమును యథాపూర్వోక్తరీతిం ద్రివిధముల ధ్యేయమగును.

సిసృక్షాపూర్వము సత్త్వరజస్తమస్సామాన్యాకృతిఁ బొంది యీశ్వరప్రేత ప్రకృతి నాఁబడు పరబ్రహ్మశక్తియు సిసృక్షానంతరమున సిసృక్షాప్రేరిత మగుట త్రిగుణములలోన్న్యూనాధిక్యభావమొదవి బ్రహ్మవిష్ణురుద్రనామక మూర్తిత్రయరూపములఁ బరిణమించు. ఆత్రిమూర్తులును బూర్వోక్త త్రివిధమును సామాన్య లగుదురు. మాహాత్మ్యవీర్యాదులఁ ద్రిమూర్తుల కంటెఁ గొలఁదులగు నగ్న్యాదిత్యాదిదైవతములును బూర్వోదాహృత విధిత్రియముల నుపాస్యములగు ఆకాశాది పంచమహాభూతములును తద్గుణములైన శబ్దస్పర్శాదిపంచకమ్మును బ్రహ్మరూపమున ధ్యానించు పట్ల త్రైవిద్యము వర్తిల్లు. బ్రహ్మాండాంతర్గతలోకములు నాలోకాంత ర్గతదేశంబులును దదంతర్గతమేరుమంధరాదిభూధరంబులు నదీనదవాపీ కూపతటాకారణ్యంబులు నిధులును దిగ్విదిక్ప్రభృతులును దివారాత్రా గతానాగతాదికాలంబులును జరాయుజాండజ స్వేదజోద్భిజ్జంబులగు సృష్టివిశేషమ్ములు బ్రహ్మక్షత్రవైశ్యశూద్రాదులగు చతుర్వర్ణములును దత్సంకరవర్ణములు నాలుగాశ్రమంబులు సోపపాతకమహాపాతకమ్ములు ధర్మసంజ్ఞలైన విప్రులును సుఖదుఃఖాదిభోగములును దత్సాధనములు కర్తృకారయితృకరణములు ప్రమాతృప్రమాణ ప్రమేయములు విధి నిషేధవిద్యావిద్యాభావాభావవంధ్యావంధ్యాది ద్వంద్వములును బ్రహ్మరూప ముగ ధ్యానించిన యుత్తమునకు భగవద్జ్ఞానము కరబదరంబగు. 184

క. ధ్యానము నూనక మోక్ష
స్థానమునర్థించువాఁడుశ్రీ సరసామృతమున్
మాని విషాన్నముఁ గొను ధీ
హీనునితోఁ బోల్పవచ్చునిది యెఱుఁగుడిఁకన్. 185

తే. ధ్యానమార్గమ్మునన్గాకయన్యగతుల
ముక్తిఁ బొందఁగఁ గోరెడుమొఱకు చెవుల
మాని కన్నవ చేతనేగానమధుర
రసముఁ గొనఁగోరు బలువెట్టికిసముఁ దగును. 186

క. శ్రుతిదర్శితాశ్వమేధా
ద్యతిపావనయజ్ఞములును ధ్యానాధ్వరసం

గతఫలముల నీఁజాలవు
మతినెంచిన ధ్యానయజ్ఞమహిమ మతులమౌ 187

క. నిరతధ్యానపరుండౌ
పురుషుఁడు కేవలశివుండు పురహరమూర్తి
తరుఁ డెన్నటికినిఁ గాడె
త్తరిని నలభ్యంబు గలదె ధ్యానపరునకున్ 188

క. దుస్తరసంసారమ్మున
పొస్తం బొనరింపఁ జాలుఁ బరమశివుండ
భ్యస్తధ్యానునకుఁ బ్రసా
దస్తవనీయార్థమొసఁగుఁ దనువు నిరతమున్. 189

ఆ. కల్పకోటికోటి కాలమ్మునకు నైన
ధ్యానయజ్ఞమహిమ యాదృతి మెయి
నేను మదధికులును నిక్కమ్ముగా నింత
పలుకఁ గలమె వినుఁడి వలఁతులార. 190

ఉ. నే నుడులన్ వచింపఁగల నే యిఁక వేదపదప్రమాణసం
ధానచణాత్ములార! శతధా విధిమించును శాస్త్రిమంచొగిన్
ధ్యానము నూనుటొప్పఁ బర మార్థము చేకురు దానఁగాన నిం
తెనియు సందియంపడకుఁడీరలు ధ్యానవిధిన్ గ్రహించుచో. 191

10. జ్ఞానయజ్ఞ విచారణ

తే. జ్ఞానయజ్ఞంబు కన్న యజ్ఞం బొకండు
కలుఁగునే యెన్నఁడైన సజ్జ్ఞానులార!
జ్ఞానవైభవ మియ్యెడఁ జతురత మెయిఁ
బలుకువాఁడను వినుఁడు పీమలు నెలంగ 192

మ. తొలుతన్ సృష్టికిఁ బూర్వమందు నవదీప్తుల్ మీర నేయద్వితీ
యలసద్రూపము తేజరిల్లునది బ్రహ్మాండాదిసృష్ట్యుత్తరో
జ్జ్వలకాలంబు నజీవదేవవివిధప్రాంచద్విదారూపసం
కలితంబైన యుపాధి నొంది వెలయున్ గళ్యాణనామమ్ములన్ 193

క. ప్రతియోగివస్తు వెలుఁగని
యతినిర్మలశక్తికగుసుశ్రీహరపరశక్త్యాం
చితనామము జడశక్తిఁ బ్రే
కృతియనఁగా మాయ యనఁగఁ గ్రుతనామ మగున్ 19।

మ. గొనముల్ మూఁడు సమానమౌ నెడలఁ జేకూరున్ బ్రధానాఖ్య నా
య్యన వైషమ్యము నొంద నయ్యవి యలోకాదిక్రియారంభకం
బన విఖ్యాతినిఁ గాంచునం దమలసత్త్వాఢ్యంబ యాఖండగున్
దనరున్ జీవసమాఖ్యయుసి మలినసత్త్వస్ఫూర్తి నొప్పారినన్. 195

వ. మఱియు జీవవిజ్ఞాన మిఱుదెఱఁగులు. అందు మలినసత్త్వప్రధాన మాయానామకావిద్యాపర్యాయనామకమును స్థూలసూక్ష్మశరీరకారణమును నయి తదుపహితచైతన్యము స్వరూపవ్యవహారహేతువగుట వలన సర్వతోముఖ్యమనున దొకటి యవిద్యాకార్యభూతస్థూలసూక్ష్మశరీరావచ్ఛిన్నమును దత్కారణమయి తదనుస్యూతమయి తాదాత్మ్యమొందునది ప్రతీతిచైతన్యమనియు రెండు విధములు చైతన్యమగు నందున రెండవదయః పిండవ్యాప్తాగ్నిప్రతీతి వంటిది. కామసంకల్పవిచికిత్సాశ్రద్ధాశ్రద్ధాధృత్యధృతులను "హ్రీ.ధీ.భీ."గుణములును మానసికములు గాని యాత్మనివి కావు. చిత్తతాదాత్మ్యము వలన సుఖిత్వదుఃఖిత్వాదు లాత్మనకు వ్యావహారికములగును. కాలకర్మవిపాకమువలన (ప్రమాణభ్రాంతి సందేహాద్యాకారముల బహువిధములఁ జిత్తమగును. జ్ఞానము తత్సంబద్ధమయి తాదాత్మ్యమునొందు వేళఁ దత్తజ్ఞానమునగును. కాచకామలాదిదోషదూషితములు గానిచక్షురాదీంద్రియవ్యాపారమువలనఁ గలుగు జ్ఞానము ప్రమ యనఁబడు. దోషదూషితేంద్రియసంపాదితజ్ఞానము భ్రాంతి నాఁబడు. ఉభయపక్షాధ్యవసాయరహితమై స్థాణువా? పురుషుఁడా యని నిశ్చయము చేయలేని జ్ఞానము సంశయజ్ఞానము నాఁబడు. తత్పదార్థమందుఁ దత్పదార్థబుద్ధి ప్రామాణ్యజ్ఞానము, ఘటమునందు ఘటజ్ఞానము, పటమునందుఁ బటజ్ఞానమును యదార్థజ్ఞానమగు. వాస్తవముగాఁ గంటికెదురైనది శుక్తియైనను శుక్తిత్వము వ్యక్తము గాకరజతత్వముగా వ్యక్తమగుట విపర్యయజ్ఞానము. అవిరెండు మనోవృత్తుల నాశ్రయించును. పదార్థదర్శన

మున నిదమాకారగోచరమైన మనోవృత్తి యొకటి. ఇది యనుజ్ఞానము మాత్రమందుఁ గలుగును. శుక్తి యందు శుక్తిత్వవిశేషము గనఁబడక యధిష్ఠాన మిదియని మాత్రము మందున తెలియును. అప్పు డిదంవృత్త్యవచ్ఛిన్న మంతఃకరణమగు. అట్టి యంతఃకరణము నందు మాయాకల్పిత రజతాకారగోచరమైనది రెండవవృత్తి. కాన విపర్యయజ్ఞానవంతమైన చైతన్యమేయుభయవృత్తిమంతమనుట తెల్లము. అందు మొదటిది యధిష్ఠానాశ్రయి రెండవది కేవలవృత్త్యాశ్రయము. ఇదమాకారదర్శన మాత్రదక్షమగు తొలుతటి వృత్తి ప్రామాణ్య మగును. రజతాకారవృత్తి మాత్రము శుక్తియందుఁ బ్రామాణ్యముకావున నదియైన దానియందు నది యను బుద్ధి ప్రమాణజ్ఞాన మనియు నది కానిదాని యందు నది యను బుద్ధి భ్రమజ్ఞానమనియు వ్యవహరింతురు. అందుఁ బ్రమాణజ్ఞాన మాఱు విధములై యలరారు. ప్రత్యక్షానుమానోపమానార్థాపత్తిశబ్దాను పలబ్ధులను నాఱును బ్రమాణజ్ఞానములే. అం దనుపలబ్ధిజ్ఞానము మాత్ర మభావజ్ఞానము. తక్కిన యైదును భావరూపజ్ఞానములు. ఇంద్రియ గ్రాహ్యమైన వస్తుసంబంధమైన యనుపలబ్ధిమాత్రము భావరూపమైనది. ఇంద్రియ సన్నికర్షము వలనఁ గలుగు జ్ఞానము ప్రత్యక్షము. వ్యాప్తి మున్నగు పంచావయవముల వలనఁగలుగు జ్ఞాన మనుమానము. అనుప పత్తి వలనఁ గలుగుజ్ఞాన మర్థాపత్తి. తాత్పర్యోపేతశబ్దార్థజ్ఞానము శాబ్దము. శాబ్ద మక్షరపదవాక్యరూపమై త్రివిధ మగును. అక్షరసముదాయము పదము పదసముదాయము వాక్యము. ఏకాక్షరపదములు నేకపద వాక్యములునుం గలవు. కొందఱమతమున నక్షరములే యర్థప్రకటన సామర్థ్యములు. కొందఱిమతమునఁ బదములే మఱికొందఱి మతమున వాక్యములే యర్థముల నిరూపించును. దీనినే స్ఫోటవాదమందురు. మఱియు వాక్యముప్రధానమనియు గుణభూతమనియు ద్వివిధమగు. ప్రధానవాక్యము మహావాక్యము. ఫలవదర్థావబోధకవాక్యమే యగు నవాంతరసిద్ధాంతమును మహావాక్యము నకుపకరించు నటుల నుడువు వాక్యము గుణవాక్యము. పదములు స్వశక్తి వలనను వాక్యములు తాత్ప ర్యము వలనను విషయముల బోధించును. తాత్పర్యము రెండు విధ

ములు. మహాతాత్పర్యమనియు నవాంతరతాత్పర్యమనియుఁ దద్భేదము లకు నామధేయములు. రెండవది మొదటి దానికి శేషవాక్యమగు. మరియు విధులు, నిషేధములు సిద్ధార్థబోధకములు నని వాక్యములు ముత్తెఱంగులు. అగ్నిహోత్రమునర్చింపవలె, సంధ్యనుపాసింపవలె నను వాక్యములు విధులు. పరదారగమనము గూడదు. కళంజభక్షణము సేయరాదను వాక్యములు నిషేధములు. స్వకంఠమణిహారము వెదకు వానికది కంఠస్థమని తెలుపు వాక్యము బ్రహ్మ సత్యమని తెలుపు వాక్యము సిద్ధార్థబోధకములు. కానఁ బ్రత్యక్షాది ప్రమాణములు. పరార్థ నిర్వాహకములుగాని ప్రత్యగర్థప్రతిపాదకములుగావు. లౌకికసిద్ధార్థబోధక వాక్యమును బరశివబోధకము గాదు. ఉపనిషత్ప్రోక్త తత్త్వమస్యాది వాక్యములు ప్రత్యగ్బోధకములు. వేదాంతములలో మహావాక్యములు ప్రత్యగ్బ్రహ్మైక్యతాసంపాదకములు. అవియే భ్రాంతిసిద్ధసంసారమును నివర్తింపఁ జాలు. సంసారము వాస్తవముగ నాత్మన కుండునేని శత కోటిజన్మలకైన నాత్మనికి ముక్తియే లేదు. అనాత్మవస్తువులగు ఘటా దులకు నాశము గలుగునట్లు నాశమాత్మునకు లేదు. జీవభేద మెట్లనిన నుపాధివలన నని యెఱుంగునది. చిత్తునకు భేదము లేకపోయినను జిద్రూపములగు నానోపాధి వశమున భేదము సంభవించు. ఆకాశ మొక్కటియైననుఘటాద్యుపాధులవలన నాకాశరూపభేదములు వ్యవహార్య ములగును గదా! కాని ద్వయవ్యవహారము కేవలము భ్రాంతిమూలకము మఱియుఁ బ్రాతీతిక, వ్యావహారిక పారమార్థికము లన సత్యము త్రివి ధములు. అందు శుక్తి రజతము కేవలము రజతాభాసమాత్రము. అదియే ప్రాతీతికసత్యము. కటకాదు లొనరించి మేన ధరించుట కది యుపయో గింపదు. ఘటపటాదులు వ్యావహారికసత్యములు. త్రికాలాబాధ్యములు గావు గనుక నవి పారమార్థికములు గావు. బ్రహ్మము మాత్రము పార మార్థికసత్యము.

ఉ. ఒక్కటి మాత్రమై వెలయుచొప్పదు బ్రహ్మము సద్వితీయమై
జక్కఁగ ద్వైతభావములుసాగును మాయకుఁ జిక్కియున్నచో

నిక్కపుఁదత్త్వమియ్యదని నిచ్చలుఁ బల్కును వేదమాతపెం
పెక్కిన మాతృవత్సలత నెల్లర బిడ్డయఁ బ్రోవ నెంచుచున్ 197

ఉ. అన్నిటి యందు భేదమున నాదరణంబు నొనర్చి యైక్యమున్
జెన్నుగఁ జూడ నేర్చు బుధశేఖరుఁ డెట్టుల మోహశోకవి
చ్ఛిన్నహృదంబుజాతుఁడగుఁ జేటునువాటిలు ద్వైతభావనా
పన్నున కెన్నఁడంచు శ్రుతి పల్కును దన్నియమంబు దప్పనే 198

చ. పరిమితిశతంబు చూచినను పండితకోట్యనుభూతి చూచినన్
సుమహితసత్పదార్థము విశుద్ధతరంబును నద్వితీయమం
చు మతి దలిర్చు నెల్లరకు శోధన చక్కని దయ్యెనేని ని
క్కము మది కెక్కనే యటులు గాని విధంబునఁ జూచువానికిన్ 199

మ. పటుసాధాంచితవేదదర్శితమహావాక్యానుసంధానసం
ఘటితజ్ఞానపదార్థ మేఘనునకైక్యజ్ఞానసంపాదియౌ
చటులానేకభయాస్పదాత్మకలసత్సంసారభారంబు దోఁ
చుటయే యాఘనుపట్ల మాను మలమెచ్చో నిల్చు సంశుద్ధితోన్

ఉ. భేదము దర్శనీయమని వెల్లితనంబునఁ గొందఱందురా
వాదము ద్రోయువారి భవవారిధి సందియ మింత లేదుస్వ
ప్నాదిగతానృతంబులను వాస్తవబోధము మాన్పదే ప్రబో
ధాధులఁ గల్గు పట్ల నిఁక నారుభవంబది యెంచి చూడఁగన్ 201

ఉ. ఆకసమొక్కటైనను ఘటాదులఁ జెంద ననేకభంగిగన్
వాకొను పెల్లనారయఁగ భ్రాంతిగదా! యటులౌను నాత్మఁ దే
కాకియ యైన మానవమృగప్రభృతిన్ వసియించు పట్ల నా
నాకృతభేదసంచయ మనారతమైన భ్రమంబు చేనగున్ 202

ఉ. కేవలజీవునందుఁ బరికింపఁగ వాస్తవభేద మెన్నఁడేన్
ధీవరులైన వారు గణుతింతురె భేద ముపాధిసాధ్యమే
యౌ వివరింప నెంచ శ్రుతులాడెడి పల్కులు వాస్తవమ్ము సుం
డీ! వివిధానుభూతికట నిక్కపు హేతువు పల్కఁగాఁబడున్. 203

క. తనయందు సకలభూతము
లును సకలము నందుఁదాఁగ లుగునది యెదలోఁ

గన నేర్చువాని నాత్మ
జ్ఞునిగాఁ దెలియుండు ముక్తచొక్కఁ నతనికై 204

క. ద్వైతజ్ఞానము విడి య
ద్వైతజ్ఞానంబు గలుగఁ బండితులై యే
రీతిన్ బాయని సంసృతి
నేతురు బాపంగ జగము నిచ్చలు మెచ్చన్ 205

శా. ద్వైతజ్ఞానము చేత మోక్షమును సంపాదింపఁ గాంక్షించు వా
రేతత్సంసృతిసర్పదష్టులయి యెన్నెన్నో విజృంభద్విప
వ్రాతార్తుల్ గడు గాసిపెట్ట భవబంధధ్వంసమున్ జేయకే
యాతిధ్యంబులు గాంచుచుందురు సతమున్ యామ్యాలయమ్మందు
నన్. 206

మ. అమలజ్యోతిరుపాయముం గనక విఖ్యాతాంధతామిస్రసం
ఘము బోలన్ సమకట్టి నట్లు విమలజ్ఞానైకసాహాయ్యలే
శమునుం గాంచక కర్మయజ్ఞముల మోక్షంబుందగన్ గాంతు
మం
చు ముముక్షుల్ పరిహాస్యులై గనరు సంశుద్ధాత్మ నెప్పట్టునన్

క. ద్విజుఁడైనం గానీ యం
త్యజుఁడైనం గాని జ్ఞానయజ్ఞోడుప ము
క్కజముగఁ గొనఁ గలిగినచో
నిజసంసృతివార్ధి దాట నేర్చున్ జుండీ 208

తే. జ్ఞానయజ్ఞమ్ము సలుపక సారహీన
లోకముల కాసగాంతురు ముల్లోకములను
జ్ఞానసామర్థ్య మొకయింత యేనిఁ దెలియ
నేని వారటుల్ పలువంగ వెంచు వారె? 209

క. శివుఁ డొక్కఁడు శ్రుతియొక్కటి
ప్రవిమలవిజ్ఞానమింత పలుకఁగ నేర్చున్
వివరింపనగునె? ననుబోఁ
టివిప్రునకు దాని వాక్పటిమత తెలఁగన్. 210

క. అమలాత్మబ్రహ్మైక్యర
సము నెఱిఁగిన తత్త్వవేత్త జ్ఞానాతిశయ
మ్మ మహితగతిఁ దెలుపఁగఁ జా
లు మహీసురులార! దీనిలోఁతుఁ దెలియుఁడీ! 211

క. మానుగ నెందైన శివా
జ్ఞాని యనుగ్రహము లేక జాణయె తెలియన్
జ్ఞానరమావిభవంబుల
జ్ఞానాధికమైన సాధనమునుం గలదే 212

తే. అఖిలమును బ్రహ్మరూపమై యలరుఁగాక
జ్ఞాని యగువానికీసర్వ జగములందు
వాప్య మొకయింత గనరాదు పలుక హేయ
మనఁగఁ దగు వస్తువే లేద యార్యులార! 213

## 11. జ్ఞానయజ్ఞవిశేషము

క. జ్ఞానవిభవంబు నుడివితి
జ్ఞానవిశేషముల నుడువఁ గడఁగెద మీరల్
వీనులవిం దలరారఁగ
మౌనివరులు వినుఁడుజ్ఞాన మానితకథలన్ 214

సీ. ధర్మంబు గల్గు నధర్మంబునుం గల్గు
తత్ఫలంబులు గల్గు తప్ప కెపుడు
పరలోకమున్ గల్గు పాపంబు సేతకుఁ
గల్గు యముండు కింకరయుతుండు
కలుగును భూతముల్ గల్గును బ్రేతముల్
గలరు యక్షులు రాక్షసులును గలరు
కలరు మౌనీంద్రులుం గల రింద్రపవనకు
బేరాదిదేవతా విసరములును

తే.గీ. తల్లికంటెను మిగుల వత్సలత (గూర్చి
మనుపఁ జాలెడి శ్రుతిగల్గు మహితతదను

సరణమున మేలు గూర్పంగఁ జాలు స్మృతియు
గల్గునది నమ్మటయె మంచి జ్ఞానములగు 215

సీ. వేల్పుగముల కెల్లఁ బెద్ద గావున బ్రహ్మ
దైవతమని గాఁగ దలఁచు టొకటి
యరవిందభవుకంటె నంబుజాక్షుఁడు మిన్న
యని నెమ్మదిని నెప్పు డరయు టొకటి
సరసిజోదరుకంటెఁ జాల రుద్రుం డెక్కు-
డని నిశ్చయమ్ము నగనుట యొకటి
రుద్రుకంటె మహేశ్వరుం డధికుండని
స్థిరబుద్ధి దయివారఁ దెలియు టొకటి

తే.గీ. ఈశుకంటెను పరశివుఁ డెంచి చూడ
శ్రేష్ఠుఁడని డెందమున విశ్వసించు టొకటి
చెప్పఁగానొప్పు జ్ఞానవిశేషములని
విబుధవరులార! వేదవిత్ప్రథితులార!

క. భూవార్యగ్న్యనిలనభో
భావాంచద్వస్తుపతులు బ్రహ్మయు హరియున్
పావనరుద్రుం డీశుఁడు
ధీవరుఁడు సదాశివుండు తెలియుఁడు మీరల్ 217

క. పరమసదాశివుకంటెన్
వరరాజసగుణవిశిష్ట పద్మోద్భవుఁ డ
చ్చెరువొంద నధికుఁడగు భూ
సురులారా! ధీవిశేషసురపతులారా! 218

క. కారణకారణమగుటన్
సారవిశిష్టత్వమెపు డెసంగున్ సకలా
ధారమగు బ్రహ్మమందని
యారయ నొక జ్ఞానరీతి యగును వినుండీ 219

క. దేహప్రాణేంద్రియచి
త్తాహంకృతులందు నొక్కడై నం గాఁడీ

దేహి యని విరతమే సం
దేహము లేకుండ దెలియు తెలివి తెలివియౌ 220

క. సకలప్రత్యయరూపము
లకు వేఱయి సర్వసాక్షి లక్షణుఁడయి వా
సికి నెక్కును జీవుండను
సకలంకజ్ఞాన మొకటి యగు జ్ఞానమిలన్ 221

క. ఆరయ నీజాగ్రద్వ్యవ
హారము నిద్దురయుఁ గల యు నఁబ్రఖ్యాతం
బై రాజిల్లు నవస్థ ల
నారతమున్ జూచు సాక్షి నా జీవుఁడగున్ 222

తే. అఖిలదృశ్యమ్ము లెవ్వాని యందుఁగల్పి
తమ్ములగు దృశ్యమెవ్వఁడిం తయును గాఁడు
కేవలద్రష్టయై చాల శీవి గాంచు
నెవఁడు వాఁడేయగున్ జీవుఁ డెఱుఁగుఁడీరు

సీ. జ్ఞాతమున్ గాక య జ్ఞాతమున్ గాక యే
దివ్యస్వరూపంబు తేజరిల్లు
సత్యమై జ్ఞానమై సౌఖ్యమై నిస్తులం
బై యేపదార్థంబు వ్యాప్తి నొందు
సకలప్రమాణధీ సరణికిన్ భ్రాంతివృ
త్తికిఁ దోఁచ కెయ్యది దీప్తి గాంచు
నీవు నేనును బల్కు నెయ్యది లక్ష్యార్థ
మై యపరోక్షమై యతిశయిల్లు

తే.గీ. సర్వమున్ భాసిలఁగ జేసి స్వప్రకాశ
మునను వెలుఁగొందు నంచు వి బుధు లెఱుంగ
నెర్తు రెద్దాని నయ్యది నిక్కమీరు
జీవుఁ డని గుర్తెఱింగినఁ జెలఁగు ముక్తి 22[illegible]

క. జీవేశ్వరులకు భేదం
బావంతయుఁ గల్గ దంచు నరసిన వారల్

గన నేర్చువాని నాత్మ
జ్ఞునిగాఁ దెలియుండు ముక్తిఁ జొక్కు నతని కై 204

క. ద్వైతజ్ఞానము విడి య
ద్వైతజ్ఞానంబు గలుగఁ బండితులై యే
రీతిన్ బాయని సంసృతి
నెతురు బాపంగ జగముఁ నిచ్చలు మెచ్చన్. 205

శా. ద్వైతజ్ఞానము చేత మోక్షమును సంపాదింపఁ గాంక్షించు వా
రెతత్సంసృతిసర్పదష్టులయి యెన్నెన్నో విజృంభద్విప
ద్వ్యాతార్తుల్ గడు గాసి పెట్టభవబంధధ్వంసమున్ జేయకే
యాతిధ్యంబులు గాంచుచుందురి సతమున్ యామ్యాలయ మ్మందు
నన్ 206

మ. అమలజ్యోతిరుపాయమ్ముం గనక విఖ్యాతాంధతామిస్రిసం
ఘము దోలన్ సమకట్టి నట్లు విమలజ్ఞానైకసహాయ్యలే
శమునుం గాంచక కర్మయజ్ఞముల మోక్షంబుందగన్ గాంతు మం
చు ముముక్షుల్ పరిహాస్యులై గనరు సంశుద్ధాత్ము నెప్పట్టునన్

క. ద్విజుఁడైనం గానీ యం
త్యజుఁడైనం గాని జ్ఞానయజ్ఞోడుప మ
క్కజముగఁ గొనఁ గల్గినచో
నిజసంసృతివార్ధి దాటనేర్చున్ జుండీ 208

తే. జ్ఞానయజ్ఞమ్ము సలుపక సారహీన
లోకముల కాసగాంతురి ముక్తిలోకములును
జ్ఞానసామర్థ్య మొకయింత యేనిఁ దెలియు
నేని వారటుల్ సలుపంగనెంచు వారె?

క. శివుఁ డొక్కఁడు శ్రుతియొక్కటి
ప్రవిమలవిజ్ఞానమింత పలుకఁగ నేర్చున్
వివరింపనగునె? నన్నుఁబ్రోఁ
టి విప్రునకు దాని వాక్పటిష్ఠత లెసఁగన్. 210

క. అమలాత్మబ్రహ్మైక్యర
సము నెఱిఁగిన తత్త్వవేత్తజ్ఞానాతిశయ
మ్ము మహితగతిఁ దెలుపఁగ జా
లు మహీసురులార! దీనిఁ దెలియుఁడీ! 211

క. మానుగ నెందైన శివా
జ్ఞాని యనుగ్రహము లేక జాణయె తెలియన్
జ్ఞానరమావిభవంబుల
జ్ఞానాధికమైన సాధనమునుం గలదే?

తే. అఖిలమును బ్రహ్మరూపమై యలరుఁగాన
జ్ఞాని యగువానికీ సర్వజగములం ద
వాప్య మొకయింత గనరాదు పలుక హేయ
మనఁ గదగు వస్తువే లేదు యార్యులార! 213

## 11. జ్ఞానయజ్ఞ విశేషము

క. జ్ఞానవిభవంబు నుడివితి
జ్ఞానవిశేషముల నుడువఁ గడఁగెద మీరల్
వీనులవిం దలరారఁగ
మౌనివరులు వినుఁడు! జ్ఞానమానితకథలన్ 214

సీ. ధర్మంబు గల్గు నధర్మంబునుం గల్గు
తత్ఫలంబులు గల్గు తప్ప కెపుడు
పరలోకమున్ గల్గు పాపంబు సేఁతకుఁ
గల్గు యముండు కింకరయుతుండు
కలుగును భూతముల్ గల్గును బ్రేతముల్
గలరు యక్షులు రాక్షసులును గలరు
కలరు మౌనీంద్రులుం గల రింద్రపవనకు
బేరాదిదేవతావిసరములును

తే.గీ. తల్లికం జెను మిగుల వత్సలత గూర్చి
మనుపఁ జాలెడి శ్రుతిగల్గు మహితతదను

సరణమున మేలు గూర్పంగఁ జాలు స్మృతియుఁ
గలు నని నమ్ముటయె మంచి జ్ఞానములగు. 215

సీ. వేల్పుగముల కెల్లఁ బెద్ద గావున బ్రహ్మ
దైవతమణి గాఁగఁ దలఁచు టొకటి
యరవిందభవుకంటెఁ నంబుజాక్షుఁడు మిన్న
యని నెమ్మదిని నెప్పఁడరయు టొకటి
సరసిజోదరుకంటెఁ జాల రుద్రుండెక్కు
డని నిశ్చయమ్మును గనుట యొకటి
రుద్రుకంటె మహేశ్వరుం డధికుండని
స్థిరబుద్ధి దయివారఁ దెలియు టొకటి

తే.గీ. ఈశుకంటెను పరశివుఁ డెంచి చూడ
శ్రేష్ఠుఁడని డెందమున విశ్వసించు టొకటి
చెప్పఁగానొప్పు జ్ఞానవిశేషములని
విబుధవరులార! వేదవిఖ్యాతులార! 216

క. భూవార్యగ్న్యనిలనభో
భావాంచద్వస్తుపతులు బ్రహ్మయు హరియున్
పావనరుద్రుం డీశుఁడు
ధీవరుఁడు సదాశివుండు దెలియుఁడు మీరల్. 217

క. పరమసదాశివుకంటెన్
వరరాజసగుణవిశిష్టపద్మోద్భవుఁడ
చ్చెరువొంద నధికుఁడను భూ
సురులారా! ధీవిశేషసురపతులారా! 218

క. కారణకారణమగుటన్
సారవిశిష్టత్వమెపు దెసంగున్ సకలా
ధారమగు బ్రహ్మమందని
యారయ నొక జ్ఞానరీతి యగును వినుండీ. 219

క. దేహప్రాణేంద్రియచి
త్తాహంకృతులందు నొక్కఁ డైనం గాఁడీ

దేహి యని నిరతమే సం
దేహము లేకుండఁ దెలియు తెలివి తెలివియౌ 220

క. సకలప్రత్యయరూపము
లకు వెఱయి సర్వసాక్షి లక్షణుఁడయి వా
సికి నెక్కను జీవుండను
నకలంకజ్ఞాన మొకటి యగు జ్ఞానమిలన్ 221

క. ఆరయ నీజాగ్రద్స్వప్న
హారము నిద్దురయుఁ గలయు ననఁ బ్రఖ్యాతం
బై రాజిల్లు నవస్థల
నారతమున్ జూచు సాక్షి నా జీవుఁడగున్. 222

తే. అఖిలదృశ్యమ్ము లెవ్వాని యందుఁ గల్పి
తమ్ములగు దృశ్య మెవ్వఁ డింతయును గాఁడు
కేవలద్రష్టయై చాల కీవి గాంచు
నెవఁడు వాఁడేయగున్ జీవుఁ డెఱుఁగుఁ డీరు 223

సీ. జ్ఞాతమున్ గాక యజ్ఞాతమున్ గాక యే
దివ్యస్వరూపంబు తేజరిల్లు
సత్యమై జ్ఞానమై సౌఖ్యమై నిస్తులం
బై యేపదార్థంబు వ్యాప్తి నొందు
సకలప్రమాణధీసరణికిన్ భ్రాంతివృ
త్తికిఁ దోఁచ కెయ్యది దీప్తిఁ గాంచు
నీవు నేనును బల్కనెయ్యది లక్ష్యార్థ
మై యపరోక్షమై యతిశయిల్లు

తే.గీ. సర్వమున్ భాసిలఁగ జేసి స్వప్రకాశ
మునను వెలుఁగొందు నంచు విబుధు లెఱుంగ
నేర్తు రెద్దాని నయ్యది నిక్కమీరు
జీవుఁ డని గుర్తెఱిఁగినఁ జెలఁగు ముక్తి 224

క. జీవేశ్వరులకు భేదం
బావంతయుఁ గల్గ దంచు నరసిన వారల్

ధీ విభవఖ్యాతాఖిల
భావుకలోకప్రపూజ్యపదులగుదు రెటన్ 225

క. ఈవిద్య పరమగోప్యం
బై వెలయున్ మూర్ఖసభలయందున దీనిన్
కోవిదులు వలుకఁగూడదు
సేవింప నొసంగవలయుశిష్యుల కెప్పుడున్ 226

12. జ్ఞానయజ్ఞ విశేషము ప్రకారాంతము

వ. మరియు జ్ఞానము తెరవెఱింగించెద.

సీ. అనృతంబు గాదననగును సత్యాంకంబు
జడము గాదన గుర్తుజ్ఞాన మగును
దుఃఖంబు గాదనదోఁచు నానందాఖ్య
మంతంబు లేదననగు ననంత
మపరికాశ్యంబననగు స్వప్రకాశమ్మ
స్వల్పంబు గాదనబ్రహ్మ మగును
శూన్యంబు కాదనుచున్ జెప్ప సత్తగు
సన్యత వారింపనాత్మఁ డగును

తే. నామరూపాదు లెఱుఁగనిధామ మగుట
తత్పదార్థం బనంగ విద్వద్గణముల
వాసిఁ గాంచిన తత్త్వంబుపరమశైవ
తత్వమని పల్కు శ్రుతివాక్యతతులు సతము 228

క. ఆద్యంతవిధానము ప్రతి
పాద్యము గా నట్టి స్వపరిభావము కల్మిన్
వేద్యముగా దజతత్త్వము
చోద్యం బిది వివిధరూపశోభనము నగున్. 229

తే. సత్తు తానయ్యు నరయ నసత్తువలెను
జావు తాఁగనకుండి సంసారివలెను
వెలయు నొక్కండ యయ్యుఁ దాభిన్నుని వలెఁ
దోఁచు బ్రహ్మంబు జ్ఞానవిదూరుల కిల 230

క. చేతనరూపమ్ములును న
చేతనరూపములు రెండుఁ సిద్ధించును వి
ఖ్యాతములై పరశివునకు
నేతద్భావమ్ము వాస్తవేతరము సుండీ 231

శా. హెచ్చుందగ్గులు గాఁగ తెల్విగల స్తంబేశాదిజీవాళియున్
హెచ్చుందగ్గులు కొల్తలుం గలుగు భూభృద్రేణుసందోహ మీ
యచ్చంపున్ శుభతత్వమందు బహుధా ధ్యస్తంబులై యుండఁబ్రో
ద్యచ్చాతుర్యము మీఱఁగాఁదెలియుఁడీ ధర్మస్ఫురన్మర్మమున్ 232

సీ. కర్తృత్వ భోక్తృత్వ కారయితృత్వాది
భేదవాదములు కల్పితము లగును
విహితవర్ణాశ్రమ విధినిషేధాది వి
భేదవాదములు కల్పితము లగును
సాధనంబుల తోడి స్వర్గలోకఫలాది
భేదవాదములు కల్పితము లగును
రాగాదిదోషవైరాగ్యాదిగుణబహు
భేదవాదములు కల్పితము లగును

తే. వైదికము తాంత్రిక మ్మపభ్రంశమార్గ
మన్యదర్శనములు నరయంగఁ గల్పి
తమ్ములంచు నెఱింగిన తత్త్వవేత్తఁ
బోలు సంజ్ఞానులం గనన్ జాల మెపుడు 233

క. తుద కీశజ్ఞానమ్మును
మదియునుఁ గల్పితములన్న మాట యెఱుఁగు కో
విదులు బుధాగ్రణి పూజా
స్పదు లగుదురు దీనిఁ దెలియవలయున్ మీరల్ 2·4

వ. మఱియు 235

కం. జడచేతనసంతోహ
మ్ముడుపతిశేఖరుని జ్ఞానముదయం బౌన

ప్పుడు గనరానిది యేయగుఁ
జూఁడి పరశివతత్త్వబోధసూక్ష్మత గనుఁడీ! 236

క. కలదను లేదను పలుకె
వ్వలనను గల్పితమె యగుసువాస్తవ మింతేన్
గలుగదు తద్వాక్యంబున
విలసితమతులార! జ్ఞానవిధమిది గనుఁడీ!

సీ. చేతనాచేతనాంచితసర్వలోకమ్ము
సర్వజ్ఞకించిజ్ఞసకలజనము
తారతమ్యాఖిలోత్కర్షాపకర్షలు
వర్ణాశ్రమాచారవరవిధాన
మస్తినాస్తీతివాక్యప్రయోగంబు వి
ధిప్రతిషేధప్రతీతినియతి
పరనియంతృనియోజ్యభవ్యవ్యవస్థ ధ
ర్మాధర్మమర్మబోధాతిశయము

తే. శ్రౌతతాంత్రికతదితరసరణివితతి
రక్తిసక్తియులేనివౌభ్రాంతిపోయి
పరమశివతత్త్వమునుగాంచివఱలు వేళఁ
బరశివాద్వైతవిజ్ఞానఫలము ముక్తి 238

ఉ. కానఁ జరాచరమ్మగు జగమ్మఖిలమ్ము విమర్శఁజేయ నీ
శానుని తత్త్వమె యగుసుశర్వుని చిత్రవిచిత్రశక్తి మా
యానుగతిన్ వెలుంగు భువనావళి యంచు నెఱుఁగు వారలె
జ్ఞానిజనాగ్రయాయు లనిశాస్త్రము వల్కెడిఁ గైకొనుండొగిన్. 239

## 13. జ్ఞానయజ్ఞవిశేషము ప్రకారాంతరము

వ. మఱియు సూతుండు పరివృతమునిసంఘాతుండయి నుడువం గడంగె. పరమశివుండును దచ్ఛక్తియు సంవిద్రూపములె. అందు మాయ యధ్యస్తము. నిర్వికల్పరూపసంవిత్తు మాయాసృష్టికార్యములఁ బ్రవేశించి యంతర్యామిరూపమున నుపాధి కుపకారమొనరించునీ విషయమున సందియ మొందుగలుగు. పరశివుం డసంగుండు గదా. సృష్టి

హేతు వెట్లగు ననియు బ్రాణికోటిసుకృతదుష్కృత ఫలవిపాకము నిమిత్తము సృష్టియనినఁ బరశివునకు స్వాతంత్ర్యభంగ మనియు, స్వభోగార్థము సృష్టి యనిన నవాప్తకామునకు స్వభోగమను మాటయే పొసఁగదనియు స్వలీలార్థము సృష్టి యనిన నదీనదోదర్యాదిజన్మము లవ్యవస్థాదూషితమ్ములై నిర్హేతుకమ్ములు కావలసివచ్చుననియు శంకించుట కవకాశముండు. ఈ ఖండనము యుక్తము గాదు. కర్మఫలభోగనిమిత్తము సృష్టియైనను నీశ్వరుండు స్వతంత్రుండై సృష్టి నొనర్చునవి చెప్పినచో స్వాతంత్ర్యభంగము గలుగదు. సృష్టలీలామాత్రమున సృష్టి యీశ్వరునకు శ్రమరహితమనియు సంకల్పమాత్రమనియుఁ దేలును గావునఁ దద్విషయమునఁ జేయఁబడు నాక్షేపణ మనాదరణీయము. 240

చ. చెలఁగ రజోగుణంబునను సృష్టినొనర్చెడి బ్రహ్మ కంటె స
త్త్వలలితశక్తిఁ బూని బహుళ్రధా జగమోము ముకుందుఁ డెక్కుడై
వెలయుఁ దమోగుణంబుననుఁ విశ్వవినాశ మొనర్చు రుద్రుఁడున్
విలసిలు వాని కెక్కుడయిఁ నిక్కము దీనిని మీరెరుంగుడీ 241

చ. ఒకపరి కన్ను విప్ప జగ మొయ్యసృజింపఁగఁ జాలు ద్రష్టయీ
సకలము గన్న తండ్రి యని శాస్త్రము వల్కెడి మేటి దైవత
ప్రకరవరిష్ఠుఁడంచునుడు వందగునీశ్వరు నంతెగాని యా
ప్రకృతికి శక్తికిన్ భువన భర్తకు శూలికి భేద మున్నదే? 242

వ. సంసారసమూలోచ్ఛిత్తిహేతువును నిరవధికానంద జీవాతువును నగు సంవిచ్ఛక్తి పరశివునకు వేఱుగాదు. 243

సీ. సర్వజ్ఞుఁ డైనను సకలజగత్కార
ణుండైన లసదీక్షణుండు నైన
రుద్రుఁడైనను విష్ణురూప మొందిన బ్రహ్మ
భవమందినను సదాశివుఁడై యెనఁ
గనకగర్భత్వ మొందిన నీశ్వరుండైన
ను విరాట్టుయైన నున్ స్వరాట్టు
నైన సామ్రాట్టైన నమరాధిపత్యాది
లోకపాలుండైనఁ గాక మనుజుఁ

తే. శక్తి కంటెను వేఱయీశ్వరుఁడు లేఁడు
శర్వు కంటెను వేఱుగాశక్తి లేదు
శంభుఁడును శక్తి యొక్కటెచటను నైన
నంచు నరసిన సయ్యదియరయుట యగు 246

క. శివశక్తుల నెడఁబాపిన
ధృవముగ దలక్రిందు కాలుదివి దెస గలుగన్
జవమున డిగ్గుచు నిరయా
ర్ణవమునఁ బడు భేదదర్శనప్రతిపత్తిన్ 247

తె. తల్లిదండ్రులు బిడ్డ వత్సలత మీఱఁ
బెంచు విధమున శివశక్తులంచితముగ
సకలభువనమ్ములను బ్రోవఁజాలు వార
లనుచుఁ గనవలె సందియమును బొరయక 248

ఉ. ఎల్ల యజాండసంతతులనెయ్యెడఁ బ్రేమను గన్నయట్టియా
చల్లనితల్లిఁ బార్వతినిస్వాంతము నందున నిల్పి భక్తిరం
జిల్లఁగ నాడిగమ్ములను జేసెడి భక్తున కల్ల కోరికల్
చెల్లును ముక్తివిద్యయును జేకురుఁ దన్మహిమ oబెఱుంగుఁడీ 249

ఉ. భారతి యంచు శార్ఙ్గధరువల్లభ యంచు శచీలతాంగి యం
చే రమణీయకాయయగునిందునిభాస్యయ యైనఁ గాని మెం
దారయ నర్తకీగతులనందుచు నయ్యుమ తానయౌ సుధీ
వారమెఱుంగు దీనిబెఱవారల కయ్యది తెల్లమౌనెటుల్? 50

సీ. అంచితశక్తిఁ బూజించి విరించ్యాదు
లందఁగాఁ గల్గిరనంత విభవ
మతులితశక్తి సన్మతి ధ్యానముంజేసి
పడసిరి కోర్కులభాగవతులు
శక్తి సన్మానించిసరగ దిగంబర
బౌద్ధాదు లందిరివాంఛితములు
మోక్ష మందిరి శక్తిమ్రొక్కి మునులవల్
విమలబ్రహ్మజ్ఞానవిధము దెలిసి

తె. వేయి పల్కులిఁకేల చుంకడీ యుమాసు
మాంగి నెదనిల్పి బత్తిమైకయర్చలిడిన
వాని కెట్టెట్టి వాంఛలుకజాను మీఱు
నమలగతి నవిచెకురుకనంద్రు బుధులు 251

క. శివయన ఁబరచైతన్యం
బవు నుమ యన లిలకొఅకుకనందిన తనువౌ
వివరింప మాయ యనఁగా
నవుఁ జిన్మాత్రాశ్రయస్థకమగు జడము గదా 252

క, భావాభావంబులు రెం
డే విద్యాంసుండు పరముకదేశివుఁ డంచున్
భావించు నతఁడు పూర్ణుం
డై వెలయున్ శివుఁడు నగుచుకనరయుఁడి ధీరుల్ 253

క. పూర్ణుండ శివుఁడు మాయన
పూర్ణుండునుఁబోలిదోఁచుకబుద్ధికి నని బల్
నిర్ణయ మొనరించిన సం
పూర్ణశివుం డగుచు వాఁడుకపొల్పుం గాంచున్ 254

క. జీవేశ్వరులున్ జగమున్
భావింపఁగఁ బూర్ణశైవకభావమునకు వే
జేవడువునఁ గాదన నది
యే వాస్తవమైన జ్ఞానకమెఱుఁగుఁడు దీనిన్ 255

వ. మఱియు మాయయు వాస్తవముగ నధ్యస్త మస్తిత్వ
ము మాయకుఁ గల్గదని తెలియఁదగు. 256

ఉ. మానవుఁ డెవ్వఁడైన నిజకమానస మందు స్వపూర్ణశైవభా
వానుగతిన్ స్థిరంబుగ నకహర్నిశలన్ నిలుపంగ మోక్షసం
ధానము నొంది పూర్ణశివకతత్త్వము తానయి ముజ్జగంబులన్
మానితశేఖరుండగుచుకమన్నన కెక్కు సుధీకళానిధుల్. 257

క. సర్వాధికారి శివుఁడని
గుర్వాశయమునను శివునికగొల్చినయెడ వి

శ్వోర్వీపతివలె భక్తుఁడ
ఖర్వనిరాఘాటవృత్తిఁ గలవాఁడ యగున్. 258

క. సకలప్రతీతవస్తు
ప్రకరమ్ము నిజాత్మగాఁగ భావించెడి య
య్యకలంకయోగికే గతి
ప్రకటంబగు భవము ముక్తి పండితులారా! 259

క. మానసమున భవమోక్షము
లేనికిఁ గన్పట్టువానిఁ దెలియఁగంబడు వి
ద్యానిధులారా విధులున్
నానాప్రతిషేధములు ఘనమ్మగు శ్రుతులన్ 260

చ. ఘటకరకాదిభేదచయ కారణమృత్తను మాలఁడంట సం
ఘటిల దోకింత దోసమటు గాక ఘటాదులు కుర్కురాదులం
టుట నగు దోసమ్ములఁ గడున్ గడు భేదము నొందు పట్లఁ బ్రా
కటము లనింద్యనింద్యములు కల్గునె యయ్యవభేదదృష్టికిన్ 2:1

ఉ. అరయ లౌకికంపువ్యవహారమ యైనను వైదికక్రియా
చారమ యైన ద్వైతమతి సాగెడి వేళ స్ఫురించు ద్వైతవి
ద్యారతి పోయి యద్వయము నారయు వేళల సర్వమైన వ్యా
పారములున్ నశించుఁ గుల పావనులార యెఱుంగుఁడిమ్మెయిన్

క. శతకోటికల్పములకున్
నుతియింపగ నేర్తునె య నూనజ్ఞానాం
చితమాహాత్మ్యము పావన
మతులారా! జ్ఞాన మెఱిఁగి మనుఁడీ సుఖులై 263

## 14. జ్ఞానయజ్ఞవిశేషము ప్రకారాంతరము

వ. మఱియు జ్ఞానపూతుండగు సూతుం డిట్లుపన్యసింపందొడంగె. మునులారా! జ్ఞానవిషయము వలుకవలసిన దింకనుఁ గలదు. పంచబ్రహ్మరహస్యంపుఁ దెఱంగెఱింగించెద. సత్యజ్ఞానానందానంతాద్వైతుండగు పరశివుండు మాత్రము శుద్ధుండు సుప్రకాశుండు వికారరహితుండును నగు ఆదివ్యనిర్గుణతేజమే సృష్టిస్థితిసంహృతితిరోభావానుగ్రహాత్మక

శక్త్యుపాధిగతమయి యీశానుఁ డనియుఁ దత్పూర్వపురుషుఁడనియు నఘోరుఁడనియు వామదేవుఁడనియు సద్యోజాతుఁడనియుఁ బ్రసిద్ధమ్మయి యేతత్పంచబ్రహ్మస్వరూపమ్మున వ్యవహారమ్ము నొందుచున్నది. దానికి వాస్తవమైన భేదము మాత్రము గల్గదు. శబ్దస్పర్శరూపరసగంధము లీశాన తత్పురుషాఘోర వామదేవ సద్యోజాతు లగుదురు. గగనానిలానలజలపృథివీతన్మాత్రల కధిదైవతములు క్రమముగా సదాశివేశ్వరరుద్ర విష్ణుబ్రహ్మలగుదురు ఈశానాదులును సదాశివాదులును శబ్దాదులును గగనాదితన్మాత్రలును శివశక్తికల్పితములగుట శివున కంటె వేఱు గావని యెఱిఁగినవాఁడు కేవలశివుండని నుడువవచ్చు. మఱియు గగనాది స్థూలభూతములు నీశానాదిపంచబ్రహ్మలగును. తదధిదైవతములు క్రమముగ ననంతశివుండు ననంతేశ్వరుండును గాలాగ్నిరుద్రుండును నారాయణుండును జతుర్ముఖుండు నగుదురు. స్థూలభూతములను దదధిదైవతములను శివరూపముగా నెఱుఁగుజ్ఞాని బంధవిముక్తుండగును. మఱియు వీనులు, కన్నులు, మేను, నాలుక, ముక్కును నీయైదు జ్ఞానేంద్రియములు వరుసగా నీశానాదిపంచబ్రహ్మ లగుదురు. వీనికి దెసలును, గాలి, పొద్దును, వరుణుఁడును బుడమియు నధిదైవతములు కర్మేంద్రియములైన వాక్పాణిపాదపాయూపస్థల ఘోరతత్పురుషేశానసద్యోజాత వామదేవు లగును. వానికి వహ్నీంద్రుత్రివిక్రమమిత్రప్రజాపతు లధిదైవతములు. కర్మజ్ఞానేంద్రియములు తదధిదైవతములును బరమశివుగా దెలిసిన వానికి ముక్తి లభించును. మనోబుద్ధ్యహంకారచిత్తాహంకరణము లీశానాదిపంచకము యథాక్రమముగ నగు. చంద్రామరగురుకాలాగ్నిరుద్రమృడానీహిరణ్యగర్భులు వాని యధిదైవతములు. మఱియుఁ బ్రాణాపాన వ్యానోదానసమానము లీశానాదులగువానికి దైవతములు విశిష్టుండు విశ్వసృష్టి విశ్వయోని యజుఁడు జయుండు ననువారు మనఆదులును బ్రాణాదులును దత్తదధిదైవతములు శివుఁడని నిర్ణయించిన వానికి ముక్తి కరతలామలకంబు.

సీ. కర్మభోగము మాన్పఁ (శ?)గాఁజాలు దీనిచే
  నన నివృత్తిఖ్యాతమైన దొకటి

జడతత్వ మెడపి సకచై ్ౖతన్యమిది గూర్చు
నన( బ్రతిష్ఠాఖ్యాతకమైన దొకటి
ప్రకృతిప్రకృతికార్యకపరు(డాత్మ( డని తెల్పు
నన(గ విద్యాఖ్యాతకమైన దొకటి
ఉరుతరదురితపాకశోపమంబగు దీన
నన ఘనశాంత్యాఖ్యకమైన దొకటి

తే. శాంతి మీర లసద్బ్రహ్మకసరణిఁ జేర్చు
నన(గ వరశాంత్యతీతాఖ్యకమైన దొకటి
బ్రహ్మ మైదువిధంబులై కవఱలు భూజ
లాగ్నివాయునభఃపదార్థరాశి యందు. 205

తే. శాంత్యతీతగుణమ్మె యీకశాను(డగును
శాంతి తత్పురుషుండౌనుకసరగ విద్య
యగు నఘోరుండునుం బ్రతిష్ఠగను వామ
దేవు( డైదవయది నివృత్తియగు( జుండి 206

తే. అలఘుగగనాదిభూమ్యంతకములను స్పంద
మును బరిస్పందమును బ్రక్రమనియతిఁ బరి
శీలనంబు ప్రచారంబుకచెల(గ వరుస
నైదు బ్రహ్మము లగు( దెలికయంగ వలయు 207

చ. సకలచరాచరంబులనుకఛాదకబోధకముగ్ధనోదక
ప్రకటచతుర్గుణంబులనుకభంజకమన్ గుణమున్ విరాజిలున్
సుకవివరేణ్య! లీ యయిదుకనున్ శివరూపముగానెఱుంగ హ
స్తకమల మందు మేలుసిరికచాడ్పున మోక్షము కైవసంబగున్

క భవపాశవినాశము( జే
యు విబుధు(డొయ్యన(జరాచకరోత్కృష్టజగం
బు విచారింప(గ శివు(డని
ధృవబుద్ధిం జెల(గి నపుడుకకృతకృత్యు(డగున్ 69

క. ఒక్క(ండయ్యున్ మిక్కిలి
యక్కజముగ మాయవల్లకనైదు విధాలన్

ముక్కంటి వేల్పు గననగు
నిక్కంబిది తెలియుఁడీ మునిప్రకరమ్ముల్ 2 0

క. ఎటు లెయ్యెడ నారయ దు
ర్ఘటకారిణి మాయ సర్వకారణమై యొ
ప్పట తత్కారణమగు శివుఁ
డెటు సర్వనియంత కాకయెసఁగున్ జగతిన్ 271

క. శివుఁడగు సత్యుఁడు పూర్ణుఁడు
శివుఁ డానందస్వరూపచిద్ఘనుఁడు నగున్
శివుఁ డపరోక్షాత్ముఁడు వా
స్తవ మారసి నట్టి వేళసంయములారా! 272

క. మాయామోహితులై వి
ద్యాయుతులయ్యున్ విపశ్చిదగ్రేసరు లా
శ్రేయోమార్గము విడి ద్వై
తాయతమార్గానుసారులై మనుదురిలన్ 273

క. ఏదాసుఁ డనుట మోహం
బే దైవత మనుట మోహమే దైవతమై
యేదనరు దనుట మోహం
బీదారులు మూఁడు విడువనే వలయుఁ జుఁడీ 274

శా. భేరీభాంకృతు లెల్లెడన్ జొరగ నిర్భేదంబు నిత్యంబనా
ధారంబచ్ఛనిరంజనంబని ప్రసిద్ధంబై శ్రుతుల్ మ్రోయ నం
దేరీతిన్ భవదీయదాసుఁడను నీవేనౌదు నంచున్ వచః
ప్రారంభంబు లొనర్ప వచ్చు మునులారా యింత యూహింపుఁడీ

క. కాన సమస్తము మాయా
జ్ఞానోద్భవ మంచెఱుంగ సర్వేశ్వరునిం
గాన నుపాయము గల్గు సు
ధీనివహములార దీనిఁ దెలియుం డీరల్ 276

శా. నిత్యానిత్యవివేకనామకలసన్నిర్ణిద్రదీపోజ్జ్వలత్
సత్యాలోకమె దారిఁజూప విమలజ్ఞానప్రశస్తాధ్వమం

దత్యంతంబు చరించువాఁడు భవమోక్షించద్గృహంబున్ గనన్
మత్యౌన్నత్యము గల్గువాఁడనివచింపన్ వేదముల్ చాలెడున్

క. తనువాసన నైగమవా
సన లోకపువాసనయు నెసంగెడు కాలం
బున జ్ఞానము స్ఫురియింపదు
త్రినయను కరుణాకటాక్షదృష్టిన కలుగున్ 278

తే. ఇంద్రుఁడైనను గాని పూర్ణేందుఁడైనఁ
గాని గోవిందుఁడైననుగాని పద్మ
బంధుఁడైనను గాని యీశ్వరుని కరణి
జ్ఞాన మొసఁగరు బల్దయాసారదృష్టి 279

క. జ్ఞానావాప్తి కొఱకు నీ
శానుం బ్రార్థించి తత్ప్రసాదము గొనఁగా
ధ్యానాదుల నెయ్యెడలన్
బూనంగా వలయు సకలబుధవర్యులిటన్ 2·0

క ఉత్తమముక్తియు భుక్తియుఁ
జిత్తజరిపు సత్కృపావిశిష్టకటాక్షో
ద్యత్తము లని శ్రుతిమస్తక
విత్తములు ప్రశంస సేయవిందుము కాదే 2 1

క. జలజాసనాదిదైవత
ములు కలుషితచిత్తులకుఁ బ్రభూతాత్మవిశు
ద్ధి లసద్ధితముగనీయఁగ
లలితగతిన్ భుక్తి వారలకు సిద్ధించున్ 282

చ. అలఘుశివప్రసాదమునసౌ గురుసత్తము సుప్రసాదమున్
గలితశివప్రసాదమునఁగల్గును భుక్తియు ముక్తి సర్వమున్
వెలయు శివప్రసాదముననే వ్యవహారము పారమార్థిక
మ్మిలను శివప్రసాదమునకెంచ సమాన మొకండు గల్గునే? 283

క. ఈజ్ఞానం బెవ్వానికి
విజ్ఞాత మ్మగును వాఁడువిబుధుం డనుచున్

తజ్ఞులందు ననుచు విఁసత్
ప్రాజ్ఞులు వచియించు వారు పండితులారా! 284

15. జ్ఞానయజ్ఞ విశేషము ప్రకారాంతము

వ. మఱియుసూతుఁడిట్లు వలికె

బ్రహ్మతత్వసత్తాశ్రియము సకలసద్వ్యవహారమగు నిది పరమ సిద్ధాంతము కాని కొందఱు వ్యక్తిత్వము జాతి యందు వలె ఁదాదాత్మ్య సంబంధముతో సత్తారూపము వ్యావహారికసత్తారూపముల యందు ఘట పటాదులవలె నుండు నని యందు రిది సరి కాదు. వారి మతమున జాతి వ్యక్తులకు సమవాయసంబంధము లేదు, కానితాదాత్మ్య సంబంధము మాత్రము గలదు. వాస్తవముగ భేదహేతు వయిన ఘటపటాదివివిధ సత్తారూపమునకు విశేషరూపము లేనేలేదు. కనుక సత్తావిశేషాకారము గలు ననువాదము యుక్త మయినది కాదు. అయిన యెడల ఘటపటాది విశేషానుభవ మెట్లు గలుగునన నది భ్రాంతిజన్య మని మాన్యులు వచి యింతురు. సత్తకు భేదము గల దందురా సత్తాభేదము శూన్యమేయగును సత్తకు వ్యతిరిక్తమైనది శూన్యము గాక మఱొకటి యెట్లగు. భేదము సత్తాభిన్నము గాఁ బోయినను సత్తాసంబంధమని చెప్పిన నదియుఁ బొసఁగదు. తత్సంబంధము తద్వ్యతిరిక్తముగదా. సత్తావ్యతిరిక్తము శూన్యపదాఖ్యమెయగు. కాన శూన్యమునకు దేనితో సంబంధముఁగలుగదు మఱియు సత్తాసంబంధము వలన ఘటపటాదిదర్శన మగు నని తలంచు నెడలఁ దత్సంబంధమునకుఁ బూర్వమున ఘటపటాదులు సదసత్తులలో నొకటి కావలయుంగదా! అసత్తయినచో విషయము సంబంధయోగ్యమే గాదు. సత్తైనచో విశేష్యవిశేషణభావము గలదని యొప్పుకొందుమేని,

తే. సర్వవస్తుప్రకాశకశక్తియొకటి
దయ్యుఁజిత్తానుగతసంస్క్రియాసరణి న
విద్య విలసిల్లు వేళలవివిధగతులఁ
గానఁబడు నీరహస్యమే జ్ఞాన మగును 286

తే. స్వప్నదృక్చేష్టయే యగుస్వప్నవిధము
నింగినే వెల్తురుం జీఁకటిం గనుదుము

సందర్శమునసె యలల్పుట్టీసమయుచుండు
బ్రహ్మమందున లోకముల్ప్రజలు మాయు॰ 287

సీ. నానావిధానూనదానమాహాత్మ్యల
భ్యఫలం బగును గదా పరమశంభుఁ
డశ్వమేధాదియజ్ఞానీకపూజన
భాజనుం డగుఁ గదా పరమశంభుఁ
డఖిలపురాణేతిహాసశ్రుతీరిత
వైభవుం డగుఁ గదా పరమశంభుఁ
డతులతపఃప్రభావాతిశయప్రాప్య
పాదద్వయుఁడు గదా భవ్యశంభుఁ

తే. డమరపత్యాదినిఖిలసురాళిసేవ
నీయుఁడై మౌనిజనమాననీయుఁ డగును
బరమశివుఁ డంచు శ్రుతివచఃప్రకరమును
ధీరులార! రహస్యమ్ము తెలియుఁడీరు

చ. హృదయనివాసి యైన శివునెయ్యెడ సంహృతకర్ములై యతుల్
తుది గురుసుప్రసాదమున ధూర్జటి సత్కరుణాకటాక్షభా
గ్యదమగు మంచివేళల నహంపదవాచ్యునిగా గ్రహించి కో
విదజనతాగ్రగణ్యులయి పెంపు గడింతురు లోక మందునన్ 289

ఉ. ఏను పరాత్పరుండనని యెంచు నెవం డెపు డట్టివాని సు
జ్ఞానవిలాససంపదకు సాక్షి చిదాత్ముఁడు శర్వుఁడంచు డెం
దానఁ దలంచు వాఁడు మరణంబును జన్మము గాంచ కెందునేన్
జానుగ నిచ్చనచ్చి నటు సర్వజగంబులఁ గ్రుమ్మరున్ వెసన్ 29।

చ. శ్రుతివచనానుసారి యయి రూఢి వినిర్మలబోధమొప్పన
ప్రతిహతయోగదార్ఢ్యమున బ్రహ్మ మెఱింగిన యట్టిప్రోడకే
గతి నరయంగవచ్చునుజగ మ్మబలమ్ము సుబోధమింతలే
నతనికిఁ గల్గునెట్లు పరమాత్ముని దర్శన మింత చూడఁగన్ .9।

చ. హృదయసరోజపీఠి నల రించెడు వాఁడు పరేశుఁడచ్చతా
స్పదమగు డెందమందుఁ గనవచ్చుఁబరాత్పరు నంచెఱుంగుకో

విదమణి కర్మబంధములు పెంపరి దగ్ధముచేసి జన్మమున్
బొదలగనీక వాని విడిపోవును సత్యము దీని నెంచఁడీ 292

ఉ. అంబుజపత్రమం దుదకమంటని చాడ్పున గాటమైన క
ర్మంబులు బ్రహ్మవిత్ప్రవరు రాపిడివెట్టగ నేర వాత్మభా
వంబు నెఱుంగువాని దగు వైభవమే గద వైభవంబు నే
మంబుల తావులైన గరిమంబునఁ బోలరు జ్ఞానికోటికిన్ 293

తే. కర్మజాతమ్ము పుణ్య మ్మఘమ్ము నంచుఁ
బోఁచు వానిది జ్ఞానంపుఁ ద్రోవ గాదు
సర్వమున్ బ్రహ్మదర్శనసమము గాఁగ
నెంచు ధీరుండె జ్ఞానియై యెసంగు ధరను. 294

చ. వివిధభుజంగయష్టిపృథివీదలనాదులు చాటినట్టి ర
జ్జువు భుజగాదులౌనె యెటు చూచిన రజ్జువు రజ్జువౌ నటుల్
శివుఁడు ననేక రూపములచే జగదాకృతిఁజెందియున్ననె
ట్లవు జగదాదులింత యరయన్ శివుఁడౌను శివుండె నిచ్చలున్ 295

ఉ. తోయము భూమి యంచు మదిఁ బోఁచిన వానికి గోచరించు భూ
మ్యాయతతత్వమున్ జలమయమ్మగు తత్వము రెండునంచు బల్
న్యాయ మొకంతు గల్గఁగ దయట్టుల బ్రహ్మమె విశ్వమంచు నే
ధీయుతుఁడెంచు వానిక గుఁ దెల్లమ విశ్వము బ్రహ్మరూపమున్

ఉ. ఏనె అప్రోఢయైన సత మేఁగనువాఁడను బ్రహ్మమున్ బ్రపం
చానుభవంబు నా కొదవ దంచుఁ దలంచినచో యదార్థవి
జ్ఞానము పూర్ణమౌను పరి గాఁ బరికించిన తొల్లిబంధమే
లేనిది బద్ధముక్తుఁ డన లేనిది పల్కుటయే యగున్ జుఁడీ 297

చ. అమలుఁడు కేవలుండు శివుఁ డాత్ముఁడయై దగ స్వస్వరూపభా
వము వెలయన్ స్వయమ్ముగఁ బ్రవర్తిలు వాఁడది యెంచినన్ బ్రపం
చమునఁ బ్రపంచదృష్టియ పొసంగదు నిక్కువమేనికాదు బం
ధమును విమోచనమ్ము వివిధశ్రుతివాక్తతి యామతించెడున్ 298

చ. పరశివతత్త్వ మిట్టిదని×భావమునందు నెఱుంగువారలే
పరమముని ప్రకాండులయి×భాసిలుచుం డ్రిటుగాక యన్యమా
సరణి నెఱుంగ నంధ తమ×సప్రధితాంధువు నందు గూలి సం
సరణఫణీంద్రదష్టులయి×సద్గతి దప్పి చరింతు రెయ్యెడన్ 299

## 16. జ్ఞానోత్పత్తి కారణనిరూపణము

వ. మఱియు సూతుం డిట్లు పలికె. 300

క. ఏకారణములు గల్గ బి
నాకిజ్ఞానంబు గల్గు×నావశ్యముగా
నాకారణములఁ బల్కెద
మీకు శుభానీకమందు×మిగులం గల్గున్ 301

క. అక్షయమోక్షనిశసం
ధుక్షితధీదక్షు డగుచు×నుతభవ్యానం
దక్షితి యయి మోక్షము సి
ద్ధక్షేమం బనుచు నెఱుక×దై వారంగన్ 302

క. మతి రుచియించిన దైవత
వితతిన్ మనసారఁ గొల్చి×విమలజ్ఞాన
ప్రతిబంధకములఁ బాయన్
జతురమతిన్ మెలఁగు నప్డు×జ్ఞానం బొదవున్ 30

సీ. ఇడుత సౌఖ్యము మిత్రుఁ×డిడుత సౌఖ్యము వరు
ణుఁ డునర్యముఁడు సుఖం×బిడుత నెపుడు
నిడుత సౌఖ్య మ్మింద్రుఁ×డిడుత సౌఖ్యము బృహ
స్పతి యురుక్రమవిష్ణుఁ×డతిముదమున
నిడుత సౌఖ్యము మ్రొక్కు×లిదెద బ్రహ్మాత్మవా
యూ! నీవు ప్రత్యక్ష×మైన బ్రహ్మ
వంచు సత్యము ఋతం×బంచు వచించెద
నట్టి నన్నీవు చే×పట్టి యోము

తే. మోమఁగోరెద నుపదేష్ట×పుంగవులను
నా గురుస్వామినన్నో×ముక మోగులెల్ల

సన్నగిల్లును గావుత శ్రీ సన్నగిల్లు
సన్నగిల్లుత నని పల్కు శ్రీ జ్ఞాన మొదవు 304

వ. మఱియు "యశ్ఛందసాంఋషభో విశ్వరూప" ఇత్యాది "శ్రుతం మేగోపాయే"త్యంతముం గల శాంతిపాఠ మొనరించిన జ్ఞానము గలుగునట్టివానికి దారిద్ర్యదోషదూషితమనీషావైభవమొదవినయెడల "నావహంతీ పితన్వానేత్యాది" మంత్రసహితముగా నన్నాజ్యైకతరహవిస్సు నగ్ని వేల్చునది. నిరగ్నియైనచోఁ దన్మంత్రి మతిశ్రద్ధాన్వితుండై యనిశ మూహించునది. దానివలన జ్ఞానోదయమ్మగు. మఱియు యథావిధిగ లేచి ముయ్యాఱు సారులు గాని పదిరెండు తడవులు గాని యొజ్జమిన్నకు సాష్టాంగదండనమస్కారము లొనరించి వేదాంతశ్రవణమొనర్చుట జ్ఞానహేతువగు లింగప్రతీకమున మహాదేవు ననిశ మర్చించునది. శాంతుండగునది, దాంతుం డగునది. విరక్తుండగునది. భైక్షాచరణమున జీవించునది. రుద్రాక్షధారణ మొనర్చునది. రుద్రాక్షధారి రుద్రుఁడే యగునని శాస్త్రములు శాసించు. ఆలస్యదోషమొదవిన నాఁకలింత యొదవిన నభక్ష్యభక్ష్య మొనర్చిన నదృశ్యదర్శనము సల్పిన షడక్షరమంత్రము జపింపవలయు. ఏపుణ్యరసనాగ్రంగణమున షడక్షరమంత్రము నిండుతాండవం బొనరించునట్టి వానితో సహాసన సహవాస సహభాషణాదులు నిర్వర్తింపవలెఁ, దదితరులతోఁ దత్కార్యము లొనరించిన దోషమును బ్రాయశ్చిత్తమున నివారించుకొనవలెను. స్వజాతివిహితాచారణమతు లెంత మతిమంతులైన వారు పండితులకుఁ బ్రసంగయోగ్యులు గారు. అగ్నిరిత్యాది జాబాలోక్తసప్తమంత్రముల నుచ్చరించి యగ్నిహోత్రాది జనితమైన బసుమంబు సాదరముగ గ్రహించి శివు నూహించి సర్వాంగములు తద్భస్మాలంకృతంబులు గావించునది. లలాటస్కంధోరః ప్రదేశంబుల భస్మంబు తిర్యక్త్రిపుండ్ర రేఖ లలరారునట్లు శృంగారించుకొనునది. పూత విభూతు లిదియు జ్ఞానకారణమ్మని సమ్మతింతురు. మఱియు సనాతన శివస్థలముల సేవించుటయు శివప్రసిద్ధప్రతీకముల శివు నారాధించుటయు శివోత్సవంబుల సందర్శించుటయు శివభక్తవిశిష్టాన్నము గ్రహించుటయు శివనిర్మాల్యనైవేద్యములఁ బరిత్యజించుటయు, రుద్రేతరనిర్మాల్యనైవే

ద్యమ్ములు సంపాద్యమ్ములని తదర్థము సర్వదా ప్రయత్నించుటయు గురుభక్తిశిష్టాన్నములు దినుటయుఁ జిత్తశుద్ధిప్రదాయకమ్ములై జ్ఞానోపాయములగు. శివేతర దైవత నివేద్య మమృతమనియు గురూచ్ఛిష్టము బురోడాశమనియు బుద్ధిమంతులు నుతింతురు. శివనిర్మాల్యనివేదనము లనుభవించిన పాపమ్ము చాంద్రాయణమ్మునఁ గాని సమయదు. వర్ణాశ్రమధర్మ్యులతో నెవ్వఁడైన నజ్ఞానముచే నైనను జెలిమిఁ జేసినఁ బలుకాడిన భోజనప్రతిభోజనమ్ములు నెఱపినఁ గలిసిమెలఁగిన సహాగమ మొనరించిన నెట్టిసంబంధము కల్పించుకొనినను వాఁడు పతితుండగు. నరసురకిన్నరాదులలో నెవరి లాంఛనమును నిర్మింపఁగూడదు. తన్నిర్మాత పతితుఁడగు. వాఁడు శ్రౌతస్మార్త కర్మముల కనధికారియగు. లాంఛితులతో సంభాషింపఁగూడదు. వారిని దాఁకరాదు. వారు ప్రవాసదండనార్హులు. మఱియు శ్రుతివిహితముల నాచరింపక పోయినను శ్రుతినిషిద్ధముల మానవలయును. శ్రుతిబోధితములయిన సత్యవచనము ధర్మచరణము, భస్మధారణము స్వాధ్యాయాధ్యయనము, దేవపితృపూజనము, మాతాపిత్రాదిసంభావనము మొదలగు శ్రుతిధర్మములను స్మార్తధర్మములను దీర్చిన ముముక్షువు చ్యుతుఁడు గాఁడు. ఏతన్నియమములఁ బాటించిన వాఁడు జ్ఞానము ద్వారా ముక్తిఁ గాంచును. ముక్తికి భస్మమనియుఁ బేరు. "భాసనాద్ భస్మ" అని శివస్వరూపపరమపదార్థము వచ్చినది. స్వయంభాసనమును సర్వావభాసకమును గావున భస్మ మనఁదగు స్వమాయోదితప్రపంచమందుఁ దానే జలమునందు జలజాప్తుఁడు వలెఁ బ్రవేశించి యుండును గానఁ దద్రూపము భస్మలేశ మనంబడు. ఏతద్విధప్రతిబింబరూపము భస్మలేశము. బింబభూతేశ్వరుఁడు భస్మోద్ధూళిత పరమశివుండు. బ్రహ్మవిష్ణ్వాదులకుఁ బూజ్యుఁడతఁడు. తత్ప్రసాదలేశ సామర్థ్యంబున సర్వదేవతలకు దేవత్వము సిద్ధించును. 305

చ. మునులు గృహస్థులన్యులును మోదమునన్ మెయిఁబూదిఁబూసి మో
మునఁ దళుకారునట్టులఁ ద్రిపుండ్రములన్ ధరియించి పేరురం
బున రుదురాక్షతావళముఁ బూని శివాస్పదపంచవర్ణ మం
త్రనియతి సొప్పు యజ్ఞగణనాశితకిల్బిషులై మెలంగుచున్ 306

క. అనిశం బీశ్వరలింగా
ర్చన మొనరించుచును మానసప్రవిమలతన్
గని తరియింతురు జ్ఞానం
బునఁ దుద, జ్ఞానమ్మునకును బోలునె యెదియన్ 307

క. జ్ఞానంబన శ్రుత్యంతవి
తానార్థజ్ఞానమగును దానన్ ముక్తి
స్థానముఁ జేరుట గల్గును
దానన్ మరిపుట్టు చావు తప్పు జనులకున్ 308

క. శ్రుతివాక్తతికిన్ బ్రహ్మా
త్మతత్పరము గాఁగ వ్యాఖ్యమానుగఁ జేయన్
దతవిద్వత్పద్ధతి యది
చతుమరతికిఁ గాని యెంచ సాధ్య మ్మగునే? 309

క. వివిధామ్నాయోక్తుల బం
ధవిహీనుఁడె ముక్తుఁడగును జ్ఞాతమె విజ్ఞా
త విధంబున నలవారున్
నివృత్తుఁడే యగు నివర్తనీయుం డెన్నన్ 310

మ. చెవి తుండంబును దోఁక పాదములునున్ జేముట్టుచున్ సారెహ
స్త విశేషాకృతిఁ బుట్టుగుడ్డులొకటన్ జిత్తంబునం దెంచు రీ
తి వివేకంబు శివప్రసాదకృత మింతే నబ్బకున్నట్టి వే
శ వికల్పంబులు పెక్కు మూర్ఖజనముల్ గావిం ప్రబుద్ధాత్ములై 311

ఉ. పావనవిప్రవంశజని భాసురుఁడైనను మాలఁడైనను
భావుకుఁడైన గర్భతల వర్తి నిసుంగయినన్ లసన్మహా
దేవుని సుప్రసాదమను తీర్థమునం దయివారునాఁడె బం
ధావళిఁ బాసి ముక్తిసుఖమందు జగద్విశదప్రభావుఁడై 312

క. ఏకాలమ్మున కైన మ
హాకారుణికోత్తముఁడు మహాదేవుం డ
స్తోకానందుఁడు తను దా
నై కన్పడఁ బులుగుఁ బర్వు నందున్ ముక్తన్ 313

మ. అమలవ్యాసమునీంద్రుసన్నిధిని వేదార్థంబునేనేర్చినం
తముదం బొప్పఁగ సంగ్రహించి సులభార్థమ్ముగాఁ బల్కినాఁ
డ మహాబ్రాహ్మణులార! వీనుగవ నింపొందంజేసి నావల్కు గో
ప్యముగా నెంచుచు నాచరింపుఁ డొగి విశ్వాసమ్ము దీపింపఁగన్

## 17. వైరాగ్యోత్పత్తి ప్రకారము

వ. మఱియు సూతుం డిట్లుపన్యసించె. సాక్షాత్పరమశివ జ్ఞానజనకసాధనములలో మొదటిది వైరాగ్యము. అది దుఃఖనాశకను. జీవబ్రహ్మైక్యజ్ఞానహీనస్థితిలో ద్వైతభావము పొడఁగట్టు. కర్మవిపాకకాలమున నీశ్వరానుజ్ఞానుసారులయి గదా మంచిచెడ్డలు మానవునకు ఫలములుగాఁ గలుగునవి కేవలభ్రాంతి మూలకములు. రాగద్వేషముల తెఱంగెఱింగించెద. కర్మవాసనాబలమున మంచిగాఁ గల్పింపఁబడ్డ విషయమున నిచ్ఛ జనియించు నదియే రాగమునకు మూలము. మంచి లౌకిక, పారలౌకిక భేదమున ద్వివిధము. లౌకికశోభన మింద్రియ ప్రమేయము, రెండవది శ్రుతికావ్యవిశ్వాసమూలము. చెడ్డయందు మనఃప్రాతికూల్యము మంచియందు మన అనుకూల్యమును గలుగును. వానికే రాగద్వేషము లనిపేరు. వాని ననుభవించుటకు శరీర మావశ్యకము. ఇఁక శరీరతత్త్వమెట్టిదో విచారింతము. శరీరము శుక్లశోణిత సమ్మేళనము వలని కార్యము. శుక్లశోణితములఁ జూచియుఁ దాఁకియు నసహ్యించుకొనని వాఁడెవఁడు? స్వశరీరేతరస్థలమునందున్న శుక్లశోణితములు సూడను ముట్టను రాకయుండు నను మాట స్మరించిన యెడల స్వపితృజన్యశుక్లశోణితపరిణామమగు దేహము తానే యనియు నది తనది యనియు నభిమానమేజ్ఞానికైననుండునా! మూర్ఖునకు మాత్రము దేహమునం దహంమమాభిమానములు మానవు. అన్యజీవుల శరీరరుధిరసిరాపూయరోమాదులయందును చిత్తశ్లేష్మరసమ్ములు భూమియందుఁ బడియున్నప్పుడెవ్విధమున దర్శనస్పర్శనార్హములు గాక జుగుప్సాహేతువులగునో యావిధముననే స్వశరీరగతములైన యవ్వానియం దహంమమాభిమానముల నజ్ఞుండొనరించుఁ గాని పండితుం డొనరింపఁడు శరీరమలములైన మూత్రస్వేదాదుల నిట్లే యూహించునది.

సీ. సరసచందనఘన సారమృగీమద
　　　సాంకవాదిఖ్యాత సౌరభములు
షడ్రసోపేతసం స్తవనీయమోదకా
　　　పూపాతిరసముఖ్య భోజ్యములును
పరమపవిత్రితా వాససూర్యాత్మజా
　　　జహ్నుకన్యాదిస్థ సలిలములును
గగనవన్నిర్మల కార్పాసకౌశేయ
　　　కాంచనాదిదుకూల సంచయములు

తే. ప్రకృతి చేతను మిక్కిలి భవ్యమయ్యు
నెద్ది సోకిన మాత్రాన నెలమి వీడి
రోఁత కానట్టి దేహంబు రూఢి గాఁగ
హేయమే గాని స్తోత్రార్హ మెట్టు లగును? 316

తే. రక్తమాంసంబు లెన్న నిరంతరంబ
నంతకృమితతి కులకుల లాడుతావు
వానిచే వర్ధితంబైన మేను దుఃఖ
హేతువే యగు సుఖహేతు వెట్టు లగును? 317

క. మాతాపితరులు గలిసిన
రేతశ్శోణితము లొక్క రేపున్ మాపున్
బ్రీతిగ నిల్చిన యెడఁ గ్రిమి
జాతమ్ములు పొడుచు వేళ సౌఖ్యము గలదే 318

వ. రేతశ్శోణితశ్లిష్టము ప్రథమదివసమునఁ గలిలం బనంబడు నది సప్తదినావసానమున బుద్బుదాకార మొందును.

క. పురువులు పరువులు పెట్టుచు
కరమున్ బుద్బుదముఁ జేరి గఱచెడి వేళన్
భరియింపరాని దుఃఖో
త్కరముగదా! యగు సుఖమ్ము గల్గునె గనుఁడీ 320

సీ. మాతృజాఠరవహ్ని మంటల పెట్టుచే
　　　బిట్టు గాసిలు నట్టి వేళ యందు

జనయిత్రి కుక్షిసంచారవాయువులకుఁ
జాల ఘూర్ణిల్లెడిసమయ మందు
అంబ కడుపు లోనలము మూత్రాదుల
దుర్వాసనల్ బడిదొరలు నపుడు
తల్లి గర్భపు మావిదవిలి కాల్సేతులు
గట్టి నట్లుండెడికాల మందు
తే.గీ రౌరవాదినరకదుఃఖరాశి ననుభ
వింపనేవలయుం గానివేళ నచట
లేని దుఃఖంబు లేదనిమానవాళి
యెఱిఁగిరేన్ బుట్టు వొందంగనెవఁడుగోరు 321
తే. ఇంత దుఃఖమ్ము నిటనుభవించి పెక్కు
కంపు లలమెడి బొజ్జలోఁగొంపి వీడి
చేటలోఁ బడ్డ దాదిగఁజేటు గాని
యన్య మెఱుఁగునె నిసుఁగింతమైనఁ దలఁప 322
సీ. అఁకొన్నచో నెవ్వరైన దయంజూచి
పాలిచ్చి ప్రోవంగవలయుఁగాని
మలమూత్రముల మగ్గియలయుచో నెవఁడైన
వచ్చి కడిగి కావవలయుఁ గాని
చీమ నల్లియు దోమవిటుకు పొటుక్కని
పడఁగుట్ట నేడ్వంగవలయుఁగాని
చీటికిన్ మాటికిన్ శిశురోగజాలముల్
బలియగాసిల్లనేవలయుఁగాని
తే. దప్పిగొనఁ గుత్తు కెవఁడైనతడుప వలయుఁ
గాని కోర్కులు దీర్పఁగాఁగలదె శక్తి
శిశువునకు నెంత పాపంబుచేసి కాని
శైశవావస్థ నొందఁడేజనుఁడు వినుఁడు 323
క. బూడిదలో వ్రేలిడి వ్రేల్
గాడంగా నక్కరాలఁగడు నిర్ధ ములై

బోఁడిమి సెడ వ్రాయింతురుఁ
జూడరు గురులింత నిసుఁగుసుఖ మెయ్యెడలన్. 324

క. పాత్రాపాత్రము లెంచక
మాత్రలు శబ్దములు శబ్దమంజరి విలసత్
సూత్రమ్ములు టీకలతో
గాత్రమ్ములు గరుసువార గఱపుదురు గురుల్ 325

క. క్రతువఁట వ్రతమఁట వేదవి
హితమఁట ప్రతిషిద్ధమంట నేనికి సైనన్
మతిభరముం బొనరించెడి
గతి మీమాంసలను గురులు గఱపుదురు గదా. 326

చ. చదువులఁ బెట్టి తీఁగగతి సాగఁగఁగొట్టి శరీరదార్ఢ్యసం
పదఁ జెడ దేశికాంగణనివాసములన్ నిలఁబెట్టు బాలకున్
పదిలముగాఁగ శల్యతనుమాత్రునిగా నొనరించి యవ్వలన్
ముదల నొసంగువారు గురుముఖ్యులు పెంలియాడఁ గన్యకన్

వ. పాణిగ్రహణోత్తరక్షణమునుండియు నామకరణాంతము పురుష
నలము కష్టరూపముల తెలంగెఱుంగ బ్రహ్మకైనను శక్యమే?

చం. తరుణుల గీములన్ మణులధాన్యములున్ ధనసంచయమ్ములన్
కరితురగాదులన్ మొదట గైవసమున్ బొనరింప క్లేశ మె
వ్వరికిని దప్పదింకఁ దగు పద్ధతివానిని రక్షసేయ దు
ష్కరతరసాహసమ్మగు నొసల్కనుగల్గిన యంతవానికిన్ 329

సీ. భూపతిత్వము దుఃఖపుంజాలయము గదా
సాచివ్యమున్ క్లేశసదనము గద!
దాసత్వ మతికష్టవాసగృహము గదా!
సంపద యిక్కట్ల కొంపయ గద!
లేవడి యిబ్బంది లీల సావడిగదా!
యొరుసిరి తనమెడయురి సుమి గద!
ఇరుగుబొర్గుల వారికెనయగు సిరిగల్గ
నదివారి స్పర్ధకాస్పదమగుఁగద!

తే.గీ. వేదమార్గాన్యమునఁ జన్నఁ వేదమార్గ
మునను జన్నను బలుగాసి మొనయును గద
దేనివలనను సుఖమింత గానరాదు
దుఃఖతాండవమెటనైనఁ దోఁచుఁగాని 330

క. అనిలానలభూతలసం
జనితానర్థముల నెట్టి జగజెట్టియు మా
న్పను సామర్థ్యము గలఁడే
దినము దినమ్మనుభవించి తీరఁగ వలయున్ 331

క. సురపతిసరసిజభవవి
ష్ణురుద్రలోకముల మనికి చొప్పు లెఱుంగన్
గురుతరదుఃఖావాప్తి
స్ఫురితములని యనుచు నుడువఁ బోలుం జుండీ 332

క. బహువాక్యమ్ములిఁకేలా?
నహంమమవికారబుద్ధి నంగమున ముహు
ర్ముహురీక్షణముం జేసిన
మహావ్యధను బొంది చెడును మనుజుం డెపుడున్ 333

క. భ్రమమూర్ఛితాంతరంగ
ప్రమాదమున ఘోరదుఃఖ రాశియును భ్రమో
దముగాఁ దోఁచున్ గావున
భ్రమదర్శన మెపుడు దుఃఖ భాజనము గదా! 334

క. సరిగాఁ బరికించినచో
స్ఫురియింపని దుఃఖమొకటి చూచుట యెల్లన్
బరమశివజ్ఞానమ్మెటు
వఱలక యుండుటయె కతము పలుకు లిఁకేలా? 335

చ. అరయసుఖస్వరూపుఁడగు నాత్ముఁడు వానికి భిన్నరూపమే
కరణిని గల్గ సత్యమగు జ్ఞానము కల్గినవాఁడు సారెకున్
వరలును సౌఖ్యవాంఛ సుఖ వాంఛ యొసంగిన మానవుండు జ్ఞా
నరహితుఁడంచుఁ బండితగణంబులు నిశ్చయముం బొనర్త్రిగిన్

క. ఆయజ్ఞానం బెపుడేన్
బోయిన యెడ సిద్ధసుఖమె పురుషుఁడు పొందున్
బాయన్ గలుగని దుఃఖం
బియర్థంబెల్ల రెఱుఁగుడిది శ్రేయంబౌ 337

కం. జ్ఞానంబు వలననే య
జ్ఞానము నశియించు వేయి కర్మములేలా?
జ్ఞానం బనఁగ మహేశ
జ్ఞానము వేదాంతవాక్యజన్యము సుండీ 338

తే.గీ. సంసృతివిరక్తి గలిగిన జ్ఞాన మబ్బు
సర్వకామంబు లెవనికి సమసిపోవు
నట్టిమర్త్యుండె యమృతత్వమందు బ్రహ్మ
భావ మొందును వేదతాత్పర్యమిద్ది 336

తె.గీ. సంసృతి విరక్తి లేనట్టి జనుఁడు బంధ
ములకుఁ జిక్కుచు ముక్తినిఁ బొందలేఁడు
ధర్మసిద్ధియు సత్యవేదనముగనఁడు
గాన విజ్ఞుండు వైరాగ్యమూనవలయు 349

### 18. అనిత్యవస్తు విచారము

వ. మరియు సూతుం డిట్లుపన్యసింపందొడంగె. నిత్యానిత్యవస్తు విచారము వలన ననిత్యవస్తు వెఱుఁగుట గలుగును. ఆజ్ఞానము వైరాగ్యోదయమున కనుకూలించుఁ గావున ననిత్యవస్తువిచార మారంభించెదను. ఆత్మేతర మనిత్య మని యెఱుఁగఁదగును. కార్యత్వ మనిత్యత్వలక్షణమని నుడువు వారి వాదము సరియైనది కాదేలయన ఘటాదిప్రాగభావము కార్యము కాదు కనుక నది నిత్య మనవలసి వచ్చును. విచారించినఁ బ్రాగభావ మనిత్యము. తత్ప్రాగభావము తన్నిర్మాణము కలదని పించును. ఘటప్రాగభావ మనాదియయ్యు ఘటసృష్టివలన నశించును. గాన నది సాంతమగును. కాన నకార్యత్వమును నిత్యత్వలక్షణము గాదు. మరి దిక్కాలాకాశాదులు నిత్యములను వాదమును సరియైనది

కాదు. అవి యనిత్యములని యంగికరించిన యెడల ననిత్యములైన ఘటాదులు తన్న్యూనపరిమాణసజాతీయద్రవ్యములఁ గలిగి నట్టులాకాశాదులకును నాకాశాదిన్యూనములై తత్సజాతీయములైన వస్తువులాకాశాదులు కారణములని తర్కించుటయుం బ్రయోజనవంతము కాదేలయన శ్రుతులట్లు బోధించుట లేదు. ఆకాశాదుల నిత్యములని బోధించు శ్రుతులకును నట్లయిన యాకాశాదులకుఁదన్న్యూనతత్సజాతీయములైన వస్తువులు తద్ధేతువులను తర్కమునకును సరిపోదు శ్రుతులైక్యబోధకములై యాకాశాదిసృష్టికథనముం జేయును. సృష్ట్యర్థమాక్షేపించుట కాకాశాద్యనిత్యత్వము నంగీకరించినచో దన్న్యూన తత్సమాన హేతువస్తువులను బోధించి చివరకు ననవస్థాదోష ముద్ఘోషించు తర్కము యదార్థము బోధపఱుప నేరదు. శ్రుత్యనుగ్రహీతతర్కము మాత్ర మాదరణీయము తదితర మగ్రాహ్యము.

క. విక్షేపమానసప్ర
త్యక్షాదిప్రమితి కలవికయౌనే కరణా
ధ్యక్షుఁడగు జీవువిధ మప
రోక్షంబుగఁ దెలుపఁగా నిశరూఢప్రజ్ఞన్ 342

మ. శ్రుతిమార్గంబునఁగాక వేఱయగు నేశ్రోవన్ బరబ్రహ్మసం
గతినే (గాంచితి నన్న సాహసుఁడునాశల్కన్ మాని హస్తంబుచే
నతిమాత్రింబుగ (గమ్మదేనెరుచి హృశద్యమ్మంచునేవిప్తెటిం
గితిఁజిత్తంబున నంచుఁబల్కు జడుభంశగిన్ హాస్యపాత్రుండగున్

క. ఇందుకుఁ గల దితిహాస
మ్మం దెలియుఁడు నుడువువాఁడశమున్పొక కాలం
బందున సంగిరుఁడను భూ
బృందారకుఁ డొకఁడు మొఱకుశవీఁడన మనియెన్ 344

క. తుదిమొదలుతర్కశాస్త్రము
చదివినవాఁడగుట నుపనిశషత్తుల మాటే
యదనునఁ దలఁపక ముక్తి
ప్రదమని తర్కంబు నమ్మిశవ్యవహరించెన్ 345

మ. కరణగ్రాహ్యము గాని బ్రహ్మమును దర్కగ్రాహ్య మంచెంచి ధీ
స్ఫురణన్ బ్రహ్మము బ్రహ్మధర్మమును సంశోధించి శోధించి బ్ర
హ్మరహస్యంబు నెఱింగినాఁడ నని గర్వాంధాత్ముఁడై విఱ్ఱవీఁ
గి రజోదూషితచిత్తుఁడై కడు మెలంగెన్ లోకమందెల్లెడన్. 347

మ. శతతర్కంబుల సాయముం గొనుచు బాషండంబునున్ దద్విశే
షతతిన్ గైకొని వాని వీడి తనయిచ్చల్ వోవుదారిన మహా
మతినంచున్ జరియించి తుట్టతుద కంబన్జావఁగా మొత్తి గు
బ్బెతలన్ గన్నులఁ బడ్డయప్పుడు సమీక్షించున్ మనోజాత్ముఁడై

క. అపశిష్టపాపమొక్కటి
లవలేశము లేక కేవలమ్మాతఁడు పా
శవవృత్తి మెలఁగుచున్ గా
లవశుండయి మరణశయ్యలావరి యుండెన్. 348

చ. గుదియలు కత్తియల్ గొనుచు గుండెల వ్రీలఁగఁజేయు హుంకృతుల్
మదకలితాట్టహాసములమందముగా నొనరించుకొంచు భీ
ప్రదులయి భీషణాకృతుల వానిసమీపమునందుఁ జేర ర
య్యాదనునఁ గాలకింకరచయమ్ములు తర్కము రక్ష సేయునే? 349

ఉ. అంతట మూర్ఛితుండయినయాతని యామ్యభటాళి పట్టి నీ
స్వాంతము వచ్చినట్టులఁ గదా చరియింతువు సాగవింక నీ
వింతచరిత్రలియ్యెడల నెయ్యది దిక్కు దలంపు మంతక
ప్రాంతముఁ జెర్చువార మని పల్కి యమాంతిక మొందఁ జేసినన్

చ. కనుగవ నిప్పుకల్ వఱలఁ గాంచి యమప్రభుఁ దగ్రవర్ణసం
జనితుఁడ వయ్యు వేదవిధిసంచరణంబుల మాని యిష్టబు
ద్ధిని జరియించినందున కిదే ఫలమంచు నెఱుంగుమంచు ఘో
రనినదముల్ నెలంగఁ దనపత్రికఁ జరించు భటాళికిట్లనున్

శా. ఈమందాత్ముని బల్మిఁ బాశముల నింకదేకొయ్యకుం గట్టుఁడీ
మీమీ శక్తి కొలంది కోలఁగొని నెమ్మేనిన్ దగన్ దొట్రిలం
గా మోదుటన్ బ్రవీణులయి వేడ్కన్ గొట్టుఁడీ యింక నేన్
క్షేమం బీతఁ డెఱుంగుఁగాక యని సంక్షేపోక్తిఁ బల్కెన్వెసన్

వ. శమనకింకరులుం గింకర్తవ్యతామతి విడచి యథాకామముగ నతని బాధింపఁ దొడఁగిరి.

సీ. చెఱకుగానుగులఁ గాన్ల్లేసేతులం దొడగిరి
గ్రిఱ్ఱన కోలలన్ద్రిప్పియార్చి
చిఱుగుంట లెల్లెడన్మెఱసినెత్తురు చిమ్మ
నొడల నాడించి నాన్రులులఁ దెచ్చి
మొండి ఱంపపుఁగోఁతన్రెండుగా వ్రీలఁగా
నంగమెల్లను గోసిన్యాచియాచి
కాలునూనియ నగ్గిన్కణముల బొబ్బెక్క
నందాఁకఁ బొరలించిన్రక్తపెయిపెట్టి

తే.గీ. చెప్పఁగాఁ జూడగా వటిన్చెట్లఁ గూర్చి
కోటివత్సరపర్యంతన్మాటు పాటు
లేని నరకార్ణవమ్మునన్వాని ముంచి
లేవనెత్తిరిజమునాన్చేత వారు 354

క. యాతన లెన్నెన్నో యమ
దూతలు తమశక్తి కొలఁదిన్దుందుడు కొప్పన్
వేతెరవులఁ గల్పింపఁగ
నేతన్నుం గానకుండున్నెడివింత మెయిన్ 355

క. ఏనాఁడొనరించిన పు
ణ్యానదో శివుపైన భక్తిన్యమరె నతనికిన్
మానితశివభక్తుండు శ
తానందుండన్న మౌనిన్యచ్చటుచేరెన్ 356

క. ఆ నగజాపతి తోడ స
మానుం డీమహితుఁడనఁగన్మను నాతఁడు తే
జోనిధి కరుణావారిధి
భానుతుఁ డాతండు విప్రున్ముందట నిలిచెన్. 357

గగనమున నుండి భువిపై
దిగి మౌనివరుండు వీనుకేతేనియ భంగిన్ 358

ఆ.వె. "ఓన్నమశ్శివాయ" యన్న షడక్షర
మంత్రరాజ మలఘుమౌని సంగి
రునకు నుడువు నపుడె యనిమిషలోకమై
నరకలోక మొప్పె నవ్యగతుల 359

సీ. సురతరుశాఖాప్రసూనవర్షంబులు
గురిసె నెల్లెడల నబ్బురము గాఁగ
మునులు సిద్ధులు యక్షపుంగవుల్ గుమిగూడి
సల్పిరి నృత్యంబు చతురగతుల
నచ్చరల్ కింపురుషాగ్రేసరులఁ గూడి
గేయముల్ పాడి రమేయలయల
నంభోజసంభవుం డనుఁగుఁగొమ్మం గూడి
మేలినాట్యంబుల లీలఁ జేసె

తే.గీ. సకలసురసంఘములతోడ సౌరపతియు
వచ్చి యాడెను నుత్సవమచ్చుపడగ,
వేయునేల రమారమణీయపాణిఁ
బాణిగొని జాణయై చక్రపాణి యాడె. 360

క. నారకులు మున్నెఱుంగని
సారానందామృతప్రచయ సేచనులై
తారపుడు నిరతిశయసుఖ
పారమునకుఁ జేరి వేగ బాసిరి వగలన్ 361

క. గడగడ వడఁకుచు యముఁడ
ప్పుడు కేలు మొగిడ్చి మౌనిఁ బురహరుఁ డంచున్
గడు భయపడి యయ్యలఘుని
యడుగులపైఁ బడియె సేవకావళి తోడన్ 362

క. కరుణించి శమను శమధనుఁ
డురుముదమునఁ బల్కె వింత లొప్పన్ బరమే

శ్వరవరకరుణాలోక
స్ఫురణంబున నంచుఁ గనులఁ మూసి సుఖాప్తిన్ 363

క. ఆయభవుభక్తుఁడగు నా
కేయింతటి మహిమ మొప్పఁ నెవ్వం డగజా
నాయకమహిమము వొగడఁగ
నీయుర్విం జాలు నని వచించెన్ భక్తిన్ 364

వ. మఱియు భయం బుడిపి సంయమి యమున కిట్లుపన్యసించె. 365

సీ. విష్ణుదేవేంద్రాదిఁ విబుధవర్గము కంటె
శివుఁడు మే లనువారిఁ చెంతఁ బోకు
శివనామ మెచ్చు పైఁ ష్ణపపంకజోద్భవా
ద్యభిధల కనువారిఁ నంటఁబోకు
సర్వావభాసకఁ సర్వమూలము శివుం
డనువారి నింతైనఁ జెనకఁబోకు
మగ్నిరిత్యాదిమంఁ త్రాన్వితంబుగ బూది
ధరియించువారి డగ్గరఁగఁబోకు

తే.గీ. మెడఁద నుదటను భుజములఁ నెనయ మూఁడు
బంతులను బూది నలఁదినఁ భవ్యజనుల
దూరమునఁ గాంచి యెడగలఁ దొలఁగి డాయఁ
బోకు మెయ్యెడ నిదిమంచిఁ బుద్ధి నీకు 366

సీ. లింగమందునఁ ద్రిశూఁ లిన్ భవమోచకు
నర్చించు వారిపైఁ యరుగఁబోకు
మొప్పగ రుదురాక్షఁ లొకటైన మూఁడైన
నాతైన నిడువారిఁ జేరఁబోకు
శమదమంబుల నొందిఁ శంకరభక్తులై
సన్యాసులౌ వారిఁ సరసఁబోకు
మమలవేదాంతవాఁ క్యార్థశ్రవణమున
నాఢ్యులౌ వారి డాఁయంగఁబోకు

తే.గీ. యజ్ఞదానతపోసవనాదివివిధ
సాధనంబుల ననిశంబు శంభు సేవ
సల్పు ధన్యుల సామీప్య సరణిఁజనగఁ
బోకు మెయ్యెడ నిదిమంచి బుద్ధి నిజము. 367

ఆ. గట్టు పట్టిఁ గూడి కనులు మూఁడుం గల్గి
చందమామ సిగను నంద మొప్పఁ
దాల్పు శుద్ధశర్వు ధన్యమూర్తిం గొల్పు
నమలఘనుల కడకు నరుగఁబోకు. 368

క. శ్రౌతస్మార్తాచార
వ్రాతమ్ముల నన్యములను భవభజనము సం
ప్రీతిమెయిఁ జేయువారిని
నేతరిఁ దరియంగఁబోకు మీః సమవర్తీ! 369

వ. మఱియు నిదియు గమనింపుము. 370

సీ. నిఖిలదివ్యులకంటె నిజముగా శివుఁడెక్కు-
డని మానువారి నీ వలుకఁగొట్టు
కేశవాదులతోడ నీశుండు సముఁడని
పలుకువారిని గూబ బగులగొట్టు
తగుశ్రద్ధతోడ శ్రౌతస్మార్తసత్క్రియల్
నెరపకుండెడువారి శిరసుఁ గొట్టు
పరగ శ్రుతిస్మృతి తరసిద్ధకార్యముల్
సేయువారిని లెంప వాయఁగొట్టు

తే.గీ. గురువులకు ద్రోహ మొనరించు పరమనీచు
లైనవారిని నీచేత నైనయంత
వఱకుఁ గాసిల్లఁగొట్టు వైవస్వతుండ!
మానకిఁకదీని నీకిది మంచిబుద్ధి. 371

క. శ్రుతహాసమొకటి మఱి య
శ్రుతాచరణమొకటి సేయు జంతువితతి భా

ంతనూణాః గారింపు ము
చితరీతుల దానఁ గిరి త్రిచేకురు నీకున్. 372

తే. గుండ్రముగఁ జుక్కవలెఁ గావికోలగాఁ ద్రి
శూలముం బలెగాని ప్రాల్మాలి యూర్ధ్వ
పుండ్ర మొయ్య ధరించెడుపూర్తుఁ బట్టి
బిట్టుఁ గొట్టుము నీకీర్తి వృద్ధి నొందు 373

తే. మానుషంబైన దైవతంబైన నన్య
మైన లాంఛనముల దేహమందెవండు
పూను వానివి వెదకి నీభుజబలంబు
కొలఁది లోకంబు పొగడఁగఁ గొట్టు మెపుడు. 374

క. అని పల్కి శతానందుం
డనఘుఁడు కైలాపశిఖరిశిఖవని ఁబూజిం
ప నరిగె నచ్చోటు విడి యెం
తని వర్ణింపంగ నేర్తు హరమహిమములన్ 375

ఉ. అచ్చెరు వొందుచున్ శమనుఁ డవ్వల సంగిరవిప్రు నొద్దకున్
వచ్చి మహాత్మ నీవు మును వైదికపద్ధతి దవ్వానర్చి నీ
యిచ్చకు వచ్చి తర్కమతినే వరియించి చరించి నందుకు
వచ్చితి విందు యాతనలఁ బాల్పడితంచు వచించె మెల్లనన్ 376

వ. మఱియుఁ బరేతరాట్టు జన్నిగట్టునకిట్లనియె 377

చ. అరిదిగదా భవత్సుకృత మార్యవతంసః ప్రశంస యేల యు
ర్వర బహుపుణ్యులై మనెడివారిటఁ బొందగఁ జాలు నీ షడ
క్షరవరమంత్ర మయ్యెడిజ గన్నుతరీతిని ఖ్యాతిగాంచ బల్
దిరముగ బొందినాఁడ వుప దేశము భర్గసమానమౌనిచే 378

క. ధరణిసురః నీదుఃఖో
త్కరములువిరమించెనిపుడు గై కొన్న షడ
క్షరమంత్రవీర్యమునఁ గ్ర
మ్మర నీకిట రాకయుండు మార్గము వినుమాః 379

క. పుట్టుమ బాపనకొలమున
గట్టిగఁ దొల్చదువు చదివి గ్రైకొనిధర్మం
బట్టిటనక యొనర్పుము
కట్టా తర్కంబు నమ్మి కడకుఁ జెడకుమీ! 380

క. వేదాంతవాక్యజన్యా
భేదజ్ఞానమ్ము నేర్చి పెంపుమ ముదమున్
నాదర్శనమున కిఁకఁ బని
లేదని గుర్తింపు మెడరు లేని తెఱఁగిదే. 381

క. అని శమనుఁడు తన నగరున
కును జనియెం గానఁ దెలిసికొనుఁడీతర్కం
బున దుఃఖము శ్రుత్యర్థం
బున సౌఖ్యము గలుగు నంచు బుధవరులారా! 382

ఉ. మందులు గొందఱెంతయుఁ బ్రమాణనయంబని తర్కశాస్త్రపుం
గందరగోళముల్ పఠనకౌశలముల్ దయివార నేర్చి యీ
చందమునన్ సదానరకసాగరముం బడి మున్గి తేలి యే
రందగరాని దుఃఖములు నందుచు నుందురు కష్టజీవులై 383

ఉ. కేవలహేతువాదముల గ్రించుదనానఁ జెలంగువారు పా
పావిలు లట్టివారి బదులాడగరాదొగిఁ బల్కరించినన్
వావిరి నెన్నఁడైన సహవాసము గూడదు వారితోడఁ గూ
డేవిధినైన మానవలె నెల్లరు తత్సహపంక్తి నెయ్యెడన్ 384

క. హైతుకుఁడు మహాపాపుఁడు
హైతుకవిద్వాంసుఁడగు మహాపాపసముం
డేతరిని వర్జనీయుం
డాతఁడు నిర్వృతియ యతని కబ్బదు వినుఁడీ! 385

క. వేదామలవాక్యప్రతి
పాదితమార్గము నెఱింగి బ్రహ్మాత్మాన్యం
బేదైన నసత్యంబగు
నీదృష్టి నెఱుంగవలయు నెల్లరు జనముల్ 386

తే.గీ. అఖిలమాత్మేతర మ్మనిత్యమ్ము గాఁగ
నరయువారికిఁ గాక యేపురుషవరుల
కైన సంసారవైరాగ్యమబ్బునొక్కొ!
కాన నాత్మాన్య మనృతముగా నెఱుఁగుఁడి. 3 7

క. రాగవిరాగమ్ములు దుః
ఖాగమనమునకును సౌఖ్యమందుటకు గతం
బేఁగాన ననిత్యజ్ఞా
నాగమనమ్మొగి విరక్తికై పడయవలెన్ 388

వ. ఘటము పటమ్ము లోగిలియుగాదెయు గోడయు మేడ సావిళుల్
పటుతరరక్తినొప్పెడి కళత్రము మిత్రము పుత్త్రిరత్న మ
క్కటా త్రుటిలో నశించు మనుకారుమెఱుంగును బోలె వానికై
కటకటలాడనేల మునుగైకొను వేళలఁ బాయువేళలన్. 389

తే. ఎంత పెంతటిభాగ్యమ్ములెనసి యైనఁ
జాలు ననుమాట పుట్టదెక్కాలమందు
చక్రివర్తియు ననుభూతసర్వరాజ్య
వైభవము వోవనెంతయువగచుఁగాదె 390

క. ఇది వాస్తవమైనను మో
హదర్పమున మూర్ఖజనుఁడునాత్మపదార్థా
భ్యుదయమునకుఁ జెమటూడ్చున్
విదితం బెయ్యెడల మోహవిభవము గనుఁడీ! 391

క. శ్రమపడి వ్యయమున కోర్చియుఁ
దమిఁ జేసిన దానయజ్ఞతపముల వలనన్
గ్రమమునఁ బొందెడి స్వర్గా
దిమహాలోకమ్ములున్ దుదికిఁ జెడుఁగాదే. 392

సీ. పుడమి జలంబులోఁబుడగవేసి నశించు
సప్తసముద్రాలుసమయు బాడ
బాగ్నియందున బడబాగ్ని మహావహ్ని
యందణంగును మహాహవ్యవాహ

నుండు వాయున కహితుండగు వాయువు
గగనమందున లీనమగును గగన
మాత్మకారణమందు నందులయంబు శ
బ్దాదులు భూతాదులవశవిధుల
తే.గీ. నాశనము నొందునట్టి గోనంబు గలవి
కాన భౌతికవస్తునికాయమందు
జతన మున వెదకిననశాశ్వతముగాని
శాశ్వతపదార్థమెందుఁ గాంచంగలేము 393
చ. జగములఁగన్న తండ్రియగుచక్రిధరుండును స్వీయులైన బం
ధుగులు నిజాయుధంబులును దొల్త నశించి జనించినట్లు మా
నుగ వినుచుందుమట్టియెడ నూల్కొనకుండునె నాశమొక్కనాఁ
డు గడువ కాలమాహరికెటుల్ దలపోయఁగ నంచెరుంగుడీ 394
తే. పురువు మొదలుగఁ బద్మజువరముగల్గు
ప్రాణులెల్లరు నశియించువారె సుమ్మ
గావునన్ నిత్యమెద్దియొ గనఁగవలెను
శాశ్వతులు గారు జగతులజరుగు వారు. 395
సీ. వెలయించు నన్నింటి వెలయింపగాఁదన్ను
వస్తువెద్దియు లేక వఱలువాఁడు
పుట్టించు నన్నింటిఁ బుట్టింపఁగాఁదన్నుఁ
దల్లిదండ్రులు లేక దనరువాఁడు
పాలించు నన్నింటిఁ బాలింపఁగాఁదన్నుఁ
బ్రభువెవ్వఁడును లేక పరగువాఁడు
సమయించు నన్నింటి సమయింపఁగాఁదన్ను
మృత్యువు గలుగక మెలఁగువాఁడు
తే.గీ. అద్వితీయుండు కేవలుండభవుఁ డన్న
తత్త్వమొక్కటి యగును వాస్తవపదార్థ
మన్యవస్తుచయంబుల నరయఁ డవ్వి
నిత్యములు గావు గావు మనీషులార!

చ. సకలజడం బనాత్మక మసత్యము నంచు శ్రుతిప్రయుక్తపూ
ర్వకముగ నిశ్చయింపఁగలవైభవముం గలవాఁడు చాల మె
చ్చిక శివు నద్వయున్ బ్రభువు సేవకసేవధిఁ జేరనేర్చుఁ ద
ప్పక యొకకాలమందు ననిపల్కెఁద సత్యము నమ్ముఁ డింతయున్.

## 19. నిత్యవస్తు విచారము

వ. సూతుండు మఱియు నిట్లు వాకొనె నయ్యలారా! యియ్యెడ నిత్య
వస్తు విచారము కర్తవ్యంబు దానఁ బరశివజ్ఞానం బుదయించు

చ. అమలుఁడు నిర్వికారుఁడు నిరంజనుఁ డాత్ముఁడు కేవలుండు సా
క్షిమహితుఁ డవ్యయుండు వరచిద్ఘనుఁడై వెలుఁగొందువాఁడు మా
రమణుఁ డొకండు నిత్యుఁడయి రాజిలుఁ దద్విపరీతవస్తుజా
తము జడమయ్యెదౌను శతధా పరికింప నసత్యమే యగున్

క. జడమే నశియించు నెటన్
జెడని పదార్థంబ యగును జిద్వస్తు వెఱుం
గుఁడు పుడమివేల్పులారా!
గడితపుశాస్త్రంబు లిట్లు గాదే నుడువున్

వ. అటులైన ఘటపటాదిప్రత్యయములు నిత్యములని యందు రేని వినుం డేతత్ప్రత్యయము గలుగక ముందే తత్ప్రత్యయాభావంబును గుర్తెఱిఁగి చిదంశమునే తత్ప్రత్యయజననాంతరమున నేతత్ప్రత్యయ జననము గుర్తెఱుంగు చిదంశము నేతత్ప్రత్యయనాశానంతరమున నేతత్ప్రత్యయనాశమును గుర్తెఱింగి చిదంశమాత్రము నిత్యము అది భిన్న భిన్నమునుం గాదు మూడవస్థలకు సాక్షియయిన దొకటి గాక ప్రత్యవస్థకు వేఱువేఱ సాక్షియగు నేని ప్రత్యయాభావమును గుర్తించిన వాఁడు ప్రత్యయజనన నాశనములను ప్రత్యయజననము గుర్తించినవాఁడు ప్రత్యయప్రాగభావప్రధ్వంసాభావములను బ్రత్యయనాశము గుర్తెఱింగినవాఁడు ప్రత్యయప్రాగభావోద్భవములను గుర్తింపఁజాలఁడు గదా. కాన సంవిత్తను చిదంశము మాత్రము నిత్యమును నద్వయమును నయి యున్నది మఱి నశ్యాంశ మేది యన వృత్త్యంశము మాత్రమని యెఱుంగునది. సాక్షికి జన్మనాశములు లేవు. సాక్షి కంటె భిన్నమగు పదార్థము వాస్త

వముగ లేనేలేదు. కాన జడవస్తువునకును జన్మనాశము లాపక్షమున సంభవింపవని యెరుంగునది. సాక్షిసాక్ష్యములలో సాక్షి నిత్యము, సాక్ష్య మనిత్యము. అటుగాక సాక్షివిశేషాకారమే సాక్ష్యమని పల్కువా రజ్ఞానులు. చిదంశ మచిదంశమెట్లగును? ఆత్మనొక్కని మాత్రము బ్రహ్మమనియు నిత్యుఁడనియు శుద్ధుఁడనియు శ్రుతిస్మృతి పురాణాదులు నుడువును.

క. జీవుం డొక్కఁడు బ్రహ్మం
బావలివెదుకంగ నిత్యుఁడని తెలియవలెన్
భావుకవరులారా! వినుఁ
డీవిధమె నిక్కమంచు నే వివరింతున్

## 20. విశిష్ట ధర్మ విచారము

వ. మఱియు సూతుండిట్లు పలికె

క. నిత్యానిత్యనిరూపణ
మత్యుపదేశ మ్మొనర్చి మానుగ నవలన్
నిత్యపదార్థవిశేష
మ్మత్యంతశుభమ్ము నుడువు దార్యులు వినుఁడీ

ఉ. తొల్లిటి కొక్క కాలమునఁ ఘోరపుశ్రద్ధను సత్రియాగమున్
జెల్లగఁ జేసి పిమ్మట మునిప్రవరుల్ దగఁ గావషేయనా
మోల్లసితప్రభావయుతు లుల్లమునందున వేదవాక్యసం
ఫుల్లవిశేషబోధములఁ బూర్ణముగా మథియించి రెంతయున్

క. చివరకు వారలు బ్రహ్మము
సవిశేష మెఱుంగు పట్ల సంశయచటులా
టవిఁ బడి తెన్నే గానక
వివశత్వము గాంచి పడిరి వెతలన్ గరమున్

చ. తపమునఁ గానియెట్టు విదితం బగు నట్టి మహారహస్యముల్
చపలమనీషగట్టు నెరజాణల కెవ్వరు సాటి యంచు మౌ
నిపతులు చారుశీతధరణీధరపార్శ్వముఁ జేరి కోరి బ
ల్తపమొనరింపఁగాఁ దలఁపులన్ గడుఁ బెంచిరి మానసమ్ములన్

సీ. మునివృద్ధులన్ స్నానముల్ సేసి సర్వాంగ
ములనిండ బలుబూది నలమి ఎలమి
నారచీరలు గట్టి పేరెదన్ రుదురాక
పూసతావళముల నేసి రోలిఁ
దలను గెంజెడల మొత్తములఁ దాలిచి కమం
డలువులఁ జేఁజివుట రుల నిలిపిరి
గడ్డుతె జొప్పార గడ్డముల్ బుజముల
వఱకు వ్యాపింపఁ బెంపు రహి గనిరి

తే. అమలతేజోవిరాజమానామలాంగుఁ
డంగనారత్నభవ్యవామాంగుఁ డంగ
జాహితుండైన శంభునియందు భక్తిఁ
బాదుకొల్పిరి సంయమీశ్వరులు కరము. 408

శా. మూఁడేండ్లిక్కరణిన్ మునీశ్వరులు శంభున్ బార్వతీప్రేయసున్
జూడాలంకృతశీతలామలకరున్ క్షోణీధరేంద్రత్మజా
క్రీడాలాలసమానసున్ శివుని నక్షీద్వంద్వముల్ మూసి యే
నాఁడెవ్వారలెఱుంగ నట్టిదగు చందం బొప్పఁగాఁగొల్చినన్ 409

చ. అపుడు కృపాతరంగితహృదబ్జవిలాసములో మహోసరీ
నృపవరభూషణుండు దయచేయుట వారికిఁ గానవచ్చె శూ
లపరికరాత్మహస్తుఁడయి లక్షణసంపద లెంచి చూడఁగా
నపరధరాత్మజావరుఁడెయౌననఁ జాలు షడాననుం డొగిన్ 410

మ. సురసేనాపతిఁ జూచి నంతనె మునీశుల్ వశ్యసర్వేంద్రియుల్
త్వరమై లేచి సహస్రదండనతులన్ బత్తిన్ సమర్పించి వా
క్స్వరసత్వంబులు మీఱ స్తోత్రములఁ జక్కం బల్కి సేవించి య
క్కరుణావారిధినిన్ బ్రసన్నవదనుం గావించి రెంతేనియున్ 411

క. జోడించి రెండు చేతుల
బాడబవిభులైన మునులు వల్కిరి దేవా
వేడెద ముత్తమధర్మం
బాటుము తరియింప మమ్మ నని వినయమునన్ 412

చ. జగముల నొంప (గల్గు కడు సాహసి యయ్యుశరోద్భవుండు జ్ఞా
నగుణమణిప్రభావము లనారతముం భజియించి ప్రోడయై
జగదుదయం జిల్కుచున్ నిరత ధర్మముం గూర్చి యుపన్యసించి పా
ద్మాగముల గల్గునట్టి ఫలమున్ గనం జాలెను వింత మీఱఁగన్

స్కాందమం దిట్లు పలికె.

క. ఉత్తములారా! వినుఁడీ
యుత్తమధర్మంబు పలుకు దురుతరపుణ్యా
యత్తస్వాంతు ల్గాపున
నిత్తరి విను భాగ్యమిప్పుడెనసెన్ మీకున్ 415

వ. ధర్మములు వేదోక్తములు స్వమనీషానిశ్చితములు నని రెండు విధములు. వానిలో రెండవ సముదయములో శ్రద్ధా సహితములైనవి అప్రహితముల కన్న వన్నెకెక్కువాని కన్న దేవతారాధన రూపధర్మము లెక్కుడు. వాని కన్న వేదోక్త ధర్మము లెక్కువ సార్థములు. వానిలో బుద్ధాగ మూర్ధతాగమ ప్రాజాపత్యాగమ విష్ణ్వాగమ శైవాగమము లొండొంటి మీఱు. శైవధర్మము లిరుతెఱంగులు. వానిలో గ్రామికాది పరిభేదము లభ్రస్రోతోద్భవము లవి స్మార్త ధర్మములకు లెక్కు. స్మార్త ధర్మములు శ్రౌతధర్మముల కంటె దక్కువ. శ్రౌతధర్మముల కన్న శాంత్యాదులను వానికన్న భస్మధారణము దాని కన్న శివలింగార్చనము దాని కన్న పోఁహాంభావసయు శివనిష్ఠాపరశుశ్రూషయు శ్రేష్ఠతరములు. వేదాంతవాక్యబన్యములు. మోక్షకసాధనమగు జ్ఞానము కన్న మిన్న యన్నెము లేదు. జ్ఞానసాధన మన్నింటిలో భస్మధారణము శ్రేష్ఠంబు. భస్మము శివాభిధము. శాంతిపరవస్తుప్రదర్శకమగు రీతి భస్మము పరశివప్రదర్శకము. జ్ఞానకారణములగు శ్రుతివాక్యములు శ్రేష్ఠతరములు. జ్ఞానములలో శంభువిజ్ఞానం బుత్కృష్టంబు. ధర్మము వేదమూలము. అదిచోదనా లక్షణమైన యర్థమని నిర్వచింపఁబడెను. వేదేతరములైన యాగమాదుల యందుఁ గూడ ధర్మములని యాస్తిక్యసామాన్యగుణము మాత్రము నాశ్రయించియే కేవలము వ్యవహరింపఁబడుచున్నవి కావున ధర్మము

నను వేదోక్తమైనది ముఖ్యార్థమును నాగమాద్యుక్తములు గుణార్థములు ననియెఱుంగునది.

సీ. వేలుపుంగములందు ఫాలనేత్రుని వంటి
వేల్పొక్కఁడున్ లేనివిధము గాఁగ
నాహారముల యందు నన్నముం బోలిన
యాహారమే లేనియనువు గాఁగ
నేఱుల యందు మిన్నేఱుతోఁ దులతూఁగు
నేఱొండు గలనితీరు గాఁగ
బలుపత్తనములందు వారణాశికిఁ దగు
పత్తనంబులు లేనిభంగి గాఁగ
తే.గీ. మంత్రములలో షడక్షరమంత్రమునకు
సాటియగుమంత్ర మెసఁగనిసరణి గాఁగ
మానములయందు వేదసమానమైన
మాన మెయ్యెడ లేదు జగాన నిజము. 417

తె.గి. మానవులయందు బ్రహ్మవిజ్ఞానమొప్ప
వాని కుపమాన మొనరింపవలఁతి యయిన
వాఁడు గలని యట్టు లెప్పట్టునందు
శ్రుతికిఁ జాలెడి ప్రమితి యెఱుంగరాదు 418

శా. సంసారార్ణవవీచికానిచయశీర్షగ్రస్తలోకార్తివి
ధ్వంసప్రక్రియ యందు దక్షుఁడగు విద్యాదేశికస్వామి వి
ద్వాంసుం డెవ్వఁడు పోలు వేదసమశాస్త్రం బెచ్చటం గలు మీ
మాంసింపన్ శివువంటి దేవరయు సంభావింపగాఁ నబ్బునే? 19

చ. ప్రతిహతి లేని సత్ప్రరుతి బల్ శ్రుతియౌ బ్రతిలేనియట్టి దై
వతము శివార్ధజాని యగు పాటియెఱుంగని మేటివిద్య స
మ్మతమగు భస్మధారణము మాన్యజనున్ పరమార్థ మింత సం
చితముగఁ బల్కి దియ్యెడన శేషమనీషఁ బరిగ్రహింపుఁడీ 420

క. ఈమెయిఁ బల్కి కుమార
స్వామి యచటు వాసి చని యెసాంబపదాంభో

జామలపూజ లొనర్పఁగ
కామముల నొసంగఁజాలు కల్పక మగుటన్ 421

ఉ. అవ్వల నాషడానను దయన్ బ్రియమారఁగ స్వీయజాయపై
నివ్వటిలంగ జేసి నవనీవరకైరవమిత్రనేత్రముల్
మవ్వ మెలర్పఁ దాలిచి సమస్తసురావనకేలి శూలి చి
ర్నవ్వులు మోముఁదమ్మి పయినాట్యము లాడఁగ దర్శనం బిడెన్

ఉ. చూచిన యంతనే మునులు చూడ్కుల విందొనరించుకొంచు వే
లేచి నమస్కరించి బహుళకృతసన్నుతులైన వారికిన్
బ్రోచెను జ్ఞానదానమిది భూధరరాజసుతామనోహరుం
డే చతురుండు మోక్షమిడు నీశుని భంగి నెఱుంగుఁ డిందఱున్

ఉ. చాలఁగ శూలి నీగతిఁ బ్రసన్నుని జేసి కృతార్థులై మునుల్
బోలి పురాకృతమ్ములగు పోసములన్ భరజాలఘోరజం
బాలవిశోషణక్షమశుభప్రదదర్శనమాననీయులై
రేలవచింపఁ బెక్కు వినుఁడిట్టివి శైవకటాక్షభాగ్యముల్ 424

ఉ. వారు కృతార్థులైతి మని భావములందున నెంచికొంచు నీ
హారధరేంద్రభాసురగుహప్రకరమ్ములఁ గాఁపురమ్ము లిం
పారఁగ నుండఁ గోరి జనిరయ్యెడ నొయ్యన శీతభూధర
స్ఫారగుహాంగణమ్ములెటువంటి పవిత్రములై యెసంగునో 425

చ. చెలఁగుచు నింతవట్టుకు వచించితి నేను విశిష్టధర్మము
జ్జ్వలమతులార! యింకఁ బలు పల్కులు పల్క వృథాప్రయాసమే
కొలువుల సంగ్రహింపఁగ నగున్ వితఁబొల్లుల సంగ్రహించుచో
నలఘుమతిన్ వరింపుడుఁ రయంబుగ నాత్మపదార్థబోధముల్ 426

## 21. ముక్తిసాధన కథనము

వ. మఱియు సూతుం డిట్లాడం దొడంగె

క. నుడువుదు ముక్తికి సాధన
మడుగని శ్రద్ధను వినుండు యోగ్యతమంబై
యడరున్ శ్రుతివిహితపథ
మ్మొకఁగుసె కడగండ్లు దాని మానక యున్నన్ 428

చ. మునులు మునీంద్రులున్ దివిజపూర్వఋషీశ్వరు లెల్లరున్సనా
తను లగువారు ద్వాదశశతప్రథితాంచితసంఖ్యవారు నె
మ్మనముల ముక్తిసాధనముమాటికినిం దెలియంగఁ గోరి సం
జనితవిరాగులై యభవసన్నిధిఁ గోరుచు నుండి రెంతయున్ 429

సీ. ఎద్దాని దర్శింపనెల్లపాపంబులు
బూదియౌ వహ్నిలోదూదివోలె
నెచ్చోట భక్తులకీశ్వరుం డెప్పుడు
ముక్తిమార్గంబునుమొనసిచూపుఁ
బ్రీతివర్షమును ద్విజవరులకెచ్చట దాన
ములు సల్ప భవబంధములు నశించుఁ
బిడికెడు బియ్యంబునిడిన నెత్తావున
దురితసంఘము లెల్లతొలఁగిపోవు

తే.గీ. నేది సంసారవిధ్వంసనేద్యకీర్తి
కాకరమ్మగు నారజతాద్రియందు
ధన్యమతిఁ జేరకొనినా రుదారభక్తి
యుక్తులైన మునుల్ ముక్తిసక్తు లగుచు 430

చ. తపము జపమ్ము నధ్వరముదానము నచ్చట సల్పమాత్ర ఋ
క్షపతికిరీటసత్కృప నెసంగు ననంతఫలప్రదంబులై
యెపుడని మున్నెఱుంగుట నుమేశ్వరసన్నిధి బల్తపంబుచే
సి పరమయోగనిష్ఠలనుజితప్రముగాఁ జరియించి రెంతయున్ 431

చ. తలఁపు లొసంగు దీక్ష రజతక్షితిభృద్వరమస్తకోల్లస
న్నిలయుఁడు నొక్కకేలఁ గొనిసీటుగ రెండవ కేలఁ బార్వతీ
లలితకరాంబుజమ్మును విలాసమెలర్పఁగఁ దాల్చి వచ్చి మౌ
నులకును దర్శన మ్మొసగెనూత్ననిధానవిధాన మూనుచున్ 432

చ. సరగున వారు శీతనగజావరుముందటఁ గాంచి భక్తి ము
ప్పిరిగొన లేచి దండనతిఁబేర్చిన రీతిని దీర్చి యవ్వలన్
గరముల దోయిలించి శితికంఠ మమున్ దయఁ జేసి ముక్తికిం
దెరువులు దెల్పుమంచు బలుతీరుల వేడిరి దీపితాస్యులై 433

తే.గీ. ప్రార్థనమ్మును విని భక్తవత్సలుండు
గాన వారిని మూఁడు జగాలవారిఁ
బ్రోవ సమకట్టి తత్ప్రశ్నమునకు బదులు
నుడివె వారలు సద్భక్తిఁ గడు వినంగ 345

క. శ్రుతివిహితధర్మమున్ స
మ్మతి మీర నొనర్చువాఁడు మాపతికరుణన్
క్షితివిప్రకులమునం దం
చితముగ జనియించు మృతినిఁ జెందిన వేళన్ 346

తే. జాతకర్మాదిసంస్కారపూతుఁ డగుచు
జన్నిదమ్ము దాల్చి వటువయి సకలవేద
ములను గురునొద్ద నేరిచి ముగుద నొకతెఁ
బెండ్లియాడి తపోయజ్ఞవితతి నతఁడు 347

ఉ. కోరికలే చేసియన ఘుండయి చిత్తవిశుద్ధి నొప్పి పా
కారిముఖాదిలోకములఁ గాసలు గొల్పక జ్ఞానసూనమున్
గోరి చతుర్థమాశ్రమము గోపతివాహనసత్కటాక్షశ్రీ
గారవనిన్ మెలంగి యటగై కొని శ్రేయము గాంచు ధన్యుఁడై 348

వ. చతుర్విధసన్యాసాశ్రమములలోఁ గుటీచక, బహూదక హంసా
శ్రమములను నీశ్వరానుగ్రహము వలనఁ బరమహంసవృత్తిని వర్తిం
చినచో ముక్తి వారి సమీపవర్తిని యయి కురంగట నిజవిలాసస్ఫూర్తితో
నర్తించు నన్నుటకు సందియమ్ము లేదు.

సీ. అగ్నిరిత్యాదిమంత్రాన్వితంబుగ బూదిఁ
బూసి త్రిపుండ్రముల్ పూను టొకటి
పార్వతీవామాంగ భవ్యలింగమునందు
నేత్రపొద్దునం బూజలిడుట యొకటి
యామ్నాయశీర్షవిద్యారామసీమవి
హారసంతోషంబులందు టొకటి
గురుచరణాంభోజవర సేవనాసక్తి
హృదయధన్యతఁ గాంచి యెసఁగు టొకటి

తే.గీ. పరమహంసకు ధర్మమైనపరగు నభవు
కృపనుదొల్లింటిపుట్టు సుకృతమహిమను
జీవుఁడే బ్రహ్మమౌ ననిభావ మొదవు
పరమహంసాఖ్యసన్యాసివరుని కరయ. 450

మ. నిగమాంతోదితవాక్యసంజనితనిర్ణిద్రప్రభావంబు చె
ప్పఁగ శక్యంబె ముముక్షుభిక్షునకు దివ్యన్మోక్ష మద్దానిచే
నగు సంపాద్యముగాదు ముక్తిసుఖమన్యంబైన నెద్దాననే
జగతిన్ జూడగ నెట్టివారి కిదియౌసత్యంబు ముమ్మాటికిన్ 452

శా. సంసారార్ణవతారకుం డభవుఁ డీశానుండు దుర్మోహవి
ధ్వంసప్రాకటసత్కళావిభవసంభావ్యుండు ధీమన్మనో
హంసస్వర్ణసరోరుహాకరము స్వాత్మానందసంధాయియై
హంసజ్ఞానము దెల్పి మౌనులకు శ్రేయంబిచ్చి యేఁగెన్ వెసన్ 65

వ. మీరు నావలన శివపరజ్ఞాన మొందినవారైతిరి పుణ్యస్థలంబుల నెల్ల మిన్నయగు దక్షిణకైలాసంబు సర్వకామితార్థప్రధానవిలాసంబు దక్షిణకైలాసదర్శనమునఁ గాక వేఱొండుమార్గమున సంసార ముడివోవదు. శివసర్వదైవతాధిక్యమొప్పకున్నఁ గోటిజన్మములకైన ముక్తిసున్న.

సీ. వర్ణాశ్రమాచారవరసమాచరణము
ర్ధన్యులే ముక్తికిం దగెడివారు
జీవేశ్వరైక్యవిశిష్టవిజ్ఞానధౌ
రేయులే ముక్తి వరించువారు
పద్మలోచనపద్మభవనాకధవముఖా
ర్చకజనమ్ములె ముక్తిపాత్రువారు
వేదాంతవిజ్ఞానవిమలాత్మతత్త్వబో
ధజ్ఞులే ముక్తి కిఁదనరువారు

తే.గీ. పలుపలుకులేల వినుఁడు సర్వజ్ఞుఁడైన
శివుఁడు విజితేంద్రియఖ్యాతిమివుల నలరు
సంయమీంద్రులు జ్ఞానంబుచాలకున్నఁ
బడయనేరరు కైవల్యపదము నిజము 355

## 22. మార్గప్రామాణ్య వర్ణనము

వ. వైదికములనియు వేదవిరుద్ధములనియు మతము లిరుతెఱంగుల పురాణేతిహాసధర్మశాస్త్రములు వేదవేదాంగోపవేదములును గాపాల కామిక లాకుళ వైష్ణవ బ్రాహ్మ సోమ పాశుపత భైరవాద్యాగమములును బౌద్ధార్హతాద్యాగమములును దర్క సాంఖ్య లోకాయత మీమాంసాదిశాస్త్రములును భిన్నభిన్నప్రతిపాదకములయ్యు నీశ్వరచైతన్యమే తత్తత్ప్రవక్తల హృదయమునఁ బ్రవేశించి పలికించుటచే నీశ్వరనిర్మితములని నుడువఁబడెను. ఆస్తికములగు మతములన్నియు నీశ్వరసమ్మతములు. సకల నదులకు సముద్రుఁడు పరమావధి యగునటుల సకల మార్గములకు నీశ్వరుండు పరమావధి. ఏయేమార్గముల నెవ్వెల్వ భజింపఁబడినను నాయా మార్గముల నుపాసింపఁబడు దైవతము నుపాధిగాఁగొని యీశ్వరుండు తద్రూపములఁ గాంచి యనుగ్రహించి తత్తద్విశిష్టమార్గముల సాధకుని బ్రవేశింప సాయమొనర్చును. కాని యన్నిమార్గములు ముక్తిసోపానములు. కర్మాశ్రయులకు శ్రద్ధాజ్ఞానముల నొసఁగియు జ్ఞానజిజ్ఞాసువులకు జ్ఞానమ్మొసంగియుఁ గర్మజ్ఞానమార్గస్థుండయి యీశ్వరుండు తత్తదాశ్రయులకు శ్రేయఃప్రదాత యగు. ముక్తి నానారూప గాదేకరూప యగును. కావున శ్రుతీతరమార్గములును దత్తదధికారిజనములకుఁ బ్రమాణములగు.

సీ. సాకల్యమెఱుఁగుదీర "యేకమేవాద్వితీ
యం బ్రహ్మ" యని పల్కు లలరఁ బల్కఁ
జాలచింతింప 'స'శబ్ద మస్పర్శమ
రూప మ్మనుచు నీశ్వరుని వచింప
"బ్రహ్మ యో వేద స బ్రహ్మైవభవతి స
త్య" మ్మంచు ఘంటాపథమ్ము తెలుపఁ
గన నెంతయును నిర్వికారనిరంజన
పురుషుం డుమేశుఁడన్ బోధ మెసఁగ

గీ. శ్రుతిని బోలెడి వేఱొక్కచొప్పునెందు
గాంచమెన్నండు నితరమార్గములు సతము
బల్కఁజాలు నవిద్య వేర్భంగులొప్పు
విద్య వెలయింపఁ జాలవు పెఱతెరువులు.

ఉ. కావున వేదమార్గములకంటెను భిన్నములైన యట్టి బల్
త్రోవలు ముక్తిఁగాక పెఱత్రోవలయందుఁ బ్రమాణమౌ నవి
ద్యావిధులుం బ్రమాణమగునారయ ముక్తికిఁ జేర్చు మెట్టులై
భావజవైరి కాస్తికులపట్టుల మెండగుఁ బక్షపాతమున్ 358

తే.గీ. జ్ఞానసంధానపరులచేసరగఁ బరమ
ముక్తి నిచ్చు నుమాప్రియమూర్తి యెప్పు
డన్యభక్తుల కొసఁగు నత్యంతమైన
శ్రద్ధ పరమార్థముం జేర్చుసరణులందు. 359

మ. శ్రుతిమార్గంబున సంచరించుసుజనస్తోత్రార్హుఁడెన్నండు వి
శ్రుత వేదాధ్వము వీడి యన్యమత మార్గాదిన్ గ్రహింపంగ రా
దతులామ్నాయనయప్రశస్తగమనాయాసం బెపెండోర్చు వాఁ
డితరాలభ్యము భుక్తి ముక్తి గను నెంతే నబ్బురంబయ్యెడున్

క. అధికారితారతమ్య
ప్రధానముగ సర్వశాస్త్రపద్ధతులు ప్రమా
ణధురంధరములుగద యె
వ్విధ నరసిన బ్రమితి గననివిధులుం గలవే? 361

ఉ. వేదవిరుద్ధమార్గ మవివేకులకున్ ఘనపుణ్యమార్గసం
పాదనముం బొనర్పఁగలమార్గముగాఁ దలపోసికాదె భూ
సాదుల కొసగొల్పి రయమార మృగాదులఁ బట్టినట్లు ని
ష్ఠాదు లొసంగి యత్తెరువులందున ద్రిప్పు హరుండెఱుంగఁడే 362

మ. తొలుతన్ క్షుద్రమనోభిలాషిజనసందోహంబులన్ వారి కో
ర్కులు చెల్లించి క్రమక్రమంబుగలసద్గోప్యామలజ్ఞాన ము
జ్జ్వలవాత్సల్యము మీఱ బోధమొనరింపన్ నేర్చి యామీఁద ని
శ్చలమోక్షంబు ననుగ్రహించు హరుఁడశ్రాంతంబు నిర్దంభుఁడై

క. శ్రుతి మార్గప్రామాణ్య
స్థితి యిట్టిది విమలమతులుస్థిరతరభక్తిన్
శ్రుతిమార్గము మన్నింపుం
డితరపథములేల? యింకనేఁగగ మీకున్ 364

## 23. శంకరప్రసాదక్రమవర్ణనము

క. ఏగతిఁ జరియించినచో
నాగాభరణప్రసాద నవ్యశ్రీలన్
వేగైకొనఁదగు దానిన్
నేఁగడు భక్తిని వచింతు నేర్పున వినుఁడీ: 365

క. మును సత్యపరాయణుఁడా
సనత్కుమారాఖ్యుఁ డనరు సంయమిచంద్రుం
డనువొప్ప దీని నడిగెన్
వనజాసన బ్రహ్మనిష్ఠ వరవినయముతోన్ 366

ఉ. న్యాయమె నే వచింపనిది హారివచోరచనావిలాసధౌ
రేయుఁడొకండు గల్గఁగృత కృత్యులమౌదుము వాని యొద్దకుం
బోయి యెరుంగువార మని ముచ్చటలాడుచు వారితోడ నా
రాయణు సన్నిధానమున కంబుజసంభవుఁ డేఁగె భక్తితోన్ 367

క. మచ్చిక దగ్గరి వారల్
వచ్చినపని దెల్ప హరియుఁ బన్నగభూషుం
డెచ్చటనుండునొ కని మన
మచ్చటి కరుగుదుముగాక యని వచియింపన్ 368

క. అమ్మువ్వు రొక్కపై చె
ల్వమ్ముల కిల్లనఁగఁదగిన పావనకైలా
సమ్మునకు నభవుఁ గొల్వఁ బ్రి
యమ్మునఁ జనుదెంచి గాంచి రమలు మహేశున్. 369

ఉ. పెన్నిధిఁ గాంచునట్టి నిరు పేదలఁ బోలి ముదంబునొంది భ
క్త్యున్నతి మీర దండనతు లొయ్యన నర్పణ చేసి యవ్వలన్
మిన్నకయున్న వారిఁగని మీరరుదెంచిన కార్యమేమి నా
కు న్నుడువంగ రాదె యని గోమణివాహనుఁ డాదరంబుతోన్ 370

క. పలికిన నళినాక్షుండో
యళికాక్ష నీప్రసాద మలవడుగతి నీ

వలనన్ దెలియఁగ వచ్చితి
మలరింపుమ దాని దెల్పి యని వాకొనియెన్ 371

తే. జలదగంభీరవాక్యముల్ శ్రవణపుటము
లమృతధారల బలెఁ గ్రోల నచ్యుతాదు
లకును రుచియించు నట్టుల హరుఁడు గిరివ
రాత్మజోపేతుఁడై పల్కె నతులగతుల 372

ఉ. నాఁడు సనత్కుమారుఁడు పినాకి వచింపఁగ విన్నయట్లు ము
న్నాడిన దాని నంతయును వ్యాసమహర్షి గ్రహించి నాకు బల్
పోఁడిమి మీరఁ జెప్పె మును పుణ్యులు మీరలు గాన మీకు నే
నీడ వచింపువాఁడ గ్రహియింపుఁడు సారవిచారచిత్తులై 373

వ. త్రిలోచనుఁడు పద్మలోచనున కెఱింగించిన తెఱంగు వినుండు.

చ. సతతము నిత్యకర్మములు సల్పి విశుద్ధతరాంతరంగుఁడై
శితిగళు సత్కృపామహిమచే భవభోగవిరాగమొంది క
ర్మతతి పరిత్యజించి తుది మామకతత్త్వ మెఱింగి ముక్తిసం
గతుఁడగు టెల్ల వాస్తవము గాదె సదా కమలామనోహరా 375

వ. మద్ధ్యానం బలవడక ముం దుపాస్యదేవతలయందాయా దేవతలు
తత్తదధీనఫలముల నొసంగుదు రదెట్టులనిన వినుము. 376

సీ. పద్మసంభవకృపాప్రాభవమ్ము లెసంగ
దాంతిశాంత్యాదిసాధనము లబ్బ
దామోదరకటాక్షధామ మేపారగా
కొదవెఱుంగని ముముక్షుత్వ మమరు
గజరాజవదనసత్కరుణాలవంబున
శ్రీగురువరపాదసేవ లొలయు
దేశికస్వామిసంతృప్తిపర్యంతమ్ముఁ
గొల్వఁగా ధ్యానమ్ము కొమరు మిగులు

గీ. నంబ దయగల్గ విమలసాంఖ్యంబు వెలయు
సాంఖ్యవిజ్ఞానసంపత్తిఁ జటులభవభ

యమ్ము నిర్మ్మలమొనరించు నలఘువైన
సంవిదైశ్వర్య మలవడు సత్యమిదియ. 377

ఉ. చేతఁ దెంపజేన్ గలుషదేహుఁవమై క్రమముక్తి నీయఁగా
చే లుగ్గలువా రరయ శీతధరేంద్రసుతాధవుండొకం
డె వెలదెని మోక్షసుఖ నీయ స్వయమ్ముగ దాన చాలువాఁ
డో వనజాక్షి నిక్కమిది యొక్క రహస్య మెఱుంగఁగావలెన్ 378

మ. పలుజన్మంబులఁ జిత్తశుద్ధి కడుసం పాదించి స్రౌఁబల్కు త్రో
వలనెల్లన్ బరికించి స్మార్తవిధులన్ బాటించి సత్కర్మని
ర్మలధర్మంబగు వాఁడు శంభుమతమ ర్మంబుల్ విలోకించి ని
శ్చలభక్తిన్ శివదేవుఁగొల్వ వలయున్ జకార్యియుధా! సర్వదా 379

చ. మనువుల నెల్లనుం బ్రణవ మంత్రము వేల్పుల నెల్లనున్ శివుం
డనుపమపూజనమ్ముల హ రార్చనమున్ వివిధస్వరూపవే
దనముల నాత్మవేదనము దారి చరిత్రలయందు నందివా
హనచరితమ్ము మిన్నలగు నంచు నెఱుంగు ముకుంద! యెయ్యెడన్

శా. ఓంకారాలఘువైభవంబున ముకుం దోద్యత్ప్రభావంబునన్
శంకాభావశశాంక శేఖరపదా బ్జాతైకసంసేవనే
ద్ధాంకూరమ్ములు మొల్కలెత్తు నటుపై శర్వార్చనాదక్షుఁడై
సంకీర్త్యంబగు జ్ఞానమొంది వరమో క్షంబున్ దగన్ గైకొనున్

సీ. దేవయానము బ్రహ్మ దేవునారాధింప
నారోగ్యవైభవ మర్కుఁగొల్వ
యశము బ్రాహ్మణ్యంబు నమృతాంశు సేవింప
నైశ్వర్య మగ్నికి నర్చలిడఁగ
పితృయాణమును బ్రేత పతిఁ బ్రసన్నుంజేయ
వాసవున్ భజియింప వైభవంబు
కార్యసమాప్తి వి ఘ్నపతి నుపాసింప
సర్వసిద్ధి షడాస్యు సన్నుతింప

గీ. బలము వాయువుఁ బూజింపఁ బలుకుతీరు
భారతికి నంజలింబట్ట భాగ్య మబ్ధి

కన్య కెఱఁగిన విజయంబు॥గౌరి మ్రోల
నతులు చెల్లింపఁగల్గున॥ల్లితులమతుల 382

క. శివునను నమస్కరించిన
భవదోషవినాశదక్ష॥పావనబోధో
త్సవమున్ సంతతమగు ని
ష్కవమియ్యది దీని దెలిసి॥కొనవలయు బుధుల్‌! 383

ఉ. కోరిక తీర దేవతలఁ॥గొల్చిన వారికి దేవతల్ సదా
కోరిక లీయఁజాలుదురు॥కోర్కుల వీడి భజించువారికిన్
సారవిశుద్ధమానస ప్ర॥సన్నమహేశ్వరసత్కటాక్షభా
పూరము గల్గ వెలుపుగ॥ముల్ దయసేయుదు రబ్జలోచనా! 384

తే.గీ. కాములకు భుక్తి నిచ్చు న॥కాములకును
ముక్తి నొసఁగునుమాధవ॥మూర్తి సుప్ర
సన్నుఁడై యొప్పువేళల॥చక్రిపాణి
భుక్తిముక్తులు హరపూజ॥బొలుపు గనుము. 385

మ. అజదేవేశవిధాదిలోకములు నీ॥హారాద్రిజామానసాం
బుజభృంగాయతఫాలలోచనకృపా॥పూరంబునం గాక యే
సుజనానీకములైన బొందఁగల రే॥శుద్ధాత్ములేయైన వా
రిజనాభా! యభవప్రసాదమొక దే॥రిన్ ముక్తులం జేయదే? 386

సీ. బ్రాహ్మణుం డగుఁగాక॥బాహుజుం డగుఁగాక
వైశ్యుఁడే యగుఁగాక॥పాదజుండ
యగుఁగాక సంకరుం॥డగుఁగాక పాషండు
డగుఁగాక యధముఁడే॥యగునుగాక
పసిపాపఁడగుఁగాక॥ప్రౌఢవయస్కుఁడౌఁ
గాక ముదుసలియౌఁ॥గాక నాలి
గాడిద యగుఁగాక॥కడకుఁ గుక్కగుఁగాక
పురు వగుంగాక బ॥ల్లి రువ యగును

తే.గీ. గాక శంకరుదయ యింత॥గలుగు నెడల
ముక్తి గాంచుట యొక్క యబ్బురము గాదు

గద సదావైదికాచారఘటితదీక్ష
లైన వారికి శివుకృపఁగాని దేది 38

తే.గీ. నలుసు కొండంత గొండయునలుసు నంత
యగును శంభుని కరుణాకటాక్ష మమరు
పరమభక్తుండు కేవలమరసియాన
తీయు మాత్రిన నిజము సుమ్మీ యుపేంద్ర! 3 8

తే.గీ. అబ్జనాభాబ్జసంభవాద్యఖిలసురులు
పుట్టుచావులు గందురేదిట్ట యాన
శిరము నందు ధరించి యాశివుని సుప్రి
సాదమహిమంబు నుడువంగశక్య మగునె?

తే.గీ. శంకరుఁడు శాంకరియుఁ దప్పసకలసురులు
వేదములు గూడ శంభు ప్రసాదమహిమ
మింత యెఱుగంగఁ జాల రనంత యనఁగఁ
జంద్రధరుకృప వర్ణింపశక్యమగునె? 390

వ. కావున శర్వప్రసాదార్థులై కాలంబు వ్యర్థంబుసేయక తొలుత గురుచరణంబుల మనసున నిలిపి మీరలందఱు వ్యాఘ్రపురంబున నభ్రిసభామధ్యంబునఁ బ్రాలేయాచలాత్మజాసమేతుండై తాండవించు నావేదండచర్మాంబరు దర్శింపుఁడు మఱియు శ్రీకాళహస్తీశ్వరునకుఁగాని కాశీవిశ్వేశ్వరునకుఁగాని మ్రొక్కుటయు నవ్వేల్పు మిన్నఁ గన్నెత్తి చూచుటయును శివప్రసాదహేతువులగు దేవతార్చనయుఁ గర్మాచరణము శివప్రసాదసిద్ధికొఱకని తెలియుము శివప్రసాదమే లేనియెడ భుక్తిముక్తులును దివిజాది సర్వప్రపంచమును శూన్యంబు లగు. 391

క. హిమవజ్జామాతృ ప్రసా
దముతోఁ దుల లేదొకండుదానికి నొక్కం
డమరదు హెచ్చైచ్చ వినుమా!
విమలంబది శివపదారవిందముఁజేర్పున్ 392

ఉ. భవుని ప్రసాద మబ్బునెడవైదికకర్మచయమ్ములేల తం
త్రవిధిశతమ్ములేల శతధా పరికింప శివప్రసాదమే

భవమును జావునుం గెడపుఁ బాటవముంగల యట్టిదౌట మీ
రవిరళభర్గదేవకరుణాప్తికి నైజతపంబు సల్పుఁడీ 393

## 24. ప్రసాదవైభవము

మఱియు శివప్రసాదమహిమంబును వాకొనువాఁడ శ్రద్ధనం
దఱును వినుండు మీకొక కథన్ వినిపింతును దొల్లి శూద్రుఁడొ
క్కరుఁడు బలాఘసంఘటనకార్యధురంధరుఁడౌట దుర్ఘటా
ఖ్య రహిఁ జెలంగువాఁడు గడుఁ గట్టిఁడియై చరియించు నెప్పుడున్

గీ. వాని సాహస మింతని పలుకఁగలమె
ముందువెనుకల తలఁపు లెప్పుడును గనక
యెంతదురితంబు నైన ఘోరంతలోన
చేసి తీరును లోక మచ్చెరువు నొంద 3–5

ఒకనూఱుమంది నూరక బాపలన్ బట్టి
కుత్తుకల్ కత్తితోఁ గోసినాఁడు
లేగడ్డి పోఁచలలీల నూఱావుల
లేఁగలార్వఁగఁ దలల్ ద్రెంపినాఁడు
క్రొవ్వి దీనులతో నిరోధించి వారి మం
దిరశతంబులు గాల్చి తీరినాఁడు
లోఁతునీళ్లైపారు నూతులు నూఱింటి
వేరంబు గొని పూడ్పించినాఁడు

కంటఁబడ్డ సతీమణిఁ గావరించి
బల్మిమై బిగికౌఁగిళ్ళఁ బట్టినాఁడు
గురువరేణ్యుల ధనమైన సరకు గొనక
తస్కరింపంగ దీక్షలం దవిలినాఁడు. 3౯౦

వాపీకూపతటాక
వ్యాపృతజలములను జెఱచు వ్రతమొకటూనెన్
బాపెన్ వర్ణాశ్రమధ
ర్మోపేతవిధానశతము లోపిక కలిమిన్ 3౯7

క. వేపుట్టువు లతఁ డొందిన
నేపుట్టువునందొ కాని యెలమిన్ గాసున్
జేపట్టి శివవ్రతునకు
నేపగిదినొ కాని దానమిచ్చెన్ దెగువన్ 398

క. దానన్ మరణించెడి సమ
యానన్ వానికిని నొక్క యమలినమతియున్
మానితరీతిం బోఁచెన్
గాననిటుల్ దలఁచి వాఁడు గడు దుఃఖించెన్ 399

చ. ఒనరిచినాఁడ నింతకుమ బోద్ధత వృత్తిఁజరించి యేను దో
షనిచయ మద్దొసంగులకు శాంతి యెటుల్ ఘటియించునాకు ఘో
రనరకవాసదుఃఖములు ప్రాపిలకుండు నుపాయమారయన్
సునిశితవేదబోధసర సున్ గని మ్రొక్కెడి వేడు టేయగున్ 400

క. ఆపాదజుఁ డీగతి సం
తాపింపన్ వాని యెదుట దర్శన మిడియెన్
బాపాపనోదనుం డొక
బాపఁడు తొలిపల్కు గన్న పాపఁడు దయమై 401

తే.గీ. పారుఁ డేతెంచి వానితోఁ బలికె నిట్లు
ఘోరతరశోకమున మునిఁగి కుమిలకు మిఁక
నీవు నిరయాన ఁబడకుండు నెఱతెఱంగు
నొకటి వచియింతు సల్పుమీ వోపుదేని 402

ఉ. వింటివొ లేదొ వ్యాఘ్రపుర విశ్రుతశైవమహాస్థలంబు ము
క్కంటి భవాబ్ధితారకుఁడు కన్నులముందరఁ దాండవించు న
న్నింటను దానగలుననునిక్కువమక్కడ వెల్వరించు నీ
వంటి దురాత్ము నోము ననిపల్కఁగ నేల గ్రహింపుమెప్పుడున్ 403

సీ. విశ్వమయుండయ్యు విష్ణుం డభవుఁగూర్చి
యపరిమితంబైన తప మొనర్చె
వేలుపుఁ బెద్దయ్యు విధి యీశ్వరుంగూర్చి
బలుతపోనిష్ఠలన్ బరిఢవిల్లె

వజ్రహస్తుండయ్యె వాసవుం డవికాశ
గూర్చి తపము చేసి కొనె జయముల
సురలయ్యె యక్షకిన్నరు లర్ధచంద్రశే
ఖరు గూర్చి సల్పిరి పరతపముల

గీ. నెచటి మాహాత్మ్యమెఱుఁగుట నెలమిమీర
నచ్చొటగుగద యెఱుఁగుమ వ్యాఘ్రపురము
దానితోఁబోల్ప నెయ్యది ధరను దొరకు
దానితో సాటి యయ్యది యౌను దలఁప 405

చ. సరసిజజన్మవజ్రిధర సారసనాభసురాసురాదు లే
గురుతరమైన క్షేత్రమున గోతురగున్ భజియించి తత్ర్పసా
దరుచిరలక్ష్మి గైకొనిరి దానిని వ్యాఘ్రపురంబు గాఁగనీ
వెఱిఁగి యటన్ త్రినేత్రు భజియించి ప్రసాదము నొందుమియ్యెడన్

వ. విప్రుం డిట్లుపదేశించిన దుర్ఘటుండు వ్యాఘ్రపురమ్మున కరిగి, తీర్థోదకమ్ముల గ్రుంకి, శ్రద్ధాపురస్సర ప్రదక్షిణ నమస్కారమ్ము లర్పించి నమోఽంతమ్ముగ శివమంత్రముఁ బఠించి, శ్రీమదభ్రసభామధ్య లీలాతాండవ పాండిత్యమండనుండైన పార్వతీజాని దర్శించి, దండ నమస్కారముల నవ్వేల్పుఁ బ్రీతుం జేసి, భస్మోద్ధూళితసర్వాంగుండు నంగనావామాంగపాదసరోరుహభృంగుండు శివజ్ఞానైక నిష్ఠాంతరంగు డును నగు విప్రోత్తమున కొక్కనికి ధనధాన్యమ్ము లొసఁగి సంతసిం పుచు మూఁడేండ్లట వసించిన నప్పుణ్యవశంబున నతఁడజేయగేయగుణ ధౌరేయుండయ్యె. 407

సీ. కల్లలేగాని పల్కంగ నేరని వాఁడు
సతమును సత్యవాక్కృతురుఁడయ్యె
దేవళంబుల జూచి యేవగించెడి వాఁడు
పరమేశభక్తి సంపన్నుఁడయ్యె
మిన్ను మన్నున్ మ్రింగు మేటి రోసపు వాఁడు
రమణీయశాంతాంతరంగుఁడయ్యె

కనుగొన్నదానిపై మనసు నెఱపువాఁడు
నిష్కామసత్కార్యనిపుణుఁడయ్యె
గీ. నవనినధమాధముం డయి యలము వాఁడు
సకలలోకాధిపతి యయి జరిగె జగతి
నెన్నొ నరకంబులం బడ నున్న వాఁడు
ముక్తుఁడై దుర్ఘటుండు సమ్మోదమందె 408
క. ఇట్టివి శివమాహాత్మ్యము
లిట్టివి శివగురులవలన నెసఁగెడి హితముల్
గుట్టులు దెలిపెడి దిట్టయె
యెట్టయినఁ దరింపఁజేయు నెన్నటికైనన్ 409

25. శివప్రసాదము—ప్రకారాంతరము

తె. వెఁడికొండను గాఁపుర మ్ముండువేల్పు
సుప్రసాదము వర్ణించు సుకవి యలవి
కాని ముదమంది సౌఖ్యఁద సత్కథల మఱల
మఱల నుడువంగ నోరూరు సమహితులార! 410
క. తెలిపెద మఱియొక గాథన్
దలపూవుగ నెల ధరించు ధన్యు ప్రసాదం
బలఘుశ్రేయ మ్మిడి యి
మ్మల నందఱ మోక్ష మొసఁగి ప్రోచున్ సతమున్ 411
చ. గొనముల పుట్టినిల్లు బహు గోవ్యతరాంచితశాస్త్రవాక్యసం
జనితవివేకలక్షణుఁడు సర్వశుభప్రదలక్షణుండు హృ
ద్వనజవినిర్మలుండు నగు బ్రాహ్మణుఁ డొక్కఁడు సత్యసంధసం
జ్ఞను దయివారు వాఁడుహరిఁ జక్రిధరున్ భజియించు నెప్పుడున్ 412
సీ. అతడుఁ బ్రతిష్ఠించు నచ్యుతాయతనముల్
పెక్కువైకుంఠాల నిక్కు వడచు
నతఁ డభ్యసించు శ్రుత్యంగముల్ శ్రుతులు బ్ర
హ్మాదుల బలుమెప్పు లంది యొప్పు
నతఁ డొనర్చిన కేశ వాంఘ్రిసపర్యల

విరు లీగి ప్రేమాంకులు విరులం గేరు
నతఁడు పూజించెడి హరిభక్తు లచ్యుత
స్వాములే మతిపెఱ వారుగారు

గీ. విష్ణుపుణ్యస్థలమ్ము లవెదుక నొక్క
డైన నాతఁడు దర్శింపనదిగలుగదు
ధన్యతను విష్ణుదివ్యమంత్రముల నెల్ల
నతఁడు సద్భక్తి జపియింపనదియు లేదు. 413

క. నిజసకలకనకవాహన
రజతాదుల విప్రవరుఁడు రాజితభక్తిన్
భుజగేంద్రశయను భక్తుల
భజియించి యొసంగె ముదము వారి కెసంగన్ 414

ఉ. పూజలొనర్చు వానికిఁ బ్రమోదము లెచ్చ మురారి మెచ్చి వి
భ్రాజితశంఖచక్రముఖవైభవముల్ దనరార నీలనీ
రేజదళప్రభోజ్జ్వలశరీరము సారెకు ముర్వులీన నం
భోజదళాక్షుఁడయ్యెడ నపూర్వవిధాంచితదర్శనమ్మిడెన్. 415

ఉ. కన్నులఁ జూచినంతట నెగల్భయంబును సంభ్రమంబునున్
బన్నుగమాన్పి కాంచుపిదపన్ నతిఁజేసి యఖండభక్తితో
డ న్నుతులన్ వచింపగఁ దగడంగె నతండు లసద్వచఃప్రభా
వోన్నతి మీరఁ బల్కులకు యోగ్యత చేకురుపట్టులేగదా. 416

వ. అతం డెట్టివిధంబున నుతించె నన

దండకము: శ్రీక్షీర పాథోధిజామాన సాంభోజరాజద్విలాసోల్ల సద్బాం భరా! విశ్వవిశ్వంభరాధ్యక్ష! పద్మాక్ష! కుక్షిస్థ నానాజగన్నిర్మితిస్థాపనాది క్రియాదక్ష! గోగోపికాగోపనావాస సంరక్ష! సద్భక్త విక్షేపణావారక ప్రాకటానంతశక్తిద్వయీనాశదీక్షా! విపక్షాసురానుగ్రసచ్చక్రి చక్రాయుధా! నిత్యశుద్ధప్రబుద్ధైతముక్తస్వభావా! జితార్కప్రభావా! ద్వితీయాద్యభావా! లస త్కౌస్తుభాభోజ్జ్వలల్లాంఛనా! కాంచనోదంచితస్వచ్ఛపీతాంబరా! చిన్నిరా ంబరా! కేశవా! విశ్వరూపా! యవస్థాత్రయద్రష్టృసాక్షీ! సమస్తావకాశాం తరవ్యాపృతాత్మా! పరాత్మా! సరోజేక్షణా! పద్మగర్భా! మునీంద్రాంత

రంగైకసింహాసనాసీన! గోవింద! నందాత్మజా! దర్పవత్కుండలీట్చారు భోగస్థలీమండలీతాండవఖ్యాతపాండిత్య! భోగీంద్రతల్పా! యనల్పాల్పసంకల్ప కల్పావనీజా! స్ఫురత్తేజ! తుష్యద్ద్విజౌజా! లసత్సచ్చిదానంద మూర్తీ! దిగంతైకకీర్తి! కృపాస్ఫూర్తి! దేవా నమస్తే! నమస్తే! నమః.

క. హారాంగదకేయూరో
దారలసన్మండనాయ ధన్యస్వాదు
స్మేరాననాయ కరుణా
పూరాంచితలోచనాయ భో వందేఽహమ్ 416

క. నారాయణాయ జగతః
కారణభూతాయ విపుల కారుణ్యాయ
క్రూరజనశిక్షకాయ న
మో రక్షితసజ్జనాయ పురుషాయ సతమ్ 417

తే. రాజితాఖిలవిశ్వాయ పూజితాయ
యోగిజనపోషకాయ దామోదరాయ
యజ్ఞరూపాయ యజ్ఞగమ్యాయ యజ్ఞ
ఫలవితరణాయ తే నమః పావనాయ 418

మ. నరకాంభోనిధితారణాయ విలసన్నారాయణాఖ్యాయ మం
దరభూమీధరభారనిర్వహణసందత్కూర్మరాజాయ భా
స్వరశయ్యాగృహసాగరాయ ఘనయజ్ఞక్షేమసంధాయకా
య రమాకోమలబాహుగాఢపరిరంభానందచిత్తాయ తే 419

క. నిత్యాయ నిరాధారా
యాత్యంతవిశుద్ధపావనాతఃకరణ
ప్రత్యలఘుపోషకాయ
ప్రత్యక్షాయ ప్రసన్నవదనాయ ముదే 420

క. అహ మర్పయామి భవతే
మహతే దండప్రణామమండన మధునా
సహభక్త్యా విలసచ్చ
క్రిహస్త తరసా గృహాణ కరుణార్ద్రధియా 421

క. మోహాన్వితసకలజగ
న్మోహంబులఁ జాలదవులు బోఁద్రోలి యటన్
సోఽహమ్మను జ్ఞానమ్మిడు
నోహరి మ్రొక్కెడుదు నొక్క యుపకృతి కొఱకై. 422

క. హరసుప్రసాదమే గతి
బొరియంగలవాఁడ నేను పురుషోత్తమబల్
కరుణను బలుకన్ వేదెదఁ
దరమే తెలియంగ నితర దైవమువలనన్ 423

క. అని సత్యసంధవిప్రుం
డన విని వనజేక్షణుండ నన్యసులభమే
ఘనినాదంబు వెలంగఁగ
వినుతఫణితిఁ బల్కె వీను విందు లెసంగన్ 424

చ. వినఁగదె! సత్యసంధ వృధివీసురవర్య! మదీయభక్తి స
జ్జననుతిపాత్ర ముక్తి నిడఁ జాలెడివారమె పద్మసంభవుం
డును దివిజేశుఁ డేనును గడున్ గడు నెంచిన ఫాలనేత్రుఁడే
యనుపమమోక్షసంపదల నందఅకిచ్చెడి వాఁడెఱుంగుమా 425

క. యోగిజనతల్లజుండు వి
రాగిజనశ్రేష్ఠుఁడగు పురహరునికంటెన్
భోగములిచ్చెడివాఁడెం
దేగలఁడే యెఱుఁగవలయు నీగోప్యమ్మున్ 426

సీ. లోకావనార్థ మాలోచించి హాలాహ
లంబు గుత్తుక నిల్పె డంబుమీర
కామమే గల్గ నిక్కరణి దీర్పఁగవలె
నంచు నిల్పె నిజాంగమందు సుదతి
వైరాగ్యమన్న నీ తీరని తెల్పఁగా
కంటిచిచ్చునఁ గాల్చెఁ గామదేవుఁ
గూళలందును దయ కొమరొప్పు ననిచెప్పి
కోడిత్రాఁచులఁ దెచ్చి కూర్చెనగల

గి. జగతివారలకన్నమర్జ్ఞాననేత్రి
మొక్కఁడెచ్చుగఁ దనకున్నర్యోజనెఱుక
పఱుపనేమొయనంగనుర్పాలనేత్రి
మొయ్య ధరియించె శివునకేర్యయ్యాయీటు 427

క. క్రిమికీటకిరాతాదుల
ః మలిన చిత్తమ్ము లొసఁగిర్యక్షయలోక
ప్రముదములఁ దనిపె నభవుం
డమరుల సముఁడొక్కఁడైనర్నతనికిఁ గలఁడే? 428

ఉ. మానుగ ఁదత్ప్రసాదగరిర్మంబునఁగాని లభింపదెందు నిం
తెనియు ముక్తిసౌఖ్యము సర్ధీశులకైనను గాన సత్యసం
ధా! నిజమియ్యదంచు శతర్ధా పరికింపుమ యందువల్ల నీ
కౌను విశేషబోధము పుర్రారి నినున్ దయఁ జూచుగావుతన్ 429

చ. అరయ నెఱుంగవచ్చుఁ బరర్మార్థము నాదిమకారణంబునై
వఱలెడి తత్త్వమందుదయిర్వారదు దేహము నింద్రియాదివి
స్ఫురణములన్ బరాత్మనకుఁర్బోల్పసముం డొకఁడెందులేఁడనన్
గురుతముఁడైన వాని కిధిర్కుండెట గల్గు నెఱుంగు భూసురా 430

ఉ. అయ్యది వాస్తవంబ యగుర్నైన హరాంచితశక్తి వింతయై
యయ్యయిరూపముల్ గల సర్మస్తజగంబయి వాసి గాంచి య
క్షయ్య మనాదియుంబలెనుర్గానఁగవచ్చును గాని జ్ఞానమే
వ్రియ్యలు చేయు దాని నితర్రమ్ములు పెంచును ద్రుంపవెందునన్

క. ఏనునజాదులునున్ వి
జ్ఞానాదుల నేని సుప్రర్సాదమహిమముం
బూని కననేర్తు మిఁక న
వ్వానికి మోచకులలో నెర్వండు సముఁడగున్ 432

క. మావంటి వేల్పులందఱు
ధీవర తోడ్తోన ముక్తిఁర్దెగి యిచ్చెదరే
పావనచిత్తమువారిన్
సేవింపం గలుగు ముక్తిఁర్జేకురుదానన్ 433

క. ఏతరి సాక్షిన్ముక్తికి
హేతువులము మేముకాము హిమగిరితనయా
చేతాబ్జషట్పదం బగు
భూతేశుఁ డొకండ యగును మోక్షదుఁ డెలమిన్ ‌ 4

ఉ. దైవతచక్రవర్తి యనఁ దగ్గ హిమాంశుకిరీటి సత్కృపన్
బోవనియట్టి దోషమును బుట్టనియట్టి శుభమ్ము గల్గునే
భావజవైరివల్ల దయి వారని వాంచలె గలినన్ మహా
దేవపదమ్ము సార్థమయి తీరుల నెట్టుల మీఱు నిమ్మహిన్ 435

క. వాదములేల "మహాంశ్చా
సౌ దేవో" యనెడి నుడువు సరణుల కిరవై
యేదైవ మమరు నతఁడు మ
హాదేవుం డనరుదెటు మహాదేవుఁడగున్ 436

క. కేవలదేవతలై పర
దేవతలెల్లరును వెలయ దివ్యమగుమహా
దేవాభిధార్థముల కగు
నేవేలుపు మిన్న యీశుఁడే కాకున్నన్ 437

క. భజియింపక వృషభాధిపు
భజియించిన నన్ను ముక్తి వలదు సుమీ
నిజముగను గోటిపుట్టుల
గజచర్మాంబరుని బ్రాపుగనవలె విప్రా! 438

ఉ. సువిమలభక్తియుక్తుఁడవు సూనృతవాది వుదారపుణ్యమూ
ర్తివి కనుకన్ రహస్యఫణితిన్ వచియించితి సంగ్రహంబుగా
శివునిప్రసాదవైభవము చిత్తమెలర్పఁగ నంచుఁ బల్కి శౌ
రి వెడలెఁ దత్క్షణంబు కృతకృత్యుఁడ యయ్యెధరామరేంద్రుఁడున్

ఉ. అలఘుఁడు సత్యసంధవసు ధామరవర్యుఁడు కేశవాజ్ఞ నౌ
దల ధరియించి శంభుని యథావిధి భక్తిఁదలంచెఁదత్కృపో
జ్జ్వలపరిపాకహేతువున వైదికసూక్తుల యంతరార్థమున్
దెలిసి శివాన్యదేవుల మదిన్ దలపోయక మోక్షమున్ గనెన్

ఉ. కావున మీరలెల్లరును గాలగళేతరదైవతమ్ములన్
భావము నందు నిల్పకయ పర్వతరాజసుతాకళత్రునిన్
భావజవైరి శర్వు హరు భక్తజనావన దక్షుఁ గొల్చి మీ
రేవిధినైన ముక్తిఁ గొని యెన్నఁడుఁ బుట్టువు నొందకుండుఁడీ. 441

క. పరమరహస్యము సత్య
మ్మిరవొందఁగఁ జెప్పినాఁడ నేను వినుఁడి సు
స్థిరవిశ్వాస మ్మస్మ
ద్వరసూక్తుల యందు నిల్పి వర్థిల్లుఁడొగిన్ 442

క. యతిగోప్యము శ్రుతిగోప్య
మ్మతిగోప్యము మీకు నుడివి నాఁడన్ దీనిన్
సతతమ్ము బ్రోవుఁడే దు
ర్మతులకు దెలుపకుఁడు సకల మాన్యుల్ మీరల్! 44

26. శివభక్తవిచారము

చ. భవునిప్రసాద మెంతకును బల్కఁతి దానికి మూలమైన హే
తువు వివరింతు నేను సుమ తుల్ మది మెచ్చెడి రీతి వీనుపం
డువులగు నట్టులియ్యెడ వి నుండు మునీశ్వరులార! ముక్తికిన్
శివునెడ భక్తిఁగాక యెది చెప్పఁగ వచ్చును హేతువం చొగిన్

క. శివముక్తి నాల్గు తెఱఁగులు
శివసాయుజ్య మ్మొకండు శివసారూప్య
మ్మవు నొకఁడు శివసమీప
మ్మవు నొక్కఁడు శివసలోక మన్నది యొకఁడున్ 445

క. అవ్వానిం గూరిచి మది
నివ్వటిలెడి భక్తి యగును నెఱినాల్గువిధా
లివ్వసుధ ననుచుఁ దెలియుం
డెవ్వరవున నైన నీశు నెదఁదలఁపవలెన్ 446

క. శ్రుతులందుఁ దదంతవ్యా
పృతవాక్తులందు శ్రవణ విధులందు లస
న్మతిమనననిదిధ్యాసాం
చితవిధులం దలరి నిలువ శివభక్తి యగున్ 447

సీ. పాప మ్ముడుపఁజాలు భస్మంబు బలంబుఁ ద
  త్త్వము దెల్పు బల్త్రిపుండ్రములఁ దీర్ప
రుద్రాక్షమాల నక్షుతనుగేలం దాల్ప
  వరషడక్షరజపసరణిఁ దవుల
శర్వుఁ బూజింపఁగా శర్వార్చనముఁ జూడ
  శర్వు విరులఁగొల్వ సంతసింప
శర్వోత్సవాగతజనపూజన మొనర్ప
  శర్వపూజాద్రవ్యసమితిఁగూర్ప

గీ. శర్వసాంబాదినామముల్ సరగ వినఁగ
శర్వమాహాత్మ్య మెఱింగించు సకలకథలఁ
గరగిడెందము బాష్పాంబుకలితనయన
యుగ్మ మలరింప శివభక్తియొప్పు లొప్పు 448

సీ. భవునికై యుద్యానవనసీమ నాఁటింప
  భూ షణ కొఱకునై నూతిఁద్రవ్వ
వామదేవునికినై వాపి నిర్మితి చేయఁ
  గరకంఠునకుఁ దటాకం బొనర్పఁ
బ్రాకారగోపురానీకమ్ము భవునకు
  నర్పింప హరునకాయతన మొసఁగఁ
బరమశివాచారపరుల కంజలిఁగూర్ప
  నాదిభిక్షుని విద్యనభ్యసింప

గీ. నిత్యనైమిత్తికాదులనిరతశైవ
సేవ లవియెంచి డెందానఁ జెలఁగి సల్పఁ
గాలకంఠపురాణాదికములుచదివి
చెప్ప నలరారు శివభక్తియొప్పు గనుచు 449

సీ. నిటలాక్షవిజ్ఞాననిలయంబు లనఁదగు
  కావ్యముల్ పఠియింపఁగలుగు టొకటి
శైలజాపతి సుప్రసాదముల్ వర్ణించు
  గ్రంథంబు లర్చింపఁగలుగు టొకటి

చంద్రచూడుని కథా । చారుపరిబంధముల్
గల నియమము నిల్ప । గలుగు టొకటి
హిమధరేంద్రాత్మజా । హృదయేశగాథలన్
గబ్బంబులన్ జేయ । గలుగు టొకటి
గీ. యీశ్వరప్రీతికై దాన । మిడుట యొకటి
కృత్తివాసఃప్రియం బని । కేలుదోయి
పరమమాహేశ్వరుల మోళ్ల । బట్టుటొకటి
శివునిభక్తిగ పెద్దలు । చెప్పుచుందురి 4?0

సీ. అంధకాసురవైరి । హరివిజ్ఞానని
ష్ఠాగరిష్ఠుల సేవ । సల్పుటెల్ల
నళికాక్షహృద్యవి । ద్యావిశారదపాద
భక్తుల వలగొని । పరగుటెల్ల
త్ర్యక్షషడక్షరీ । దక్షమంత్రాసక్త
జపితల కెఱగి మో । దపడుటెల్ల
నంగజరాతి ది । వ్యస్థలాలోకన
యాత్రాపరుల గొల్చి । యలరుటెల్ల
తే. వ్యోమకేశవరాలయో । ద్దామశిఖర
దర్శనౌత్సుక్యలక్ష్మని । ధాననయన
జలజయుగ్మవిలాసమ్ము । వెలయుటెల్ల
శివునిభక్తిగ నెవరు వ । చింపకుందురి? 451

శా. నీలగ్రీవునకున్ దదర్చకులకున్ । నీహారశైలాత్మజా
కేళీలోలపరేశనిష్ఠులకు భో । గిప్రాకటాభోగది
వ్యాలంకారమహేశభక్తులకు గా । సంతైన యెగ్గున్ బ్రిమా
దాలస్యాదుల జేయు వానిగసి । వేయన్ శంభు సద్భక్తియౌ

క. బసుమమును మైని నలందిన
కుసుమశరహరాంఘ్రిభక్తి । కోమలహృదయున్
బసలెఱుగక దూషించిన
కసుమాలపువాని డిటు । గడుభక్తి యగున్ 452

ఉ. పెన్నఁడు మున్నుగాఁ గలుగు వేలుపుభక్తులఁ దిట్టువారినిన్
బన్నము నెర్చి దేవధన బ్రాహ్మణవిత్తములన్ హరించువా
రిన్నెలదాతలన్ దెగడి కిర్రిందును మీఁదు నెఱుంగకుండువా
రిన్నిజ ౹మలన్ వెలువరించుట శంభుని భక్తియే యగున్. 453

క. ఆతురుల కరక్షణులకు
భీతి నుడిపి వారిఁ జేరి ప్రియ మొనరిచి త
చ్చేతము చల్లఁబడంగా
బ్రాఁతిగఁ బలుకాడ శంభు భక్తి యగుఁ జూడీ 454

స. ఆత్మవత్సర్వభూతాళి యంచును సర్వ
భూతాళి పైదయన్ బూనకున్న
చెన్నఁటి మాటలే తెన్నునన్ వలదంచు
నఖిలజీవులఁ బ్రియ మాడకున్న
నీశుండు లేని తా వేలగల్గు నని హితం
బెల్లప్రాణులకు నూహింపకున్న
దోషమెచ్చోటనున్ దోఁప దంచును గుణం
బందటియందున నెరయకున్న

తే. తలఁప నాత్మేతరంబింత గలుగ దనుచు
దేనిగాంచిన నయ్యది యేన యగుదు
నని యెఱుంగుచు సకలమై తిరిని జెలంగ
కున్న శివభక్తుఁడని యెట్టు లెన్నవచ్చు? 455

స. పార్వతీజానితప్పక ప్రోచు నన్నను
పరమవిశ్వాసమ్ము భవునిభక్తి
శివవేదనమును మించిన వేదనము గల్గ
దను నమ్మకమ్ము గుహారుసిభక్తి
వేదాంతవిద్య కే విద్య యీడగు నని
తలపోయుటయు నుమాధవునిభక్తి
దేశికార్యకృతోపదేశమ్మునన్ ముక్తి
యని తలంచుట నిటలాక్షభక్తి

ఆ. గురుపదమ్ముల సేవించు కొన్నఁగాని
ముక్తికాంతాకరాంగుళి ముట్టఁజాల
మన్న నిశ్చయ మగును హిమాంశుమౌళి
భక్తి యటుగాక యితరముల్ భక్తి యగునె? 456

తే. భక్తి పరమార్థదాయిని భక్తి భవవి
నాశినియు భక్తి పరవేదన ప్రదాత్రి
భక్తి పరముక్తకారిణి భక్తి ముక్తి
భక్తినిం బోలఁజాలు నుపాయమెద్ది? 457

ఉ. భక్తిసమేత మౌనిజన పావనమానసవారిజంబునన్
శక్తిని గూడి యీశ్వరుఁడు సంతతమున్ వసియించువాఁడు సం
త్యక్త ధనైషణాదుల కుదారసుఖాంచితరూపమైనబల్
ముక్తి నొసంగు నయ్యదియ మోక్షము గల్గు నుపాయ మారయన్

చ. ఒనరుచు నట్టి సేవలకు నుల్లమునందునఁ బొంగి యీశ్వరుం
డును నగజాసహాయుఁడయి నూల్కొనునట్టిదయారసంబునన్
మునులకు సచ్చిదాత్మసుఖబోధ మొసంగిన నంతతా నెము
క్తినివయ సేయు నెయ్యదియుఁ గ్రిందగు భక్తికిఁ బోలఁ జూచినన్

## 27. పరపదస్వరూప విచారము

ఆ. శక్తిసహితుని బరుఁడంచు శాస్త్రచయము
పల్కుఁ బరుకంటెఁ బరుఁడని పలుకఁదగిన
పదము వర్ణింతు వినరయ్య పరమమునులు!
తెలియగాఁదగు పదమిదే తెలియుఁడయ్య! 459

తే. ఉన్న నెయ్యది సర్వంబు నున్న యట్లు
మనకు భాసించు నెద్దాన మానవాది
ప్రాణిలోకంబు చేష్టించు నయ్యది గద
నిర్గుణబ్రహ్మతత్త్వంబు నెఱినెఱుఁగుఁడు! 460

తే. ఎయ్యదానందతత్త్వమై యెసఁగు కతన
ప్రేమమన్నది జగతిలో విస్తరిల్లు
ముజ్జగమ్ము లెఱుంగు ప్రమోదరసము
దేని యంశంబు దాని నే తెలియవలయు 461

వ. భౌతికములకంటె (దత్కారణమ్మగు జీతతత్వ మ్ముత్కృష్టమ్మగును. జీవుఁడు సమష్టివ్యష్టిరూపుండయి యిరుతెఱంగులను వ్యష్టిజీవులు ప్రారబ్ధకర్మాయత్తులయి పరస్పరభిన్నులై యుందురు. దేవతిర్యఙ్మనుష్యాదిభేదములకుఁ బ్రారబ్ధము మూలము సర్వజీవులలో బ్రథముఁడు హిరణ్యగర్భుఁడు. వానికంటె నవతారపురుషులను బ్రహ్మవిభూతులై మిన్న లగుదురు. వారిలో బ్రహ్మ కన్న విష్ణువును, విష్ణువు కన్న రుద్రుఁడును శ్రేష్ఠులు. వీరి ముువ్వురి కంటె బరమకారణుఁడగు నీశ్వరుం డెచ్చు. ఈశ్వరతత్త్వము "సా కాష్ఠా సా పరాగతిః" అను పల్కునకు విషయమైనది. పండితుఁడై విత్తపరిపూర్ణుఁడై పరగు పడుచు వాని యానందము మానవానందములలో నుత్తమము. దానికంటె మనుష్య గంధర్వాదుల యానందము నూఱురెట్లధికము. దానికంటె బ్రహ్మానంద మును దానికంటె వికుంఠానందమును నూఱుమడుంగు లధికము. దాని కంటె రుద్రానందమును, రుద్రానందము కంటెఁ బరశివానందమును నూఱు కొలఁదు లెక్కుడు. తదానందము భూమానంద మని వ్యవహరింపంబడు. తచ్చైతన్యమే బ్రహ్మవిష్ణ్వాదినానారూపములై వృక్షమునకుఁ గొమ్మలవలె నలరారు.

ఉ. కావున సర్వదేవతలకంటె ఘనుండని శంభు నెవ్వఁడేన్
భావన జేయఁడేని యగువాఁడసురుండు సురారులన్న వే
జే? వనజారిలాలితకిరీటునిపట్ల ననాదరాత్ములై
కావర మొప్ప బాలిశులకంటె మునీశ్వరులార! తెల్పుఁడీ! 463

తే. భేదవాదమ్ము లెల్లనువాదు దలఁప
వాస్తవము కాదు భేదమ్ము వాస్తవమ్ము
నిత్యుఁడొక్కండు శర్వుండు నిజమెఱుంగుఁ
డయ్య బుధులార! మునులార! యనఘులార! 464

ఉ. పాపపువర్తనంబు బలుబాములలోఁ జరియించువారు ది
వ్యాపగ నోఁదలం గలుగునట్టి విభుండు పరాత్పరుండు గా
నోపునొ యోపఁడో యనుచు నూరక సందియమంది కాలుబల్
తాపుల కోర్వలేక పరితాపము నొందుదు రెట్టి పుట్టలన్ 465

శా. పాపాధిక్యము గాదె యెయ్యెడ శివస్ఫారామలజ్ఞానస
ద్దీపస్ఫూర్తికి నంతరాయమయి బాధించున్ లసత్పుణ్యధీ
వ్యాపారంబుల పెక్కుపుట్టువులఁ జేయన్ శుద్ధులౌ వారు భా
గ్యోపేతుల్ గద శర్వతత్త్వభవనం బొప్పారు నవ్వారికే. 466

క. శివుఁడొక్కఁడు సాక్షాన్ము
క్తి వితరణ మొసంగు దక్కు దేవతలును మో
క్షవిభవసంపాదనమున
కవిరళసాహాయ్య మొనఁగు నట్టిఁడులు కదా 467

చ. పరమశివాతిరక్తులగువారిని వేలుపు మిన్నలందఱన్
గరము పరిత్యజించి శితికంఠుని మాత్రము సంస్మరించుచున్
శరణము నొంద ముక్తి గనశక్యమగున్ భవపాశనాశమే
కరణి నొనర్పవచ్చుఁ ద్రిజగమ్ములఁ గ్రుమ్మరు జీవరాశికిన్ 468

క. మొక్కకుఁ బాదున నీరిడి
జక్కగ లేఁదలిరు నలరు శాఖలు దొడగున్
ముక్కంటి మ్రొక్కు మాత్రన
దక్కిన వేలుపులు మివులదనియుట యరుదే? 469

క. కర్కశతరవివిధాంచిత
తర్కంబున నిర్వికల్పతత్త్వ మెఱుఁగ బా
లార్కునిచే నిరులుం బలెఁ
గోర్కులు సంసారములును గొనసాగ వెటన్ 470

క. అటుకాక యెవ్వఁ డేనియుఁ
బటుతరవేదప్రమాణపద్ధతిఁ దత్త్వో
త్కటవిజ్ఞానము నొందిన
చటులభవ మ్మొదలి ముక్తిసద్గతిని జనున్ 471

తే. వాస్తవమ్ములై నామరూపమ్ములరయఁ
గల్పితమ్ముల యగుఁగాక కాలగళున
కభవశివవామదేవరుద్రాదిసంజ్ఞ
లెసఁగు విషమాక్షునకు ముఖ్యవృత్తి గనుచు 472

తే. విష్ణు నారాయణాదిపవిత్రశబ్ద
వితతి దామోదరుని యందు వెలయు రూఢి
నాశ్రయించి మహేశ్వరునందు నవియె
యోగ్యవృత్తిని విలసిల్లు నొప్పు గనుము 473

ఉ. రూపములేకయున్న భవరోగవినాశకుఁడైన భూమిభృ
చ్చాపున కమ్మహామహుని సంయమిచంద్రులు దర్శనీయస
ద్రూపునిగా వరించి యెదఁ దోరపు ముక్తిని జూఱగొన్న వి
ద్యాపరిపూర్ణు లెంచెడి విధంబు నిటన్ వివరింతు నెనొగిన్ 474

క. క్రొన్నెలపూవౌదల మే
న న్నెలఁత యుఁ గప్పుమెడయు నయనత్రియమున్
బున్నెముల ప్రోవు తనువున్
జెన్నుంగని శివుని మూర్తి జింతింపవలెన్ 475

క. తాండవ పాండిత్యంబును
ఖండేందుకిరీటమస్తకంబున్ గిరికో
దండంబు గలుగు వేల్పౌ
క్కండగు ధ్యేయుండు గరుడగమనాదులకున్ 476

చ. పరమశివస్వరూపమయి భాసిలు సాక్షికి రుద్రరూపమే
యురతమరూపమై యెసఁగు నొప్పుగఁ దక్కిన సర్వదేవతో
త్కరతనువై భవంబు లెటు దానికి నీడగు నంచు సర్వశా
స్త్రరుచిరమర్మముల్ దెలియ సద్గణముల్ వచియింతు రెమ్మెయిన్

చ. పరశివతత్త్వముం దెలుపు బ్రహ్మసదవ్యయశుద్ధబుద్ధిము
క్తరసము భాతి నామము లఖండరసంబున కెంచ ముఖ్యవృ
త్తి రహిఁ జెలంగు నన్యులగు దేవతలందు నముఖ్యవృత్తియై
పరగుఁ దదీయనామములు భావుకులార! యెఱుంగుఁ డిగ్గతిన్ 478

సీ. చలన మింతయు లేని స్వాంతమందు హరాంఘ్రి
నలినముల్ నిల్పు ధ్యానంబువలన
విరులుకావివి మనోవిమలసుమము లంచు
శర్వు నర్చించు పూజనమువలన

నాఁకొన్నవారికి నమృతోపమానాన్న
మిది ధన్యుఁడై ముదంపడుటవలన
త్రావ నీరులు లేక తహతహపడువారి
కెఱఁగి పానీయమ్ము లిడుటవలన

గీ. సర్వమూర్తుల కరయఁగా స్వస్వరూప
మైన యీశాను సుప్రసాదైకభాగ్య
మందఁగలుగును దానిచే నాత్మయందుఁ
బరమతత్త్వమ్ము ప్రత్యక్ష సరణి వఱలు 479

క. శివసుప్రసాద మొక్కటి
దవులకయున్నట్టి వేళఁ దత్త్వవివేకం
బవునే యెందునఁ గావున
భవుకృప సంపాదనీయ పరమార్థ మగున్ 480

## 28. శివలింగస్వరూపకథనము

క. భవ మెడలి ముక్తుఁడగు మా
నవుఁ డెయ్యదెఱుంగ దాని నవసుధ లోలుకన్
వివరింతున్ సంక్షేప
స్తవనీయవిధంబు మీర సన్మణులారా!

క. శివుఁ డెరుఁగున్ జగమెల్లను
శివుని జగంబెరుఁగ దింత శివుఁడు తెలివియౌ
శివభిన్నము జడమగు వా
స్తవముగ శివుఁ డేవెలుంగు స్వప్రభ తోడన్ 482

ఉ. ఆరయ స్వప్రకాశమహిమాతిశయంబులు శంభునందు గా
కేరియెడన్ జెలంగుఁ బర మేశ్వరు వీడి మఱొక్కచోట దై
వారునయేని యాశివున కొనెటు లెంచ శివాంకమో! నిరా
బారు లెరుంగుఁడీరలు శుభంబగు దీని నెరుంగు వారికిన్

తే. స్వప్రకాశైకలక్షణేశ్వరుఁడు శివుఁడు
గల్గకుండిన సకలలోకంబు లందు

నెయ్యె దెవఁడును దెలియఁడో యయ్యలార!
కనుక శివతత్త్వ మొకటె చేతనము సుండు

చ. సకల మభావమందు నసుసంభవమౌ నను వాదమెంచ దు
శ్శకమగు నిర్వహింప నది శాస్త్రవిరుద్ధమ యుక్తిబద్ధమిం
చుక దలపోయుఁడీ! బుధులు శూన్యము శేషి యనంగరాదు శూ
న్యకలన గుర్తెఱుంగునది యై పరచేతన మొందు మీకెడున్ 465

క. భాసురవేదము "తద్భా
సా సర్వమిదం విభాతి సత్య" మ్మని వా
చా సంరంభము నెఱపు ను
ధీసంఘములార! మీకుఁ దెలియుంగాదే! 466

క. శివలింగవిగ్రహమ్మున్
"శివస్య లింగ" మ్మనుచు వచింతురు వేదో
ద్భవవిజ్ఞానుల్ కొందఱు
"శివ ఏవ చ లింగ" మనివచింపుట యతగున్ 467

తే. స్వప్రకాశత వెలయించు శర్వమూర్తి
కగునె వేదోక్త లింగమే జగతి నైనఁ
దనకుఁ దాలింగమగు (గామ దహనుఁ డెలమి
యంచు వచియింప రుచియించు నార్యతతికి 468

వ. సర్వధా సర్వదా సుప్రసిద్ధపదార్థమైన శివలింగమునకు శివుని లింగమని లోకము వ్యాఖ్యానించుట హీనవివేకోక్తి ననుసరించి యని తెలియవలయు నటులఁ గాదందురేని యప్పలుకులు సమంజసము గావని నుడువవలసి యున్నది. శివుఁడుస్వతఃప్రకాశుఁడయ్యు మాయా బద్ధజనదృష్టి కప్రకాశుఁడగుఁగాన నజ్ఞజనవ్యవహారదృష్టిచే శివుఁడు లింగగమ్యుఁడనియు బరమార్థదృష్టిచే నలింగ గమ్యుఁడనియుఁ దెలియ దగు. సామాన్యజ్ఞానము కల మనీషిజనవ్యవహారభేదంబు లిందుఁ గొందుపఱచెద. 469

సీ. తత్త్వమస్యాదివాక్యోక్తిజన్యవిజ్ఞాన
మభవలింగం బని యరయువారు
చతురమీమాంసా విచారసారజ్ఞాన

మగు శివలింగ మంచరయువారు
స్మృతి పురాణేతిహాసేరితామలబోధ
మగు రుద్రలింగ మంచరయువారు
ఘనచిత్తబుద్ధ్యహంకారమానసములు
నగు శర్వలింగ మంచరయువారు

గీ. ఇంద్రియము లైదు ప్రాణంబులేను మేను
నగును శంకరలింగ మంచరయు వారు
విషయములు నైదు తన్మాత్రవితతి యైదు
హరుని లింగమ్ము లని యాత్మనరయువారు 490

ఆ. భూతపంచకమ్ముభూతసూక్ష్మము లైదు
నంగజారి లింగమనెడివారు
వివిధలోకసమితివివరింప నీశాను
లింగ మనుచు నెదఁజెలంగువారు 491

క. కలుగునదెల్లను జగతిం
గలుగని యది యెల్ల గరళకంఠుని లింగం
బెలమినగు ననుచు నెఱుకలు
గలవారలునుం గలారుగలుగుదు రెపుడున్ 4 2

ఉ. కాని విశుద్ధయోగిజనగణ్యులు శంభునకున్ స్వయంప్రభా
మానితదివ్యతేజునకుమౌనిహృదంతరదేశవాససం
ధానకళావిలాసున కెదందలపోయఁగ లింగమేదియుం
గానమటంచుఁ బల్కుదురుగాదె మతిప్రకటోన్నతస్థితిన్ 493

ఉ. అయ్యది లింగమంచు వచియించిన నయ్యదచేతనంబయో
నొయ్యస్వయంప్రకాశునకునొప్పును లింగమనంగఁజెల్లునే
యెయ్యెడఁ జర్చ చేసిన మహేశ్వరుఁడౌను స్వలింగమంచు ధీ
న్యాయ్యము మీర వాకొనుటయర్హతమంబగు గాదెయేరికిన్ 4 4

వ. కావున గమకార్థమందు లింగశబ్దము వర్తించు నెడ శివునకు లింగమే లేదని సిద్ధాంతము. లింగమన నాలయమనియు నర్థము కలదు. ఆలయమున నాధారము. ఆలయము లింగమను నెడ సర్వాధారుఁడైన

శివున కాధారమెట్లు పొసఁగును. తాను నిరాధారుఁడై స్వప్రతిష్ఠితుఁడై శివుఁడు సర్వాధారుఁడగును. ఆధారాధేయభావము కల్పితముగాని వాస్తవము కాదు మఱియు లింగమన లయ మొందు స్థాన మని యర్థముం గలదు. బుద్ధినైశిత్యముచే నేయర్థముం జూచినను శివుఁడు స్వలింగ మనియే స్పష్టమగును. సర్వమును స్వపరమ కారణమైన శివునందు లీన మగును కనుక శివుఁడు లింగమగును గాని శివునకు లింగమొండు లేదు. భ్రాంతిరజతాదులు సత్యములైన శుక్తికాదుల యందు లయమగుటయుఁ బ్రసిద్ధము. అశివస్వరూపమై శివేతరమైన సర్వము శివాఖ్యలయస్థాన మందు నశించును. కావున నదివినాశియు శివలింగముమాత్ర మవినాశియు నని పెద్దలు పలుకుదురు. మఱియు శరీరమునం దాఱు చక్రములు గల వందు శివు నుపాసింపదగు మూలాధార మణిపూర కానాహతాజ్ఞా ద్వాదశార షోడశారములు వానికిఁ బేరులు. దేహమష్టవితస్తి పరిమితము. మూలాధారముచతుర్వితస్తి కనంతరము ననుండు నందు గుణసామాన్యోపాధికుండగు గణేశుం డుపాస్యుండు నాభియందు మణిపూరకచక్రముండు నచ్చట రజోగుణోపాధికుండు జగత్సృష్టివ్యాపారుండు బ్రహ్మాభిఖ్యుండును నగు నాపరతత్త్వమే యుపాస్యము హృదయమున నం దనాహతచక్రముండు నచట సత్త్వగుణోపాధికుండు జగత్పాలనవ్యాపారుండు విష్ణ్వభిధేయుండు నగు నా పరతత్త్వము చింతించునది. భ్రూమధ్యమునం దాజ్ఞాచక్రముండు నట. తమోగుణోపాధికుఁడు సర్వసంహారవ్యాపారుండు రుద్రనామధేయుండు నగు నాపరతత్త్వము ధ్యానించునది. బ్రహ్మరంధ్రమునందు ద్వాదశార చక్రముండు నందు సాక్షిరూపుండైన నాపరతత్త్వమే యుపాసించునది. బ్రహ్మరంధ్రానంతరమున వెనుక షోడశారచక్రముండు నట. స్వప్రతిష్ఠితుండైన యాతత్త్వమే నిలుపునది. ఇది తాపనీయోపనిషదను సరణి నిపుణు లుపన్యసించు విద్య. మూలాధారచక్రోపాస్యదైవత మింతకు మున్ను బల్కితిని. మిగిలిన చక్రములయం దుపాసింపవలసిన దైవతముల విస్తరింతు. వాస్తవముగా నాద్యంతరహితంబు నశరీరంబు నయ్యు స్థూలశరీరసంబంధమొంది కాలానలజ్వాలనోత్కృష్ట వర్ణవరేణ్యుంబయి

సృష్టిక్రమోపక్రమమునకుఁగడంగుట నధోముఖమై వెలయు పరతత్వము మణిపూరకచక్రమునందు ధ్యానింపవలయు. తద్ధ్యానమున నోంకారమున ప్రథమమాత్రయగు నకారమహామంత్రమును స్మరింపవలెను. జాగ్రద వస్థాసాక్షియయి వైశ్వానరాభిఖ్యుండగు పురుషుం డకారముగా భావింప వలెను. మఱియుఁ గాంతిని గోటిసూర్యోపమంబయ్యుఁ దైక్ష్ణ్యరహితం బగుచు కోమలంబయి కర్మఫలప్రాప్తిస్థానము కానందున నపదంబయ్యు సర్వకర్మఫలోపభోగస్థానంబైన లింగశరీరము నుపాధిగాఁగొనుట పదాఖ్య వెలసి స్థూలశరీరరహితంబగుట నజాణంబయ్యు స్థూలశరీరోపాధి సహి తంబగుట ప్రాణనామూర్తంబయి విలసిల్లు సంసారనాశకంబగుట నూర్ధ్వ ముఖంబయి విలసిల్లు విష్ణుస్వరూపం బనాహతచక్రము నందు నోంకార మునకు ద్వితీయ మాత్రయగు నుకారాఖ్యమహామంత్రముచే ధ్యానింప వలెను. వాస్తవముగ నరూపమయ్యు నాత్మభక్తజనానుగ్రహనిమిత్త మునఁ బార్వతీ సహితంబయి శతలక్షసితభానుసదృశంబయి విశ్వం బయ్యు విశ్వ జ్ఞాన సాధనంబయి వెలయు రుద్రరూపమున నాజ్ఞా చక్రమందు నోంకారతృతీయమాత్ర యగు 'మ' కార మహామంత్రమునఁ గొల్చునది. పూర్వోక్తాకారోకారమకార మంత్ర త్రితయంబు గురూపదేశమునఁ గాని యభ్యసింపరాదు 495

శా. జ్ఞానాద్వైతకవిహారధీరులకుఁ బూర్ణజ్యబ్రాజదధ్యమ్మమా
జానిఖ్యాతవిలాసమూర్తిని నిజేశచ్ఛన్స్వీయకాయస్థచ
క్రానీకంబుల మున్నుఁ జెప్పిన గతిన్ ధ్యానించినన్ యోగసం
ధానాంచత్పురుషాళికిన్ ముదమిడున్ శంభుండు ప్రత్యక్షమై 496

క. పాంసులతానిలయంబగు
సంసారాంబుధిఁ దరించు సమయంబున వి
ద్వాంసునకు జ్ఞాననౌకా
శంసితవిహరణము కాక శరణము గలదే? 497

శా. అంతర్లింగము గుర్తెఱుంగు పరవిద్యాదక్షుఁడక్షీణదుః
ఖాంతప్రోద్ధతసంసృతిప్రకటపాశాసీకబంధం బుమా
కాంతానుగ్రహమొంది త్రుంపఁగలుగున్ గానన్ శ్రుతుల్ బ్రహ్మని
ష్ఠాంతస్సంచరణమ్ముఁ బల్కుఁగద శ్రేయంబెంచి లోకాళికిన్

శా. పూవుల్ పండులు నీళులిచ్చి పరశంభున్ బూజలన్ భక్తిమైఁ
గావింపుండని శాసనంబు సలుపంగా ముఖ్యకర్తవ్యమా
భావాభ్యాంబుసుమాదు లిచ్చి శివు సంభావింపుఁడీ యంచు సం
సేవామార్గము తెల్పు చేగద సుధీశ్రేష్ఠాళికెప్పట్టులన్. 499

తే. అరయ నజ్ఞానమే మూలమైన యాజ
వంజవాభ్యమహాభూజవనము వేఱు
తో నశింపదు మంత్రాలతో సమర్ప
ణమ్మొనర్చెడి పూజలనమ్ముఁడింత

శా. జ్ఞానమ్మే హరపూజ పూలఁగొనిపూజల్సల్పు చే స్థూలమా
ర్గానీకంబులఁ బోవుటల్ శ్రుతిశతప్రామాణ్యమే కైకొనం
గా నౌ ధీరజనాళికెంతయును ముఖ్యంబైన ప్రామాణ్య మం
చో నాళికభవప్రభావయుత మత్త్యార్జస్వు లూహింపుఁడీ 501

ఉ. కేవలమున్ త్రినేత్రుఁడని కీర్తి వహించిన వ్యాసమౌని సం
భావనతోడ నాకు మును బల్కిన రీతిని మీకుఁ బల్కితిన్
బావనులార మీరు హరుపాదములన్ భజియించి తత్కృపా
ప్లావనలక్ష్మిగై కొనెడు భాగ్యము మీ కగుఁగాత మెన్నఁడున్

క. సత్యేతరమైన జగం
బత్యంతము దొలఁగునెవ్వఁడన నిటలాక్షున్
మత్యున్నతి దర్శించిన
గత్యమలత గల్గునట్టి కాలమునఁ జూఁడీ 503

## 29. శివస్థానవిచారము

మ. ప్రతిబంధంబులు గల్గు వారికిఁ ద్రినేత్రజ్ఞానమింతైన నే
గతినైనన్ బొడచూప దట్లగుటచే క్కాణింతు నేతీర్థసం
గతినిన్ దత్ప్రతిబంధసంతతి నొగిన్ ఖండింతుర్రిసుజ్ఞానులా
శితికంఠానఘదివ్యతీర్థముల సంసేవింపుఁడీ భక్తిమై. 504

క. ప్రతిబంధములు తొలఁగక
ప్రతిజీవుఁడు పొందునట్టిపదమెది యన స

న్మతిఁ బరశివుఁడేయని ని
శ్చితగతిఁ బలుకంగ వచ్చుఁ జింతించినచో. 505

తే. గాథ యొక్కఁడు దీనికిఁ గలదు మీకు
నుడువఁగడఁగుదు మీరు విప్రనుండు బాడ
బావతంసములారా! మహాత్ములార!
నుడువు నాకును వినుమీకు నడరు ముదము 506

క. లోకోద్ధరణార్థమ్మయి
వైకుంతుఁడు పక్షిరాజవాహవిహార
శ్రీకుండయి రజతాద్రి
ప్రాకటసుందరవిశాలపరిసరభూమిన్. 507

క. చేరి యొకతావునన్ సు
స్మేరలతాంతాతిసురభిసేవ్యవనీశృం
గారం బారసి యచ్చో
సారతప మ్మాచరించి శర్వున్ దనిపెన్ 508

సీ. లేఁతవెన్నెల నవలీల గెల్వఁగఁజాలు
బసుమంబు మేనిపైఁ బసలు గొలుప
ముత్తిరుగా దిద్దుబూదియొప్పిదములు
నుదిటిపై మురిపెముల్ గుదురు. పరుప
మెడదిగి రుదురాకబెడగులనేవళం
బరిదిచందపుఁ జెన్నులమరఁజేయ
సంజకెంజాయ గెల్వంజూచు నెఱ్ఱని
జడలు వైరాగ్యంపుఁ దొడవులీన

గీ. నారచీరయ మొలకు మండనము గాఁగ
తన్ను భజియించు వారిపైఁ గన్న నెనరు
కంటికొనల నటింపఁగా గరళకంఠుఁ
డచ్చటికి వచ్చి ప్రత్యక్షమయ్యె నంత. 509

క ఆలాలితచంద్రకళా
మౌళిన్ గని లేచి భక్తిమహితుం డగుచున్

గేలొందలఁ గీలించుచు
నేలన్ సాష్టాంగప్రణతిఁ జెలఁపెన్ హరియున్ 5.0

వ. "అ"కారుండ వైననీ వతిశుద్ధుండ వఖిలభూతాత్మభూతుండ వనంతానందమూర్తివి నీకు నమస్కారము. "ఆ" కారుండ వైన నీ వసంగుండ వమలుండ వనవరతసాక్షిస్వరూపుండవు నీకుఁ బ్రణామం బిడెద. "ఇ" కారుఁడవైన నీ వింద్రాదిలోకపాలాతిశయవైభవుండ వేక ప్రభుండ విద్ధసిద్ధికరుండవు నిన్నున్ వలగొనియెద. "ఈ" కారుండవైన నీవు వరిష్ఠుఁడవు వసుదుండవు వంచకాలభ్యుండవు వాంఛితార్థప్రదాతవు నీ కంజలిఘట్టెద. 'ఉ' కారుండవైన నీ వుగ్రుండవుత్తమోత్తమార్చనీయుఁడవు నీకుఁ గేలెత్తెద. 'ఊ' కారుండవైన నీ వూర్జితుండ వుత్తమాత్ముండ వుత్తమజ్ఞానగమ్యుండవు భోగాపవర్గార్థుల కుపవీతుండవు నీకుఁ జేతులు జోడింతు. 'ఋ' కారుండవైన నీవు రామపూర్వార్చితుండవును ఋగర్థస్వరూపుండవు నీకుఁ బ్రణతుండ నగుదు. 'ౠ' కారుండవైన నీవు స్వయంభువుఁడవు నిత్యతృప్తుఁడవు రసాదిస్వరూపుఁడవు నీకెఱఁగెద. 'ఌ' కారస్వరూపుఁడవగు నీవు లింగరూపుఁడవు లింగలింగ్యాదిభేద విహీనుండవు. 'ౡ' కారుండవైన నీవు లయస్థానుండవు ధ్వంసకుండవు కర్మఫలప్రదాతవు. లక్కవంటి యొడలు గలవాఁడవు నీకుఁ బ్రణమిల్లెద. 'ఏ' కారుండవైన నీవు ప్రత్యగ్రూపుండ వద్వయుండ విదంతాహంతాసాక్షివి నీకు నమితశిరస్కుండ. 'ఐ' కారుండవైన నీవు జ్ఞానిజ్ఞానాత్ముండవు. 'ఓం' కారుండవైన నీవు రుద్రుఁడవు విష్ణుఁడవు వాచ్యవాచకశూన్యుండవు స్వయంప్రభావుండవు నీపాదముల వ్రాలెద 'ఔ' కారుండవైన నీవు మహామంత్రస్వరూపుఁడవు మహాదేవుఁడవు 'బిందు' స్వరూపుఁడవైన నీవు బీజస్వరూపుఁడవు. బీజాధిష్ఠానమీవు బీజనాశకజ్ఞానస్వరూపుఁడవు నీకై చేతులు దోయిలించెద. విసర్జనీయుఁడవైన నీవు విస్మయుండవు విశేషప్రార్థనీయుడవు నీకు వినమ్రుండనగుదు 'క' కారుండ వైన నీవు కంజభవాదిపరదైవతసంభావ్యుండవు కారణాది శరీరత్రియ సంహారకారుండవు కాలాతీతుండవు నీకుఁ బ్రణతశిరస్కుండ నగుదు. 'ఖ' కారుండ వైన నీవీపంచీకృతపంచీభూతాదియై ఖాదిపంచ

ఘాతహేతువవు ఖసదృశనిర్మలమూర్తివి ఖలవర్జితాగోచరుండవు నిన్నుం బొగడెద 'గ' కారుండవైన నీవు గణేశుండవు. గణబృందార్చితుండవు గంగాధరుండవు గణాతీతుండవు గుహాఖ్యబుద్ధి వేద్యుండవు నిన్నుఁగొల్చెద 'ఘ' కారుండవైన నీవు సర్వప్రళయసమయమున జగములు నీయందు నిబిడమై యుండుఁగాన ఘనాత్ముండవు ఘటాదిదృశ్యప్రపంచవిలక్షణుఁడవు నిన్నుఁగడింతు. 'ఙ' కారుండవైన నీవు ఙమంత్రార్థస్వరూపుండవు "ఙాఙీ ఙూ" మున్నగు సకలవర్గములకు నవాచ్యుండవు నిన్నభివర్ణించెద. 'చ' కారుండవైన నీవు చకారమంత్రనిష్ణాతుల కమృతపదప్రదాతవు చకార మంత్రార్థమవు నీకు స్తవమర్పింతు. 'ఛ' కారుండవైన నీవు ఛలాలస్యచ్ఛాదనాదివిశేషములచే ఛాదనచ్ఛందనచ్ఛన్నవిభాగుండవు. నీకు నమస్కారము. 'జ' కారుండవైన నీవు జగదుత్పత్తిస్థితిలయకారణశక్తివి. జయార్థులకు జయ ప్రదాతవు మాయను స్వవశమునం దుంచుకొనువాఁడవు గనుక జంభమోహుండవు నీకు మ్రొక్కెద. 'ఝ' కారుండవైన నీవు ఝమంత్రార్థస్వరూపుడవు కాన నమృతస్వరూపుఁడవు 'ఝ' యన నమృతవాచి తద్ఝకారాఖ్యామృతము మధ్యము నందుఁగల చంద్రుండవు నీకు దండనమస్సుగూర్చెద. "ఞ" కారుండవైన నీవు ఞమంత్రార్థస్వరూపుఁడవు ఞమూర్తివి జ్ఞాననిష్ఠజనమోక్షప్రదాతవు నీకు నభివాదనం బొనర్చెద. 'ట' కారుండవైన నీవు టటాటిటీటుటూ ప్రభృతి కారాధ్యుండవు సురాసురపూజ్యుండవు నీవు నమస్కార్యుండవు "ఠ" కారుండవైన నీవు ఠమంత్రార్థస్వరూపుండవు ఠఠాదిగణసేవ్యుండవు ఠమధ్యుండవు నిన్ను సేవించెద. "డ" కారుండవు డడాడిడీడుడూదేదొమహానాదార్చితుండవు. డామరములన భయంకరములు డామరశబ్దపూజ్యుండవు. నృత్తప్రియుండవు నిన్నభినుతింతు. "ఢ" కారుండవీవు ఢమంత్రార్థపరిజ్ఞాతృజనులకు ఢాభిదానంద మొసంగువాఁడవు నీవుపాస్యుండవు. "ణ" కారుండవునీవు ణణాణిణీత్యాది విరావపూజ్యుండవు ణసంజ్ఞుండవు ణాక్షేగ్నిగణపూజ్యుండవు. ణసపర్యుండవు నీకుఁ గైయెత్తెద. "త" కారుండవీవు తతాఖిలప్రపంచుఁడవు. తత్త్వమనుపూజనీయుఁడవు నీవు సేవనీయుండవు 'థ' కారుండవీవు థమంత్రార్థస్వరూపుఁడవు థథంజ్ఞిత గణపూజ్యుండవు.

నీవు ప్రమధేశ్వరుండవు కావున"థ"మధ్యుండవు. నీకై నతుండనగుదు,
'ద' కారుండవు దయారూపియగు మహీశక్తి నీ రూపమగును. దేశ
జాతి రహితుండవు. దివారాత్రి స్వరూపుండవు. నీకు దాసుండనగుదు.
'ధ' కారుండవు నీవు ధరాదిపంచభూతాదినేతవు. ధరాధరతల్లజంబైన
కైలాసాద్రి నీకుఁ గాఁపురము నీకు బాహువులెత్తుదు. 'న' కారుండవు
నీవు నగేంద్రుఁడవును నీవునామజాత్యాదికారణుండవు నీవు నమ్యుండవు
శివుండవీవు నీకుఁ గైమోడ్పు. 'ప' కారుఁడవు నీవు పరమాత్ముఁడవీవు
పరాపరవిహీనుండ వీవు పరానందస్వరూపుఁడవు నీవు నీకుఁ బలుమరు
బొగడ్తలొసఁగెద. 'ఫ' కారుండవు నీవు ఫలాభిధుండవునీవు. మరియు
ఫలాఖ్యం దనరారు ప్రమథగణమ్ములకుఁగారణంబవు. నిన్ను స్తుతింతు.
'బ' కారుండ వీవు బంధనకారణమైన యవిద్యానాశకుండవీవు బకారాఖ
బ్రహ్మమంత్రబీజమ వీవు బ్రహ్మాండసృష్టికర్త వీవు నీవు మాననీయుం
డవు. 'భ' కారుండ వీవు భవుండ వీవు భవాభితారకుండ వీవు భశబ్ద
లక్ష్యుఁడ వీవు భర్గకుఁ బ్రాణవల్లభుండ వీవు నీకుఁ బ్రదక్షిణము లర్పింతు
'మ' కారుండవీవు మహామాయాపాశచ్ఛేదకుండ వీవు మమకారరహితు
లకు మహానందంబివొసంగుదువు. నీవు మహనీయుఁడవు. 'య' కారుఁడ
వీవు యథార్థుండవు నీవు యథార్థజ్ఞానవితానములకు యదార్థప్రత్యగద్వైత
జ్ఞాన మిడుదువు. నీకుఁ బ్రహ్మాభావమొందుదు. 'ర' కారుండవీవు రతి
ప్రాణనాథుండవై యీ వవతరించితివి. రతిహేతువు నీవు రవి నీయష్టమ
తనువు. రోగనాశకుఁడవు నీవు నీకు డోసిలొగ్గెద 'ల' కారుండ వీవు
లలితమృగలాంఛనుండైన సోమునకు శుద్ధప్రతిపత్తిథి మొదలు పౌర్ణమి
వఱకు నొక్కొక్క కళ హెచ్చి యప్పటి నుండియు నమావాస్య వఱకు
నొక్కొక్క కళ తగ్గునట్లు సోమలతకుఁ బూర్వపక్షమున ప్రతితిథికొక్క
పత్రము దొడగుటయుఁ బశ్చాత్పక్షమునఁ బ్రతితిథి కొక్కయాకు
నూడ్చుటయు సంభవించుటం జేసి యాయష్టమూర్తులలో నొక్కఁడవై
సోమునివలె సోమలతయును నీవు. లాభాలాభప్రసంగమొప్పని నిత్య
సిద్ధవస్తువ వీవు నిన్నుగ్గడింతు. 'వ' కారుండ వీవు వరదుఁడవు నీవు
వాసుదేవాదిత్రయమునకు నీవు కారణమవు. వాంఛ యను వలనుద్రెంచు

వాఁడవునీవు. నీకుమ్రొక్కెదెద 'శ' కారుండవీవు శరణ్యుండ వీవు శరణార్థిశంకరుండవు శరచ్చంద్రిధవళ మోహనుఁడవీవు నీకై మ్రొక్కెద "ష" కారుండ వీవు షడాధారషట్చక్రాది స్వరూపుఁడవు వీవు షడక్షర విషణ్ణుండవు నీవు షణ్ముఖహేతువవు నీవు నిన్ను భజింతుము. "స" కారుఁడ వీవు సహజశక్తిసహితుఁడైన భృంగీశుండవగు సకారార్థమవు నీవు సకలసాక్ష్యసాక్షివి నీవు సదాత్ముఁడ వీవు. సాధుజనకృతోపకారి వీవు నీచరణము వట్టెద. 'హ' కారుఁడ వీవు హంసరూపుఁడ వీ వహంపదప్రత్యయ జ్ఞేయుఁడవు నీవు. అహంకారరూపుఁడవీవు. హాహా హిహీహూహూ గతమూర్తివి నీవు. నీమ్రోల వ్రాలెద. 'ల' కారుం డవు నీవు లకారమంత్రిప్రియుండవు. లోలత్సంసారనాశకుండవీవు నీ కాళ్ళపైఁబడెద. 'క్ష' కారుండవు నీవు క్షమంత్రార్థస్వరూపుండవు క్షమా రమణీయులకు క్షేమప్రదాతవు నీవు నాకునుక్షేమకారుఁడవగు నీకునమస్సు

తే. మాతృకామంత్రిలభ్యాయ మాతృమాన
సాక్షిణే మాతృకాకాయ సంగతాయ
మాతృకాధారభూతాయ మాతృకైక
మూలరూపాయ మహసే నమో నమోఽస్తు. 512

క. కేవల మపదాత్ముండయి
నీవు స్వరవ్యంజనాత్మ నియతపదుండై
భావన కందెడు వాఁడై
సేవకసేవ్యుండ వవుదు చేయుదు నతులన్ 513

తే. అష్టవర్గవిభక్తుఁడ వై యశేష
శబ్దరూపుండ వై సర్వ శబ్దలక్ష్య
సాక్షివై శబ్దవాచ్యత్వ సరణి గనని
స్వపరికాశుండ వగు నీకు వందనమ్ము. 514

క. నిరుపాధికస్వరూపుఁడ
వురుతర్కప్రమితికంద వుద్యల్లోకో
త్కరసాక్షివి తేజోనిధి
విరుకరముల నీకుమోడ్తు నేనెయ్యెడలన్ 515

చ. అతులనిజస్వరూపమున నారయ నీవొక యింతయేనియున్
జ్యోతిగనకుండువాఁడవు మహోజ్జ్వలతేజుఁడవున్ స్వయంప్రకా
శత దనరారువాఁడవును సాక్షివియున్ బృహదాఖ్యవాఁడవున్
చతురమతిప్రపూజ్యుఁడ వొసంగెద నీకు నమస్కృతమ్ములన్ 516

క. త్రిగుణపరాభవ మెఱుఁగని
యగణితమౌ సుప్రసాద మందెదివా రొం
దఁగనేర్తురు నీతత్త్వం
బు గరమ్మును నేను నీకు మ్రొక్కెద నభవా! 517

క. అని వనజాక్షుఁడు నుతియిం
చిన నునుబలుమొయిలు బోలి శితికంఠుఁ ధీడు
రనినాదాంచితముగ ని
ట్లనఁ దొడఁగెను మోదమంది యచ్యుతు తోడన్ 518

క. నీవెమిగోరి తపముం
గావించెద విట్లు నీకుఁ గలవే బడయం
గా వలసిన కోర్కులు ల
క్ష్మీవర పలుకందఁదగు సుకమీ దాపకుమీ 519

మ. అనుచున్ గౌరవమొప్పఁగా నభవుఁడ య్యబ్జాక్షుఁ బ్రశ్నింపఁగా
వనజాతాయతనేత్రుఁడా హరునికిన్ ఫాలాక్ష నిన్నెట్టి పా
వనతీర్థంబులఁ గొల్చువాఁడ దయతో వాక్రువ్వవే దేవ నా
కని ప్రార్థించిన చక్రితో ననియె నీ హారాద్రిజాభర్తయున్ 520

చ. పలికెదివాఁడ నన్గొలుచు వట్టులు పక్షికులీనవాహనా!
సులలితభక్తితో వినుము చొప్పతు నయ్యవి రెండు తెన్నులే
కలుగు శరీరమం దొకటి కల్గు నొకండు తదన్యదేశమం
దలి పలుతావులందు వివిధంపుఫలంబులు వానిచేనగున్ 521

సీ. బ్రహ్మరంధ్రస్థానవాసి నన్ బూజింప
ముక్తిసాధనమని పొలుఁబల్కు
నాస్యప్రదేశమం దర్చింపఁగా నన్ను
భుక్తిముక్తులుదానఁ బొల్చుఁజువ్వే

నయనకరోష్ఠగండద్వయదంతనా
సామూర్ధపాదహస్తములయందు
సంధియు న్నాభిపార్శ్వద్వయపృష్ఠస
ట్చక్రిధాతూత్కరస్థానములకు

గీ. నర్చనము సేయఁగల్గు ననంతఫలము
లనుచు నయ్యయి స్థానంబులాత్మదేహ
మందు వెలసిన పుణ్యతీర్థాళి యనుచుఁ
దెలియజెప్పిరి గాదె సుధీజనములు 522

సీ. కైలాస దక్షిణకైలాసములును గో
పర్వతాఖ్యమును శ్రీపర్వతంబు
కేదారసోమనాథోదారహరతీర్థ
వృద్ధాచలాదులు విమలకాశి
గోపుటమ్మును గుంభఘోణమ్మును త్రికోటి
కాఖ్యమధిగ్రామమన్నదియును
సవ్యేతరావర్తసంజ్ఞమ్మునన్ ధృతి
స్థానమ్ము వల్మీకసంజ్ఞితమ్ము

తే.గీ. పుండరీకము రామేశపురవరమ్ము
నలఘుమంగళవంశహాలాస్యములును
పూతతీర్థమ్ము లనఁదగు భుక్తిముక్తి
ఫలము లొసఁగెడితీర్థముల్ పద్మనాభ! 523

క. సారసనాభా! మఱిపే
దారణ్య మనంగఁజను మహాతీర్థంబున్
సారతరపుణ్యనిలయగ
జారణ్యమ్మనెడి తీర్థమలఁతులె తెలియన్ 524

ఉ. ఈవును నేను నందియు సురేశ్వరుఁడున్ గణనాథుఁడందఱే
దేవునికై ప్రియంపడి మతిన్ దగ నిల్పిసపర్యగూర్తు మా
దైవతమే నృరాట్టగుగదా యెటనంచుఁ దదీయవాసమే
లా వెదుకంగ బుద్ధియని [illegible] జనోక్తి వినంగలేదొకో! 525

ఉ. ఎంతకుఁజాలియున్న నొకరింత మహర్షితతుల్ శ్రుతిస్మృతుల్
చింతనచేయరానిదగు చిన్మయతత్త్వము నేమహాత్మున
త్యంతదయామయాంచితకటాక్ష మెఱింగినవారు శాంతులై
గాంతురు ముక్తి నట్టిజితకాలుఁ దొకండు శివస్థలమ్మగున్ 526

ఉ. ఎవ్వనిచూడ్కి నివ్వటిలు నెన్నియు నైన శుభమ్ము లెప్పుడున్
దవ్వులకేఁగు దుఃఖములు తామె తమంత భయానఁబోలి వా
కు్రివ్వగరాని మోదసుఖకోటి లభించు జనాళి కట్టి వే
ల్పెవ్వలనన్ శివస్థలము యయ్యది నిక్కువ మీవెఱుంగుమా 527

ఉ. కోటిదివాకరప్రభలు గూడిన కాంతిని మించువాఁడు మున్
సాటిలలేనియంధతమసంబుల ఁబాటవ మొప్పఁ బోలు వాఁ
డేటిచెలిన్ దలందు వెలయించెడు వాఁడు శివస్థలంబు నీ
రాటమదాపహారి వినుమా కనుమా యిది నెమ్మనంబునన్ 528

శా. ఈ కైలాసనివాస మెన్నఁగఁ బ్రియంబెంతేని శ్రద్ధాలస
ద్భీకళ్యాణుల కర్పితమ్మిది సుధీదివ్యాళికిన్ జ్ఞానసౌ
ఖ్యాకారప్రద మీ గిరీంద్రి మెపుడే నానందసంధాయినై
ప్రాకట్యంబుగ నిల్చువాఁడను రమాప్రాణేశ యీతావునన్ 529

ఉ. ఆరయ భక్తసారహృదయ స్థితి గాంచి యఖండమంగళా
సారమొసంగఁజాలి పరసత్యమునన్ బ్రకటింపనేర్చి సం
సారశమం బడంపఁగల జ్ఞానమునీయ సమర్థమౌచు నిం
పారెడు తాండవం బిచట నాత్మముదంబుగఁ జల్పుదున్ వెసన్ 530

మ. పరమప్రేమనికేతనమ్మగు నుమాభామాలలామంబు భా
సురపుత్రద్వితయంబు వెంటగొని యిచ్చో ముచ్చటల్ మీర సు
స్థిరపాండిత్యము తోడఁ దాండవము నేఁజేయన్ విలోకించి య
బ్బురపాటొందుచు నన్యమున్ మఱచి నింపున్ సొంపు నెమ్మోమునన్ 531

గీ. అంతరంగికు లనఁజను నమలులకును
... మహా... ండవాలోక నై కవైభ

వసులు గల్గునె యెంతటి వారికైన
నెఱుకగనుమయ్య! గోవింద యింతనిజము 532

చ. వనజభవుండు వాణియును వాసవుఁడున్ శచియున్ ధరేంద్రజా
వనజముఖీలలామమును వావిరి నేనిడు దివ్యదృష్టిచే
తను గద నేనొనర్చు ఘనతాండవమున్ గనఁజాలినా రనన్
కనఁదగునే తదన్యులకుఁ గన్నుల విందుగ నాదునృత్యముల్ 533

ఉ. భూనుతశబ్దజాలపరిమోహితచిత్తులు భూరిశబ్దశా
స్త్రానుగతిప్రభావసమదాయతచిత్తులు నస్మదీయనృ
త్యానుసమీక్షణోత్సవములారయ వారలె యెన్నఁడైన మ
ద్ధ్యాన మహాత్మధీరులకు నయ్యవి ప్రాప్యములంచు నెంచుమా 534

మ. శ్రుతిబాహ్యాధ్వవిహారులున్ బరమమూర్ఖుల్ సంతతానంతభ
క్తితతాంచద్ధృదయంబులం దున ననున్ గీర్తించిరేనిన్ మహా
మతి సందర్శనయోగ్యమై వెలయునస్మన్నృత్యపాండిత్య మ
చ్యుత దృక్పర్వముగాఁగ జూడనగు నిచ్చో విస్మయం బొప్పఁగన్

ఉ. ఇచ్చట నాదుతాండవము నేర్పడఁజూచిన భాగ్యశాలి తా
మెచ్చఁడు స్వర్గవైభవము మేకొని జన్మమొనర్పఁడందుకై
సచ్చిదనంతమోదమనఁ జాలెడు బ్రహ్మమునందు నాస పెం
పచ్చుపడంగ జ్ఞానమున కాదరణమ్మును సల్పఁడించుకేన్ 536

శా. నానృత్యంబును జూడకున్న నరుఁడైనన్ బుర్వుతో నీడగున్
గానన్ దత్సుకృతంబు దుష్కృతమయై కష్టాలపాల్సేయు న
వ్వానిన్ మామకతాండవోత్సవములొప్పన్ జూడకున్నట్టి బ్ర
హ్మానూనాన్వయసంభవుండగును బోయంత్యాన్వయుం డెంచఁగన్

శా. ఏలా పెక్కులు పల్క నింక సకలాహీనానఘస్థానజా
లాలంకార మనంగ నొఁగద మదీయావాసమైనట్టి యీ
కైలాసం బిది ముక్తిహేతువగు మోక్షశ్రీని దక్కించుకోఁ
జాలంగోర్కులు మీరు వారలకు నిస్సందేహమీ సుద్దియా 538

శా. అంతర్ధానము నొందె శర్వుఁడిటు లొయ్యం బల్కి యామీఁదటన్
సంతోషించి తదీయమౌ దయకు నబ్జాతాక్షుఁ డెంతేని శ్రీ

కాంతారత్నమొసంగు మన్ననల కేకాంక్షించి వైకుంఠఘ
ద్ధాంతప్రాంతముఁ జేరెఁగోరికలు డెందంబందు నక్షాడఁగన్

చ. మురరిపుఁడంతవాఁడు వినె మున్ శివుఁడానతి నీయఁగా మహే
శ్వరవరపుణ్యతీర్థములవానిని మీకు నెఱుంగఁజెప్పితిన్
గురుతరమోక్షసంపదలగొబ్బునఁగాంచుడి వానిసేవఁజే
సిరహిని బుణ్యశీలురకుఁజిత్తమువేతొకచోటనిల్పునే 540

మ. శివతీర్థంబుల కేగువారికిఁగదా శ్రేయంబు ప్రాపించు సం
భవమృత్యూగ్రపరంపరావ్యథలు నిష్పన్నైన విద్యాటవీ
దవకీలావళి ప్రజ్వరిల్లుఁ జటులాంతశ్మతుప్రిసంఘంబు భ
స్మవిధంబై నశియించుఁ గాన చనుఁడస్మద్వాక్యసత్పద్ధతిన్ 541

## 30. భస్మధారణవైభవ నిరూపణము

క. శ్రీభస్మధారణోద్యద్
వైభవముల నిఁక వచింతు వాని వినిన మో
క్షైభయపదమే యలవడు
వేభవబంధములు సడలు వినుఁడీ మీరల్ 542

క, ఇరుతెఱఁగగు భస్మంబుల
నరయగ సన్నుతిని గని మహాభస్మం బొం
డిరవొందు నల్పభస్మా
ఖ్యరూఢి గను నది యొకండు గదః మునులార! 

మ. పరమాత్మం డభవుండు శర్వుడుమహాభస్మాభిధానుండగున్
దురితాఘంబుల నెల్ల భర్త్సనవిధిన్ గూర్పంగ బల్ జాణయై
వఱలన్ మాయ దదీయకార్యము నొగింభాసింపఁగా హేతువై
నిరపేక్షాధికభాసకుండగుచు నిర్ణిదప్రిప్రిభం గాచుటన్ 544

శా. వేదాంతోద్భవవిద్య యొక్కటియె సద్విద్యాభిధానార్హమౌ
వెదాంతేతరవిద్యలున్ దలఁపగా విద్యాఖ్యతానే యవి
ద్యాదర్మంబులుగా వచింపఁదగు భేదాజ్ఞానవృద్ధిప్రకా
రోదారస్థితిమైఁ జెలంగి భవబంధోగ్రప్రింబులై యుండుటన్ 545

సీ. బూది బూయఁగనేల? యౌఁదల జడలేల?
సీటుగా మొలఁగట్ట శాటులేల?
తపము గైకొననేల? ధర్మాచరణమేల?
పేరు మ్రోసిన యీవి తీరులేల?
స్వాధ్యాయవిధులేల? స్మార్త కర్మములేల?
డంబుమీరిన పురాణంబులేల
తీర్థాటనములేల? దివిషదర్చనలేల?
పటుగోపురాల దేవళములేల?
గీ. మహిత వర్ణాశ్రమాదిధర్మమ్ములేల?
సర్వసాక్షి మహాభస్మసంజ్ఞుఁడాత్మఁ
దనుచుఁ దెలిసిన యట్టి బుధాళి కరయ
జ్ఞానులకుఁ గార్య మొకటైన గలదె చేయ 546

క. ఏనికి నైనను భస్మ
జ్ఞానమ్మె నయంగ యోగిజనమణి కృతకృ
త్యానూనపుణ్యుఁడున్ వాఁ
డౌనని వచియింప నేల యభవుండ యగున్ 547

క. ఏతద్భస్మజ్ఞాన
ఖ్యాతార్థము దెలుప వెలయుఁగా దే పూజ్యం
బై తగు శ్రుతియున్ స్మృతియున్
బూతపురాణేతిహాసపుంజమ్మెపుడున్ 548

క. కృతకృత్యుఁడగుట భస్మా
ధృతికిని గర్తవ్య మెచటఁ దెలియఁగఁబడ ద
క్కృతమునఁ దనుయాత్రను స
మ్మతించుఁ బ్రారబ్ధకర్మమహిమకులోనై 549

తె. పలికినాఁడను నే మహాభస్మవిధము
నల్పభస్మవిధమ్ములనాడువాఁడ
శ్రౌతమన లౌకికమ్మన స్మార్త మనఁగ
ముత్తెఱంగులు గలయది మునులు వినుఁడు 550

శా. శ్రౌతస్మార్తములన్న భస్మములు విశ్రప్రక్షత్రవైశ్యత్రయ
ఖ్యాతాంచత్కులులైన వారికగు లౌకిక్యాఖ్యంబు భస్మంబు త
జ్జాతాన్యాళికి నొప్పునంచు దెలియన్ శాస్త్రార్థయాదార్థ్యధీ
చాతుర్యాత్మలెఱుంగు ఁ త్రోవగద ప్రజ్ఞావంతు లూహింపుఁడీ. 55।

వ. భస్మము సర్వాంగముల నలఁదియుఁ ద్రిపుండ్రముఁగ దిద్దియు ధరింపవలెను. "అగ్నిరితి భస్మ", "వాయు రితిభస్మ"।, "జలమితి భస్మ"।, "స్థలమితి భస్మ"। "వ్యోమేతి భస్మ।""సర్వగ్ం హ వా ఇదం భస్మ।" 'మన ఏతానిచక్షూంషి భస్మాని' యను సప్త మంత్రోచ్చారణ సహితంబుగ సకలాంగముల బూదిఁ బూయుట భూతిస్నాన మనంబడు. తదనంతరమున "త్రియాయుషం। జమదగ్నేః కశ్యపస్య త్రియాయుషమ్। అగస్త్యస్య త్రియాయుషం యద్దేవానాం త్రియాయుషమ్। తన్మే అస్తు త్రియాయుషమ్" అను మంత్రములతోఁ త్రిపుండ్రధారణము చేయనగును. పూర్వోక్తమంత్రములకు ద్విజులర్హులగుటం జేసి వారే తన్మంత్రసహితముగ భస్మోద్ధూళన త్రిపుండ్రరచనముల నొనర్చునది. మఱియు "మేధావీ భూయాసం యశస్వీభూయాసం' మంత్రములచే బ్రహ్మచారియు "త్ర్యయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్ ఉర్వారుకమివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ మాఽమృతాత్" అను మంత్రముచే గృహస్థ వానప్రస్థులు నోంకారము త్రిరుచ్చారణ మొనర్చి హంస మంత్రము స్మరించి యతియుఁ ద్రిపుండ్రముల ధరింపవలెనని జాబాలశ్రుతి శాసించుచున్నది. లలాటఫలకంబున వక్షఃస్థలంబున బాహుప్రదేశంబులఁ ద్రిపుండ్రమ్ము ధరించునది, భుక్తిముక్తు లందుననగు మఱియు మంత్రరహితముగా భస్మోద్ధూళన మొనరించిన నేరికైనను వర్ణాశ్రమ భేదము లేకయే సుఫలముదయించు నని జాబాలశ్రుతి వక్కాణించుచున్నది. మఱియు నుద్ధూళనత్రిపుండ్రములు జ్ఞానభాసకములనియు మాయానిరాసకములనియు శ్రుతులు వలుకును.

క. ఏపుగను మాయచెడ జ్ఞా
నోపాయమునుం గ్రహింపక నుద్ధూళనపుం

ద్రోపమితసాధనమ్మెటఁ
జూపఁగఁ శక్యంబె యెంత సూరికి నైనన్ 552

క. సలిలజ్వలనోర్వీసే
వలఁ గలిగెడి ఫలము కన్న బహుళఫలమ్మున్
లలిఁ భస్మోద్ధూళనపుం
ద్రలలితరచనలను సత్వరమ్ముగఁ గలుగున్ 553

సీ. ఘోరాఘకుధరాళిఁ గూల్ప ననల్పవ
జ్రాయుధ మ్మేది యని యరయుపట్ల
సకలజీవుల ప్రాణజాలముల్ రక్షింప
నమృతభాండ మ్మెట ననెడిపట్ల
మహితలోకానంతమంగళకరశక్తి
యెచ్చోట నని చర్చలెనఁగుపట్ల
మాతృగంగాగురుమాన్యాళి కన్నఁ బ
విత్రమెయ్యది యని వెదకుపట్ల

గీ. భస్మమున్ మేని పయిఁ బూసి భస్మ మొప్ప
మూఁడురేఖలుగా దిద్ది మురియుట యని
చెలఁగి ఘంటాపథమ్ముగాఁ జెప్పవచ్చు
భస్మధారణ మేమఱన్ వలనుపడదు 554

సీ. స్నానవ్రతమ్ము విజ్ఞానార్ధదీక్షయు
భస్మత్రిపుండ్రపావనము లరయ
నైష్ఠికవ్రతము దానధురీణతయు లస
ద్భస్మత్రిపుండ్రపావనము లరయ
యజ్ఞనిర్వహణము నలఘుతపంబును
భస్మత్రిపుండ్రపావనము లరయ
శ్రౌతధర్మంబులున్ స్మార్తధర్మంబులు
భస్మత్రిపుండ్రపావనము లరయ

తే.గీ. వేయు నుడువంగ నేల సంవిదితసకల
ధర్మసేవనమును భస్మధారణాప

మమ్మునుం బుండ్రరచన సమమ్ముగాఁగఁ
బలుకు ప్రాఁబల్కు తెలియంగవలెను మీరు 55

సీ. భార్గవీ పార్వతీభారతీపౌలోమ
లమలభస్మము దాల్చియడరినారు
భవపద్మసంభవపద్మగర్భసురేంద్రు
లెల్ల భస్మముదాల్చియేపుగనిరి
చక్షుఃశ్రవోయక్షరక్షఃసురౌఘమ్ము
బసుమముం దాల్చి పెంపెసఁగినారు
సకలాగమపురాణశాస్త్రవిద్వద్వర్యు
లెంచి భస్మమును ధరించినారు

గీ. భూతి మేన నలందితిర్యపుండ్రములను
బొల్పుగాఁదాల్చియే యెట్టిపురుషులైన
జ్ఞానవాసనగనువారుగాన భస్మ
మహిమ మెంచఁగలారెఁయేమహితులైన 5

సీ. ఎన్ని పుట్టువు లెత్తియేమి నేర్చిన యైన
పరశివజ్ఞానంబుబరగు నొక్కొ?
ఎన్నెన్ని సుకృతమ్ములెంచిచేసిన యైన
ముక్తిచెంతకునైనఁబోవుతెరగె?
ఎన్ని సువ్రతదీక్షలెలమిసల్పిన యైన
వర్ణాశ్రమాచారఫలము లగునె?
ఎన్నెన్ని తీర్థాలునెట్టి వేల్పులఁ గొల్వ
విపరీతఫలమిడిపిద్రులకున్నె?

గి ఎన్ని శాంతుల నొనరింపనించుకైన
పాతకమ్ములు నశియింపవలనుపడునె?
భస్మమును దాల్పకుండినభస్మపుండ్ర
ములను దీర్పక యుండినపురుషులకెట. 55

ఉ. ఎరికి భస్మధారణసమిద్ధవిధుల్ రుచియింప వేరికిన్
వైరము భస్మధారణమునన్బ్రబలున్ ఁదగుశ్రద్ధయేరికొ

స్ఫారదు భస్మధారణకళాభ్యసనమ్మునఁ బాపసంఘమ
వ్వారికి నారలేదని భ్రమవమ్మగఁ బల్కుదు రెల్లపండితుల్ 558

చ. అమలవిశాలఫాలతలమందము మీఱెడి రీతి గాఁ త్రిపుం
డ్రములను దిద్దువానిని గనన్ విన మోదము నొందకుండి భ
స్మమహితదర్శనశ్రవణసంగతిఁ గోరక యుండు నట్టి య
ల్పమతుల పాపమెన్నఁగఁ గలాఁడె? చతుర్ముఖుఁ డంతవాఁడునున్

చ. మఱియును భస్మధారణప్రమాణములారసి యప్రమాణతా
స్ఫురణమతిన్ నిరాదరణబుద్ధిఁ జరించెడి వారి దెంతయో
దురితము వాకొనన్ దరమె దోషములెన్నుట కైన వానికిన్
దొరగుట గల్గునే నరకతోయధి యింకునె యెన్నఁడేనియున్ 560

క. నాకున్ మద్గురువరునకు
సాకల్యంబుగను భస్మసామర్ధ్యంబుల్
వాకొనఁగ శక్తి చాలదు
గాక వచింపమొకొ యింతకంటెన్ దీనిన్ 561

శా. ఆహా! మోహవిజృంభణమ్ములు దురూహంబౌఁగదా సర్వవి
ద్రోహమ్మం బొనరించి భస్మవిధులందున్ శ్రద్ధలేకుండఁగా
దేహాత్మప్రతిపత్తి మజ్జనుల కెందేన్ గల్గఁ గాఁ జేయు నీ
మోహం బొక్కటి సంహరింప భవముల్ మూలంబుతోఁ బోవవే?

క. నే నేర్చినయటు భస్మవి
ధానమ్మును బల్కినాఁడ దద్వ్రతమతులై
ధీనిధులారా! మానకుఁ
డే నాఁడును మీరు భస్మ మెలమి ధరింపన్ 563

చ. పరమరహస్యమే యయిన బల్కితి లోకహితమ్ముగాఁగ ని
త్తరిని విభూతిధారణవిధానము తావకసన్నిధానమం
దిరవగునేని నియ్యదొక యింత భవన్మతులందు పుట్టువుల్
కరముకృతార్థమౌనని తలంపుఁడు గైకొనుఁడీ వ్రతమ్మొగిన్

## 31. జీవబ్రహ్మైక్య విజ్ఞానవర్ణనము

చ. శివుఁడు దయామయుండు శివుచిత్తము మెచ్చెడి సేవమీర లు
త్సవముగ సల్పి భక్తి మెయి సంతతమున్ జపియించి శర్వుఁ బ్రీ

తివేలయు నట్టి తెన్నుల మఱితిన్ గమనింపుఁడు నేను వాకొనం
గ విని శుభంబు గాంత్రుశివుఁగాంతురు నే నెఱిఁగించు పద్ధతిన్

తె. అఖిలమున్ బ్రహ్మమౌను నేనగుదు బ్రహ్మ
మనుచు వేదాంతవాక్యాలననుగమించి
శక్తిసహితుని శివునెదసరగ నిల్పు
విప్రవరులార! యిదిశివప్రీతి కగును. 565

క. ముక్కంటి తాండవంబుల
నక్కజపడి చూచుటొకటిహరయీశానా!
చుక్కలదొరదాల్పా! యని
గ్రిక్కునఁ బల్కుటయు గరళగళు ప్రీతి కగున్ 566

క. శివభక్తియు గురుభక్తియు
వివిధపురాణేతిహాసవేదస్మృత్యా
దివిమలభక్తియుఁ దద్భా
వ విరణముం బఠనమున్శివప్రీతికగున్ 567

మ. చదివింపన్ జదువన్ స్మృతుల్ శ్రుతులు శాస్త్రంబుల్ పురాణేతిహా
సదురాధర్షచరిత్రముల్ శ్రుతిశిరస్సందోహముల్ ముక్తిధి
ప్రదసందర్భములంచెఱింగి దినమున్పత్ర్యాహరాహిత్యస
మ్మద మొప్పార దయామయాచ్ఛతరశంభుప్రీతికిన్ హేతువౌ 568

సీ. జాబాలివాక్యానుసారమ్ముగా భస్మ
ధారణమ్మొనరించుధన్యతముఁడు
దల మెడన్ జేతోయిఁదగురీతి రుద్రాక్ష
మాలికన్ దాల్చెడిమాన్యతముఁడు
లింగమందున యెంచియంగజారిం గొల్చు
భక్తితత్పరుఁడైనభవ్యతముఁడు
వారాణసిముఖోదారపుణ్యస్థలీ
సేవాప్రవణుఁడై నశ్రేష్ఠతముఁడు

గీ. శాంతిదాంత్యాదిగుణములసత్యసత్య
వస్తుపరశీలనంబునువాంఛలేమి

యజ్ఞదానతపఃకర్మయాజనములు
గల్గువాఁడు శివప్రీతిగలుగువాఁడు 569

మ. ఇతరాచారరుచిం ద్యజించి స్వమతాహీనాభిమానాత్ముఁడై
ప్రతిబద్ధక్రియ లుజ్జగించి దురితప్రారంభతాటస్థ్యస
ద్గతిమాన్యుం డటు లన్యదూషణములంగావింపఁగా మాని సం
తతమున్ భక్తులఁ గొల్చువానికగు రుద్రప్రీతిసౌభాగ్యముల్ 570

తే. విషయవాంఛల వీడినవిప్రులకును
జ్ఞానపూతాత్ములకు నమస్కారమిడిన
వినయభక్తిసమేతులవెదకికొనుచు
వచ్చి వరియించుఁగద శంభువత్సలతలు 571

క. దయసకలభూతములయం
దయవిధి విలసిల్లె నేనిహరు ప్రీతికగున్
దయ యొకఁడులేని వారు ని
రయమున కేఁగుదురు వారురక్కసులుగదా! 572

మ. చరలింగంబుగ నెంచుకొంచు నభవజ్ఞానైకనిష్ఠాపరున్
గురుపాదుం దగఁజేరి శక్తికొలఁదిన్‌గూర్మిన్ దదీయోల్లస
చ్చరణాగ్రస్థలి వ్రాలి సేవ సలుపన్‌చంద్రోత్తమాంగస్ఫురత్
కరుణాపాంగవిలాసవీక్షణసుధాదామంబుజూడన్ దగున్ 573

క. ఈయర్థము దెల్పన్ స్మర
ణీయంబగు గాథనై పురాణిన్ ముని పెద్దల్
గేయగుణులార పల్కిరి
శ్రేయం బద్దాన మీకుఁజెకురు వినుఁడీ 574

క. ఘటనాఘటనధురీణుం
డెటు బ్రహ్మాండములొనర్చిసృష్టికరుండౌ
నటు నొకఁడు చిత్రఘటనం
ఘటనాచాతురుని వన్నెగాంచిన వాఁడై 575

క. సొమ్మయి కుమ్మరి కులమున
కిమ్మయి సుగుణమ్ములకు సత్సమిద్ధకళావా

సమ్మయి సత్కీర్తిలతాం
తమ్ముర్ హరపాదయుగము దలపైఁదాల్చున్ 576

ఉ. కల్పితగాథలన్ మధుర కావ్యములన్ శ్రుతులన్ జెలంగు బల్
శిల్పకళావిలాసములఁ జిత్తము ఉల్లసిలంగ నాతఁడ
స్వల్పమనీషతోడ రస వద్రచనల్ రచియించి కుండపైఁ
దెల్పును కుమ్మరీఁడులకుఁ దీరులు మున్నిటి వంటి వయ్యెనే 577

సీ. పూ మొక్క కొక కుండ పూని యొనర్చెనా
లేని మొక్కలె పూవు లూనినట్లు
కోర్కి మీరఁగ నొక్క కూజాను జేసెనా
నీరు లేకయె నారు నిల్పినట్లు
నిండు వేడుక నొక్క భాండంబు నీనెనా
బ్రహ్మాండమందునఁ బరగినట్లు
దనుపలోకము నొక్క దాక నిర్మించెనా
ముక్కువిందుగ ఁబోపు పొగచినట్లు

గీ. ప్రకృతిసౌందర్యమును గ్రింక వచ్చుచునట్లు
కుంభకారుఁడు కుండలఁ గూర్చు లలిత
కళ లనంతములై యిందు కళలఁగేరు
లెక్కకే మొక్కుమని యెక్క సక్కె మాడి 578

క. నిచ్చలు నెచ్చెలియుం దా
నచ్చపు టందమ్ము దెచ్చి యా కుమ్మరి సౌ
రచ్చుల గ్రుద్దిన యట్టుల్
ముచ్చట లలరారు భాండ ముల్ రచియించున్ 579

క. సౌందర్యకళోపాసన
ముందగ నొనరించుకతన ముగుద కతనికిన్
డెందమ్ము తదాయత్త
మ్మొందున నయి యరుచిజెందు నితరములందున్ 580

క. సతికౌఁగిట సుఖియింపుచు
రతి యిది కుమ్మరిదిగాదు రాయని యెదలో

రతి చక్కఁదనము దలఁచుచు
నతఁడు ముదంబందుచుండు నయ్యెయెడలన్ 581

క. లోకోత్తరలావణ్య
శ్లోకోత్తరయగుచు నొక్కసుత యుదయించెన్
నాకాంగనాపరాభవ
మీ కుమ్మరి నిసుగువలన యెసఁగె ననంగన్ 5 2

క. మెయిబాబాన్ బంగారం
దియ వెలవెలబోయిమేల్మి దీరుం జెడె ది
వ్వియ కాఁగడాల ముందట
దయనీయంబైన స్థితులఁ దవులుం గాదే? 583

క. అమ్మరుని కఱకుటమ్మె
క్రుమ్మరు నది భువి ననంగఁ గుమ్మరిది విలా
సమ్ములకుఁ బుట్టినిల్లయి
కొమ్మల తలసొమ్మనంగఁ గొమరుల నమరున్ 584

క. అచ్చెలువ దలను ముడిచిన
ముచ్చటముడి నెవఁడు చూచి మురియక యుండున్
లచ్చికిఁ గల చెల్వమ్ములు
పొచ్చెమ్మన వచ్చు దాని పొలుపుల పజ్జన్ 585

ఉ. పెన్నెరివేణికిన్ దురము పెద్దది పెద్దదియౌ పిఱుందు చె
న్నెన్నెగఁ జాలపెద్దకను లెంచగ మిక్కిలిపెద్దలౌను మేన్
వన్నెయుఁ బెద్దకాని యల వారిజనేత్రికు వింతవింతగా
నెన్నడుమొండు సన్ననయి నిల్చెను పెద్దలమధ్యఁ బిన్నయై 5 6

ఉ. ఏకులమైననేమి మదిరేక్షణ భోగ్యరసాలవాలమై
పోఁకలనాకులన్ విడెము పొల్పుగఁ బూని పచారుచేయ మే
ల్పోకడ గాంచినంత ముని క్రుచ్చయి తెప్పల మూసి దాని పూ
ర్ణాకృతి ధ్యానమున్ సలుపు నాత్మను బల్వల పుప్పతిల్లఁగన్ 5 7

మ. అరుణాబ్జమ్ములు కాన్కలిచ్చునటులే హస్తంబులన్ జాఁచుచో
ధరణీచక్రిము వెంటనంటునటులం దంబొప్ప నాలేమ బల్

ల్విరుఁదుల్ ప్రేగయి బిట్టుమందగతులన్ బ్రేరేపుఁబో మేలిక
ప్పురముల్ హారతులిచ్చునట్టుల నగున్ పూఁబోఁడి పల్కాడుచో 588

క. అచ్చరలేమలు భువికిన్
వచ్చి తదీయాంగసౌష్ఠవంబారసి ము
ద్దిచ్చి మదిమెచ్చి కౌఁగిటఁ
గ్రుచ్చి కనుల్దెరచి కొనుచుఁ గ్రుమ్మరుదురిలన్　　589

క. సవయస్కలు చెరియొక వం
క విరాజిల నడువ దాని కలికితనమ్మే
చివురుం బోణికి నబ్బున్
దివిజాంగన సౌరు దాని తీరుల కోడున్　　590

క. ఇరులెంపల వాయించుచు
స్వరసప్తక మువిద నేర్పఁ బంచమవిదిత
స్వరమొకటి పికము నేర్చెను
బరభృతములచదువు లెటుల పారము ముట్టున్　　591

క. తనువుల్ మనువుల్ చనవుల్
ధనముల్ వనముల్ త్వదర్పితమ్ముల్ సుమ్మీ
యని సర్వార్పణమొనరిం
చిన యువకుల్ దానికడ వసింతురు నిచ్చల్　　592

ఉ. మారుని స్వారిగుఱ్ఱమన మానిని నిక్కుల కిక్కయౌను గా
సారసరోజభృంగతతి చాడ్పున ముంగురులుం జెలంగు శృం
గారరమావిలాసమగు క్రమతనుప్రభ లుల్లసిల్లు జో
హారు లొనర్తు రెల్లరు వరాంగికి నిచ్చలు చెతు లెత్తుచున్ 593

శా. గోచీ చెంగులు జాలువార వెనుకన్ గుచ్చెళ్ళు మీఁగాళ్ళపైఁ
బ్రాచుర్యంబునఁ జిందులాడ మనుజుల్ బ్రావైక తళ్కొత్తఁగా
ఖోచల్దాల్మునుజేతికందమిడనా పూబోణి చెయ్యెత్తఁగా
పీచుల్ పీచులు గాఁగ బార్శ్వరుచులున్ వీక్ష్యారఁజేయున్ విటున్

ఉ. బంగరుముద్దుటుంగరము ప్రన్నని వ్రేలి నలంకరింపుచుం
డం గరపల్లవంబు పయిటన్ సవరించెడిపట్ల కుంభకా

రాంగన నంగజారి కను లారఁగ నారసె నేని చీరకొం
గుం గయికొంచు వెంటఁబడుఁ గోమలి దాసజనాగ్రగణ్యుఁడై

క. అంగన మామిడిపిందె హో
రంగు జరీ నగిషీ జేచి రా చీర ధరిం
పం గమలాక్షులునున్ వల
పుం గాంతురు దానిఁజూచి పులకల్ మొలవన్ 596

చ. అదియొక కాలమందునన హమ్మతితో నొకవిప్రనందనుం
గదిసి పరాభవింప సమ కట్టినఁ దగ్గురుతేజుఁ డింతితో
మదము విడంగరాదొ వల మానధరామరనిర్మలప్రభా
స్పదు ననువంటి వానిపయి సాఁగకు పోఁగదె యంచుఁబల్కెనన్

చ. అలిగి కులాలవంశకుటిలాలక వానికి నింతపోత్రమా
బలియుర నాదునాన తల పై ధరియింతురు బోడిబాపఁడా!
పలువురు గల్గు దాన నినువంటి ద్విజాళి సహస్రసంఖ్యలన్
బొలియఁగజేయఁ గల్గుదును ప్రొమ్మనుచున్ వచియించె గర్వియై

చ. ఎఱుఁగక బల్కెదీవె చట నెచ్చట బ్రాహ్మణతేజ మీవు కు
మ్మరితవుగాని బావలకు మారివి కాఁగల శక్తి యున్నదే?
యరుగుమ సారె చేరవకు నన్నువరాకుమమిన్నకేఁగుమం
చురుతరకం పమానుఁడగు చున్ వచియించెను బాపఁడయ్యెడన్

క. కోపమునుం బుట్టెడు నది
కోపంబే గాక యన్య గుణమగునె యనన్
కోపోద్దీపితమానస
యై పెదవింగఱచికొనుచు నయ్యదిపల్కెన్ 600

క. త్రిసహస్రబ్రాహ్మణలస
దసువుల నెడలింపకున్న నగునా పై నొ
ట్టుసుమా! యని రోసమ్మున
కసుమాలపుఁబ్రతినపట్టెఁ గట్టిఁడి యగుచున్ 601

వ. అంత నది తన వంశవదులైన ముష్కరకోటిం బిలిచి వారలతో
నిట్లనియె. 602

క. బాపనవారఁట! పాపము
లేపులనడిగింతురంట! యెక్కడిమాటల్?
నాపయిన మత్సరం బిడ
నే పురుషుండైన బ్రతుకునే యెపుడైనన్? 603

క. త్ర్యక్షుం డడ్డము వచ్చిన
నీశ్రద్రుల మూఁడువేలనేసమయింపన్
దీక్ష వహించితి మీమీ
కౌక్షేయము లంది రండు కార్యము దీర్పన్ 603

వ. అని వారిఁ బ్రోత్సహించి కడుపులనిండఁ గల్లుంద్రావించి వారి వెంట నిడుకొని.

క. తన వ్రతము పూర్తియగు వఱ
కును బాపల వెదకి వెదకికొని చంపించెన్
మనుజాశనులన వేఱే
మనువారలె? క్రూరులయిన మనుజుల్ గారే? 605

క. సాధుజనమ్ముల నూరక
బాధించెడు వారు కోపభావస్ఫూర్తిన్
బోధవెడి స్వయకుత్సా
రాధన మొనరించు వారె రక్కసు లరయన్. 606

చ. అసురుల మెచ్చునిట్టులవ్రతాంతసుదీక్షను నిర్వహింపఁగా
వసుధను బ్రహ్మనిష్ఠుఁడన వాసికి నెక్కిన బ్రాహ్మణోత్తమున్
కసికొని చంద్రహాసమున కంఠమునున్ దునుమాడగావలెన్
బసరమునుం గసాయివలెఁ బాపము లేదని యయ్యదెంచుచున్

క. ధర బ్రాహ్మణ్యానులనన్
గురుతుకునో వారు నెండఁ గొండ చఱియల్వ
దిరిగెడి వారిని వినుకలి
కరమున్ వఱలుటను జేరెఁ గైలాసాద్రిన్ 608

మ. వివిధామ్నాయవిశారదోత్తములఁ జంపింపంగ వీక్షించి బల్
సవనంబున్ బొనరించు నాకవబృధస్నానంబు చేకూరఁగా

నవు నిచ్చె నని ముచ్చటించుకొని బ్రహ్మజ్ఞాని దర్శించు కో
ర్కి విశాలాచలకందరాంతరములన్ రేయిన్ బవల్ ద్రిమ్మరెన్

మ. ఒకచోఁగల్పనగంబు నీడ ననువై యొప్పారురత్నాసనం
బకలంకస్థితి నాశ్రయించుకొని యాత్మాలోకనాతత్పరున్
వికచాంభోరుహనేత్రయాచుఁగని యువ్విళ్ళూరగాసాగె నేఁ
టికి నాకోర్కి ఫలించె నంచు నటువైతీవిన్ దగంజేరుచున్ 610

చ. కరతలదండ్రిహాసమును గంతముపైఁ దగ వేయఁబోవ న
బ్బురముగ స్తంభనంబొదవి భూరిమదంబరి సర్వధాతును
స్థిరమలదాహకమ్మయిన తేజ మొకానొకఁడందుఁ బర్వ న
త్తరుణికిఁ గలె నూతనవిధమ్మగు మానస వీధి చెచ్చెరన్ 611

వ. అది యిట్లు పలికె. 612

ఆ.వె. మదనుచేతవిప్రమాహాత్మ్య మెఱుఁగక
పాపకట మింత వఱకునేను
వోలి నరకజలధిఁ గూలకుండఁగ నీకుఁ
గోర్కి యొక్క టొదవు కుమతిఁబోయి 613

ఉ. సూరిజనాగ్రిగణ్య! దయ చూడుము! పుట్టిన దాదిగా నహం
కారవిమూఢచిత్తనయి కన్నులు గానక కావరమ్ము చే
దారుణకృత్యముల్ సలుపు దానను దావకపాదసన్నిధిం
జేరిననాయఘమ్ములు గృశించిన వంచుఁ దలంతు నియ్యె 614

క. నే నీపాదసరోజము
లూనఁగ నవరుద్ధబాహ వుచితక్రియలన్
జానుగనన్ సెలవిమ్మిఁక
దీనపరాధీన! భూమిదేవమహాత్మా! 615

క. అని వేడిన నట్లగుఁగా
కనురీతిని నతఁడువల్కి నట్లైనఁగరం
బున కవరోధము మానెన్
వనిత వినయసంభ్రమముల వాకొనె మఱియున్ 616

క. మీవంటి వారి సేవలు
మావంటి జనమ్ములకు న్సమంగళవిధ్వం
సావహ మని నేఁదలతున్
గావున మాయింటివిందుగాఁ జనుదెమ్మా! 617

క. నావిత్త తనుమనంబులు
నీవశముం జేయుదాన నిష్కల్మషధీ
పావనవృత్తిఁ జరించెద
నీవందుకు సమ్మతించి నెనరుంచఁగదే! 618

క. నా గురుదేవుఁడ వౌదువు
నేఁగొల్తును నిన్మహాత్మ నిండిన బత్తిన్
మాగమునకున్ మానక
రాఁగదె యోంగీద్రవంద్య రమ్మా! రమ్మా! 619

చ. అకలుషమానసుండగుచు నందున కాతఁడు సమ్మతించినన్
జకితమృగాక్షి వానిపద సారసయుగ్మము మీఁద వ్రాలి యిం
టికిఁగొని వచ్చి వానికిఁ గడిందిగఁబూజ లొనర్చి పేర్చు మ
చ్చిక దయివార నాఘనుని జేరి వసించె జగన్నుతస్థితిన్ 620

సీ. నీపాదరజములో నాపాపములుబాయ
కాళ్ళగడ్గెదను వేనీళ్ళ దెచ్చి
మజ్జనమ్మనినన్ను మన్నింపఁగా నీవు
గొజ్జంగితోఁ దీరు మజ్జనమ్ము
సేవకీతిలకమం చీవుగారవమీయఁ
దిలకంబు నుదుటను దిద్దుదాన
దరిలేనినామన స్తాపంబు చల్లారఁ
జందనచర్చలొసంగుదిప్పు

గీ. డతులవాసనలెల్లన న్నాదరింప
పూలదండలనీమెడ న్వ్రేలనిడుదు
ననుచు నాత్మార్పణము చేసి యనుదినమ్ము
కుటిలకుంతల సేవించు గురువరేణ్యు. 621

ఉ. నాగరికప్రపంచముకనన్ వినరాని నవీనభక్ష్యముల్
భోగములున్ గురూత్తమునిముందట నాదట నిల్పి పీనినిన్
వీఁగక యారగింపఁగదవే యని బల్మరు వేడి వేడి తా
నెగతి నైన వానిభుజియింపగఁ జేయును బుజ్జగించుచున్ 622

క. ఏయం తెఱుఁగని వానికి
నాయింతి తలంటిస్నానమాడించి బహు
శ్రేయోదాయకుఁడవు దని
ప్రేయంబులనెన్నియైనపిమ్మట ఁబల్కున్ 623

క. త్రిగుణముల గెల్చు వానికి
మగువ యొసఁగు నాకుఁబోఁకమఱిసున్నంబున్
దగనిడితాంబూలమ్మున్
దెగుఁతన త్రిగుణమ్ములంచుఁదెలిసియకాదే! 624

తే. షడ్రసోపేతములుగ భోజనములిడుచుఁ
దనషడూర్మ్ములు దూరమౌదారి యనుచు
షోడశార్చన లర్పించుషోడశకల
లలరు పురుషుని దెలియంగనతివమిన్న 625

సీ. ఎన్నెన్నిభోగంబులేగతిం జవికొన్న
దవులొంద కుండ నీధన్యతముఁడు
సుఖములెన్నెనియుంజూఱగైకొన్నను
గోర్కిలేకుండ నాకోవిదుండు
వింతలెన్నొ యనుభవించి మించినయైన
వింతలేకుండ నావిబుధవరుఁడు
పూజలెన్నెని యాపూబోణి యొసఁగినఁ
జలియింపకుండ నాశమధనమణి

గీ. యేఱు లారినఁ బారిననేకవిధము
గాంచు గంభీరజలనిధికరణి నతుల
విషయములమధ్యఁదాను నిర్విషయుఁడగుచుఁ
గుమ్మరిదిసేయు సేవకుఁగదురుపడును 626

మ. గురుపాదాబ్జయుగమ్మునుం గొలుచుచున్ గొన్నాళ్ళు లిమ్మాడ్కి గు
మ్మరిపూబోణి చరింపగాఁ గలుగుటన్ భవ్యాత్మవిజ్ఞానపున్
సిరి యావిర్భవమయ్యె నయ్యదియు సుశ్రేయఃపదావాప్తి సు
స్థిర మోదమ్ములు గాంచి ముక్తి గని భాసిల్లెన్ సుబోధాత్మయై

ఉ. కుమ్మరికొమ్మ తండ్రియును గూరిమితల్లియు నేస్తకాండ్రునున్
గ్రిమ్మెడి మాయపో నడచి క్రమ్మర జన్మము నొందకుండ భా
గ్యమ్ముల కెల్ల తావులయి కమ్రయశోలతికానవీనపు
ష్పమ్ములునై జరించిరి శుభప్రదుఁడౌ గద జ్ఞానియెయ్యెడన్ 628

ఉ. దీనులఁ బ్రోచు దీక్షలును దీర్చుటకై యవతారమెంచు సు
జ్ఞానులు సద్గురూత్తములొ సంగని శోభనమెద్దిగల్గు వి
ద్యానిధులైనవారు గద యన్యుల నుద్ధరణంబొనర్చి య
జ్ఞానము మాన్పఁగల్గు బుధచంద్రములన్యులు సేయనేర్తురే? 629

క. పిమ్మటఁ గైలాసమ్మున
కమ్మగువయు గురువరుండు ననుచరయుతులై
పమ్మినవేడుకఁ జేరి సు
ఖమ్ముగ వసియించి రలఘుగౌరవమొప్పన్ 630

క. జ్ఞానుల కొనరుచు శుశ్రూ
షానివహమ్ములను మోక్షసంపద తెలమిన్
బూను నరులెందరెందఱు
నైనఁ గలారంచుఁ దెలియుఁడమలస్వాంతుల్ 631

ఉ. కావున నేవచించిన ప్రకారమునన్ హరుఁ బ్రీతుఁ జేసి బం
ధావళిఁ ద్రుంపఁగాఁ గలిగి యవ్వల శాశ్వతమోక్షమై భవ
మ్మావహిలంగఁ జేసికొని యార్యజనోత్తములార! పొందుఁడీ
గ్రావనివాసమూర్తి నురగప్రికటాంచితభూషణున్ వేసన్ 632

## 32. భక్త్యభావకారణ నిరూపణము

వ. ఆర్యజనవతంసములారా! యానందముగోరుకొనని వారెందుఁగలరు
తుచ్ఛాతి తుచ్ఛమగు విషయానందమె యంత లోకప్రియమై యుండ

నఖండానంద రసస్వరూపమైన మోక్షానందం బేరికిఁ బ్రియము గాకుండు? నట్లయ్యు నుపేయంబైన మోక్షమునందుఁ గల ప్రీతి యుపాయములైన భక్త్యాదులయందు లోకమునకుఁ జెల్లుట లేదుగదా యది సర్వలోక విదితమ్మగదా. కాని యుపాయసాహాయ్యము లేక యుపేయమెటుల నొందవచ్చునని తలంపిం చుకంతయైనఁ గానక యుపేయము మాత్ర మభిలషించుచు నుపాయమునం దనాదరణము గల మూఢలోక మ్మెట్లు శిష్టజనాదరణీయమ్మగుఁ గావున భక్త్యాభావ మే హేతుప్రభావమువలనగలుగుచున్నదో వివరించెదను. వీను లిచ్చి వినుండు. తొల్లి నొకప్పుడు ప్రాణిసంచయసంపాదిత దుష్కర్మ కారణమున నగు కాలవిపాకమున ద్వాదశవర్షకాలపర్యంత మింద్రుండు చిటుక్కుమన నొక నీటిబొట్టైనను నను మేఘముల వర్షింపనీయండయ్యె నందువలన ద్వాదశవర్షక్షామము ప్పతిల్లె. నాకాలమునఁ బ్రాణిజాలమ్ములు పడినయాఁకలి బాధ లేకరువు బెట్ట నలవికాదు. 633

క. అన్నపు మెతు కొకటైనన్
గన్నులకున్ గానరాక గరమును బ్రాణా
పన్నంబయి లోకము వే
గె న్నిరతము మంగలమునఁ గింజలు వోలెన్ 634

క. మన్ను దినిరొక్క కొందఱు
గ్రన్నన మనుజులను దినిరి కాలినకడుపే
తెన్నన నారక కొందఱు
వెన్నులకుం గడుపులంటి వెతలం బెట్టన్

క. ఆఁకొన్న వానికేలా
పాకాదిరుచిప్రశస్త వస్తూత్కరముల్
గైకొను నెదియైనను నను
లోకోక్తి యదార్థమౌ విలోకింపంగన్. 635

క. కాలెడి కడుపునకున్ దెగ
ప్రేలెడి నోరునకు నరుచి విదితమ్మగునే

కీలి కభక్ష్యములున్నే
జాలియుఁ దలజూపునొక్క జనమాఁకొన్నన్　　636

క. ఈనిన పులులకు నీపై
ప్రాణంబగు గ్రుడ్లఁ దినెడి ఫణులకు జోడై
మేనులు నిల్పుకొనుటకై
దెనిన్ గనిమానకుందురితినక తీధార్తుల్　　637

క. లేమియు నాఁకటిచిచ్చును
కామాతురతయును నెట్టి ఘనులను నైనన్
భీమాఘంబులఁ జేయం
గా మనమున్ బ్రోత్సహించుఁ గద సతతమ్మున్　　638

క. మృతి నొందిన వారికి నిన్
గతజీవులు గాకయుండు కష్టాత్ములకున్
సుతరాము భేదమెన్నఁగ
మతిగల్గునె యెంత బుద్ధిమంతుల కైనన్　　639

తే. చచ్చి పడియున్నవారును జావనున్న
వారునై యెల్ల రాఁకలి బాధకోర్వ
లేక మలమల మాడిరి లేవలేరు
చావనున్ లేరు చచ్చిరి చావకుండ　　640

వ. సకలభీభత్సరస మట్లు తాండవింప నాలుక లెండఁగుళులు మండఁ బాపంబులు పండ నానుకొన నేయండయుం గానక బ్రహ్మాండంబుల నెల్ల విచారించుకొని కొంద అమందపుణ్యావశంబున సుభిక్షంబు గనొక్క గౌతమాశ్రమప్రాంతభూమియున్నదని యెఱింగిన వారై తత్తపోవనంబులకుఁ జేరికొని తదాశ్రమమునందు మేనులఁ జేర్పగలిగిరి. 641

తే. ఫాలనేత్రుని కృప యతి పాదుతపము
బ్రోది సేయఁగ నాశ్రమ భూమి తత్త
పోవనంబును వర్షవి స్ఫూర్తి నొంది
కలవు లెఱుఁగక సస్యసం భరితములగు　　642

క. ఆరిన పెదవుల నచ్చటి
నీరాని తమించి కొంత నిలిచిన యసువుల్
సేరుకొన మేనఁ గ్రమ్మర
వారందఱు గములగూడు వారై యవలన్ 643

వ. గౌతమఋషి సందర్శించి వినయపూర్వంబుగ దీనాననులై 644

చ. కఱవులు మమ్ముఁ బట్టికొని కాల్చుక తిన్నవి యింతపట్టులన్
హరహర మాదు పాట్లు తెలియన్ వశమే యిఁకఁ జెప్ప నోప రె
వ్వరు మునిచంద్రమా! మముఁ గృపామతివై యవనం బొనర్ప నీ
శ్వరుఁడును నీవుకాక పెఱవారలు గల్గరు నిక్కమెంచుచో 645

క. కూడును గుడ్డను బదిరెం
డేడులెఱుఁగకుం డువారమిదె మమ్మున్ మా
తోడఁ జనుదెంచువారిన్
జూడుము దయతోడఁ గూడు చూడ్కుల ననఘా! 646

సీ అస్థిపంజరమ కాకరయ నేమున్నది
పూర్వ మీతఁడు దొడ్డ బొజ్జనొప్పు
నూచకాళ్ళను జేతులూచశక్తియు లేదు
తొలుత జమాజెట్టి దొరయ యితఁడు
హీనస్వరముతోడ దీనుడై పల్కును
మొదట సింహార్భటిన్ బొదలు నితఁడు
కనులు లోఁతుగఁబోయి గనబూచివలెఁ దోచు
తొగరేకు కనులమున్ దగు నితండు

గీ. చిన్న చిరుగుల బొంత నీయన్నమిన్న
మొలను గట్టుక లజ్జమైఁదలను వంచి
యచ్చటం గూరుచున్నది వచ్చి సగము
రాతిగుండెయుఁ గరుగు నన్నాతిఁజూడ 647

క. నూఱేండ్లది వలె నిది పది
యాఱేండ్లది యయ్యుఁదోఁచుఁ నాస్యవళీశ్రం

గారంబు చప్పిదవుడలు
నౌరా! యిది పడుచు ముసలికిదగును మునీంద్రా! 648

తె. మూఁడుహజ్జల మాత్రమే వీఁడు తొలుత
గుజ్జుగుజ్జని వీని వాకొందు రెపుడు
వీఁడు బొట్టనవ్రేలంత వాఁడెయయ్యె
పురుషుడంగుష్ఠమాత్రుడ న్వేరవునిదియె

చ. మరిమరి చెప్పనేల మునిమాన్యశిరోమణి మాదుసీమలన్
గలవులు వచ్చి కాఁపురముగై కొనుటన్ గలవయ్యె సర్వమున్
గలవులు మాత్రమున్ గలవుగానక మేపగు నెల్లజీవులున్
గలవగు వేళ నేరినవిగాసిలఁజేయునొ జూడగాఁ వలెన్ 650

క. గరువులఁ దిష్ఠలు గుదురవు
గరువుల నిష్ఠలును సున్న గద! జన్నంబె
వ్వరు సల్ప కునికి సురలకుఁ
గలవయ్యెనుదిండి నోరు కాయలుగాచెన్ 651

క. ఇలవేల్పులు గుడివేల్పులు
జననై వేద్యములు లేక సంకటపడుచున్
శిలలున్ దారువు లగుటనొ
చరియింపరు తారుగల్లు స్థానము లందున్ 652

సీ. సలిలంబు లింకఁగా జలచరమ్ములకొక
సంఘమారణములు సంభవించె
కసవుగింజలు లేని కతమున నవి దిను
జంతుజాలము లెల్ల సమసిపోయెఁ
దినమాంస మలవడమిని పలలాహార
జీవసంతతులు నశించిపోయెఁ
గొల్వ నెవ్వరులేక గుళ్ళు దేవుళ్ళును
రాళ్ళు రప్పలును జీర్ణాళ్ళు నయ్యె

గీ. భూములెల్లను గాడులై బుగ్గియయ్యె
మడుగు లెల్లను దెగ కాలి మంటలయ్యె

గొప్ప నదులింకఁ బాటిబల్ ◊ తిప్పలయ్యె
చెప్పఁగా నెవ్వఁడొప్పుమా ◊ తిప్పలెల్ల 653

ఉ. చండమయూఖభానుపరు ◊ షప్రకటాయుతఘర్మభీష్మమా
యెండకు బీటలువాఱియిల ◊ యింగలమున్ బొగయున్ వెలార్చుమా
ర్తాండుని వేడికోర్వ కురి ◊ గాధిపుకోఁటల మీఁది యూర్పులు
ద్దండగతిన్ విదారణప ◊ దంబుల వెల్వడి రేఁగుచుండఁగన్ 654

ఆ. ఋతువు లారు నైన ◊ గ్రీష్మ హేమంతముల్
రెండు నొకటి విడిచి ◊ యొకటి వచ్చి
యుడుకు నొకటిఁగూర్ప ◊ వడఁకు నొక్కటి గూర్చు
వెట్టి చలియుఁగూడ ◊ వెతలఁ బెట్టు 655

క. పలుపలుకులేల? దీనుల
మలబ్ధశరణులము సీదు ◊ నండ వసింపన్
గలవారము కాదనకుము
గలవారలు గాక యొరులు ◊ గావంగలరే? 656

క. అని విన్నవింప గౌతమ
ముని యింతఁగ నుడువనేల ◊ మునులకు దీనా
వనమునకు మించు ధర్మ
మ్మును గలదే యనివచించి ◊ మోదము నించెన్ 657

వ. మఱియు నాయతిథిసత్కారనిపుణుండు

క. నాకుఁ గలయదియు మీరుం
గైకొని నన్నుం గృతార్థు ◊ గా నొనరిచి మీ
మీకష్టమ్ముల నేమరి
నాకడ నివసింపఁ బండు ◊ నాకోర్కులికన్ 659

క. అని వచియించిన వారలు
వనటలు దీరినవి వోలెఁ ◊ బరమానందం
బునుగనిరి వారలెల్లరు
చనుఁగద యిక్కట్టు లొక్క ◊ చల్లని మాటన్

మ. ధనధాన్యంబులు వస్త్రముల్ దిలలునుం ◊ దైలంబులున్ గంధమున్
ఘనసారమ్ములు దమ్మలమ్ములును మే ◊ ల్కస్తూరి మున్నైనవా

నిని నెవ్వం డెదిగోరు దానిని రవంత తెన్ లోటులేకుండ న
ట్లు నిరాబారి యొసంగె వానికిఁక సీతఁడున్ గల్గనే యెయ్యెడన్

సీ. వ్యాధిచేఁగృశియించు వారి నారసి భిష
 జ్మణులను బిల్పించి మాన్పెవ్యాధి
సంస్కారహీనులౌ జనముల గనుగొని
 యలఘుసంస్కారవంతుల నొనర్చె
చిఱుపాపలకు బాలు వరియించి వారింటి
 ముంగిటి ధేనువుల్ పూని నిలిపె
శయ్యాసౌఖ్యము కోరు పరసాత్మ్మలకుఁ బట్టు
 దిండ్లతో బఱుపులున్ తెలిసియిచ్చె

తె. భక్ష్యభోజ్యమ్ము లెన్నెని పంచిపెట్టె
నృత్యగానాదిముదములన్ నియతిఁగూర్చె
గౌతముని వంటి దాత యెక్కాలమందుఁ
గలుగఁడని చెప్పవచ్చు లోకమ్ములందు. 662

క. చిరకాల మిట్లు లరిగిన
వరవాక్యార్థము లొనర్పఁ బరిషత్తొకటిన్
దరతమభావము లెంచఁగ
సురసభఁబురుడించు దాని శుచిమతి గూర్చెన్ 663

ఉ. పండితులెల్ల రందు శ్రుతివాక్యములన్ వివరించి చెప్పఁగా
దండిగ నందు నుక్కఁగను ధన్యుల నన్యముదంబు లొందఁగా
మండనమౌచు దత్సభకు మాన్యుఁడు గౌతమమౌని నాధుఁడై
యుండగ నొండిగోవొకటి యొద్దకు రా సమకట్టు నుద్ధతిన్ 664

క. వాలముద్రిప్పుచు నిటునటు
నోలగముం జొరఁగదాని నొగిమరలింపం
గేలనొక పూతిగొని ముని
లీలకునై గొట్టునట్టులే ప్రహరించెన్ 665

క. గ్రక్కున నది మరణించిన
ముక్కున వ్రేలుంచుకొనుచు బుధపరిషత్తా

చక్కఁగని నీవు పాపుఁడ
వుక్కివుఁడ వటంచు బల్కి రుత్కంఠములన్ 666

చ. కరుణ యొకింత లేని బలుకట్టెఁడివై గద గొట్టినాఁడ వీ
సురభిని జచ్చె దాన నిది శుద్ధుఁడవీవెటుకాదు నిన్ను దు
ర్భర దురితమ్ము చుట్టికొనె బ్రహ్మపవిత్రిత లంతరించె నో
పరిషదకార్యశాసనము పాతక గౌతమ యంచు వారనన్ 667

వ. గౌతముఁడు కోపారుణనయనచణుండగుచు నిట్లనియె. 668

క. నన్నును నాశీలంబును
మున్నె మెఱిఁగియును దోషమున్ నాతలపైఁ
గ్రన్ననఁ బెట్టితిరిది నే
మన్నింపగఁదగిన దురితమా! మందమతుల్ 669

ఉ. చీపురుపుల్లఁగొట్టినను జీవముఁ బాయునె గోవు నాపయిన్
బాపము పెట్ట నెంచి యిటు పల్కితి రంతియ కాక దానికిన్
శాపము సొంతమౌట నటు చచ్చె రహస్యమిటుండ మీరు న
న్నీపగిదిన్ నృశంసుఁడని యెన్నుట మీకును సాహసంబయౌ

క. పిన్నని పెద్దని యెంచక
నన్నవమానించు మీకు నాకున్ మోమో
టన్నది యేలాయిఁక మీ
కు న్నే శాపంబు నిడుదు గొనుఁడీ దీనిన్ 6/1

చ. విదితచరిత్రులందు నొక వేళ నొకానొక దోషమున్నటుల్
మదికిని దోఁచినంతనె విమర్శ నొనర్పక పామరున్ బలెన్
గదిసి యధేష్టవృత్తి బలుకం జనరాదు యదార్థ మెట్టిదో
పదిలముగాఁగ జేరితెలుపన్ గదె యంచును వేఁడఁగావలెన్

మ. కలశాస్త్రంబుల నెల్ల ఁజూచిన జగత్కళ్యాణవృత్తాన్వితుల్
కలనైనన్ దురిత మ్మొనర్పరని వక్కాణింతురి విద్వాంసు లె
వ్వలనైనన్ దొసగొండు వారియెడఁగన్పట్టంగ నద్దాన ముం
గల నారోపణముం బొనర్పఁదగ దెక్కాలంబునంగాంచుఁడీ

క. ఉత్తములగు వారలను బ్రి
మత్తులగుచు నిందసేయు శ్రమందులరగు మీ
కిత్తున్ శాపం బొక్కటి
నిత్తరి మీవంటి వారికెల్లను బుద్ధియగున్ 674

సీ. శివపూజ లొనరింపఁ జేతు లాడకయుండు
శివకథల్ వీనులు చెలఁగి వినవు
శివమూర్తి ధ్యానింప చిత్త మొప్పదు శివ
గాథలు వల్క నాల్క రుచి గనదు
శివమందిరమును దర్శింపఁ గాన్పింగవు
శివరూపుఁ జూడఁ గన్గవకు రోఁత
శివభక్తుఁ బూజింప నవు ననిష్టము శివ
తీర్థమ్ములకుఁ బోవ దీర దెపుడు

గీ. శివుని నామంబు జపియింప జిహ్వ చేదు
శివునిమాహాత్మ్యముఁ వల్క చెట్టగ్రిమ్మి
శివున కర్పించి దానము చేయకుందు్రి
శివుని సంరర్భములును నింద్రపవు ముదమ్ము 675

ఉ. అక్షయసంపదల్ గలుగ సంగమునన్ బలుబూదిఁ బూసి రు
ద్రాక్షములన్ ధరించి నిటలాక్షుని మందిరమందుఁ జేరి ప్ర
త్యక్షముగా హరాకృతిని నారయు భాగ్యము కల్గకుండు నే
దక్షుఁడనై శపించితిని తప్పదు మీకిది సర్వభంగులన్ 676

మ. కరము న్నిత్యము కాకిక్రియల్ నెరపఁగా గామ్యంబు వర్జింపఁగా
వరశాంత్యాదిగుణమ్ము లిమ్ముగను సంపాదింపఁగా జ్ఞానవి
స్ఫురితాధ్వంబుల సంచరింపఁగ జపంబుల్ సల్పఁగా వేదపా
ఠరుచుల్ స్వీకరణంబొనర్పఁగ నకుంఠద్వేషమున్ గాంచుఁడీ 677

ఉ. వేదములన్ దదంగముల విశ్రుతదానములందు యజ్ఞసం
పాదనమందు యోగముల పావనదీక్షలయందుఁ బాపవి
చ్ఛేదమునందు బల్నిగమశీర్షములం దితిహాసక్రమగా
థాదులయందు మీమనము లంటక యుండెడుగాత మెప్పుడున్ 678

చ. అనలుఁడు సాక్షిగాఁ బరిణ§యమ్మగు కొమ్మకుఁ బ్రీతి గూర్ప న
న్యునికిని దారమింప మది§నువ్విళులూరకయుండఁ బుణ్యతీ
ర్ధనిచయసేవసల్పఁగ ను§దారులఁ గూడి మనంగ మీమనం
బనిశము సేవగించి బహు§పద్ధతులన్ మిము నేచుగావుతన్ 679

ఉ. వెన్నుఁడు మున్నుగాఁగలుగు§వేల్పుగముల్ శివుకన్న నెక్కుడై
మన్నన కెక్కు నన్న భ్రమ§మానక మీకగుఁగాక సంతతం
బెన్నుచు శంఖచక్రగద§లీడ్యము లంచును వానిమేనిపైఁ
జెన్నగు ముద్రవెట్టుక యి§సీ చరియింపుఁడు దాసదాసులై 680

మ. మఱియున్ వర్తుల మర్ధచంద్రసఖమున్§మత్స్యాకునాకారమున్
గిరిజానాయకశూలరూపమునునై§నేపైన చిహ్నంబులన్
గురువిశ్వాసముతోడ మీరు నుదుటన్§గుత్సాత్ములై నిల్పుచున్
నిరతంబున్ విహరింతురుగాక యవనిన్§మీమీప్రదేశమ్ములన్ 681

చ. గదయును శంఖచక్రములు§కంజము పాశము నంకుశమ్ముగ
ల్వదయిత మున్నుగాఁ గలక§శంకములన్ ధరియించి పెద్దకో
విదులము మేమ యంచు బ్రభ§వించిన గర్వము తోడ నెప్పుడున్
జదల స్పృశించునట్లు తెగ§సాగుట మీ కలవాటు లయ్యెడున్ 682

క. అతిహీనజాతినామాం
కితులును దద్రూపధరని§కృష్ణాత్ములునై
క్షితిఁ గలకాలము దిరుగుచు
మతిమద్ధూష్యప్రవృత్తి§మజ్జనులగుఁడీ 683

ఉ. తల్లిని దండ్రి సోదరుల§దారలఁ బుత్రుల బాంధవాళి భా
సిల్లెడి తీర్థరాజములఁ§జేవ జెలంగెడి వేదధర్మముల్
గల్లను మత్స్యమాంసముల§గట్టెడులై తగనమ్ముకొంచు మీ
రెల్లరు దుష్టవర్తనులు§హీనులునై చరియింతురు గాకెటన్ 684

క. వేదానంగికృతబౌ
ద్ధాదిమతములన్ గ్రహించి§యాత్మహననసం
వాదకులయి ధర్మేతర
చోదకులయి యుండుగాక§శోచ్యస్థితులన్ 685

ఆ. పాంచరాత్రదీక్ష పశుపతిమతమును
మీకుఁ బ్రియములగుచు మెలఁగుఁగాక
కడుని కృష్టమైన కాపాలికాదిద
ర్శనముమీకు నిష్టసరణి యగుత 686

ఆ. బౌద్ధమతము మఱియు బార్హస్పతంబును
బట్టు మిమ్ముఁ బట్టి విడువకుండు
శాంభవంబు వామ శాక్తేయమతమును
స్వకృతదురితఫల మొసంగుఁగాత 687

క. మీరున్ మీసుతులున్ మీ
దారలు మీవంశజులు యథాశక్తి మదు
క్త రమ్యపద్ధతిం జనుఁ
డెరీతిన్ శంభు నెఱుఁగ కిద్ధర మనుచున్ 688

మ హరునందున్ హరుధర్మమందునను శ్రద్ధాభావమిట్లయ్యెనె
ల్లరకున్ దొల్తను దాని దూరముగఁ ద్రోలంగా హరజ్ఞానమే
పరమోపాయము గాన నీశు సతమున్ భక్తిన్ దగన్ గొల్వఁడీ
శ్వరపాదార్చనకన్న నెయ్యది శుభప్రారంభకం బెన్నఁగన్ 689

ఆ. భూతి దాల్పు టయుఁ ద్రిపుండ్రధారణమును
శైవభక్తి మూఁడు చక్కఁ బూని
దక్షులై యెనర్ప దాక్షాయణీపతి
జ్ఞానలక్ష్మి మీకొసంగు నిజము 670

## 33. పరతత్త్వనామ విచారము

చ. అలఘుమనీషులార: పరమార్థము శంభుని తత్త్వమౌ గదా
గలుగుఁ దదీయనామము లగణ్యములై యిట కల్పితములై
తెలుపును దానినందు గమనింపుఁడు కొన్నిటి నేనుబల్కెద
స్తులఫలమందునం గలుగు దూరమగున్ దురితమ్ము లన్నియున్

క. ఏనామములన్ బేర్కొనఁ
గా నే మోక్షమ్ము జగతిఁ గలవారలకున్

పీనులవిందుగ వినుఁడీ
నేనుడువుదు గురువునొద్దనేరిచినట్టుల్ 672

తె. అవధి సంసారమున కౌటనవధి యనఁగ
నఖిలమునందు నిల్పుటనాది యనఁగ
నన్నిటినినాహరించుటనత్త యనఁగ
గేయమగు శైవతత్త్వాభిధేయములయి 673

సీ. అద్భుతుండాధారుఁడంతకారియు నహ
మర్ధుండు నద్వైతుఁడప్రమేయుఁ
డవ్యక్తుఁ డనఘుఁడంధకరిపు ఁడహి
ర్బుధ్న్యుం డతిపవిత్రమూర్తి యమలుఁ
డతులసాధనుఁ డాత్ముఁడానందుఁ డాయత
నుం డనుభూతి యఖండరసము
నీశ్వరుం డీశానుఁడీశుం డుమావరుఁ
డుగ్రుం డుమాప్రియుఁడుడుపమౌని

గీ. కాలగళుఁడు కపర్ది కపాలి కాలుఁ
కాలుఁ డుపపంజరుండును గాలకూట
ధరుఁడు కృత్స్నుండునుం గిరాతపతి కోమ
లుండు కామారియును గేవలుం డనంగ 674

తె. గిరిశుఁడు గణేశుఁడును జంద్రధరుఁడు జన్మ
కారణుడు జన్మమరణాదిదూరుఁడును జ
గత్ప్రభూత్తముఁడుం జగత్కర్త యనఁగ
శైవనామంబులై కొన్నిజరుగు జగతి 675

తె. తత్వవిద్యాగరిష్ఠుండుతత్వగురుఁడు
త్రిపురహరుఁడు త్రిశూలుండుత్రినయనుండు
దహరుఁడున్ దక్షయజ్ఞవిధ్వంసకర్త
ధామవర్జితుఁడును బరంధాముఁడనఁగ 676

తే. ధాతయన ధారయిత యనద్రష్ట యనఁగ
దెవుఁడనఁ బరదేవతదివ్యుఁ డనఁగ

దేవదేవుం డనంగను దృశి యనంగ
మహితశివునకుఁ గొన్నినామములుగలవు 677

తే. నిత్యుఁడును నిర్గుణుండును నిర్భయుఁడు ని
రామయుండు నిరంజన శ్రీమయుండు
నిశ్చలుండు నిత్యానంద నిపుణమూర్తి
యనఁగ నభిదేయములు కొన్ని యభవున కగు 678

సీ. పశుపతియును బతి పరమాత్ముఁడు పరుఁడు
ప్రభువు ప్రశాంతుండు పాలకుండు
పవమానుఁడును బ్రజాపతి పరాత్పరుఁడును
పాలాక్షుఁడు పినాక పాణి పాప
నాశనుండు పురాతనముని పాశహరుండు
ప్రాణుండు పార్వతీప్రాణవిభుఁడు
పుణ్యుఁడు పురుషుండు పూర్ణుండునుం బ్రకా
శుండు పాశముఁ బ్రధితుండు ననఁగ

తే. భవుఁడు భూతేశుఁడును బ్రహ్మ భవవిరోధి
భీమదేవుఁడు నాదిమ బిక్షుకుండు
ననఁగ బహునామములు గలవును హరునకు
భువనపతి భూతపతియును భోక్త భోజి 679

సీ. మహిత మహాదేవ మౌని మహర్షి మ
హాత్మ మహామాయి కావిధలును
ముక్త ముకుందేశ ముక్తి మహాగ్రాస
మధురస్వరాదినామములు పెక్కు
మృడుఁ డపరిమేయుఁడు మేరుధరుండును
మూలకారణుఁడును మోచకుండు
మూలగురుండును మూలాయతనమును
మూలధనంబును ముక్తిదాత

తే. వ్యోమకేశ మహాదేవ వామదేవ
వహ్నిరేతో విరూపాక్ష వరవితరణ

విశ్వరూప వినాయక। వేదవేద్య
సంజ్ఞలెల్లను దగు శివ। సంజ్ఞ లగుచు 680

తె. విశ్వవేష విశాలాక్ష। విశ్వభర్తృ
విశ్వకృద్విశ్వవిద్విజ్ఞ। విగతకామ
వేదవేదాంతవాస్తవ। విద్వ్యపాంశ
విమలవైశ్వానరాఖ్య। లవెలయు హరుఁడు 681

తె. శంభుఁడున్ శర్వుఁడు శివుండు। శంకరుండు
శంకుఁడున్ శిపివిష్టుఁడు। శాస్త్రయోని
శూలి శ్రీకంఠుఁడను పేరు। లోలిఁ బరమ
శివునకును వాచకమ్ములై। చెల్లు నెపుడు 682

సీ. సత్పదార్థము సాక్షి। సర్వజ్ఞుఁడున్ స్రష్ట
సర్వవినాశుఁడు। సర్వనిధియు
సత్యుండు శుభుఁడు సం। సారవర్జితుఁడును
సర్వేశ్వరుండును। సర్వసముఁడు
స్వప్రకాశుండు సభా। నాధుఁడున్ సభా
పతియు స్వయంప్రభా। భాసురుండు
సర్వసాధకుఁడును। స్వగతుఁడు స్థాణుండు
స్వానుభవుఁడు సుఖా। సీనఘనుఁడు

తె. సీమ సభ్యుండు స్తుత్యుండు సేతుమూర్తి
సకలమునకు నధిష్ఠాన। చణుఁడు సుధియు
సంసృతివిమోక్షకుండు సం। సారవేద్యుఁ
డనఁగ వాసికి నెక్కు వా। మార్థజాని 683

తె. సత్యవస్తువు సంసార। సారభేష
జమ్ము సకలార్థసారమ్ము। సర్వగృహము
స్వప్రతిష్ఠితమ్మనుసత। తప్రభావ
మను సమాఖ్యలు చెలఁగు ఫా। లాక్షునకును 684

క. సకలైశ్వర్యప్రదజప
నికరమ్ములకున్ బ్రధాన। నియతిఁ దలిర్పన్

ప్రకటహకారము గావున
సకలంకాభిఖ్య భవునకగును దెలియుఁడీ 685

వ. హుంఫట్ శబ్దములు నభవుం దెలుపుపలుకులు. హరిమురజిన్నారాయణవాసుదేవాధిశబ్దములు విష్ణునందు యౌగికములు, వానివలెఁగాక నభవునందుఁబూర్వోక్తములగు నవధిప్రభృతి నామములు రూఢియగుచున్నవి. అరయక ప్రసిద్ధి కన్న సముదాయప్రసిద్ధి బలవత్తరము. కావున నవి సర్వదా స్మరింపుఁడు. 686

క. శివవాచకశబ్దంబుల
నెవఁడేనియు విడిచి యితరమెద సేవింపం
గ విముక్తి లేదు క్రమము
క్తి విశేషము లొదవు వారికిన్ మునులారా! 6 7

తే. అవధి గల్గక పరమాత్మనరయ వచ్చు
నవధిలేక సుఖంబులనందవచ్చు
ముఖ్యవాచకముల శర్వుమూర్తి పేరు
కొన్నమాత్రిన భక్తులకును సత్రంబు 688

మ. సతతానందసుఖస్వరూపమున నీశానుండు కల్పించె నా
మతతిన్ మాయ సహాయఁజేసికొని యిమ్మాడ్కిన్ దగన్ దొల్త ని
శ్చితమిట్లయ్యును గొన్ని నామములకేసిద్ధించు ముఖ్యత్వ మ
గ్గతి సంకల్పము నీశ్వరుండు తొలుతన్ గావింప నీనాఁడునున్

తె. ముఖ్యశబ్దాలతో జపమున్ బొనర్చు
వారి నాలుక మీఁదను గౌరితోడి
శంకరుఁడు తాండవించును సరగ వార
లభవసాయుజ్యమొందుదు రాక్షణంబ 690

ఉ. ఏనరుఁడైనఁ బాపమొక యింతయుఁ బాయకయుండు నాతఁడీ
శానశివాదినామములు చక్కఁగ నోట వచింపకూరకే
పూనును క్రోధమయ్యెడలఁ బోవును వాఁడధమాధమా
జ్ఞానపిపీలికాదిబహు జన్మములం దగఁ గ్రిందు క్రిందుగన్ 691

మ. పలుపల్కుల్ పచరింప నేల శివసాంబఖ్యాతనామాదు లి
మ్ములఁ దామై ప్రకటించు వాచ్యమగు శంభున్ వారిజాక్షాది సం
జ్ఞలు తెల్పున్ మధుసూదనాదుల శివాజ్ఞాధూర్వహత్వాద్యన
ల్లలితాఖండరసైకబోధల వరాలబ్ధప్రవాహంబుచే 692

చ. అలఘుమునీంద్రులార భవసాంబశివాదిమహాభిధానసం
కలితజపమ్మొనర్పఁగ సుఖమ్ముగ మాన్పగవచ్చు మీకమం
గలములు గానఁదజ్జపము గైకొని యింతటినుండి మీరు ని
శ్చలమతులై శివార్చనలు సల్పుఁడనన్యముదాంతరంగులై 693

34. మహాదేవప్రసాద కారణనిరూపణము

చ. పలికెద నిప్పుడేను గురుపాదుల యొద్దకు శిష్యుఁడేఁగి యు
జ్జ్వలతరభక్తి తోడ గురుపాదము పట్టుట సంప్రదాయసం
కలితముగాఁగ దానఁగరకంఠకృపామయసత్కటాక్షముల్
గలుగును ముక్తి యాపిదపఁగల్గును భక్తజనాళికెల్లెడన్ 694

వ. అంతేవాసి పురాంతకసమాను గురు నన్వేషింపవలె నది యెట్లం
దు రేని వినుండు.

తే. సత్యమస్తేయమున్ దయాసరణి మున్ను
గాఁగలుగు సర్వధర్మముల్ గలుగువాని
కామమదలోభమోహాదిగాఁగలట్టి
దుర్గుణంబులు లేనట్టిదొడ్డవాని 696

క. కారుణికోత్తముఁడన నే
పారు మహామహుని శిష్యులాదృతిఁ జేరం
గోరికలు గల్గువానిం
జారుచరిత మొప్పువానిసారతరాత్మున్ 697

తే. దేశదేశమ్ము లెల్లను దిరిగి తిరిగి
వెదుకవలసిన తావుల వెదకివెదకి
పేద పెన్నిధి గనునట్టివిధము తోడ
గాంచి సంతోషమును గాంచి కడఁకతోడ. 698

తే. చందనాగరుమృగమదసరసగంధ
సారకాశ్మీరముల భక్తిసహితుఁడగుచు
నర్పణము నేసి శక్తికినలవి యైన
కాంచనము దెచ్చి గురున కర్పించి యవల 699

తే. దండి నతిఁజేసి పలుసార్లుతగిన శ్రద్ధ
గురుపదంబులఁ దలఁబెట్టుకొని మహాత్మ!
బ్రహ్మమును దెల్పుమంచునుప్రార్థనమ్మ
సలుపఁగావలె శిష్యుండు నవలనెఱింగి 700

వ. గురువరుం డయ్యెడ నిర్జనమును నిర్భయమును సమస్థలమును నైన నొక ప్రదేశమును విలోకించి దాని గోమయమున శుద్ధి యొనర్చి. పూవులం బూజించి దీపధూపపూర్ణకుంభాదులచే నలంకరించి తోరణములు గట్టించి యచ్చట నొక్కచో విశుద్ధమైన తండులములతో నొక మండలము నిర్మించి యందు శిష్యునా-నుం జేయవలె నట్టియెడ శిష్యుం డిరుకరమ్ములు జోయిలించి పట్టి శివానందసంధానమానసుండయి యుండ వలయును. తత్సమయమ్మున నాత్మభిన్నముగాఁ గన్పట్టు నాత్మాభిన్నుం గాఁ జింతించి తాను జపంబొనర్చి శిష్యునకు గ్రంధిచ్ఛేధన నామకసం స్కారంబు దీర్చవలె నయ్యదనున నద్దయాళుయుండు స్వాత్మభూత యయిన పరాశక్తి శిష్యునందుఁ బ్రవేశపెట్టవలెఁ దచ్ఛక్తిమాహాత్మ్య మ్మున మాయ భస్మీపటల మగును. శిష్యునకు స్వకీయాంగమే తాననెడి బుద్ధి పూర్ణముగా నడలును. శిష్యుఁడనంతరము శరీరపాతంబైన వెను కకుఁ దిరిగి తనువొందఁడు, వాని జ్ఞానముపనిషద్వాక్యజ్ఞానము మాత్ర మయి యున్నది. గురుప్రసాదకామి నిత్యము గురు నారాధింపవలెను. మద్గురువరులకు సాక్షాచ్ఛంకరుండీ సంప్రదాయక్రమ మెఱింగించిన దానిని మీకిప్పుడు నుడివినాఁడను. 701

35. సంప్రదాయ పరంపరాకథనము

తే. గురుపరంపర నిపుడు వాకొనెడివాఁడ
దాని నెఱిఁగి ద్విజశ్రేష్ఠుఁడౌను గురుఁడు

తత్పరంపర నెఱుఁగక తనకుఁగల్గు
విద్యయును సత్ఫలంబిచ్చి పెంపుగనదు. 702

ఉ. ఎవ్వఁడు సర్వభూతములకీశ్వరుఁడై తనరారుచుండువాఁ
డెవ్వఁడు సర్వవిద్యలకధీశుఁడనంజెలువొందుచుండువాఁ
డవ్విభుఁ డాపరాశివుఁడ యాదిగురుండని మీరెఱుంగుఁడీ
యవ్విమలాత్ముఁ గన్నమరి యాదిమదేశికుఁడన్యుఁడెవ్వఁడో 703

ఉ. వానికి శిష్యుఁడై పరగి వారిజనాభుఁడు సుప్రసిద్ధవి
జ్ఞానమహాసముద్రమయి సర్వమెఱింగిన ప్రోఢయౌను ద
ద్దీనిధిపాదపద్మములు తేఁకువ బత్తిని గొల్చి పద్మజుం
డౌను గురూత్తముండు సకలాధిపుఁడున్ వరబోధమూర్తియున్

తే. బ్రహ్మసన్నిధి సద్విద్యఁ బడసి యా స
నత్కుమారుండు ధీరుఁడ నంగఁజాలెఁ
జెలఁగి శ్రుతవేదనుండయి వెలయునట్టి
యతని సర్వజ్ఞుఁ డని పిల్తు రఖిలబుధులు 705

ఉ. వ్యాసమునీంద్రుఁ డాఘనుని భక్తిని గొల్చి సమస్త వేదవి
ద్యాసమితిం బురాణరచనాలఘుదక్షకనిత్యతత్వ మ
భ్యాసము సేసి లోకవిహితాదరబుద్ధి జెలంగి సద్యశో
భాసురుఁడై సమస్తబుధవర్గశిరోమణి మాలయై తగున్ 706

ఉ. ఏనును వానిపాదయుగ మెంతయు భక్తి భజించి యింతయై
మీనడుచక్కఁ తావుగని మీహృదయమ్ము గొనంగఁజాలి వి
జ్ఞానఫలోదయమ్ము గను సత్కథ లెగతిఁ బల్కఁ దక్షతన్
బూని చరింతు వ్యాసముని బోలు గురుల్ లభియింపరెందునన్

చ. తెలియుఁడు నెవచించు గురుదేవపరంపర నిట్లు తద్గురూ
జ్వలతరనామధేయములు సారెకు సారెకునుం బఠించి వి
ద్యలఁ గయికొందు రేని యవి తప్పక మిక్కిలి వీర్యవంతమై
ఫలము లొసంగఁజాలు గురుపాదమహామహిమంబు లిట్టివో

మ. అలఘుల్ మీరలు భక్తియుక్తులయి వేదాంతప్రసిద్ధోక్త సూ
క్తులఁ బాటించి ఋజుప్రవర్తనములం దున్ జెల్మి నాలించి యి

మ్మల నాచార్యుల విశ్వసించి విలసన్ మోహాంబుధిన్ వ్రచ్చివె
న్నల సుజ్ఞానమయంబులన్ గొనుఁడువిన్ న్నాణంబుదీపింపఁగన్

సీ. ఆకస మ్మిరుచేతు లారఁ గోరికఁబట్టి
యాఁకలి దీర్చెది పోకడలకు
నిసుక గంపెడు తెచ్చి విసువక తైలము
తిలలు లేకయె తీయు తీరులకును
బందనొక్కని యూధ పతిఁజేసి పగతుర
మగఁటిమిమై గెల్చు తెగువలకును
బురుషకారము మాని యరిది సంపదలకై
నింగి కసుంగొను నేటులకును
తే. వెకలి పై కార్యభారము వెనుకఁబెట్టి
జయము కాంక్షించు వెంగలి సరణులకును
గురుపరంపర లెఱుఁగని గురుని యొద్ద
విద్యనేర్చుట సరివచ్చు విబుధులార! 710

తే. దేశికపరంపరాహీన దేశికుండొ
సంగు విద్యయు నరకవా సమున కగును
గురుపరంపర నెఱిఁగిన కోవిదుండు
మెచ్చి యిడు విద్య మోక్షంపు లచ్చి నిచ్చు. 711

ఆ. ఆత్మగోత్రిఋషుల కాదిని గేల్మోడ్చి
పిదప తనదు గురుని పెద్ద శ్రద్ధఁ
గొలువవలయు నతులఁ గూరిచి గురుగురుఁ
గూడ నంజలిచ్చి కొలువవలయు. 712

తే. విఘ్నపతిని గుమారునిన్ విష్ణు విధిని
విమలవిద్యాస్వరూపిణి నమరవరుల
నెల్ల ధ్యానించి విజ్ఞాన మెదను గోరి
యుండవలె గురునొద్ద శిష్యుండు గడఁక. 713

చ. పరతరశిష్యచిత్త పరిపాక మెఱుంగుచు దేశికుండు త
త్తరతమభావసంపదకుఁ దగ్గ విధంబున నెంచి జ్ఞానమున్

గరముపదేశ మీయవలెఁగాని యదేచ్ఛను శిష్యచిత్తవి
స్ఫురణ మెఱుంగకుండ నొకబోధమెనర్పఁగఁ గూడదెయ్యెడన్.

ఉ. మోహపరీతచిత్తున కమోఘసుబోధమొనర్చుటల్ గురు
ద్రోహమొనర్చుటల్ దురితదూరనయాధ్యయనైకగర్వని
ర్వాహకుఁడౌటలున్ సతముపాలవిలోచను నంతవాని సం
దేహము లేక నారకగతిన్బడఁద్రోయు నిజమ్ము నమ్ముఁడీ!

మ. ఒకయేఁడైనను సన్నిధిన్ నిలిపి శిష్యున్యోగ్యతాయోగ్యతా
త్మకసంశోధన మాచరించి యవలన్ధర్మాత్ముఁగా నెంచుచో
సకలాఘంబులఁ ద్రోలఁజాలు ఘనమోక్షజ్ఞానమీయంగ దే
శికవర్యుండు మదిం దలంప నుభయశ్రేయంబు లొప్పారెడున్.

క. గురుసంప్రదాయహీనం
బురువిద్యయ యైనజగతి నొప్పదు వినుఁడీ!
ధర నది యవిద్య యౌనని
రరిషట్కజయమ్ము గొన్నయార్యోత్తంసుల్ 717

క. గురుపారంపర్యజ్ఞా
నరుచిరసద్విద్య గుణసనాథంబగు ను
ర్వర వీర్యవత్తరమ్ముగు
గురుపారంపర్య మెఱిఁగికొనవలె విద్యన్ 718

చ. తలపఁగ సంప్రదాయసహితమ్ముగ విద్య గ్రహించిరేని ని
ర్మలతరబోధ మొప్పు సుకరంబగు సంసృతిపాశఖండనం
బులనగు నంచుఁ బ్రాజ్ఞులగుపూరుషు లెల్లరు సంప్రదాయసం
కలితముగా గ్రహింతు రెటజ్ఞానము సద్గురుపాదసేవ్యమై 719

క. ఉపయమమునకున్ గోత్రం
బుపకారమెనర్చునట్లులొప్పఁగ నయవా
ర్ల పరంపర జ్ఞానమ్మున
కుపకార మెనర్చుఁ గానఁగొనవలె దానిన్ 720

మ. అరయన్ వేదములందు విశ్రుతము విద్యాసంప్రదాయార్థవి
[illegible]గణంబొందు సుసంప్రదాయముల సద్బోధార్థసిద్ధ్యర్థమై

గురుపారంపరి శిష్యుఁడాదరమునన్ గొన్నంగదాజ్ఞానసం
భరితంబౌ బలువిద్య తీవకుఁబుల్ మవ్వమ్ములై నట్లుగన్ 721

మ. గురుసంధానము తోడ విద్యలను గైకొన్నన్ మహాదేవుఁడా
త్మరతిన్ శిష్యుల కిచ్చి ప్రోచును సదాతచ్ఛూన్యమౌ వేదనో
త్కరముల్ సంతతమున్ బిశాచగణబాధల్ గూర్చి శిష్యాళినిన్
నిరతాసౌఖ్యపలంబొసంగు నిటులేనిక్కమ్ము మమ్మాటికిన్ 722

ఉ. దేశిసంప్రదాయ ముపదేశమొనర్పక విద్యనియ్యఁ ద
ద్దేశికదేశికత్వములతీరు చెడున్ భవబంధపాశముల్
నాశము నొందఁజాలవు ప్రణాశమునుంగను బుద్ధి శుద్ధియున్
లేశమునున్ సుఖం బొదవనేరదు శిష్యజనాళి కెయ్యెడన్ 723

చ. పరమముదంబు నొందరుబ్రహ్మపరంబును గాంచరెంతయున్
దురితచయమ్ములన్ గడకుఁబోలఁగఁ జాలరు సంప్రదాయబం
ధురములు కానివిద్దియలనున్ గ్రహియించినయట్టి వారలె
త్తటి గురుసంప్రదాయరహితమ్ముల విద్యల నొంద మానుఁడీ

క. ఏమీకున్ బల్కెద స
ద్వ్యోముక్తి కరంబు శ్రుతిచయోక్తిస్ఫురితం
బేమనుజులకును సుకరం
బై మాన్యతఁగను వ్రతంబునార్యులు వినుఁడీ! 725

క. ఇందుకుఁ గల దితిహాస మ
మందశ్రద్ధన్ వినుం డుమారమణికిఁ గన్
విందై దర్శన మిడి నుడి
వెందగఁ దగ్గాధ హరుఁడువినిపింతు నిటన్ 726

క. తా విజ్ఞానాకృతియయి
భావితసకలార్థదానపరకృతదీక్ష
పావన యయి భగవతి యయి
గౌవసుతామూర్తి వెలయుఁగద లోకాళిన్. 727

728

వ. అట్లయ్యు.

సీ. బ్రహ్మ మొదలు కీటపర్యంతమును సమ
స్థితిఁ దనరారెడి దేవదేవుఁ
బదునాల్గులోకాలు పాలింపఁగాఁగల్గు
దక్షత నొప్పారు దైవతమ్ము
సచ్చిదానందలక్షణలక్ష్యమూర్తియై
విబుధులఁ బ్రోచెడి వేల్పుమిన్న
నద్వితీయప్రకాశైకస్ఫురత్తేజ
మై యలరారెడు నట్టిదిట్ట

తే. నారులవలెఁగాక నిజసహజోజ్జ్వలప్ర
భాప్రభావంబు వీడని పరమతత్త్వ
నఖిలదిక్పూర్ణు నానందు నమితసత్త్వు
పాకటాక్షునిగనె జిగురాకుబోణి 729

క. గుణమూర్తి భావనీయుని
గుణాతిరిక్తు గురువరుని గుహ్యాతమ్మున్ దాఁ
బ్రణమిల్లి భక్తిమెయి నై
పుణి మీరఁగఁ బలికె నిట్టు పొలుపుల్ గులుకన్ 730

తే. దేవదేవ జగన్నాథ సేవనీయ
సకలవిపదార్తిహరణదీక్షాప్రశస్త!
సులభముగ ముక్తి యొదవెడి త్రొవ్వ చెప్పి
నాకు దయసేయు మయ్యది లోకహితము 731

క. నీవంటి మగఁడు గలుగన్
నావంటిది మగువ గల్గి ననుగద సంసా
రావధి లోలుట గలుగును
గావున భవ నాదు దెసను గరుణింపఁగదే! 732

క. పతి దైవ మాఁడువారికి
బతి జ్ఞానం బొసఁగ ముక్తిపదము కరగతం
బతులితగురుపదమగుఁ బతి
సతులకు మోక్షప్రదాత జగములయందున్. 733

వ. అన విని పరమగురుం డిట్లానతీయందొడంగె. 734

క. మున్నెవ్వరిట్లు ప్రశ్నము
వన్నదిగినయదియు లేదు నాచే నెవఁడున్
విన్నదియు లేదు నవలా
కన్నా! నీకు వినఁగఁ గలిగెన్ వినుమా! 735

తే. బాపఁడైనను గడజాతివాఁడ యయినఁ
బండితోత్తముఁ డైనఁ బాషండుఁడైన
శ్రీవిరాజితుఁ డైన దరిద్రుఁడైన
బాలుఁడైనను ముదుసలివాఁడ యయిన 736

తే. ఆస్తికుం డైన నాస్తికుం డైన చాలఁ
జాలువాఁడైన నించుకచాలకుండు
వాఁడయైనను నాఁడుదియైనఁ గాళ
హస్తి తీర్థము సేవింపనందుముక్తి 737

క. పరగన్ దక్షిణ కైలా
సరుచిరనామమున దనరిసత్క్షేత్రంబై
మురువొందుఁ గాళహస్తీ
శ్వరవరపుర మఖిలవైభవమ్ముల కిరవై. 738

ఉ. దేవతలున్ సురారులును దిక్పతులున్ రవిసోములున్ వృషం
బీవును బిడ్డలిర్వురును నే నజుఁ డచ్యుతుఁడున్ వసించుటన్
పావనమైన తీర్థమిది భవ్యసువర్ణముఖీస్రవంతికా
సేవితమై మునీంద్రగణసేవితమై యలరారు నిచ్చలున్ 739

క. అచ్చట వత్సరమే వా
క్రుచ్చువిధము తప్పకుండఁ గోర్కులు నిండన్
సచ్చరితను వ్రతమొక్కటి
నిచ్చ నొనర్పంగ ముక్తియెసఁగు నపర్ణా! 740

వ. ద్వాదశమాసములయందును దత్తన్మాసనామహేతువులైన రిక్కల
యందు సువర్ణముఖరీతోయములం దోఁగి పగట నోగిర ముజ్జగించి
కాళహస్తినాధునకుం గేలుమోడ్చి యుచితద్రవ్య మవ్య యాత్మస్వరూపు

లైన యచ్చటిభూదేవుల కొసంగి రాత్రి మాత్రము భుజించుచుండుట ముక్తిసాధనములలో నుత్తమమైన సాధనము. ఈవ్రతోత్తమ మెల్లరకు నాచరణీయమై నిర్వహించుటకు సర్వవిధముల నాతిశ్రమోపేతం బనుట లోకవిదితము. 741

క. వ్రత మది యిచ్చోటన్ దగఁ
గృతమతియై సల్పువానికిన్ బ్రహ్మార్థ
ప్రతిపత్తి యొదవుటన్నది
శ్రుతివచనము గైకొనుండు శుచియుతమతులై 742

క. సకలాఘతూలపావక
మకలంకార్థప్రదంబునై యాక్షేత్ర
మ్మకృతానందపదమ్మున్
వికలాత్ములకైన నిడు పవిత్రస్థలమౌ 743

తే. కాళహస్తిప్రభావాదిగరిమమెల్ల
నాయనుగ్రహవశమునన్ గాకయెట్లు
తెలియవచ్చును జంచరీకలలితాల
కాభిరామాననా! దీనినరయు మీవు. 744

కం. తీరుచుఁ గోరిక లెల్లం
జేరుచు ముక్తస్థలమ్ము స్థిరమగు సద్భో
ధారంభహేతువగు సు
మ్మీ రుచిరతరాస్యా! క్షేత్రమిట్టిదెఱుఁగుమీ! 745

తే. బ్రహ్మవిష్ణుమహేశ్వరప్రభృతులకును
భక్తిగలిగినయెడల లభ్యంబటంచు
శ్రుతియ క్షేత్రమహత్వంబుస్తుతి నొనర్చు
బలభిదాదినమస్కృతపాదపద్మ! 746

వ. అని చిత్తం బగురొత్తఁ బలికి 747

ఉ. ఈవును నేఁదలంప నొకచే యనుమాట స్మరించుచున్ మహా
దేవుఁడుమాలతాంగి బలుతీరులఁ గౌఁగిటగుర్చిచ్చినంత న

దేవియు వాని భక్తిఁ బ్రణుతించుచు నర్చనలిచ్చి మెచ్చె న
ప్పావనశీల లోకహితబంధురకార్య మొనర్చె నిమ్మెయిన్ 748

మ. పరమబ్రహ్మపదార్థమున్ గనని జస్వాంతమ్ములన్ గోరు బ్ర
హ్మఋషిశ్రేష్ఠులు మీకు నేను మునుపార్యాదేవితో శంభుఁడె
త్తెఱఁగున్ బల్కెనో దానినంతయును బుద్ధిన్ దోఁచిన ట్లియ్యెడన్
బరమార్థంబు వచించినాఁడఁ గొనుఁడీ సంధన్ ముదం బొప్పఁగన్

ఉ. తక్కిన వెల్లనున్ విడచి తత్క్షణముక్తికర ప్రసిద్ధమౌ
చక్కియ కాళహస్తి యని చక్కనె తెలిఁగిన వార లై సదా
చొక్కి యటన్ వసింపఁదగు సూరివరేణ్యులు కాళహస్తికిన్
మిక్కిలి కాంక్ష సేయఁదగు మేదురతత్పల మందగాదఁగున్ 750

మ. లలితస్వాంతులు మీరలెందునను కాలక్షేపముల్ సేయ కు
జ్జ్వలమాహాత్మ్యవితానసంవిదితభాస్వత్కాళహస్తీశు నం
ఘ్రులనే చేరి భజింపుఁడంత నగు మీకున్ శాశ్వతానందస
త్యలసత్సంవిదఖండముక్తిపరమార్థానంతభవ్యస్థితుల్ 751

## 37. ముక్త్యుపాయకథనము

చ. మునివరులార! చెప్పెదను ముక్తి కుపాయము లెన్నియేనియున్
దనరును కాళహస్తి సమధన్యతమాన్యబహుస్థలంబులం
దు నరుఁడు దోఁగి యీశ్వరుని దోరపుభక్తి భజించెనేని ము
క్తిని గనవచ్చు నెల్లరకుఁ దీర్థము లన్నియు సేవనీయమౌ 752

వ. నేనును జైమినియు సహాధ్యాయులము గదా! ఒకనాఁడు వేద వేదాంతవిశారదుండును స్వనజితనీలనీరదుండును తపఃపూతశరీరస్వచ్ఛాకారాలంకారదుండునగు నస్మద్గురుస్వామియైన వేదవ్యాసుని కడకుం జని జైమినిముని దండప్రణామంబులిడి వినయవినమితగాత్రుండై భవరోగభేషజంబగుగురుపాదంబుశిరంబందునఁ బాదుకొలిపి లోకోపకారబుద్ధినను సంధించి పరమరహస్యంబునొక్కటి నెఱుఁగఁగోరి మాయానాశకంబయి మోక్షప్రదంబగు నొక్కవిధం బుపదేశింపఁగదె యని వేడిన వ్యాస మహర్షియు దయాసారంబులు చిలుకు పలుకులతో నిట్లు ప్రతివచనంబు నుడివె. 753

చ. అడిగిన నిట్టిప్రశ్నముల§నాదృతియై యడఁగన్వలెన్ ముదం
బడర జగద్ధితార్థమయి§యార్యవతంసమ! వాసికెక్క నీ
వడిగినప్రశ్నమందులక§నంతహృదంతరమోహమందితిన్
గడుఁగడు శ్రద్ధమై వినుము§గాథయు నొక్కటి గల్గునందుకై

ఉ. వేదమయుండు బ్రహ్మయని§విశ్రుతుఁడౌట విధాతృనొద్దకున్
సాదరబుద్ధిమై చని మ§హాత్మ విముక్తికిఁ ద్రోవ జెప్పవే!
నీదరిఁజేరినాఁడ నని§సేవచియింపఁగ నాతఁడంత ల
క్ష్మీదయితాంతికమ్మునకుఁ§జేరుదమంచు వచించితోడనే 755

క. నాతో రయ మొప్పారఁగ
నాతనికడ కరిగి ప్రశ్న§మవ్వల నడుగన్
ప్రీతిమెయి మమ్ముఁ గొని య
బ్జాతాక్షుఁడు గరళకంఠు§పజ్జను నరిగెన్ 756

క. మేమందర మట గాంచితి
మామదనాంతకుని భాస్వ§రాత్మాలోక
క్షేమంకరప్రతిష్ఠా
స్థేమున్ సుగుణాభిరాము§శ్రేయోధామున్ 757

క. దనకుఁగల చనవు చేతను
దనుజారి పురారిఁ జేరి§తత్ప్రశ్నమ్మున్
వినిపించి సమాధాన
మ్మనఘా! సెలవీయు మంచు§నడిగిన హరుఁడున్ 758

వ. హరి పరోపకారిగా నెంచి యిట్లుపన్యసింపంగడంగె. 759

క. నెచ్చెలి నాకడ కీవిట
వచ్చి జగద్ధితముగాఁగఁ§బలికిన పశ్నం
బుచ్చతరమైన దందుకు
మెచ్చితి నుత్తరము నొసఁగి§మెప్పింతు నినున్ 760

ఉ. అండజరాజవాహ! ప్రియ§మారఁ బ్రమోదలసత్పరంపరా
ఖండరసప్రధానబహు§గౌరవభాగ్యములుల్లసిల్ల మత్

తాండవసత్కళానిపుణ॥తల్ దయివారెడి వ్యాఘ్రపత్తనం
బొండు జగత్ప్రసిద్ధమయి॥యుండును భక్తజనాతిసేవ్యమై 761

ఉ. అచ్చట నాదు నృత్యముల॥నాదట నారసి లెక్కకైదునౌ
యచ్చరముల్ సెలంగు మహి॥మాన్వితమంత్రమునన్సతారమున్
జిచ్చుతురత్వమొప్ప జప॥సిద్ధిఁబొనర్చిన యంతవానికిన్
జెచ్చెర మోక్షసంపదలు॥చేకురుటన్నది వాస్తవంబయో 762

వ. తాదృశపుణ్యక్షేత్రంబులు పెక్కులు గలవు. వానిలో వల్మీకవృద్ధాచలంబులును. గోపర్వతగోకర్ణమ్ములును నాధిగ్రామసోమనాధంబులును రామేశ్వరభీమేశ్వరంబులును వేదారణ్యాశ్వేతారణ్యంబులును గేదారేశ్వరజప్యేశ్వరంబులును గుంభఘోణమధ్యార్జునంబులును హాలాస్యవారాణస్యాదులు మున్నగునవి ముఖ్యములు వానిలో హాలాస్యప్రభావమ్ము వినుతించెద.

చ. కలఁడొక బ్రాహ్మణాధముఁడొ॥కానొకకాలమునందు వానికిన్
గలుగవు చేయనట్టి జెడు॥కర్జములున్ దలపొందనట్టి చె
ట్టలు నిరతం బొనర్చుఁగ ఁగ॥డంగని యెగ్గులు స్వాపరాధసం
కలితము కాని కాలములు॥క్రౌర్యము నొల్లని యట్టిగుట్టలున్ 764

సీ. పాపసంఘమ్ము లేక॥పట్టుఁ జుట్టున్ ముట్టు
పుణ్యలేశమ్ముల॥పొంతఁ జనఁడు
తల్లివంటి పతివ్రత॥తన్బట్టి మోహాన
నిర్బంధమున్ జేసి॥నెగడువాఁడు
తండ్రిపై నూరక॥దవిలిన కట్టల్క
గుది. మోదఁ బ్రాణముల్॥వదలె నతఁడు
దయలేక నిర్భయో॥ద్దామయథాకామ
విహరణంబుల నెల్ల॥వెళఁదిరుగుఁ

తే. బేరు చెప్పినయంతనే॥యూరిబిడ్డ
లెల్ల జడియఁగ జడిపించు॥తల్లిదండ్రు
లటివానికిఁ బరలోక॥మన్న దెపుడు
స్వప్నమందైనఁ గనరాదు॥జరుగు దవ్వు 765

సీ. పెదవి మెదిపి నట్టిదయదునులె వినరాని
బూతులకును బెద్దబుంగ యగుచు
కారణమ్మునులేక కస్సుబుస్సనుచును
పైబడి కోడిత్రాడై బరితెగు
జూదమాడుట సురజొక్కి ద్రావుట రెండు
క్రీడలుగాఁగ లెక్కించు నతఁడు
తనచేఁతలకు జనుల్ దన్ను నిందింపఁగా
విఱ్ఱవీగుచు వారి వెక్కిరించు

తే. పిన్నపెద్దలు తల్లి యున్ బిడ్డ లేరు
మంచిచెడ్డలు బోఁప వాకించుకైన
వాని సరివచ్చు వాఁడెందునైన లేఁడు
వానిఁ గన్నమ్మ యెట్టి పాపమ్మొనర్చె. 766

సీ. వేదపాఠం బేల వెఱ్ఱియెత్తెనె? మీకు
నాదుపల్లె యగు వేద మెపుడు
స్మృతుల తలంపేల మతి వోయెనే? మీకు
కామినీస్మృతి కన్నఁ గలవె స్మృతులు?
నఖిలపురాణేతిహాసముల్ పరిహాస
పాత్రమానంబులీ పగిది నెఱుఁగుఁ
డామ్నాయశీర్షంబు లమ్మమ్మ తాతల
రుచిలేని సరసాలు రూఢిఁగనుఁడు

తే. చెలఁగి భోగింప నేరక చేతకాని
చవటలగుదురు ఋషిముని ప్రవరులిలను
వారు నాబారిఁ బడ్డ వహ్వా! దగియెడు
బుద్ధి జెప్పెడి వాఁడ నిబద్ధి గాను 767

క. అని వాఁడు త్రాగి యుండక
మునుపును గడుపార త్రాగి పొరలెడి వేళన్
దినమున్ రేయున్ వాగును
దినమణిశశితారలైన నడిద్దవు వానిన్ 768

వ. కొంతకాల మిట్లు రిగిన 769

క. ఒడలేమర చేసిన బ
ల్పెడుగులకు ఫలంబో యనఁగ చెంగట నెదుటన్
బడు బ్రహ్మరాక్షసుండొ
క్కఁడు రోఁకటి నొకటి చేతఁ గైకొనియెప్పుడున్ 770

తే. బొమ్మరక్కసి వెంటాడి పోవు వాని
కెచటి కేఁగిన నచ్చట కరయవచ్చి
నీడవలెఁ బోఁడఁ జనుచుండి నిరత మతని
గాసిలన్ జేసె దుష్కర్మ గతు లలఁతులె? 771

క. ఏనాఁడొనరించిన పు
ణ్యానయో వానికిని గల్గె హాలాస్యక్షే
త్రానూనదర్శనోత్కం
ఠానివహము లడఁగె నాగడము లటుపయిన్ 772

మ. అడుగుం బెట్టెనొ లేదొ కాని యతఁడా హాలాస్యపుణ్యస్థలిన్
జెడి పాపంబులు బ్రహ్మరాక్షసుఁ డునున్ వెంటాడఁగా మానె న
ప్పుడు పాఱుండును భక్తి విస్మయలసన్మోదంబులం గాంచి య
క్కడనే కాఁపుర ముండఁగోరె మది నెక్కాలమ్మునన్ మాధవా!

శా. ధన్యుండాతఁడు మత్ షడక్షరజపాద్రైక ప్రమోదంబుతో
నన్యాయత్తుఁడు గాక నన్నరసి యత్యంతంబు నిత్యం బసా
మాన్యంబైన పదంబునన్ గనెడి శంభద్భక్తియుక్తాఘమూ
ర్ధన్యుండై యలరారె క్షేత్రపుమహాత్త్వంబెంచఁగా శక్యమే? 774

ఉ. తొల్లిటి విప్రుఁబోలి భవదూరులు కాఁగలవార లిప్పుడున్
సల్లలితాత్ములై యిచట సర్వశుభంకరమూర్తి నన్ను సం
ఫుల్లసరోజనేత్రములమోద మెలర్పఁగఁ గాంచిరేని గా
సిల్లఁగనేల సంసృతులఁ జేరుచు నెల్లరు సారెసారెకున్ 775

క. సంసారతోయరాశిరి
రంసాతిజిఘాంస నలరు రాజదమలవి

ద్వ్యాంసుల కిది క్రోవనుచుఁ బ్ర
శంసింపఁగవచ్చు దీనిఁ సారసనేత్రా! 776

తే. ఇచట నొనరించు దావమ్ముఁ లించుకైన
నిచట నల్పేది జన్నంబుఁ లింతయైన
వీర్యవ త్తరములు నయిఁ పెంపు గనుచు
బహుళఫలము లొసంగునుఁ బద్మనాభ! 777

మ. శివపుణ్యస్థలులందుఁ గాని పరమఁ క్షేత్రంబులంగాని య
న్యవరస్థానములందుఁగాని శివమాఁ హాత్మ్యంబులో నెంచి సం
భవమౌ కాలము రిత్తపుచ్చకయ షఁ ద్వర్ణాంకమంత్రంబు వా
స్తవభక్తిన్ దనరారఁ బల్కినను మోఁ క్షంబుల్ సదా గల్గెడిన్ 778

వ. అని మాధవున కుమాధవుండు తెల్పి యంతర్ధానమొందె నట గాన

ఉ. గాసిలకుండ మోక్షమునుఁ గైకొను పద్ధతి యియ్యదంచుదృ
ప్తాసురగర్వభంజనునఁ కానిటలాక్షుఁడు దెల్పినట్లులో
భూసురవర్యులార! బుధఁ పుంగవులార! వచించినాఁడ నే
భాసురలీల మీర లదిఁ భక్తిని గైకొని యాచరింపుఁడీ. 779

## 38. ముక్తిసాధనవిచారము

వ. మఱియు ముక్త్యుపాయము వివరించెదను. పూర్వమొకప్పుడు సర్వవేదసారుండు సర్వవిజ్ఞానసాగరుండును గరుణాసముద్రుం డును నగు మద్గురువరుండగు వ్యాసమునిచంద్రుఁడు సంసారభ షక్కల్పుండు ననల్పుండు నగు సదాశివమూర్తి ధ్యానించి భావ కుసుమాదిపూజాసమర్పణవిధానమ్మున నర్చించి షడక్షరమంత్ర ముం జపియించి శివుఁ బరితుష్టుం జేసి యిట్లు వినుతించె. 780

తే. తత్త్వములయందుఁ బరమతఁ త్త్వంబ యగుచు
తరచి చూడ యదార్థతఁ త్త్వంబ యగుచు
నవిదితస్వాత్మభిన్నతఁ త్త్వార్థ మగుచు
నడరు నీకు నమస్కారఁ మమరవంద్య! 781

తే. అరయఁ జిచ్ఛక్తి జడశక్తిఁ యన్నవి యును
వానిభేదంబు లెయ్యదైఁ వరలు సతము

నట్టి పరతత్త్వరూపున కమలునకును
నే నమస్కార మొనరింతు నిండు భక్తి 782

తే. ముగురుమూర్తులునున్ విరాణ్మూర్తి సర్వ
దివిజమూర్తులునున్ సదా శివునిమూర్తి
వాస్తవంబుగ నెవ్వఁడై పరగు నట్టి
భద్రమూర్తికి శివునకేఁ బ్రణుతిఁ గూర్తు 783

తే. అలఘుసత్త్వాఢ్యులగు నమృతాంధసులును
మధ్యసత్త్వాఢ్యులైనట్టి మానవులును
నధమసత్త్వంబులౌ కీటకాదులెవని
తత్త్వమౌ వాని కంజలి దాల్చువాఁడ 784

తే. ఎవఁడు గల్గనిచో లోకమే గలుగదు
లోకసత్తానుమేయమై యేకృతార్థు
పరమసత్తా వినిశ్చయసరణి యగును
వానికై కేలుదోయిని బట్టుదేను 785

తే. ఎవఁడు భాసింప నీజగం బెల్లభావ్య
మెవఁడు భావింపకున్నచో యీజగమ్ము
భాసమానము గాదట్టి పరమశివున
కేను నిరతంబు మ్రొక్కుదు నెలమిమీఱ 786

తే పరగు నెద్ది పరాపరవర్జితమయి
యేసదానందమూలమై యొల్లరకును
గల్గు నానందలేశమె క్కాలమందు
నట్టి యానందరూపు నే నభినుతింతు 787

తే. ఎన్న దిగ్దేశకాలాద్యభిన్నమెయ్యి
దద్వయం బెయ్యి దీవిశ్వమఖిల మెయ్యి
దదియ బ్రహ్మంబు సత్వంబు నగును నెయ్యి
దట్టి పరవస్తు వొకటి వంద్యమ్ము నాకు 788

తె, అంతరహితమ్ము కేవలమ్మద్వయమ్ము
పూర్ణమంచు వరామ్నాయపూగ మెపుడు

వాకొనంజాలు నాపరబ్రహ్మవస్తు
వందు నానుతి లగ్నమై యలరు నెపుడు. 789

తే. సాంఖ్యయోగము లేనివాస్తవవిధమ్ము
నెఱుఁగకుండఁ బ్రవర్తించు నెవఁడబోధ
చిత్రరచనకు గోడయై చెలఁగు నాతఁ
డట్టి శివతత్త్వమునకు కేల్పట్టు దేను 790

సీ. ఏవాని యాథార్థ్యమింతయు నెఱుఁగక
శబ్దశాస్త్రము చిన్నచదువునయ్యె
నేవాని తత్త్వంబు నెఱుఁగను బరమాణు
కారణవాదంబు కఠినమయ్యె
నేవాని కలరూపు నెన్నఁజాలక కర్మ
మీమాంస వాదం బమేయమయ్యె
నేవాని యున్న యున్నదియన దెలియను
దేహాత్మవాదంబు తెల్లవోయె

తే. నెవని మాహాత్మ్యమెఱుఁగక యింద్రియాత్మ
వాద ముద్ధతమందవిద్వజ్జనావ
తంసకర్ణావతంససౌందర్యగరిమ
మొంద దాబ్రహ్మతత్త్వమ్ము నుగ్గడింతు 791

తే. ఏచిదాత్మస్వరూపంబు తోఁచకుండు
తరిని బ్రాణంబు జీవుగాఁ దలఁచు నరుఁడు
వానినిన్ బ్రాణవిజ్ఞాతశక్తి మీఱఁ
గొల్చువాఁడను నానుతిన్ గొనుము దేవ! 792

వ. ఏదివ్య యదార్థంబు గనని వారు మనోబుద్ధి చిత్తాహంకారములు జీవునిగఁ బరిగణింతు రట్టి తత్సాక్షికి నేఁ బ్రణామంబు లర్పింతు. జాగ్రత్స్వప్నసుషుప్తితురీయావస్థలే యధిష్ఠానమునం దారోపితంబు లాయధిష్ఠానస్వరూపుండైన నీకు నమస్కారము. సంఖ్యాపరిచ్ఛేదానర్హుండయి యేకాదిపరార్ధపర్యంతాదిసంఖ్యాపరిచ్ఛిన్నుండు లోకముచేఁ గల్పింపఁబడు నట్టి నీకు నమోవాకంబు లర్పింతు. హారకేయూరాది భూషణములకు

గారణహేమమే కార్యరూపమునఁ గన్పట్టుచుండుఁగదా కానఁ గారణత్వమూహించుచో భిన్నత్వమును బంగారువిషయమున నంగీకరించు భంగి బ్రహ్మజగదాదికారణమగుట నభేదమును జగదాదికార్య స్వరూపమూహించుచో భేదమును నొందునని కొంద ఱెద్దానిని ధ్యానింతురో యా పరాద్వయవస్తువగు నీకు దండప్రణామము లొసంగెద ఏ పదార్థవిజ్ఞానము వలనఁ ద్రిమూర్తులును ద్ర్యవస్థలును ద్రిశ్రుతులును బురాణేతిహాసమ్ములును సమస్తాగమమ్ములును దర్క వ్యాకరణాదిశాస్త్రమ్ములు సర్వవర్ణాశ్రమంబులు విద్యావిద్యలు బంచభూతములును దద్భేదములును సర్వాధిష్ఠానబ్రహ్మమునందు గల్పితమ్ములగు నని విజ్ఞాను లెఱుంగుదురో యట్టి పదార్థమైననీవు శరణ్యుఁడవు. నీ వహంతావర్జితుండవు నీవిజ్ఞానము వలనఁగదా! ప్రత్యగ్జ్యోతిఃస్వరూపనిరూపణ నిపుణులయి గుణిగణగణనీయులై జ్ఞానులలరారుదురు. ఎవఁడహంరూపము నిదం రూపము నను రెండు రూపముల కధిష్ఠానమగు నెవఁడు వాస్తవముగ లక్షణరహితుఁడగు నెవఁడు స్వయంప్రభుండగు వానికి నతశిరస్కుండ నగుదు నీయున్నతఅంగుల. 793

క. మతిమన్నుతిశతమున కం
చితకణభుగ్గౌతమాద్యశేషాగమస
మ్మతసూక్తివితతికిన్ బ్రో
న్నతనిగమోక్తికిని వాకొనన్శక్యంబే. 794

క. ఘోరాజవంజవాంబుధి
తారక! యాత్మాపరోక్షధామోదారా!
సారస్వయంప్రభాసూ
ర్తీ! రామార్ధాంగ! నీకిదే నుతి గొనుమా! 795

ఉ. బత్తి మునీశ్వరుం డిటులఁ బల్మరు వేడినఁ గృత్తివాసుఁడు
వ్వేత్తుగ వాని ముందట నహీనరుచుల్ దళుకొత్త వెండికొం
డత్తరి నేఁగుఁదెంచెననఁ నక్షపదంబునఁ దోప నెమ్మి మొ
ల్కొత్త నమస్కరించెఁ బులకెత్తఁగ మౌని శరీర మెల్లెడన్

తే. సర్వసాధనవేదనా! సర్వసాక్షి!
సర్వదేవేశ! సర్వజ్ఞ సర్వమూర్తి!
సర్వమోక్షద! సాధనసమితి నాకు
పూనివచియింపు మని వేడె మునివరుండు 797

ఉ. వ్యాసమునీంద్రు నంతట దయాపరిచుంబితసత్కటాక్షవీ
క్షాసముదాయసంభరితసారరుచుల్ ప్రచురింపఁ జూచి భా
షాసుధలొల్కఁగా సకలసాధనమున్ వివరించి చెప్పె నాఁ
డో సుగుణాత్ములార! వినుఁ డొప్పుగ నే వచియింతు నియ్యెడన్

వ. ధరాత్మజాధవుండును విగతభవుండు నైన శివుం డిట్లానతిచ్చె 799

చ. విదితకవిత్వతత్త్వజనవిశ్రుత! సాత్యవతేయ! నీకు నే
ముదమున సర్వసాధనముఁ బొల్పుగఁ బల్కెద శ్రద్ధతోడ నీ
యదనున విందువేని సకలార్ధములన్ గడియించువాఁడవౌ
దది గయికొన్న వారలకు నెప్పుడు తప్పక మంగళంబగున్ 800

చ. తలఁపఁగ నౌను ముక్తి ద్వివిధమ్మయి సిద్ధము సాధ్యమంచు వే
రొలసి జగంబులందు గొమరొప్పను సిద్ధము నిత్యవస్తువై
యలఘులు జ్ఞానమార్గమున నందుచు నుందురు దాని సాధ్యమున్
గొలఁదులు కర్మమార్గమునఁ గొందురు శాశ్వత మంచెఱుంగమిన్

శా. సాయుజ్యాంచితముక్తిసాధనము సుజ్ఞానంబు కర్మంబుగా
దో యార్యోత్తమ! తత్సముచ్చయము సాయుజ్యంబు నీ నేరదా
మ్నాయాంతర్విలసద్వచోనిచయసందర్భంబు శోధింప నీ
శ్రేయోమార్గము జ్ఞాన మొక్కటనుచున్ జెప్పంగ నే నెయ్యెడన్ 802

ఉ. ముక్తి సదాత్మరూపము నబోధము సత్యమ యైన సిద్ధమన్
సూక్తి ఘటిల్లు ముక్తి కటు చూడక ప్రాప్తము గాదు ప్రాప్యమౌ
ముక్తి యటంచుఁ బల్కుట యబోధము గాక దబోధ మెట్లగున్
యుక్తముగాదె యట్టిపలు కొక్క భ్రమంబని నొక్కిపల్కుటల్

తే. ముక్తి యప్రాప్తమన విభ్రమోక్తి యగును
భ్రమ నివారణమైన కాలమున ముక్త

ప్రాప్త విధమున నఁ దోఁచుటన్ ప్రాప్త మంచుఁ
బలుకుచుందురు పెద్దలు వలఁతులగుచు. 804

తే. భ్రిమయు నజ్ఞానమూలమై పరిబలుగాన
జ్ఞానసాధనమున్బూని సరగ భ్రిమను
నాశ మెనరింపవలె భవ పాశమిట్టు
త్రెంపవలెఁగాక మఱియొక తెన్ను లేదు. 805

శా. జ్ఞానాభ్యోత్తమసాధనమ్మొకటి దక్కన్ సాధనమ్మొక్కట
జ్ఞానంబున్ బరిమార్పఁగలునె క్రియా సందోహ మజ్ఞానసం
ధానానూనవిధానమౌట నది బంధప్రక్రియాదక్షమై
మానిందార్కి కడు మాననీయమగు సుమ్మా! యజ్ఞలోకాళికిన్ 806

వ. మఱియుఁబరముక్తి యాత్మరూప గాక యన్యరూపయగు నని దలంతు రేని యది యనవద్యసిద్ధాంతము కాదేల యన యన్యరూపయగు ముక్తి "బ్రహ్మవిదాప్నోతిపర" మ్మను వాక్యానుసరణమున బ్రహ్మ ప్రాప్యమని తెలుచున్నది గదా. ప్రాప్తి సామాన్యముగా నప్రాప్తిపూర్వకముగదా! కాన బ్రహ్మవస్తువు నిత్యము కాదని పర్యవసాన మగునని తెగువ మెయిఁ దర్కింతురేని పాప్త్యప్రాప్తులు భ్రమపూర్వకములనియు యదార్థములనియు ద్వివిధములు. భ్రమపూర్వకమైన యవి సిద్ధవస్తు విషయమునను యదార్థము లైనవి సాధ్యవస్తువిషయములందు ననువర్తించు ఏమరిన స్వకంఠాభరణమును దద్విషయకాప్తవాక్యస్మరణమును భ్రమకృతప్రాప్త్యప్రాప్తులకు దృష్టాంతము. ఘటాభావవిధ్వంస కారణమైన ఘటసృష్టి యదార్థములైన యప్రాప్తిప్రాప్తులకు దృష్టాంతము. ప్రాప్యమా? యప్రాప్యమా? యని వికల్పించిరేని యందు ప్రాప్యమైనచో నప్రాప్తప్రాప్తిరూపమా? ప్రాప్తప్రాప్తిరూపమా? యని మఱల వికల్పించి యప్రాప్తప్రాప్తిరూపమైనచో ప్రాప్యప్రాపకసంబంధము విషయమున రెండు భిన్నవస్తువులకుఁ గల యాధారాధేయ స్వస్వామ్యాది సంబంధమా? లేక రెండు వస్తువులకుఁగలదాదాత్మ్యరూపమా? యని పునర్వికల్పనంబొనర్చి మఱియు మొదటపక్షమునఁదత్సంబంధము సాధ్యము నంతవంతమునా లేక సిద్ధము నిత్యమునా? యనిప్రశ్నించుకొని తర్కించి

విచారమొనర్చిన యెడల ముక్తిప్రాప్యమను సంగతి యుక్తియుక్తము కాదని తెలియు నది యెట్లనిన ముక్తముక్తులకుఁగల సంబంధము సాధ్యసంబంధమందురా? చక్రచీవరతురీవేమాది సాధ్యమైన ఘటపటాదులవలె ముక్తియు ననిత్యమగు నందు వలన ముక్తులకు గూడ బంధప్రాప్తిప్రసంగము కలుగును ముక్తునకును. బునర్బంధ ప్రాప్త్యర్హత యున్నయెడల ముక్తికొఱకుఁ బ్రయత్నించు నధికారియే కలుగక పోవుట తటస్థించును అందువలన మోక్షశాస్త్రనర్ధక్యము వాటిల్లు నందువలనఁ దచ్ఛాస్త్రప్రవక్తయగు నీశ్వరునకు వ్యర్థకార్యకర్తృత్వార్థరూపమైన దోషము చెప్పఁదగి యుండును గాన ముక్తముక్తులకుఁ గలసంబంధము సాధ్యమను మాట పొసఁగనే పొసఁగదు. దీనికిం బూర్వపక్షమ్మాగఁ బ్రధ్వంసాభావము ఘటాదిధ్వంసము వలన సాధ్యముగదా! ప్రధ్వంసాభావమున కంతము లేదు గదా! కాన సిద్ధాంతము ప్రధ్వంసాభావవిషయమున వ్యభిచరించుటంజేసి "యద్యత్సాధ్యంతత్తదనిత్య"మ్మను వ్యాప్తి దోషవంతమైనదని పల్కుదు రాయావాదమాదరణీయము గాదేల యనఁ బ్రధ్వంసాభావము నిత్యమని వచించుట లోఁగల దోషముల ముందు చర్చింతము. ప్రస్తుతము బ్రధ్వంసాభావము నిత్యమని యంగీకరించియే విమర్శింతము. తత్పక్షమున దృష్టాంత మసమమని నుడువ వలసియున్నది. భావరూపమైన ముక్తి విషయమున నభావరూపమైన ప్రధ్వంసాభావదృష్టాంత మెట్లుం గార్యమగును? భావధర్మము లభావధర్మములు భిన్నము కావొక్కతీరుగనే యున్నవని యందురా ఘటపటాద్యభావమునకును తత్సాధనమునకును వ్యవస్థయే లేకపోవును. కాన నభావధర్మములు భావధర్మము లేక విధమనుట యసంగతము. మఱియు సాధ్యత్వము భావపదార్థాశ్రయముకాదు. కావుననే యభావమును సప్తపదార్థములలో నొక్కటిగా తార్కికులు లెక్కించినారు. పై న్యాయ విమర్శనమువలన ముక్తిముక్తులకుఁ గల సంబంధము సాధ్యము గాదనియు ననిత్యము కాదనియు దెలియుచున్నది. అందువలన ముక్తునకును ముక్తికిని నిత్యసంబంధ మనుపలుకు యదార్థమనియు దేలుచున్నది. పై సందర్భములో ముక్తి సిద్ధము నిత్యప్రాప్తమే యగుననుసిద్ధాంతము

సర్వాంగ సుందరమని నుడువవచ్చును. ముక్తి యప్రాప్తప్రాప్యము కాదు. వ్యాసనంయమీ! యింతవఱకు నప్రాప్తప్రాప్యముక్తి యను వాదమున ప్రథమవికల్పమైన యాధారాధేయాదిరూపసంబంధవిషయక సిద్ధసాధ్యత్వాదిరూపచర్చ వింటివి. యిఁక యప్రాప్తప్రాప్తివిషయకమైన రెండవ వికల్పమనఁగాఁ దాదాత్మ్యసంబంధమును గుఱించి వినుము. ప్రాప్తప్రాపకద్వయమున ప్రాప్తప్రాపకుల కైక్యమే న్యాయమువలననుశాస్త్రముమువలనను సిద్ధింపదు మరియు "జ్ఞానాదేవతుకైవల్య" మ్మను సూక్తికి జ్ఞానేతరముల వలన ముక్తి కలుగదని యర్థము. వాస్తవముగా ముక్తి యప్రాప్తమేయయిన నదికేవలము జ్ఞానమువలన నెట్లు ప్రాప్తించు? కాంతాకనకాదులు తనకుఁ బ్రాప్తములుకాని యున్న స్థితిలో గాంతాజ్ఞానముగాని కనకజ్ఞానముగాని తనకుఁ గలిగినంత మాత్రమునఁ గాంతగాఁగాని కనకముగాఁగాని సిద్ధింపదుగదా! అతీరుననే ముక్తి యప్రాప్తమే. వాస్తవముగానైన సందర్భమున ఁగేవలముక్తివిషయక జ్ఞానమువలన ముక్తి చేకూరుననుట యుక్తియుక్తము కాదు. మఱియు నప్రాప్తప్రాప్తి విషయమున నింకొక యాక్షేపణము కలదు. తాదాత్మ్యమన నైక్యముగదా! యది జీవేశ్వరులు వాస్తవముగ భిన్నులైన స్థితిలోఁ గుదురునా? భేదము పోయిన తర్వాతఁగుదురునా? యని ప్రశ్నించినచో వాస్తవభేదమున్నంత కాల మన్యోన్యాభావముండును గానఁ దాదాత్మ్యమున కవకాశము లేదు. భేదము వాస్తవమైనచో భేదము పోవుటయు సంభవింపదు. ఘటపటాదు లన్యోన్యాభావవిశిష్టములగునవి గాన ఘటము పటము గాని పటము ఘటము గాని కానేరదు. తద్వస్తుద్వయాంతర్వర్తిభేదము శాశ్వతమే.

సర్వవిధముల ముక్తి యప్రాప్తిప్రాప్తమను వాదము నారసి కల్పనయగునది స్వల్పబుద్ధికారమై పండితుల కప్రమాణకల్ప మగుచున్నది. ఇంత వాదోపవాదముల కవకాశములేకుండు పని యెంచి ముక్తి సర్వభంగుల నప్రాప్యమని యెంచువారి కొక ప్రత్యుత్తరము గలదు. అప్రాప్యమైన ముక్తి కెవఁడైన ప్రయత్నించునా? తత్సాధనమెవఁడైన నపేక్షించునా? శశశృంగమునఁ గండూతినివారణమొనరింపను గగన కుసుమమున శిరోఽలంకరణ మొన

రింపను జూచువెఱ్ఱిగలఁడే! కావున మోక్షసాధనము శిక్షించు వేద శాస్త్రము లాపక్షమున నిరర్థకము లగును మఱియు నెటు చూచినను నప్రాప్యమగు ముక్తి వేదోదితసాధనముల వలన మాత్రము ప్రాప్త మగునా? కాన సర్వదా ముక్తి యప్రాప్యమనుటయుఁ జెల్లదు. నిత్యసిద్ధ మైన సాయుజ్యముక్తి సాధ్యరూపము కాదు. సాధ్యమె యది యగునేని యనిత్యాదిదోషములకు లోనగునని యిదివఱకే పలికితింగదా. యిఁకఁ బ్రధ్వంసాభావతత్వముం గూర్చి యించుక ప్రపంచింప వలసియున్నది ప్రధ్వంసాభావమున కంతము లేదని తార్కికులు మాత్రము వాదింతురు గాని యది శ్రుతిసమ్మతము కాదు. వేద మచిద్రూపమైన సర్వమును నశించు ననియే వచించును. శ్రుతిసంప్రదాయచతురమతులు కేవలతర్క గర్వితులవలెఁ బ్రధ్వంసాభావ మనంతమని యంగికరింపరు. తద్విరుద్ధ ముగా భావపదార్థము సాధ్యవస్తువైన యెడల నది సాంత మనవచ్చును. తన్న్యాయ మభావరూపమైన ప్రధ్వంసాభావము నందు నిరూపింపఁగూడ దని తర్కకర్కశులందురేని వారు చెప్పిన యభావత్వమును హేతువు నం దనైకాంతికఫలముగన్పట్టుచున్నదా? తా వెయ్యదనినఁ బ్రాగభావమని చెప్పవలెను. ప్రాగభావము సాంతమని వారంగికరింతురు. కావున నభావత్వహేతు వవి నాశ్యత్వరూపకార్యమును సాధింపనేరదు. ప్రాగ భావ మదియగుట నది సాధ్యమెకాదందురా చేతనేతర మంతయు సాధ్య మనియు ననిత్యమనియు శ్రుతిశాసనము బాధితమగును శ్రుతి భావపదా ర్థము సాధ్యమైనప్పు డనిత్యత్వమును విధించుచున్నది కాని యభావము విషయములో విధించుచుండుటలేదందురా యాపక్షమునఁ బ్రధ్వంసాభావము ప్రాగభావ మభావసామాన్యహేతువువలనఁ దుల్యమేయగు నిదివఱకే ప్రధ్వంసాభావ మనిత్యమని సిద్ధాంతీకరింపఁబడినది, కావునఁ జైతన్యా ఖ్యములయినవి భావపదార్థములు కానిం డభావపదార్థములు కానిండు సాధ్యపదార్థములు కానిండు బ్రకృతిప్రభృతులైనసాధ్యపదార్థములుకానిం డవి యెల్ల ననిత్యములని యంగికరింపక యెట్టి తర్కాదిశూరులకుఁ దీరదు. సనాతనియగు వేదమాత నిత్యానిత్యములచేత నాచేతనాచేతనము లనువివరించుచున్న సందర్భములోఁ జైతన్యమనంత మనియు నచిత్పదార్థ

మంతవంతమనియు బుద్ధిమంతులు పంతంబుల మాని యంతఃకరణము నిశ్చయించుకొని నిశ్చింతులగుట లెస్స. 307

ఉ. కావున నోమునీంద్రు యెఱుఁగందగు జీవపరైక్యముక్తి వి
ద్యావశమబ్బదెన్నఁడు క్రియాశతసాధ్యముగాదు జ్ఞానక
ర్మావరసాధనోత్కరకృతాప్యముగాదు సదావిశుద్ధస
ద్భావపదార్థరూపమయి భాసిలునన్నది నిక్కువంబగున్ 308

శా. జ్ఞానంబౌను చరాచరాత్మకలసత్ సర్వప్రపంచంబులున్
నేనే యౌదు మదన్యమంతయు నెటం దీపింప దంచున్ మహా
ధీనై పుణ్యము మీర నెంచుచు నివృత్తిప్రక్రియావిద్వద
ధ్వానాంచన్మతియై చరించుట వరంబౌ జ్ఞానసన్మార్గమౌ 309

ఆ. కర్మమభిలషించుఁ గర్తను; జ్ఞానమ్ము
నన్ను గోరు; రెంటికి న్నెగడును
వైర: మట్లుగాన వానిసముచ్చయ
వాంఛ వలదు ముక్తి వలయు నేని 310

శా. సారూప్యాంచితముక్తివైభవమునున్ సామీప్యసాలోక్యనా
మారూఢస్తుతముక్తివైభవములాౙ్యాః కావు సాయుజ్యమో
క్షోరుప్రాకటతుల్యవైభవములీ వూహింపుమా యవ్వి క
ర్మారబ్ధంబులుగాన నిత్యములుగా వాత్మాన్యముల్ నిత్యమే? 311

క. జ్ఞానవిధానము కర్మవి
ధానమ్మున్ రెండు శ్రుతిగతమ్ములె యగుటన్
బూనంగవలయు శ్రద్ధన్
మానితబుధుఁడాత్మతరత మజ్ఞుం డగుచున్ 312

చ. అలఘుహిరణ్యగర్భకమలాక్షసురేశహరాదిదేవతా
వళిభజియించు పట్టులను భక్తియుతార్చన తోడఁ దత్తదు
జ్జ్వలతనురూపబోధము లెసంగినఁగాని ఫలంబుగల్గది
మ్మల నని జ్ఞానసత్కృతిసముచ్చయమున్ శ్రుతి బల్కు ధినిధి

ఉ. కావున వేదచోదితసుకర్మములన్ నిగమోక్తబోధసం
భావనలం దనాదరణ భావము నొందక వేదశాస్త్రవా

క్యాపలి నాదరించి సుజనాదృతి గైకొని జ్ఞానకర్మదీ
ఔపరదక్షతన్ మెలఁగు గర్మఠుఁ డెయ్యెడ స్తోత్రపాత్రుఁడౌ 314

చ. పలికి యనంతరమ్మున సుభవ్యకళాంచితుఁడైన జన్మకృత్యమున్
సలిపి యుమాసమేతుఁడయి సర్వజగచ్ఛ్రయభాసకాత్మరూ
పలలితగాత్రుఁడై శివుఁడు వ్యాసమునీశ్వరు నందనుండు య
వ్వల కరిగెన్ ఋషీశ్వరుని భాగ్యము లెంచ వశంబె యేరికిన్.

క. సకలార్థసాధనమ్మై
నకలంకమనిషులారః యాడితిఁగద దా
నికిమించి చెప్పవలసిన
దిఁకఁ గలుగదు మోహమెడలు నిట నద్దానన్ 316

## 39. వేదవిరోధము

ఉ. బోధ మొనర్చి యెల్లరకు ముక్తి నొసంగఁగఁ జాలు నట్టి బల్
సాధనముల్ వచించు శ్రుతి జానగు నయ్యవి జ్ఞానకర్మస
ద్బోధవిధద్వయం బపర ముక్తి ఘటించును గర్మభాగము
బ్బోధ మొనర్చు మీరుఁ బర ముక్తిని జ్ఞానవిధానభాగమున్ 317

ఉ. వేదము జ్ఞానకర్మవిధి విశ్రుతమై తగు రెండుభాగముల్
సాదరబుద్ధి యద్వయప దార్థము తెల్పును జ్ఞానకాండమున్
వేదవిభాగమందుఁ బృథి వీగగనాదివిభేదమెల్ల సం
పాదితమయ్యె మాయ నని పల్కును రెండవ భాగ మెంచఁగన్

తే. ద్వైత మరయంగ నింత వాస్తవము కాదు.
భ్రాంతదృష్టిని ద్వైత మద్వైతమందు
కల్పితంబగుఁ గాన వి జ్ఞానమొదవు
వేళ నశియించు నది యని విబుధుఁ డెఱుగు. 319

ఉ. ముత్తెపుఁజిప్పలో రజత మున్భ్రమబుద్ధులు గాంచునట్లువి
ద్యాత్త మనీషలెల్ల రచ తాదిజగద్విషయంబు లాత్మనం
దెత్తఱిఁ జూచువారు జగ మెన్న నసత్యము బ్రహ్మ సత్యమౌ
ముత్తెపువెండివాస్తవమె ముత్తెపుఁజిప్పగదా నిజమ్మగున్ 320

చ. జగము నిజమ్ము సుమ్మటు నసత్యము గాదని యెంతురేని వి
శ్వగమగు నట్టిదంతయు నశాశ్వతమౌనని గాంతుమే గదా
నిగమములట్లు వాకొనునసేర్పునఁదర్కము నట్లుపల్కు నెం
చఁగ జగమేవిధంబున నసత్యము బ్రహ్మము సత్యమై తగున్

వ. ద్వైతమునందు నద్వైతమధ్యస్తమందురా? యట్లనఁగూడదు. ద్వైతము దృశ్యమును నశ్యమునై యున్నది. కనుక సత్యమునం దసత్యమధ్యస్త మనుట యొప్పుగాని యసత్యమందు సత్య మధ్యస్త మనుట పొసఁగని పల్కు. ద్వైతాద్వైతములు రెండు నధ్యస్తములనియు ననఁజెల్లదు ద్వైతాద్వైతరూపములు గాని యేవస్తువు స్ఫురింపదు కనుక నీపలు కసంగతము. ద్వైతాద్వైతములుభయములు శూన్యమంద ధ్యాసము చేయనగు నని యందుమా? శూన్యమునం దధ్యాస మసంభవ మగుట నదియుఁ గుదురని పలుకగును. కావన సర్వవిధముల నెంచిన బుధులు ద్వైత మద్వైతము నందధ్యసింపఁబడుచున్నదని నిశ్చయించిరి ప్రత్యక్షానుమానోపమానాది ప్రమాణముల కందని బ్రహ్మపదార్థ నిరూపణమునందు మాత్రము శ్రుతి ప్రయోజనవతి యగును గాని ప్రత్యక్షాది ప్రమాణలక్ష్యమగు ద్వైతదర్శనమున శ్రుతి ప్రమాణము కానేరదు స్వపరదోషదూషితముగాని శ్రుతి ప్రమాణములందు బలిష్ఠమనుట నిస్సంశయము. మఱియు రహస్యముం గలదు. భేదప్రతిపాదకములగు శ్రుతులు లోకబుద్ధి ననుసరించి భేదము కేవలమనువదించి తుదకు నభేదము ప్రతిపాదించును. శ్రుత్యనుసరణచణంబులగు స్మృతి పురాణాదులు నిట్లే యని సమన్వయించుట న్యాయము. "సత్యం జ్ఞాన మనన్తమ్ బ్రహ్మ" "అశబ్దమస్పర్శ మరూప మవ్యయ" మ్మను శ్రుతులను తద్విధములగు నితరశ్రుతులును జగద్విలక్షణబ్రహ్మపదార్థబోధకములు 'తత్సృష్ట్వాతదేవానుప్రావిశ'దిత్యాదిశ్రుతులు జీవబ్రహ్మైక్యమునుబోధించు నిది యదార్థము. బ్రహ్మవస్తువునకు జీవత్వము వాస్తవము కాదు. వాస్తవమైనయెడల తత్వమస్యాది మహావాక్యవ్యాకోపముప్పతిల్లు నేల యన స్వతస్సిద్ధగుణము నశించుట యెన్నఁడు తటస్థింపదుగదా! యటులనే జీవత్వము బ్రహ్మకు స్వతస్సిద్ధమైన యెడల జీవుఁడు బ్రహ్మమగుట

తటస్థింపదు మఱియు రాగికి సహజముగాఁ దటస్థించు తుప్పాఖ్య పదార్థ సాధనమున మన మపనయించు తీరున నీశ్వరారాధనాది సాధనముల జీవులకు సహజమైన జీవత్వము మనమపనయింప వచ్చునని మీరందురా? యది సరికాదు. రాగి పునఃపునర్మలసంయోగియగు నటుల ముక్తుఁడుం బునఃపునర్జీవత్వయుక్తుఁడగు నని యనవలసివచ్చు నాపక్షమున ముక్తి నిత్యము కాదని యనవలసివచ్చు నట్లనుట సమ్మతము కాదు గదా! స్వాభావికమైన యుష్ణత్వము జితప్రభానుని వీడనే వీడదు. వీడిన యెడల నగ్నికి నగ్నిత్వమే లేదు. మణిమంత్రౌషధులవలన దహనదాహకశక్తి మఱుంగుపడున ట్లబోధాది ప్రతిబంధకమువలన నీశ్వరత్వము జీవ విషయమున మఱుఁగు పడుట గుర్తెఱుంగక సూక్ష్మదర్శనానిపుణు లీశ్వరత్వము జీవసహజలక్షణమని తెలియఁజాలరు. బుద్ధిసూక్ష్మతా శూన్యతలు సులభభ్రమపర్యవసాయములనుట మనకు నిత్యానుభవము. బంగారుతోఁగూడిన వెండినిబంగారనియుఁ బాలతోఁగూడిన నీటిని బాలని యు స్థూలబుద్ధులువ్యవహరించు భంగి నింతయుం బరిశీలించినచో నాగంతుకహేమత్వక్షీరత్వములు రజతనీరములకు స్వాభావికములనిచెప్ప నొప్పదు గదా. ఏరసవీర్యమువలన నాగంతకహేమత్వము సంభవిం చెనో యది నశించిన వెనుక నాగంతుక హేమత్వమును నశించును. కానఁ గించిత్ప్రతిబంధకార్యమైన యాగంతుక జీవభ్రాంతియు దత్ప్రతి బంధనాశము వలన నశించి "యహంబ్రహ్మాస్మి" యనుజ్ఞాన ముదయిం చును మఱియుఁ దోయమున కగ్నిసాయమున నౌష్ణ్యమబ్బి వేడినీళ్లను సంజ్ఞ కలిగినట్లు శివేతరుఁడగు జీవున కశివసంపర్కము వలనఁ గలుగు శివత్వము స్వాభావికముకాదు. జలమునకు జలత్వము స్వాభావికమైనట్లు జీవునకు జీవత్వమె స్వాభావికము జీవున కీశ్వరత్వ మనిత్యమని కొందఱు విపరీతవాదము చేయుదు రది విదితశాస్త్రపద్ధతి కాదు. జీవునకు శివసా మ్యము ముక్తియని కొందఱమతము. సమ్యగ్విమర్శనంబొనరుప నది యంగికార్యము కాదు. సర్వదా జీవునకు శివసామ్యమనిన జీవేశ్వర భేదమె పొసఁగదు. ఏకదేశసామ్య మందురా? అది యేవిషయమున ననఁ జేతనత్వవిషయమున నని యనునెడ జీవులందఱు ముక్తులే యని

యనవలయుఁ గావున సత్యాది శబ్దముచేఁ దెలియనగు శివుని కన్న వేఱు కాఁడు. స్వాజ్ఞానము వలన సంసారమును దన యందుఁ గల్పించుకొని తదజ్ఞానవినాశమున స్వబ్రహ్మస్థితినెఱుఁగును. కల్పిత రజతబుద్ధి తదధిష్ఠానశుక్తి యాథార్థ్యబోధము వలన నశించు. ముక్తావస్థయందు జగదభావమా? జగదప్రతీతియా? జగత్తు శివరూపావస్థానమా? యని వికల్పింపఁ గడమవి రెండు వికల్పములు మందమతి విలసితములు. మొదటిది సిద్ధాంత మెట్లన శశశృంగము వంటి యత్యంతాభావమా? యన యట్లుగాదనియు రజ్జుసర్పమువలెఁ బ్రతీతిమాత్రసత్తాకమని వాస్తవత్వరహితమనియు జగత్తును జెప్పుటొప్పు వంధ్యాపుత్రాది వలె నత్యంతాభావస్థితికిని జెప్ప నయ్యది తప్పగును గావుననే జగన్మిథ్యాత్వము శ్రుతులచే నిశ్చయింపఁబడినది. సర్వాధిష్ఠానమొక్కటి మాత్రము సర్వశేషియని మనీషిజనము పల్కుదురు. జగమ్మెల్లఁ బ్రలయమున నశించు నప్పుడు పరశివవస్తువు మాత్రమొక్కటియే శేషించునని మున్మాటికి నొక్కి చెప్పెదను. జలైక్యబోధోపదేశకములగు వాక్యముల కితర వాక్యము లుపకారకవాక్యములని వేదమీమాంసాపద్ధతిగ గ్రహింపనగు.

క. ఏఁదథ్యముఁ బల్కుదును మ
హాదేవుఁడు సర్వశేషి యగునటు లామ్నా
యోదితము సర్వశేషము
గాఁ దెలియం దగును మీరు కవికుంజరముల్ 823

తే. తల్లి బిడ్డలకును వలెఁ దగ జనాళి
కెల్లరకు సత్యమున్ హిత మెలమిఁ బలికి
మేలు చేకూర్చు శ్రుతి దాని మించునట్టి
తల్లి నెచ్చోట నరయము ధన్యులార! 824

సీ. ఎఱిఁగియు నెఱుఁగక యెల్ల కాలములందు
దురితముల్ పొనరించు దుశ్చరితుల
లేమటి యైనను నెంచక పున్నెంబు
నేఁతకొల్లని యట్టి చెట్టకట్టె
లతుల శ్రుతుల హాస్యగతుల నొవ్వఁగ జేసి

విహరించి మించుపాపిష్ఠిజనులు
మాటవరుసకైన నమందుకైనను మేలి
త్రోవలఁజనకుండు దుష్టమతులు

తే. శ్రీమహాదేవునందు నశేషవేద
వాక్యములయందుఁ బావనభస్మధార
ణమ్మునందును గాంతురి ద్వేషమ్మునెపుడు
వలదు శివనింద తత్ఫలమలఁతిగాదు 825

క. శివనింద భస్మనిందయుఁ
బ్రవిమలనిగమాంతనిందపాపిష్ఠిజనుల్
వివిధోత్సవముల రీతిన్
దవిలెడిబలువిద్యయంచుఁదలఁపన్ వచ్చున్ 826

క. శివసమదైవతమును శ్రుతి
సవిధమ్ము ప్రమాణమొండెసంగునె యెందున్
శివతుల్యా శ్రుతితుల్యా
న్యవస్తువచన మ్మఘమ్మనన్ బుట్టునుఁడీ 827

మ. మఱియున్ బ్రహ్మపదార్థబోధమునుసంపాదించి యావెన్కనె
ల్లరు కర్మంబు లొనర్పఁగావలయుఁ దెల్లంబంచు నెల్గెత్తి కొం
దఱువాక్పాటవ మొప్పఁ బల్కుదురు తద్వాక్యంబు యుక్తంబుకా
దరయున్ జ్ఞానము గల్గుపిమ్మటను జేయం గార్యముల్ గల్గునే?

ఉ. జీవుఁడు కర్త భోక్త యనుశేముషియున్ బరదైవతంత్రుఁడన్
భావమునున్ నశించు శ్రుతివాక్యసమన్వయజన్యవేదన
శ్రీవిలసిల్లుచో నని వచించును శాస్త్రముపండితాళియున్
గావున జ్ఞానలబ్ధికిని గర్మము శేషి యనంగరాదెటన్ 829

ఉ. జన్మము మున్నుగాఁ గలుగు శ్రౌతవరక్రియలొను భోగసం
పన్నఫలస్వరూపతిరిదివపభృతిప్రకటప్రదేశవా
సోన్నతి కట్టులౌటక్రియ కొప్పను శేషత తత్ఫలార్థమై
యెన్న ఫలంబు జ్ఞానమగు నెట్టుల కర్మము జ్ఞానశేషమౌ? 830

ఆ. అల్పఫలము మాత్ర మబ్బఁజేయునుగర్మ
జాల మలఘుఫలము నబ్బఁజేయు
జ్ఞానమార్గ మటులఁ గావున జ్ఞానికిఁ
గర్మశేష మెపుడు గలుగ దుగద! 831

క. కర్మప్రకరణములను శ్రుతి
నిర్మితవాక్యములఁ దోఁచు నెటి జ్ఞానము స
ద్ధర్మఫలం బిడుఁ దత్త
త్కర్మము లొనరింప నంచుఁ గద! తెలియనగున్ 832

క. జ్ఞానప్రకరణమందునఁ
గానంగావచ్చు నట్టి జ్ఞానమునకు నిం
తేనియుఁ గర్మము శేషము
గానేరదు బుద్ధిసూక్ష్మగతి యిదియ యగున్ 833

క. ఏయమలినయజ్ఞాదులఁ
జేయన్ స్వర్గాదిలోకసిద్ధియొదవు మీ
కా యనువున మోక్ష ముపా
దేయము గాదంచు మీరు తెలియుం డిటుపై. 834

ఉ. కావునఁ గర్మకాండమును జ్ఞానవిధాయకకాండమున్ శ్రుతిన్
త్రోవలు రెండునున్ వెలయు దూరము తోఁచుఁ బరస్పరమ్ము న
జ్ఞావళి ప్రాజ్ఞలోకమను నాఖ్యలతో నధికారు లెయ్యెడన్
ధీవరులార! తద్ద్వయము నేర్తు రి యథామతి నొక్క రొక్కటన్

తే. జ్ఞానకర్మసముచ్చయ మూనుటన్న
త్రోవ యొప్పదు రెండు విరుద్ధమార్గ
ములును జరియింప నేరికిఁ బోలు నేక
కాలమం దిది తెలియంగఁ జాలరొక్కొ 836

సీ. తెలియంగ శాంతిదాంతి క్షమాదిగుణమ్ము
లాత్మవిద్యకు నముఖ్యాంగములగు
మననమున్ శ్రవణంబు మహితనిధిద్యాస
బ్రహ్మవిద్యోపకారకములగును

చీఁకటు లినుతేజుచేవలె నజ్ఞాన
మాత్మబోధముచేతనడఁగు నిజము
జ్ఞానసాధన మన్యసాధనాపేక్ష
హితమయ్యు నిడు ముక్తినెల్లరకును

తె. నల్పఫలమీయఁ జాలుఁ గర్మాఖ్యసాధ
న మ్మనల్పఫలప్రదానక్షమైక
బోధమున కంగమును గాదుపూని జ్ఞాన
కర్మవిధముల నీగతిఁగనుట యొప్పు 837

స. కనఁగ ధర్మాధర్మగతులు రెండును గర్మ
మగు నధర్మంబుచేనఘము పెరిగి
నరకలోకనివాసగురుదుఃఖములు సంభ
వించు ధర్మము పుణ్యవృద్ధి నొసఁగి
చిత్తశుద్ధిని మాత్రమత్తఁజేయఁగఁజాలుఁ
గాన ధర్మాధర్మకర్మవిసర
మరయ జ్ఞానాంగమైవఱలుట గల్గదు
గాని పరంపరాకారణంబు

తె. జ్ఞానమున కగుఁ జిత్తసంస్కారకరణ
మగును గర్మంబు నద్దాననలఘుజనన
మరణముల యందు దోషవిస్ఫురణదృష్టి
యొదవు దాన విరక్తియు నొదవుఁ బిదప 838

క. వైరాగ్యమ్మునఁ గలుగున్
సారముముక్షుత్వమబ్బుజ్ఞానము దానన్
గోరకయే ముక్తియుఁజే
కూరును జ్ఞానమున నిగమకోవిదులారా! 839

తే. జ్ఞానకర్మసముచ్చయసరణియెట్టి
భంగినైనను బొసఁగదు వైరగతుల
నమరు వస్తుద్వయమున కేకాధికరణ
భావమొప్పునె? కనుఁడిది భావములను. 840

వ. కొందఱు. 841

తే. తర్కనైపుణి మీఱ వేదములు జ్ఞాన
కర్మముల్ రెండు విధియించుఁ గాన దత్స
ముచ్చయాత్మకనిర్ణయము గ్రహించి
మోసపోవుచుఁ జెడుదురు మూర్ఖులగుచు. 842

ఉ. మోహకళావిజృంభణము మోహముగా విలసిల్లఁ గాన ని
ర్మోహపదార్థమందున నిరూఢపరాత్మమనీష దక్కి సం
దేహవిపర్యయాత్మకమనీషలఁ జిక్కి యనేకజన్మకౌ
తూహల మొప్ప దుర్వినయదోహలులై చరియింతు రెల్లరున్

శా. వేదార్థంబు తెఱంగు లిట్టివను తేల్విన్ జంద్రచూడస్ఫురత్
పాదాంభోరుహభక్తి చేతను హరోదారైకకారుణ్యధా
రోదంచన్మహిమంబుచేతను గదా యొక్కప్పుడుద్యన్మనీ
షాదార్ఢ్యంబునఁ గాంతు రొందఱు విరాజత్పూర్వపుణ్యమ్ము చేతన్

ఉ. మీయెడ నాకుఁగల్గిన యమేయదయాపరిపాకసంగతిన్
గేయచరిత్రులార! శ్రుతినిశ్చితబోధము నర్పి నాఁడ నే
నీయెడ దీనికన్న మఱియెందును ముక్తిపథంబు లేదు ని
శ్శ్రేయసతత్త్వమాగమగరిష్ఠులు గాఁగలవారు మీరికన్ 845

40. సర్వసిద్ధికర ధర్మవిచారము

క. కర్మంబు సకలసిద్ధిద
ధర్మంబని తెలియుఁడయ్యా నాని తెఱంగున్
మర్మంబున్ వచియింతున్
నిర్మలమతి వినఁగఁదగు మునీశవరేణ్యుల్! 846

క. చేయందగు కర్మంబులు
కాయికమానసికవాచికంబులు నా మూఁ
డై యొప్పు వాని నియ్యెడ
నాయోపిన కొలఁది మీకనంగలవాఁడన్ 847

మత్తకోకిల :

కాయికంబనఁ గాలకంఠున కఖర్వభక్తిని గొల్చుటల్
కాయజారివరాలయస్థలిఁ గాలు నిల్పి సుఖించుటల్

గేయశైవమహాస్థలిన్ గృతకృత్యులై చరియించుటల్
జ్ఞేయశంభువిలాసగాథ రచించి కీర్తి వహించుటల్ 848

ఆ. మఱియు మంత్రపూర్వమహితంబుగాఁజేసి
బసుమ మొగిని గేలఁబట్టిపుండ్ర
ములను దీర్చియైన నెలమిని మెయి నిండఁ
బూయుటయును నగును గాయికంబు 849

సీ. చెలఁగి చిన్మంత్రంబు నలరి జపించుట
ప్రణవమంత్రమ్ము జపమ్ము సేత
పదనామమంత్రజపప్రసంగంబు ష
డక్షరమంత్రజపానురక్తి
ధన్యహంసాఖ్యమంత్రజప సేవనమును
సావిత్రిజపమును సల్పుటయును
వేదపారాయణవిభవమొందుటయును
వేదాంగపఠనమ్ము విడువకుండ

తే. సంతతంబు నొనర్చుట సరసహృదయు
లార! వాచికమని మీకు నరయఁదగును
వాచికాఖ్యంబు కర్మంబు వఱలఁజేయఁ
గోరికలు మీకు సతము చేకూరు నిజము. 450

సీ. శ్రీసదాశివరూపచింతనమ్మును సుమా
దేవీసమర్పితభావనిహృతి
తత్త్వమస్యాదివేదప్రోక్తవాక్యార్థ
సందర్భసముదయచారుచర్చ
వేదార్థకృతనిశ్చయోదారమహితార్థ
సతతనిశ్చలమనీషావిశేష
మఖిలపురాణేతిహాసోక్తవివిధధ
ర్మానుచరణబుద్ధియలవడుటయు

తే సర్వలోకవిరక్తియు సకలదైవ
తోన్నతప్రాభవుండగు నుగ్రుఁడనెడి

పరమనిశ్చయమును నేనుభవుఁడ నగుదు
ననెడి తలఁపునుమానసికాఖ్య కమరు 851

క. శ్రౌతస్మార్తరహస్యము
లీతెరవులు తెల్పెఁగానినింతకువేఱే
యేతీరుల నెఱ్ఱ్యెడలం
జూతుమె సద్భావనావిశుద్ధుల్ వినుఁడీ! 852

సీ. కాఁడొకో! సర్వనాకపాలికటోన్నతా
ఖర్వపై భవుఁ డుమాకాంతుఁడరయఁ
గాఁడొకో! నానాజగత్పదార్థావభా
సకదివ్యమూర్తి యీశానుఁడెంచఁ
గాఁడొకో! వివిధలోకస్ఫురద్దివ్యమ
హానందకందమాహరుఁడెఱుంగఁ
గాఁడొకో! నిఖిలభూగగనాంతరస్థలీ
వ్యాప్తపూర్ణుం డుమాపతియ తలఁపఁ

తే. గాఁడొకో! సర్వసత్తాప్రకటతముండు
సర్వకారణకారణచణుఁడు సర్వ
భద్రదాయకుఁడరయగోభద్రతురగుఁ
డార్యజనులార! సందియమందకుండ. 853

క. శివధర్మమ్ములు మోక్షో
త్సవదాయకములును దొలుతసకలజనమనో
వివిధేప్సితప్రదమ్ములు
నవు పిమ్మట నంచుఁదెలియఁదమరవిచారుల్! 854

సీ. భాగిరథీతుల్యపావనోదకములు
వఱలునే? యెట్టిసరిద్వంతినైన
హేమభూధరసామ్యభూమీధరంబులు
గలుగునే? యెట్టిలోకములనైనఁ
బరిధవిల్లునె? యమృతపానసమానదా
నము లెట్టిమహితధర్మములనైన

వేదసద్రుక్షసంవిదితప్రమాణంబు
గాంతు మే? యెట్టితర్కమునవైన
తే. శివమహాక్షేత్రసన్నిభక్షేత్రమభవ
విభవసమదైవతంబు వృషభతురంగ
విమలవిజ్ఞానసద్బోధము త్రినేత్ర
ధర్మసాధర్మ్యధర్మంబు ధరణిఁగలవె? 855
చ. అలఘుమదుక్తచారుమదనాంతకధర్మములో నభీష్టదం
బులు పలుపల్కలేల? సరిపోల్పఁగవచ్చునె వానితోడ ని
ర్మలతరధర్మకర్మనిఃకరంబులు శ్రుత్యుదితంబులయ్యు ను
జ్జ్వలమతులార!పల్కితినిశర్వరహస్యము మీకు నియ్యెడన్ 85

## 41. పాతక విచారము

వ. పిమ్మటఁబరిహరించుటయే ప్రయోజనముగానెంచి పాతకములు పేర్కొందును. అవి దశవిధములని పండితులు నుడివి రవియుత్తరోత్తర లఘువులునగు. అందు మహాపాతకమనునది మొదటిది అతిపాతక మనునది రెండవది. ప్రాసంగికము మూఁడవది. పాతకమనునది నాల్గవది. ఉపపాతకమైదవది. జాతిభ్రంశకరణ సంకీర్ణ కరణములాఱవదియు నేడవదియు నగు. అపాత్రీకరణ మెనిమిదవది. మలాపహము తొమ్మిదియవది. శేషించిన ప్రకీర్ణమనునది. 857
తే. కల్లుద్రావుట బ్రహ్మవిజ్ఞానిఁబొలియఁ
జేయుటయు వాని సొమ్ము స్పృశించుటయును
గన్నతల్లిని గవయుటకలిసిమెలిసి
యట్టివియు సల్పు వారితో నరుగుటయును 858
తే. ఐదు లెక్కింపనగు వీనినార్యజనము
లఘములందున గొప్పవియగుటజేసి
పరగపల్కిరిగద మహాపాతకమ్ము
లంచుఁగావున వర్జనీయమ్ము లగును 859
తే. కోడలిం దల్లియనఁదగుచెడెమిన్నఁ
గూఁతుఁ జెలియలినిన్ గవగూడుటయును

శర్వమురరిపువిగ్రహ • చలనము నతి
పాతకము లని యార్యులు • వక్కాణింరి మును 859

క. ప్రాసంగికాభిధములగు
దోసంబులు నుడువుదున్ గుతూహలమతులై
యోసూరివరులు వినుఁడీ!
శాసింపుఁడు! వాని జనులు • సల్పకయుండన్ 860

సీ. సకలప్రజానురంజకధర్మ మొప్పార
జగతిఁ బాలించు రాజప్రకాండుఁ
గ్రయవిక్రియాదిసర్వక్రియాన్యాయప్ర
వృత్తచిత్తుండైన శెట్టికొడుకు
సప్తతంతుక్రియాచరణ దీక్షాదక్షు
యజమానయాజకాద్యఖిలజనుల
నరికృతాపత్సమూహాపనోదకదివ్య
క్షమతి శరణొందు సజ్జనాళి

తే. మాతృగర్భస్థితాజ్ఞాతమాతృశిశువుఁ
జెఱఁగు మాసిన చేడియ చెలఁగి నిసుగుఁ
గుక్షిఁదాల్చిన కోమలిఁ గ్రూరబుద్ధిఁ
జంపుటన్నవి యగును బ్రాసంగికములు. 861

తే. తల్లి తోఁబుట్టువలయును దండ్రియన్న
దమ్ములయు మేనమామల తాతలయును
ధరణిసురవర్యులయు నృపుతరుణి పాప
మనక హరియించుటయు నట్టియఘములగును. 862

తే. బుద్ధిసూక్ష్మత లోప్పార మొలచి నట్లు
కూటసాక్ష్యంబుఁ జెప్పుట కూర్మి మీఱ
తన్నుఁ బ్రేమించు నెచ్చెలి మిన్నఁబట్టి
యురక హింసించుటయు నట్టి దెఱుఁగుఁడీకను 863

వ. ఇఁక బాతకముల నేర్పరింతు. 864

తే. తల్లి సోదరి కొామరితఁ దల్లి కూర్మి
చేడె కొామరిత మేనత్త కోడలత్తఁ
జిత్తజుని బారి కోర్వక చేరెనేని
దాని పాతక మండ్రు బుధవరులిలను 865

తే. మూడురేకలు దైవాఱ బూదిదాల్పు
కునికి బూదిని మైఁబూయకునికి నన్య
పుండ్రములు మేనఁ దాల్చుట బుధజనాళి
పాతకము గాఁగ నిశ్చయపఱచిరి గద 866

కం. అంకుశము గదాదండము
సంకును బాణంబు విష్ణుచక్రాదుల మే
లంకములగాఁగ మెయిపయిఁ
బొంకమ్ముగఁ దాల్ప నదియగును బాతకమున్ 867

వ. ఉపపాతకము పాతకములలో నైదవది. అది ముఖ్యగౌణభేదముల నిరువిధమ్ములగు నందు ముఖ్యోపపాతకము లెట్టివనిన వినుండు.

సీ. తనతోడు నీడగా ననయమ్ము వర్తించు
చెలికాని కూర్మి నెచ్చెలి నొకరిత
యజ్ఞయాగాదిక్రియా వేళఁ బనిఁబూని
ఋత్విజుండగువాని ప్రియ నొకరిత
మంచిచెడ్డలు దెల్పు మహిత విద్యనొసంగు
నయ్యవారగువాని యాలి నొకత
తనదు పవిత్రగోత్రంబున జనియించి
కొమరుఁబ్రాయము నున్న కొమిరె నొకత

తే. తనదుకొమ్మకు చెలిమియై తనరు కొమ్మ
నొకత గురువులు వెలిపెట్టినువిద నొకత
కాకతాళీయముగఁ గాంచు కాంత నొకతఁ
గవయ ముఖ్యోపపాతకాఖ్యకును దగును 869

వ. పాషండనిష్ఠాజనసంబంధంబును జతుర్థాశ్రమ, నిష్ఠాగరిష్ఠ స్త్రీసంబంధంబును పరస్త్రీగమనంబును. దుర్గాదిత్యాది దేవతా చాలనంబును ముఖ్యోపపాతకము లని యందురు. 870

సీ. పినతల్లిఁ బెదతల్లిఁ బెండ్లాము మేనత్తఁ
గడఁక బోషింపక విడచుటయును
శ్రుతినిందన మధీత శ్రుతిపరిత్యాగంబు
వీతిహోత్రుని బత్తి వేల్వమియును
మూల్యమ్మునకు వేదము విక్రయించుట
ధనమిచ్చి వేదవిద్యను గొనుటయు
జన్నం బొనర్పమి సజ్జనస్తుతిపాత్రుఁ
బుత్రునిం గాంచమి భూరుహాది

తే. హింసయు బ్రదుకు తెరవుగా నెంచి మనుట
యిక్షుకాండాదిపీడన దక్షయంత్రి
నిర్వహణజీవనంబు ముని వరిశాంతు
లనిరి గౌణోపపాతకమనుచుఁ దొల్లి. 871

క. తనకొఱకై తను పచనం
బొనరించుట కల్లు దావుని విదను సతిగాఁ
గొనుటయు నాస్తిక్యము రం
గనటన మభిచారహోమకరణం బటులౌ 872

క. పరతరుణీసాంగత్యము
నిరుపమసర్వాధికార నిర్వహణమ్మున్
బరధనహరణ మయోగ్య
స్ఫురిత స్నేహంబు నట్టి చొప్పుం గాంచున్ 873

తే. బ్రహ్మచర్యంబు నగ్నిహోత్రంబు నిత్య
ముజ్జగించుట భక్షణా యోగ్యములుగ
శాస్త్రముల్ నిందచేసిన సరకుగొనక
భక్ష్యముల్ మెక్కుటయు నట్టి పాతకములు 874

వ. జాతిభ్రంశకరాఖ్యాఘమ్ములఁ బేర్కొనెద. అవనీసురసంకటాచరణము సఘ్రేయఘ్రాణనము మద్యసౌరభము చవిగొనుట పశుపురుషమైథునము వప్రవర్తనము జాతిభ్రంశపాతకములగు గ్రామంబులంగాని కాంతారంబులంగాని వసించు పశువుల హింసించిన సంకీర్ణకరణపాతకమగును.

క. ధనమన్నంబును నిందిత
జనముల యాచించుటయు నసత్యంబులు వా
కొనుటయు వాణిజ్యము వ
డ్డిని గొని జీవించుటయుఁ బ్రతిష్ఠాఘంబుల్ 876

వ. అవియు నంబుజోదరపాదజయాజనమ్ము నపాత్రీకరణాత్మకదోషమ్ములు నేలనునీటను వసించు నీడోద్భవంబులకుఁ గీడాపాదించి జీవించుటయు సురాపాయి యింట భుజించుటయు మలావహపాతకములనంబడు.

పైనఁబేర్కొనఁబడినవి కాక తక్కుంగల పాతకమ్ములు ప్రకీర్ణపాతకమ్ములు. 877

క. వడిపగతుఁడు తనపైఁ ద
చ్చెడివేళల ధైర్యమొదవఁ జెచ్చెర సమరం
బడరెడితావుల విడి భూ
పుఁడు పరువిడఁ బెద్దదోసఁగుఁ భూభుజునకున్. 878

వ. తులామానంబున వంచనంబును మాంసవిక్రయంబును సురావిక్రయణంబును వైశ్యులకు మహాపాతకంబులు. బ్రాహ్మణీగమనంబును గాపిలపయఃపానంబును ద్విజులను ద్వేషించుటయు శూద్రునకు మహాపాతకంబులు. స్త్రీలకును బురుషులకును బాతకంబు సమానంబు. నీచాభిగమనంబును గర్భపాతనంబును భర్తృహింసనంబును భర్తృశిష్యగమనంబును భర్తృగురుగమనంబును స్త్రీలకు మహాపాతకంబు లని పెద్దలు వచింతురు. 879

క. శ్రుతులును స్మృతులును జెప్పిన
మత మది ధర్మంబు వేయిమాటలిఁకేలా?
శ్రుతులును స్మృతులును జెప్పని
వితమెల్లను బాతకంబు విజ్ఞులు వినుఁడీ! 880

తే.గ. ఘోరశోకమోహాంబుధితారకంబు
వేదసారంబు నుడివితి విజ్ఞులార!

షాతకంబులు విడనాడి భక్తితోడ
భవుని శ్రీదేవదేవుని శివునిఁ గొలుఁడు. 881

## 42. ప్రాయశ్చిత్త కథనము

మ. సకలామ్నాయ శిరఃప్రకాశితరహస్యం బియ్యదౌ బుద్ధిపూ
ర్వకపాపౌఘముఁ ద్రోలఁ జాలుఁ బరతత్త్వజ్ఞానమొక్కండు దా
నికి నీడైన యుపాయమున్ వెదకి యెంతదేఁగాంతుమే? ధీప్రమా
దకృతాఘప్రకరాపనోదనవిధాధ్యానంబు లెన్నేనియో. 882

కం. వేదాంతవాక్యరత్నా
పాదితబోధమ్ము తృణము వహ్నివలెన్ బెం
పేదంజేయును బుద్ధికృ
తాదరపాపముల నెల్ల నార్యులు వినుఁడీ! 883

కం. కాయికవాచకమానస
మై యిరవుంగాంచుఁ గర్మ మది తత్సాక్షిన్
డాయఁగ వశమౌనే? యిది
మాయావశులైన జనులు మన్నింపరుగా 884

కం. దేహేంద్రియధిషణాచి
త్తాహంకారాదిభిన్నుఁడగు నాత్మన కె
ట్లూహింపుఁడు! దేహాదిస
మూహార్జితపుణ్యపాపములు దవులుకొనున్ 885

తె.గి. పుట్టి గిట్టుటయును గిట్టి పుట్టుక మఱి
చెందుటన్న వికారంబు లొందనట్టి
వాఁడు తానౌను: దనకు నెప్పగిదినెట్టి
కర్మబంధప్రసంగంబు గలుగ దెపుడు. 886

వ. మఱియు నణుస్థూలహ్రస్వదీర్ఘ ప్రియాప్రియ ప్రేర్యప్రేరకాది ద్వంద్వవినిర్ముక్తంబాత్మ తత్త్వంబు. దానికి లేశమైనను గర్మస్పర్శము లేదు. అయ్యది జిజ్ఞాసుని భూమానందవాస్తవస్వరూపంబు. తనయందు కల్పింపఁబడిన సర్వజగత్తులకు సాక్షి యదియ. నేతినేతి వాక్యనిరస్త ప్రపంచవైలక్ష్ణ్యమ్ము దాని లక్షణమగును. అజ్ఞాన జన్యంబగు కర్మ

త్వాదిబుద్ధి సునిశిత వేదాంతవాక్యవిచారజన్యబ్రహ్మాత్మైకజ్ఞానము నెట్లు బాధించును? అజ్ఞానాంధకారమ్ము స్వయంప్రకాశకాఖండజ్ఞానభాస్కరసమక్షమున దవ్వుదవ్వుగాఁ దొలఁగవలయునే గాని యునికి యుంగలుగునే? తమోరూపకరాహుజిహ్వాగ్రంబు తా గ్రసించిన భాస్కర తేజంబుచేఁ బ్రతీయమానంబగు నయ్యును దత్తేజస్తమస్సులకు సంబంధము లేనట్లే యజ్ఞానతత్కార్యము స్వయంప్రభమైన బ్రహ్మతేజస్సుచే భాసించినను వానికిఁ బరస్పరసంబంధము లేశంబును లేదు జీవుఁ డజ్ఞానముచే భ్రమపడి కర్మసంబంధమును దనయం దారోపించుకొనుచున్నాఁడు గాని విద్వాంసునకు భ్రాంతిగాని కర్మసంబంధము గాని యుండవు. దేహాది సంఘాతమ్మునం దహమ్మతి యేని కుండునో వానికే కర్మము వలన యోగము సంభవించును. విజ్ఞాన సంపన్నునకుఁ గర్మసంబంధమించుకయు నుండదు. 887

ఉ. ఏనికి నైనఁ గర్మఫలకమింతయుఁ బాయకరాదుగాని సు
జ్ఞానికి మాత్రమెయ్యెడలఁ గర్మఫలంబులు చెందనేర వ
జ్ఞానికి జ్ఞానికిన్ గ్రియలసంగతి గాంచుట గాంచకుండుటే
మానితలక్షణం బనుచు మాటికిఁ దెల్పును ధీరవాక్యముల్ 888

చ. తెలిసి యొనర్చు పాపములు ద్రెళ్ళఁగఁ జేయు నుపాయమైక్యబో
ధలలితశాంతి గాక వితధంబులు తక్కిన యట్టిసాధనం
బులు నిజబుద్ధి సందియము పూని జనింపకయుండుఁగాత! ని
శ్చలపరతత్త్వబోధవిలసన్మతులై చరియింత్రు గావుతన్. 889

చ. శ్రుతిగురుసంప్రదాయపరిశుద్ధిగఁ దత్త్వమసితిదివ్యవా
క్యతి నిరవొందు జ్ఞానము యథావిధిగా దయివాఱునట్టి పం
డితునకునన్న లోకపరికటీకృతసంసృతిదోషదుఃఖదు
స్థితిగలరాదొకింతయు సుధీజనులార! యెఱుంగుఁడింతయున్ 890

వ. మఱి ప్రాయశ్చిత్తకాండం బేరి కొఱకు శ్రుతు లేరుపఱిచె నన బ్రహ్మపరోక్షజ్ఞానహీనులయినను తత్పరోక్షజ్ఞానమాత్రులకని తెలిసి కొనఁదగినది 891

సీ. ఒజ్జయు శ్రుతిపల్కు నోజ 'సర్వంబ్రహ్మ'
మనుచు నెంచిన గతి యైనఁ జాలు
నయ్యవా రెఱిఁగింప నఖిలంబు బ్రహ్మమం
చరయు నేర్పు దినార్థ మైనఁ జాలు
ముగురుమూర్తుల రుద్ర మూర్తి మిన్నఁగ డెంద
మందు నిల్పిన దినం బైనఁ జాలు
వేఱుచింతలు మాని వెన్నుని ధ్యానింప
నరిగెడి ఘూఁడు నా కైనఁ జాలు

తే. లెక్కలేనట్టి పుట్టుల లెక్కలేక
చేయఁగాఁ గుప్పతిప్పలై చేరుకొన్న
పాపజాలంబు లెల్ల ను బాప సూరి
జనవరేణ్యులు తెలియుఁడీ! సరణు లిపుడు 892

కం. రేలేడు నైననున వన
మాలిన్ ధ్యానించు భక్తి సమహితునకు మహా
ఖీలాఘంబులు దొలఁగున్
గాలాబ్దశ్యామలాంగ కరుణాదృతులన్ 893

కం. మాసం బొకఁ డెవ్వం డ
జ్ఞాసనుఁ గొల్వంగ నోపు నాతఁడు రాసుల్
రాసులుగఁ బెచ్చు పెరిగిన
డోసంబుల నెల్లఁ బట్టి తోలుం గడకున్ 894

కం. తిరిపెం బెత్తుచు నొక వ
త్సరమున్ గోష్ఠంబునందు వసియింపుచు సు
స్థిరతన్ బవమాను నను
స్మరణం బొనరింపఁ బాపచయములు దొలఁగున్ 89౫

తే గీ. స్వస్వరూపానుసంధాన జనిత మోద
మలరఁ దాండవమొనరించు హరుని రూప
మొండు క్షణమును ధ్యానింప నురుతరాఘ
సమితి తను దాన విచ్చుచు సమసిపోవు 896

సీ. భువనేశమంత్రాఖ్యమున్ బదివేసార్లు
భక్తితో జపము సల్పంగవలయు
మాతృకారూపసమ్మాన్యపదాఖ్యంబు
పదిరెండువేల్ జపింపంగవలయు
బ్రహ్మను వచియించు ప్రణవమంత్రము లక్ష
పర్యాయములు నుడువంగవలయు
హంసమంత్రంబుఁ గంతావధిసలిలమ
ధ్యంబున లక్ష సేయంగవలయు

తే.గీ. నాభి మాత్రంబువులనిల్పి నయమతో ష
దక్షరాఖ్యంబు నెమ్మదిననఁగవలయుఁ
బెదవి మెదపక లక్షసావిత్రి నుచ్చ
రింపఁగావలెఁ బూని హరింప నఘము 8౯7

తే.గీ. వ్యాహృతులతోడనుం బ్రణవంబు తోడఁ
బదియునాఱును మార్లు భక్తితోడఁ
బ్రాణసంయమనంబు సల్పంగవలయు
భ్రూణహత్యాఘనాశనంబునకుఁ గోరి 8౯8

తే.గీ. గోవుఁ జంపిన పాపంబు వోవుటకును
గోవు వెన్నంటి తిరుగుచుఁ బావమాన
మంత్రరాజంబు పదిసార్లు మంతనమున
వాకొనన్వలెఁ బండితవరులు! వినుఁడు! 89౯

ఆ.వె. ఉపవసించి మూఁడహోరాత్రములు కంఠ
దఘ్నసలిలమధ్యతలనివాస
మంది యమలరీతి నఘమర్షణమ్ము జ
పించి పాపచయ మడంచవలయు. 900

తే.గీ. దినదినం బేడునాళ్ళను దిరిపెమెత్తి
యనుదినమ్మును గాయత్రి మను వెనిమిది
వేలసార్లుచ్చరించిన భీకరాఘ
సంచయమ్ములు తప్పక సమసిపోవు. 901

మ. స్మరణీయంబన జాలఁ బొల్చు విలసత్కాత్యాయనంబు వామ్నాయవా
గత్యరసోదంచితసూరిసన్నుతము కూశ్మాండాఖ్యమంత్రంబు బా
స్వరలీలం బఠియించి మూఁడు నుపవాసంబుల్ తగన్ జల్పి సు
స్థిరుఁడై యిర్వదినాళ్లు నాహుతులు ప్రీతిన్ వేల్వనిష్పాపుఁడౌ 902

తే.గీ. అస్యవామీయ సూక్తరహస్య మగుచు
మాన్యమగు శివసంకల్పమంత్ర మొండు
కల్గు నయ్యది పల్కం బంకగరు హరించు
పాపసందోహములు షట్ప్రపంచలగును 903

కం. అలఘుహవిష్పాంతీయో
జ్జ్వలపౌరుషసూక్త మొండు జపియించినచో
దొలఁగున్ గురుతల్పగదు
ర్మలసంచయమెల్ల దీనిమది నెఱుఁగుండీ 904

వ. మఱియు నుపవాసత్రియమొనర్చి, పురుషసూక్తవిధానంబున నేతితో హోమంబు సల్పిన సర్వపాపము లెడఁబడును. "యశ్ఛందసాం వృషభోవిశ్వరూప" యను మంత్రమ్ము దశాయుతపర్యాయమ్ములు పునశ్చరణమ్మొనరించుచు జలమధ్యమ్మున మూఁడు రేలు వసించిన మైడల దొంగతనము వలనఁ బాపము దొలంగు. సర్వాంగవిభూతివిలేపనుండయి మూఁడునాళ్ళుపవాసక్రమమున కోర్చి నిరుపద్రవంబగు రుద్రంబు పారాయణంబుం బొనర్పఁగల్లు చవిగొన్న దురితమ్ము సన్నగిల్లు. వాజసనేయకశ్రుతిస్థితద్రుపదానామగాయత్రీజపము జలనిమగ్నుండయి పంచపర్యాయంబు లాచరించిన నిఖిలపాపాపనోదకవిధానమగును "యత్కించేదత్రవరుణ" యను మంత్రం బొక్కసంవత్సరము జపించినచో మహాపాతకములు నశించును. "తరత్సమందీధావతి" యన్నుమనువుజపించిన మానవుం డభక్ష్యభక్షణపాపవిముక్తుండగు. "ఇన్ద్రమ్ మిత్రం వరుణమగ్ని మాహుః" అను మంత్రంబు జపియించుచు బిచ్చమెత్తి యాహరించువానికి మహత్తరపాపవిముక్తియగును. 905

క. ముమ్మార్ ప్రాణాయామ
మ్మిమ్ముగ నొనరించ నఘములెల్లం జెడు నా

శమ్మగును ఘోరసంసా
రమ్మున్ వెయిసార్లు దానిఁ బ్రతి యొనరింపన్ 905

క. తోయముల నిల్పి మున్మరుఁ
బాయక వ్యాహృతులతోడఁ బ్రణవము తోడన్
గాయత్రిన్ సశిరస్కముఁ
జేయంగా దురితతతి నశించున్ వినుఁడీ 906

క. వేసారుల్ తిలహోమము
చేసినఁ బ్రణవంబు భక్తిఁ జేసిన వరశ్ర
ద్ధాసంగతి వ్యాహృతులం
జేసిన గురుపాతకములు క్షీణించుఁ జుఁడీ 907

తే. తల్లవారెడుచో మహాదేవ యనుచు
ననిశమున్ లేచి వ్యవహారమాచరించు
వాని జన్మాంతరసహస్రపాపచయము
లెల్ల నశియించు నని మీరలెఱుఁగఁదగును. 908

తే. అరసి బ్రహ్మముహూర్తంబునందు లేచి
తాన మాడి సమాహితాంతఃకరణవి
శుద్ధి నొప్పారి శివుఁబల్కు సుకృతి స్వకృత
సకలపాపమ్ములను ద్రోలఁ జాలు ఘనుఁడు 909

ఉ. పుణ్యము వేదవాగ్వితతి పుణ్యము భూతి త్రిపుండ్రరేఖయున్
బుణ్యము వారణాసియును బుణ్య ముమాపతి విగ్రహంబునున్
బుణ్యము స్వర్ధునీసలిలమున్ దగ నీయవి పంచపుణ్యముల్
పుణ్యులు వేగ లేచి యఘపుంజము ద్రోతురు వానిఁ బల్కుచున్

క. ఇనచంద్రగ్రహణంబుల
ననువుగ విషువాయనములనమల శ్రద్ధన్
గని శివనామము జపియిం
చిన నరునకు నింతపాపశేషము నున్నే 911

క. ఇమ్మగ నెవఁడు వ్యతీపా
తమ్ముల బాపలకుఁ దిలలధాన్యమ్ముల దా

నమ్మెడువానికి నఘనా
శమ్మయి పరమార్థరూపసద్గతి కలుగున్ 913

క. నరుఁ డమవస శివబుద్ధిన్
ధరామరుని బిల్చి యన్నదానం బిడినన్
జిరసముపార్జితబహుతర
దురితమ్ములు బాఱఁద్రోలుత్రోవఁ గనఁదగున్ 914

క. మానితకృష్ణచతుర్దశి
బోనం బగ్రిజున కొసఁగి భూసరవరు నీ
శానుం డని పూజించిన
వాని కిల సమస్తమైనపాపము దొలఁగున్ 915

క. మఱియున్ గృష్ణాష్టమినాఁ
డురగవిభూషణుని గాఁగ నుర్వీసురుఁ గొ
ల్చి రహిం గుడువం బెట్టిన
దురితోత్కరముల్ దొలంగి తుదకు శివుఁడగున్. 916

క. సావిత్రి నూటయెన్మిది
భావించి మదిన్ దినేశవారంబున గౌ
రీవిభునిగ బాపని సం
భావించి భుజింపఁజేయ పాపము లడుగున్ 917

తే. అగ్రిజమ్మని గొనితెచ్చి యభవబుద్ధి
నార్ద్రయందున భోజనం బమరఁజేసి
ప్రీతుఁ గావించు పురుషవరేణ్యుఁ డఖిల
పాపబంధంబు వాసినవాఁడ యగును 918

తె. మాఘమాసంబు నందు సుకుమారమణుని
నాజ్య ధారల నభిషేకమాచరించి
నలరఁజేసిన బ్రహ్మహత్యాదిపాప
జాలమంతయుఁ దప్పక తూలిపోవు 919

తే మాఘమాససమాయాత మహిమమెుప్పు
కృష్ణపక్షచతుర్దశిన్ వృషభతురగు

బిల్వదళ మొక్కటైన నర్పించి కొల్వ
నరులకున్ సర్వపాపవినాశనమగు. 920

క. ననవి త్తుపగతునిన్ ఫా
ల్గునమాసంబునఁబలాశకుసుమంబులచే
జనితప్రీతుం జేసిన
ననఘునకున్ జెల్లిపోవు నఘసంఘంబుల్ 921

క. సౌరభయుతసుమతతిసుకు
మారార్పణములను జైత్రమాసంబున మా
రారిం బూజించుచుఁ ద
త్సారకథల్ వినఁగఁబాపసముదయము చనున్ 9.2

క. ఒకసారియైననుం గా
శికిఁజని గంగను మునింగి శ్రీవిశ్వేశా
త్మకశంభుని దర్శించిన
సకలాఘంబులు నశించు సజ్జనులారా! 923

క. గోదావరిఁ బుష్కరమున
మోదంబునఁజేరి స్నానమున్ జేయ సమా
సాదితభూమీసురహ
త్యాదిమహాపాపచయము లడుగంటుఁజూడి 924

క. స్తవనీయమాఘమందున
సువర్ణముఖరీతరంగశుభ్రస్నానో
త్సవమున్ దీరిచి రొక్కము
నవనీసురులకు నొసంగ నఘములు వాయున్ 925

క. పొంగుచు నాశ్లేషన్ శివ
గంగన్ రవిదివసమందుఁ గడుబత్తిని ము
న్గంగ మహాపాతకరా
శిం గెడపంగలఁడు నరుఁడు శివు సత్కృపచేన్ 926

తే. అమవసయుసోమవాసర మమరు నప్పు
డర్కవారంబు సప్తమి యలరు నప్పు

శలభములకా వేరి నొకసారిశ్రయము మలమతివి
గ్రుంకులిడ సర్వపాపమ్ముల్ దింకుటరుదె? 927

క. అల గంధమాదనాద్రిన్
జలకంబులనాడి యగస్త్యజన్మనికి ధనా
దులవిడి రామేశ్వరునిన్
దిలకించిన యఘము లెల్ల(ద్రెళ్ళుంగాదే? 928

ఆ. బ్రహ్మనిష్ఠవన్నపానాదుల నొసంగి
పూజనల్పవట్టిపురుషవరున
కమితపాపచయము లడుగంటుటయే కాదు
శర్వసన్నిధానసంగతి యగు 929

తే.గీ. ప్రేమ దభ్రసభామధ్యసీమ( జెలగి
తాండవించు నుమాపతిదర్శనంబు
దినదినంబును బదినాళ్ళు నమముబత్తి
నేయఁబాపంబు లెల్లఁ గృశించు విన్ముడు 930

క. ప్రాయశ్చిత్తము పాతక
భూయిష్ఠుల కగును మోక్షమందెద్దునైనస
దేయులకుఁ దగును మోక్షో
పాయంబు సముద్ధకర్మపరివర్జనమై. 931

వ. వృత్తిభేదంబునఁ గుటీచకబహూదకహంసపరమహంసాఖ్యలం బరగి సన్న్యాసాశ్రమంబుచతుర్విధంబగు వానిలోఁ బూర్వపూర్వమ్ముల కంటె నుత్తరోత్తరమ్ములు శ్రేష్ఠమ్ములు. తొలిమూఁట సన్న్యాసాశ్రమ నివాసులును యథోక్తకర్మకలాపంబుల నిర్వర్తించి తుదకు నిర్మలచిత్తులై మోక్షంబు సాక్షాత్కరించుకొందురు. కేవలముముక్షుత్వప్రేరితులగు వార లఖిలకర్మనివహంబుల యథావిధిగ విసర్జనం బొనర్చి నిగమాంతనిర్ణీత నిశ్చలజ్ఞానాపేక్ష శమదమాదిసాధనోపేతులయి పరమహంసఖ్యాతి నలరు చుందురు. కుటీచకబహూదకులు శిఖాయజ్ఞోపవీతులై సపవిత్రజల పాత్రంబును గోవాలలోమమయపాశబద్ధత్రిదండంబునుకమండలువును దర్భలును ధరింతురు. శిఖాధారణంబును త్రిదండధారణంబును గాక

హంసలు కుటీచకబహూదకుల వలె శేషాచారములు నిర్వర్తింతురు.త్వక్కు చెడక దర్శనీయరూపముగల వెదురుకఱ్ఱదండమును గాషాయాంబరమును హంసపరమహంసలకు సమానము. శివధ్యానశివార్చనములు స్నానశౌచములు శాంతిదాంతులు భస్మలేపన త్రిపుండ్రంబులు చాతుర్మాస్యవ్రతంబులు సర్వసన్యాసాశ్రమములకు సమానమని విధింపఁబడియె. ఎంత పాపిష్ఠుఁడైనను శాస్త్రోక్తవిధానంబు సన్యసించి యవల మరణంబొందిన వానికి సర్వదోషములు నిర్గతంబులగు. రమణీయచరిత్రుఁడగు వాఁడు సన్యసించి యాత్మహత్య గావింపక జ్ఞానం బభ్యసింపవలెను. ప్రాయశ్చిత్తము పాపాపనోదనసామర్థ్యమున సన్యాసముతో సమము కాదు గాన పాపనివృత్తి కొఱకు సన్యాసం బవశ్యకర్తవ్యంబు. ప్రసిద్ధకృతపాపంబులకుఁ బ్రాయశ్చిత్తంబు వోలె రహస్యాచరితదురితమ్ములు వాపుటకు సన్యాసము పరమోపాయము. 932

సీ. పరశివధ్యానంబుఁ పరశివజ్ఞానంబు
పరశివశబ్దజపంబు భూతి
పుండ్రత్రియంబు విభూతిలేపనమును
రుద్రాక్షమాలికాధారాదివిభవ
మమలసన్యాసాశ్రమావాసనియతి ప్రా
యశ్చిత్తసంవిధానానుచరణ
మఖిలపాపావళినంతమొందించు సా
ధనములుగా నెప్డుఁ దలఁపవలయు

తే. శ్రుతిరహస్యము సత్కృపామతిని దీనిఁ
బల్కినాఁడను నేనంచు వ్యాసదేశి
కోత్తముఁడు మున్ను బల్కిన యుత్తమార్థ
ములను మీకు వచించితి బుధులు వినుఁడు. 933

### 43. పాపశుద్ధ్యుపాయకథనము

క. మఱియున్ బాపము వాపెడి
తెరవుల నెఱిఁగింతు మీ రతిశ్రద్ధ వినుం

డిరవుగ మును బల్కిన బ
త్తెరవులఁ బోలేనివా రిక దే సల్పవలెన్ 933

క. ఇలఁ బేరెక్కిన పుణ్య
స్థలములఁ గొన్నింట శివుఁడు దానే మును పా
పుల పాపము వెడలింపన్
వెలయించెన్ వాని మీకు వినిపింతు నిటన్ 934

సీ. అఖిలార్థసాధకం బమరేశ మచ్చట
శర్వుఁ డోంకారుండు చండి శివయు
వాసిఁ గాంచినదీప్తి బాసమ్ము సోమనా
థేశుఁ డీశుఁడు పుష్కరేక్షణ శివ
నైమిశారణ్యంబునన్ లింగరూపిణి
శివదేవదేవుండు శితిగళుండు
పుష్కరతీర్థానఁ బొల్చును బురుహూత
శివరజోగంధాఖ్యఁ జెలగుఁ హరుఁడు

తే. శంభుఁ డాషాఢి నాషాఢసంజ్ఞ నొప్పు
నచటఁ బరమేశ్వరియు రతి యనఁ దనర్చు
భారభూతిని శర్వుండు భారభూతి
భూతి యన నొప్పు నగరాజపుత్రి యచట. 935

సీ. సోమశేఖరుఁడు చండీముండి దండియో
దండిని యగు భూమిధరతనూజ
నాకులభ్యాతపుణ్యస్థలంబందున
నాకులుం డభవుండు నకుల గౌరి
యల హరిశ్చంద్రమహాస్థలంబున హరి
శ్చంద్రుఁ డీశానుండు చండిక యుమ
శ్రీపర్వతమున వసించును త్రిపురాంత
కాహ్వయశివుఁడు మాయావి దేవి

తే. యీశుఁ డగును త్రిశూలి జల్పేశ్వరమున
ఫాలనేత్రుని యాలి త్రిశూలిని యట

నమరు నామ్రాతకేశ్వరంబందు సూక్ష్మ
నాముఁడభవుం డగునా సూక్ష్మనాము యగజ 976

సీ. అతిపవిత్రమ్ము మహాకాళమట మహా
కాళుఁడీశుండు శంకరి యపర్ణ
మాయాపహమ్మయిమధ్యమం బలరారు
శివ పరమేశ్వరిశివుఁడు శర్వుఁ
డలఘుకేదారమ్మునందీశుఁ డీశానుఁ
డంబ మోక్షప్రదాహ్వాయమ్ము గనును
సంసారరోగభేషజము భైరవ మట
భైరవీభైరవుల్భవభవాను

తే. లలరుచుందురు ప్రపితా మహాభిధాన
శంకరుఁడు మంగళాభిధశాంకరియును
భక్తజనులకుఁ బూజనభాజనులయి
స్తోత్రమున కర్హ మగు గయాక్షేత్రమందు 937

సీ. స్థాణుప్రియాదేవిస్థాణుదేవుని తోడఁ
జెలఁగుచుండును గయాక్షేత్రమందు
స్వాయంభవీనామశర్వాణితోఁ స్వయం
భూశర్వుఁడొందునుముదము స్థాలి
విశ్వవిశ్వాసాఖ్యవిశ్వనంబులన్ గాంతుర్రి
విమల యందున శాంభవియు భవుండు
నుగ్రుఁ డుగ్రాదేవియును గన్ఖల్లమహా
తీర్థానఁ గ్రిడింతురిదివ్యశివులు

తే. అట్టి హాసాఖ్యతీర్థంబునందు ముదము
నను మహానందుఁడున్ మహానంద యనఁగ
గృత్తివాసుండు పార్వతీశికిరణవాణి
యును వసింతురు జగములకన్నోము నెప్పుడు 938

సీ. శివ మహాంతక యగుశివుఁడు మహాంతకుం
డగు మహేంద్రాఖ్యపశుస్థలమున

భీతిహారిణి దక్ష భీమస్థలిన్ భీముఁ
డెసఁగు శివుండు భీమేశ్వర శివ
వస్త్రాపథంబున భవుఁడు శివుండగు
నగు భవానీదేవి యద్రితనయ
రుద్రుఁడు శివుఁడగు రుద్రాణియున్ శివ
యగు రుద్రకోటిది వ్యాలయమున.

తే. నగు మహాదేవనాముండు హరుఁడు వాని
యనుఁగునిల్లాలు వరవిశాలాక్షి యగును
విమలతీర్థంబులం బేరు పెంపుగన్న
యట్టి యవిముక్తభక్తజనావనులయి. 939

సీ. అవనిఁ బేరొందు మహాలయంబందు మ
హాభాగయును రుద్రుఁ డహిధరుండు
గోకర్ణతీర్థాన శ్రీకంఠుఁడౌ మహా
బలుఁడు తజ్జాయయు భద్రకర్ణి
భద్రకర్ణంబునన్ భద్రామహాదేవి
యార్యయు శివనాముఁ డంగజారి
స్థాణ్వీశ్వరుండును స్థాణ్వీశ్వరియు స్థాణు
వందున భవదేవ హైమవతులు

తే. భువనమందు సువర్ణాఖ్యుఁ బొలుపు మీరు
క్షేత్రరాజమ్మునన్ వ్యోమకేశుఁ డదజ
యలరుచుండ్రు సహస్రాక్షుఁ డనఁగ నుత్ప
లాక్షి యనఁగను బుధవరులార! వినుఁడు. 940

సీ. కమలాలయఖ్యాత విమలాలయంబునన్
కమలాఖ్య దుర శంకరుఁడు కమలుఁ
డల్ల ఛాగండాఖ్యనలరు క్షేత్రమున భ
వాని ప్రచండ కపర్ది భవుఁడు.
ఊర్ధ్వరేతసుఁ డుగ్రుం డుగ్రి జాయ త్రిసంధ్య
యుద్దండ వామపుణ్యోర్వి యందు

మాకోటమున యందుఁ గమఠు జేశ్వరి యపర్ణ
యగు మహోత్కటుఁడు ఖట్వాంగపాణి

తే. మండలేశ్వరవిదితనామస్థలమున
మండలేశ్వరి శాంకరి మన్మథాంత
కుండు శ్రీకంఠదివ్యసంజ్ఞుండు భక్త
వాంఛితార్థప్రదానప్రభావయుతుడు. 941

క. హరుఁ డదిత్రితనుజ కాలా
బరమున నిలయంబు గాంచి భక్తేష్టదులౌ
దురు నీలకంఠకాళీ
స్ఫురదభిధల వారిఁ బోలు సురలుం గలరే? 942

తే. శంఖుకర్ణంబునందున శైలకన్య
ధ్వనిసమాహ్వయ ఖండేందుధరుఁడు వాసి
గను మహాతేజుఁ డఖిలజగంబులందుఁ
జెట్టలను బాపగాఁ జాలుసీమ యదియ. 943

క. స్థూలేశ్వరేరపుణ్యస్థలి.
స్థూలాఖ్యుండు హరుఁడు స్థూలాభిధమై
శైలాత్మజాత వెలయున్
జాలగఁ బున్నెంబు లబ్బుఁ జనువారి కటన్. 944

క. చెలఁగుచుఁ దత్తత్పుణ్య
స్థలముల దర్శించి యచట దైవతములఁ బూ
జల నలరించెడి జనములు
బలుదొసఁగుల రూపుమాప వలఁతులు ధరణిన్. 945

సీ. సంతతాత్మానందసందోహమున శివుం
డంచితమ్ముగఁ దాండవించు నెచట
పతి నృత్యమొనరింపఁ బార్వతీదేవి క
న్విందుగాఁ గని గారవించు నెచట
భక్తితోఁ దనుగొల్చువారికష్టెదటఁ బ్ర
సన్నుఁడై బొడఁగట్టు శంభుఁ డెచటఁ

దనతాండవము గాంచు ధన్యుల కఱచేత
నిల్చును ముక్తి త్రినేత్రుఁ డెవట
తే. నదియు శంభున కౌను శ్రీ వ్యాఘ్రపురము
పరగు దభ్రసభేశ్వరీ ప్రథితనామ
భవునియిల్లాలు భవుఁడు సభాపతి యగు
నట శివాశివసేవచే నఘము దొలఁగు. 946

క. అచ్చట హోమ మొనర్చిన
నిచ్చమెయిం జపము సలుప నెన్నో మడుఁగుల్
హెచ్చగు ఫలములు కలుగున్
సచ్చరితుల్ స్థలమహత్త్వ సంగతి గనుఁడీ! 947

క. అందున శివగంగాభి
ఖ్యం దనరు తటాక మొండు కలదందునఁ దోఁ
గం దొలఁగు మహాపాతక
సందోహము లెల్ల ధీరసత్తములారా! 948

క. తద్దక్షిణతీరంబునఁ
దద్దయు మోదంబుతోడఁ దాండవకేళీ
బద్ధాదరుఁడగు వరఘృణ
భృద్ధాముఁడు సూరిజనవరేణ్యుల్ వినుఁడీ! 949

మ. సతతంబున్ శివగంగఁదోఁగిఁ పరమశ్రద్ధాలులై వ్యాఘ్రపా
శ్రితికంఠున్ గనులారఁ గాంచి సకలక్షేమప్రదంబంచు స
న్మతిమీరంగ షడక్షరాఖ్యమనురత్నంబష్టసంఖ్యాధికాం
చిత మౌరీతి శతంబు పల్కిన జనుల్ ఛేదింత్రు ఘోరాఘముల్.

క. పొంగుచు తరంగదభంగను
భంగన్ శివగంగ నెవఁడు భక్తిన్ మును దో
గంగలుగు వాని కెడలు దొ
సంగుల్ సకలమ్ము పుణ్యజాలము వఱలున్. 951

సీ. మేషంబునన్ రవి మీర నార్ద్రాదినం
బందున శివగంగ యందుఁ దోఁగ

వృషభరాశిం బ్రొద్దు విహరింపఁగా వృషో
దయమున నట ముని దానమొసఁగ
నర్కుఁడు మిథునస్థుఁడైన కృష్ణాష్టమి
నాఁడచ్చటన్ మజ్జనంబు దీర్ప
నాషాఢకృష్ణపక్షాంతశ్చతుర్దశిన్
డంబుగా నందు స్నానంబొనర్పఁ

తె. జెలఁగి శ్రావణపౌర్ణమాసిని దదీయ
విమలజలములఁ గ్రుంకుట వెలయఁజేయ
నంబుజాప్తుఁడు కన్యయం దలర జన్మ
తార రవివారమున నట తనువు తడుప. 952

సీ. రశ్మిమంతుఁడు తులారాశి భాసింపఁగా
భరణి తద్వీచికా పంక్తిఁ దోఁగ
వృశ్చికంబున రవి విచ్చేయఁ బావక
వారంబునం దటఁ జేరి దోఁగ
మకరరాశ్యారూఢమానుఁడై యినుఁడొప్పఁ
బుష్యంబునన్ దదంబువుల దోఁగ
పారసమిత్రుండు చాపమున్ సంధింప
రౌద్రతారను నాతరగల దోఁగ

తే. మాఘమాసంబునన్ మఘా మహితమైన
సమయమునఁ దత్తరంగక సమితి దోఁగ
ఫాల్గునంబున నుత్తరఫల్గునీక
భరమందునఁ దత్తోయమందు దోఁగ. 953

తె. బహుభవంబుల నార్జించు పాపపటల
చటులసామర్థ్యములు వీఁగి స్వాంతశాంత
భావ మలరార ముక్తికాంతా విలాస
సత్కటాక్షసుఖంబులన్ జనులు కాంత్రు. 9 54

ఆ. బత్తితోడ బ్రహ్మవేత్తల కిచ్చుటఁ
ద్రావఁ గుడవ నిచ్చు దాతలకును

సకలపాపసమితికి వికలమ్మగుట కాక
పరమగతియుఁ గూడ కవఁలు నిజము. 955

సీ. యోగివరుని కొక్కఁ డుత్తమావాసంబు
గాని మరమగానిఁ దాన మీయ
దురితచయము లెల్లఁ దొలఁగును మరి ఫాల
నేత్రుసన్నిధానకి నియతి దనరు. 956

క. కరుణాంతరంగుఁ డగుటన్
బరమేశుఁడు సకలజంతుపాపంబుల రూ
పరఁ జేయుటకు నుపాయం
బరయుచు శ్రీవ్యాఘ్రపురము నర్మిలిఁ జేసెన్. 957

క. బహుకోటిజన్మపుణ్యాని
వహఫలితము గాదె వ్యాఘ్రపత్తనశోభా
మహిమంబు కన్నులారన్
రహిమైఁ గనుటంచు మదినిఁ బ్రాజ్ఞు లెఱుఁగుఁడీ. 957

క. దానికి సమమగు పుణ్య
స్థానము వేఱొండు లేదు చట వసియింపన్
బూను మహనీయులకు వే
మానున్ భవబంధవితతి మాన్యుల్ వినుఁడీ. 9 9

క. దురితాపనోదనక్షమ
మురరీకృతముక్త్యుపాయ మూర్వీనివస
న్నరసేవనీయమను చా
పురము ప్రసిద్ధిని వహించి పొలుపుల్ గాంచున్. 960

## 44. ద్రవ్యశుద్ధ్యుపాయకథనము.

వ. మఱియు ద్రవ్యము ద్వివిధము. ఆత్మద్రవ్యము నిత్యశుద్ధము. తదితరమెల్ల శుద్ధేతరము. అదియెట్లనిన నాత్మ సచ్చిదానందుగ నిగమము లభివర్ణించినవి. ఉపాధిరహితసత్తా చైతన్యానందములు నిత్యంబు స్వతఃశుద్ధములె, సత్తాలక్షణ మెఱుంగఁదగు. పరస్పరభిన్నసర్వనామ

రూపాత్మకాత్మక ప్రపంచమునందును దుదకత్యాభావమునందును దండయందు దారమువలె ననుస్యూతమయి సామాన్యముగనున్నది యనుటయె సత్తా స్వరూపము. సత్త స్వతోదోష మందురా! సర్వదోషత్వమే పట్టి పవిత్రత్వమునకు నిలువ నీడయే లేకపోవును సత్తయుఁ గలదనియుఁ దత్సంపర్కమువలన సత్తకు దుష్టత్వ మొదవు నందురా! నిర్దుష్టమును వాస్తవముగ దుష్టమగు నెడ సర్వదా నిర్దుష్టవస్తువొకటున్నది లేనే లేదు. అటుగాక సత్తాశూన్యత్వ మంగీకరింతురా! తచ్ఛూన్యత్వ స్ఫురణము స్వవచనవ్యాఘాతహేతువగును. కావున సత్త నిత్యమును స్వతశ్శుద్ధమని యొప్పుకొనక తప్పదు. మరి చైతన్యవిశుద్ధిం గూర్చి ప్రసంగించెద. మనోవృత్తిరూపమైన జ్ఞానమునకు జన్మనాశనములున్నను దత్ప్రకాశకస్వయంప్రకాశమయి విరాజిల్లు శుద్ధచైతన్యమునకు జన్మనాశాదివిపత్తులు లేవు గాన నభివ్యంజకవృత్తిసహితమగుట దోషము కాదు. ఆనంద తత్త్వము వినుఁడు. ప్రేమభూమి యానందనివాసస్థానము నిరతిశయ నిర్వ్యాజ ప్రేమ మెచ్చట నని తర్కించినఁ దానేయని తెలియనగును. తన్నుదాఁ బ్రేమించు కొనని జీవియే లేదు. ఇందులకు వేఱ తార్కారణ మేల? అటులైన విషయసుఖము వంటిదియా? యా యత్మసుఖమని మీరు శంకింతురేమో విషయ సుఖమనునది యభివ్యంజక వృత్తిదోష సమేతమయి యునికిలేములు గలదియనియు నాత్మసుఖమట్లుకాక నిత్యమనియుఁ దెలియుఁడు. కాన నాత్ముండు నిత్యశుద్ధుండు. తద్జ్ఞానహీనుండశుద్ధుండు. పునశ్శుద్ధ్యుపాయము వానికిఁ గర్మము గాక తాను నిత్యశుద్ధుండ నని తెలియ నగు. అజ్ఞానము వలనఁ గలిగిన దోషమజ్ఞాన నివృత్తిరూపమైన జ్ఞానము వలనఁ గలుగును. సచ్చిదానందస్వరూపుండైన యాత్మున కజ్ఞానమువలనఁ గలిగిన యవిశుద్ధజ్ఞాన మాత్మ నిత్యవిశుద్ధిజ్ఞానము వలని నివర్తింపఁబడనిచో స్వాభావికమైన నిత్యశుద్ధియే యాత్మున కలవడు కర్మమున నట్టిశుద్ధి పొడము ననుట యెప్పదు. ఏలయనఁ గర్మజన్యము నశ్వరమ యగుఁగాని శాశ్వతమెట్లగును? జీవేశ్వరైక్యవిజ్ఞానము విశుద్ధ్యుపాయమని గ్రహింపుఁడు. తత్త్వమస్యాదిశ్రుతి వాక్యప్రమాణసంతానము వలనఁ దద్విజ్ఞానము జనియించు. దేహేంద్రి

యాదులఁగలుగు నహంబుద్ధి యాధ్యాత్మిక మనియుఁబృథివ్యాదిభూతము లంగలుగు జీవబుద్ధి నాధిభౌతిక మనియు ననాత్మబుద్ధి ద్వివిధంబగు.

క. వేదోదితగర్భాధా
నాదులు పదియాఱు సంస్క్రియల్ సేఁతయు హిం
సాదుల నొనరింపమి శివు
గాఁదలపన్ దేహశుద్ధికారణము లగున్. 962

క. వివిధేంద్రియనేతృస్మర
ణవిధానాచరణమునఁ ద్రిణయనుగ శ్రోత్రా
దివిషయములను దలంచిన
నవు శుద్ధి నిబద్ధి దీని నరయుఁడు మీరల్. 963

క. ప్రాణాయామప్రభృతుల
స్థాణునిగా నెంచి వాని దైవతముల వి
న్నాణముతో స్మరియించినఁ
బ్రాణమునకు శుద్ధి యొదవు నందురు పెద్దల్. 964

తే. శ్రుతినిషిద్ధార్థముల నింత మతి జొనుపక
సాంబమూర్తిగ సంభావనంబు సలుప
బుద్ధి మున్నగు వానికి శుద్ధి కలుగు
నని వచింతురు విద్వాంసు లమలులార! 9 ０

చ. అలఘుసమాధియందుఁ గన నయ్యెడు ధ్యేయపదార్థముఖ్యవృ
త్తిలయము లంది మానసము దీపిలుటన్నదియున్ విశుద్ధికౌ
లలితవిశుద్ధి మేనునకు లబ్ధము గాఁగ విశుద్ధి ప్రాప్తి నా
కలవడెనంచు నెంచ నది యౌను మతిభ్రమహేతులబ్ధమై. 966

చ. కలువలమేలువాఁడు జలకంబు చలింపఁ జలించునట్లు ని
శ్చలుఁడయి తోఁచుఁ దచ్చలనసంగతి వాస్తవ మింత కాదు ని
ర్మలతముఁడాత్ముఁ డయ్యును గరంబు విశుద్ధివిహీనుఁడట్లు ని
ర్మలమతి సాహచర్యమున మాటికిఁ దోఁచు నిజంబెఱుంగుఁడీ.

చ. సకలము బ్రహ్మవస్తు వని సందియ మింతయు లేక వేదవా
క్ప్రకరము తెల్పురీతి మది భావము నిల్పఁగ జాలిరేని త

త్సకలము శుద్ధమౌను విదితంబగు సత్యము పల్కునాఁడ నిం
తకు నీఁక మించు సత్యము ప్రకృతంబును దృశ్యము గాదెఱుంగుడీ.

మ. శ్రుతివిజ్ఞాననిధాన మూనకయ సంశుద్ధప్రకారంబుసం
గతి ప్రాప్తింపఁగ సత్యమట్లయిన లోకంబందు నానాశ్రుతి
స్మృతికాండంబులు శుద్ధ్యుపాయములు మున్జెప్పంగ నేలన్నఁద
ద్గతితాత్కాలికవస్తుసిద్ధికయి పల్కంబడ్డవన్నన్ దగున్. 969

క. వ్యవహార శుద్ధి యని దీ
ని వచింతురు తజ్ఞజనులు నిచ్చలు దీనిన్
దివిరి యొనరింపఁ జిత్తము
పవిత్రమగుఁగాన మడువు వాఁడన్ విసుఁడీ! 970

తే. పక్వభాండము చండాలు స్పర్శఁ గనిన
వర్జ్యమని వీడవలయు నపక్వమునకు
నది తటస్థింప సంశుద్ధి యగును నీటఁ
గడుగుటం గాని కుశజలకములఁ గాని. 971

తే. శూద్రకులజుఁడు పక్వంబు నొకు నెడల
నుదకములు చల్ల శుద్ధమై యొప్పునయ్యా
దతఁడు వాడిన నొకపరియవలఁ ద్రోయ
వలయు నటుకాక శుచియగునగ్గిఁ దాల్ప. 972

తె. ప్రాఁతమృన్మయపాత్రం బపక్వమైనఁ
బక్వమైనను శుద్ధమౌ వహ్నిఁ బెట్టి
చక్కఁగాఁ గాల్చి తీసి సంస్కార మొదవ
నాచరించినచో విను దలఘుమతులు. 973

వ. నూతనభాండమునకు శుద్ధిగూర్పవలెనన్న జలకములఁ గడుగు
నది. మఱియు నమేధ్యస్పర్శన దూషితంబుపయుక్తమగు భాండమట్లు
విడువవలయు. పచ్చిపనఁటి బహూపర్యాయములఁ గుశోదకంబులు చల్లిన
పునీతంబగు 974

తే. అంటుగైకొను నెలఁత తానంటు నేని
నంటి యుపయోగముం జేయుట యెన్నేని

దారుమయయజ్ఞపాత్రంబులు త్యాజ్యమగు ని
తరము కుశజలములను శుద్ధంబ యగును. 95

వ. మఱియుదేశకాలాదులను ప్రయోజకంబును స్వోపపత్త్యవస్థలను బరిశోధించి శౌచక్రియ నిర్వహింపవలయు ద్రోణపరిమాణము కంటె నెక్కుడైన పక్వధాన్యమాపత్సమయముల నంత్యాదిస్పర్శనదూషితమ్మ గుచో దంచుటవలనఁగాని కడుగుటవలనఁగాని శుద్ధిగాంచు నంతకంటె గొఱతవడునది విడువవలయు భారముకంటె నధికమైనదియుఁ బ్రోక్ష ణమున శుద్ధమగు. ఆపదితరములగువేళల నట్లుకాదు పక్వము ద్రోణా ధికము క్షాళనమునను గుంభాధికము ప్రోక్షణమ్మునను శుచియగు నప క్వము క్షాళనమున శుద్ధిగనును. మఱియుఁ బక్వధాన్యతండులముల భార మునకుఁదగిన విడువవలయు రెండు భారముఠములకుఁ దక్కువవి గడు గవలయు నంతకు మిగిలినవియైనఁ బ్రోక్షింపవలయు. రజస్వలాదిదూషి తపక్వాన్నము వర్జింపవలెనుగాని యాఱుభారముల కధి మయ్యేనేనిఁ గడుగుట వలనను నంతకు హెచ్చుయ్యేనేనిఁ బ్రోక్షణము వలనను శుద్ధిచేయ వలెను. వెలుపలనున్న నెలఁతుకగాని వెట్టికొలమునఁ గలిగినవాఁడుగాని కుక్కగాని లొట్టియగాని సూకరముగాని గాడిదగాని స్పృశించిన వస్త్రము ప్రక్షాళనమున విశుద్ధమగును. కాని యది క్రొత్తవలువయైనను నల్లవలువయైనను బొంతయైనను బ్రోక్షణము వలననే శుద్ధియగును. కంబళము మున్నగు నవియుఁ బ్రోక్షించిన శుచియగు. బియ్యము ధాన్యములు బెల్లము నేయియును బ్రోక్షణమున శుద్ధి గాంచు. పాయ సాదులచే నపరిశుద్ధమైన యన్నము విడువవలయును. శేషించినది ప్రోక్షించిన శుచి యగును. ద్రవద్రవ్యము గాలిచే విసరిన గ్రాహ్య మగు. అటుకులు మొదలగు వానిని ధాన్యమువలెను శుద్ధి నొనర్పవలె. దొరకక దొరకక దొరకిన వస్తువు ప్రోక్షించిన గ్రహియింపవచ్చును. కేశలోమనఖమ్ముల దూషితమ్మయిన పదార్థమును గ్రిమికీటాదిదూషిత మ్మయిన వస్తువును బ్రోక్షణమునఁగాని యాజ్యమునఁగాని శుద్ధిచెందు. పిష్టమయమగు క్రీతద్రవ్యంబు పునఃపాకంబువలన శుద్ధి బొందు. శూద్రులు నంత్యజులు ముట్టిన ద్రవ్యంబు విడువవలయును. ఉచ్ఛిష్టమును

భక్షింప రాదు. ధాన్యము, వస్త్రములు, నల్పద్రవ్యములు జలప్రక్షాళ నంబుచే శుద్ధి పొందు. కల్లుచేఁ దాఁకఁబడిన సువర్ణాదితైజసద్రవ్యంబులు వహ్నిదాహంబున శుద్ధి నొందు. వైశ్యులు, రాజులు తాఁకిన తైజసద్ర వ్యము క్షాళనము చేతను, శునకంబును జండాలురు తాఁకిన తైజసద్రవ్యము మార్జనము చేతను, శుద్ధి పొందు రాగివస్తువులు చింతపండుచేఁ దోముటవలన శుద్ధి నొందు. ముట్టైన నెలఁత భుజించిన కంచుకంచము మొదలగు వస్తువులు నీటితోఁ దోముటవలన శుద్ధిపొందు. వివాహాదిశుభ సమయములందును, దీర్ఘయాత్రల యందును, రాష్ట్రక్షోభము సంభవించిన సంభ్రమసమయములందును, దేవతోత్సవములందును, దారిద్ర్యము సంభవించిన పట్ల యందును స్పర్శదోషంబు లేదు. శూద్రాద్యనులోమవిలోమజాతులు ముట్టిన వస్తువులు మృజ్జలంబులతో నిర్వదియొక్క మాఱులు మార్జించిన శుద్ధి నొందు. జాతి వస్తువులు భస్మజలంబులతో నిరువదియొక్క మాఱులు మార్జించిన శుద్ధంబు లగు. అబ్జశంఖశుక్త్యాది సకలద్రవ్యంబులును భస్మమార్జనంబున జలక్షాళనంబున శుద్ధంబులగు. వేయి వచనంబు లేల? సర్వదోషనివృత్తికై సర్వద్రవ్యంబులను బ్రహ్మరూపంబుగా భావించినచోఁ బవిత్రంబులగు. 9.6

చ. సకలచరాచరాత్మకవిశాలజగంబును హేతుభూతమై
సకలము దాన వ్యాప్తిగనిసర్వమయంబన వ్యాప్తి కెక్క సా
రకవిజనైకగేయ మనఁజాలిన బ్రహ్మముగాఁ దలంచుచో
సకలమునున్ బునీత మనిశాస్త్రకృతాదరబుద్ధి నెంచుఁడీ! 9.7

మ. తొలుతన్ గార్యములెల్లఁ గారణము నందున్ జన్మముం గాంచి య
వ్వల నందున్వసియించి కొంత తడ వాపై నందునే యారయన్
విలయం బందును గాన హేతు వని భావింపంగఁ గార్యంబులన్
వెలయున్ శుద్ధిసమస్తకార్యతతికిన్వేపల్కు లేలా యిఁకన్.

చ. సకలము దేనఁ గల్గుననిసంశయమే వల దయ్యలార! భా
వుకుల మటంచుఁ గొందఱు స్వబుద్ధికిఁ దోఁచిన యట్ల పల్కు త
త్ప్రకృతియు శూన్యమున్ దలఁపరాదు ప్రపంచకహేతు వంచు బ్ర
హ్మాకృతము గాని దెందు నరయన్ వశమౌనె పరీక్ష సేసినన్

## 45. అభక్ష్యని వృత్తి కథనము

తే అమలహృదయంబునం గాని యలరకుండు
పారమేశ్వరసద్ధ్యానపటలి యయ్యె
దెది వఱలం గాని సంసారహేతుభూత
గ్రంథు లడలవు శంకింపగాం జనకుండు 980

చ. తొలుత నభక్ష్యభక్షణముతో జనియించును జిత్తకల్మషం
బలవడు భ్రాంతి యక్కతనయ్యాదికారణమౌ విషిద్ధసే
వల కిది పుట్టినిల్లు కదః పాపచయంబుల కందు సంస్మృతి
చ్ఛలవిటపుల్ సమృద్ధిగను సంయము లంటకుండీః యభక్ష్యముల్.

క. ఇది భక్ష్య మిది యభక్ష్యం
బిది విధియు నిషద్ధకర్మమిది యను పలుకుల్
విదితాత్మజ్ఞానులకే
యదనున వర్తింప వవ్వియగు మూర్ఖులకే. 982

క. తన కంటె నన్యమొక్కటి
యన వేఱే లేదటంచు నాత్మం దలపో
యును బ్రహ్మజ్ఞాని యభ
క్ష్యనివృత్తిపొసంగు నా బుధాగ్రణి కెట్టుల్? 98‹

క. అన్నాన్నాదుల నే నను
తెన్నుగ లోఁదలఁచు నట్టిధీరుం డాత్మ
జ్ఞోన్నతకీర్తి కిఁ దగి తా
నన్నిటి భక్షించుచుండు నమలమనీషన్. 984

క. ఏనికి బ్రహ్మ క్షత్త్రివి
ధానూనజగత్తు భక్ష్యమంతకుఁడును నం
జై నివ్వటిల్లు నాను
జ్ఞానియు నటువంటి వాఁడు జగతిన్ దలఁపన్. 985

క. జగమెల్లఁ దనదు రూపం
బుగ నరసెడు జ్ఞాని లోకబుద్ధిరహితుఁడై

జగమెల్లన్ భుజియించిన
నగునే? భోసం బొంకితక్రియైనన్ వినుఁడీ! 98౹

మ. జగమున్ దెల్వి సమీక్షచేసిన నధిష్ఠానోపజీవాఖ్యనో
తగఁ దత్సంవిదభేదరూపముగనో తర్కింపఁగా వచ్చు నే
మిగతిన్ జూచిన లోక మంతయును బ్రహ్మీభూతమై గాన వ
చ్చు గరిష్ఠాత్మన కెట్లు భక్ష్యనియమస్ఫూర్త్యుక్తు లొప్పారెడున్?

మ. రహి నొప్పారు సమస్తవస్తువులు జాగ్రత్స్వప్నకాలంబులన్
బహుళోపాధియుతంబులై వెలయు స్వాపంబందు నబ్భంగి గా
క హృతంబై చను నిద్రమేల్కొనఁ బునఃఖ్యాతంబు లౌఁగాన స
న్మహిమన్ మించు ప్రతిష్ఠలేదనుచు డెందంబందు నూహింపుఁడీ.

వ. మఱియు నస్తిత్వలక్షణము బ్రహ్మవస్తువునందుమాత్రము సిద్ధించి తదితరములందు సంభవింపదు. అట్లయినచో "జాయతే-అస్తి-విపరిణమతే"యను మొదలగు వాక్యములకు గతియేమనినఁ దద్దేతుకమస్తిత్వమాత్రము గ్రాహ్యమగుఁ గాని భావవికారాదు లావాక్యము వలన గ్రాహ్యములు గావని యూహింప నగును. జడప్రపంచహేతు వగుమాయ గతి యేమనిన బ్రహ్మాతిరిక్త మైన మాయ పరమార్థముగ లేదనియె నుడువ వలయును.

ఆ.వె. ఉండి యునికి లేకయుండక కార్యాను
మేయ మైన మాయ గేయశైవ
భక్తిహీను లందుఁ బ్రబలి యుండును యోగి
వరుల యందు నుక్కి పట్టు గనదు. 990

మ. జగదాదుల్ గనఁ డంచు నెంచకుఁడు మోక్షశ్రీకుఁడౌ జ్ఞాని త
జ్జగదాదుల్ తనకంటె బిన్నమనుచున్ స్వాంతంబునం దెంచ కుం
డ గరీయస్స్థితి నుండుటొక్కటియె జ్ఞానస్తుత్యసల్లక్షణం
బగు నజ్ఞాని స్వభిన్న మంచు జగమత్యంతంబు లో నెంచెడిన్.

మ. నదనద్యాదిసమస్తరూపముగఁ గానన్ వచ్చు లోకంబు జ్ఞా
ని దృగాత్మండయి చూడఁ జాలి తనకంటె వేఱుగా దానిఁ జూ
డఁ దలంపం డటులౌట జ్ఞానమయు నంటంబోదు భక్ష్యాదిభే
దద శాస్త్రోక్తి యథార్థమింతయును విద్వాంసుల్ గణింపం దగున్

వ. కావున మహర్షులారా! యాత్మవిజ్ఞానహీనుల కొఱకు భక్ష్యాభక్ష్య వ్యవస్థ శ్రీశంకరునిచేఁ గావింపఁబడియె నవ్విధానంబు వాక్రుత్తు సావధానులరై యాకర్ణింపుఁడు.

వెల్లుల్లిని నీరుల్లిని బుట్టగొడుగు నుల్లితో సమానమగు ద్రవ్యంబులను నింగువ దక్కఁ దక్కిన చెట్లనుండి స్రవించుపదార్థంబులను జిప్పకసవును మునుగకూరను గంబళిచిక్కుడును వంగను భూలవణంబును నెండినద్రవ్యంబులను జలిదిపదార్థములను మూఁకుడుపై వేఁచిన పదార్థంబులను గల్లుతోఁ గూడిన వానిని రేతంబును దేహమలంబును గుక్కలు కాకులు పిల్లులు ముంగులు వేదబాహ్యులు నెంగిలి చేసిన వానిని దురంగగజమండూకవిణ్మూత్రంబులను దాటికల్లును కొబ్బరి కల్లును బ్రాహ్మణుఁడు భక్షింపఁ గూడదు.

కోడిమాంసంబును బందిమాంసంబును గుండేటిమాంసంబును నేనుంగుమాంసంబును గుఱ్ఱంబుమాంసంబును గొడ్డుమాంసంబును మేఁకమాంసంబును గోమాంసంబును లేడిమాంసంబు నొంటెమాంసంబు నేఁదుపంది ముండ్లపంది యుడుము కుందేలు తాబేఁలు నను పంచనఖంబుల మాంసంబులను శూలమాంసంబును వండిన మాంసంబును బ్రాహ్మణుఁడు భుజింపరాదు

మాంసంబు తిను పక్షులను నీటి కొంగలను గొంగను బెద్దకొక్కెరను గాటుకపిట్టను గోకిలను బాతీనరోహితరాజీవాదిమత్స్యంబులను నూరఁబిచ్చికను లకుముకిని నీటికోడిని బెగ్గురుపక్షిని వానకోయిలను జిలుకను గోరువంకను గప్పను బ్రాహ్మణుఁడు తినఁగూడదు. ఒంటె మేక మొదలగు వాని పాలను దూడ లేని యావుపాలను గేదె తక్కఁ దక్కిన యరణ్యజంతువుల పాలను స్త్రీక్షీరంబును బ్రాహ్మణుఁడు త్రావరాదు. ఆవు గుఱ్ఱము నేనుఁగు మొదలగునవి మూచూచిన ద్రవ్యంబులను బ్రాహ్మణుఁడు ముట్టరాదు. కావున బుద్ధిమంతు లగు బ్రాహ్మణు లిట్టి యభక్ష్యములను త్యజింపవలయును. అభక్ష్యంబులను భుజించిన విప్రు లధోగతిని జెందుదురు. క్షత్రియులు వైశ్యులు కూడ వీనిని విడనాడుట మంచిది. శూద్రులకు భక్ష్యాభక్ష్యవ్యవస్థ లేక పోయినను నభక్ష్యంబులను విసర్జించుట వలన వారు మహాఫలంబునొందుదురు. భక్ష్యనియమంబు

వలన నందఱు విశుద్ధహృదయు లగుదురు. విశుద్ధహృదయులకుఁ బార మేశ్వరజ్ఞానంబు గలుగు. ఆ జ్ఞానంబే ముక్తిని బ్రసాదించు. పరమే శ్వరవిజ్ఞానము వేదంబు వలనఁ గల్గుఁ గాని తక్కిన యాగమంబుల వలన జనింపదు. అష్టాదశవిద్యలకు వేదంబు మూలంబు. శైవాగమంబులును వైష్ణవాగమంబులను బ్రాహ్మాగమంబులు నధికారవిశేషంబు ననుసరించి ప్రవర్తిల్లెఁ గావున జను లందఱు స్వీయాగమోక్తవిధానంబు ననుసరిం పవలయు. వేదానుసారంబుగ ద్విజుల కాత్మశుద్ధి కల్గుటకై యభక్ష్యం బుల నుపదేశించితి.

## 46. మృత్యుసూచకవివరణము

ఇంక మృత్యుసూచకంబులను వివరింతువినుండు. సోమచ్ఛాయను ధ్రువనక్షత్రంబును నక్షత్రశ్రేణిని నరుంధతీనక్షత్రంబును గననివాఁడు సంవత్సరంబులో మృతి నొందు. రశ్ములులేని సూర్యుని రశ్మలు గల యగ్నిని గాంచిన వాఁడు పదునొక్కండు నెలలలో మరణించు. బంగా రంబును వెండిని విణ్మూత్రంబులను బ్రత్యక్షంబుగాఁ గాని కలలోఁగాని వమనం బొనర్చిన మనుజుండు పదిమాసంబులలో మరణించును. భూత ప్రేతపిశాచంబులను గంధర్వనగరంబును బంగరువన్నెగల చెట్లను గాంచినవాఁడు తొమ్మిది మాసంబులలో మడియు. అకస్మాత్తుగా స్థూల రూపంబును గాని కృశరూపంబును గాని కృష్ణరూపంబును గాని పొందిన మనుజుం డెనిమిది నెలలలోఁ జనిపోవు. స్వపాదంబు ఖండితంబుగఁ గాంచు నరుఁ డేడునెలలలోఁ బొలియు. కపోతంబు గాని గృధ్రంబు గాని కాకంబు గాని మూర్ధంబున వ్రాలిన వాఁ డాఱునెలలలో జము మందిరంబు గాంచు. వాయసపంక్తి పాంశువర్షంబునఁ బడిన మనుజుం డును వికృతమగు తన నీడను జూచిన వాఁడును నాలుగైదు నెలలు కంటె జీవింపఁడు. దక్షిణదిక్కున మేఘంబులు లేని సమయంబున మెఱపును గాంచిన వాఁడును నీటిలో నింద్రధనుస్సును జూచినవాఁడును రెండు మూఁడు మాసంబుల కంటె బ్రదుకఁడు. అద్దంబు నందుఁ గాని నీటి యందుఁ గాని యితరుల కంటియందుఁ గాని తన శిరంబును గాంచని వాఁడు మాసంబునఁ జచ్చు. బస్తగంధంబు గాని శవగంధంబు గాని నింబ

గంధంబు గాని శరీరంబునఁ బొడమిన మనుజుండు మాసార్ధంబున మృతుం డగు. ఋక్షవానరసంయుక్తంబగు రథంబున దక్షిణదిక్కుగాఁబయనించి నట్లు కలగాంచిన వాఁడును కృష్ణాంబరధరులతో దక్షిణదిక్కుగా వెడలు చున్నట్లు కలగాంచినవాఁడును జీవింపఁడు తన బట్ట నల్లనై చినిఁగి నట్లు కలగాంచిన వాఁడు మృత్యుముఖమునఁ బడు. పగలు నక్షత్రము లను రాత్రి యింద్రధనుస్సును రక్తచంద్రుని కృష్ణసూర్యుని గాంచిన వాఁడును సూర్యచంద్రమండలంబులలో రంధ్రంబును గాంచిన వాఁడు నా కాశంబున రక్తమాలను గాంచిన వాఁడును వెంటనే మృతి చెందు. శ్మశా నంబును భస్మంబును గేశంబులును శుష్కనదిని సర్పంబును గలలోఁ గాం చిన వాఁడు మృత్యువు వాతఁబడు. కృష్ణవర్ణులును వికేశులను నగు పురు షులచే స్వప్నంబులందుఁ బీడింపఁబడిన వాఁడును పాషాణంబుచేఁ గొట్టఁ బడిన వాఁడు నగు మనుజుండు మృత్యువు నొందు. సూర్యుఁ డుదయించు వేళ నక్క లభిముఖంబుగా వచ్చి యఱచిన యెడల వాఁడు వెంటనే మృతిచెందు. భయకంపాదులు శోకమోహాదులు బొందిన వాఁడును నాలుక యెండిన వాఁడును దంతఘర్షంబు గలిగిన వాఁడును హృదయం బున వేఁడి పుట్టిన వాఁడును మృత్యువు నొందు. ఒకకన్ను స్రవించుటయుఁ జెవులు స్థానభ్రంశంబు నొందుటయు నాసిక వంకర యగుటయు నాలుక నల్లనగుటయు ముఖవికారంబులు గలుటయు మృత్యుసూచకంబులు. ముక్తకేశుం డగుటయు నవ్వుచుఁ బాడుచు దక్షిణదిశ కేఁగుటయు నుష్ట్రరాసభసంయుక్తంబగు రథం బెక్కి యామ్యదిశకుఁ జనుటయుఁ గలలోఁ గాంచినవాఁడు మృత్యువు నొందు. కర్ణంబుల ఘోషంబు వినని వాఁడును నేత్రంబుల జ్యోతిని గనని వాఁడును గోతఁ బడినట్లు కల గాం చిన వాఁడును మృత్యువు నొందు. ఊర్ధ్వదృష్టిని రక్తకృష్ణదృష్టిని బొం దినవాఁడు నూష్మవిహీనదేహుండును మృతి నొందు. నాభియందుఁ గాని హృదయమందుఁ గాని రంధ్రంబు పడినవాఁడును నత్యుష్ణంబగు మూత్రంబు గల వాఁడును మృతి చెందు. జాగ్రదవస్థను గాని స్వప్నావస్థను గాని కనఁబడని మనుజునిచేఁ గొట్టఁబడు వాఁడు తత్క్షణంబ మృతి నొందు. అగ్ని యందుఁ బడినట్లు కల గాంచుటయు స్మృతి తప్పుటయు యామ్యశబ్దంబు లుచ్చరించుటయు మృత్యులక్షణములు. తాను గట్టిన వస్త్రంబు కలలో

నెఱ్ఱగాఁగాని నల్లగాఁగాని కనుపట్టిన యెడల నతఁడు మృత్యువునకు గుఱి యగు.

ఇట్టి యరిష్టంబులు సంభవించిన నరుండు శోకమోహభయంబులను వీడి యేకాగ్రమనస్కుండై శ్రీమద్వారణాసికిఁ జని గంగాజలంబుల స్నానమొనర్చి విశ్వేశ్వరుని దర్శించి పంచాక్షరంబును జపింపవలయు. లేక సోమనాథంబున కేఁగి సోమతీర్థంబున మునింగి సోమనాథుని గాంచి పంచాక్షరంబును జపింపవలయు లేక శ్రీపర్వతంబు చేరి మల్లికేశ్వరుని దర్శించి భస్మోద్ధూళితదేహుఁడై పంచాక్షరంబును జపింపవలయు. లేక శ్రీకాళహస్తిక్షేత్రంబు చని సువర్ణముఖరీజలంబుల స్నాన మొనర్చి మహాదేవుని దర్శించి పంచాక్షరంబును జపింపవలయు. లేక గోపర్వతంబున కేఁగి శక్తీశ్వరుని సందర్శించి భస్మోద్ధూళనంబు గావించి పంచాక్షరంబును జపింపవలయు. లేక శ్రీవృద్ధాద్రికిఁ జని ముక్తాజలంబుల మజ్జనం బొనర్చి వృద్ధాచలేశ్వరుని దర్శించి పంచాక్షరంబు జపింపవలయు. లేక రామేశ్వరంబున సముద్రస్నానంబు గావించి శ్రీమద్రామేశ్వరుని సేవించి పంచాక్షరంబు జపింపవలయు. లేక హాలాస్యక్షేత్రము చొచ్చి హాలాస్యనాయకుని వీక్షించి యథాశక్తి భక్తులకు ధనధాన్యాదులు సమర్పించి పంచాక్షరంబును జపింపవలయు. లేక వేదారణ్యంబున మహోదధిలో మజ్జనంబాడి వేదారణ్యేశ్వరుని గాంచి పంచాక్షరంబును జపింపవలయు. లేక వల్మీకంబున క్షీరకుండజలంబుల స్నానంబు చేసి మహేశ్వరుని వీక్షించి పంచాక్షరంబును జపింపవలయు. లేక గజారణ్యమునఁ గావేరిలో స్నాన మొనర్చి గజారణ్యేశ్వరుని గాంచి పంచాక్షరంబు జపింపవలయు. లేక జప్యేశ్వరమున కేఁగి కావేరిలోఁ దోఁగి జప్యేశ్వరుని బూజించి పంచాక్షరంబు జపింపవలయు, లేక దక్షిణావర్తంబునఁ గావేరిలో స్నానము చేసి దక్షిణావర్తనాథేశునిం గాంచి పంచాక్షరంబు జపింపవలయు. లేక కుంభకోణంబునఁ గావేరిలో మునింగి కుంభకోణేశ్వరుని దిలకించి పంచాక్షరంబు జపింపవలయు. లేక మధ్యార్జునంబునఁ గావేరిలో స్నానము చేసి మధ్యార్జునాధిపుని గాంచి పంచాక్షరంబు జపింపవలయు. లేక గోవటుతీర్థంబునఁ గాని మంగళవంశకంబునఁ గాని

యగ్నీశ్వరంబునఁ గాని కోటికాఖ్యంబునఁ గాని దృతిస్థానమునఁ గాని శ్వేతారణ్యమునఁ గాని శ్రీమద్బ్రహ్మపురంబునఁ గాని యుదధిసంగమంబునఁ గాని కావేరిలో స్నానంబు చేసి యథాశక్తి ధనంబు గాని ధాన్యంబు గాని తిలలు గాని దానంబు చేసి శ్రీమన్మహేశ్వరుని దర్శించి పంచాక్షరంబును జపింపవలయు. లేక శీఘ్రంబుగా వ్యాఘ్రపురంబున కేఁగి శివగంగను మునింగి ప్రదక్షిణత్రయం బాచరించి శ్రీమద్దభ్రసభాపతిని గాంచి పంచాక్షరమంత్రంబును సతారంబుగ సర్వదా జపింపవలయు. వ్యాఘ్రపురంబున మృతి నొందిన మనుజుండు ముక్తిని గాంచు. వ్యాఘ్రపురంబునఁ బ్రవేశించి నంత మహాపాతకములు తొలంగు. సభాపతిని దర్శించిన మాత్రంబున ముక్తి సిద్ధించు. 993

తే. నిత్యమును బార్వతీదేవి నృత్య మాడు
నిత్యము సభాపతీశుండు నృత్య మాడుఁ
గాన నవిముక్తతీర్థంబు కంటె మిన్న
పరమమోక్షప్రదంబు శ్రీ వ్యాఘ్రపురము. 994

తే. సకలవిద్యాస్వరూపిణి సకలజనని
పార్వతీదేవి కల్యాణి పరమశక్తి
శివితో నివసించెడు తావు గాన
మోక్షఘంటాపథము వ్యాఘ్ర పురము ధరణి. 996

క. అమలమతులార! మీరలు
సమస్తము పరిత్యజించి జ్ఞానులరై ని
త్యము శ్రీవ్యాఘ్రపురీశ్వరు
సమర్చనము చేసి మోక్ష సంపద గొనుఁడీ! 996

## 47. అవశిష్టపాపస్వరూపకథనము

తే. అంత శ్రీసూత మౌనీంద్రుఁ డనియెఁ బుణ్య
నైమిశ మునీంద్రులను గాంచి ప్రేమతోడఁ
జెప్పెద వినుండు ఘోరావశిష్టపాప
లక్షణంబులు పాపముల్ సలుపకుండ. 997

వ. బ్రాహ్మణుని జంపిన వాఁడు క్షయరోగి యగు. కల్లు ద్రావిన వాఁడు గొగ్గిపండ్ల వాఁడగు. బంగారమును ముచ్చిలించిన వాఁడు పుప్పి గోళ్ళవాఁ డగు. గురుతల్పగామి దుశ్చర్ముండగు. పరివాదరతుండు కుంటియు గ్రుడ్డియుఁ జెవిటియు నగు. అనుకీర్తనకారి గాడిద యగు. గురువులను నిందించినవాఁడు నిత్యాపస్మారి యగు. గురునాజ్ఞ నుల్లం ఘించిన వాఁడు భగంధరవ్యాధి నొందు. గురువులందు మాత్సర్యంబు వహించిన వాఁడు విట్క్రిమి యగు. గురుశుశ్రూష సలుపని వాఁడు మందప్రజ్ఞుం డగు. విష్ణుద్రోహి యగు వాఁ డూసరవెల్లి యగు. వేదం బులను దూషించిన వాఁడు చండాలుం డగు. వేదాంతశాస్త్రంబును నిందిం చిన వాఁడు పుల్కసుం డగు. వేదవిజ్ఞానమును దూషించిన వాఁ డున్మ త్తుం డగు. రజస్వలను గూడిన వాఁ డంత్యజాతి యగు. చిచ్చు పెట్టిన వాఁడును విషము పెట్టిన వాఁడును గుష్ఠవ్యాధి నొందు. శస్త్రపాణియై రూప్యచోరుం డగు వాఁడు కప్ప యగు. కూటకృత్యంబులు సలుపువాఁడును గూటసాక్ష్యంబులు చెప్పువాఁడును గూటకృత్యంబులు సలుపువానికి సహా యము చేసి యుపాయంబులు చెప్పువాఁడును ముఖరోగంబుల నొందు. తల్లిని దండ్రిని భార్యను సంతానమును వీడిన వాఁ డక్షిరోగంబుల నొందు. ప్రతిజ్ఞ తప్పినవాఁ డల్పాయు వగు. పెక్కు భార్యలు గలవాఁ డొక్క భార్యయం దాసక్తుఁడైనచో నపుంసకుం డగు. అన్నంబును హరించిన వాఁడు మందాగ్నియు జిహ్వారోగియు నగు. బంధువులకు స్త్రీబాలవృద్ధులకు నిడక ముందు కుడుచువాఁడు కంఠరోగంబుల నొందు. పంచయజ్ఞంబులను విడిచినవాఁ డూరఁబంది యగు. పర్వంబులందు మైథునమొనర్చు వాఁడు మేహరోగంబు నొందు. అతిథుల నభ్యాగతులను బరిత్యజించినవాఁడు కపోలపిండకుం డగు. స్వాత్మోత్కర్షపరుం డగువాఁడు వామనుండు పంగుండు నగు. గోవులఁజం పిన వాఁడును గృతఘ్నుండును బుట్టుగ్రుడ్డియగు. భార్య యందు స్నేహంబు లేని వాఁడు గళగండి యగు. వేశ్యలను సేవించిన వాఁడు

భిన్నలింగుం డగు. తామ్రాదిలోహంబుల నమ్ము వాఁడు పిశునుండును బూతివక్త్రుండు నగు పొట్టేలిని మేఁకను గజంబును గుఱ్ఱంబు నమ్ము వాఁడు వ్యాధుండగు. జ్ఞానాపహారియు మంత్రచోరుండు నగు వాఁడు మూఁగ యగు. అభక్ష్యభక్షకుండు గండమాలి యగు. రంగోపజీవి యగు వాఁడు కుమతి యగు. పుస్తకంబులను లేఖినిని హరించినవాఁ డంధుం డగు. పుణ్యకథల నాక్షేపించువాఁడు వక్రనాసుం డగు శిష్టాచారంబులను ధర్మంబులను దూషించినవాఁడు రాక్షసుం డగు. దేవతలను దూషించువాఁడును జ్ఞానప్రదుండగు గురువును దూషించిన వాఁడును వక్రాస్యుం డగు. పుణ్యకర్మంబులందుఁ బ్రవర్తించువానిని బ్రతిషేధించిన వాఁడు క్రిమి యగు. దేవతాద్రవ్యంబు లపహరించినవాఁడు సర్పం బగు. తటాకంబుల నారామంబులఁ జెఱచినవాఁ డంగహీనుం డగు. మర్యాదాభేదకుం డగు వాఁడు దాసుం డగు. పరదారాభిగామి వాతరోగి యగు. ఉష్ట్రాదిజంతువులను గూడిన వాఁడు మధుప్రమేహి యగు. పతివ్రతలను జెఱచువాఁడు పంది యగు. పరాపవాదనిరతుం డలసుండును వ్యసనియు నగు పాతకంబులు గావించువాఁడు పంది యగు. అతిపాతకంబులు గావించువాఁడు క్రిమియగు. ఉపపాతకంబులు గావించు వాఁడు కుక్క యగు. అన్యపాపంబుల నాచరించువాఁడు శూద్రయోనులందు జనించు.

స్వస్వరూపపరిజ్ఞానంబు లేమి మానవుండు బద్ధుం డగు. స్వస్వరూపపరిజ్ఞానంబు గలవాఁడు కర్మంబులచే బద్ధుండు గాఁడు. స్వస్వరూపంబగు నాత్మద్రవ్యంబు సర్వదేహములందు సత్యజ్ఞానాది లక్షణంబై స్వయంశుద్ధంబై ప్రకాశించు. ఈయాత్మము దేహాదిసంఘాతము కాకుండుటచేఁ బటాదుల వలె దృష్టిగోచరము గాదు. దృశ్యరూపంబుగ దేహపూర్వకంబగు నేరూపము కనుపట్టుచున్నదో యది దృశ్యమగుటచే ననాత్మ యని యెఱుంగవలయు. దేహాదికము దృశ్యమగుట సర్వసమ్మతము. అదృశ్యత్వము ద్రష్టృపూర్వముగ నుండును. ద్రష్టకు

దృశ్యత్వంబును దృశ్యమునకు ద్రష్టృత్వంబు నుండవు గదా! దృశ్యరూ
పంబులగు కుడ్యాదులకు ద్రష్టృత్వంబు సంభవింపదు గదా! ద్రవ్యాంశ
ముచే దృశ్యత్వము బోధాంశముచే ద్రష్టృత్వము కల్గునన్నచో నదియును
సరిగాదు. ఆత్మ నిరవయవద్రవ్యమగుటచే నంశభేదమును గల్పించి
నచో సావయవ మగుటవలనఁ గుడ్యాదులవలె దానికి ననాత్మంబే యగు.
అంశభేదము నంగీకరించినను దృగ్విషయము ద్రవ్యాత్మకమునగు
నాత్మాంశము దృశ్యమగుటవలనఁ గుడ్యాదులవలె ననాత్మయగు ననియు
దృశిధాత్వర్థాశ్రయభూతయగు నంశము చిదాత్మక మగు నాత్మ యనియు
నంగీకరింపవలయును గాన ద్రష్టకు దృశ్యత్వ మెపుడును సంభవింపదు.
ద్రష్ట్రంశమునందుఁ గూడఁ గర్తృత్వం బుపాధిజనితం బని యెఱుంగ
వలయును. ఆత్మకు స్వతఃకర్తృత్వ మున్నచో దర్శనరూప మగుటచే
నది పరిణామి గావలయును. ఆత్మ మృత్తికాదులవలెఁ బరిణామి
యగుచో నచిత్త్వప్రసంగము గల్గును. చిద్విహీనమైన జడము ప్రకా
శింపదుగదా! స్వతఃప్రకాశహీనంబగు దానికిఁ బ్రకాశంబెట్లు గల్గు? కావు
నఁ జిత్తు చిత్తే యని యెఱుంగవలయును. ఆచిత్తు దృగ్దృశ్యత్వహీ
నంబై సర్వదా భాసించుచుండు. భానంబు భానాంతరంబుచేఁ బ్రకాశింపదు
గానఁ జిత్తు భానరూపం బనియు నేకం బనియు నద్వితీయం బనియు
నంగీకరింపవలయు. స్వయంప్రభంబును సర్వసాక్ష్యమునకు సాక్షిభూ
తంబు నగు నాత్మ కర్మములకు బద్ధంబు గాదు. దృగ్రూపంబు దృశ్య
సంబద్ధం బని చెప్పుటయు సరిగాదు. ఈయాత్ముం డసంగుం డని
శ్రుతి వక్కాణించుచున్నది. కావున నాత్మ చిద్రూపమై కర్మంబులచే
బద్ధంబు గాదు. చిద్రూపంబగు నాత్మయే సాక్షాద్బ్రహ్మ మని వేద
ముపదేశించుచున్నది. ఆవేదమే బ్రహ్మమునకుఁ గర్మసంబంధము
లేదని చెప్పుచున్నది. అయినచో నాయాత్మ కర్మములచే నేల బద్ధమై
యుండు నన్నచో స్వమోహంబుచే సంసారి వలెఁ బ్రకాశించుచున్నట్లు
కనుపట్టుచున్న దని గ్రహింపవలయును. వర్ణాశ్రమవయోఽవస్థావిశే

